నమశ్శివాయ.

# మాండలిక పదకోశము


కూర్పరి:

శ్రీ మరుపూరు కోదండరామ రెడ్డి

పరిశోధక సంఘము.

డాక్టర్ తూమాటి దోణప్ప,
ఎం. ఏ., పిహెచ్. డి.

శ్రీ పురిపండా అప్పలస్వామి

శ్రీ గడియారం రామకృష్ణ శర్మ

శ్రీమతి ఊటుకూరు లక్ష్మీకాన్తమ్మ






ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి

కళాభవన్ : : హైదరాబాదు

**1970**

# పదముల సేకరించిన వివిధ ప్రాంతములవారు

1. శ్రీమాన్ వానమామలై జగన్నాథాచార్యులు
—వేంకటేశ్వర ఓరియంటల్ కాలేజి; కరీంనగరు

2. డాక్టర్ పాకాల యశోదారెడ్డి; ఎం. ఎ; పి. హెచ్ డి.
—రసిడెన్సీ మహిళా కళాశాల; హైదరాబాదు

3. శ్రీ కె. సభా
—శారదాపీఠము; చిత్తూరు

4. శ్రీ ఎం. డి. వెంకటసుబ్బయ్య; ఎం. ఎ., బి. ఇడి.
—ఉస్మానియా కళాశాల; కర్నూలు

5. శ్రీ పురిపండా అప్పలస్వామి
—విశాఖపట్నము

6. డాక్టర్ తూమాటి దోణప్ప; ఎం. ఎ., పి హెచ్. డి.
—ఆంధ్రా యూనివర్సిటీ కాలేజి; వాల్తేరు

7. డాక్టర్ బి. రామరాజు; ఎం. ఏ., పి హెచ్. డి.
— యూనివర్సిటీ కాలేజి; వరంగల్లు

8. శ్రీ ఎస్. గంగప్ప; ఎం. ఎ.
—ప్రభుత్వ కళాశాల; అనంతపురము

9. శ్రీ పుప్పూరు రామాచార్యులు
— 'సాధన' సంపాదకులు; అనంతపురము

10. విద్వాన్ కోట సుబ్రహ్మణ్యశాస్త్రి
—రిటైరు తెనుగు పండితులు; నెల్లూరు

11. శ్రీ నేదునూరు గంగాధరం
—రాజమహేంద్రవరము

12. శ్రీ గోనెల వెంకట నరసింహారావు; ఎం. ఎ.; బి. ఎల్.
—రిటైర్డు డెప్యూటీ కలెక్టరు, అడ్వోకేట్, శ్రీకాకుళము

13. డాక్టర్ పల్లా దుర్గయ్య; ఎం. ఎ, పిహెచ్. డి.
—యూనివర్సిటీ కాలేజి; హైదరాబాదు

14. విద్వాన్ ఊటుకూరు లక్ష్మీకాన్తమ్మ
—బాపట్ల

15. శ్రీ గడియారం రామకృష్ణశర్మ
—అలంపురము; మహబూబ్ నగర్

16. శ్రీ పూతలపట్టు శ్రీరాములు రెడ్డి
—చిత్తూరు

17. శ్రీ వీరంరెడ్డి ఉమామహేశ్వర రెడ్డి
—సూరాయపాళెం; ఆత్మకూరు, నెల్లూరు

18. శ్రీ వనం శంకరయ్య
—'హితవాద' సంపాదకులు, పత్తికొండ; అనంతపురము

19. శ్రీ యరమాక ఆదిశేషారెడ్డి
—వావిళ్ల; నెల్లూరు

# ఆంధ్రప్రభ - ఆదివార సంచికలనుండి

**1949** లో ఆంధ్రప్రభ ఆదివార సంచికలందు, క్రిందివారు ప్రచురించిన మాండలికములు గ్రహింపబడినవి —

సర్వశ్రీలు 1. తూమాటి దోణప్ప
—బళ్లారి - అనంతపురం

2. సోమరాజుపల్లె చెంచయ్య
—కందుకూరు, నెల్లూరు

3. వడ్లమూడి గోపాలకృష్ణయ్య
—కృష్ణ, గుంటూరు

4. రు. సుబ్బరామరాజు
—చెంగల్పట్టు.

5. శ్రీమతి నాయని కృష్ణకుమారి
—విశాఖపట్నము

6. విద్వాన్ ఎ. వెంకటరామరెడ్డి
—చిత్తూరు

సర్వశ్రీలు 7. వేదాంతం గోపాలకృష్ణమాచార్యులు
—కృష్ణ; గుంటూరు

8. యడ్లపల్లి దేవయ్యచౌదరి
—గుంటూరు

9. బృందావనం రంగాచార్య
—గుంటూరు

10. భట్టి వెంకటసుబ్బయ్య
—కృష్ణ

11. విద్వాన్ శంకరప్రసాద్
—చిత్తూరు

12. శ్రీమతి ఎస్. రాజాబాయి
—విశాఖపట్టణ మన్యము

సర్వశ్రీలు 13. యనమండ్ర రామమూర్తి
—సేలం

14. చిలకమర్తి సత్యనారాయణశాస్త్రి
—పశ్చిమ గోదావరి

15. సి. మునిరాజు.
—హోసూరు; సేలం

16. బండ్లపల్లి ఓబులురెడ్డి
—అనంతపురము

17. బులుసు వెంకటేశ్వర్లు
—గోదావరి

18. గారుపల్లి కోదండరామయ్య,
—హోసూరు

19. కె. జి. లక్ష్మిరెడ్డి,
—కర్నూలు

20. మంత్రి శంకర్
—మదనపల్లి, చిత్తూరు

21. చెరుకుమిల్లి వెంకయ్యచౌదరి
—పశ్చిమ కృష్ణ

22. భట్టిప్రోలు కృష్ణమూర్తి
—గంజాం

23. భాషాప్రవీణ అడుసుమల్లి రామచంద్రరావు;
—కృష్ణ

24. విద్వాన్ బిట్రా భావనారాయణ,
—గుంటూరు

# సంకేతములు

గ—గంజాము

గ - మ—గంజాముజిల్లా మన్నెము

శ్రీ—శ్రీకాకుళము

వి—విశాఖపట్టణము

తూ - గో—తూర్పుగోదావరి

ప - గో—పడమటి గోదావరి

కృ—కృష్ణ

గు—గుంటూరు

నె—నెల్లూరు

నె - మెట్ట—నెల్లూరు మెట్టప్రాంతములు

చి—చిత్తూరు

రా—రాయలసీమ

క—కడప

కర్నూ—కర్నూలు

అ—అనంతపురము

తె—తెలంగాణము

ఆ—ఆదిలాబాద్

కరీ—కరీంనగర్

నై—నైజామాబాదు

వ—వరంగల్లు

ఖ—ఖమ్మం

న—నల్లగొండ

హై—హైదరాబాదు

మ—మహబూబ్‌నగర్

చె—చెంగల్పట్టు

సే—సేలము - కృష్ణగిరి

హో—హోసూరు

బ—బళ్లారి

అ - పె—అనంతపురం, పెనుగొండ

నె - పొ—నెల్లూరు పొదిలి

రూ—రూపాంతరము

((1); 2)—అర్థభేదములు

(చూ)—చూడు

×—ఎదురుమాట.

# అవతారిక

అప్పటమైన, కండగలిగిన తెనుగు మాటలు ఎన్నియో పల్లెలలో ఇంకను పుష్టితో విరివిగా ఉపయోగింపబడుచునే యున్నవి. ముఖ్యముగా రాయలసీమ, తెలంగాణము, నెల్లూరు ప్రాంతాలలో ఇవి వన్నెవాసి చెడక, అన్యభాషా సంపర్క దోషమును అంతగా పొందక ఎక్కువగా వ్యాపించియున్నవి. ఇందు నెల్లూరు తెలంగాణములకు సన్నిహితత్వము అగపడుట ఇంకొక విశేషము; దీనివెంట రాయలసీమ వచ్చును. భాష భేదించినదెల్ల సర్కారులలోనే!

గ్రంథముల కెక్కనంతమాత్రాన వీటిని గ్రామ్యములని త్రోసిపుచ్చుట అట్టి భాషావాదుల గ్రామ్యతనే తెలుపును. నిఘంటుకారులకు పల్లెలసంబంధము లేకపోవుటవల్లను, అప్పటికి తమ కందిన పుస్తకములను మాత్రమే ఉపయోగించుటచేతను యీ మాటలు ముందుకు రాలేదు. గ్రామీణసంబంధము కలిగిన కవుల రచనలే రాణకెక్కుచు వచ్చినవి. పట్టణవాస భాష, చెట్లను పెంచి ప్రోది చేయు కృత్రిమ వాతావరణము కలిగిన "అద్దాల ఇంటి" చెట్ల వంటిది. ఇందలి సంకరము - వృద్ధి వాంఛనీయమే గాని, పల్లెల పెంపకమునకు వలె దీనికి స్వచ్ఛత, సహజ సౌభాగ్యము లేదు. భూతద్దమనే పదమును ఎవడు సృష్టించినాడోగాని, సంకరమైనా అర్థవంతముగా వాడుకలో నిలిచిపోయినది.

ఆనాడు వాడుకలో ఉండిన పదజాలమునే, అప్పటమైన పల్లెపదములనే అప్పటి కవులు తమ కృతులలో వాడినా రన్నది నూటికి నూరు నిజమైన మాట. ఇవి తిక్కన - శ్రీనాథుడు - పోతన మొదలగు లోక కవుల నాలుకలపై లాస్యమొనరించి, వారి కవితా వైభవమునకు ఉద్దీపనములై యున్నవి. మరికొన్ని జానపదుల నోళ్లలో తియ్యటి పలుకుబడులతో జాను తెనుగులై యున్నవి. వీటిని గ్రామ్యములనిన - గ్రామీణము లని అర్థము చేసికొనక, నింద్యములనుట భాషావేదులు సహించని వాదము.

తిక్కన: 1. తలపాలము=పొలిమేర; ఇది నెల్లూరు నాగర్తవాడుకలో నున్న తలమనిషివంటిది; దీనికి సేద్యము చేయించు మేస్త్రి – Head Farm Servant అని అర్థము. (సాదురేగనేని తలపాలమునగాని నిలువదు.)

2. దానికి=కొరకు; వచ్చేదానికి తీరలేదు.

3. అడుగుట (స్త్రీని)=సంపర్కమునకే.

4. కడుపుకూటికి పనిచేయు – మొదలగు ప్రయోగములు అన్యప్రాంతములవారికి క్రొత్తవైనను, నెల్లూరువారికి వాడుకమాటలు.

ఇట్లే శ్రీనాథుడు :

1. ఎడాటము – భీమే – 2. ఆ – 88 – దీని రూపాంతరము ఏడాటము, అనగా ఇబ్బంది. ఇచట నిఘంటువులిచ్చిన–ఆట, విషయము అను అర్థములు అతుకవు.

2. దూబర తిండి – భీమే – 3 – ఆ – 210 = వితరణ లేని భోజనము.

3. నూకు – హర – 4 ఆ – 33 = నెట్టు (ఇతని మెడబట్టి నూకుండని) ఈ నూకు ఉత్తరాది ''దొబ్బు'' వలె నానార్థములతో ఇప్పటికిని నెల్లూరులో వాడుకలో నున్నది; ఈ నూకులు నూకవు; నూకులు బెట్టినావులే; నూకినావులే మొదలగు అర్థము లున్నవి దీనికి. కమ్మి నూకిన నూత్న కల ధౌతమును బోలె – అని ఇంకొక ప్రయోగము – భీమే – 4 ఆ – 129.

4. సరిగంచు = (జరీ అంచు)

5. కారుగోష్ఠి – కారుకూతలు – వలె.

ఇట్టి వాడుకమాటలను వీరందరు ఉపయోగించి యున్నారు. పోతన ఎక్కువగా స్థానికములనే ఉపయోగించినాడు. కాబట్టి ఇవి గ్రామ్యములు గావు – ఆర్షములే – శిష్టములే.

ఇక యీ రంగమున మిగిలిన పని ఇట్టివాటినెల్ల ఏరి కూర్చుటే?

పల్లెలవారు "రేపు–మాపు" అంటే, నాగరికుడు "ఉదయము–సాయంత్రము" అంటాడు. పల్లెకాపు "కూడు" అనగా, పట్నపు దొర "అన్నము, భోజనము" అనును. ఇట్లు తెనుగుమాటలు రానురాను మరుగైపోయి, తెనుగువారికి తూర్పు–పడమర అనునవి వాడుకలో నున్నను, ఉత్తర దక్షిణములకు సరియైన "వడ – తెన్ను" పదములు జీర్ణించి పోయినవి. "వడకు గుబ్బలి" అన్నదానికి, ఏ వ్యాకరణ సూత్రముగూడ సాధింపలేని ప్రేరణార్థమును అతిక్రమించి, వడకించు కొండ=మంచుకొండ అను అర్థమును నిఘంటువు కల్పించినది. దీనిక్రిందనే "వడకు త్రోవ"కు ఉత్తరాయణ మని అర్థము వ్రాసియున్నది. ఉత్తరాదికి "వడ నాడు" అనిన ప్రయోగము, పూర్వపు కవులవి కొన్నిగలవు (అయ్యనకోట పార్థసారథి శెట్టిగారి సత్యవిజయము).

దీపమునకు "తిల్లిక–తిర్లిక" అనే పదములు నెల్లూరు పల్లెలలో ఇంకను వాడుకలో నున్నవి. ఆంధ్రభాష వికృతి అనే గీర్వాణవాదులు, దీపమునకు తెనుగుమాటే లేదని నిన్నమొన్నటివరకు చంకలు తట్టుకొనేవారు.

ఇట్టివి ఎన్నియో మారుమూలలందు నక్కొని యున్నవి.

ఒక పదమునకు ఎన్నియో పర్యాయపదములు, భిన్నార్థములు ఉండుట విభిన్న స్థానిక ప్రయోగములే కారణ మగుచున్నవి. లేకున్న "అరిష్టము, హరి" మొదలగు పదములకు అన్నేసి అర్థములు ఎట్లు చేకూరి యుండగలవు?

ఒకేమాటకు వ్యతిరేకార్థము గూడ ఇమిడియుండుట గూడ ప్రయోగమే మూల మగుచున్నది. సంస్కృతమున – "ఆరాత్"= 1. దగ్గర, 2. దూరము అనియు, "అర్దన" = 1. సుఖపెట్టు, 2. కష్టపెట్టు అనియు (జనార్దన అనగా కృష్ణుడు – మొసలి) అర్థము లున్నవి.

ఈ గుణము, తెనుగుపదములలోను, మాండలికములలోను విరివిగా నున్నదని యీ పదకోశము బయట బెట్టుచున్నది. గోరు చిక్కుడుకు ఎన్ని పేర్లు! వేరుశనగకు ఎన్ని పేర్లు! చిలగడదుంపకు ఎన్ని పేర్లు! ఇంతేగాదు, మానికోటప్రాంతములో (మహబూబాబాదు) "కంద"యే యీ గణుసుగడ్డ – యీ చిలగడదుంప! నెల్లూరువారి "సొరకాయ", ఉత్తరాదివారి "ఆనపకాయ" ప్రక్కప్రక్కనే ఉండిననేగదా భాషావికాసమునకు ప్రోది. గుంటూరు వారి "ముట్టుకోక"ను నెల్లూరువారు "తాకబాక" అనుటలో సొగసున్నది. ఈ విభిన్నత్వమే భాషాదేవికి ఎనలేని అందమైన సొమ్ములను కూర్చిపెట్టగలదు. భాషను ఒకే అచ్చులో (కరువులో) బోసి, యిప్పుడు నిబంధించవలెననుట, భాషాభివృద్ధిని కాంక్షించు వారికి నచ్చేదికాదు; అప్పుడు ప్రతిభాషగూడ "బేసిక్ ఇంగ్లీషు"వలె గిటకబారి, మరుగుజ్జగనే నిలిచిపోయి, తీరుతెన్నులు లేకుండా పోగలదు. ఈ నిబంధన అధికసంఖ్యాకులకు మదికెక్కనిది అని అంటే వెలితిమాట కాదేమో!

పల్లెల పట్టణముల భాషల కలగలుపే ఏ భాషకుగాని ఉన్న బిగువు–సిరి. ఇక మాకారువారి అనంతరము, ఇప్పటివారికి యీ నుడికారముయొక్క సంబంధము దూరమై, జాను తెనుగు కాలగర్భములో మాటుమణగి, క్రమేణా జీర్ణించిపోవునేమో అన్నభీతి చాల మందికి కలుగుచున్నది.

అందుచేత, వీటిని పరికూర్చి ప్రకటించమని సాహిత్య అకాడమీవారిని కోరుచుంటిని. ఇప్పుడు ఆ పెద్దలు దీనికి అంగీకరించి, ఆ పరికూర్పుపనిలో పెత్తనము నాకే యిచ్చుట ఒక అదృష్టముగా భావించుచున్నాను.

## జరిగినపని

మొదట, రమారమి 2500 పదములు (నెల్లూరువి) ఒక ప్రాతిపదిక ప్రతిగా రూపొందించబడినది. తెనుగునాట, నాలుగు చెరగులలో ఉన్న పండితులకు దీనిప్రతులను పంపితిమి. పల్లెల సంబంధము లేని, కేవల గ్రంథపాండిత్యము దీనికి అంతగా ఉపకరించదని గుర్తించబడినది.

నలుమూలలనుండి వచ్చినమాటలను, నిఘంటువులలో సరిచూచి, అందున్నవాటిని కొట్టివేసి, భిన్నవిశేషార్థము లున్నవాటిని అట్టిపెట్టి–ఇంకను కొన్ని తప్పించుకొని యిందు దూరి ఉండవచ్చును–నిలువ, నిగ్గు తేల్చబడినది.

1949 లో "ఆంధ్రప్రభ" ఆదివారపు సంచికలలో, వివిధ ప్రాంతములవారు–భాషాభిమానులు ప్రచురించిన మాటలనుగూడ గ్రహించినాము.

ఆవల ఒక సంపాదకవర్గము సమావేశమై, వీటిని పరిశీలించి, కోశనిర్మాణమునకు రూపురేఖలు నిర్ణయించినది. ఆ నిర్ణయము ప్రకారముగనే యీ ఆకృతి కల్పింపబడినది.

## పెద్దలపని

ఇందు డాక్టర్ దోణప్పగారి తోడ్పాటు ఒత్తిఒత్తి చెప్పదగినది; వారి శాస్త్రీయధోరణి ఎంతగానో యిందు పనికివచ్చినది,

ఇట్లే శ్రీ గోనెల వెంకటనరసింహారావుగారి సహాయము అమూల్యమైనది. వీరు డెప్యుటీకలెక్టరుగా పనిచేసి విరమించినవారు;

ప్రస్తుతము శ్రీకాకుళమున అధివక్తలు. వీరు భాషాభిమానములో ప్రతిప్రాంతపు పదజాలమును సేకరించి, కక్షములు (కాలములు) బడ వాటివాటి భిన్నత్వమును విశేషత్వమును ప్రాంతీయతను వివరించుచు పంపినారు.

శ్రీమాన్ వానమామలై జగన్నాథాచార్యులు, శ్రీమతి యశోదారెడ్డిగారలు, బాగా లెక్కకువచ్చినన్ని మాటలను—నానా శాఖలకు చెందినవాటిని సంతనచేసినారు. శ్రీ కె. సభా, శ్రీ ఎం. డి. వెంకటసుబ్బయ్య, విద్వాన్ కోట సుబ్రహ్మణ్యశాస్త్రిగారల పనిగూడ ఎన్నదగినది. ఇట్లని మిగతవారి పనిని కీతపరచుటగాదు. వీరిలో చాలమంది పెద్దలు ఏన్నూరు, ఆర్నూరుమాటలను ఇచ్చిఉన్నారు.

వీరికిని, మిగతవారికిని, అకాడమీపక్షాన, నా పక్షాన నెనరు తెలుపుచున్నాను.

ఇప్పటి ఈ ప్రయత్నము, ఒక పెద్దచెరువులో ఒకటిరెండు అలలకు సమానమైనదని మాత్రమే సవినయముగ చెప్పుకొను చున్నాను. మున్ముందు ఈ రంగమున చేయవలసినపని ఎంతో ఉన్నది. ఈ మొదటి మెట్టునుండి రెండో మెట్టును నిర్మించుటకు అకాడమీ పూనుకొనునుగాక.

ఈ పదములు, నుడికారము లెట్లు ఏర్పడినవో విచారించ వలసినది భాషావేత్తలు—పరిశోధకులు. ఊడుదోక (పనికిమాలిన) కొయిలగోపి (పోకిరి) మొదలగునవి.

చివరకు ఈ పదకోశములన్నిటిని చేర్చి ఒకటిగ కూర్చినప్పుడే నేటి ఆంధ్రభాషకు ఒక సమగ్ర నిఘంటువు పుట్టగలదు. ఇప్పటివరకు జరిగినది పరిగ ఏరుకొనుటవంటిదే! వ్యుత్పత్త్యాదులనుగూర్చి భాషా స్వరూపజ్ఞులు పరిశీలించి తోడ్పడగలరని ఉవ్విళ్ళూరుచున్నాను.

ఈ పెద్ద పూనికయందు తెలంగాణా వివిధోద్యమములలో ఒకభూమిక – ఆంధ్రసారస్వతపరిషత్తు, అకాడమీల తలమనిషి–

సహృదయుడు, – శ్రీ దేవులపల్లి రామానుజరావుగారు నాకు చేసిన ప్రోత్సాహము, చేసిన సహాయము మరువరానివి; వారికి నా హృదయపూర్వక నమస్కారములు.

ఇట్లే మిగిలిన అకాడమీ పాలకులకును, ఇతర పండితులకును, మిత్రులకును కృతజ్ఞతాపూర్వక వందనములు.

వ్రాతపనియందును అకారాదిగ ఏర్పరచుటయందును పూర్తిగా సహాయపడిన మిత్రుడు వేములచేడు వెంకయ్యనాయుడుగారికి కృతజ్ఞత.

మీ,
మరుపూరు కోదండరామరెడ్డి

అపర్ణ
జేమ్సుతోట
నెల్లూరు
15 జనవరి 1970.

# మాండలిక పదకోశము

## అ

**అంకణము** = (1) వరుసల ప్రాంగణములు గల ఇల్లు—*రెండు అంకణముల ఇల్లు* [గు]
(2) మిద్దె ఇండ్లలో రెండు స్తంభములు లేక, రెండు దూలముల మధ్య గల భాగము—*ఈ ఇల్లు మూడంకణాలున్నది* [చి, అ]
(3) పన్నెండు అడుగుల పొడవు, ఆరు అడుగుల వెడల్పు గలిగి, 72 చదరపు అడుగుల వైశాల్యము గలిగిన ఇండ్ల అడుగు స్థలము లేక ఇండ్ల కట్టుబడి—*ఇదిఆరంకణముల ఇల్లు; ఇరవై అంకణముల చోటు* [నె]

**అంకపొంకాలు** = జ్వరమువలన రోగికి కలుగు శారీరకబాధలు [చె]

**అంకమ్మ** = అంకాళమ్మ [గు]

**అంకమ్మసోకాలు** = పెద్దపెట్టున ఏడ్పుటలు [కృ]

**అంకసిరి** = అరువది సంవత్సరములు నిండినప్పుడు కలుగు ఒక జబ్బు (మృత్యువు) [నె - పొ]

**అంకాతాపా** = కోపతాపము [వి]

**అంకిళ్లువడు** = నక్కిళ్లపడు [న]

**అంకు** = అంకె - ఒకటి రెండు మొదలగు సంఖ్య—*అంకులు లెక్కపెట్టు* [కరీ; న]

**అంకుట** = స్వాధీనమగుట; అబ్బుట—*అంకిన చోటును తీసికొనుట మంచిది* [కరీ; న]

**అంకువలు** = తాలువులు; అంకిళ్లు [నె - పొ]

**అంకె** = (1) (చూ) అనికె [నె]
(2) స్వాధీనము—*అంకెకు రాని మనిషి* [కర్నూ]
(3) లొంగుబాటు—*వాడు అంకెకు రాడు* [గు; తె]

**అంకెము** = (1) పొగాకుకట్టిన పెద్దకట్ట; బేల్ [నె]
(2) కాశీబస్తా [నె; వ]
(3) గోనె; గోతాము [శ్రీ; ఉ - గో]
(4) నలభై మానికల ఘనపరిమాణము [గు]
(5) రెండుబస్తాలుకలిపికట్టినది—*గోనెకి అంకెలు లాభం వేశాడు* [వి]
(6) ఎద్దు మొదలగువానిమీద వేయు గోతాము—*అంకెండ్లు (బహువచనము)* [అ]

**అంకెళ్లు** = గొర్తిచెక్కలకు తగిలించియుండు కొక్కెకములు [నె - పొ]

**అంగ** = అచ్చంగా [వి]

**అంగముదప్పు** = సిగ్గు, భీతి మొదలగువాటిని వదలు [అ - బ]

**అంగడము** = నేర్పు లేనివాడు—*వాడు ఒక అంగడం* [కరీ]

**అంగడాలు** = పశువులు [శ్రీ]

**అంగడాలుగా** = పోకిరిగా, హద్దులేకుండా [గు]

**అంగడి** = అల్లరి—*పిల్లలు అంగడి చేశారు* [కరీ; మ]

**అంగడిలెట్టుకు** = అటు ఇటు పరవకు [మ]

**అంగమణి** = వివాహసమయములో వరుని విడిది ఇంటికి పంపు పదార్థములు, పాత్ర [అ]

**అంగము** = (1) చిత్తూరు, కడప మండలములలో చెట్లు కాచు మొదటికారు ఫలింపు. ఇచట పండ్లచెట్లు ముంగారు పంట నిచ్చును. రెండవకాపు—*గైరంగము; మూడవది ఎడకారు* [క - చి]

(2) (రూ) హంగాం, అను ఉర్దూ పదము నుండి వచ్చినది. అనగా పంటకాలము; గైరంగాము అనగా అకాలములో వచ్చునది [తె]

అంగరంగ వైభవము = ఒంటికి ఇంటికి చేయు అలంకారము [అ]

అంగరిల్లు = తలుపులు, తాళములు వగయిరాలు లేని గృహము [నె]

అంగలపంగలు = చాలా తొందరగా ఎచ్చుట [గు]

అంగలము = ముంగిలి [తె]

అంగామా = గలబా—అక్కడ వాలా అంగామా జరుగుచున్నది [తె]

అంగామీ = వర్షములు ఎక్కువగా కురిసిన సంవత్సరము × గైరంగామీ = వఱపు సంవత్సరము—అనగా చెఱువులు కుంటలు నిండని యేడు. దీనినే అంగామి - గైరంగామి అనియు నందురు [కరీ]

అంగాము = (1) నూర్పిడుల కాలము, తాత్కాలికమైనది [తె; మ]
(2) (రూ) హంగాము—కోతలకాలము [కర్నూ]

అంగారు = చాదు; బొట్టు పెట్టుకొను నల్లటి పదార్థం [గ, శ్రీ; వి]

అంగీ = కాళ్లవఱకు పొడవుగల చొక్కాయి [శ్రీ]

అంగు-హంగు = (1) పద్ధతి, (2) స్వాధీనము—వాని హంగులోలేను [అ; వి]
(3) వీలు, ఉపాయము—ఆమెకు అంగ గుట లేదు, వానికి పనిని సాధించెటి అంగులు తెలియవు [కరీ]

అంగుడుముల్లు = పిల్లల మొలకు కట్టు ఒక పగ [వి]

అంగుణనె = ఊరకనే [ప]

అంగులు = డబ్బు [గం]

అంగే = ఓసీ—నీచస్త్రీని పిలుచుట [తె. గద్వాల]

అంగోస్త్రపుపొట్ట = ఎంతతినినను బయటకు ఉబకని పొట్ట [కృ]

అంచ = (1) మెట్టు, పడికట్టు [చి]
(2) ఆగుట [కృ]

అంచనాలు = పంటలు పరిమితాన్ని సూచించే పని [శ్రీ]

అంచిన = తరువాతికి [చి]

అంచుకట్టు, అంచుగట్టు = (1) అనుకూలమగు—ఆ విషయము అంచుగట్టుకొని వస్తున్నది [నె]
(2) కురుపు చెక్కుగట్టి, మానబారుట [నె, తె]
(3) ముగియు, తుదముట్టు—వాని ఆస్తి అంచు కట్టుకొని వచ్చుచున్నది.
(4) వ్యాపించు—పుండు (లేదా) కురుపు అంచు కట్టుచున్నది [అ]
(5) బుట్టలు, చాపలు మొదలైనవాటికి చేయు ముగింపు అల్లిక [గో]
(6) అధికమగు—మేఘము అంచు గట్టుకొనినది [అ-పె]

అంచీలు = మెట్లు; చీడలు; తాపలు; సోపానములు

అంచున = సమీపమున; వద్ద—నా అంచున ఏమీలేదు [కర్నూ]

అంచెబుట్టి = ఎక్కువలోతు లేక వెడల్పుగా అల్లిన బుట్ట (బుట్టి) [మ]

అంచెలు = వరుసలు [అ]

అంచోడించు = ముందు వెనకలాడు [తె]

అంజ = ఒక కాలి అడుగునకు, చాచిన రెండవ కాలి అడుగునకు మధ్యగల దూరము; అంగి [అ]

అంజనకప్పు = తమలపాకుపై కాటుకవేసి గూఢ విషయములను కనుగొనుటకు మాంత్రికులు చేయుపని; అంజనము వేయుట [చి]

అంజలు = దూరముగా పాదములనుంచి నడచుట; అంగలు [వెం]
అంజి - అమిజి = (1) గ్రామ ఉమ్మడి పనికి, భూమి దామాషాప్రకారము వచ్చి చేయు పని [నె]
(2) వంతు, పర్యాయము [తె]
(3) పాదాభరణం [గో]
(4) ఉచితము; అనాయాసము—*పేనా అంజీగా వచ్చినది* [చి]
అంట-అంటు = కుట్టిన చిన్న విస్తర—*విస్తరఅంట్లు* [కర్నూ]; *విస్తర అంట కుట్టినది* [కరీ] - అంటు
అంటట్టుకుపోవు = బాగా చిక్కిపోవు [వి]
అంటబెరుకు = (1) కాలితో తన్ను
(2) తీవ్రముగా మాట్లాడు
(3) తాకు అను అర్థములో
(4) బంక [తె]
అంటలు = (1) విస్తరంటులు
(2) జడగా పెనుసుకొనిన వెంట్రుకలు [నె-పొ]
అంటి = అరటి (చి)
అంటించింది = కుట్టింది—*తేలు బాగా అంటించింది* [చి, నె]
అంటించు = (1) కొట్టు
(2) అగ్గిపెట్టు
(3) కొండెములుచెప్పు [తె]
(4) దెబ్బలువేయు [గు]
అంటింపించు = అతికించు [ఉ-గో; శ్రీ]
అంటు-అంట = (1)విస్తరగాకుట్టినమోదుగ, మట్టి మొదలగు ఆకులు [నె; కరీ న]
(2) అశాస్త్రీయ స్త్రీ పురుష సంబంధము—*దానికి వాడికి అంటు* [నె]
(3) బంక [కర్నూ]
(4) పాలపిడతలో అడుగంటిన తెల్లని పిప్పిలాంటిది [కృ]
(5) మెతుకులు
(6) కూరగాయలు లేదా మాంసము వండిన తరువాత ఆ కూరతో కలిసియుండు రసము; ద్రవపదార్థము—*దీనినే షోర్బా షోర్వా అందురు* [వ]
(7) స్త్రీలబహిష్ఠ
అంటుజోడు = (1) మగవారు ధరించు కర్ణభూషణము × ఆడువారిది కమ్మ [నె; అ; తె; చి]
(2) స్త్రీలు ధరించు కర్ణభూషణము [తూ-గో, గు]
అంటుడుగాడు = తల్లిని విడవకుండా కఱచుకొని ఉండు బాలుడు [గు]
అంటుతిరుగలి - తిరగలి = ఆళ్లు విసరుటకుగా, రెండు రాళ్లకు బురద అలికి, ఆరబెట్టిన తిరుగలి [నె-మె]
అంటుపడు = (1) బహిష్ఠఅగు—*నా భార్య అంటుపడినది* [అ]
(2) ఎంగిలిపడు; తిను [వి]
అంటుపోగు = చెవి కమ్మ — పురుషులు ధరించునది [చి, నె]
అంటుముట్టు = మైల—*అంటుముట్టు తగలరాదు* [చి]
అండ-అండా-అండి-(రూ) హండా =
(1) నీళ్లుపోసిపెట్టుకొనుటకు, స్నానము చేయుటకు ఉపయోగించు వెడల్పు మూతిగల లోహ పాత్ర, గంగాళము [నె; కర్నూ; అ; తె]
(2) మకాము, లేక ఆశ్రయము—*ఆ యూళ్లో అండా పెట్టినాడు.* (ఈ ప్రయోగము అడ్డా యను పదమునకు అపభ్రంశము) [కరీ]
(3) వెడల్పైన గనిమను చక్కగా చెక్కుట—*అండ చెక్కినారు* [చి]
(4) బావి వెడల్పుగా త్రవ్వునపుడు ముందు తంతెగానుంచి త్రవ్వునది (రూ) ఇండె—*పెద్ద అండ బెట్టితే కష్టము; చిన్న అండ బెట్టి తవ్వు* [నె-పొ]

అండీ=(చూ) అండ

అండీ - అండి=లోహపాత్ర విశేషము [వి]

అండీలు=వీధిబడిలో పిల్లల హాజరు క్రమాన్ని సూచించు పట్టీ—*సిరి, చుక్క, ఒకటి, రెండు, ఇట్లా వ్రాసి ఆయా అంకెల క్రమంలో పిల్లలను అన్నేసి దెబ్బలు బెత్తంతో చేతిమీద కొట్టుదురు* [అ]

అండెము=(1) అంకెము (పొగాకు, మిరప కాయలు, చింతపండు, కట్టుమూటలు మాత్రం)

(2) 40 మానికెల ధాన్యము [గు]

అండెన దండెన=అదుపూ, ఆజ్ఞా—*దాని కేమీ అండెన దండెన లేదు* [గు]

అంతకము=(1)పట్టుదల—*పిల్లవాడు అంతకము చేస్తున్నాడు*—(రూ) అంతుకం [వ]

(2) పిల్లలు మారాము చేయుట—*మా పిల్ల అంతకము పెట్టినది—మీ పిల్లవాడు అంతకపు పిల్లవాడు* [కరీ]

అంతకము=సాధారణముగ మూడేండ్ల కొకమారుగాని, అనుకొనిన కు_స్తకాలము నకుగాని, అప్పు మొ_త్తమునకు వడ్డీ లెక్కించి, దానిని అసలు మొ_త్తములో చేర్చు పద్ధతి (Resting of Interest)—*ఏటేటా అంతకము, తీర్పు* [నె]

అంతన పొంతన=మర్యాద — *అంతన పొంతనలేని మాటన్నాడు* [కరీ]

అంతరకొట్టు=తల,క్రిందుగాచేసి నీటిలోనికి దుముకుట [అ, బ]; పిల్లేరుగంతుపేయు (సమ్మర్‌సాల్ట్) [నె]

అంతరగంగ=అంతరతామర [కర్నూ, అ]

అంతరదామర=చిన్న చిన్న కుదురులుగా నీటిపై తేలియారు చిన్నఆకుతామర—రూ-అంతరగంగ [తె; నె; అ]

అంతరపల్లిటీ=దేహమును వలయముగా త్రిప్పుచు క్రిందికి దూకుట [నె]

అంతరాళము కట్టుబడి=నగలకు రాళ్ళ పనిచేయునపుడు, వెనుకభాగమునకూడా వెలితిఉంచి వెనుకకూడా రాళ్లు కనబడు నట్లు కట్టు పని

అంతల పొంతల=(1) ఏమీ సంబంధము లేని

(2) ప్రాణం పోవునంత శ్రమ—*ఆ పని నెరవేర్చడానికి అంతల పొంతలైనది* [గో]

అంతల పొంతలగాడు=దూరపు చుట్టము [శ్రీ]

అంతల మందల=సాలు మూల—*అంతల మందల లేనిపని* [గు; తూ. గో]

అంతలు పొంతలు = అనుకోకుండా జ్వరము ఒక్కమాఱుగా హెచ్చిపోవుట [గు]

అంతు=(1) మొ_త్తము, కుల్లు [చి]

(2) లోమర్మము — *అంతు పట్టీయలేదు* [నె; కర్నూ]

(3) చివర [తె]

(4) చివర హద్దు — *అంతులేని పాండిత్యాము* [కర]

(5) ఇంతకీ [సే]

అంతుకట్టు=అప్పుమీద వడ్డికట్టి, అసలుకో చేర్చు (Resting of Interest); అంతకం కట్టు [గు]

అంతుదేల్చు=(1) శిక్షించు—*వాని అంతు దేలుస్తాను* [అ-పె]

(2) విషయము తిరుగులేకుండా పరిష్కరించు—*ఆ సంగతి అంతు తేల్చివేస్తా* [నె]

అంతు పొంతు=జాడ—*దాని అంతు పొంతు లేదు* [నె; కర్నూ; వ]

అంతూ = మొ_త్తముమీద [అ]

అంత్రము=తాయెత్తులోపెట్టు రక్షరేఖ [చి, నె]

అందనక } = ఈలాగే; అప్పుడు; అంత
అందాక } వరకు [శ్రీ]

అందని పొందని=అసాధ్యములగు — *అందని పొందని యూహలు* [కరీ-న]

అందాజు=రమారమి, సుమారు, ఉరామరిక; అందాదు [అ; బ]

అందాదు=అందాజు, ఉజ్జాయింపు, ఉరామరిక [కర్నూ]

అందిగ=అందియ; అందె [అ]

అందిపుచ్చుకొన్నట్లున్నది = సమీపమున నున్నది—*ఇక్కడికి ఆ ఊరు అందిపుచ్చుకొన్నట్లున్నది* [నె-పొ]

అందిరాని=సాధ్యపడని—*అందిరాని పనులు సేయుట రోత* [కరీ]

అందుకని=అందుకుగా; దానికిగా [నె, కర్నూ; అ, తె]

అందుకు = రహస్యకారణము — *ఒక అందుకు అదిచేసినా* [నె]

అందుగడి=అందుబాటు [చి]

అందుబడి=(1) అనుకూలము [అ]
(2) అందుబాటు, అందుకొనుటకు వీలైనది [నె]

అందెబొందె = సంబంధము — *వాడా యూరిలో అందె బొందె లేకుండా ఉన్నాడు* [నె-పొ]

అందెము=పొగాకు అందెము, కట్ట—*పొగాకందెములు కట్టిరి* [కరీ, న]

అంపకము - అంపకాలు=(1) క్రొత్తగా పెండ్లి అయిన ఆడుబిడ్డను, సారెతో మొదటిసారి కోటిరికమునకు పంపుట.
(2) ఒకడిని పనినుండి నిలిపివేయుట—*వాడికి అంపకాలు అయినవి* [నె, తె, వ]
(3) ఇంటికి వచ్చిన బంధువులకు విందు చేసి వీడ్కొలుపుట [కర్నూ]

అంపుదోడు=ఒకరివెంట వెళ్లువాడు, అనుకరించువాడు—*అంపుదోళ్ళ వెధవ* [చి]

అంబటా(టే)ళ = పొలములో పనిజేసే కాపులు, అంబలిత్రాగువేళ (మధ్యాహ్న సమయము)—*అంబటాళకు పోతిని* [వ; మ] కాపుకూటి ప్రొద్దు (వేళ)

అంబటిగాసము=కొంత నగదు, రెండు పూటల అన్నం, సంవత్సరానికి ఒక గొంగడి, చెప్పులజత, రోజూ చుట్టకు పొగాకు ఇచ్చి కుదుర్చుకున్న పనివాడు [తె, మ] జీతగాడు; కడుపుకూటిగాడు

అంబటిచేయి=కుడిచేయి [కర్నూ]

అంబటిపొద్దు=పగలు 10 గంటలప్రాంతం, అంబటివేళ; అంబటీలు [కర్నూ, అ]

అంబటిపోచమ్మ=గవ్వలంత పొక్కులు (బొగ్గలు) ఒంటిపై మారదూరముగా లేచెడి ఒకరకపు మశూచికవ్యాధి [కరీ]

అంబటీలు=ప్రొద్దునఅంబలి త్రాగువేళ[అ]

అంబ లంబలిగా=కొంచెము జాలుగా, రవంత చిక్కగా (అనుకనుకుగా)—*ఆమె బజ్జీలపిండిని అంబలంబలిగా కలిపియుంచినది* [కరీ; నె]

అంబలి=చోడిపిండితోచేసిన ద్రవపదార్థము. ఇందులో గట్టిగా ముద్దవలె చేసిన దానిని 'తోప' అందురు [శ్రీ; గు; నె, అ, కృ]

అంబాజీపేట ఆముదము = గొప్ప మోసము, కుంబకోణమన్నట్లు [ఉ-గో]

అంబాడు=గెంతు, దేకు [కరీ]

అంబారీలు=ఒకవిధమైన గోమార్లు [ప-గో]

అంబారుకాణాలు=మట్టిలో నుండే చిన్న పురుగులు. ఇవి కుట్టును [నె-పొ]

అంబాలీస్ - అంబాల్=(1) పిల్లకాయలు ఆటమధ్య విరామముకోరుచు అను మాట
(2) చేయవలసిన పనిని ఎగగొట్టుట—*ఆ పనికి వాడు అంబాలీస్ అన్నాడు* [నె] అంబాలు; అంబేలు

అంబు=(1) శుభసందర్భాల్లో దీపమునకు నూనెపేయు చొప్పదంటు [మ]
(2) బలపపు కడ్డీ [కృ]

అంబున గొట్టినట్లు మాట్లాడుట=సూటిగా కచ్చితముగా మాట్లాడుట [గు]

అంజేలు - అంజాలు = ఆటలలో విరామము కోరుట—అంజాలీను [చి]

అంబోదరగిడ్డడు=గజదొంగ—(చిత్తూరు జిల్లాలో 1930 నుండి 1940 వరకు పెద్ద దొంగతనములు చేసినవాడు దానకర్ణుడని గూడ పేరుపొందినవాడు, పేదలకు పెండ్లిండ్లు చేసినవాడు) [చి]

అంబ్యాద
అంబేద } = అమాయకుడు (రాలు) [మ; నె]

అంశం=చనవు [చి]

అంస=తెల్లని కోడిపుంజు (కోడిపందెపువారి పరిభాష) [నె-పొ]

అకటావికటము=(1) వేళాకోళం [వి]
(2) సామర్థ్యము [నె]

అకము=అధికారము—అకము మించిన పనిచేయుట దోషం; అతడు అకము మించినపని చేయసాగెను [కరీ]

అకారతుగా=నిష్కారణంగా [వి]

అక్కరి=గర్భాధానము [కృ]

అక్కఱ=శుభకార్యము [గు]

అక్కలముత్తయిదువు=కొన్ని బ్రాహ్మణ కుటుంబములలో పెండ్లికూతురు అత్తవారింటికి మొదట వచ్చినప్పుడు. ఆరాధించు దేవతలు. వీరు పూర్వము యీ కుటుంబమున కన్యలుగా ఉండి పాతివ్రత్య మహిమతో వెలసిపోయినవారు. ఇల్లే పెండ్లి కొమారుని ఇంట జేయు సాంగెమును గురునాథపొంగలి అందురు [నె]

అక్కలి
అక్కడి } = అక్కల్లి [తె]

అక్కల్ల=అక్కయ్యా అనుటకు [ని]

అక్కించుకొను=అనుభవించు [కర్నూ]

అక్కుపక్షి=(1) బలహీనుడు [ఉ-గొ]
(2) దిక్కుమాలినవాడు [వి]
(3) తెలివిలేనివాడు—ఓయీ అక్కుపక్షి [నె]

అక్కెడబెట్టు=మెట్టపొలములో జొన్న మొదలగు పైరులమధ్య వేరువేరు చాళ్లుగా, కంది మొదలగు వేరు పైరును బెట్టుట: × ఎదబెట్టు=ఒకేజాతి పంటను బెట్టు. అక్కెడవేయు [నె-మె]

అక్కెడవేయు = (చూ) అక్కెడబెట్టు [అ-పె]

అక్షంతముండ్లు = బియ్యపు గింజలవలె ఉండి, బట్టలకు అంటుకొనునవి [తె]

అక్షరాల=తప్పనిసరిగా, యూఢిగా — అక్షరాల వైభవ [వి, నె]

అక్షింతగడ్డి=కాడలు కాదలుగా ఎదుగు బీటి గడ్డి, దీని చివరిన పేరిన కంకి నూగు గలిగి గుడ్డలను అంటుకొనును [నె. కర్నూ]

అక్షింతలపురుగు = కాకరతీగకు పట్టు పసుపువచ్చ పురుగు [గు]

అఖిలాండం=నలుబది రోజులు ఆరకుండా వెలిగెడు దీపము. మొక్కుబడి ఉన్నవారు దేవాలయములందు వెలిగింతురు [చి]

అగచాం=గ్రహచారం [వి]

అగడ=సంచకారము, సంచకరవు, అగావు.

అగడాబగడా=కొద్దిగా పక్వమగుట [గు]

అగడు - ఆగడు=(1) అధికమైన ఆశ—మరీ అంత అగడు పనికిరాదు,—వానికి అగడు;—అగడుబడిన పోచమ్మ మొగుణ్ణి మ్రింగి పెట్టెను. అగుడు
(2) అగ్గిసెగ, ఎండవేడిమి [తె; న; కరీ]

అగడుపరచు = బెదరించు — ఆవును అగడుపరచకు [అ]

అగపడు=కనబడు [శ్రీ: వె]

అగాయి = తుపాకిదెబ్బ గాలిలో గురిలేకుండా వదలుట; భయపెట్టుటకై విడిచే దెబ్బలు [వ]

అగావ = దబాయింపు—*అగావ చేస్తావే?* [కర్నూ]

అగావు = (1) ముందుగా చెల్లించుధనము—*భూమి గుత్త సంవత్సరారంభములో అగావు ఈవలెను;* సంచకరువు [తె; అ]
(2) అప్రయత్నముగా లభించునది—*అగావుగా వచ్చినది* [నె]
(3) వాయిదా మానివేయు [కృ]
(4) అన్యాయముగా లభించునది [అ]

అగావు బగావు = అధికారంతో కూడిన చెలాయింపు [గు]

అగుడుచేయు = అల్లరి బట్టించు [తె]—*అగుడు మొగుడిది, అనుభవం లోపలది*

అగుబడి = సంసారితీరులేనివాడు, బోగుబడి [నె]

అగులుబుగులు = ఆందోళన—*అతని కి నిన్నటినుండి మనసులో అగులుబుగులు అగుచున్నది* [కరీ]

అగో = అదిగో [శ్రీ]

అగోరించు = (1) మిడుకు [కరీ]
(2) ఏడ్చు (వ్యంగ్యముగా) *అగోరించి నావులే,* అకోరించు [తె; నె]

అగ్గగు - (అగ్గి + అగు) = కోపపడు; అధికమైన కోపమును చెందు — *వాడు మాట విని అగ్గయినాడు—అగ్గి అయి నాడు* [అ]

అగ్గనగండ్లు = కష్టకాలములు, కరువుకాలములు—*అగ్గనగండ్లల్లో ఈ ఖర్చులు భరింప వశముగాదు* [కరీ]

అగ్గారు - (అగ్గి + ఆరు) = నశించు—*నీ దంతా అగ్గార అని, స్త్రీల తిట్టు* [నె]

అగ్గారు = చెరువుకట్టమీద నిర్మించిన ఏడు మట్టి గుళ్లములు—ఇవే సప్త కన్నెలు; కన్నికలు; కట్టమీద కన్నెలగుడి [చి]

అగ్గారుపూజ = అగ్గారుకు (సప్తకన్యలకు, కన్నికలకు) పచ్చరంగుపూసి పాల పొంగలి, బలి ఇత్యాదులు ఇచ్చుట [చి]

అగ్గి = ఎండ [గుం]

అగ్గిగురియు = కరువు పెరిగి ధరలు మండిపడు—*అగ్గి కురుస్తున్న ఈ రోజులలో ఏది కొనజాలము* [కరీ]

అగ్గిచూచు = కోపగించు [వి]

అగ్గిదాకు = (1) ఆకలిఅగు—*బిడ్డలు అగ్గి దాకినారు* [నె]
(2) ముఖము వాడుట [నె-మె]

అగ్గిదాహం = ఎక్కువ దప్పిక [నె]

అగ్గినిప్పు = అగ్నికణము [వి]

అగ్గిపంతులు = మహాకోపిష్ఠి [కరీ]

అగ్గిపిండము = తీక్ష్ణప్రకృతిగలవాడు: ఉక్కుపిండం [క]

అగ్గిపిడుగు = చాల గట్టివాడు [చి]

అగ్గిపెట్టు = జగడంపెట్టు [వి]

అగ్గియగు = ఆగ్రహించు, అగ్గగు [తె]

అగ్గిరాముడు = (1) కోపిష్ఠి [నె]
(2) చెడ్డచేయుటలో సమర్థుడు; మైరాముడు [వి; నె]

అగ్గివేయు = వంట ఆరంభించు [వి]

అగ్గురారం = అగ్రహారము [తె]

అఘుముడి = మొదలియార్లలో ఒక తెగ; వీరు మాంసాహారులు [చి]

అచ్చంగా = (1) స్పష్టముగా — *అచ్చంగా అది ఇది*
(2) యథారీతిగా—అట్లే—*వీడు అచ్చంగా నీలాగే ఉన్నాడు* [నె, వి; అ-పె]
(3) స్వయముగా—*అచ్చంగా నేనే ఇచ్చినా* [నె]

అచ్చనగాయలు = చిన్న చిన్న రాళ్ళతో ఆడు ఆట, దోసిటరాళ్ళను పైకివేసి, చేయి త్రిప్పి పట్టి, నిలిచినవాటిని పైకివేసి పట్టుకొనుట; పల్లంచి [చి]

అచ్చరాలు } = శిశువులకు కంఠములో
అక్షరాలు } కలుగు జబ్బు [నె-పొ]

అచిత్తు - అసిత్తు = రోగముచే ఏర్పడిన దౌర్బల్యము—వాడు అసిత్తు అయినాడు [నె]

అచ్చివచ్చు = లాభించు, కూడివచ్చు; అచ్చుదల [నె; కర్నూ; అ; తె]

అచ్చింతల } = అక్షంతల [కరీ]
అచ్చెంతలు }

అచ్చు = (1) త్రిప్పటకుగా తిరుగలిరాతికి వేయు గట్టిమేకు, తిరుగలి త్రిప్పుటకు వేసిన గుంజ; పిడి [అ; చి]
(2) నేతకై నూలుపోగులు అతికినది [చెం]

అచ్చుకట్టుగా = దిద్దితీర్చినట్లు — ఆమె ఏ పనిని చేసినా అచ్చుకట్టుగా చేయును [తె]

అచ్చుకొను = (1) చెల్లించు—పడ్డీ అచ్చుకొన్నా [అ; వి; నె]
(2) ఒకడీయవలసిన బాకీని ఇంకొకరు యిచ్చెదనని ఒప్పుకొను, అవాల్తాపడు [గు]
(3) బాకీపడు [వి]

అచ్చుపాటు = (1) కుదురుపాటు; అచ్చుబాటు [అ - పె; వ; నె]
(2) కలసివచ్చు — అది అచ్చుపాటు కాలేదు [నె]

అచ్చుపాలు = అనుకూలము [గు]

అచ్చుబాటు = అచ్చివచ్చు; అచ్చుపాటు [గు; నె]

అచ్చుబోయు = చక్కగాచేయు [తె]

అచ్చుబోసిన ఆబోతు = స్వేచ్ఛగా తిరుగువాడు, అచ్చువేసిన ఆపపెద్దు [కృ]

అచ్చుమాను = భూమిని చదరపెట్టి కయ్యలగా చేయు సాధనము [శ్రీ]

అచ్చువేయు = (1) వెంకటేశ్వరునిపేర, మంచి కోడెదూడను, జొబ్బపై గుర్తులు కాల్చి, ఆవులనుదాటుటకు వదలివేయు—(చూ) ఆపపెద్దు, ఆబోతెద్దు
(2) ఒకవ్యక్తి అద్దుపద్దు లేకుండా విహరించుట—వాడిని అచ్చువేసి వదలినట్లున్నది [నె]

అచ్చువేసిన ఆబోతు = అనగా దేవరెద్దు; బసవెద్దు; (చూ) ఆపపెద్దు [చి]

అచ్చేకాలు = కల్తీలేని విత్తులు [అ, నె]

అచ్చేకాలు బుచ్చేకాలు = పరస్పర అనుకూలతలు — వారిద్దరిలో అచ్చకాలు బుచ్చకాలు చాలా సాగుచున్నవి [కరీ]

అచ్చేరు = గంజివార్చని యన్నమువంటిది; అత్తెసరు—పిల్లలకు ప్రొద్దుననే అచ్చేరు బెట్టిరి [కరీ]

అజ గజాంతరము = వర్ణింప నలవికానిది; వూహింపరానిది, చాలా యెత్తైనది; హస్తిమశకాంతరమువలె. (అజము = మేకను, గజము = ఏనుగుకుగల అంతరము) [అ; బ]

అజలేదు = లక్ష్యములేదు [గు]

అజాపజా = జాడ—అతని అజాపజాలేదు [చి; గు]

అజీలుగా = సర్వదా, ఎల్లకాలము [అ] ఆజీలుగా [నె]

అజ్జా = అంచనా [వి]

అజ్జాయించు-అర్జాయించు = (1) ముందు వెనుకలాడు [నె]
(2) ఓర్చుకొను [గు]

అజ్జి = మొండి [అ]

అజె అయిపు = జాడ—వాడు ఎటుబోయెనో అజా అయిపూ తెలియలేదు [తె]

అజెము = సదా; తరచుగ—అయన అజంగా ఇక్కడికి వస్తుంటాడు [నె]

అటక - అటప - అట్టువ = ఇంటిలో సామానులకుగా దూలములపై అడ్డముగా చక్కలు

పేర్చి అమర్చిన వసతి. అట్టువమీద సామాను.మచ్చు:అటుకు; అట్టక; అట్టడి [నె; కర్నూ]
(2) గాడిపాటిమీద మేతపెట్టుటకు కట్టినది [అ]

అటకాయించు=(1) ఎదిరించు [చి]
(2) అడ్డగించు—*వచ్చే బండ్లను అటకాయించినాడు* [కర్నూ; నె; తె]

అటావల ఎల్లుండి=(1) ఈనాటికి ఐదవ నాడు [తూ-గో; గు]

అటావలెల్లుండి=(1) ఆవలయెల్లుండి తరువాత వచ్చు దినము [వ]

అటిక - అటికె=వెడల్పు మూతిగలిగి, కూరలు వండుటకు ఉపయోగించు మట్టి పాత్ర; చట్టి [తె; నె, కర్నూ]—*అటికెల బెట్టి ఫుటికెల వెదకినట్లు* [వ]

అటిక=(చూ) అటక [అ-పె]

అటిక=ఎసల [అ]

అటికమామిడాకు = ఒకవిధమగు ఆకు కూర [నె-పొ; చి]

అటికలు=కుండలు [శ్రీ]

అటుకాసి ఇటుకాసి=ఈలాగు, ఆ దిక్కు, ఈదిక్కుగ [శ్రీ]

అటుకు=అట్టవ-అటువ-అటక [వ, అ; నె]

అటుకుమామిడి=పసిఆకుచెట్టు [చి]

అటుకుల గొలుసు=అటుకులవలె బంగారంతో చిన్నబిళ్ళలుచేసి తయారుచేసిన కంఠహారము [సర్కా]

అటువ=అటక, అట్టవ [అ-పె]

అటూటు=అవతలికి [కర్నూ]

అట్ట=(1) సందులేకుండా లేచిన పుండు, చెమటకాయలు—*అట్టగా పేలినది; అట్ట అట్టగా లేచివచ్చినది* [నె; కర్నూ]
(2) పుస్తకమున కిరువైపుల బైండు చేయునప్పుడువేయు దళసరికాగితము—*అట్టవేసినా* [అ; నె, వ; తె, కర్నూ]
(3) అట్టలుగా ఏర్పడినది—*చెంపమీద ఐదువేళ్ల అట్టలు కట్టినవి* [తె; వ]
(4) తల మురికితో పేరుకోవడం—*తల అట్టకట్టింది* [వి; నె]

అట్టక=సామానులుంచు చోటు; దూలములపై కఱ్ఱతో చెక్కతో వాసాలతో పేర్చి కట్టిన స్థలము, అటక, అటవ; అట్టడి [చి]

అట్టడి=అటక, అట్టవ [తె]

అట్టది=ఇంటిలో సామానుల వేసికొనుటకు పైన కట్టినది; అటక [తె]

అట్టవ=బైలాట ఆడుటకు వేయు వేదిక; మచ్చు [కర్నూ-పత్తికొండ]

అట్టవేయు=భద్రతకై పుస్తకమునకు వేరొక దళసరి కాగితముతో కప్పు వేయుట [అ నె]

అట్టాము=బండిమీద అమర్చిన కంప మోపులు. క్రింద యీడ్పించుకొనిపోవు కంపమోపును తొడుగు అందురు [నె-ఆత్మకూరు]

అట్టిట్టుసేయు = ఉపేక్షించు—*అతడా పనిని అట్టిట్టుసేయడు* [కరీ]

అట్టిపెట్టుకొను=(1) గట్టిగా ఊనుకొను [నె; వి]
(2) కావలసినంతమటుకు వస్తువును తన దగ్గర నిలిపిపెట్టుకొను—*నాదగ్గర పది పావులు అట్టిపెట్టుకొన్నా* [నె]

అట్టు = (1) బియ్యము మున్నగువాని పిండితో దోసెగా పోసినది—*పెసరట్టు; అట్లతదియ గౌరమ్మ పండుగ* [తె-సర్కా]
(2) హరము అను అర్థమునందుమ వాడుక కలదు—*అతడు చాల అట్టుమనిషి* (రూ) హట్టు [తె; వ]
(3) కోడిగుడ్డుతో దోసెగా పోసినది; ఆంలెట్ [నె]

(4) తెంపులేకుండ ఒకటిగా ఏర్పడినది—అట్టు కట్టుకొనిపోయినది;—అట్టు తింటె జుట్టు పెరుగుతది—సామెత [వ]

(5) పిండిని బెల్లముతో నూనెలో వేయించిన వంటకము, అతిరసము వంటిది (అట్టు, అట్లు - బహు) [అ]

అట్టుడికినట్లు = తీవ్రవేదనబడుట — నా మనస్సు అట్టు ఉడికినట్టు ఉడికిపోయింది [నె, వి]

అట్టుడుకు = అంకట మెండుకొను; పెద్దగా సంక్షోభించు—అవాంగోపాలము అట్టుడికిపోవుచున్నారు [కరీ]

అట్టుప్పు = పశువులు త్రాగు నీళ్ళలో కలుపు ఉప్పు, మేలైనది కాదు—వానికి ఈ ఊళ్లో అట్టుప్పుగూడ పుట్టదు [తె]

అట్టులెక్క = నాటకములో నటించుట—వాడు అటులెక్కినాడు [అ-ఉరవకొండ]

అట్టువ = (1) నాటకరంగము [అ - ఉరవకొండ]

(2) అల్మేరాలో (బీరువా) వేయు అంతస్థు పలక [అ]

అట్టెడ = వంతెన [నె]

అట్టెము = రాతివిగ్రహాలు కదలకుండ లక్క మొదలైనవానితో చేసిన బంధము [తె]

అట్లు = అరిసెలు [అ]

అడ = (1) రేగుపండ్లు మొదలగు వానిని ఉప్పుతో కలిపి త్రొక్కి గారెలవలె తయారుచేసి యెండబెట్టబడినది [నె]

(2) బెల్లం కలిపి చేసిన లావుదోసె; చాపటి [అ]

అడంగు = మూలస్థానము—రైలు బయలు దేరిన అడంగులో ఎక్కితే స్థలం ఉంటుంది [తూ-గో]

అడంగులు = లోపల, తెలియనిస్థితి— ఆ కాగితము అడంగుల్లో పడినది [అ-పె]

అడకొత్తు = అడకత్తెర, వక్కకత్తెర; అడకత్తి

అడగారు - అణగారు = అడుగంటిపోవు [నె; గు, అ, వి]

అడప = (1) ఒకవిధమగు వాసముల కట్టు [కృ]

(2) బరువైనది [నె]

అడపదడప - అడపాదడప = (1) అప్పుడప్పుడు [నె; కర్నూ]

(2) పనిని వక్కలముక్కలచేయు—ఆ పనిని అడపదడప చేసిపోయినాడు [నె; వి; వ, అ]

(3) పలుమారు [అ]

అడపము = మంగలి కత్తుల సంచి [చెం]

అడపాదడపా = అప్పుడప్పుడు [శ్రీ, నె]

అడపాను = చెప్పులజోడు [చి]

అడపాను వెధవ = చెప్పులకుకూడ సాటి రాని అప్రయోజకుడు [చి]

అడపొడ = జాడ—వాని యడపొడ లేదు; అడా పొడా [గు]

అడభంగరము = అక్రమము—ఆ మనిషి అడభంగరము మనిషి [కరీ]

అడమానము = తనఖా; తనఖా అంటే అసలు అర్థము జీతమని, సర్కారులలో Mortgage అనే అర్థంలో వాడబడుచున్నది అడుమానము [చి]

అడమానముకూలి = (చూ) అధీనంకూలి [అ]

అడలు = ముద్దగట్టిన చింతపండు [గు]

అడలుగట్టుట = జబ్బు చేసినపుడు జుట్టు కఱచుకొనిపోవుట; అడచగట్టుట [గు]

అడవ = (1) కిరుగు, మేలైనదికానిది; వ్యర్థమైనది—అడవపరకు వసూలుకాక నిలిచిపోయినది, అడవబారు [అ]

(2) వీధిభాగవతములో భామవేషమువేయు లాస్యము—బాగా అడవదొక్కింది [నె]

(3) వరుస, మునుము—అడవ బెట్టితప్పు [తె]

(4) ఆడతనమున్నవాడు; ఎందుకూ కొర గానివాడు [చి]

అడవ=(1) రానిబాకీలు [కర్నూ - పత్తి కొండ]

(2) లొంగినది [చి]

(3) ప్రాతది—అది అడవసడక

(4) మితికి మించినది [నె-పొ]

అడవందరము=దిక్కు మొక్కు లేని—ఆమె బతుకు అడవందరవు బతుకు; అనాధ జీవితము; అబందర [కరీ]

అడవాబడుట=బాకీరాకుండా మొండి వడుట [గు]

అడవాసరుకు - అడవారకం = పనికి మాలిన సరుకు, అడవాజాతి [తూ-గో, గు]

అడావా=ఖాతాలోని జమాఖర్చులను సరి చూచి దేనికి దానిని వేత్వేఱగా ఎత్తుట, ఆసామివారి లెక్క—మా సెట్టి నానా గురించిన అడావా ఎత్తి వ్రాసెను [కరీ]

అడావుడి - హడావుడి = తొందరపాటు [తె, నె]

అడాసు = పాడదై పనికిమాలినది — అది అడాసు బండి [నె]

అడి=ఎద్దును, కుక్కను తోలునప్పు డుప యోగించెడి ధ్వని [వ]

అడిగంట్లు=మెట్టగ్రామాలలో కాపుపాత ళ్ళలో నీరు దిగినపుడు చెడిపోయిన అడుగు ధాన్యము [నె-పొ]

అడిగట్టి=పూరిండ్ల కప్పునకు అడుగున నుంచు ఆకుకట్టలు, బందేబాకు మొద లగునవి [నె-పొ]

అడిదెకొచ్చిన=ఉత్తపుణ్యానికివచ్చిన[సు]

అడివాకు (అడవి+ఆకు)=పొలమునకు ఎరువుగా వేయు పచ్చిఆకు [చి]

అడివితల=అడవిప్రాంతము, అడవితల—ఆ ఊరు దాటితే అంతా అడివితల [నె]

అడు=కొట్టు; అంగడి [అ]

అడుక్కొనేవాడు } = భిక్షుకుడు[శ్రీ; నె]
అడుక్కొనోడు }

అడుగంటు=(1) నాశనమగు

(2) మాడు [తె; నె]

అడుగడుగుదండాలవాడు=(1) శ్రీ వెంక టేశ్వరుడు, (2) పలుమారు స్తుతించవలసిన వ్యక్తి

అడుగవచ్చు = మనువు నిశ్చయించుటకు వచ్చుట—మా అమ్మాయిని అడుగవచ్చి నారు [కరీ, నె]

అడుగు=ప్రొద్దు నీడ, నేలమీద ఒకఅడుగు దూరము ప్రాకుటకు పట్టుకాలము—ఒక అడుగు ముందు రానిదేమి? [నె]

అడుగు = (1) గౌరవించు — అతని కుక్కెటుగూడ అడుగవు [కరీ]

(2) చిందు, లేదా, నృత్యవిశేషము[వ, నె]

అడుగుట=(1) స్త్రీని సంభోగమునకై అను మతించమని కోరుట—ఆయన నిన్ను అడుగమన్నాడు-ఇది తిక్కనప్రయోగము గూడ [నె]

(2) క్షేమము విచారించుట — మనవారి నందరిని అడిగినానని చెప్పు [వి; నె]

అడుగునబడు = వెనుకబడు, ఉపేక్షింప బడు [తె, నె]

అడుగుపడు=పాత్రలకు అడుగున రంధ్ర ముపడు [నె]

అడుగుబొడుగు=శేషము; పాత్రలో అడు గున శేషించినది. అడుగుబొడుగులూడ్చి పెట్టినారు [కరీ; నె, గు]

అడుగుమట్టు=కట్టకడపటి క్రింది ప్రదే శము [నె-పొ]

అడుగులకుబోయు=రాగిపిండితో సంకటి వండునపుడు ముందుగా నూకలుపోయుట (బియ్యము, జొన్న, సద్ద, నూకలు) [అ-పె]

అడుగులకు మడుపులెత్తు=అతిదీనముగా సేవించు—అడుగులకు మడుపు లెత్తినా

ఆయనకు దయ కలుగలేదు—(మా) మడుపులెత్తు [నె]

**అడుగులు**=(1) రాగిపిండి సంకటిచేయు నప్పుడు అందులో కలిపి వండు బియ్యము, జొన్నలు మొదలగు ధాన్యపు నూకలు [అ; తె; నె]
(2) కళ్ళంలోగాని, ఇంట్లోగాని చివరకు మిగిలే గింజలు [వ]

**అడుగులు** = గంజికుండలో క్రిందచేరిన మెతుకులు, వంటలో మాడి క్రింద చేరి నవి [నె-మెట్ట]

**అడుగువేయు**=(1) ముందుకు నడుచు
(2) నాట్యముచేయు [తె; నె]

**అడుగోలు**=ఒప్పందము, ఆడుగోలు [చి]

**అడుదిడ్డగ**=క్రమము లేకుండా మాట్లాడు [శ్రీ]

**అడుమానము**=ఆస్తిని తాకట్టు బెట్టుట, గుర్వి; తనఖా. (ఎ) స్వాధీనాడుమానము. (బి) చూపుడు అనుమానము. స్వాధీన అడుమానమున అప్పిచ్చినవారే ఆస్తిని అనుభవింతురు, దీనికి వడ్డి లేదు. చూపుడు అనుమానమున వడ్డి ఉన్నది, అనుభవించే హక్కు లేదు, అడమానము; ఆడు మానము [చి, నె]

**అడువు**=(1) దట్టము, సాంద్రము—పైరు అడువైనది [అ]
(2) బలమైన [అ-బళ్లారి]

**అడుసుపుండు**=కాలివ్రేళ్ళమధ్య బురదలో తిరుగాడినపుడు ఏర్పడు పుండు; నీటి చిలువలు [చి; నె]

**అడుసుపుల్లలు**=మడికోసినవెనుక దున్ని నపుడు లేచెడి పుల్లలు (ఆకు త్రొక్కి నపుడు రెమ్మలతో త్రొక్కివేయుదురు; ఆకు కుళ్ళి ఎరువై పోగా ఈ పుల్లలుండును) [చి]

**అడుసువేయు**=మట్టి మిద్దెలకు పై భాగ మున బంకమట్టితో పేముట [నె-పొ]

**అడేజావ్ బడేజావ్**=(1) ఏమీ లక్ష్యపెట్ట కుండుట—వాడి పసంతా అడేజావ్ బడేజావ్ [గు]
(2) దర్పము, వైభవము—అతని యింటి లో అడేజావు బడేజావు సాగుతున్నది [కరీ]

**అడ్డ**=పశువులు, బండ్లు నిలిచియుండు చోటు (Stand) [హైద; వ]

**అడ్డ**=(1) రెండు మానికలు; కుంచములో సగము (కొలత) [గు]
(2) పాత్ర విశేషము
(3) బండి పట్టా ఆకులకు మధ్య నున్న కొయ్య [నె, గు]
(4) బండి ఇరుసుమీద అడ్డముగా బిగిం చిన పెద్ద కొయ్య మొద్దు [నె]
(5) కట్ట—కాలువకు అడ్డవేసినారు [చి; నె]
(6) దున్నిన తరువాత చదరముచేయు సాధనము—ఆ చేను దున్ని అడ్డదోలి నాము [నె-పొ]

**అడ్డంగ అయినవు** = లావుగ అయినావు అనుట [మ]

**అడ్డకట్టు**=(1) కట్టుపంచను తమిళులవలె గోచిలేకుండ చుట్టుచుట్టినది, దట్టి, బ్రహ్మ చారికట్టు [నె; కర్నూ తె]
(2) వితంతువులుకట్టు తీరునుకూడా అడ్డ కట్టు అంటారు [సర్కా; గు; తూ గో]

**అడ్డకట్టు**=వరిమళ్ళలో నీరు నిల్చుటకు వేయు చిన్న మట్టి గట్టు [అ]

**అడ్డకట్టుపంచె** = వితంతువులు కట్టుకొను వస్త్రం; సాధారణంగా తెలుపురంగే కట్టె దరు [సర్కా]

**అడ్డకాలు** = ఆటంకము—ఆ పనికి అడ్డ కాలు బడినది [కరీ]

**అడ్డగ** = రెండు అణాలు; బేడ [కర్నూ-మార్క, చి]

అడ్డగట్టి=(చూ) ఒడిసెగడ్డ; సుఖవ్యాధి విశేషము [సర్కా: చి]

అడ్డగలకలో బుడ్డగలక=ఒక యిబ్బంది లో మరొక యిబ్బంది [కరీ]

అడ్డగాడిద=(1) ఊరికే పూరిపనిచేయువాడు—*అడ్డగాడిదె కొలువు* [అ]
(2) పనిలేక ఊరక తిరుగాడువాడు [నె; అ]

అడ్డగొడ్డు=(1) అంగసౌష్ఠవముతో తీరుగా బుట్టిన పసరము [నె]
(2) జంపును నిలువుగలిగి భుజబలము లేని పశువు [నె-పొ]

అడ్డగోలు=(1) తెలివితక్కువగా పనులు చెడగొట్టుకొనువాడు—*వాడు ఒట్టి అడ్డగోలు* [గు]
(2) క్రమముతప్పు—*అడ్డగోలుగా మాట్లాడినాడు* [తె]

అడ్డచాకిరీ=విపరీతమైనపని, అరవచాకిరి [తె]

అడ్డదిడ్డము - అడ్డాదిడ్డము=(1) అటు ఇటు గాకుండ, వరుసలేకుండ పేర్చుట.
(2) వ్యతిరేకముగా మాట్లాడుట—*ఆయన అడ్డదిడ్డముగానే మాట్లాడును* [నె; కర్నూ: అ; గు]

అడ్డధోవతి=లుంగీ, అడ్డపంచె [అ]

అడ్డపడుట=ఆదుకొనుట [కరీ]

అడ్డపాటు=నివారణము; విఘాతము [కరీ]

అడ్డపైన=శరీరములో సగభాగము—*అడ్డపైన నీళ్లబోసి కడుగుకొన్నాను.* వంగి మొలగుడ్డ తడువకుండా వీపు - రొమ్ము తడియునట్లు నీళ్లతో కడుగుకొనుట [నె]

అడ్డపొగ=చుట్టను అగ్గివైపు నోటపెట్టుకుని విడుచు పొగ [వి]

అడ్డపోతు=నురిసిన వెంటనే గల్లపొట్టుతో గూడ చేర్చి పొడవుగా పోసిన ధాన్యపు రాశి; అడ్రాసి (తూర్పారబట్టినవాటిని గుండ్రముగా పోయుదురు) [నె]

అడ్డబాల=అడ్డపాప [నె]

అడ్డబాస=(చూ) ముంగర, ముక్కునగ [గో, ప]

అడ్డమాలినవాడు = ఎందుకూ కొఱగాని వాడు [శ్రీ]

అడ్డము ఆపు - అడ్డమాపు లేక = క్రమశిక్షణ యందుంచువారు లేకపోవుట.

అడ్డము పెట్టు=తాకట్టుపెట్టు, కుదువయిడు [కరీ]

అడ్డమైనవాడు=ఎవడో పేరు ఊరు లేని వాడు, అన్యుడు [మ, నె]

అడ్డవ్రేలు=బొట్టనవ్రేలు [కరీ-న]

అడ్డసరిగడ్డలు=గెజ్జలలో పుట్టు మేహపు గడ్డలు, అడ్డకట్టులు [కరీ]

అడ్డాదిడ్డము=(చూ) అడ్డదిడ్డము [అ]

అడ్డాల=దోగాడు పాప—*ఈ పిల్ల అడ్డాల బాల అయింది* [తె]

అడ్డాలబిడ్డ=పాలుత్రాగుబిడ్డ [చెం]

అడ్డాలు=చాచిన తొడలు—*అడ్డాల్లో బిడ్డ* [వి]

అడ్డిగ=స్త్రీలు మెడలో ధరించు నగ—*రాళ్ళ అడ్డిగ* [నె, కర్నూ; తె; అ.పె]

అడ్డిగ=జిగినీగొలుసు [చి]

అడ్డిగల్లము = ఒకవిధమైన అలముకొను గడ్డి [అ-పె]

అడ్డిసేరు=రెండుసేర్ల నర; రెండున్నర సేరు [కరీ]

అడ్డీ=పొలములో గనుము (గనిమి, గట్టు) తెగినపుడు వేయు అడ్డు [గు]

అడ్డీగలు=(చూ) అడ్డిగ [అ]

అడ్డుట=బదులుగా నుంచుట; తాకట్టిడుట—*ఋణము క్రింద నాచే నడ్డితిని* [కరీ]

అడ్డుపడు=మధ్యపడు—*ఆపదలో నున్న వానికి అడ్డుపడి రక్షించు* [శ్రీ]

అడ్డుపుల్ల=(1) ఒకపని జరుగకుండుటకై చెప్పు కారణాలు [గో]

(2) కార్యముపట్ల కల్పించు అవరోధము —వాడు ఆ పనికి అడ్డుపుల్ల వేసినాడు [నె]

అడ్డెన్నుపడుట = వరివెన్ను వెరిగి వ్రాలుట [అ]

అడ్రాసి = అడ్డముగా పోసిన పెద్ద ధాన్యపు రాసి, అడ్డపోతు [అ-పె]

అడ్లు = ధాన్యము, వడ్లు (వాడు అనుటకు ఆడు అన్నట్లు) [వి]

అణక = (1) పసరముయొక్క ముందటి జబ్బ [కరి]
(2) (మా) అనికె [చి]

అణపు = సాకు—వారు తమపైకి రాకుండా అణపువేసినారు [కరీ]

అణుకు-అనుకు = దబ్బటి; ద్రవము ఎక్కువైనస్థితి—సంకటి, పిండిచాలక అనువైనది [అ]

అణ్ణ = తండ్రి, అజ్జ, అయ్య [అ-దక్షిణము]

అతంత్రము = (1) బలహీనము [అ]
(2) స్వాతంత్ర్యములేమి:—వాడిది అతంత్రపు బ్రతుకు [నె]

అతక = బాగుగా అరిగిపోయిన చెప్పు [నె-మెట్ట]

అతకరించు = (1) ఎట్లనో సరిపెట్టు
(2) వదలు వదలుగా ముడివేయు [నె]

అతకలుచచ్చినవాడు = శక్తిఉడిగినవాడు; ఏమిచేయనివాడు [నె]

అతగాడు = ఆయన [శ్రీ; ఉ-గో]

అతల కుతలము = (1) చిందర వందరగా, క్రిందిది పైకి కలగలుపు అగుట [నె]
(2) ఎక్కువ పొంగుగా—అతలకుతలంగా జ్వరం వచ్చినది [కర్నూ, తె]
(3) కల్లోలము [అ]
(4) ఆయాసము [నె-పొ]
(5) మనోచాంచల్యము [కర్నూ - పత్తికొండ]

అతిగడియు = జవదాటు — వాడు నా మాటకు అతిగడియడు [శ్రీ]

అతిమాత్ర = ఎక్కువగా మాట్లాడువాడు; అధికప్రసంగి, మాటకారి; వాయాడి [చి, తె; నె]

అతుకు = కలిసియుండు—వాడు ఎక్కడా అతకడు [తె; నె]

అతుకులబొంత = అప్పటికి ఎట్లో సరిచేసికొనినది—వాని సంసారము అతుకులబొంతగా అన్నది [తె]

అతుకులు = లోపాలు —అతుకులబొంత— లోపాలపుట్ట [వి]

అతులం కుతులము = బండి ఎత్తుపల్లాలలో నుండి పోవునప్పుడు శరీరం బాగా కదలుటవలన కలిగే అలసట; అతలకుతలం [మ]

అత్తపత్తి = తాకిన ముడుచుకొను ఓషధి— హస్తభీతి [నె-పొ; చి]

అత్తపుత్త = (1) వచ్చిరాని జిలిబిలి పలుకులు—ఆ అమ్మాయి అత్తపుత్త మాటలు మాట్లాడును [కరీ]
(2) హస్తభీతి ఆకు [నె]

అత్తము = అరటి గొలలోని కాయల వరుస; జీబు [గో]

అత్తారుబతంగా = జాగ్రత్తగా, భద్రంగా [కృ]

అత్తిరసము = అత్రెసము [కర్నూ]: అతిరసము, నిప్పటి; అరిసె

అత్తోడి (హతోడీ) = చేతుకు, అధీనత; —ఆమె ఎవ్వరి అత్తోడీలో లేదు [కరీ]

అదనా = హీనము [తె]

అదనాలు = సేద్యపు పనులలో నెలజీతగాండ్రు దిగాక దినకూలీల లెక్క; హాజరుపట్టి —అదనాలు వ్రాయించినాడు [నె-డెల్టా]

అదము-(రూ)అజము = మదము, పొగరు, అదరిపాటు, దుడుకుదనము [కృ]

అదరగొట్టు=(1)నోరుమూయించు—వాణ్ణి అదరగొట్టి పంపితివి [అ; నె]
(2) దులుపుట, రాలగొట్టుట — చింత కాయల అదరగొట్టు [అ-పె]

అదరబదర=త్వరత్వరగా, ఆదరాబదరా, ఆదరాబాదరా [నె; తె]

అదరబదరచేయు = బాగుగా చేయకుండా పోవు; అందతుకులుగా చేయు—వారా పని అదరబదరచేసి పోయినాడు [అ-పె, నె]

అబరాబదరా - అదరాబాదరా=త్వరిత ముగ [చి; వి; శ్రీ; నె, తె; కర్నూ, అ]

అదరు = కదలు — నా భుజము అదరు చున్నది [తె, నె]
(2) (చూడు) అదురు

అదరుమ్రాకు=మోటవావిపై బిగించిన అడ్డ మ్రాకు [కరీ]

అదలుబదలు = మార్చుకొనుట — లమ అస్తులను అదలుబదలుచేసికొనిరి [కరీ]

అదవ = (1) హీనము—దొంగిలించేటంత దొరలనముండగా అడుక్కుతినేటంత అదవబతుకు ఎందుకు [నె]
(2) కుంటి—గుడ్డి [కర్నూ-పత్తికొండ]

అదవమనిషి=(1) పనికిమాలినవాడు [నె]
(2) శక్తిహీనుడు, అంగవైకల్యము గల వాడు [అ; కర్నూ, తె]

అదాటుగా=హఠాత్తుగా [వ; నె]

అదాటున=(1) ఆకస్మికముగా [అ; నె]
(2) రొంగి [ప]

అదాటుపడు=అనుకోకుండా మార్గమధ్య మున ఎదురుపడు [నె, కర్నూ, అ; తె]

అదిన=వదిన [వి]

అదుపు=పరిమితులకు లోబడియుండు—అదుపులో నుంచుకో [తె, నె; అ]

అదురు=(1) ప్రకంపనము (వై ద్రేషణ)
(2) గని సొరంగములలో మందు బెట్టి కాల్చిన తర్వాత కదలవారిని భూభాగము —అదురంతా చేసివేసినారు [నె]

అదురేటు-(రూ)అదురువేటు=ఉన్నట్లు ఉండి అదురునట్టు (భయపటునట్లు) కొట్టుట [నె]

అదువు=లోకువ, బలహీనమైన [అ]

అద్ద=వరికుప్పను మొనతేల్చుటకు ముందు (గోపురాకృతిగ) క్రింద వేయు, వృక్షకాండ మువంటి మొదలు—పప్పు అద్ద అయినది [నె]

అద్దలము=నాటకములందు ముఖమునకు వేయురంగు, హరిదళము—అద్దలంపూసి వేషమేస్తే చాలు, [చి; నె]

అద్దలా=పెగాని [వి]

అద్దు=(1) ఒకటి ఇంకొకదానిలో ఇముడు; ఒకటి ఇంకొకదానిలో మిళితమైపోవు—అబొట్టు అత్త ఒత్తే అద్దినట్లున్నది [కరీ]
(2) రవికగుడ్డ [వి]

అద్దుగోడ=చిన్నగోడ, అడ్డుగోడ [చి]

అద్దుడుకాగితము = బ్లాటింగ్ పేపరు (Blotting Paper) [కరీ; నె]

అద్దుపద్దు = నియమము — అద్దుపద్దు లేకుండా పెరిగినాడు; అద్దుపొద్దు; హద్దు పద్దూ [నె; కర్నూ; అ; తె]

అద్దులుబెట్టు=చాకలితో మంగలితో మాట్లా డక, చీపురు చేట ముట్టక నియమ పాటించునది. [చి]

అద్వైతము=మంచి చెడు తెలియని అవివేకి; యతామతం [గు]

అన=(1) బుట్ట, సంచి మొదలగునవి అల్లు టకు ఏర్పరిచిన మొదటియాకృతి—నీవు అనవేసి యిమ్మ, నేను బుట్టంతా అల్లు తాను [నె-పొ]
(2) ప్రారంభమునవేయు నూలు, లేక నులకపోగు—మంచమల్లుటకు అన వేసి నారు [కర్నూ]

అనక =(మూ, అనిక—ఎద్దు అనకపెట్టింది; అనకవేసింది [వ]

అనకాసారి = వెనుకసారి; తర్వాత: అంకాసారి [అ, బ

అనకొాన = మొదలుకుద; వితరణ — అనకొానలేనిపని; అనగొాన [నె]

అనకొాన తెలియదు = ఇగురేదో, కొాస ఏదో తెలిసికోలేనిస్థితి [నె]

అనప =(1) అనపకాయ, (2) అనుములు [చి]

అనాక = తర్వాత, పిదప [చెం]

అనాద = చేతగాని, అనాథ [అ]

అనామత్తు =(1) అమానత్తు.

(2) పూర్తిగా—పైరు అనామత్తు పాడయినది [నె]

(3) చేబదులువలె, తాత్కాలికమైన లెక్క—అనామత్తులో వ్రాసి డబ్బు తీసుకో [నె]

అనాస = అనాసపండు [చి]

అని =(1) దారి, సుముఖము—ఆ విషయము ఒక అనికిరాలేదు. [నె]

(2) పరిష్కారము—అని కుదురలేదు [నె]

(3) దారపుకండెకొాన; అల్లిక [అ]

అనిక =(1) ఎదురు తిరుగుట,

(2) ఎద్దు మెడమీద కాడిని క్రిందకు త్రోసి వేసి అడ్డము తిరిగి నిలచుట—ఎద్దు అనికవేసినది; అనక; అంకె [నె]

(3) పనిచేయ నిరాకరించుట; వాడు అనిక వేసినాడు [నె-డెల్టా; తె]

అనిపించుకొాను = నిందింపబడు — ఒకరి చేత అనిపించుకొానడం ఎందుకు ? [నె, అ; గు, తె]

అనిలి = పిచ్చి, అమాయకపు [అ]

అనుపు = సాలుగుదారులు కలియుకేంద్రము; కూడలి [చి]

అనుమాయితీ = సంప్రదాయం [వి]

అనుము = తాళము, (బిగము) మున్నగువానిలోని మర—అనుము చెడినది. [వ]

అనువు =(1) అలవు—అనువువచ్చేవని [అ]

(2) లోకువ; హీనమైపోవు [శ్రీ]

అనువుకట్టు = లోకువచేయు— అనువు వాడి పెళ్లాము ఊరందరికీ వదినె [ప]

అన్న = తండ్రి [చి-పుంగనూరు] అక్క [చి]

అన్నకావడి =(1) తిండిపోతు—అతడన్నకావడి, ఎందుకూ కొరగాడు (కొందరు సన్యాసులు కావడికట్టి బిచ్చమునకువచ్చు అలవాటు గలదు) [చి]

(2) ఇంటింట కవళమెత్తుకొని పొట్టబోసికొానువాడు; అన్నపూర్ణకావడి [నె]

అన్నకుత్తి = అన్నము వడ్డించు సాధనము [చి]

అన్నన్నగతికులు = కూటికి అంగలార్చువారు [కరీ]

అన్ననా్న = జాలితో అనుట, లేక పొరపడి చేసిన పనికి పశ్చాత్తాపపడుట [గో]

అన్నశుద్ధి = నెయ్యి [గు]

అన్నా! = కోపముతో అదల్చుట [గో]

అన్నా! పన్నా! = దండుగ, ద్రోహము లేనిది [కరీ]

అన్నాబత్తి = ఊదువత్తి, సాంబ్రాణికడ్డీ [చి]

అన్యాత్తుడు = కేవలము అప్రయోజకుడు [నె]

అన్యాలము = అన్యాయము [కర్నూ]

అపరాత్రి = అర్ధరాత్రి, అపరాతిరి [శ్రీ; నె]

అపరాలు =(1) కాయధాన్యాదులు, పప్పుదినుసులు [సర్కా, గు]

(2) అపరకర్మలు [కర్నూ; నె]

అపసవ్యం = ప్రతికూలము [శ్రీ]

అపిని =(1) చెడ్డ అలవాటుకు ఎక్కువగా లొంగిపోయి ఉండుట.

(2) ఎక్కువ అభిలాష—వాడికి అదంటే ఒకే అపిని; (అఫిని = నల్లమందు తినువానిస్థితి అని కాబోలు) [నె]

(3) తృప్తి కాకుండుట [నె-పొ]
అపిరితిపిరియగు = తట్టుకోలేక ఉక్కిరి బిక్కిరగు [గు]
అపూటముగా = బొత్తిగా [అ-పె]
అపూటు = స్వచ్ఛము, — *అపూటుసారాయి* [కరీ]
అప్ప = (1) అక్క—*కనకప్ప* [శ్రీ; గో; నె; అ]
(2) పిండివంట, (అప్పచ్చిరూపాంతరము) [కర్నూ]
(3) అయ్యఅనుట(సంబుద్ధిలో)—*ఏమప్పా* [అ]
(4) తండ్రి [రా]
అప్పకేడ్చేడివాడు = అప్రయోజకుడు— *ఆ కుఱ్ఱవాడప్పకేడ్చేడివాడు* [కరీ]
అప్పచ్చి = అప్పన్న దేవుడిపేరు విశాఖ జిల్లాలో స్త్రీలకూ పురుషులకూ కూడా పెట్టు పేరు.
(2) పిండి, బెల్లము, ఉప్పు, నూనె కలిపి రేకులుగా బొగ్గులమీద కాల్చే పిండివంట [వి]
(3) భక్ష్యవిశేషము [శ్రీ]
(4) నిప్పటి (అరిసె); వడ మొదలగు తినుబండారము [నె]
అప్పటము = కల్తిలేని; స్వచ్ఛము [తె; నె; అ]
అప్పడూ = కూతురినైనా, కొడుకునైనా పిలుచుకొనే ముద్దుపిలుపు — *అప్పడూ ఇటురా* [వి]
అప్పనంగ = ఉచితంగ [శ్రీ]
అప్పనాలబావ = అవ్యక్తుడు; అప్రయోజకుడు—*మావాడు అప్పనాలబావ* [కరీ]
అప్పన్న = సింహాచలదేవుడు [వి]
అప్పయ = పిల్లవాడు [అ]
అప్పయ్య = (1) సెట్టి(వైశ్యుల)బిడ్డలు చిన్నాయనను పిలుచు మర్యాద [కరీ]
(2) అబ్బాయి [అ]
అప్పలస్వామి = సింహాద్రి నరసింహస్వామి [వి]
అప్పసము = (1) పొలములోని నీరు క్రిందకు జారిపోకుండా అడ్డువేసిన మట్టిపెళ్ళ [శ్రీ]
(2) బోదెలనడిమి చిరుకాలువ; యారాము [వి]
అప్పసము = ఋద్దున, స్వయముగా — *అతడా పెను అప్పసంగా ఉంచుకొన్నాడు.* [కర్నూ]
అప్పళముగా = (1) సులభముగా
(2) సంపూర్ణముగా
(3) అనువుగా — *అది అప్పళంగ సరిపోయింది* [నె]
అప్పాలు = అప్పచ్చులు (పిండితో చేయునవి)
అప్పిళము = ఎల్లప్పుడు, అజంగా [నె-ఆత్మకూరు]
అప్పుదిద్దు = అప్పుదీర్చు [శ్రీ]
అప్పుసప్పు = ఋణముగనో, చేబదులుగనో సంపాదించుడబ్బు; (జంటపదము) - *అప్పుసప్పుచేసి పని పూర్తిచేసినా* [నె. తె: అ, కర్నూ]
అఫము = అభము, శుభమునకు వ్యతిరేకము [కరీ]
అబము సుబము = అశుభము శుభము— *వాడు అబము సుబము ఎరుగడు పాపము; అన్నెము పున్నెము* [నె. పొ]
అబాపురి = (1) అలాటప్పు
(2) డబ్బు ఎగవేయుట [గు]
అబోరు = శూన్యం, నిర్లిప్తత [అ, బ]— *ఇల్లంతా అబోరుమంటున్నది.*
అబ్బక్క = ఆశ్చర్యార్థకము [కరీ]
అబ్బగాళ్లు = పశువులకు, దున్నీ దున్నీ పుండుపడినకాళ్లు; మెత్తకాళ్లు - *ఆయెద్దు అబ్బగాళ్ళపై నడుస్తుంది* [కరీ]

అబ్బడాలు = అబ్బకు + ఆలు అనుట;— స్త్రీలు వాడే ఒక తిట్టు;—ఓసీ, నీ అబ్బడాలా [నె. కర్నూ - గిద్దలూరు]

అబ్బనాకారం = అర్థంలేని గారాబం [తూ-గో]

అబ్బయ్య (అబయ) = (1) బాలుని పిలుచునపుడు వాడే పదాలు. [నె]
(2) పిల్లవాడు [చి]

అబ్బరాంతము = అపూర్వము — అబ్బరాంతపుబిడ్డ పుట్టినాడు, గడ్డపారతేరా చెవులు కుట్టుదాము [కర్నూ]

అబ్బరానిగడ్డపార = అలవిగానివాడు [నె]

అబ్బరింత = (1) ఒక పక్షి (బెదురుపక్షి)
(2) వ్యంగ్యముగా-బెదరిపోవు ఆడుది— అబ్బరింత వ్లాడది [అ-పె]

అబ్బరేకం = కాబోవు పెండ్లిజంటలకుచేయు అభ్యంగనకర్మ [కరీ]

అబ్బాసల్లీకాలము = చాల పురాతనమైన కాలము అబ్బాస్ఆలీ ఉదయగిరి నబాబుగా పూర్వము పేర్గాంచినాడు; ఓబాయ కాలము [నె-ఆత్మకూరు]

అబ్బి = (1) అతడు అనుట; ముఖ్యముగా ఆడువారు వాడుదురు - ఆ అబ్బితో చెప్పు [నె]
(2) అబ్బాయి — ఆ అబ్బిని చూడు [కర్నూ, ఉ. గో]
(3) పురుషవాచకము - వంకాయలబ్బి :- ఓ యీ అనుమాటకు సరిపోయినది - ఓ అబ్బి వచ్చినావా? [నె]
(4) కొడుకు [శ్రీ]
(5) పిల్లవాడు [అ]
(6) బిడ్డ [చి]

అబ్బిగాడు = (1) చిన్నవయస్సులో ఉన్న కొడుకు నుద్దేశించి పల్కునట్టిమాట
(2) ఎఱుగని ముద్దరాలు [శ్రీ]
(3, కుఱ్ఱవాడు [ఉ-గో]

అబ్బిఱ్ఱగరచు = బొడుగరచు, పెద్దవిగరచు [నె-ఆత్మ]

అబోడ్డు = అబ్బాయి, బాలుడు [చెం]

అభిప్రాయము = మక్కువ — దానిపైడ అభిప్రాయం కలిగింది. [నె]

అమందస్తా = తాంబూలము దంచుకొను; చితకకొట్టుకొనుటకు ఉపయోగపడునది, ఉమానుదస్తా [శ్రీ]

అమకక్కశము = అతిశయము—పెండ్లి అమకక్కశంగా జరిగింది [చి]

అమగము - అసహ్యము, రోత [కర్నూ - గిద్దలూరు]

అమడకాయ = ఒకజాతి కలుపుమొక్క.

అమరిక = కుదిరిక, ఒప్పిదము [అ, నె]

అమరు = (1) ఒప్పునది; సరిపడినది. కుదిరినది [అ; నె]
(2) కుదురు—పనికి మనిషి అమరినాడు [తె]
(3) దెబ్బలు తగులు (వ్యంగ్యం)—అమునకు బాగా అమరినవి [నె]

అమిలు = మత్తు, మైకము—పాము గఱముటపల్ల అతనికి అమలు వచ్చినది. హామలు (అన్యదేశీయం) [వి, కరీ]

అమాంతము = (1) పూర్తి—అమాంతముగా లాగుకొన్నాడు [నె, కర్నూ; వ]
(2) హరాత్తుగా లేక అకస్మాత్తుగా [గో]

అమాంతము = అమావాస్య పర్యంతము పూర్తినెల (అమ + అంతము) [నె-పొ]

అమాం బాపత్తు = అన్నీచేర్చినమొత్తం [శ్రీ]

అమాన్ దస్తా = వక్కాకురోలు.

అమాలి = మూటలుమోసేకూలి, కళాసీ అని [వి, అ]

అమిజి = (మూ) (1) అంజి. (2) దండగపని —అది అమిజి అయినది [నె]

అమిరిచ్చుకొను = ఇతరులది దక్కించుకొను [మ]

**అమిసిన(అమియు)**=సిద్ధమైన - *అమిసిన దానిపై అయ్యవారిచేయి* [కరీ]

**అమీ తుమీ**=అయ్యేది కానిదీ, అవుగాములు—*అమీతమీ తేల్చేసుకో* [చి; నె-పో]

**అముజు**=ఒరద—*అముజు కడుక్కొచ్చిరా* [నె-కనిగిరి]

**అముసు**=పట్టువడు, ఇముడు—*ఆ బ్రూసు చేతికి అమరదు* [కరీ]

**అమ్మ**=స్తనము. చన్ను — *పంటిపాపకు అమ్మనోటిలో పెట్టుము; ఆ పాప అమ్మ జీకుటలేదు* [కరీ]

**అమ్మక్ డమ్మక్**=మోసము [కరీ]

**అమ్మక్క**=పెద్దాయి, తల్లియక్క [కరీ]

**అమ్మజూపు**=ఒక వస్తువును అమ్ముదునని ప్రకటించు—*ఇంటిని అమ్మజూపినాడు* [నె, కర్నూ, తె, అ]

**అమ్మడు**=(1) అబ్బాయి. చిన్నపిల్లవాడు [చి, వి]

(2) కూతురుని ముచ్చట పాటుగా పిలుచు గారాబపు పిలుపు [వి]

**అమ్మణ్ణి**=(1) దేవి [నె]

(2) చిన్నపిల్ల [అ]

(3) అమ్మాయి, ఎందుకూ కొరగానివాడు —*వాడు అమ్మణ్ణిగదా* [చి]

**అమ్మతల్లి**=(1) దేవతవలె పూజింపదగినది. (గోవులపట్ల స్త్రీలపట్ల దీనిని వాడుదురు) [గు]

(2) అందమైన కుదిరిక గల గోవు [గు]

(3) స్ఫోటకము [కరీ]

(4) పసిపిల్లలను పిలుచు ముద్దుపేరు [నే]

**అమ్మమ్మ**=(1) తల్లి [సర్కా]

(2) అవ్వ, మాతామహి [నె]

**అమ్మమొగుడా**=ఒక తిట్టు [అ]

**అమ్మలక్కలు**=(1) ఇరుగుపొరుగు ఆడువారు—*అమ్మలక్కల మాటలు* [నె; అ; తె]

(2) అక్కాతమ్ముడు [తూ-గో]

**అమ్మలు**=స్త్రీలు [వి]

(3) కూతురు—*మా అమ్మలు మంచిపిల్ల; అయ్యాలు* [కరీ]

**అమ్మవారిపొంగు** = మశూచి చిడుములు (పొక్కులు కట్టినదశ) [చి]

**అమ్మవారు**=(1) పోలేరమ్మ; స్ఫోటకము, మశూచికము.

(2) దేవి—*అమ్మవారిగుడి* [నె; కర్నూ, వ, అ]

(3) గడుసు స్త్రీ [అ-పె]

(4) బ్రాహ్మణస్త్రీ [తె], అమ్మోరు [నె]

**అమ్మాడమ్మా** = బాతాఖానీ; పుక్కిటి పురాణం, లోకాభిరామాయణము [కరీ]

**అమ్మి**=(1) బాలిక, అమ్మాయి (ఇది ప్రీతి వాచకము)—*మా అమ్మి* [ఉ, గో, నె, అ]

(2) కూతురు [తె, శ్రీ]

**అమ్మన వేసినట్లు**=చక్కగా, సూటిగా—*అమ్మన వేసినట్లు గీత గీచినాడు* [కరీ; నె]

**అమ్మవేయు**=మాతావేయు, దివాణపు అమ్మవారు వేయు (వేక్సినేషన్) [అ-పె]

**అమ్మేసినట్లు** — అమ్మ + ఏసినట్లు= చక్కటి చాలుగానుండుట — *ఆ చెట్టు అమ్మేసినట్లు పైకిపోయింది* [నె]

**అమ్మోరు**=(1) బ్రాహ్మణస్త్రీ

(2) స్ఫోటకము [నె, చి]

**అయ**=తండ్రి [నె]

**అయిచ్చు**=(1) రొప్పు

(2) బండితోలు—*ఆ యెద్దును అయిచ్చుము* [కరీ]

**అయినకాడికి**=వచ్చినంతవరకు — *అయినకాడికి అమ్మేసిరా* [చి; నె]

**అయినవారు** = కావలసినవారు — *అయినవారికి ఆకుల్లోనూ, కానివారికి కంచాల్లోను* [వి; నె]

అయినిల్లు=ఇంట్లో దేవుడిగది [వి]
అయిపిలేదు=జాడలేదు, అయిపులేదు [గు]
అయిబు సయిబు=మంచీ చెడ్డ, ముద్దూ ముచ్చట [మ]
అయిరేడి=(చూ) అరివేణి, అవిరేణి
అయిలు=తిక్క—వానికి అయిలు బట్టినది [అ-పె]
అయివచ్చులు=అచ్చివచ్చుట—మాకు వ్రతములు అయిరావు [కరీ]
అయివేజి=(1) రాబడి [తె]
(2) ధనస్తోమతి — మాకు అయివోజు తక్కువ [నె, కర్నూ, తూ-గో, అ]
(3) బ్రాహ్మణుడు [కర్నూ]
(4) పంటభూమిస్తోమత [తూ-గో]
అయివేజు=(చూ) అయివేజి
అయివోజు=(చూ) అయివేజి [నె;ఆదోని]
అయిసా పయిసా=(1) త్వరలో తెగించుట, తెమల్చుకొనుట; — ఇంత సేపా, మేమైతే అయిసాపయిసా తేల్చేస్తాము [గు]
(2) అటో ఇటో తేల్చు [నె]
అయోమయం=(1) చుట్టూ యేమీ కానరానంత సముద్ర మధ్యభాగం [గు]
(2) ఏమీ అర్థముగాని స్థితి (ఇనుముతో చేసిన దానివలె) [నె]
అయ్య=(1) తండ్రి, నాయన, నాన్న [ఉ-గో]
(2) జంగమయ్య [కరీ]
(3) వ్యంగ్యముగా నిందమోపునపుడు అనుమాట-ఆ అయ్యకు అంతా తెలుసు [నె]
అయ్యగారిచేను=మాన్యము,అగ్రహారము; అయ్యగారిపల్లె [చి]
అయ్యగారు=(1) పూజారి [మ]
(2) పురోహితుడు [తె]
(3) గౌరవవాచకము [నె]
అయ్యడు=(1) పూజ్యుడు [కరి]
(2) ఒక మగవాడు—ఆ యయ్యనికి అంతా తెలుసు [కరీ]
అయ్యలు = గురువులు, అయ్యవార్లు; —అయ్యలు వచ్చినారు [నె]
అయ్యవారి తలవాకిలి=సంసారుల కుటుంబములకు లక్షణమైన గొడ్డుగోదలేక శుభ్రముగా నుండుట, వ్యంగ్యముగా శూన్యమనుట—ఇది అయ్యవారి (బ్రాహ్మణుని) తలవాకిలివలె నున్నది [నె]; అయ్యగారి మట్టిల్లు [తె]
అయ్యవారి నట్టిల్లు=ఇంట నేమియు లేదు. ఇది వైష్ణవ గురువులవారి ఆచారము; ఏ దినమున కా దినమే శిష్యులంపిన సంభారములతో ఆ దినమే వండివేసి మర్నాటికి ఏమియు పాచిద్రవ్యము లేకుండ జేయునది; అయ్యవారి తలవాకిలి [గో, తె]
అయ్యవారు=(1) ఉపాధ్యాయుడు—అయ్యవారికి బాలు ఐదు వరహాలు [నె]
(2) బ్రాహ్మణుడు × అమ్మోరు, అమ్మవారు—పంచాంగం అయ్యవారు [చి; నె; అ]
(3) సాతాని [వి]
(4) శ్రీవైష్ణవుడు [కరీ, వ]
అర=(1) గది—అరలో పందుకో [నె, చి]
(2) పెట్టెలో ఒకభాగం—అరలో దాచిపెట్టు [అ; నె; వ] అఱ
(3) కపటము—వాడెప్పుడుగూడా నాలో అరలేకుండా మాట్లాడి యెరుగడు
అరంగము=చెట్టు, ఆ ఏట కాయు మొదటి కాపు: రెండవది గైరంగము: మూడవది ఎడకారందురు, (చిత్తూరుజిల్లాలో, మలబారులోవలె మామిడి మొదలగునవి ముక్కాఱు కాయును) [చి; క]
అరంట=అక్షింత గడ్డి [తె]
అరక=మడక, నాగలి—అరక అరిగిన గరిసె విరుగును [చి; నె; గు; వ]

అరక = (1) బండి మొదలగునవి లాగునపుడు కలుగు ముందుబరువు—*బండి అరకైనదిxలేవు, లేవడి* [నె, కర్నూ, అ, శ్రీ, తె]
(2) అరక = కాడి—*పది అరకల సేద్యము* [కర్నూ]

అరకంఠము = చలికాలమున పిల్లలకు కంఠముచుట్టు గట్టిన వలివస్త్రము [కరీ]

అరకట్లు = సెద్యపు పశువులచేత ఒక ఇడి (పూట) మాత్రమే పని చేయించుట [నె-మెట్ట]

అరకనేల = ఒక అరక (నాగేటి) తో చేయు పనికి తగినంతటి సేద్యపు భూమి: 10-12 ఎకరముల మెట్టభూమి కలిగినది—*ఇది ఒక అరక తోట* [నె-మెట్ట; వ]

అరకాయ = వరి మున్నగు ధాన్య జాతిలో సగము మాత్రమే గింజ బట్టినది

అరకు = (1) ద్రావకము—*అతడు ద్రాక్షల నుండి అరకు తీసెను* [కరీ]
(2) పలుచని బిళ్ళ

అరకొరలు = (1) సగము సగము చేసిన పని, వక్కలు ముక్కలు, అరగొరలు [నె; వ; అ-పె]
(2) తక్కువలు,
(3 మనస్తాపములు [అ]
(4) లోపము
(5) సందేహము [నె-పొ]

అరగడము = అజీర్ణము—*అతనికి అరగడము బట్టెను* [కరీ]

అరగొత్తు = సగము కడుపునకే చాలిన తిండి—*అతడు అరగొత్తు భోజనము చేసెను* [కరీ]

అరజాయించు = వెనుదీయు, వెనుక ముందాడు—*అ పనికి ఖలే అరజాయిస్తున్నాడు* అర్జాయించు; అజ్జాయించు [నె]

అరడ = తరిమిన బట్టిన చిన్న కొయ్య భాగము, వీటితో ఉయ్యాలతొట్టి ప్రక్కలు, పెద్ద మంచముల తలదాపులు, కాళ్ళ తట్టులలో చట్టములు చేయుదురు—*అరడాల తొట్టి* [నె]
(2) పడమటింటిలో (గది) దేవుని పీఠమునకు పైన మేల్కట్టుగా, వెదురు దబ్బలతో అమర్చి వ్రేలాడగట్టినది.

అరడు = వ్యాపించు [సే]

అరదండి = కఱ్ఱతో చేయబడు అర్గళము [కరీ]

అరదట్టు = అరదట్టీలు (Cut drawer) [గు]

అరదట్లు = నీటికొరత, ఎద్దడి [నె]

అరదడి పొలము = తోటపైరుచేయు నేల; అప్పుడప్పుడు నీళ్లగట్టు పొలము [తె]

అరదుడ్డు = రెండు పైసలు, దుగ్గాణి [చి]

అరప = పొలములలో కాపుండుటకు, పిట్టలను తోలుటకు ఎతుగా వేసిన పందిలి వంటిది, మంచె [శ్రీ]

అరపు = అధికమైన—*వాడు మనకు అరిపే మనిషికాడు* [గు; నె]

అరపువేట = పెద్ద గోలచేయుచు అడవి జంతువులను ఆడువేట, పరవదోలు వేట [నె, శ్రీ]

అరప్పనములు = కట్నాలు, కానుకలు [కరీ]

అరబందరము = అబందరము [గు]

అరబ్బులబాకి = నిర్బంధముగ వసూలుచేయబడునది; కాబూలువాని బాకి, అగని బాకీ [కరీ]

అరమరికలేక = భేదములేక; ఆత్మీయతగా [తె, శ్రీ, నె]

అరవ = (1) మాశెము (మచ్చిక) గాని ఆవు [నె]
(2) అర్థముగానిది—*అరవగోడు చింతగుగ్గిళ్లు* [నె; కర్నూ]

అరవంకాలు = చేతియొక్క పై భాగమున (రెట్టకు) పెట్టునగ [సర్కా]

**అరవందము** = దిక్కులేని—*ఆమెది అరవం దవు బ్రతుకు* [కరీ]

**అరవకట్టు** = దట్టీకట్టు, అడ్డకట్టు [నె]

**అరవచాకిరి** = (1) తమిళ వైష్ణవులకు మంగలి చేయు సర్వాంగ క్షౌరము [నె]
(2) హీనమైన సేవ, చాకిరి
(3) ఎక్కువ కష్టమైన పని [అ]
(4) ఊరకచేయు పని [అ]

**అరవటిక** = జాతరలలో వడపప్పు, పానకము యిచ్చుచోటు [సే]

**అరవడి** = బావిని మరింత వెడల్పుగా త్రవ్వుట—*మా బావిని అరవడి బట్టించినాము* [కరీ]

**అరవముసలి** = పండు ముసలి [కరీ]

**అరవమొత్తుకోలు** = అర్థంకాని భాష [చి]

**అరవాసి** = (1) సగము
(2) అర్థం ఏర్పడిన కాయలు—*అరవాసి కాయలు* [చి]

**అరసి** = వివరము తెలిసికొని — *అరసిపోని రా* [తె]

**అరాకు పరాకులు** = చీకాకులు [కరీ]

**అరాకొరా** = శేషము — *ఆ పని అరాకొరా లేకుండా పూర్తి చేసిరా* [చి: గు]

**అరాబు** = తడిగలవస్తువులను క్రిందపెట్టినపుడు ఆ వస్తు వున్నంతమేరా నేలపై ఏర్పడిన తడిగుర్తులు [గు]

**అరాము** = దొంగ [చి], హరాము
(2) నిషేధము

**అరాయించుకొను** = జీర్ణించుకొను; —*వాడు యితరుల ఆస్తిని అరాయించుకోలేడు.* హరాహించుకొను [నె; కర్నూ: అ, తె; వ]

**అరావిడి** = గిన్నెలో పాలు మొదలైనవి కాచినప్పుడు ఆ గిన్నెలో చుట్టూ పడే మరక [గు]

**అరిగిండ్లు** = తుంగభద్రపై మనుష్యులను, సరకులను దాటించు పెద్ద తోలుబుట్టలు; హరిగిలి, పుట్టి [కర్నూ]

**అరిగిలి** = ఏరుదాటుటకు తోలుకుట్టిన గంప; పుట్టి [తె]

**అరిఘోష** = మిక్కిలి కష్టము [కరీ]

**అరిణ** = నీళ్లు పారించుటకు ఉపయోగించు పెద్ద దోనె, అరిణి [నె]

**అరిణి** = దోనె, అరిణ [నె]

**అరితి** = అరుత, అఱు, మెడ—*అరితిన మోసినాడు* [నె; అ]

**అరితి కాకలవాడు** = ఏపనినిగాని తుదముట్టకొన సాగించకనే నడుమ వదలివేయువాడు; మెడ వేడి ఎక్కుటచే అనుట [నె]

**అరిపి** = బక్కపలచన, సన్నము, అరీపి [గం]

**అరిపేద** = (1) మిక్కిలిపేద, దౌర్భాగ్యుడు [నె]
(2) బలహీనుడు, బక్కచిక్కినవాడు [నె-పా, గొ]

**అరిబరి** = కొంత [గు]

**అరిబువ్వ** = వరిఅన్నము [వి]

**అరిమెన** = (చూ) అరివేణి, బచ్చెనకుండలు [చి]

**అరిల్లా** = సనేమి, బొత్తుగా—*అరిల్లా అతడాపనిచేయడు* [కరీ]

**అరిల్లు** (అర + ఇల్లు) = ఇంటిలోపలి గది —*పెట్టి అరింట్లో బెట్టు* [నె]

**అరివాణము** = సంధ్యవార్చుకొను పళ్లెము [గు]

**అరివేణి** = పెండ్లి సమయములలో ఉపయోగించు పెద్దబానలు—*వీటిని రంగులతో చిత్రింతురు. వీటి మూతిపైన పెద్ద ప్రమిదలో శుభసమయమున దీపారాధన గావింతురు;* అయిరేడి, అవిరేణి [నె]

అరుగులు దాటని = కొరగాని — *అతని ఆలోచనలు అరుగులు దాటనివి* [కరీ]
అరుట్పా = శ్రీ జ్యోతి రామలింగస్వామి తత్త్వములు [చి]
అరుట్పాలై = గోదాదేవి సూక్తులు: ఆంధ్ర శమ్మ పాటలు [చి]
అరుపు = అభ్యంతరము — *దానికేమీ అరువు లేదు* [నె]
అరుపుసొరుపు = అల్లరి, గడబిడ — *అరుపు సొరుపు లేకుండా ఆ వ్యవహారము సాగిపోతు న్నది* [కరీ]
అరుబు = లేవడి, లేపు × అరక [గు]
అరులు = దయ, వాత్సల్యము — *గేదెకు దూడపై అరులుపొంగెను* [కరీ]
అరువు = (1) క్రమము — *సంసారం అరువు లేదు* [నె]
(2) వివేకము — *అరువులేని మనిషి, అరువూ తెరువూ లేనోడు* [చి, నె; అ]
(3) ఒద్దిక — *ఇంట్లో అరువులేదు* [నె]
(4) తగిన — *అరువైనది*
(5) క్షేమము — *అరువుగా పోయిరా* [నె, తె]
(6) ఉపాయము — *దీని కేదైన అరువు చెప్పు* [అ-పె]
అరుసోజ్జము = ఆశ్చర్యము [నె-పొ]
అరే యప్పా యను = బ్రతిమాలికొను — *అరేయప్పా యని ఎదుటివారితో పనితీసు కొనెను* [కరీ]
అర్ధఅస్తమానము = ప్రొద్దు కుంకుటకు ముందు కాలము, అసలు సంజె [నె]
అర్భకుడు = చేతగానివాడు, బాలుడనుట [తె]
అఱ్ఱు కడుగు = (1) బాగా పనిచేసిన ఎద్దు ముసలిదైనప్పుడు, మెడను పాలతో కడిగి పనిచేయించకుండా వదలివేసి మేపు చునే యుండుట — *కపిలఎద్దుకు అఱ్ఱు కడిగినారు* [నె]
(2) వయసు చెల్లినవారికి పనినుండి విశ్రాంతినిచ్చుట [గు; నె]
అఱ్ఱుగు = ఎద్దు, దున్న మొదలగు సేద్యపు పసరములకు మెడనలిగి, కాయగాచి కాడి మోయుటకు అనువగు — *కోడెకు ఇంకా అఱ్ఱుకాలేదు* [నె, తె, వ, అ]
అఱ్ఱువంచు = (1) వరిగింజలు బాగుగపండి, వెన్నువంగుట — *పైరుఅఱ్ఱువంచినది* [నె]
(2) లోబడు
(3) ఓపికచూపు
(4) విధేయతజూపు [నె-పొ, అ-పె]
అఱ్ఱెము = ఆడపిల్లల ఆటలలో ఆరవ దివసము, ఆనాడు ఆట మానుదురు [కరీ]
అఱ్ఱోడు = (1) దుర్బలస్థితి, అసిత్తు — *అది అఱ్ఱోడుగా నున్నది* [నె]
(2) పాడయిపోవు [అ-పె]
అలంగం తొక్కు = ఆవేశమునకు లోబడ కుండా ఉండుట [గో]
అలకన = (1) పలుచన, గుడ్డలో నేతనూలు తక్కువగుట. [నె]
(2) బరువు తక్కువైనది, తేలిక [తె, అ]
అలకలతోపు = దేవుని తిరునాళ్లలో పార్వేట నాటి (చివరదినము) ఉత్సవము. స్వామి గుఱ్ఱపువాహనంమీద వేటకు పోయిరాగా, అమ్మవారు అలిగి తలుపు బిగించుకొని అర్చకులచేత బ్రతిమాలించుకొని తలుపు తీయును [నె]
అలకా = హీనకులము [నె]
అలగము = పరికుప్ప చుట్టు, నురుచుటకు వరి కట్టలు యమర్చినది — *ఈ అలగము చక్కగా మెదిగినది; వడ్లు బొత్తుగా రాలి నవి;* పడుగు [కరీ]
అలగాజనము = (1) సన్నకులములవారు; కృషికులుతప్ప యితరకులాలు [నె-పొ]
(2) నీచులు [తె]
(3) కూలినాలి చేసికొని బ్రతుకువారు; అలకా [గు]
అలగు = చిక్కటిపేడనీళ్లతో కళ్లము అలు కుట [చెం]

అలపటించు = ఎక్కువగా దుఃఖించు—వాడు దానికి అలపటించిపోయినాడు; అలపటించు [కర్నూ]

అలపాలి = ఒకంతట; ఒకమాయన; ఒక లాగున—వాడు అలపాలిరాడు [శ్రీ]

అలబడి = గ్రామములో తక్కువకులము బీద వాండ్రు; అలగాజనము, అలబరి [నె]

అలబడినోరు = బూతుబండు మాట్లాడేవాడు [నె]

అలబడి శాదవ = పరువు తక్కువపని [నె]

అలబొద్దు = సూర్యాస్తమాన మగుటకు ముందు సమయము. ఈ సమయమపుడు రైంతాగము అన్నముతిందురు — అల బొద్దులో అన్నము తిన్నాము; అర్ధఅస్త మానము, అలపొద్దు [శ్రీ]

అలమటించు = పరితపించు, అలవటించు [తె, అ; వె]

అలమరగు = కలిసిమెలిసియుండు అలవాటు [నె-ఆత్మకూరు]

అలరాయి జలాశయములలో కట్టలలోపలి తట్టు అలల తాకిడికి కట్టదెబ్బ తినకుండా పరుపున విగించురాయి; లోడారాయి; రివెల్‌మెంట్ [నె]

అలవటించు = (చూ) అలపటించు [నె, అ]

అలవరించు = అలవాటుచేయు [నె-పొ]

అలవరితనము = అంగడపు తనము—మాయమ్మాయిలో అలవరితన మెక్కువ [కరీ]

అలసంద పట్నాలు = ఉప్పుకారము పెట్టి వేయించిన అలసందులు [అ]

అలాకు = సులభము, కష్టములేమి — ఆ వస్తువు అలాకుగా దొరికినది [అ-పె]

అలాకుఅగు = వృథాయగు; చెదరిపోవు [అ]

అలాకు పలాకు = (1) చెల్లాచెదరగు — ఆ కుటుంబము అలాకుపలాకై పోయింది [నె]
(2) చాలతేలిక [గు]
(3) వ్యర్థము [అ]

అలాగా = సులభముగా — వాడు ఎంత పనైనా అలగాచేస్తాడు [తె]

అలాల్‌టప్పా = అటాఅటలు, నీలివార్తలు

అలావు = పీర్లపండుగరోజున పాడుతు అడుగువేయుటను అలావు తొక్కుట అందురు [అ]

అలావుసంత = (గుండము) అలావుతొక్కు ప్రదేశము, అగ్నికుండము [అ]

అలికిడి = (1) అస్పుటము—ఆ సంగతి అలికిడిగా తెలిసినది [కర్నూ; నె]
(2) స్వల్పధ్వని—అలుకుడై నది [కర్నూ]

అలికిడిలేదు = కనుపించలేదు [శ్రీ]

అలిగిరి = దొంగ [చి]

అలిపి = అలసట [ఓ]

అలిపిరి = ఏడుకొండలదారిలో విశ్రాంతిమంటపము [చి]

అలుకు = (1) నేలపై పేడతోరాచుట—ఇల్లు అలుకుము
(2) వరి నాటుటకుముందు మడిని చదును చేయుట
(3) వరినాటు—వరిమొలక అలుకుడు అయినది, ఊడ్పు [మ,వ]

అలుకుచల్లుట = పేడనీళ్లు చల్లుట [మ]

అలుకుడుసేయు = పొలములో విత్తనము చల్లు [కరీ]

అలుగు = (1) ఇనుపమొన, ములికి—వడి సాన అలుగు [అ; నె]
(2) బాణము [అ]

అల్పము = పిల్లలు ఎవరైన ఇంటికి వచ్చినప్పుడు ఎక్కువ గారాబము చేయుట [మ]

అల్లకము = (1) అల్లినది
(2) పన్నాగము [నె, కర్నూ, వ, అ]

అల్లడి తల్లడియగు = బంగారుపడిపోవు [గు]

అల్లను = ఒద్దు (ఒల్లను) [వి]
అల్లరాయి = హద్దురాయి (ఎల్లరాయి) [చె]
అల్లరికము = అల్లుడు అత్తవారింటిలో నుండుట; ఇల్లిఱికము [చి]
అల్లల్లిబుచ్చి = ప్రతి చిన్నవిషయానికి వెకిలిగా ఆర్భాటము చేయువాడు [తూ-గో]
అల్లాటప్పయ్య = (1) తెలివిమాలినవాడు, అప్రయోజకుడు [వి, అ]
(2) తోలుబొమ్మలాటలో హాస్యగాడు (కేతిగాడు)
(3) పనిలేక తిరుగువాడు; సోమారి;సోంబేరి [వి]
అల్లాటప్పా = (1) మాట నిలకడలేని [నె]
(2) సామాన్యమైన—అల్లాటప్పా మనిషి [అ, బ]
(3) యోగ్యతలేని; నమ్మదగనివాడు—అల్లాటప్పావాడు [నె]
(4) పనిబాటలెక తిరుగువాడు [గు]
అల్లాటప్పాలు = వట్టి ఆడంబరములు [చి]
అల్లిక = (మా) అల్లకము [నె, కర్నూ]
అల్లికారు = మైలవన్నె ఎద్దులు, ఇవి సూరు జాతికి చెందినవి [చె]
అల్లికాయ = బలపము [వి]
అల్లి దర్బారు = కఠినమైన అధికారము,అర్జునుడు అల్లి దర్బారు అధికారమునకు గురియై ఆమెను వివాహమాడినాడు ఈ నాటకము ప్రసిద్ధమైనది [చి]
అల్లిబిల్లి = సరియైన ఒకదారి లేకుండుట[గో]
(2) పిల్లకాయలు బొంగరముఎలె తిరుగు ఆట [గో, నె, వ]
అల్లిముక్కు = రక్తము స్రవించు ముక్కు—అబ్బాయికి అల్లిముక్కెత్తుకొన్నది[చి]
అల్పి = గుండుసూది [గుం]
అల్లీబిల్లి = నిలువబడి దేహము గుండ్రముగా త్రిప్పునది—పిల్లలు అల్లీబిల్లీ తిరుగుచు ఆడుకొంటున్నారు. అల్లి బిల్లి [నె]
అల్లు = (1) నేతకు పూర్వము చిక్కును విడదీయుట [చె]
(2) పిరికి [అ]
అల్లుంద్రపండుగు = దీపావళి [కరీ]
అల్లుడు = తీగలు అల్లుకొనుటకు అనువుగా ఏర్పరచిన మండలు—చెట్లపాదికి అల్లుడు పెట్టినారు; మారాకు; పందిరి [నె]
అల్లుపెట్టు = తీగ అల్లుకొనుటకు ఏర్పరిచిన మండలు, పందిలి [గు; నె]
అల్లువ = తీగలుపారే కూరగాయచెట్లకు పెట్టు పందిరి, అల్లుడు [అ]
అల్లె = ఎల్లగట్టు—అల్లెమీద నిలువు[నె, పా]
అవ = వ్యయము — అంతా అవచేసినాడు [గో]
అవతల (1) అటువైపు [శ్రీ]
(2) తర్వాత [నె]
అవతారము = అణకువ, మంచి వేషభాషణములు గుణములు కలవాడు [అ]
అవదు = కాదు—ఈ పని నాచేత అవదు [కర్నూ-పత్తికొండ, నె, వి]
అవవాయి = హేళన [అ]
అవసరము = తప్పనిసరిగ—అవసరంగా రా [శ్రీ, నె]
అవస్థ = ప్రేమచూపు [శ్రీ]
అవాకు చెవాకు-అవ్వాకు చెవ్వాకు = (1) లేనిపోని మాటలు; అది ఇవి [నె - కరూ]
(2) చెప్పరానివి, వినరానివి [అ]
(3) చేసినదానిని సమర్థించుకొనుమాటలు—అవాకులు చెవాకులు చెప్పి పోయినారు [నె, అ]
అవాటము = చిక్కు, అసందర్భము — అన్నీ అవాటములే సంభవించెను [కరీ]
అవాయి = (1) పుకారు, వినికిడి—ఆ సంగతి అవాయి అయింది [నె]
(2) దుష్ప్రచారము—అవాయి రేపినారు [నె]

(3) వేగముగా వ్యాపించునది, వ్యాప్తి, అవాలూ చువ్వలు [కర్నూ]

(4) పరిహాసము [అ]

**అవాల్తా పడు**=ఒకరి బాకీని చెల్లించుటకు ఇంకొకరు అంగీకరించు, పూచీపడు[నె]

**అవి టవిటికి**=మాటిమాటికి (శ్రీ)

**అవిపిరికి** = బలహీనుడు — *వాడు అసలే అవిపిరికి, దానికి దోడు ఈ బరువు మోయుటా?* [నె-పొ]

**అవిరేణి**=(చూ) అరివేణి [వ]

**అవిరి**=కన్ను యెఱ్ఱపడు జబ్బు. దీనికి బంగారుతో తుడుపు చికిత్స [నె-పొ]

**అవియలు**=మలబారువారు నాలుగైదు రకముల కూరగాయలువేసి, కొబ్బరిచమురుతోచేసిన గుజ్జుకూర. అరవల కూటులో కొబ్బరి చమురుండదు.

**అవియు**=(1) కుళ్ళిపోవు [నె-పొ; వ]

(2) చెడిపోవు—కూర అవిసిపోయింది [చి]

(3) సెగకు కమలిపోవు [నె]

**అవు?**=ఔనా? (ప్రశ్నార్థకము) [కరీ]

**అవుగూదు కాయ**=టొమాటో,టక్కోరపు వంకాయ [అ]

**అవుతారము**=(1) లేనిపోనిచేష్ట, కొంటెతనం

(2) వ్యర్థప్రయత్నము [అ-బళ్లారి]

**అవుతారుడు** = (1) పనికిమాలినవాడు, విష్ణువు అవతార మెంతఘనమో, యితడంత హీనమనుట —*వాడొట్టి అవుతారుడు* [నె]

(2) అందము లేనివాడు

(3) బలహీనుడు [తె, అ]

**అవురు**=(1) బలహీనము,లోపములుకలిగిన తావు [గు]

(2) అవిరి—నీటిపదను,పొలముపదను—*అవురారిపోయినది* [కరీ]

**అవులు**=అటుకులు [చి]

**అవుసలి**=బంగారుపనిచేయు కంసాలి;కమసాలి, అగసాలి [తె]

**అవ్యక్తుడు**=(1) వెఱ్ఱివాడు—*వాడు వట్టి అవ్యాక్తుడు* [నె; కర్నూ]

(2) మూగవాడు [గో]

**అవ్వ**=అమ్మ [వి]

**అవ్వబిడ్డ**=అచ్చము అవ్వగుణములే కల కూతురు [కరీ]

**అవ్వబువ్వగాడు**=అసమర్థుడు [కరీ]

**అవ్వల్లో!**=అమ్మబాబో అనుట [వి]

**అవ్వాయి చువ్వాయి** = బాగా చురుకైన వాడు [గు]

**అష్టమదరిద్రుడు** = ఎనిమిదివిధాల దరిద్రుడు, అనగా అత్యంత దౌర్భాగ్యుడనుట—అష్టైశ్వర్యములకు కేవలము వ్యతిరేకమైనమాట—*వాడు వట్టి అష్టమదరిద్రుడు* [నె]

**అసంటు**=అవతల—*అసంటు జరుగు* [నె-మెట్ట, గు]

**అసడ్డ**=అశ్రద్ధ [శ్రీ]

**అసనాటు**=సరియగు స్థితిలో లేకపోవుట—*అటైటు కదిలించక, అది అట్లే అసనాటుగా ఉన్నది*, అసిత్తు [గు]

**అసలసందగూక** = సంధ్యవేళ,అసలుసందె; మునిమాపు; అసురసంధ్య [చి]

**అసలు**=ఇల్లు పూయుటకు మట్టిని పేడ, బూడిదవేసి బాగా తొక్కిన బురద

(2) మట్టిని ఇల్లుకట్టుట కనువుగతొక్కి మెత్తగచేసినది; అసట

**అసలుసందె**=మునిమాపు [నె]

**అసింట** = అవైపుకు, — *కొంచెం అసింట జరగవయ్యా* [తె]

అసిత్తు=(1) నిస్సత్తువ [అ]
(2) దీర్ఘరోగము [నె-పొ]
(3) వ్యాధిచే ఏర్పడిన దౌర్బల్యము—వాడు అసిత్తు అయినాడు; అచిత్తు; అస నాటు [నె]

అసినిత్తా=చెడుకు ఉపయోగించు పదము [కరీ]

అసినుసి=మంచీచెడ్డ—అసినుసి దెలియని యజ్ఞులు [కరీ]

అసినేటు=జాఱువేటు, బాగా తగులనిదెబ్బ, అనేటు

అసిపి=ఎద్దులమీద వేయుటకు కుట్టినగోనె సంచి, అసిమిసంచి [అ. బ]

అసిపోవు=దెబ్బ తప్పిపోవు, బాగుగ తగులకపోవు—తేలుకాటు అసిపోయింది [నె]

ఆసిరమ్మ=స్ఫోటకము. అమ్మవారు [శ్రీ]

అసుంట=దూరముగా తప్పుకొనుట [కృ]

అసుకు = కొంతతడిగా కొంతపొడిగా ఉండుట—పిండిలో ఇంక కొంతనీరు పోయి లేకున్న అనుకనుకుగా ఉంటుంది [కరీ]

అసు రుసురు=అలసిపోవుట [గు]

అసేటు=తేలికగా తగులు. (కత్తి మొదలగు వాటి వేటు) అసిపోవు [చెం; నె]

అస్తమానం=ఎల్లప్పుడు; పొద్దుగూకులు [శ్రీ; నె]
(2) అస్తమయము—అస్తమానంతో గూడ ఇల్లుచేరినాము [చి; నె]

అస్తర్‌కార్=బిల్డింగు గోడలపై చేయు సునుపు గిలాబా, (పూత) ఈ పనిని మీగడ సున్నముతో చేయుదురు [కరీ]
దుబార్ (దోబార్ అని కాబోలు) [నె]

అస్కాచక్కెర=(1) అస్కా—గంజాం జిల్లాలో తయారయ్యే చక్కెర [వి]
(2) తెల్లటి బరకచక్కెర, (పంచదార) × బూరాచక్కెర (నె)
(3) బూరాచక్కెర [అ]

అస్తాయిస్తము - అస్తావ్యస్తము = మతి చెడుట — వాడికి అస్తాయిస్తం [నె; కర్నూ]

అస్మాకము=ఉంపుడుకత్తె—ఆయనకొక అస్మాకం [అ. నె]

అస్కింత=ఏదో పెట్టి కొద్దిగా మిగిల్చినది [మ]

అస్తిబారము=పునాది; అస్తిభారము — ఆ ఇంటికి అస్తిబారం బాగా లేదు [నె: కర్నూ, తూ-గో]

అస్తువారుట=(1) చచ్చుట, ఒక విధమైన తిట్టు
(2) దహనం అయిన తర్వాత పాలతో కాష్టమును ఎముకలను ఆర్పుట [నె]

అహై=కుడిచేతిప్రక్క ఎద్దుకు పేరు (యా) అహాః [కృ]

అళస్తిగా=బాగుగా [సే]

అళస్త్రి=విశాలము. — ఇల్లు అళస్త్రిగా వుంది [చి]

అళువుపీటీ=శ్రేష్ఠమైన వక్క [గు]

ఆంజనేయుతోక = ఎడతెగనది, తుదిలేనిది. లంకలో తోకకు గుడ్డలుచుట్టి తగులబెట్ట ప్రయత్నించినప్పుడు హనుమంతుడు తోకను పెంచినది ఇందు స్ఫురించు చున్నది; రావణాసురకాష్టం [చి]

ఆండ = (చూ) అండ [మ; నె, కరీ, వర]

ఆండా-హండా = (చూ) అండ [అన-రాయ దుర్గ]

ఆంద్రెబ్బగా = విచ్చలవిడిగా [వి]

ఆంబోతు = ఆబోతు, ఆపటెద్దు; దేవరఎద్దు; అచ్చోసిన ఎద్దు, వెంకటేశ్వరుని ఎద్దు.

ఆక = పెమ్మట — వచ్చాక, తిన్నాక [సర్కా]

ఆకంటినీళ్లు ఈకంటికిపోయు = మిక్కిలి ఏడ్పించు [కర్నూ]

ఆకట్టు = (1) వలె, పోలె - *నీయాకట్టు ఎవరూ లేరు*

(2) ఆక్రమించు [కరీ]

ఆకట్టుకొను = తన వైపునకు మరల్చుకొను [శ్రీ]

ఆకప్ప = పచ్చిఆకులను మీదయుంచి, నిప్పులపై యుడికించు అప్ప (అప్పచ్చి); దాలిరొట్టె [కరీ]

ఆకము = అధికారము-*అతడాకము మించిన పనిచేసెను* [కరీ]

ఆకర = ఆకురాయి, లోహమును అరగదీయు సాధనము—*ఆకరో పోకరో పట్టుకరా* [చి]

ఆకాడికి = అప్పటికి — *ఆకాడికీ నేనెంతో చెప్పిచూచాను, వింటేగా* [నె]

ఆకాశచివ = ఆకాసువ్వ [అ]

ఆకాశచువ్వలు = ఆకాసువ్వ, తారాసువ్వ; ఆకాశచివ [చి]

ఆకు = (1) వంతు — *నీ ఆకు పైకొన్నది* [నె]

(2) బండిచక్రమునందలి స్పోక్సువంటి నిలువుపట్టలు

(3) తమలపాకు [నె; వ, తె; చి; గో]

(4) మసాలా వస్తువులలో నిచ్చు ఆకు- [చి]

(5) వ్రాసికొనిన పత్రము [గో]

ఆకుఅలము = జంటమాట, గడ్డిగాదమువలె [నె; కర్నూ; తె; అ]

ఆకుకి పోకకి చెందని(పొందని)మాట = ఎందుకూ పనికిరానిమాట [వి; నె]

ఆకుకూర = (1) కూరగాయలు, అన్నమునకు వలసిన వ్యంజనము [అ]

(2) మెంతి, తోటకూర మొదలగువాటి ఆకుతో చేయు కూర [నె]

ఆకుకొబ్బి = క్యాబేజి; గోసుగడ్డ [శ్రీ]

ఆకు గొడ్డలి = సన్నటి వెడల్పు వాదరగల గొడ్డలి; తేలిక అయిన గండ్రగొడ్డలి [నె; వ]

ఆకుచాటు పిందె = తండ్రిఆజ్ఞలో ఉండు బిడ్డ [గు]

ఆకుచెప్పులు = సన్నని చెప్పులు [నె-పొ, వ]

ఆకుత్రొక్కు = వరికయ్యలో చెట్ల ఆకు, వెంపలి మొ౹౹లగు పచ్చిఆకును ఎరువుగా త్రొక్కుట [నె; పొ; చి]

ఆకుపూజ = తమలపాకు మడుపులతో దేవునికి చుట్టును అలంకరించునది — *హనుమంతరాయనికి ఆకుపూజచేయించినా* [అ]

ఆకులు = బారెడు జోళ్లదుత్తలు [కరీ]

ఆకులు పోకలు = పెండ్లిలో వధూవరులు ఒకరి వొకరు అందుకొనిన ఎంగిలి తాంబూలములు—*ఆ వధూవరులాకులు పోకలందుకొనిరి* [కరీ]

ఆకులోటా = రేకులోటా [నె-పొ; నె]

**ఆకోడాలు**=హంచాయ ఇరుపైపులనుండి లోహపు రింగులు (చెవులు) [శ్రీ]
**ఆగండాలు**=అబద్ధాలు—*పిల్లలు ఆటలలో అన్నీ అగండాలే* [కరీ]
**ఆగడప**=చేను అక్కడా అక్కడా తడియుట [గు]
**ఆగడము**=కొంచెమును పెద్దగాచేసి గోల చేయుట—*దానికి పెద్ద ఆగడం చేసినారు* [నె, కర్నూ]
(2) అల్లరి [వి]
(3) అన్యాయము [నె-పొ]
(4) వ్యర్థముగా వినియోగించు, దుర్వ్యయము చేయు [అ]
(5) పెద్దల భయభక్తులులేకుండ స్వేచ్ఛగా చెడుదారుల దిరుగు అలవాటు
(·) గారవము [గో]
**ఆగడించు**=అన్యాయముచేయు [నె-పొ]
**ఆగతి**=ఆహుతి [నె-ఆత్మకూరు]
**ఆగము**=(1) గలబా, అల్లరి—*పిల్లకాయలు అగం చేస్తున్నారు* [నె; గు]
(2) నాశము—*వనంతా అగంచేసినాడు* [తె]
**ఆగలించు**=ఆవులించు [శ్రీ]
**ఆగమ్మపక్షి**=అనాథ పక్షి; ఎటుగాని బ్రతుకు—*అతడు అగమ్మ పక్షియై తిరుగుచున్నాడు* [కరీ]
**ఆగాకర**=ఆకు పచ్చని రంగుతో ముల్లు ముల్లుగా ఉండు గుండ్రని ఆకారము [శ్రీ]
**ఆగాతమ్మ**=ఆహాయిత్యము చేయుపిల్ల [గు]
**ఆగారము**=(1) దేవికి ఇచ్చుబలి [చి]
(2) ఆహారము [కరీ]
**ఆగావు**=ముందుగా దొరికినది—*ఆగావు గుత్త* [కర్నూ]
**ఆగిత్తము**=మూర్ఖపుపట్టు, ఆగాయిత్యము [గు]
(2) అల్లరి; ఆర్భాటము [నె]
**ఆగు**=నిరోధించు—*తెల్లగుడ్డ మాపుకు (మాయుటకు) అగదు* [నె, అ]
**ఆగుబ్బు**=రహస్యముగా జరిగిన అధర్మ వర్తనము బయటబడి లోకులనోళ్ళబడి విమర్శింపబడునది—*ఆ సంగతి ఎంతో అగుబ్బుగా చెప్పుకొంటున్నారు* [గో]
**ఆఘమేఘాలుమీద**=అతిత్వరగా—*వాడు ఆఘమేఘాలమీద వచ్చాడు* [వి]
**ఆచ్చనగిల్లలు**=గచ్చకాయలు [మ]
**ఆచ్చి**=(1) మంచి
(2) వేరొక ప్రదేశము; చిన్న పిల్లలను బులిపించుటకు పెద్దలందురు — *నేను అచ్చిపోతున్నాను* [వ]
**ఆచేడు**=పశువులను పొలములో పేడవేయుటకు కట్టివేయుట, మందకట్టుట [శ్రీ]
**ఆజీలుగా**=ఎల్లకాలమూ; ఆరు గాలమూ; సర్వదా,—*అజీలుగా వస్తూంటారు* [నె; అ, బ]
**ఆటకాయ**=సోమరి, క్రీడాసక్తుడు [నె]
**ఆటపాటలుగా**=అనాయాసముగ [కరీ]
**ఆటలపాటల తల్లి**=పలుచపలుచగా, అందొకటి ఇంకొకటిగా తేలిన స్ఫోటకపు బొగ్గలు [కరీ]
**ఆటలు**=ఎత్తులు—*నా దగ్గర నీ ఆటలు సాగవు* [తె, నె]
**ఆటవిడుపు**=(1) బాధ్యతారహితము [గో]
(2) బడికి సెలవు [నె; చి, అ]
**ఆడవిడుపు పద్యము**=సెలవులలో విద్యార్థి కంఠస్థము చేయవలసిన పద్యము [చి; నె]
**ఆటివచ్చు**=తక్కువ ఖర్చుతో ఎక్కువ వినియోగము కల్గు [సర్కా]
**ఆటు**=సముద్రపు నీరు సూర్య చంద్రోదయములకు ఎక్కి తగ్గిపోవుట (పోటు) [నె]

ఆటుపోటు=(1) తగ్గుమొగ్గులు, ఎచ్చు తక్కువలు—*ఆటుపోటులేని బీరము.*
(2) సముద్రము ఉబ్బితగ్గుట (టైడ్) [నె]
(3) అధికబాధ—*కంటి ఆటుపోటుతో బాధపడినా* [కర్నూ; గు]
(4) చెవిలో పుండు అగు [అ; కర్నూ-పత్తికొండ]
(5) విచారము [గు]

ఆటుబడి=ఆలకూడుట, అగుట; సరిపోవుట—*ఆటుబడికి రాలేదు; మూట బియ్యం వారానికే ఆటుబడికి రాలేదు* [చి]

ఆటుమూట=కాళ్లు చేతులు కట్టివేయుట—*ఆటుమూటగా కట్టి బావిలో వేసినారు* [కరీ]

ఆటోపము=అదుపు—*వాడు ఒకరి ఆటోపములో పెరిగినవాడు కాడు* [తె]

ఆట్టె=అధికముగా—*అట్టే లేవే* [కృ]

ఆడ=అక్కడ (అడుండు) [కర్నూ, నె; తె]
(2) చింతపండు బుట్టనుండి తీయుట [ప. గో]

ఆడంగి = ఆడుదాని స్వభావంగల మగవాడు [శ్రీ]

ఆడంగి డవ్వా=(1) ఆడువారివలె మాటలు చేతలు గలవాడు
(2) అప్రయోజకుడు; ఆడంగిరేకులవాడు [గు]

ఆడంగిరేకులు = పేడితనపు రూపము; కొజ్జాతనము; ఆడుమగ రూపముల కలగలుపుగ, ఆడువారి చేష్టలు గల పురుషుడు; ఆడబోకళ్లు—*ఆడంగి రేకుల బత్తయ్య* [నె]

ఆడకము=గానుగను ఆడి చమురు తీయుట—*మానె ఆడకం ఎంతయ్యింది* [చి]

ఆడపాప=జమీందారుల నగళ్లలో పనిచేయు దాసీలు; వీరు పెండ్లి చేసికోకుండ, కన్యలుగానే ఉండువారు; కాసాపడచు × నగిరి పిల్లవాడు. ఆడుపాప, ఆడివాప; ఆడబాల [నె, వ]

ఆడబాల=(చూ) ఆడపాప [అ]

ఆడమ్మానము=స్థిరాస్తిని గుర్వి బెట్టుట (మార్ గేజ్) ఆడుమానము [నె; కర్నూ; వి]

ఆడామూడా=వరిలో ఒకరకము [చి]

ఆడారి సత్తెప్ప=నపుంసకుడు, ఆడంగి రేకులవాడు [వి]

ఆడితి=(1) కొలత.
(2) మాదిరికిగా ఇచ్చు వస్తువు. ఆలతి; ఆళిసి, ఆది [అ]

ఆడిదవాళ్లు = ఇతరులు [మ]

ఆడిపాడిపోవు=మంచిగా మాట్లాడుచు పనులు చేయుచునే చచ్చుట—*అతడు ఆడి పాడిపోయినాడు.*
(2) అకస్మాత్తుగ మరణించు [కరీ]

ఆడిపోసుకొను=నిందించు [శ్రీ; నె]

ఆడివాప = దాసీపుత్రి; ఆడపాప [మ]

ఆడు=(1) రక్షణ—*తోటకు ఆడు కావలెను* [గు]
(2) వాడు [సర్కా; తె]
(3) పనిచేయు [తె]
(4) తిరుగు [తె]
(5) మిట్టిపడు [తె]

ఆడుకొత్తు బాగాలు=వక్కలు [తె]

ఆడుగట్టులు = చేనిలో అక్కడక్కడ పలుచ పలుచగా నుండిన పైరుమొక్కలు [గు]

ఆడుగొప్పు=మిరపమొక్కలు మొదలగు వాని గొప్పు [వి]

ఆడుగోలు=ఒప్పందము [నె-దక్షిణము]

ఆడుపాప=(చూ) ఆడపాప [చి]

ఆడుబిడ్డ=భర్త తోబుట్టువు; ఆడుపడుచు [నె]

ఆడుబొొట్టె=ఆడపసుపు, మగనితోబుట్టువు, ఆడుబిడ్డ [గం]

ఆణిముత్తెము=ముత్తెపుచిప్పలో బుట్టిన స్వచ్ఛమైన ముత్యము; సీపెముత్యము; అసలుముత్యము. ఇవి గుండ్రముగా నుండుట అరుదు [గో;నె]

ఆణెము=(1) మంచివంశము; సొరుుడి
(2) పశువులు మొదలగు వాటి మంచి సంప్రదాయము, మంచి కులము (Pedigree)—ఆణెపె ఆవు [నె]

ఆతట్టు=ఆవైపు [నె, తె; అ]

ఆత్రము=(1) పేరాస—*ఆత్రగానికి బుద్ధి మట్టు; ఆత్రంతో తిన్నాడు* [నె]
(2) అవసరము [కర్నూ-పత్తికొండ]

ఆత్రెసలు=అరిసెలు, నిప్పట్లు [మ]

ఆద=(1) ఆదాయము, రాబడి; లాభము [నె; కర్నూ]
(2) చింత—*ఆదమరచి నిద్రించినాడు;* ఆరా [అ]

ఆదమరపు=అన్యదృష్టి; నిర్లక్ష్యము; మరచుట [నె]

ఆదరా బాదరా=త్వరత్వరగా — *ఆదరా బాదరా పోయినాడు;* అదరాబదరా [నె; కర్నూ, సర్కా, అ]

ఆదరువు=(1) అనుపానము — *అన్నము లోనికి ఆదరువు లేదు* [అ]
(2) ఆధారము—*అతడికి ఆదర వెవరూ లేరు* [శ్రీ, నె]

ఆది=(1) గుడ్డలు కుట్టుటకు, నగలు చేయుటకు కొలతలను సూచించుచు, మొదట మాదిరికి యిచ్చు వస్తువు—*ఆదిచొక్కా;* ఆత్తి; ఆళితి, ఆళి [నె; అ]
(2) కొలత [తె]

ఆదీకము=లాభము [చి]

ఆదీనంకూలి = ముందుగా ధనమో, ధాన్యమో తీసికొని, పనిబడినప్పుడు ముందే నిర్ణయించుకొనిన కూలికే పని చేయువాడు; అధీనంకూలి [నె]

ఆదీనం తప్పినది=భర్త చనిపోయిన స్త్రీ; విధవ [గో]

ఆదూడ=కట్టుకారు పెయ్య [కరీ]

ఆదోకగా=ఆవుతోకవలె ఎక్కి తగ్గుట; గోపుచ్ఛాకృతి, ఆదోకగా [నె; వ]

ఆదోకుగా=(చూ) ఆదోకుగా [గో]

ఆదో బూదో=లాభమో నష్టమో—*అచ్చటికి పోవుచున్నాను కాని అవని ఆదో బూదో* [గో]

ఆద్రగాణము=(1) పెద్దగా అరచి మోసగించుట
(2) అన్యాయము [మ]

ఆన=(1) నీటికి అడ్డముగా వేయుకట్ట; అన [నె]
(2) వరకు—*గుండె ఆన* [నె, అ-పె]

ఆనంగ=అటునుండి [వ]

ఆనక=తరువాత [శ్రీ]

ఆనగపు కాయ=సొరకాయ; ఆనబకాయ; ఆనపకాయ [తె; వ]

ఆనబ=సొరకాయ, ఆనపకాయ [చి]

ఆనమాలు=(1) ఒకరికి మాటచెప్పి పంపునప్పుడు, పంపేవ్యక్తి తనవస్తువును దేనినైనా ఒకదానిని సాక్ష్యముగా యిచ్చి పంపుట—*అయన తనపేనాను ఆనమాలుగా పంపినాడు. (సీతమ్మ ముద్రికను హనుమంతునికి ఇచ్చినట్లు)* ఆనవాలు
(2) గుర్తు [కర్నూ]

ఆనవాయి=పరంపరంగా వచ్చు ఆచారము; ఆనువాయి; ఆనువాయితీ [గు; వి]

ఆనవాలు=నమ్ముటకు యిచ్చు గుఱుతు; ఆనమాలు [నె; తె; అ; గో]
(2) వానబోసిన బియ్యములో బెల్లము కలిపినవి, నానబియ్యము [నె; గో]

(3) గుర్తు—ఆయన నన్ను ఆనవాలు పట్టలేదు; [తె; నె; అ]

ఆనిక=(1) అనుకొను సాధనము; అండ—నిచ్చెనకు ఆనిక లేదు [చి, నె]

(2) సరియైన గురి [శ్రీ]

ఆనికి=తర్వాత; ఆనాక [కృ]

ఆనిపోవు=తెంపులేకుండా వరుసగా నిలిచిపోవు—బండ్లు ఆనిపోయినవి; జనం కిటకిట అనిపోయినారు [నె; అ]

ఆనీక=ఆ తరువాత; ఆనింక [తె]

ఆనుగఱ్ఱలు=ఎద్దులను విడిచినపిదప బండి నొగలను మీదికి ఎత్తియుంచుటకు ఆనుగా నుంచునట్టి త్రాటిచే జత చేయ బడిన నిలువు కఱ్ఱలు [వ]

ఆనుపానులు = (1) అండ చూచుకొని వేయదగిన పని [నె-పొ]

(2)గుట్టుమట్టులు [చి]

(3) పూర్వపరము, సర్వవిషయములు [గు]

ఆనువాయి=పరంపరగా వచ్చు ఆచారము, సాంగెము, ఆనవాయి [గు]

ఆనువాయితీ=(చూ) ఆనవాయి [గు]

ఆనె=అరికాలిలో యెదుగు కండరము, ముల్లు గుచ్చుకొనినచోటగూడ ఇది పుట్టును—అనెలు పెరిగినవి [నె; అ]

ఆపతెద్దు=అవులను దాటుటకు, వెంకటేశ్వరుని పేర అచ్చువేసి వదలివేయు మేలుజాతి కోడె (Stud bull) ఈ అచ్చు వేయుట—వృషోత్సర్జనము. - ఒక పెద్ద తంతు అపర క్రియలలోను, పెండ్లిండ్లలోను ఆయా పందిళ్ల యందె, వేంకటేశ్వరస్వామిపేర ఒక ఆబోతు [జాతిగల] ఆవుకోడెను పూజించి, దాని జొబ్బమీద గుండ్రముగా వాతవేసి (అచ్చువేసి) మంత్ర సహితముగా వదలివేయుదురు. అప్పుడు దానికి దేవబ్రాహ్మణ మాన్యములను తాకవలదని హితోపదేశము గావింతురు. గ్రామములలో దీనికి మంచిబెట్టు, గౌరవము. దీనిని కొట్టరు, దొడ్డికిగూడ తోలరు, యథేచ్ఛగా అన్ని పొలములలో తిరుగాడుచు, ఆవులు దాటుచు కాలము గడుపుచుండును. ఇది చనిపోయినతర్వాత గూడ, బండిమీదబెట్టి, పెద్ద ఉత్సవముతో తీసికొనిపోయి సమాధి చేయుదురు. దీనిని అచ్చువేసిన ఎద్దు అందురు. దక్షిణదేశమున దీనిని పెరుమాళ్ల మాడు అని గౌరవింతురు.—ఆబోతెద్దు, గూళి; సిమ్మాదిరప్పన్న; జన్నెకు విడిచిన పశువు; ఎత్తు కట్టిన పశువు [నె]

ఆపడంగా=అట్లనె; [గో]

ఆపళంగా, ఆపాళంగా [వి]

ఆపదమ్రొక్కు=(1) ఆర్తిలో మ్రొక్కుకొని, దేవునికిగా ముడుపులు కట్టియించునది.

(2) ఆపదసమయములో చేసి చెల్లించని వాగ్దానములు, ఎన్నికలలో చెప్పుమాటలు యీ ఆపద మ్రొక్కులు వంటివి [నె; కర్నూ; అ; తె]

ఆపద మొక్కులవాడు= శ్రీ ఏడుకొండల వెంకటేశ్వరుడు [చి]

ఆపసోపాలు=(1) శ్రీమంతులు స్వల్ప విషయములకుగూడ కష్టపడునట్లు ప్రవర్తించుట—ఆమె ఆపసోపాలు పడుతున్నది [నె, తె, కర్నూ]

(2) అల్పశ్రమకు గూడ పొడచూపు అలసట చిహ్నములు [అ]

(3) మితిమీరి భుజించిన పిమ్మట వడే భుక్తాయాసాదిబాధలు [గో]

(4) దుఃఖము, ఉక్కు తోచకుండుట [కర్నూ-వత్తికొండ]

(5) అలసిపోవు [శ్రీ]

ఆపళాన=ఆ విధముగా [కృ]

ఆపాట=(1) ఆ తర్వాత,

(2) ఉన్నట్లుండి; అట్లనే — అపాటనే పోయినాడు; ఆమాయన [నె]

ఆపాట్న = అలాగుననే, ఉన్నట్లుండి— ఉన్నవాళ్లు అపాట్న లేచి వెళ్లినారు[గు]

ఆపొట్ల = అ సమయమున —నన్ను ఏమో అన్నాడు, నేను ఆ పొట్ల నోటిమీద కొట్టి నాను [నె. పొ]

ఆప్యాయనత = ఆత్మీయత [తూ-గో; గు]

ఆపు = (1) మేకు

(2) సెలవు—రేపు ఆవు; మానకము [చి]

(3) అండ—దానికి అవులేదు [అ; నె]

ఆపుచేయు = నిలుపుచేయు [శ్రీ]

ఆపుగోర = రెండు అంతస్థులు కలిగినట్లుల చేసిన కంచుపాత్ర [శ్రీ]

ఆపురు = ప్రాణము—నీ అవురువెళ్లిస్తా[నె]

ఆపోవు = తీరిపోవు; అణగిపోవు — దప్పి ఆపోవడం లేదు [నె]

ఆబ = దురాశ [గం]

ఆబీ = మాగాణి, × తాబీ [కరీ]

ఆబురు = గౌరవము—అ సమయాన మీ రాదుకొనుటచే నా ఆబురు దక్కినది; ఆబోరు [కరీ]

ఆబెయ్య (ఆవు + పెయ్య) = ఆవు, ఆడ దూడ. మగదూడ—కోడె [నె; తె]

ఆబోరు = పరువు, మర్యాద — ఆబోరు దక్కించుకో; ఆబురు [గో; వి]

ఆమంద = ఆమాత్రము—వాడు అమందము నేర్చుకున్నాడు [తె]

ఆమవడ = (1) పెరుగువడ, తైరువడ [నె, దక్షి; రా]

(2) సెనగపప్పుతో చేసినవడ [తె]

ఆమదము = దండుగఖర్చు; ఆముదము —అదొక అమదం [నె, గు]

ఆమాయన = (1) ఆ తర్వాత, ఆ పాట

(2) అట్లనే; తటాలున-ఆమాయన చెప్ప కుండా పోయినాడు [నె]

(3) ఒకే పోకగా పోవుట [తె]

(4) ఆవిధముగా [అ]

ఆము = పశువు ఒకానొక లేత చొప్పదంటు తినగా వచ్చు రోగము—అది అము గొన్నది; (చూ) నాము; నాగు [తె]

ఆముదం = అనవసరముగాతగులు వ్యయము —ఇదొక ఆముదమైంది; ఆమదం [నె; కర్నూ; గొ ;గు]

ఆమెత = (1) పెండ్లిలో చివర దినమున పెట్టు విందు [శ్రీ]

(2) విందు.

ఆమొయిన = అపాట్న; ఆ తర్వాత [గు]

ఆమైన = అ తర్వాత; ఆమొయిన, ఆమ యిన [కర్నూ]

ఆమ్మ = పెత్తల్లి; దొడ్డమ్మ; పెద్దమ్మ.

ఆయం సాయం = అండదండ; రక్షణ [మ]

ఆయకం దారు = నీటిపారుదల హక్కున్న వాడు [చి]

ఆయక్కల్ల = అక్కడ, ఆ ప్రదేశంలో [కరీ; మ]

ఆయగాండ్లు = గ్రామోద్యోగులు [అ]

ఆయగాడు = గ్రామములో నిర్ణీతవృత్తి చేయువాడు [తె]

ఆయకుడుము = ఆవిరికుడుము; ఆయి కుడుము [వి]

ఆయికుడుము = ఆవిరి కుడుము, ఆవి కుడుము [అ]

ఆయిటికి = కాలానికి; సంవత్సరానికి; అవి టికి [న, మ]

ఆయినోళ్లు = (1) ఉన్నవాళ్లు,

(2) తగినవాళ్లు [మ]

(3) చుట్టాలు; అయినోళ్లు [నె]

ఆయివెట్టు = కుడుములు మొదలగునవి ఉడి కించునప్పుడు, ఒక కుండలో నీళ్లు పోసి బట్టగట్టి, దానిపై ఇవి పెట్టి తిరిగి మూత పెట్టి ఉడికించు; అవిచెట్టు [నె]

అరబైలు=పైకప్పు లేని బైటి ప్రదేశము (Open Air); అరుబైలు [కర్నూ]

ఆరి=కోడిపుంజుకు మీగాలుపైన మొలచు వంకర కూచిగోరు; పెట్టకు ఇది చిన్నదిగా నుండును—*ఆరెతో కొట్టినది*; ఆరె [నె]

ఆరింద=ఒక వృత్తిలో నైపుణ్యము గడించినవాడు [శ్రీ; వి; తె]

ఆరిక్కమ్మరి=(చూ) బయటి కమ్మరి [గో]

ఆరిమాని గంగమ్మ = ఒక గ్రామదేవత; బందేరుమండలలోనే గుడికట్టుదురు [చి]

ఆరిసీ పారిసీ=దుర్ఘటమైన కార్యము—*ఇదేమి ఆరిసా పారిసా?*

అరుగాలము=(1) ఏడాది పొడవున.
(2) ఎల్లకాలము—*అరుగాలం కనిపెట్టుకొని ఉండినా* [నె - ఆత్మకూరు; అ; కరీ]

అరున్నొక(క్క)టి = ఏడు, ఎంచునప్పుడు, కొలుచునప్పుడు ఏడు అనుట రోదనమును సూచించునని, ఆరు - ఆరునొక్కటి - ఎనిమిది అని లెక్కింతురు.

అరుపోరు=(1) ప్రస్తావన—*దాని అరూ పోరు లేదు* [నె]
(2) ఇబ్బంది—*ఆడబిడ్డల అరూ పోరూ లేదు* [కర్నూ]
(3) రగడ; చిత్రహింసలు—*ఆ కోడలికి అరూ పోరు లేక హాయిగా ఉన్నది* [తె; అ]

అరుబత్తుల కంపెనీ=దివాలా కోరు మురా. ఆర్‌బత్‌నాట్ అను మదరాసు విదేశీయ బ్యాంకు దివాలాతీసి అలజడిని రేపినది ఈ దుర్ఘటన తర్వాతనే ఇండియన్ బ్యాంకు బోటి స్వదేశీ బ్యాంకులు నెలకొల్పబడినవి. ఇది ఈ శతాబ్ది ఆదిలో జరిగినదిక్కై[కృ]

అరుబైలు=(చూ) అరబైలు—*అరుబయట పండుకొన్నాడు;* అరబయలు [నె; తె]

అరుమున్నూరు కాలము=ఎల్లప్పుడు[నె; చె]

అరుముళ్లు=(1) కష్టములు, చిక్కులు [వి]
(2) వ్యర్థము [గు]

అరుమూడు=చెడుట, వ్యర్థమగుట (అరుమూడుగా తగ్గిపోవుట)—*అదంతా అరుమూడైంది* [నె; వ]

అరుమూడుగాని మూడారుగాని = ఎట్లయినను సరే ఆ పని చేసి తీరుతాను అనుట [అ, నె]

అరుమెడయిచ్చు=(1) ఓడి పరుగెత్తు—*వాడు అరు మెడ యిచ్చినాడు.*
(2) ఎద్దులు పోట్లాడుకొనుచుండి, అందు ఒకటి మెడత్రిప్పి పరుగెత్తిపోవుట [నె]

అరువాని=కొంత మేలురకము [చి]

అరుశ్లు=ఉడకవేసి అరబెట్టిన వడ్లు (అరబెట్టబడినవి అనుట) [చెం]

ఆరె=(1) బండిగీఋబుద్దికిని (కుండ) చుట్టలకును (పూటీలకు) నడుమనుండు నిలువు గట్టిలు (ఆకు) [కరీ]
(2) ఒకానొక చెట్టుపేరు; ఆరెనార [నె]
(3) కోడిపుంజు కాలిపైన మొలచే వంకర కూచిగోరు, ఆరి [నె; అ]

ఆరెమరాటీలు=బొమ్మలాటలాడువారు. ఇది ద్రిమ్మరిజాతి, వీరు మహారాష్ట్రదేశీయులు [నె-పొ]

ఆరేకలు=ధాన్యము [చి]

ఆరేటిబాతు=పలువన్నెలు గలిగిన చిన్న అందమైన నీటిబాతు. ఇది బాగా ఎగురగలదు. ఇది ఋతువులనుబట్టి కోవెల, స్వాతికొంగ మొదలగు వాటివలె చాల దూరదూర దేశములకు గుంపుగట్టిపోయి తిరుగాడుచుండును (Climate changing Bird) తెలుగునాట దీనిని నవంబరులో చెఱువులలో చూడనగును.

ఆరేరు=దున్నుచున్న నాగేళ్ల చాలులో రెండవ నాగలి. మొదటిది—ముందేరు [నె]
ఆల=వేళ—*నిన్నటాలనుండి నిద్రరాదు* [అ; నె]
ఆలకూడు=కలసివచ్చు—*సంసారం చాల ఆలకూడి వస్తున్నది* [నె]
ఆలగోడు=పశువుల కష్టము [అ]
ఆలతి=(చూ) ఆడితి; ఆళితి [అ]
ఆలాకు=వ్యర్థము (Wastage) — *వాడు దానిని ఆలాకు చేసినాఁడు;* అలాకు [అ]
ఆలాజాలము=(1) చీకు చింత లేకుండుట;
(2) సంతోషాతిశయముతో కలసిమెలసి యుండుట — *ఆయన ఆలాజాలంగా వుంటాడు* [నె]
(3) ఆడుకొంటూ పాడుకొంటు ఉండుట
(4) కలుపుకోలుతనము — *ఆయన ఆలాజాలవు మనిషి* [నె]
ఆలాపన=(1) ఒక విషయమును గూర్చిన ఎడతెగని ఆలోచన—*అదే ఆలాపనగా ఉన్నాడు*
(2) జ్వరములో పలువరించుట [నె; వ]
ఆలిమీద = రెండవపెండ్లి [అ]
ఆళ్తి=కొలత నమూనా; ఆది [కర్నూ]
ఆలు = నూలును పడుగు చేసెడి సాధనము [చెం]
ఆలుగడ్డ=ఉర్లగడ్డ; బంగాళాదుంప; ఆలుదుంప [తె]
ఆలేకాగు=క్రిందమంట పెట్టుటకు గూడుగల తిన్నెలో బిగించియుండు వేడినీళ్లకుండ [అ]
ఆల్నే = వలెనే (సాదృశ్యము) —*వాడు నీయాల్నే ఉన్నాడు* - ఆలనే [తె; నె]
ఆళితి=కుట్టుటకు ఇచ్చిన కొలత నమూనా వస్తువు; ఆది; *ఆళితిచ్చాను;* ఆళి [అ]
ఆళ్వారుగడ్డ=(1) చిలగడదుంప; గణుసుగడ్డ [చి]
(2) పెండలమువంటిగడ్డ; దీని పిండితో సగ్గుబియ్యము చేయుదురు [నె-దక్షిణము]
ఆవ=గడ్డివామి; మేట [ప-గో]
ఆవగించు=(1) అవపెట్టు; కూరలకు ఆవ రుబ్బి పెట్టు [తూ-గో]
(2) మాంసాదులను పసుపు ఉప్పుతో కలియరుద్ది చెడిపోకుండ వుంచుట; ఈ కండలను ఎండబెట్టుదురు; అవటిల్లబెట్టు [నె]
ఆవటాయి=దొంగ్రాగి [కరీ]
ఆవటిల్లబెట్టు=పచ్చిమాంసము మొదలగు వానిని చెడకుండా నిలువఉంచు, ఆవగించు [కరీ]
ఆవడి=(1) అపకీర్తివ్యాప్తి— *దానివంగతి ఆవడి అయింది*
(2) రచ్చ [నె]
(3) వదంతి, పుకారు [నె]
ఆవలమతేస్తారు=ధర్మరాజుల తిరునాళ్లలో తపసుమాను అనే గోగ్రహణోత్సవము. చుట్టుపట్ల గ్రామాల పశువులను చేర్చి అర్జున వేషధారి వీటిని తోలి మలవేయును. [నె; చి]
ఆవల యెల్లుండి=(1) ఈ దినము మొదలు నాల్గవనాడు—*రేపు, ఎల్లుండి, ఆవలెల్లుండి* [నె; కర్నూ; వ]
(2) మర్నాడు [నె] అ మర్నాడు, ఆవలెల్లుండి [అ; తె; వి]
ఆవలిమొన్న = నేటికి మూడు దినములు ముందు (క్రితము) [కరీ]
ఆవికుడుము=(చూ) ఆయికుడుము [అ]
ఆవిటిబూను=వర్షఋతువు ప్రారంభమగు
ఆవిబట్టు=ఆవిరికి ఉంచు; ఉడికించు [అ]
ఆవిబెట్టు=అవిరికి ఉడుకబెట్టు [నె పొ]
ఆవిరికుడుము = (1) ఆవిరితో వండిన బియ్యపుపిండిఉండ [నె; కర్నూ; తె]
(2) ఉండ్రాళ్లు

**ఆవిరిలాడు**=తలచినపని తీరువఱకు అదే పనిగా తొందరపడు [గు]

**ఆవిరిల్లు**=కలతజెందు — *అవిరిల్లి పోయి నాడు* [నె; అ]

**ఆవుదూడ**=ఆవుకు పుట్టిన ఆడుదూడ × కోడె [శ్రీ]

**ఆవునోటివాడు** = రహస్యమును దాచని వాడు [చి]

**ఆవు రావురను**=(1) అదేపనిగా రోదించు [చి]
(2) జబ్బుపడి లేచినతర్వాత అన్నము తినవలెనని తొందరపడు [గు]

**ఆవురుకొను** = చేసినపదార్థము మెల్లగా ఉమ్మగిలు; ఆమరుకొను [గు]

**ఆవురుమను**=దుఃఖసమయములో ప్రేమ కలవారు తమ దుఃఖమును ఒక్కమాటుగా వెళ్లబోసుకొను [గు]

**ఆవులలో ఆపఁబెద్దు పడినట్లు**=గందర గోళముగా నుండుట [నె] — *ఆవులలో అంబోతు, మేకలలో చింబోతు* [గో]

**ఆశెగాడు**=హాస్యము చేయువారు × ఆశె గత్తె [మ]

**ఆషాఢభూతిగాడు**=మోసగాడు [వి,నె]

**ఆసము**=బియ్యపుపిండితో చట్టిలోకాల్చిన దోసెవంటి తినుబండారము. ఇది మధ్య లావుగా నుండును, ఆపము [నె; చి]

**ఆసాది**=జాతరలు ముగిసిన తర్వాత గ్రామ దేవతలను ఎల్లనంపు (ఎల్లమీదికి అంపు) నప్పుడు, బూతులు తిట్టుచు వెంటవచ్చు మాలలో ఒకతెగ [నె; తె]

**ఆసాదించు**=చక్కగ అలంకరించి సిద్ధము చేయు [కర్నూ]

**ఆసాదికూతలు**=అసభ్యపుకూతలు, ఆసాది అను మాలవారు జాతరలలో ఆడు బూతు మాటలు [నె; అ; తె]

**ఆసాదివాడు**=అంతిమజాతిలో శవస్థాపన జరిపించువాడు [అ]

**ఆసామి**=శ్రీమంతుడు [చి]

**ఆసించు**=కలుగు, సోకు [నె-పొ]

**ఆసికింత**=కొంచెము [న]

**ఆసిగము**=హాస్యము [వి]

**ఆసు**=(1)నూలును పడుగుచేసెటి సాధనము (2) చేపలుపట్టునది [చె]

**ఆసుపోసినట్లు**=యోచన కుదురక, అటు నిటు తిరుగాడుచుండుట, నూలును ఆసు మానుకు పోసినట్లు—*ఆయన అసుపోసి నట్లు తిరిగినాడు* [నె; అ; తె]

**ఆసెగాడు**=హాస్యగాడు [మ]

**ఆసోది** = గ్రామదేవతను స్తుతించువారు (తిట్టువారు) ఆసాది [చి]

**ఆస్తి**=ఆశ, ఇష్టము, అసక్తి—*ధనము మీద వానికి చెప్పరాని ఆస్తి; ఇంత ఆస్తి పనికిరాదు; నేనంటే ఆయనకు చాలఆస్తి* [తె; వ]

**ఆస్తిగా**=తరచుగా — *ఆయన ఇక్కడకు ఆస్తిగా వస్తుంటాడు* [నె]

**ఆస్మాన్‌గిరి**=పసిపిల్లల ఉయ్యాలతొట్టెలకు పైన బట్టకు చిటికలు, పూలుచెండ్లు, రంగు రంగుబట్టలు కట్టి అలంకరింతురు. పసి పిల్లలు అవి కదలునప్పుడు చూచి ఆడు కొందురు; చక్కి [మ]

ఇంగ = ఇంక [అ]
ఇంగడించు = (1) సర్దు; ఏర్పరచు [అ]
(2) చేయు [చి]
ఇంగరా = ఇలారా; ఇట్లారా [వి]
ఇంగింత = ఇంకనూ, యింత [అ]
ఇంగిలికాయలు = చిన్న మంచినీటిచేపలు [ఉ. గో]
ఇంగివాయి = మత్స్యవిశేషము [కృ]
ఇంగిలీకము = (1) చాల మెత్తగ ఉండి, ముందు రెండు ముండ్లవంటి మీసములు గల చేప
(2) ఒకచోట నిలువని స్త్రీ [మ]
ఇంచేత = ఇందుచేత [వి]
ఇంజు = చికుక్కుదీయు, చీల్చు—*నారయింజు* [అ-పె]
ఇంటాతగాడు = ఇంటి యజమాని, భర్త [కర్నూ]
ఇంటాయన = (1) ఇంటి యజమాని
(2) భర్త—*మా యింటాయన* [నె; అ; వ]
ఇంటావంటా = ఏమాత్రముగాని; ఎందుగాని *ఆ పద్ధతి మా ఇంటావంటా లేదు* [చి; నె]
ఇంటిలిదబ్బ = (చూ) వింటిలిదబ్బ; ఉండేలి దబ్బ [నె]
ఇంటి యలపాది = ఇంటిలోఉన్న వారందరు —*ఇంటి యలపాది పెండ్లికి వచ్చినారు;* ఇంటెడిరాజులు [నె; తె]
ఇంటియెలపాది = ఇంటిల్లపాది [గో]
ఇంటిల్లపాది = కుటుంబము అంతా [శ్రీ; అ]
ఇంటెడిరాజులు = ఇంటిలోని వారందఱు; ఇండెడురాజులు; ఇంటియలపాది; ఇంటిల్లపాది [కరీ; వ]

ఇంటెల్లపాది = (చూ) ఇంటిల్లపాది [గు]
ఇంట్లోది = భార్య — *మా ఇంట్లోది ఊరికి పోయింది* [చి]
ఇండి = వామిగడ్డి పెరుకుటలోను, నేల త్రవ్వుట మొదలగు పనులలో, పనికివీలుగా ఏర్పరచుకొనిన మట్టసమైన భాగము; వరి కోతలో మఱుమువలె — *గడ్డివామిలో ఇండిబెట్టి పెరుకు;* ఇందు [నె]
(2) పశువులకాళ్లు బెనుకుట — *ఆ యెద్దు కాలు ఇండిపోయింది* [అ]
ఇండె = (చూ) ఇండి—*కట్టెలు ఇండెలుబెట్టి చీల్చు* [తె]
ఇండె = తొడ, జొబ్బకీలు—*చెట్టుమీద నుండి పడి ఇండె తొలిగింది* [నె]
ఇంద్రడిక్కు = ఆటోతును పోరాటమునకు ఎగగొల్పు సంజ్ఞ [నె-ఆత్మకూరు]
ఇండ్లఅడుగు = గృహనివేశన స్థలము; ఇండ్లు కట్టుకొనుటకు పనికివచ్చుచోటు —*ఇండ్ల అడుగులన్నీ అమ్మివేసినాడు* [చి]
ఇంతంతోడు = ఘటికుడు [మ]
ఇంతక్రితము = కొంచెముకాలము క్రిందట [గో]
ఇంతల = కాల పరిమాణమును తెలుపు పదము—*పగటింతల* [నె; తె; అ]
ఇందము = విధము—*రెండిందాల చెడ్డాడు;* రెండందాల [వి]
ఇందనక = ఇప్పుడు, ఇంతకుముందు, ఇంత వఱకు [శ్రీ]
ఇందలమందల = (1) ఉన్న విషయముల స్థితి
(2) క్రమమైనపనితెన్ను—*వాడికిఇందల మందల లేదు* [నె]

ఇందాక = (1) ఇంతకుముందు — *ఆయన ఇందాకనే వచ్చిపోయినాడు* [నె; కర్నూ; సర్కా; తె]

ఇందాప నెల = అశ్వయుజమాసము [చి]

ఇందు = (1) తినినది లోపల ఇముడు — *మందు ఇందలేదు* [నె: కర్నూ: అ; తె]

(2) ఎముకగూడు దొలగుట [అ]

(3) గడ్డివామిని గడ్డి పెరుగుటకు వామి పైభాగమున కొంతగడ్డి ఎత్తివేసి గడ్డిని పెరుకుట — *ఇందు పెట్టి పెరకరా*; ఇందె [నె]

ఇందె = (1) ఒదలు

(2) పిక్కటముగానున్న ఆభరణాదులు ధరించుటవలన దేహముమీద ఏర్పడు నొక్కు, గుర్తు; — *చేతిమీద ఇందె పడింది* [తె]

(3) త్రాడు మున్నగువానితో కట్టినచోట ఒత్తుకొని పడు గుర్తు [కరీ]

ఇంపతం = (1) సువాసన; ఇంపితము

(2) ఇంపు అయినది [అ-నె]

ఇగటం = హాస్యం [శ్రీ]

ఇగిరించు = (1) కూరను ఇగురబెట్టు

(2) వంటకమును ముద్దగా చేయు [నె; తె; అ; శ్రీ]

(3) ఇగురబెట్టు; ఇగుర్చు [కర్నూ]

ఇగురగట్టు = తిండిలేకుండా చేయు [వి]

ఇగులవట్టు = చిక్కిపోవు [మ]

ఇగో = ఈలాగే; ఇదిగో [శ్రీ]

ఇగ్గామొగ్గా = సమృద్ధిగా ఉండుట [గు]

ఇగ్గించు = ప్రోత్సాహపరచు [అ-పె]

ఇగ్గు = (1) అధికముగా సంతోషపడు [అ-పె]

(2) లాగు, కదిలించు [అ; నె-కనిగిరి]

(3) గర్వము, బడాయి [అ]

ఇగ్గుమొగ్గు = (1) మనిషిని అటునిటు కదిలించివేయు

(2) త్రొక్కుట

(3) చీకాకుపెట్టుట — *ఇగ్గుమొగ్గుచేసినారు* [నె]

ఇగ్గులాట = (1) ఇగ్గు, గుంజు, లాగు

(2) వ్యభిచారమునకై బలవంతముచేయునది [వ]

ఇగ్గులాట = (1) ప్రయాస — *దానితో ఇగ్గులాడుచున్నాను*

(2) వివాదము [నె; కర్నూ: అ; తె]

ఇగ్గుళ్లు = అప్పులు మొదలగువానివలని తగాదాలు [కరీ]

ఇచ్చారచ్చ = యథేచ్ఛగా: ఇష్టానుసారము — *అవిడ యిచ్చారచ్చగా తిరుగును*; ఇచ్చారచ్చ [కరీ; అ]

ఇచ్చిత్రం పచ్చిపులుసు = ఒక సామెత; విచిత్రవిషయములను గూర్చి ఉపయోగించునది [చి] — *ఇచ్చిత్రంకూర ఇస్తరను మింగిందంట* [నె]

ఇచ్చిపెట్టిన సొమ్ము = అప్పుగా యిచ్చిన సొమ్ము [చి]

ఇచ్చిరూపాయ = వెండిరూపాయ [వి]

ఇచ్చుకత్తె = (1) తనకుతానే సంతోషపడునది

(2) అల్పసంతోషి [నె]

(3) ఒరదీసినకత్తి [అ]

ఇచ్చుకొను = (1) తనకుతానే సంతోషపడు — *అతడు బలే ఇచ్చుకొంటున్నాడు* [నె; కర్నూ; తె; అ]

(2) విడిపోవు — *తగులు ఇచ్చుకొని దూడ పారిపోయినది* [అ]

(3) చీలిపోవు — *గోడ ఇచ్చుకొనిపోయినది; ఇటుక ఇచ్చుకొని పోయినది; కుండ ఇచ్చుకొని పోయినది* [అ-పె]

(4) దెబ్బలుగొట్టు [అ]

ఇజారా = జాగీరుకన్న చిన్నది [మ]

ఇజారు = చల్లడము, లాగు [అ; నె]

ఇజాలు = వృషణాలు [అ]
ఇటుకాసి = ఈ దిక్కుగా [శ్రీ]
ఇట్టగరిసె = తిరుగలినియుంచి పిండి విసరెడు వెడల్పుగంప, లేక చేట [సే]
ఇట్టట్టగు = (1) తలక్రిందగు;
(2) ప్రమాదముచేయు
(3) కలతపెట్టు [నె-పొ]
ఇడత = సారి; *తొలిడత అన్నము, మలి డత అన్నము* [చి; నె]
ఇడవలి-విడవలి = చెరువుతొట్టులలో గంట కట్టి గుబురుగా ఎదుగు బిరుసుగడ్డి — దర్భ, *దీనితో ఇండ్లకు కప్పువేయు దురు. వీటిలో సువాసన వ్రేళ్లుగలది వట్టివేరు* (KUSKUS) [నె]
ఇడి = ఒకపూట, అర్ధదినభాగము—*అది ఒక ఇడిపని* [నె]
ఇడిపసులు = వ్యవసాయమునకుగాని, పాడికి గాని ఉపయోగపడనివి [అ]
ఇడిపోవు = తోట మొదలగునవి కాపు ఉడిగి పోవు; ఈటుబోవు; ఈటిబోవు [నె;వ.అ]
ఇడిముడి = దిగుముడి, సులభముగా విడి పించుకోగల ముడి [అ]
ఇడిముళ్లు = (1) ఇబ్బందులు
(2) నిరోధములు
(3) వివాదములు—*ఇడిముళ్లు పెట్టినారు* [నె, తె]
ఇడియాప్పం = కొబ్బరిపాలు కలిపి చేసిన దోశ [చి]
ఇడీ = పూర్తి—*ఇడీ అదోనంతా వెదకినా* [కర్నూ]
ఇడుగు = తొలిదుక్కి; అనగా తొలిసారి దున్నినది—*అతడు పొలము ఇడుగుబెట్టి నాడు* [కరీ]
ఇడుగు = విచ్చుట; పెట్టపొదిగిపిల్లలుచేయుట —*కోడి పదిపిల్లల్ని ఇడిగింది;* విడుగు [చి]
ఇడుగుతొడుగు = ఎచ్చుతక్కువలు; ఇడుగు దొడుగు; ఇడుగు ఐడుగు—*ఇడుగుతొడు గుకు పనికివచ్చింది* [నె; కరీ]
ఇడుపు = ఒకపూట దున్నదగినభూమి— *ఆ చేను రెండు ఇడుపులకు ముగియును;* విడుపు [నె; పొ; అ]
ఇడుబాటు = తీరిక [చి]
ఇత్తగిల్చు = ఇష్టము లేకున్నను ఇచ్చివేయు [అ-పె]
ఇత్తికట్టు = మగవారు మెడలో వేసుకొను వెండికంటె [శ్రీ]
ఇత్తు = వృషణములోనుండు బీజము — *ఇత్తులుగొట్టిన కోడె,* విత్తు [నె]
ఇత్తులు దులుపుకొన్నప్పటి నుండి = వివాహమైననాటినుండి [మ]
ఇత్యర్థముచేసికొను = స్పష్టపరచుకొను [తె]
ఇది = వరుసలు—*రామయ్యకు ఇది పోయి వచ్చాను* [చి]
ఇదిరిచ్చు = (1) దులుపు; విదిలించు
(2) తిరస్కరించు
(3) భోజనము ఇష్టములేక పెట్టు [మ]
ఇద్దులాట = (1) వృథాగా కాలము గడుపుట [వి, అ, శ్రీ]
(2) మసలుట [వి]
ఇద్దోట = కాపు ఆగిపోయిన తోట: ఈటు బోయిన తోట; ఇడిపోయిన తోట [చి]
ఇనమాటు = రెండుసార్లు [శ్రీ]
ఇనమారు = పొలమును అడ్డముగా, నిలువుగాను రెండుమార్లు దున్నుట; మడక చేయు [వి; గో]
ఇనిమనమడు = మునుమనమని మనమడు
ఇనిమనమరాలు = మును మనుమరాలు
ఇనుప గజ్జెల తల్లి = దారిద్ర్యదేవత; పెద్దమ్మ —*ఇనుపగజ్జెలతల్లి ఇల్లుచేరె*
ఇనుప తొడుగు = గట్టిమనుచి [వి]

ఇప్పట్ల = ఈ రోజులలో; ఈ మధ్య [కరీ; నె]

ఇబాచారి = వ్యభిచారిణి [నె]

ఇబ్బంది = సంకరము — *ఇబ్బందిగండు, సింహమనుట* [నె; కర్నూ; అ; తె; శ్రీ]

ఇబ్బందిగండు = సింహము — *అసలు సింహములు లేవని ఇప్పటివి సంకరజాతివన్న నమ్మకంతో అను మాట ఇది* [నె]

ఇబ్బట్టు = లోకవిరుద్ధము; జుగుప్సాకరము — *ఈ పని చాల ఇబ్బట్టుపని* [కరీ]

ఇబ్బడి = ఒత్తిడి [వి]

ఇబ్బళిగె = ధాన్యమును కొలుచుపాత్ర [అ; పె; సే]

ఇమకబడు = వానచేత నేల చేపెక్కు; చితచితలాడు; ఇవకబడు [నె]

ఇమడిక = (చూ) ఇమిడిక [తె]

ఇమిడిక = (1) సంగ్రహము — *ఇమిడికగా* చెప్పు (ఇముడునట్లు)

(2) ఒద్దిక = వాళ్లకి ఇమిడికలేదు [నె]

ఇమిరిపోవు = నీరు ఆవిరియైపోవు [తె]

ఇరక = (1) ముక్క (Piece) [అ-పె]

(2) ఇరుకుసందు [శ్రీ]

ఇరకం = ఒకకులమును తెలుపు పదము — *కాపిరకము; పంటిరకము* [వ; నె]

ఇరమైల కాలము = షుమారుగా ఆ సమయంలో అనుట [అ-పె]

ఇరస = రెండుకుంచాలు, తూములో సగము [నె; తె]

(2) ఐదుకుంచాలు [కృ]

ఇరకటము = (చూ) ఇరకాటము [కర్నూ]

ఇరకాటము = (1) అవస్థ; క్లిష్టపరిస్థితి — *నేను ఇరకాటములోపడినా; ఇల్లు ఇరకటము, అలు మరకటము* [నె; తె]

(2) సంకోచస్థలము; ఇరుతట్టు [అ]

ఇరగ వల = తెప్పలమీద సముద్రంలోపలి భాగానికి వెళ్లి చేపలవేట చేయునప్పుడు వాడే వల. దీనిలో మొయ్య, చేకి, చావడా మొదలైన పెద్దచేపలు పడును [గు; బాపట్ల]

ఇరాటము = కమీషను (విశ్వబ్రాహ్మణులు వాడుదురు) [వి]

ఇరుకంత = (చూ) ఇరుకకంత, ఇరుక్కంతి [తె]

ఇరుకారు = రెండుకారులు, రెండుపంటలు. ఇక్లే ముక్కారు? [నె; కర్నూ; అ]

ఇరుకు = చోటులేకుండుట — *ఇల్లు ఇరుకైనది;* ఇరకాటము [నె]

ఇరుకుకంత = కరగోడలో, మనిషి దాటిపోవుటకుమాత్రము అమర్చినదారి. దీనికి సాధారణముగా ఒక పంగాలుకొయ్యను నాటియుంతురు; ఇరుకుమాను [నె, అ]

ఇరుకుమాను = (చూ) ఇరుకుకంత [నె-మెట్ట]

(2) పంగల (పంగాల) కట్టె [వ]

ఇరుకువాకిలి = (చూ)ఇరుకుకంత [అ-పె]

ఇరుక్కొను = చోటుచాలనందున ఒదిగి ముడుచుకొను — *బండిలో ఇరుక్కొని కూర్చున్నా* [నె]

ఇరుగారు = (చూ) ఇరుకారు [తె; అ]

ఇరుతట్టు = (చూ) ఇరకాటము [వి]

ఇరుతడి = బెట్టనేలకు మొదటితడి(తడుపుట) వెంటనే రెండవమారు నీరుకట్టినది [నె; అ-పె; తె]

ఇరుబురి = (1) మందల దప్పట

(2) రెండుపురులుకలది; ఇక్లే ముప్పురి [నె-పొ]

ఇరువారం = రెండువైపులనుండి [శ్రీ]

ఇరువు = సౌకర్యము — *వాడికి ఆ యింట్లో ఇరువులేదు;* అరువు [గో]

ఇరుస = ధాన్యపుకొలత; ఇరస [మ]

ఇరుసు = వీధిబడులలో విద్యార్థులకునేర్పించు కూడిక తీసివేతల లెక్కల ప్రకారము—

పుట్లు *ఇరుసు; రూపాయల ఇరుసు;* నెరుసు [నె]

ఇరుసుకట్లు=ఉదయము ఒకజత పశువులతోను, మధ్యాహ్నము మరియొక జతతోను పనిచేయించునది [నె]

ఇరుసుకట్లు=(1) రెండిడుపులు, రెండు పూటలు.

(2) పిడిచికట్టు [గో]

ఇరుసుకొను=ఎక్కువగా గంతులువేయు; చెప్పినమాట వినకుండు [అ-పె]

ఇరుసుమరుసు=(1) అటునిటు కదలించి వేయుట

(2) చిందరవందర—*ఇరుసుమరుసు చేసినాడు* [నె; తె]

ఇర్ల=ఒకకులము [చి]

ఇలపీట=కత్తిపీట [వ]

ఇలవరస=(1) ఇంటివంతు — *ఇలవరసన అన్నానికి పిలిచినారు* [నె]

(2) వంశక్రమము [నె, తె, అ]

(3) సంప్రదాయము; ఇలవరుస; ఇలువరుస [కర్నూ]

ఇలా=ధ్యాస, చింత,—ఒక పనిలో మనసును లగ్నంచేయుట—*మావానికి బాగుపడాలనే యిలా నే లేదు* [అ]

ఇలాకా=చట్టసమ్మతంకాని స్త్రీ సంబంధం [గో]

ఇలాతికాయ=వేరుశెనగకాయ; పల్లికాయ; నేలశనగ; బుడ్డ [మ]

ఇలాయి=గుడ్డపేలికల చుట్టలనుగాని, పిడకలనుగాని చమురులో తడిపి వెలిగించు దివిటీకట్టె; ఇలాలు [నె; తె; అ]

ఇలాయి జులాయి=బాధ్యతలేకుండా సోమరిగా తిరుగువాడు—*ఇలాయి జులాయిగా తిరుగాడు* [గు]

ఇలారము=గవాక్షిని కప్పువస్తువు, గంప [కర్నూ-పత్తికొండ]

ఇలారము=(1) పిడకలకుచ్చెలపైన వేయు గుండ్రటిపైకప్పు; ఇది కుచ్చెలికి ఆనదు

(2) గుండ్రని పూరిగుడిసె [నె; శ్రీ; వ]

(3) ఇంటిపైకప్పు; ఇలారు [గో]

ఇలారు=(చూ) ఇలారం [అ]

ఇలాలు=(చూ) ఇలాయి [కర్నూ]

ఇలాసము=భేదికి వేసికొనుట [నె-పొ]

ఇలీ బిలీలేని విస్తరాకు=పరులకు పెట్టనివాడు; లోభి [కృ]

ఇలుకు=నరముబెణికి పట్టిన నొప్పి,—*కాలు ఇలుకుపట్టింది* [చి; వి; తె]

ఇలుకూచి=ఇల్లు విడువనిది [వి]

ఇలుదీర్థం = ఇంటెల్లపాదీ, ఆబాలగోపాలము తిరుమలకు చేయుయాత్ర — ఇల్లు*తీర్థము; వారు ఇల్లుతీర్థం వెళ్లారు* [చి; అ]

ఇలువరుస=(1) వంశాచారము [కరీ; అ]

(2) ఇంటికి ఒకరు వంతున — *ఇలువరసన అన్నానికి పిలిచినారు* [నె]

ఇలోనారాయణమ్మ=ఎవరికి బెట్టనిది [వ-గో]

ఇల్ల= లేదు [కరీ]

ఇల్లటము=అత్తవారింటనేఉండుట [కర్నూ] ఇల్లరకము; ఇల్లరికము [అ] ఇల్లింటము ఇల్లింట్రము, ఇల్లిరికము [నె]

ఇల్లరి=(1) ఇంటిపై పన్ను—*ఇల్లరిపుల్లరి లేని వారు* (పుల్లరి, పులవరి=గడ్డిపన్ను; మేతపన్ను)

(2) పనిబాటలవాళ్లు [నె-పొ]

ఇల్లా=ఒక ఆటగెలుపు [కృ]

ఇల్లాకత్తల=పెరటిలో (పెరడు) [శ్రీ]

ఇల్లాకావల= ఇంటివెనుక పెరటిలో సందు [నె; వి]

ఇల్లాకు=పెరడు, దొడ్డి [శ్రీ]

ఇల్లామల్లిసుద్దులు=లేనిపోనిమాటలు [అ]

ఇల్లారము=పిడకలగుచ్చెపైకప్పుపైకప్పు; ఇలారము [కరీ]

ఇల్లారు=గవాక్షిని మూయుగంప [అ]

ఇల్లింపులు (ఇల్ + నింపులు)=వధూవరుల గృహప్రవేశము [అ]

ఇల్లీనింది=(ఇల్లు + ఈనింది) ఇంట్లో పిల్లలు చాలమంది ఉన్నారు అనుటకు [మ]

ఇల్లు కెల్లి=ఇక్కడినుండి [వ]

ఇల్లుపీకి పందిరిపెట్టు = వ్యర్థమగుకార్యము లనుచేయు [కరీ; నె]

ఇల్లువెడలనంప దొంతులు సవరించు = మూర్ఖులగురించి యనుమాట [కరీ]

ఇల్లుఁపెట్టు—నాసముగ ఉంచు [మ]

ఇల్లెలకాతం=ఇంటివెనుక [వి]

ఇవకబడు = వానవలన నేలతడిసి జోడెక్కు; ఇమకబడు [నె]

ఇవకువ=లేమ, చెమ్మగిలుట, నెమ్మునేల; ఈకువ [గు]

ఇవతల=ఈప్రక్క—ఈవైపు × అవతల [కృ, నె; తె; శ్రీ]

ఇవాయి=వికారపు చేష్టలు [చి]

ఇవ్వేళ=నేడు, ఇవ్వాళ్ళ [కరీ; నె]

ఇషంటు = ఇటువేపు [వి]

ఇసంటు=ఈ ప్రక్క, ఇవతల [గు;ఉ-గో]

ఇసగడ=విసుగు [గు]

ఇసపుగోళ్లు = ఒకరకపు వెచ్చపుదినుసు [కరీ]

ఇసింత=ఈకొంచెము [తె]

ఇసికమ్మోరు=ఇసుకవలె పొంగు అమ్మ వారు; గవదలమ్మోరు [చి]

ఇసుకదండు = గోదుమ వర్ణమయినచేప [గు] ఇసుకపుట్టి, ఇసుకదొందు [నె]

ఇసుకదొందు=చేపలో ఒకరకము [చి;నె]

ఇసుకదొంతులు=తెల్లని చిన్న మంచినీటి చేపలు [శ్రీ]

ఇసుకపాతఱ = (1) ధాన్యము లేక ఇసుకతో మాత్రమే నిండిన పాతర—ఫలిత మివ్వని ప్రయత్నము

(2) ఎంత త్రవ్వినను తుదముట్టనిది, వృథాప్రయాస, అంతులేనిది [నె; వ; అ, తె]

(3) ఎంతచెప్పినా తరగని గొడవ [గో]

ఇసుకపాతఱలు = అత్యధికములగు ధాన్యపు నిల్వలు [కరీ]

ఇసుకపుత్తి=మట్టగుడిసె జాతికి చెందిన తెల్లటి చిన్న మంచినీటిచేప [నె, వ]

ఇసురు =(1) పొడవు ఆ యెద్దుకు కాలు యిసురు [నె-పొ]

(2) వైశాల్యము

(3) దూరము—ఆ దారికాస్త ఇసురు [నె]

ఇసుళ్లు = (చూ) ఇసుళ్లపుట్ట ఉసుళ్లు [నె; తె; అ]

ఇసుళ్లపుట్టు = ఎడతెరిపిలేకుండావచ్చు జన సమూహము, నేలయీనినట్లు అనుట; ఇసుళ్లు = రెక్కలు గలిగిన చీమజాతి పురుగులు. చలికాలము పుట్టనుండి బయటికివచ్చును, వీటిని వేయించుకొని తిను వారును గలరు [నె; గో; అ; తె; వ]

ఇసుక్కుడు=నలిగిపోవుట; విసుగుడు [మ]

ఇసొక్కలుమళ=సూక్ష్మగల మేకు; మరచీల [అ]

ఇస్త్రాయము=విశాలము — ఇల్లు ఇస్త్రాయముగా ఉంది [చి]

ఇస్=నిర్లక్ష్యమును వ్యక్తపరచుటకు అనునట్టిమాట [తె]

ఈకిరి = కృశించిన దేహస్థితి, సన్నటి —వాడు *ఈకిరి ఈకిరిమని ఉన్నాడు*; ఈసుసు [నె]

ఈకు = వావి [ఉత్తర-వి]

ఈకువ = లేదు [గు]

ఈగపోటు = ఈగలవలన కలుగు నష్టము

ఈచపోవు = (చూ) ఈచకపోవు; ఈతేసుకపోవు [తె]

ఈచకపోవు = (1) కాళ్లుచేతులు కృశించి పీలగాపోవు

(2) చెట్లుకాపు ఉడిగిపోవు [నె]

(3) చచ్చినదూడను ఈను; గర్భము దుసిపోవు [అ; గో; నె-పొ, గు, కరీ; న]

(4) పాలు పిండుటమాని పశువు వట్టిపోవు —*ఈచుకపోవు* [అ; పె, నె]

ఈచుకపోవు = పశుగర్భము చెడిపోవు: ఈచపోవు, ఊచపోవు; ఈతేసుకపోవు; ఈచకపోవు [తె; నె, గు; కరీ]

ఈటి = ఈటుబోయినది (చూ) ఈటుబోవు [వ]

ఈటుబోవు (1) చెట్లు తోటకాపు ఉడిగిపోవు; సిలిచిపోవు; ఇడిబోవు [నె; కర్నూ; తె]

(2) వ్యర్థమగు

(3) మిరప మొదలగు తోటలను కాపును కోసుకొని చివరన వదలివేయు [నె; కర్నూ; గ; తె]

ఈడెసాని = గెడసాని — *గెడపై సాము చేయు (దొమ్మరి) స్త్రీ* [వి]

ఈడ = ఈత [సే]

ఈడవ = (1) వేరు వేరు ప్రదేశములందున్న ఒకేభూస్వామియొక్క సేద్యపుకమతము. భూమి. — *వాళ్లది మూడు ఈడవల సేద్యము* [నె]

(2) మూడుఏండ్లకాలము [నె-వింజమూరు]

(3) వంశపుతీరు; ఈడువ [నె - ఆత్మకూరు]

ఈడువ = (చూ) ఈడవ [నె - పొ]

ఈడిక = (1) ఈడ్వబడినట్లుగా పని కష్టమనిపించు — *సులోచనాలు లేకుంటే చదువు ఈడిక అనిపిస్తుంది* [నె]

(2) చాలా బరువైనది; పెద్దది [నె]

(3) ఈడిగవారు [సర్కా]

ఈడిగలబడు = బలహీనమై కూలబడు — *ఎద్దు ఈడిగలబడింది*, ఈడెలవడు [నె; కర్నూ, తె; అ]

(2) పోవుటకు ఇష్టములేక, ఈడ్చుకొనిపోవువానికి వశముగానట్లు కూలబడుట [అ]

(3) మొండికెత్తు [శ్రీ]

(4) కాళ్లుచాపి నేలమీద కూలబడుట [గో]

ఈడు = రెడ్లు మొదలగువారి పెండ్లిండ్లలో, వచ్చిన చుట్టములు, ప్రతివారు పెండ్లిచేసినవారికి ఒక్కొక్కరూపాయ యిచ్చు ఆచారము—*ఈడు ఇచ్చి వ్రాయించినా* [నె; వి]

ఈడు = యుక్తవయసు — *ఈడువచ్చినపిల్ల* [నె; గో]

ఈడుచదివించు = పెండ్లిలో కట్నము చదివించు [వి]

ఈడుపులు = చెవులకు వేసుకొను సొమ్ములు [చి]

ఈడుపోతలు = బాధలు [శ్రీ]

ఈడుపోవు = (1) వయస్సు ఉడుగు; కాన్పు కాతగినకాలము దాటిపోవు, ముట్లుడుగు [తె; వ]

(2) బర్రెలు మున్నగునవి ఒక సంవత్సరము కట్టకుండుట [గు]

ఈడెలవడు = లేచుటకు శక్తిలేక కూలబడు; ఈడిగిలబడు [మ]
ఈడెలవడ్డ = చేతగాకుండ అగుట [మ]
ఈడేరు = రజస్వలయగు [తె]
ఈడ్డు = (చూ) ఈపె [వ]
ఈత = (1) పశువు రెండవకాన్పు [చి]
(2) నీళ్లలో ఈదుట — *ఈతకుమించిన లోతులేదు* [నె]
(3) పశువు దూడను ఈనుట — *ఇది మూడు ఈతలబఱ్ఱె* [నె]
ఈతనబడుట = చేలలో పైరుకు కంకి పైకి వచ్చుట [గు]
ఈతూకు = ఈసారి (నింద్యగ్రామ్యము); ఈతూరికి [కరీ]
ఈతేసుకపోవు = [చూ] ఈచకపోవు [తె]
ఈదపోవు = కంకిలో విత్తులు లేకుండా పోవుట — *మాచేను ఈదవోయినది;* తాలుబోవు [కరీ]
ఈదులు = ఈతచెట్లుండు ప్రదేశము [నె, తె, అ]
(2) బుట్టలల్లుటకు ఉపయోగించు ఈత మెలికలు; మెల్లెలు [చి]
ఈనంగ = ఇటుపైపు, ఇటునుండి [వ]
ఈనపుల్ల = సన్నబడుటను సూచించుపదము —*ఈనవుల్ల అయినాడు* [గో; నె]
ఈనపుల్ల = (1) విస్తరికుట్టుటకు పనికివచ్చు నట్లు గున్నగా చీల్చిన జొన్నదంటుపుల్ల [అ; తె]
(2) గుండ్రటి ఒకజాతి గట్టి గడ్డిపుల్ల; చీపురుపుల్ల. దీనిని చీల్చి విస్తళ్లు కుట్టుదురు; చీల్చక కసువూడ్చుటకు ఉపయోగింతురు [నె]
ఈను = (1) వరికోతకు సిద్ధమగు [తె]
(2) వరి, ధాన్యపు కంకులను వెలువరించు [కృ]
ఈనె = నాభిమొదలు గుదస్థానమువరకు నూగారు ననుసరించియుండు నరము
(2) నరము — *ఈనె పగిలినది* [నె-పొ]
ఈనెలు = ఈరికలు [వి]
ఈపి = (చూ) ఈపె [నె; తె]
ఈపె = (1) చిన్న పేనుగుడ్డు, ఈపి; ఈరు; ఈడ్డు [నె; తె; చి]
(2) పుండు బాగా కుళ్ళిన తరువాత వచ్చే పురుగులగుడ్లు [వ]
ఈపెట్టు = పుండు కుళ్ళినచోటు [వి]
ఈబరిగొట్టు = నిష్ప్రయోజకుడు [శ్రీ]
ఈబలు = తరకలు (చూ) లీబలు; [నె-ఆత్మకూరు]
ఈమిరి = (1) నెమ్ముఅరని నేల
(2) ఎక్కువతడి; ఈమురు [నె; చి]
ఈమురు = (చూ) ఈమిరి [అ]
ఈరంగము = (1) పెద్దగోల — *ఇక్కడ పెద్ద ఈరంగము సాగినది;* వీరంగము
(2) కొమ్ముగాండ్రు జమిటకులవాయించుచు చేయు వీరనృత్యము [కరీ; నె]
ఈరకడియము = వీరుడుకడియము. దీనిని వీరులు ఎడమచేతికి పెట్టుకొనెదరు [వి]
ఈరకత్తె = ఈపరాలు [వి]
ఈరవాని = ఈళ్లనీడ్చు దువ్వెడి సాధనము, ఈరి; ఈర్పెన [అ]
ఈరిబాన = పేలు ఈపెని చంపుటకు ఉపయోగించు కొయ్యసాధనము. ఈర్పెన, ఈరిపెన [చి]
ఈరు = (చూ) ఈపె [వ]
ఈరుపన్నె = (చూ) ఈరివాని [గో]
ఈరుబానె = [చూ] ఈరిబాన [చి]
ఈర్లు = పేనుగుడ్లు; ఈపి [శ్రీ]
ఈర్పెన = (చూ) ఈరివాన, ఈర్వాణి, [వ; నె]
ఈర్వాణి = (చూ) ఈర్పెన; ఈర్వావి [అ]
ఈలకత్తి = కత్తిపీట; ఈలపీట [అ]
ఈలగఱము = ప్రాణావశిష్టమై భయపడి నోరు బిగబట్టియుండుస్థితి [అ]

ఈలపీట = [చూ] కత్తిపీట [అ-పె]

ఈలపురుగు = రాత్రులందు పైరుపొలము లలో నిరంతరాయముగ రొదచేయుచుండు చిన్నపురుగు; కీచురాయి [కర్నూ]

ఈలిక = గుడ్డపేలిక [వి]

ఈసం = ఒక అణా (పీసము) [వి]

ఈసకపోవు = (చూ) ఈచకపోవు [నె; కర్నూ; అ; తె]

ఈసబడి = గ్రామస్థులందరికి ఉమ్మడిగా భాగములు గలిగిన పశువుల బీడు మొదలగు భూములు—*మాకు పది ఈసబడి భాగము లున్నవి* [నె; అ]

ఈసర = అధికము [నె]

ఈసరబాసర = నోరికి వచ్చినట్లు — *అత డామెను ఈసరబాసర వదరెను* [కరీ]

ఈసుల్లు = ఉసుళ్లు; ఇసుళ్లు, వానకాలము నందు పుట్టలనుండి బయటికి లేచు రెక్కపురుగులు, వీటిని వేయించి మసాలా కలిపి తిందురు [ఓ]

ఈసుకపోవు - (చూ) ఈసకపోవు [వ; నె]

ఈసురు = మిక్కిలి కృశించియుండు — *మా అబ్బాయి ఈసురో అని ఉండును;* ఈకిరి [కరీ]

ఈసుళ్లు = (చూ) ఇసుళ్లు [నె. వి]

ఈవలి = దాహము [గ]

ఈవిరి (చూ) ఈమిరి [కర్నూ]





ఉంగ = (1) పసిబిడ్డలకు పోయు ఉగ్గు [శ్రీ] (2) చంటిపాపలకు పోయు పాలు [కరీ]

ఉంగటము = కాలిబొటనవ్రేలను దూర్చుకొనుటకు చెప్పులో అమర్చియుండు ఉంగరము [అ, నె-పొ]

ఉంగిడి = కంకితీయని కొన్ని జొన్నదంట్లకు ఎక్కియుండు విషమును తినిన పశువులకు తగులువ్యాధి; నాము; నాగు [నె-మెట్ట]

ఉంచు = వడ్డించు — *అన్నం ఉంచు* [నె-వైశ్యులు]

ఉంచుకొను = (1) ఒకడు ఒక లంజను పెట్టుకొను — *దానిని వాడు ఉంచుకొన్నాడు* [నె; కర్నూ; అ; తె] (2) అట్టిపెట్టుకొను [గో]

ఉంట్లు = ఉండలు [నే]

ఉండ = చక్రము; గాలు; కల్లు — *బండుండ* [వి]

ఉండబట్టక = అనవసరముగ — *ఉండ బట్టక వాడు యీ పని పెట్టుకొన్నాడు;* గాదుబట్టి [తె; నె]

ఉండిఉండి = (1) అప్పుడప్పుడు [వి] (2) మధ్యమధ్య విరామములతో—*వాడికి ఉండిఉండి వచ్చిరేగుచుండి* [నె]

ఉండిగ = లక్కగూడు. కమ్మలు మొదలగు నగలలో రాళ్లు బిగించుటకు, ఒక చిన్న వెదురుపుల్ల ఒక చివరన లక్క అంటించి గూడు (కుదురు) గాచేసి అందులో నగను బిగించునది [గు]

ఉండిలేములు = మధ్యరకపు స్థితులు [కరీ]

ఉండు = తప్పుకో; ప్రక్కకు తొలగు—*ఉండు నాయనా* [నె]

ఉండూరు = నివసించుగ్రామము; స్వస్థలము —*ఉన్నమాటఅంటే ఉండూరు అచ్చిరాదు* [నే; నె]

ఉండెము = చిన్న బురుజు [కరీ]

ఉండేలు = పిట్టలను గురిబెట్టి కొట్టు సాధనము (చూ) వింటిలిదప్ప—*పిల్లవానికేమి తెలుసు ఉండేలుదెబ్బ* [చి; కర్నూ]

ఉండేలిదబ్బ = (చూ) ఇంటెలిదబ్బ [వి]

ఉంపడము = ఎవడో ఉంచుకొనిన స్త్రీకి పుట్టినబిడ్డ [చి]

ఉంబరము = ఉక్క, ఉమ్మదము [అ]

ఉక్కబెట్టుట = ఉంద్రములు మొదలగు పిండివంటలు చేయుటకు ముందుగా, నాన బెట్టి దంచిన మెత్తటి వరిపిండిని, సల సల కాగిన వేడినీళ్ళతో తడిపి ముద్దగా జేసి, కొంచెముసేపు ఉంచుట. దీనినే ఉగ్గలిపోయుట అనికూడ అందురు. [గో]

ఉక్కసము = దగ్గు; కాసరోగము [అ]

ఉక్కిష్టము = అసహ్యస్థితి [నె]

ఉక్కిరి = కూరలోని ఊట; ఉరుపు [వి]

ఉక్కు = గోలీలఆటలో గోలీని కదిలించి ఉన్నచోటనే, లేక, ఆ దగ్గరనే ఉంచుట [నె]

ఉక్కుదేవుడు - గట్టి నల్లటి శరీరమువాడు [వి]

ఉక్కుపిండం = చాలా గట్టివాడు; ఉడుకుపిండము [గు]

ఉక్కురోషము = ఉక్రోసము. క్రోధము [చి]

ఉక్కెర = (1) మెత్తన — *ఉక్కెరగావండినాను*

(2) సొంటి మొదలగు వస్తువులు నూరి, ఉంటగట్టి నీళ్ళలో జారవిడిచి కాచిన కషాయము [కర్నూ]

(3) బియ్యపుపిండిగాని గోధుమనొజ్జను గానీ ఉడికించి, లేక వేయించి, చక్కెర నేయికలిపి చేసిన పిండివంటకము [అ]

(4) హల్వా [చి]

(5) చంటిపిల్లలకు వండిపెట్టు మెత్తని అన్నము.

(6) చక్కెరకలిపి వేయించిన పిండి [కరీ]

ఉక్రోపం = క్రోధము [వి]

ఉగ = (1) బుద్ధి — *ఉగదెలిసినది మొదలు; చిన్నతనమునుండి అనుట*

(2) ఊహ — *మంచి ఉగగలిగినవాడు* [నె]

ఉగాయించు = ఊహించుట [గు]

ఉగాదిసాంగ్యము వధువుకు పాత్రలు, పశువులు పలెకరాలన్నీ కొని పంపు సంప్రదాయము. పెండ్లి అయిన మొదటి ఉగాదిలోగా వీటిని పంపితీరాలనే నియమము. ఉగాదిసారె [చి]

ఉగిబిగి = మంచిచెడ్డ; — *ఉగిబిగితేల్తే కాని వదలను* [ం]

ఉగ్గము (1) ఉగ్గు; మడతలు; చిక్కులు — *దారం ఉగ్గపడినది* [కరీ]

(2) ఉరి; అపాయము — *ఇంటికుగ్గము తెచ్చినాడు* [కరీ; వ]

(3) ప్రాణాంతకమైన కష్టము — *వాని మెడకు ఉగ్గం తెచ్చిండు; నాకు ఉగ్గం* పెట్టిండు; ఎసరుబెట్టినా - - వంటిది [వ]

ఉగ్గము = పాలుతీయుటకు ఆవుకాళ్ళకుబెట్టు బంధము [నె-ఆత్మకూరు]

ఉగ్గలిపోయు = (చూ) ఉక్కబెట్టు [గో]

ఉగ్గులు = (చూ) ఉగ్గము [కరీ]

ఉచ్చాలు = (1) గుత్తులు — *జుట్టు ఉచ్చాలు ఉచ్చాలుగా పెరికినాడు*

(2) దఫాలు దఫాలుగా — *ఉచ్చాలు ఉచ్చాలుగా తిట్టినాడు* [నె]

ఉచ్చి = మెదడునకు పైభాగము; మాడు [చే]

ఉచ్చికెక్కు = చాలనిపించు — *ఆ విషయము ఉచ్చి కెక్కిందిరో* [చి]

ఉచ్చనవు = లావుగ అయినావు అనుట [మ]

ఉచ్చలితనము = చిలిపితనం — *అతడు చాల ఉచ్చలితనపు మనిషి* [కరీ]

ఉచ్చుమల్లి — బరిబత్తల; నగ్నముగనున్న స్త్రీ [మ]

ఉచ్చులుచ్చులు = (చూ) ఉచ్చాలు [అ]

ఉజలీబండి = బలియిచ్చుటకు, పందిపిల్లను అమ్మవారిగుడికి తీసుకుపోవుబండి [వి]

**ఉజాడు** = సిగ్గువిడిచిన — *వాడు వట్టి ఉజాడువాడు* [నె]

**ఉజ్జ**=ఉద్ది [అ]

**ఉజ్జి**=కుక్కపిల్ల [చి]

**ఉటాగ**=ఎత్తుగ — *మావాడు ఇంతకంటె ఉటాగా ఉన్నాడు; ఉటాను* [నె-పొ]

**ఉటాను**=ఎత్తు — *ఉటాను మనిషి; ఉరావు* [నె]

**ఉటింగించు**=తగ్గించు; హ్రస్వముచేయు; దాటవేయు [అ]

**ఉట్టితిరుణాళ్ల** = గోకులాష్టమినాడు జరుగు ఉత్సవము. నునుపైన స్తంభముకొసలో రూకలసంచి నుంతురు. దానిని ఎక్కితీసి కొనగలిగిన వ్యక్తిదే ఆసొత్తు. కాని అతడు పైకెక్కుటను నిరోధించుచు, వసంతపునీళ్లు అతనిపై చల్లుచుందురు [చి-నె]

**ఉట్టు**=బొట్టుబొట్టుగా గోల మొదలగువాటి నుండి స్రవించు—*కల్లు ఉట్టినది*[నె; తె]

**ఉట్రు ఉడియము**=(1)సులభసూక్ష్మము—*ఉట్రుఉడియంగా కొట్టివేసినాడు* [నె] (2)హఠాత్తుగా [నె]

**ఉట్లశ్లోకం**=అబద్ధము; ఉళక్కి

**ఉరావు**=పొడవు; ఉటాను

**ఉడకబెట్టు**=ఎక్కువ ఎండ తాపముచేత ఉక్కబోసి కష్టపెట్టు—*గాలి బిగించి ఉడకబెట్టుచున్నది;* ఉడుకబెట్టు [నె]

**ఉడకాడించు** = మనస్సులో ఉడుకునట్టు చేయు, కష్టపెట్టు—*నా పుస్తకం తీసికొని నన్ను కొంతసేపు ఉడకాడించినాడు;* ఉడకాయించు [నె]

**ఉడకాయించు**=(చూ) ఉడకాడించు [నె]

**ఉడసైనాడు**=వెళ్లిపోయినాడు [చి]

**ఉడాను**=డాంభికపుమాటలతో చేయుప్రయత్నము—*ఒక్క ఉడాను కొట్టినాడు*— Bluff [నె; వ]

**ఉడాయించు**=(1) పారిపోవు — *వాడు పిల్లను తీసుకొని ఉడాయించినాడు* [చి] (2) చెప్పకుండా వెళ్లిపోవు [గు; నె]

**ఉడీ**= అబద్ధము అను అర్థమున వాడబడు జాతీయము [కరీ]

**ఉడుకపోత**=గాలిలేక వేడిగా [ఉక్కగా] నుండుట; ఉడుకపోయి [వ]

**ఉడుకులు** - గుడ్డకు చాయవేయుటకు రంగు వేసి ఉడుకబెట్టిన పర్యాయములు — *అది మూడుడుకులచాయ; (ఎగతాళిగా) ఆయన ది రెండడుకుల నలుపు* [నె]

**ఉడుగుబాటుపిందె**=(చూ) ఉడుబోతుపిందె [తె]

**ఉడుబోతుపిందె**=(1) చెట్టుకాపు ఉడుగు బోవు సమయములో వేసిన బలహీనమైన పిందె, కషపటిపిందె (2) చివరిసంతానము; ఉడుకుబాటుపిందె —*వాడు ఉడుబోతుపిందెగా పుట్టినాడు* [నె]

**ఉడుముపట్టు**=అటు ఇటు కదలనీయకుండా గట్టిగా పట్టుకొనినది; భల్లూకపు పట్టువంటి మాట;—*ఉడుముపట్టుపట్టినాడు.* ఉడుము ఒక పెద్దబల్లివలె మెట్టనేల బొరియలలో నుండును. అది దేనినిగాని కాళ్ళతో కరచు కొనినచో లాగి వదలించుట ఏనుగులచేత గూడ కానిపని అందురు. పూర్వము ఉడు ముల నడుములకు మోకుగట్టి, కోట బురుజులపైకి విసరి అది పట్టు చిక్కించు కొనినతర్వాత, వ్రేలాడు మోకులు బట్టు కొని సైనికులు కోటగోడలపైకి ప్రాకి ఎక్కిడివారు [నె; అ; తె]

**ఉడుసు** - బలవత్తరము; తరతమ భేదమును తెలుపువదము—*అకోడెకంటె ఇది కొంచెము ఉడుసు* [నె-పొ]

**ఉడైయారు** = కుమ్మరవారిపేరు చివరన ఉంచుకొను కులబిరుదము; రాజశ్రేష్ఠుడు [చి]

**ఉడ్డ**=(1) కుప్ప [నే; నె]
(2) నాలుగు [చి; అ]

**ఉడ్డాముగ్గురు**=(1) ఏడుగురు; (4+3)
(2) కొంతమంది [అ]

**ఉడ్డాలు**=ఒకే విధమైన వస్తువుల రెండు మూడింట కుప్ప—*డబ్బును ఉడ్డాలుగా పెట్టు* [నె-పా]

**ఉడ్డోలం**=ఆశ్చర్యం [వి]

**ఉతక**=తలుపును ద్వారమునకు బంధించిన సీల; బందు [గు]

**ఉతాయింపు**=రమారమి; సుమారు [గు]

**ఉతారా**=మతింపు;—*ఉతారావేసి చెప్పు* [చి]

**ఉతారాదారు**=కల్లు దిగుబడిని రోజూ లెక్కచూచువాడు [చి]

**ఉతారు**=ఊహ; ఉద్దేశము; [అ]

**ఉతుకు**=చాకలిగుడ్డలు ఉతికిన ఒక్కొక్క మారు—*ఈనెలకు అది మూడో ఉతుకు* [నె]

**ఉత్కాలాడు** = ప్రసవించు, ఉదకాలాడు; ఉతకాలాడు [మ]

**ఉతుకులు**=దుస్తులు, ఉతికినవి [మ]

**ఉత్తపుణ్యానికి**=తెగతేరకు, ఊరకే [నె; కర్నూ; గో; తె; అ]

**ఉత్తబిత్తలు**=(1) నగ్నంగా, దిసమొలగా
(2) వట్టిచేతులతో, ఉత్తలబిత్తల [అ]

**ఉత్తచేతులత్త**=నిరర్థకవ్యక్తి [కరీ]

**ఉత్తది**=(1) బొల్లిది: అసత్యమైనది
(2) వ్యర్థము—*వాడు ఉత్తోడు* [నె]

**ఉత్పాతం**=పెంకితనము; పొగరు [శ్రీ]

**ఉత్తుక్తు**=కబడ్డీ; చెడుగుడు ఆట [మ]

**ఉత్తుత్త**=హుళక్కి; అబద్ధము; అంతా ఉత్తుత్తదే—*ఉత్తుత్తమాటలు చెప్పకు* [వ; నె; పా]

**ఉత్సగీతగాడు**=ఒకరుచెప్పు ప్రతిమాటకు తల ఊచువాడు; తథాస్తు అనువాడు [శ్రీ]

**ఉదరగొట్టు**=(1) పశువులను భయపెట్టి చెల్లాచెల్లా పరుగెత్తజేయు
(2) ఎదుటివానిని మాట్లాడకుండజేయు—*వాడిని ఉదరగొట్టి వేసినాడు; అదరగొట్టు*, [నె, అ; తె]

**ఉదరము**=పొట్ట ఉబ్బియుండుట [అ]

**ఉదరాయించు**=(చూ) ఉదరగొట్టు; ఉదిరించు [కర్నూ]

**ఉదాశనము**=నీచము అను దూషణము—*పెద్దరికానికి పెసలపప్పు, కమ్మదనానికి కందిపప్పు, ఉదాశనానికి ఉలవపప్పు* [నె-పా]

**ఉద్దము** = (1) పశువుల ముంగడికాళ్ళ క్రిందటి శరీరము
(2) పొడవు [కరీ]

**ఉద్దరము**=మూడు; (విశ్వబ్రాహ్మణులువాడు పదము) [వి]

**ఉద్దరిణచప్పుడు**=నటన— *పూజచేసినట్లు ఉద్దరిణ చప్పుడుచేయుట* [వి]

**ఉద్దానము**=ఫలవృక్షాదులతో కూడుకొనిన వనము [శ్రీ]

**ఉద్ది**=(1) మిట్టపొలములకు నీరు పారించుటకు పోసిన ఎత్తుకోవ, బోదె.
(2) మినుములు - *ఉద్దిపప్పు; ఉద్దిపేడలు*
(3) ఒకజట్టుకుపెద్ద, నాయకుడు
(4) జట్టు
(5) సమానము—*వాడికి వీడు ఉద్ది* [నె; కర్నూ; అ]

**ఉద్ది**=బావి మొదలైనవానినుండి నీరు తోడుటకై బిళ్ళ వేయుటకుగాను కట్టినట్టిది [తె]

**ఉద్దీలు**=ఇంచుమించు [గో]

**ఉద్దులు**=బండిపై చట్టమునకుఇరుప్రక్కలా అమర్చిన దట్టమైన పొడవు కొయ్యలు; వరములు [శ్రీ]

ఉద్దెర = అప్పుగ వస్తువులిచ్చుట; ఉద్దర [మ]
ఉద్యోగం = ( ) చాకలిగుడ్డలు ఉతుకుటకు రేవుకు (నిటిదరికి బొవుట — వాళ్లు ఉద్యోగానికి పోయినారు
(2) చాకలి ఇస్త్రీజేసిన దుస్తులను సొంత వారికి చేర్చుట — ఇది రెండోఉద్యోగం; ఉద్దాగం; రెండో ఉతుకు [నె]
ఉనుక = వరిపొట్టు, ఊక [వ]
ఉన్క = తవుడు (సన్న వరిపొట్టు) కలిసినది; చిట్టు [మ]
ఉన్నరగా = నేర్పుతో; వరుగా [అ]
ఉన్నవాడు = కలిగినవాడు; ధనవంతుడు [వి, నె]
ఉపకారి = భర్తీబండిని నిలుపుటకై నొగల క్రిందపెట్టు ఆనుగట్టి [కరీ]
ఉపద్ర = ప్లేగు మొదలగు అంటువ్యాధి; ఉపద్రవము [అ]
ఉపము = ఉపాయము [నె-పొ]
ఉపరసము = ఔషధాదులయందు దనుపానము [నె, కృ, గు]
ఉపరాగా = కష్టపడకుండానే; ఉపరిగా [అ]
ఉపరాలు = ఉచితము [చి]
ఉపరి = చేసినదానికి తోడుగా ఇంకొకటి చేయునది — *గుణ్ణం పడద్రోసిందిగాక ఉపరిగా గుంట త్రవ్వినట్లు* [నె]
ఉపాది = ఇబ్బంది — *వస్సు ఎగవేస్తే ఉపాది వస్తుంది* [నె-పొ]
ఉపారము = పప్పు, అన్నము, మూడుపిండి వంటలతో అమ్మవారికిపెట్టు నైవేద్యము [శ్రీ]
ఉప్పచప్పన = రుచిహీనమైన [కరీ]
(2) ఉత్సాహరహితమైన [నె]
ఉప్పత్తి = దృష్టిదోషము [గు]
ఉప్పత్తులు = (1) పోటాపోటీలు
(2) ఒకరు ఒకటిచేయగా ఇంకొకరు ప్రతిక్రియగా ఇంకొకటిచేసి నష్టము కలిగించుట — *ఉప్పత్తుల కాపరం ముందరికి రాదు; — అన్నగారు పది కర్చుచేస్తే తమ్ముడు యిరవై చేశాడు* [నె-పొ]
ఉప్పదన = అసూయతోడి పొగడిక — *ఈ ఉప్పదన మెందుకూ?* [నె-పొ]
ఉప్పనచేప - ఉప్పువేసిన ఎండుచేప; కర వాడ [నె, వి]
ఉప్పనపట్టె = వెన్నెలలో ఆడు ఒక ఆట [నే]
ఉప్పనపరిగె = ఉప్పుచేప, ఉప్పనచేప; కరవాడ [వి]
ఉప్పరతట్ట = మట్టిమోయుటకు, గుంట పళ్లెము (టకారం) వలె అల్లిన ఈతపేళ్ళ తట్ట. ఉప్పరవాళ్లు (వడ్డెలవలె ఒక పనిబాటల కులము) సాధారణముగ వాడు తట్ట [కె]
ఉప్పలాయి = (1) ప్రళయము; పొగాలము [కృ]
(2) కీడు [కరీ]
ఉప్పలి = భూమిలో మొలుచు పుట్టగొడుగు వంటిది, పరశురామహస్తము [కరీ]
ఉప్పాంసులు = పచ్చిమాంసమును చిన్న తునకలుగాకోసి ఉప్పు పసుపు కలిపి ఆవ గించి ఎండబెట్టినవి, ఉప్పాసులు; ఉప్పు కండలు [నె; వ]
ఉప్పాడు = (చూ) ఉప్పరియు [అ-పె]
ఉప్పిడి = ఉప్పులేని ఉపవాసము — *ఉప్పిడి ఉపవాసాలతో తెల్లవారుచున్నది* [కరీ]
ఉప్పుకండలు = (చూ) ఉప్పాంసులు, ఉప్పు తునకలు [నె]
ఉప్పుకశం = ఉప్పు ఎక్కువైన కూరమొదలైనది; ఉప్పుకసిం [నె-పొ]
ఉప్పుగడ్డి = ఒకవిధమైన గడ్డి, ఇది ఉప్పుగా ఉండును. రాగి వెన్నువలె, దానికి పూ వుండును [అ-పె]
ఉప్పుగెడ్డ = ఉప్పు ఎక్కువైనది; ఉప్పని; ఉప్పుకసిము [చి]

ఉప్పుచెక్క=(1) ఎద్దులకు బలమునకై వేయు మందుచెక్క [చి]
(2) వరిపిండితో ఉప్పువేసి పెనములో చముఱుతోకాల్చిన గట్టి పిండివంట [నె]
ఉప్పుచేప=(చూ) కరవాడ [చి]
ఉప్పుతునకలు=(చూ) ఉప్పాంసులు [చి]
ఉప్పుదన=దిష్టి [గు]
ఉప్పుదేలు=(చూ) ఉప్పెల్లు [చి]
ఉప్పునేల=చవిటినేల [చి]
ఉప్పుమిరపకాయలు=మజ్జిగలో ఉప్పువేసి ఊరవేసి ఎండించిన మిరపకాయలు. వీనిని వేయించి భోజనసమయమున కొఱికి తిందురు [అ; నె]
ఉప్పురియు=ముఖ్యముగా మట్టిగోడలక్రింది భాగము ఉప్పు మట్టిగామారి క్రమేణా రాలిపోవుట, చవిటిమట్టిగా మారుట [నె; కర్నూ; తె; అ]
ఉప్పెల్లు=పొలములు సవర (చవుడు) దేలిపోవు; ఉప్పుదేలు, ఉప్పురియు [నె; కర్నూ]
ఉప్పేసిపోవు=పొలములు ఉప్పుపడు [గు]
ఉబద్ర= ఇబ్బంది, పోదు—*వాడిది మాట పెద్ద ఉబద్ర* [నె]
ఉబల=శక్తిలేని బలుపు; బలములేనిబలుపు; ఊదుబలుపు [శ్రీ]
ఉబాలు = పైరునాటుట, ఊర్పు; ఊడ్పు; ఉభా [శ్రీ]
ఉబ్బ=చాకలివాడు బట్టలు ఉతుకుటకై ఉడికించుట (అ)
(2) చాకిరేవువద్ద బట్టలను ఉడికించు పొయ్యి, బాన [చి]
(3) ఎండవేడిమిలో గాలి వీచనందున ఏర్పడిన ఉక్క [నె]
ఉబ్బతము=కాలువలు మొదలగువాటి నీరు క్రిందికి పారిపోండా నిలిచి, ఉబ్బి ఎగదన్నినది [నె]
ఉబ్బగట్టుట = ఆనకట్టవేయుట [కరీ]
ఉబ్బడాలు=దారిలో ఏర్పడిన గుంటలు కనుబడకుండ బురదతో నిండియుండుట [కర్నూ-పత్తికొండ]
ఉబ్బడాలు=(1) పచ్చి ఆరని ధాన్యము [నె]
(2) గింజపట్టని ధాన్యము [నె]
(3) మెట్టగ్రామాలలో కావుపాతరలలోనికి నీరుదిగి ఉబ్బిన ధాన్యము [నె-పొ]
ఉబ్బన్న=నుబ్బన్న [సే]
ఉబ్బర=ఊరకే—*ఉబ్బరగా వచ్చింది* [వి]
ఉబ్బరపోవు=ఎండదెబ్బకు దాహమెత్తి ఆరాటపడు; వడదెబ్బదగులు [నె]
ఉబ్బరము=(1) ఉక్క [వ, కరీ]
(2) ఉబ్బుట—*కడుపు ఉబ్బరంగాఉంది* [నె]
ఉబ్బరింత=ఉక్కగానుండుట, ఉడుకపోత [వ]
ఉబ్బర్లు=ఇతరులు [గు]
ఉబ్బల=చిన్నపొగడ్తలకేపొంగిపోవువ్యక్తి; ఉబ్బులమారి; ఉబ్బులు [నె]
ఉబ్బలాంకోడి=ఉబ్బసవ్యాధిని నివారించు ఆకుతీగ. పిల్లలకు ఈ ఆకురసమును పోయుదురు, తీగెను మొలకు కట్టుదురు [చి]
ఉబ్బాచక=ఉబ్బుపట్టజాలక [కరీ]
ఉబ్బి=బురదమడుగు—*ఉబ్బిలోబడి పెద్దఅదలంచు*; ఉబ్బలి; ఉమ్మలి (Quick Sands)
ఉబ్బుకొని=మూతిబిగించి [అ]
ఉబ్బులు = పొగడ్తలకు పొంగిపోవువాడు; ఉబ్బులకారి; ఉబ్బలమారి; ఉబ్బల [నె]
ఉబ్బెత్తు=సమతలముమీద పైకి ఉబ్బిన ఆకారము (Emboss) [నె; తె]
ఉభా = పొలముఊడ్చుట; నారువేయుట; ఉబాలు [ఉత్తర-వి]

**ఉమాదము** = వెఱ్ఱిరోగలతనము; పిచ్చిసంచు —*వాడికి వస్తే ఉమాదం;* ఉన్మాదం [నె, అ]

**ఉమ్మ** = నోటినుండి కారు ఒకవిధమగు ఉమ్మి—*ఉమ్మ కార్చేడు; ఎద్దు ఉమ్మలు కార్చేసింది* [గో]

**ఉమ్మకాపు** = అదనుతప్పించి కాయు మామిడి మొదలగు చెట్లుకాపు—*ఉమ్మ కాఃకాయ* [నె]

**ఉమ్మగిల్లు** = అన్నము, గంజి వార్చినతర్వాత తేమ బిగుసుకొనుట, అమరుకొను [అ]

**ఉమ్మనము** = పొగరు [ప గో]

**ఉమ్మరము** = (1) అధికము; ముమ్మరము—*వాన ఉమ్మరమైంది* [నె; వ]
(2) ఉక్కపోత [తె]

**ఉమ్మాయిముత్తెము** = (నకిలీ) కృత్రిమ మౌక్తికము [కరీ]

**ఉమ్మనీరు** = తల్లిగర్భమునుండి బయటికి వచ్చునప్పుడు శిశువు లోపల త్రాగి ఉండు నీరు (గర్భజరాయు జలము) [నె-పొ]

**ఉమ్మిరి** = హెచ్చు; ఎక్కువ; ఉమ్మరము —*కాయకూరలు ఉమ్మిరిగా వస్తున్నవి* [శ్రీ]

**ఉమ్ము** = పొయ్యిలో ఆరుతున్న నిప్పులు; కుమ్ము [చి]
(2) ఎంగిలి ఉమియు [అ]

**ఉమ్ముకొను** = ఉమ్మివేయు [నె-పొ]

**ఉరక** = మేక, గొఱ్ఱె మొదలగు సన్నజీవాలు ముందరికాళ్లు ఎత్తి వెనుకకాళ్లపై నిలబడుట—*మేక ఉరకవేసింది* [నె]
(2) నీరూరుట [కృ]

**ఉరకలు** = (1) తొందరతొందరగా పనులు చేయుట [గో]
(2) పరుగులు [గో; నె]

**ఉరకాబరకా** = అధికంగా — *వాడు ఉరకా బరకా తిన్నాడు* [వి]

**ఉరడా** = పచ్చిరాగులతో చేయు పాకపు ముద్దలు, బాలురకు ప్రీతిఅయినవి [నె-పొ]

**ఉరదాళ్లు** = గ్రామదేవత ప్రీతిగా భక్తులు మెడకు వేసికొను త్రాడు [నె-పొ]

**ఉరామరిక** = రమారమి; ఉరమరిక [నె]

**ఉరిడి** = (1) భూమిలో వుండే పురుగు [ఉత్తర-వి]
(2) కుమ్మరి పురుగు [శ్రీ]

**ఉరిదెపోటు** = తలవెంట్రుకలు ఊడిపోవు రోగము; పేనుకొరుకుడు [వి]

**ఉరిమంటలు** = కోపంతో ఆపాదమస్తకము వేడెక్కి పుట్టుమంటలు [చి]

**ఉరుకాల్వ** = (1) చేనిలోనికి ప్రవేశించు చిన్న సొంత పాయదలకాల్వ [నె]
(2) ఊరునీటికై తీయు సన్నకాల్వ [చి]

**ఉరుకు** = పరుగెత్తు [నె; కర్నూ; తె; అ]

**ఉరుకు** = (1) గంతువేయు,
(2) ఎత్తునుండి క్రిందకు దుముకు [గో]
(3) దూకు—*గోదావరిలో ఉరుకినాడు* [నె-పొ]
(4) ఆలోచన కుదరక తలను క్రిందికి పైకి ఆడించు; ఉంకించు [వి]

**ఉరుకుడుబొడ్డు** = అణగక ఎత్తుగానుండు బొడ్డు [చి]

**ఉరుకుపెరుమాళ్లు** = ధనుర్మాసములో, నెత్తిన రాగిచెంబుతో, పాడుచు పరుగెత్తి భిక్షమెత్తు సాతాని జియ్యరు [దక్షి]

**ఉరుటు** = ఇంటి పిల్ల దూలములకు (మేలు దూలములకు) వేయు కొయ్య [చి]

**ఉరుబోతుసుడి** = ఎద్దుసుడి, చాలచెడ్డదని నమ్మకము [చి]

**ఉరుపు** = కూరలోని ఊట (రసము) [నె]

**ఉరుము** = (1) గద్దించు — *వాడు ఉరిమాడు* [వి]
(2) స్వరూపము — *ఉరుము గల్లంతు; స్వరూపమే కనపడకపోవు* [గు]

ఉరువు=(1) ఉనికి; మొదలు — మనిషి ఉరువే లేదు; ఉరువుతో మోసము [నె; రా; చి]

(2) బరువు, పెద్దదైన—ఉరువైన కాయ [నె]

(3) వస్తువు—ఎన్ని ఉరువులు [గు, నె, కర్నూ, చి; వి]

(4) జాడ—ఉరువులేదు [అ, నె]

(5) అసలుకే, మొదటికే—ఉరువురాలేదు [రా, నె]

ఉరువులేకుండపోవు=కనుపడకపోవు [నె; చి]

ఉర్లగడ్డ=పొటాటో [నె, రా- సీ]

బంగాళాదుంప [సర్కా]

ఆలుగడ్డ [తె]

ఉర్లాంపద్దు=సన్మానంపొందిన పండితుడు శ్రీకాకుళంజిల్లాలో ఉర్లాంసంస్థానములో ఆరితేరిన పండితులకు సన్మానం జరిగేది; అందుకని అక్కడ సన్మానం పొందిన పండతుని ఉర్లాంపద్దు అంటారు. [వి]

ఉర్లిపడు=ఉప్పొరిసిపోవు; గోడలమెత్తులు (పూతలు) రాలిపోవు [కర్నూ]

ఉర్లిపోవు=(చూ) ఉర్లిపడు [కర్నూ]

ఉఱ్ఱుకట్టు = అర్ధరూపాయ (విశ్వబ్రాహ్మణులు భాష) [వి]

ఉలకాలు=అంటుజాడ్యము; దీని నొకతిట్టు క్రింద వాడుదురు.

ఉలవ=లోన నల్లమందు ఉంచబడి ఉలవ గింజవలె నుండునది, దీనిని నేలపైగీచి విడిచిన చిటపటలాడుచు నుండును; చిటపటాలు [చి]

ఉలవరించు=(1) నేల పలుమారు తడిసి ఎండి బొదబొదగా (వదలు వదలుగా) పోవు

(2) సత్తువ ఎక్కువైనను పొలముగూడ ఉలవరించును [నె]

ఉలవాయి = బండిచక్రపు రంధ్రములో, ఇరుసు ఆడకుండ బిగించు ఇనుప వలయము (బేరింగువంటిది); బళ [నె; వ; చె]

ఉలవేగలి=ఒక్కసారి సాగైనభూమి [అ]

ఉలస=చిన్న మంచినీటిచేప [నె, ం; శ్రీ; వి]

(2) ఓటిగడ్డి [నె-ఆత్మకూరు]

(3) వాకచేసు, వెల్లవలగులుచేను, పడవ; వాద; బాడవ [నె-ఆత్మకూరు]

(4) ఉలిపి [వ]

ఉలారం=(1) కడిలో తిరిగినపుడు కాళ్లు పాచి, జిలబొబ్బలు లేచినపుడు కల్గుదురద

(2) తలచుకొన్నపని అగువఱకు ఊరకుండలేక వెఱ్ఱెత్తిపోయిన ఆతురత [గు]

ఉలింత=(చూ) వలంత [నె-ఆత్మకూరు]

ఉలిపి=(1) కొయ్యలో పురుగు తొలుచునపుడు రాలుపొడి; కొయ్యమెత్తబడుట, ఒలిపి [నె]

(2) పశువుల దేహంపైనుండు బొల్లివంటి మచ్చలు; ఇవి ఉన్న పశువు ఎండకు ఓర్చుకోలేదు—*ఆ కోడెకు ఉలిపి ఉండబట్టి ధర తగ్గింది* [నె-పా]

ఉలిపికట్టె=అందరికంటె వేరుమార్గమున నడచువాడు; పెడద్రుడు; ఎవ్వరితోను పొసగనివాడు — *ఊరిదంతా ఒకదారి, ఉలిపికట్టెది ఇంకొకదారి* [నె; తె, గు]

ఉలిపొటు=నిట్రముగా నుండు నరుకుడు మొదలగునవి. వడ్రంగి ఉలితో వాలులేని వాదరవైపుతో నరికినప్పుడు ఏర్పడిన నిట్రపుఅంచువంటిది - అనుట (Steep) [నె]

ఉలిపిరికాయ=దుడుకుపిల్లవాడు [తె]

ఉలుకు=కామోత్సాహము—*ఉలుకు తగ్గించుకో* [కర్నూ]

ఉలుకుబట్టు = కొయ్య పాతది అగుకొలది సన్నపురుగులచే తొలువబడి బిగువుపీడు; ఉలిపిబట్టు [నె]

ఉలుకూడు = వరిపైరుకు తగిలెడు ఒక తెగులు—*వరిపైరు ఉలుకూడినది* [అ-పె]

ఉలుకూ పలుకూలేదు = సవ్వడిలేదు [వి]

ఉలోఉలోయనియమ్ము = బజారులో పరువమ్ముకొను [కరీ]

ఉల్లక్కి = ఉత్తుత్తి, ఉళక్కి [నె]

ఉల్లాకు = బంగారము పరీక్షచేసి నికరము నిర్ణయించుట, ఇది ప్రత్యేకమైనవిద్య [వి]

ఉల్లాము = చెరువు మొదలగు జలాశయములలో దరులవెంబడి, అరగాబిలోను ఏర్పడిన చిన్న సడియ

(2) చేపలువచ్చి చేరుటకు త్రవ్విన చిన్న గుంట; మరుగుగా ఉండుటకు ఇందు పాచిని వేచియుంతురు [నె]

ఉల్లారు = పులుపు పచ్చి తొలగుట;కొంచెము అరుట [కరీ]

ఉల్లిగడ్డ = ఎఱ్ఱగడ్డ; ఉల్లిపాయ [అ]

ఉల్లిడి = (చూ) ఉల్లెడ [అ]

ఉల్లిపావని = ఒకరకము పాడలపాము [వి]

ఉల్లుశ్శెక్కి = హుళక్కి [అ]

ఉల్లూరుగా = వదలువదలుగా, ఉల్లుళ్లుగా [కరీ]

ఉల్లెక్కిమాటలు = అబద్ధాలు [మ]

ఉల్లెడ = వివాహాది శుభాకార్యములలో పెండ్లివారు అరివేణి మొదలగునవి తెచ్చునప్పుడు, తెల్లదుప్పటిని, నలుగురు నాలుగు మూలల బట్టుకొని ఇంకొకరు కఱ్ఱతో నడుమఎత్తి డేరావలె జేసిన మేలుకట్టు, ముత్తయిదువులు దీనిక్రిందనే నడతురు, ఉల్లిడి [నె, వ]

ఉల్లెడగట్టు = ఇంటికి, సంస్కారము లేక బూజుపట్టు [మ]

ఉల్లెబట్టు = భక్ష్యములుచేయు పట్ల సొజ్జెను గోధుమపిండిలో పొదుపుట (పొదువుట) [శ్రీ]

ఉల్సర = భయము — *ఉల్సరపోయాడు పాపం!* [చి]

ఉసక = ఇసుక [అ]

ఉసలా = అవకాశము—*ఆవనికి నాకు ఉసలా దొరుకలేదు;* ఎసిలిక [కర్నూ]

ఉసలాయించు = ప్రయత్నముతో సమకూర్చు—*పైకం ఉసలాయించు* [నె-పొ]

ఉసి = (1) ప్రేరణ; *కుక్కను ఉసిగొల్పినాడు*

(2) దూకుటకుగా వెనుకకుపోయి, పరుగెత్తి శక్తిని పెంచుకొనునది—*వెనుకకుపోయి ఉసిదీసుకో* [నె; వ]

(3) పొడవు—*అ దూలము ఉసెక్కువ* [అ]

(4) ఉత్సాహము, సహాయము— *మావిల్లవాడుంటే నాకు ఉసిగా ఉండును* [నె-పొ]

(5) సందు, విరామము,

(6) వీలు, అవకాశము — *దానికి ఉసిలేదు* [అ]

ఉసికొయ్య = బండికి ఎద్దులు కట్టకుండా ఉన్నప్పుడు, బండి నొగను ఎద్దుల మెడపై ఉన్నట్లు ఎత్తి ఉంచుటకు ఉపయోగించు ఊతకొయ్య [తె]

ఉసిపాట = అంగభూతమగు గానము—*తందానతాన మొదలగునవి* [కర్నూ;నె]

ఉసిపెట్టు = ఉడికించు — కుక్కని ఉసిపెట్టాడు [వి]

ఉసిబెట్టు = ప్రేరెపించు, ఉసిగొల్పు [తె]

ఉసురు = (1) శిశ్నము [నె]

(2) ప్రాణము [నె, అ; ఎ]

(3) అన్యాయముగా ఒకనిని కష్టబెట్టినందుకు కలిగే పాపఫలము—*వాడిఉసురు తగిలింది* [గో, నె]

ఉసురుగొట్టై = పరులబాధించినందుల హాని కలుగు [నె-పొ]

ఉసురుతగులు = పాపఫలము — ఆమె ఉసురు నీకు తగిలినది [కరీ; వి; నె]

ఉసురుబోసుకొను = ఒకరిని బాధించి పాపము గట్టుకొను [వ; నె, అ]

ఉసురుముట్టు = ఒకరిని బాధించినప్పుడు ఆతని ఘోషతగులు [మ]

ఉసుళ్లు = (చూ) ఇసుళ్లపుట్ట; [కర్నూ; అ; వి]

ఉసూరుమను = కలిగించినబాధకు సంకట పడు; దుఃఖించు—నీమీద వాడు ఉసూరు మంటున్నాడు [నె; కర్నూ; తె; శ్రీ; వి]

ఉస్తి = సహాయము; తోడు, ఆసర [కర్నూ-పత్తికొండ]

ఉశ్లైక్క-దొడ్డము = అంతా అబద్ధము [కరీ]

## ఊ



ఊకదంపు = లేనిపోని మాటలుచెప్పుట; వ్యర్థప్రసంగము [గో]

ఊగడు వేగడు = ఎంతమాత్రము చలించడు [కరీ]

ఊగు = సంభోగించు [వ]

ఊగులాట = (1) అనిశ్చితమైన మానసిక స్థితి; డోలాయమానము.
(2) బ్రతిమలాడు—ఆయనను బట్టుకొని ఎందుకు ఊగులాడటం [నె; వ; అ; తె]

ఊచే = (1) ముదిరిన జొన్నలోనగు వాటి దంటు.
(2) బండికి కట్టిన సన్నటిబొంగులు [అ]
(3) బాణము [నె-పొ]
(4) కృశించినది [తె; నె]
(5) తీగెవంటి సన్నని కడ్డీ — కిటికీ ఊచలు [గో]

ఊచేకాళ్లు = ఊచవంటి సన్నని కాళ్ల [వ; నె]

ఊచేకోత = చాలామందిని ఒకేమారు అతి ఘోరంగా కోసివేయుట, సంఘాతహత్య

ఊచేనీచములు = మంచిచెడ్డలు [కరీ]

ఊచేపోవు = (చూ) ఈచుకపోవు [తె]

ఊచేబియ్యము = లేతజొన్నకంకిని ఊచతో గొట్టి తీసిన పాలజొన్నలు—పొట్టకరువు దిన్నవారికి ఊచబియ్యా మెక్కడిది [నె-పొ]

ఊచిపలుకు = గట్టిగా నొక్కి ఉచ్చరించు [కరీ]

ఊజ = (చూ) ఊజా [శ్రీ]

ఊజా = మరచెంబు [సే]

ఊజి = (1) గూళి, (చూ) ఊత [శ్రీ]
(2) చిన్న కోడిపిల్లలను కప్పిపెట్టుగూడు; జాబు [శ్రీ; నె-మెట్ట]

ఊట = (1) ఏదైనా వస్తువును (కరక్కాయ మొదలగునవి) నీటబోసి ఊరబెట్టి, వేడి చేయని రసము; అరిష్టము.
(2) గుంటలో ఏర్పడిన నీటిసెల — బావిలో మంచి ఊట ఉన్నది [నె; తె; అ]
(3) మామిడి మొదలగు పుల్లనికాయలను ముక్కలుగాకోసి ఉప్పుకలిపి కుండలో బోసి యుంచగా ఊరిననీరు [గో]

ఊటకాల్వ = ఏటిలో ఇసుకనెత్తి గుంట చేయగా దానినుండి సాగివచ్చు కాల్వ; సొనకాలువ [చి]

ఊటగారిపోయినది = బొంగపడి మడిలోని నీరు బయటికి పోయినది [శ్రీ]

ఊటి=వెలగలు వేయు గట్టిపాటి అడవి చెట్టు; వీటి మెల్లెలను ముల్లుకఱ్ఱలకు ఉప యోగింతురు [నె]
ఊటు=(1) తడిచే చితచితలాడి, నెమ్ముపై కెక్కుట—*ఇల్లు ఊటెక్కినది.*
(2) నీరు ఊరేకాలువ—*ఊటుకాలువ.*
(3) నోటితో నీరు మొదలగు వాటిని ఎగ పీల్చుకొనుట—*గంజి ఊటుకో* [నె]
(4) పసిపిల్లలు పలుచగా నీళ్లనీళ్లుగా కొద్దిగా బయటకు పోవునది [వ; గు]
(5) అప్రయత్నముగ రోగమువలనగాని భయమువలన గాని గుదస్థానము నుండి స్రవించునీరు — *వానికి ఊటుకారు చున్నది* [నె-పొ; నె; తె, వ]
ఊటుకారిపోవు=(1)నిర్వీర్యమగు—*అయ నకు ఊటుకారిపోయింది* [నె; ; తె; వ]
(2) కాలక్రమేణ ఒక వ్యవహారము దిగ జారి అంతరించిపోవు [గో]
ఊటుకార్చు=సన్నపిల్లలు తెలియకనే కొద్ది కొద్ది మలము వదలుట [కర్నూ; గో]
ఊటుగార్చుకొను=భయపడు — *నాపేరు వింటే ఊటుకార్చుకుంటాడు* [వ]
ఊటుదాకుడు=(చూ)ఊడుదోక; ఊడదోక [అ-పె]
ఊడదోకలోడు=అప్రయోజకుడు; ఊడు దోక; ఊటుదాకుడు; ఉడ్డోకు[అ]
ఊడు=నాటుకొను, (ఊడుకొనినదే ఊడ) *మఱ్ఱి ఊడ* [గు]
ఊడుదోక=పనికిమాలిన — *వాడు వట్టి ఊడుదోకవాడు*; ఊటుదాకుడు, ఊడ్డోకు [నె, అ]
ఊడ్డోకు=(చూ) ఊడుదోక [చి]
ఊత=పిండిపట్టుటకు వెదురుబద్దలతోనల్లిన జల్లెడవంటి వస్తువిశేషము [వ. గో]
ఊతప్పం=(1) పులిబొంగరము.
(2) మసాలావేసి, దోసెవలెగాక లావుగా పోసిన తినుబండారము [నె; చి]
ఊతాని=నడువలేనివాడు [చి]
ఊదగాలి=తూర్పునుండి వచ్చేగాలి; పైరు గాలి; పైరగాలి [గు]
ఊదర=(1) ఎలుకల,పందికొక్కుల కలుగు లోనికి, ఒక ద్వారముగుండా గడ్డిపొగ ఊది, ఊపిరి ఆడనీయక చంపివేయు విధము—*పందికొక్కులకు ఊదరబెట్టు.*
(2) కష్టపెట్టు—*ఊరకే ఊదరబెట్టివేసి నాడు* [కర్నూ; నె; అ; తె]
(3) పనికిరానిగడ్డి ధాన్యము, ఇది బాగా వడ్లలో కలిసిపోవును, ఒడిపెళ్ల [నె]
ఊదరకాయ=పొగతో మక్కించిన అరటి కాయ; పొగవేసినకాయ [చి]
ఊదరగొట్టు=(1)అరటిగెలలనుఒకగదిలో పేర్చి వానిమీద వట్టి (ఎండు)గడ్డికప్పి,ఆ పైనబందపూసి, ఉదయాస్తమయములందు ఒక్కొక్కగంటసేపు వట్టిగడ్డికి నిప్పం టించి మంటరాకుండ పొగవచ్చునట్లుచేసి, ఆ పొగను ఊది ఆ అరటిగెలలోకి జోరుగా పోవునట్లు చేయునది ఇట్లు చేసినచో రెండు రోజులలో ఆ పచ్చి అరటిగెలలన్నీ (మక్కును) ముగ్గును [గో]
(2) గాలికొట్టు [చి]
(3) రెచ్చగొట్టు [వి]
ఊదా=(1) వంగపండురంగు
(2) నీలివన్నె; నీలము—బ్లూ [నె; తె]
(3) నేరేడువన్నె—Violet [అ]
(4) అసూయవల్ల కలుగుబాధ — *నేను ప్యాసైనానని వాడు ఊద పటలో వున్నాడు* [నె-పొ]
ఊదిపండు=విభూతిపండు [మ, న, కరీ]
ఊదు = (1) బంగారము వెండి-యందలి మాలిన్యమును కాకలతో తొలగించు [కర్నూ. గు]
(2) జలాశయములలో, ముఖ్యముగా ఊతతో చేపలుపట్టుట [నె; వ]

(3) రహస్య విషయములను మెల్లిగా చెవులోచెప్పి ప్రోత్సహించు — *ఏదో చెవిలో ఊది పోయినాడు* [నె]

(4) దేహము నీరెక్కి ఉబ్బుట — *వాడు ఊదెక్కినాడు* [నె, తె, అ]

**ఊదుకడ్డి**=ఊదొత్తి; సాంబ్రాణికడ్డీ, అగరువత్తి [అ, సే]

**ఊదువత్తులు**=సాంబ్రాణికడ్డీలు [నె]

**ఊదుగింజ**=పశువులచేత నీళ్లు తోడించునపుడుపయోగించు సాధనము [నె]

**ఊదుబలుపు**=(చూ) ఉబల [నె]

**ఊదువాసన**=మజ్జిగ, పెరుగులకు కలిగెడు ఒక చెడ్డవాసన—*బూజువాసన; పులసరపు వాసన* [అ, నె]

**ఊనాక**=బలహీనమైన, ఊనాకి [అ]

**ఊనాపి**=(1) శక్తిహీనుడు [చి]

(2) వికలాంగుడు [అ]

**ఊప**=నపుంసకుడు, ఊబ

**ఊపట్లు**=ప్రోత్సాహం, బెదిరించు [అ]

**ఊపిరితీయు**=బాధించు, బలవంతముచేయు—*ఆబ్బిమ్మని నా ఊపిరితీస్తున్నాడు*[నె]

**ఊపిరిపోసుకొను**=బ్రతుకు [తె, నె]

**ఊపు**=భయపెట్టు [వ]

**ఊపురము** = ఎద్దు మూపురము; చెండు [కరీ]

**ఊబగడ్డి**=(1) ఒకవిధమైన అడవిగడ్డి; ఊబచెత్త [నె-పా]

(2) ముండ్లుగలగడ్డి [అ; ప]

(3) మేతకు పనికిరానిగడ్డి, దీనితో పొరకలు చేయుదురు; చీపురుగడ్డి [అ, నె, తె]

**ఊబచెత్త**=(1) పనికిమాలిన లావాటి శరీరము [కరీ]

(2) ఊబగడ్డి [నె-పా]

**ఊబి**=చాలలోతుగావున్న మెత్తటి బందనేల. ఇందులో దిగబడిపోయినచో లాగుకొని బయటబడుట కష్టము, ఇది ప్రాణాంతకమైన తడినేల, ఉమ్మలి, ఉబ్బలి (Quick Sands) [గో]

**ఊరకాడు**=(1) బావమరది; వీరగాడు, (2) వియ్యమందినవాడు [శ్రీ]

**ఊరముత్తయిదువ**=స్వైరిణి [కరీ]

**ఊరబావి**=(1) గ్రామమున కంతటికి త్రాగు నీటికి ఉపయోగించు ఉమ్మడినూయి [కర్నూ, నె, తె, అ]

(2) అడుగని వానిది పాపముగా అందరితోను వ్యభిచరించు స్త్రీ [గో]

**ఊరబ్బునారబ్బు**=ఎక్కువ గలాటా [అ-పె]

**ఊరవాకిలి** = గ్రామములముందు ఉండు ప్రవేశద్వారము; గవని, గమిడి [కర్నూ]

**ఊరవిందు**=గ్రామములలో కార్యములపట్ల ఊరి ఇండ్లవారిని పిలిచి పెట్టు భోజనము-*ఊర విందు చేసినారు* [నె; తె, వ]

**ఊరాయూరెడు** = ఊరిలోనుండు వారందరు [కరీ]

**ఊరించు**=ఆశబెట్టు — నోటిని ఊరించు అని—*ఇస్తాను ఇస్తానని ఊరించినాడు* [నె, తె, అ]

**ఊరిదేవర**=గ్రామజాతర [అ]

**ఊరినవు**=లావుగ అయినావు అనుట, ఊరినావు [మ, నె]

**ఊరివిందు**=(చూ) ఊరవిందు [అ]

**ఊరీలు**=పుల్లటి పదార్థములు తినునపుడును, తినుచుండగా చూచునపుడును నోటిలో ఊరు నీరు; నోరూరు—*అతనికి ఊరీలు వస్తున్నవి* [వ]

**ఊరీలుగొట్టు** = లొటకలువేయు, లొట్టలువేయు [వ]

**ఊరుకాలవ** = (1) పల్లపు పొలమునందు, పచ్చి రొట్టపైరులకు చల్లుటకు ముందు అందలి నీరుపోవుటకు ముందుగా తీయు చిన్నకాలువ [నె]

(2) చిన్న కాలువ, ఊరుగాలువ; ఊరు కాల్వ [చి]

**ఊరుకోపట్టదు**=ఊరకే ఉండదు — *కత్తి వున్న వాడిచెయ్యి, కంపఉన్న వాడి చెయ్యి ఊరుకోపట్టదు* [వి]

**ఊరుకోబెట్టు**=ఊరక కూర్చుండబెట్టు; పని లేకుండా జేయు — *వాడిని ఊరుకోబెట్టి జీతం యిచ్చినా* [నె]

**ఊరుబిండి**=(1) బండపై నూఁరిన పచ్చడి [నె-మెట్ట, రా; ఎ]

(2) తొక్కిన పచ్చడి [తె]

(3) తెలకపిండి నానవేసి చేసిన పచ్చడి [శ్రీ]

(4) వడియములనిమిత్తము కలుపు మినుములపిండి [ప-గో]

**ఊరుబిండివడియము** = ఊరవేసిన వడియము [వి]

**ఊరుమిండి**=(1) పచ్చడి, ఊరుబిండి

(2) ఊరవేసినదాని నిలువతో చేసినది — *మామిడికాయ ఊరుమిండిపెట్టినా* [కర్నూ, అ]

**ఊరువుహాము**=గ్రామమందలిజనసమూహమంతయు [కి; గుం]

**ఊరేగు** = (వ్యంగ్యముగా) చెడ్డను ప్రదర్శించుకొను; వివాహ ఉత్సవములోవలె తిరుగాడు; ఇది ముఖ్యముగా ఆడువారి తిట్టు—*నీదంతా ఊరేగగదరా* [నె]

**ఊర్పు**=అడుగూర్చిన యంటు, మైలపాత్ర [కరీ]

**ఊలపుట్టు**=సంకల్పము పుట్టిపచు —*అతనికి వారందరిని చూచి ఊలపుట్టినది* [కరీ]

**ఊలబడు**=కాలువలలో చిన్నకంత లేర్పడి నీరు బయటికిపోవు; బొంగబడు [గు]

**ఊల**=(1) చచ్చు; బలహీనత — *వానికి ఊలపుట్టింది* [అ; కర్నూ]

(2) కృశించు-*వాడు ఊలపోయినాడు*[నె]

(3) నక్కకూత; ఊళ [వ]

**ఊలబొక్క**=నీటి కడ్డముగా గట్టినగట్టులో (ఏర్పడిన) పడిన సన్నని రంధ్రము; దీని గుండా నీరు కారిపోవుచు, క్రమముగా రంధ్రము పెద్దదై తుదకు గండిపడును; బొగిద [గో]

**ఊళ**=నక్కకూత—*గుంతనక్క ఊళ వేసింది;* ఊల [చి]

**ఊస**=నూలును చుట్టుకొను చిన్న కొయ్య సాధనము [చెం]

**ఊసిపోవు**=(1) చెడిపోవు; పాచిపట్టు [చి]

(2) జబ్బుచేత తలవెంట్రుకలు ఊడిపోవు —*తలంతా ఊసిపోయినది*

(3) ఇష్కించు [నె; అ, తె]

(4) ధాన్యము రాలిపోవు [కర్నూ - పత్తికొండ]

(5) చాయ మాసిపోవు; ఎక్కువగా రంగుపోవు—*చీర ఊసిపోయింది* [నె]

(6) సంబంధము తెగిపోవు—*ఆ కార్యము ఊసిపోయినది* [అ-పె]

**ఊసు**=(1) బలహీనమైన [అ]

(2) పశువుల చర్మములను చెడిపోకుండా తయారుచేయుట, ఊను [నె]

**ఊసుబోవు** = సన్నబడు — *ఊసుపిల్లలవాడు.*

(2) దుర్బలమగు ; ఊలపోవు [నె-పొ]

**ఊష్ణము**= జ్వరము [వి]

ఎంకమ్మ=పిన్నమ్మ [వి]

ఎంగిలి=రెండు అడుగులు పొడవున ముల్లు గల చేప [శ్రీ]

ఎంగిలిచుడుము=గుండ్రని బిళ్లగా ఏర్పడు గజ్జివంటి చర్మవ్యాధి; ఎంగిలిచుఱుకు; ఎంగిలిచురుడు [నె, తె]

ఎంగిలిచుఱుకు = (చూ) ఎంగిలిచుడుము [అ· తె]

ఎంగిలిచురుడు = (చూ) ఎంగిలిచుడుము [కర్నూ]

ఎంగిలిచేయు = (1) అస్వస్థత తరువాత మొదటసారిగా అన్నముతిను; పథ్యము బెట్టు [నె; అ]
(2) తిను, ఎంగిలిపడు [వ]

ఎంగిలిపడు = (చూ) ఎంగిలిచేయు [తె; కర్నూ]
(2) తిను [వి]

ఎంగిలిబంతి=క్రొత్త పెండ్లి జంట ఒకరి విస్తరిలో మరొకరు అన్నకబళముల ఎత్తుకొనుట [కరీ]

ఎంచు=(1) దూషించు [తె]
(2) విమర్శించు [నె]

ఎంటవ=ఒక ముంగిసజాతి, చెరకుతోటలందుండును, మెంటవ [చి]

ఎంటువ = ఉడుముజాతిలో భేదము. దీనిని పట్టి వండి తిందురు [నె-పొ]

ఎంటి=గడ్డితో ఒకేపురిగా పేనిన (పట్టిన) మోకు; వెంటి [నె; అ, తె; చె]

ఎంటు=వరిగడ్డి పురికితాడు; ఎంటి; వెంటి [చె]

ఎంటె = చెరకుగడల ఆకులను పెఱుసు (పెనవేయు) తీరు [చె]

ఎండబడు=ప్రొద్దెక్కు — *ఎండబడి లేచినాడు* [నె; కర్నూ; తె; అ]

ఎండవ=ధాన్యాదులను ఎండబెట్టు పర్యాయము—*రెండు ఎండవలైనవి*; ఎండుగు [నె]

ఎండిపోవు=కృశించు—*బిడ్డ రోజురోజు ఎండిపోతున్నాడు* [నె-పొ]
(2) పశువు పాలిచ్చుకాలము సమాప్తమగు; వట్టిపోవు [నె, అ]

ఎండుగు=ధాన్యమెండబోయుట, ఎండవ [కరీ]

ఎండె=(చూ) ఇండె [నె]

ఎండెక్కు=(చూ) ఎండబడు [అ]

ఎండేయు=ఒకనిని మాయచేసి వస్తువులు తీసుకొను [శ్రీ]

ఎంతోఅంత=(1) కొంతఅయినా,
(2) అధికము—*ఎంతో అంత ఇవ్వండి; అది ఎంతో అంత గొప్పగా ఉంది* [వి]

ఎందుకు=ఎక్కడకు—*ఎందుకు పోతావు* [సే]

ఎంపగొడ్డు=బఱ్ఱె, గేదె, ఎనుము [కర్నూ]

ఎంపిక=ఎన్నిక [వి]

ఎంబ=చీకాకు, కష్టపరిస్థితి—*ఇంట్లో చాల ఎంబగా వున్నది* [నె; తె]

ఎకటాయించు = ఎదిరించు; నిర్లక్ష్యము చేయు—*వాడు నామాట ఎకటాయించినాడు* [నె]

ఎకసికము=ఎగతాళి, చాత్రి—*అంతా ఎకసికము పడుతున్నావే*, ఎకసక్యము; ఎగసికము [నె; గో; తె]

ఎకాయికి=(1) నేరుగా, తిన్నగా [గు]
(2) త్వరగా [నె]
(3) ఒంటరిగా; ఎకాయెకి.

ఎకిలి=(చూ) సగిలి [అ]

ఎకిలి=అవివేకి—*వాడు ఎకిలి వెధవ* [తె]

ఎక్కబెట్టు=(1)ప్రోత్సహించు-లేనిపోనివి చెప్పి ఎక్కబెట్టినాడు [నె-పొ]
(2) లేని ఆధిక్యము కల్పించు—వాడిని బాగా ఎక్కబెట్టి నెత్తికి తెచ్చుకొన్నాడు [నె]

ఎక్కలాగు=త్రుంచివేయు [శ్రీ]

ఎక్కవేయు=(1)దీపపువత్తిని పైకిత్రోయు—ఆ దీపాన్ని ఎక్కవేయి [నె]
(2) నీళ్లతగ్గిన సమయములో కాలువ నీరు దూరమునుంచి నడిపించుకొనివచ్చు—తోటకు నీళ్లు ఎక్కవేసినా [నె]

ఎక్కళ్లు=సాహుకారువద్దచిన్నకుండతో కొలిచి తీసికొని, పెద్దకుండతో ధాన్యము కొలిచి తిరిగి చెల్లించునది; నాము; నాగు [కరీ]

ఎక్కా=కందిలిబుగ్గ [కరీ]

ఎక్కాచిక్కం=అర్థంకాని స్థితి. ఆ లెక్క లన్నీ ఎక్కాచిక్కంగా ఉన్నవి [చి]

ఎక్కించు = ఊరక ఒకనిని గొప్పచేయు; ఎత్తిపెట్టు [తె]

ఎక్కిడి=ఒక పనిని చేయించుకొనుటలో చూపు శ్రద్ధ; తీవ్రప్రయత్నము; ఆతురత—ఎక్కిడిచేసి పని నెరవేర్చుకొన్నాడు [శ్రీ]

ఎక్కితక్కి = చాల సమృద్ధిగా నుండుట; ఎక్కితొక్కి [గు; తూ-గో]

ఎక్కితొక్కి = చాలఎక్కువ — అన్నం ఎక్కితొక్కినట్లుండినది;ఎక్కితక్కి[నె]

ఎక్కుడు=దారిలో మిట్టగానుండి ఎక్క వలసిన (కష్టముతో నడవవలసిన) ప్రదే శము; చడావు, ఎగమారు × దిగుడు—ఇల్లు ఎక్కుడులో నున్నది [నె; అ; వ]

ఎగఊపిరి= (1) అవసానకాలస్థితి—వానికి ఎగఊపిరి పుట్టింది [తె]
(2) పరుగెత్తుటలో ఏర్పడిన అలపుతో గూడిన రొప్పు — వాడు ఎగఊపిరితో వచ్చినాడు [నె]

ఎగగొట్టు=(1) ఎగవేయు; ఇవ్వవలసిన దానిని ఇవ్వకుండుట, ఎగనూకు; ఎగబెట్టు; ఎగ్గొట్టు [కర్నూ; నె]
(2) పని మాను [అ]

ఎగజెప్పు=లేనివి యున్నవి కలియవేసి చెప్పు [కరీ]

ఎగజేదు=ప్రక్కలు (డొక్కలు) క్రిందికి మీదికి ఊరక చలింపజేయు [కరీ]

ఎగజేపు=(1) పాడిపశువు పాలుఇవ్వకుండ ఎగగొట్టు.
(2) సహాయము చేయక నిరాకరించు [నె, అ, తె]

ఎగదట్టు = పొగరెక్కు—వాడికండ్లకు ఎగ దట్టింది [నె]

ఎగదన్ను=కాలువనీరు అడ్డగింపబడి,ఉబ్బి పైకి ఎగప్రాకు — కాలువ ఎగదన్నినది [నె; కర్నూ; వ, అ]

ఎగదోకు=ఎక్కివచ్చు [గు]

ఎగదోచుకొను=కష్టమునులెక్కబెట్టకుండ ప్రవర్తించు — జ్వరం వచ్చినా ఎగ దోచుకుంటూ వచ్చినాడు [నె]

ఎగదోలు=(1) బీటిగడ్డిని సొంతపశువులు మేసివేసిన తర్వాత, ఇతరుల పశువులకు వదలివేయు [నె]
(2) ఒకరిని ఇంకొకరిపైకి పురికొల్పు [నె; వ]
(3) పశువులను మోటదారిలో పైకితోలు [అ]

ఎగద్రోయు=(1) పనిలో సహాయపడు — ఆయన ఆపని యీపని ఎగద్రోసినాడు
(2) లెక్కబెట్టకుండ ఉపేక్షించు-జబ్బును ఎగద్రోచుకొంటూ వచ్చినా [నె]

ఎగనామంబెట్టు=(1) ఇవ్వవలసిన ఋణ మును ఎగవేయు [నె; కర్నూ; తె]
(2) మోసగించు [అ]
(3) చేసినమేలు మరచు [అ]

ఎగనెత్తు = క్రిందికి పైకి కలియబెట్టు—*గింజలు బాగా ఎగనెత్తు* [నె]

ఎగపెంటె = ఒకేపూట నాగలికి కట్టిన ఎద్దులజత [మ]

ఎగబడు = (1) పైకిలేచు [కరీ]
(2) ముందుకు నెట్టుకొనిపోవు — *దానికి జనం ఎగబడినారు* [నె]
(3) గద్దించు [వ]
(4) తొందరతో గూడిన ఆస్తు [శ్రీ]

ఎగబెట్టు = (1) చేయవలసిన పనిని చేయక మానుకొను [నె-పొ]
(2) ఋణాదుల ఎగవేయు [తె]

ఎగబోయు = (1) రాశిలో ధాన్యమును పైకి నెట్టిపోయు [నె]
(2) ఆయాసపడు, భుక్తాయాసము చెందు —*ఎగపోసుకుంటున్నాడు* [అ, కర్నూ]
(3) ఆయాసముతో ఎక్కువ గాలి పీల్చుకొను [తె]
(4) ఏడ్చు — *ఎక్కెక్కి ఎగపోస్తున్నది* [వ]

ఎగబోసుకొను = ఎగశ్వాసతో బాధపడు—*కుతికలమయుకు దిని, ఎగపోసుకుంటున్నాడు* [నె-పా]

ఎగమారు = (చూ) ఎక్కుడు; చెడావు [తె]

ఎగర = కోడి [వి]

ఎగరవేయు = (1) తూర్పారబట్టు [శ్రీ]
(2) తిరుగబడు — *నన్ను ఎగరవేసిపోయినాడు; ఎగురవేయు*
(3) తిరస్కరించు—*నామాట ఎగరవేసినాడు* [నె]

ఎగవెట్టు = పనికిరాకుండ ఉంచు [మ]

ఎగరొప్పు = అపసానములో బుట్టు ఎగశ్వాస —*ఎగరొప్పుపడింది ఇక బ్రతకదు* [నె-పొ]

ఎగవేయు = (1) పొరుదల నీరు తక్కువైనప్పుడు, దూరమునుండి నీటిని మళ్లించుకొనుచు వచ్చి, కావలసిన కాలువగుండా పారించుకొను — *దూరంనుండి ఎగవేసికొనిరా; ఎక్కవేయు* [నె]
(2) ఎగగొట్టు [కర్నూ; నె]
(3) వడ్లు దంచినప్పుడు బయటికి వచ్చు గింజలను రోటికి చేర్చు —*ధాన్యం ఎగవేస్తున్నారు* [వి]
(4) చెదరిమేయు పశువులను దూరం నుండి ఒకటిగా (మందగా) చేర్చుకొనుచు వచ్చు [వ]
(5) ఒకస్త్రీని లేవదీసుకొనిపోవు [వ]
(6) అప్పుతీర్చకుండు [అ, నె]

ఎగసన్రద్రోయు = దీపము వత్తిని పైకిలాగు; ఎగదోయు [కరీ]

ఎగసిపోత = బాగరు; అహంకారము — *ఇంత ఎగసిపోతకూడదు* [వ]

ఎగాదిగా = (1) ఎగువకు దిగువకు; పైకి క్రిందికి—*ఎగాదిగా చూచినాడు*
(2) క్రమములేకుండా చేయు; పని చెరచు —*పనినంతా ఎగాదిగా చేసినాడు*
(3) ఆశ్చర్యముతో చూచు [నె, కర్నూ; అ, తె]

ఎగాదిగా మాటలాడు = అగౌరవముగ మాటలాడు [నె]

ఎగిరింతఎద్దు = మనిషి ఎక్కిపోవుటకు మచ్చిక పడిన ఎద్దు [నె]

ఎగిరిపాటు = మిడిసిపడుట; మిట్టిపడుట [గో]

ఎగుజెమ్మ = సులభముగా పైకిప్రాకు చెమ్మ (తేమ) గలప్రదేశము — *ఎగుజెమ్మనేల* [నె, తె]

ఎగుడు = (చూ) ఎక్కుడు × దిగుడు [కర్నూ]

ఎగుదల = (1) పైవైపు; పైకట్టు; ఎగుదాల [నె; కర్నూ, అ-పె]
(2) అభివృద్ధి—*వాని సంసారము ఎగుదలలో ఉన్నది;* ఎగసాన [రా]

ఎగుడుదిగుడు = (1) మిట్టపల్లము,

(2) సరళమైన నడవడికలేని — వాడు ఎగుడు దిగుడు మనిషి; దారి ఎగుడుదిగుడుగా నున్నది [నె; కర్నూ, తె, అ]
(3) పెద్దచిన్న గుర్తించకుండుట—ఎగుడు దిగుడులుగా మాట్లాడితే తన్నులు తగులుతాయి [గో]
ఎగుపొగరు = ఊరకే త్రుళ్లిపడుచుండుట —వాడు ఎగుపొగరుమనిషి [నె; అ-పె]
ఎగుబున ప్రాణము పోవుసమయములోని స్థితి, ఎగశ్వాస [తె]
ఎగురవేయు = (చూ) ఎగరవేయు [నె]
ఎగురుగాఉండు మేలుగానుండు — కోడె కంటె గిత్తె ఎగురుగా ఉన్నది [నె-ఆత్మకూరు]
ఎగూపగూ = హెచ్చుతక్కువలు [చి]
ఎగ్గలితనము = వెంగలితనము [కరీ]
ఎగ్గామగ్గా = ఇష్టం వచ్చినట్లు—ఎగ్గా మగ్గా తింటున్నారు [చి]
ఎగ్గు = భేదభావము; ఆధిక్యము, — ఆయన ఎగ్గులేని మారాజు [తె, నె]
ఎగ్గూపగ్గు = భేదభావము—ఎగ్గూపగ్గు లేని వాడు [చి]
ఎగ్గొట్టు = పాడిపశువు పాలివ్వకుండా ఎగవేయు; ఎగగొట్టు [కర్నూ]
ఎగ్గోపు = వేళాకోళము [అ]
ఎగ్గోలు = ఎనిమిదికాళ్ల విషకీటకము [చి]
ఎచ్చం = కూరల మసాల—ఎచ్చం కొను క్కొనిరా; వెచ్చం [మ]
ఎచ్చు = చిన్నపిల్లలు చేయుచేష్టలు — వాడికి ఇంకా ఎచ్చుపోలేదు [శ్రీ]
ఎచ్చులకారిపిందె = తన్నుతాను ఎక్కువజేసికొని ప్రవర్తించువాడు—ఆయన ఐతే ఎచ్చులకారిపిందె; జంబాలకారి [నె]
ఎచ్చులకారి = డాంభికుడు; జంబాలకారి [నె]
ఎచ్చిడి = (1) లేనిగొప్పలు [మ; కరీ]
ఎచ్చీపచ్చీ = (1) సరిగా వక్కమునకురాని

(2) కాలీకాలని [నె]
ఎటకాయించు = అటకాయించు [వ: అ]
ఎటమటము = (1) వికటము
(2) పొడగుట
(3) ఇటువి అటు, అటువి ఇటు చేయుట [మ]
ఎటామొటి = అసమ్మతితో ముక్తసరిగా మాట్లాడుట; ఎట్లామొట్టీ—వాడు చప్పుగా ఉండక ఎటామొటీగా ఉంటాడు [గో]
ఎటుతు = ఎంతవరకు [కరీ]
ఎటుబట్టి = ఏ విధమునవైన [కరీ]
ఎట్టు = వేడి—ఎట్టు చేసింది [తె]
ఎట్టుముగొట్టు = ఊడ్చుకొనిపోవు [కరీ]
ఎట్టామొట్టి = (చూ) ఎటామొటి
ఎట్టి = (1) గ్రామములో పెద్దరైతుకు చిల్లర రైతులు చేయు కూలీలేనిపని- ఇది ఏడెకరా కొన్ని దినములు చేయుటగలదు, ఎట్టుకూలి, వెట్టి.
(2) ఊరకే, నిర్లక్ష్యముగ—దానిని ఎట్టికి పారవేసినారు [నె; కర్నూ, అ]
(3) కర్చులేనిది, వెట్టి [వ]
ఎట్టు = నాణెములను అచ్చువేయు మూస [చి]
ఎట్టుకూలి = ఉచితశ్రమ
ఊరిపెద్దకు కూలీలు ఉచితంగా పడుశ్రమ; ఎట్టుమడకలు; వెట్టి [చి]
ఎడ = (1) సాధారణమైన ఋతువుతప్పిచేయు సేద్యము—ఎడకారుపైరు [నె; వ; అ]
(2) చెట్టుకాయు మూడవకాపు— ఎడకాపు [చి]
ఎడ = నైవేద్యము [అ; మ]
ఎడకట్టు = కురుపుచుట్టును గుల్లలు పగులు [అ]

ఎడకాల్వ=నీరు పలచబడినకాల్వ; నీళ్లు పారుట నిల్చిపోయిన కాలువ — అది *ఎడగాలవ పడిపోయింది* [చి]

ఎడతెగు = (1) పూర్తిఅగు
(2) పరిష్కారమగు, వగతెగు—*ఆ పని ఎడతెగలేదు* [నె; వ, అ]

ఎడతెరిపి = విరామము—*ఎడతెరిపి లేనిపని* [నె, కర్నూ, వ, అ]

ఎడపడు = మధ్య వ్యవధినిచ్చు [కరీ]

ఎడపిల్ల = తల్లికి మరొక సంతానం కలిగిన తర్వాత, ఆ మొదటిపిల్ల రెండవబిడ్డను ఎత్తుకోగల యీడుగలపిల్ల [మ]

ఎడపెడ = అటుఇటు, రెండుప్రక్కలా —*ఎడపెడ చెంపలు వాయించినాడు* [నె]

ఎడపెడగా = సందులుండురీతిగా [అ]

ఎడమకుడి = (1) కొంత మంచి కొంత చెడ్డగా [కరీ]
(2) స్వల్పమైన భేదము—*వాటికి ఎడమ కుడి భేదం* [నె]

ఎడమచేయిచూపు = (1) డబ్బు ఎగగొట్టు
(2) సాయమునిరాకరించు, వామహస్తము చూపినా డనుటవంటిది [వ]

ఎడమొగము పెడమొగము = విముఖము; విరోధం [కరీ]

ఎడవాపులు = కొంచెము పెద్దదిఅయి తల్లిని విడిచి తిరుగు కోడిపిల్లలు; ఎడలు [మ]

ఎడిగల = వేరే [కర్నూ]

ఎడిగలబోవు = వేరుపడు [కర్నూ]

ఎడివ = మొరటువాడు; ఎడ్డె [తె]

ఎడివి = తట్టుకొనివడుట—*వాడు రాయి ఎడివినాడు* [తె]

ఎడుపు = ఎడముచేయు [నె]

ఎడుపువేయు = పలుచనగానున్న పైరులో నడుమ నడుమ పైరునాటి ఒత్తుచేయు [నె]

ఎడ్డి = (1) మోటు—*ఎడ్డిమనుష్యు డేమెరుగు* [అ;నె]
(2) మురికి
(3) చెడ్డ—*ఎడ్డిపని* [కృ]

ఎడ్డిమడ్డి = మొరటు—*ఎడ్డి మడ్డి తిండి* [నె; తె; అ]

ఎడ్డెమంటే తెడ్డెమను = అవునంటే కాదను [నె-పొ]

ఎడ్డెమడ్డె = మొరటు; ఎడ్డిమడ్డి [కర్నూ]

ఎత్తక తిను = యాచించి పొట్టపోసుకొను, ఎత్తుకతిను, అడుక్కతిను [నె, కర్నూ]

ఎత్తడి = (1) ఎత్తైన — *అతడు నాకంటె ఎత్తడి మనిషి* [కరీ]
(2) చేలకు తోలిన క్రొత్తమన్ను—*ఎత్తడి తోట* [అ]

ఎత్తలి = ప్రవాహమువలన పొలములలో పెట్టిన ఇసుకదిబ్బలు; మేట [నె]

ఎత్తించు = వ్రతము మున్నగునవి పూర్తి అయిన తర్వాత ఉద్వాసన జేయించు [కరీ]

ఎత్తికొనివెళ్లు = దొంగిలించు పట్టుకొనివెళ్లు [దివి-తాలుకా-కృ]

ఎత్తిడి = చేపలు పట్టుటకు ఉపయోగించు, పొడవు వలయాకారపు వల; ఇది మూతి వలయమునుండి చివరికి పోనుపోను సన్న గిలిపోవును; ఎత్తిలి [శ్రీ]

ఎత్తిన = అత్యంతముతగిన—*ఆపనికిఆయన ఎత్తినవాడు* [నె; అ]

ఎత్తినచేయి = పేరు మోసినవాడు; మిక్కిలి సమర్థుడు [కర్నూ; అ,తె]

ఎత్తిపంపు = కొనిన సకలసామగ్రిని కట్టి, కొనినవారి యింటి కప్పగించు [కరీ]

ఎత్తిపెట్టు = (1) ఒకరిని అనవసరముగా పెద్దజేయు—*ఆయనను ఎత్తిపెట్టి దాని ఫలితం అనుభవించినాడు* [నె]

(2) కట్టిపెట్టు—*నీవు ఆ విషయము ఎత్తి పెట్టు* [అ-పె]
(3) చేస్తూచేస్తూ వున్నపనిని మధ్యలో మానివేయు [గో]
(4) నిందించు [అ]
(5) అన్నీ పూర్తిచేయు [శ్రీ]
(6) ఆగిపోవు—*అమ్మకాలు ఎత్తిపెట్టాయి* [వి]
(7) తాత్కాలికముగ చాలించు—*ఆ పని యెత్తిపెట్టి, ఇది ప్రారంభించావా?* [నె-ఖా]

ఎ_త్తిపోత, దించిపోత = సేతబడిని మాన్పుటకు చేయు కార్యక్రమము [కరీ]

ఎ_త్తిపోతల = జలపాతముయొక్క దార్లు

ఎ_త్తిపోయు = తిట్టు, నిందించు—*ఇది వారు విందే మేమేమో చేసితిమని మమ్ము ఎత్తిపోస్తారు* [నె-ఖా]

ఎ_త్తిపోవు (1) అత్యధికముగా రాణించు—*ఆ నగలతో ఆమె ఎత్తిపోయింది*
(2) చల్లిన విత్తనములు మొలవకుండాపోవు—*చల్లకం ఎత్తిపోయింది* [నె]
(3) దివాలాదీయు — *వాని సంసారము ఎత్తిపోయింది* [తె]
(4) తీరిపోవు; పూర్తియగు — *దానితో అప్పు ఎత్తిపోయింది* [తూ-గో]

ఎ_త్తిరిల్లు = (1) వికసించు
(2) అభివృద్ధిజెందు — *ఆ యిల్లు ఎత్తిరిల్లింది* [శ్రీ]

ఎ_త్తిళ్ళి = సంచివలెనుండు చిన్నచేపల వల; ఎ_త్తిడి; ఎ_త్తెల [నె]

ఎ_త్తివచ్చినోళ్లు = చెడివచ్చి వేరుగ్రామము చేరినవారు [చి; నె]

ఎ_త్తివచ్చు = ఒకచోటినుండి మరొకచోటు జేరు [తె]

ఎ_త్తివేయు = అనవసరముగా ఒకరిని పెద్ద చేయు [గు; సర్కా]

ఎత్తు = (1) ఒకటిన్నరవీశె — *60* ఎం॥ ములు [చి]
(2) ఒక మానిక [అ]
(3) బరువు (లేక) రెండుపీసెల ప్రమాణము — *పావలాఖ మూడెత్తుల ఎంత తాయు* [నె-ఖా]

ఎత్తుకట్టిన పశువు = దేవునిపేర అచ్చువేసి, పశువుల దాటుటకు వదలిపెట్టిన ఎద్దు: ఆబోతెద్దు; ఆబోతెద్దు; అచ్చువేసినఎద్దు; జన్నెకు విడిచినఎద్దు [మ]

ఎత్తుగట్టు = ఒక కొలపాత్రకు లేక యొక కొలమానమునకు సరిపోవు తూకమును గట్టుట, పడిగట్టు [కరీ]

ఎత్తుగాలి = పెద్దగాలి, ఖోరుగాలి [నె; తె]

ఎత్తుచెడు = పనిరేవు చెడిపోవు [కరీ]

ఎత్తుడుకాపురము = చోటుమారుచుండు కాపురము [నె-ఖా]

ఎత్తుదప్పినపని = రేవు రావులేనిపని [కరీ]

ఎత్తుబడి = (1) శవమును ఇంటినుండి శ్మశానమునకు కదలించుట — *ఎత్తుబడి అయినది* [నె]
(2) యాచన [కర్నూ]
(3) ఒకని సహాయమునకై చందాలు వసూలుచేయుట [తె; అ]
(4) ఎ_త్తదగినది [చి]
(5) బక్కదేరు; నిస్సత్తువగు — *ఎద్దు ఎత్తుబడిపోయింది* [గో; నె]
(6) చావ సిద్ధమగు—*మన గొదలు ఎత్తుబడినవి* [కరీ; నె]
(7) జబ్బుపడి కోలుకొనకుండుట; ఎదుగుబాటు లేకుండుట [నె]
(8) ఆర్థికముగా దెబ్బతిను—*ఆ సంసారం ఎత్తుబడినది* [నె]

ఎత్తుబాటు = దూరప్రదేశములకుప్రత్యేకించి వెళ్లుట [ప-గో]

ఎత్తుబారం = (1) పెత్తనము వహించినవానికి యిచ్చు భత్యము: ఎత్తుభారము [ప-గో]
(2) అవకతవకగా నుండుట,— - వాడిపని ఎత్తుబారముగా నున్నది - ఎత్తుబారము సంజెచీకటి [నె]
(3) వ్యర్థముగా మోయవలసి వచ్చినది [చ]
(4) బూడిద, ఇది తిట్టులోమాత్రం వాడు దురు—నీయెత్తుబారం—నాయెత్తుబారం [కృ]
(5) పీనుగును మోయుట [చి]
(6) చెడినది — అవని ఎత్తుబారమైనది

ఎత్తుమరుగుట = చంటిపిల్లలు ఎప్పుడును ఒకరి చంకలో నుండుట కలవాటుపడుట [నె; ఓరీ]

ఎత్తుమానము — ప్రయత్నము, ఎత్తుగడ; యత్వారి [కర్నూ]

ఎత్తురేవు = కర్మాంతరములో చివరిదినమున ఎటికిగాని, చెరువుకుగాని పోయివచ్చుట. ఇచట కర్మకలాపము జరిగినతర్వాత కర్మచేసినవ్యక్తికి ఆదరింపుగా, మామ పరుసవారు కొత్తగుడ్డలు కప్పుదురు[నె]

ఎత్తులు = దండలు [అ]

ఎత్తువారిచేతిబిడ్డ = (1)ఎవరిదగ్గర నుండిన, వారిమాట వినువ్యక్తి, బిడ్డ మామఎత్తు కొని యున్నప్పుడు నాయనను తన్నేకాలు చూపును; ఇట్లే నాయన చంకనున్నప్పుడు మామను తన్నుటకు అదేకాలు చూపును [నె, తె]
(2) ఎవరివద్దకైనను మాలిమిగా వెళ్లు బిడ్డడు; క్రొత్తలేనివాడు; [అ, తె]

ఎత్తెత్తుబంగారం = అల్లారముద్దు [మ]

ఎత్తెల = సంచివలెనుండు చిన్నచేపలవల; ఎత్తిలి [చి]

ఎత్మానము = ప్రయత్నము; ఎత్వాన్నము; ఎత్తుమానము [కర్నూ]

ఎత్వాన్నము = ఎత్తుగడ; ఎత్వారి [నె, కర్నూ]

ఎత్వారము = ప్రయత్నము— మంచిఎత్వారంమీద నున్నాడు [నె]

ఎదగాచల్లు = విత్తులు ఎడయెడముగా బడునట్లు పలుచగా చల్లు, ఎదబెట్టు [గో]

ఎదగు (చూ) ఎదవేయు, ఎదబెట్టు [అ]

ఎదచల్లు ధాన్యముచల్లు [శ్రీ, వి]

ఎదబెట్టు = జొన్న మొదలగు పైరులను ఇతరపైరులతో కలపకుండా చల్లుట— (జొన్న ఎదబెట్టిరి) అక్కడ బెట్టు (చూ) ఎదగు, ఎదగాచల్లు × సడబోయు [నె-మె]

ఎదబెట్టు - ఆవుపాలు యివ్వక ఒట్టిపోవుట [గో]

ఎదరపుతాడు = కపిల (మోట) బానతొండము తాటికి ప్రక్కనే కట్టిన సన్నటి మోకు [నె-మెట్ట]

ఎదర్పు = (1) రావలసిన సొమ్మును రాబట్టుకొనుటకుగా మరల ఋణస్థునికి చేయు ఎదురుసహాయము — అతనికి ఎదర్పు పెట్టవలసివచ్చినది.
(2) ఆదుకొను—అదుబిడ్డ సంసారానికి ఎదర్పు పెట్టలేకపోతున్నా [నె]

ఎదాళము = ఎదుట — ఆయన ఎదాళానికి పోలేరు [నె]

ఎదిగివచ్చు = చేతిక్రిందకువచ్చు; చేతికిఅందివచ్చు—పిల్లవాడు ఎదిగివచ్చినాడు
(2) వృద్ధిఅగు — ఆమె వడ్డీపై ఎదిగివస్తది [మ]

ఎదుగు = సమర్తాడు— ఆ పిల్ల ఎదిగింది [చి; వి, నె, శ్రీ]

ఎదురీగము = పైర్లమీదపడి నిలిచిన మంచు చినుకులు [కర్నూ]

ఎదురు కుతికలు = పిల్లలకు కుతికకుప్రక్క గల్లువాపు (టాన్‌సిల్సు) [నె]

ఎదురుకోళ్లు = పెండ్లి కొడుకు పెండ్లి ఇంటికి చేరుటకుముందు, పిల్లవైపువారు వెళ్ళి ఎదుర్కొని మేళతాళముతో తీసికొనివచ్చి విడిదిచేర్చుట; ఎదురుకోలు; ఎదురుకోవలు [మ]

ఎదురుకోవలు = (చూ) ఎదురుకోళ్లు [నె]

ఎదురు = (1) కలియబెట్టు; లోడబెట్టు— *అవిడకు ఈ దుఃఖ మన్ని వేళముతో కడు పెదిరినట్లయినది* [కరీ]

(2) పఱచిన ధాన్యము మున్నగువానిని దగ్గఱకుజేయు [కరీ]

ఎదురువారు = చెప్పునకు పైభాగమును మీ గాలికి బిగువుగా నుంచు చర్మం, గూడు [నె-పో]

ఎద్దేవ = ఎగతాళి [గు]

ఎద్దుముక్కుపాము = వానపాము

ఎనకలియు = ఒక ద్రవపదార్థములో నొక ఘనపదార్థము (ఉప్పు, చక్కెర) కలిసి పోవు [కరీ]

ఎనకాపల = వెనుక [ఓ]

ఎనమలుపెట్టు = తప్పులుపట్టు [గు]

ఎనలు = స్త్రీలు మెడలో ధరించు బంగారు పూసలు [కరీ]

ఎనించు = ముద్దకవ్వముతో కూరలను బజ్జిగా (ముద్దగా) రుద్దు, ఎనంచు [నె; వః అ]

ఎనిపేటి = బట్టె; గేదె [చెం]

ఎనుచు = (చూ) ఎనించు [కర్నూ]

ఎనుపు = (చూ) ఎనించు [తె; అ; నె]

ఎనుముగొడ్డు = గేదె. (ఎనుమును గొడ ను కలిసిపోయినవి) [అ]

ఎన్నవ = దెప్పుచు ఏడ్చుట— *ఎన్నవలు బెట్టి ఏడ్చినది* [నె]

ఎన్ని = దూడలు అప్యాయంగాతిను ఒక ఆకు మొక్క [చి]

ఎన్ను = (1) మగగురి

(2) పొగరు

(3) దూషించు [తె]

ఎన్నుకట్టు = జొన్నకంకివేయు; వెన్నుకట్టు [మ]

ఎన్నోఅన్ని = అధికము — *వాడు ఎన్నో అన్ని మాటలన్నాడు* [వి]

ఎప్పేయు = చేమిరివేయు; తోడుబెట్టు ఎప్పెవేయు; [అ-రాయదుర్గం తాలూకా]

ఎబ్బెట్టు = రోత [అ]

ఎబ్బెరికము = భేదభావము [తె]

ఎబ్రాసి = రోతగలవాడు, అసహ్యము [గు]

ఎరనూగులు = శ్రేష్ఠమైన, రుచికరమైన నూవులు, [ఓ]

ఎరమరికం = అరమరలేకుండుట; ఎరబరికం [శ్రీ]

ఎరవలి = ఇతరులసొమ్ము—*ఎరవలిసొమ్ము బరువులచేటు*; ఎరువు, అరువు [చి]

ఎరుకలేదా = సంగతితెలియదా? [తె]

ఎరుపు డాగు = లేత ఎఱుపువాయ [నె]

ఎరుసు = (1) గుణకారపులెక్కలు, (చూ) ఇరుసు, వెరుసు [కరీ]

(2) భిన్నాభిప్రాయమును ఉండుట [శ్రీ]

ఎఱగడ్డ = నీరుల్లిపాయ; ఎఱ్ఱగడ్డ [నె, చి; క; తె; నే, అ; గు]

ఎఱగడ్డచూపు = ఎగవేయు, చేయవలసిన సహాయము చేయకపోవు — *చివరకు ఆయన ఎఱగడ్డ చూపినాడు* [నె; తె]

ఎఱెము = తెగమాదిగకు, వడ్లకమ్మరులకు బెట్టు బిచ్చము [కరీ]

ఎట్టిగాజు = మాంసము [నె-కలువాయి]

ఎట్టిపొద్దు = సంజ [వి]

ఎట్టిచెరుకు = నిరుపయోగకరమైన చెరుకు, ఎవరూ తినరు; వెట్టిచెరకు [చి]

ఎట్టిపుచ్చకాయ = పాపటకాయ, ఈకాయను తిన్న పిచ్చియెక్కును; వెట్టిపుచ్చ [చి]

ఎట్టిబాగులు = అమాయకుడు; వెట్టిబాగులు [తె]

ఎట్జీసందు = బాలగ్రహసంధి [అ-పె]
ఎలంబరము = విశాలము — *ఎలంబరమైన ప్రదేశంలో చేరినారు* [నె]
ఎలచిపండు = రేగిపండు, రేగుపండు [సే]
ఎలపన = ఎక్కువవైశాల్యము ఆక్రమించు కొనునట్లు; ఎలపాన [అ: నె]
ఎలపల = (1) బయట
(2) కుడిప్రక్క; వెలుపల [నె; వ, అ]
ఎలపాది = అందరు; అంతా—*ఇంటిఎలపాది వచ్చినారు* [నె]
ఎలపాన = (1) చదరముగా అంతటనుబాగుగ వ్యాపించు—*నీళ్లు కయ్యా ఎలపాన పారి నవి; ఎలపన; ఎలపాది* [నె]
ఎలవరపోవు = వరివెన్ను గింజపట్టకుండా పోవు; తాలుపడు [నె, అ]
(2) తెల్లబోవు; వివర్ణమగు—*ఆయన ఆది విని ఎలవరపోయినాడు* [నె]
ఎలవాడు = గ్రామబంట్రౌతు; సుంకరి [కరీ]
ఎలికంజేవు = చేలలో రాళ్లప్రక్కన మొలచు మొక్క; దీని పచ్చడి రుచికరము, ఆరోగ్యప్రదము; జీర్ణశక్తి నిచ్చును [చి]
ఎలిగిడ = (చూ) వెలిగడ [నె]
ఎలిదుక్కి = తడిలేనిదుక్కి; ఎలిగడ; వెలి దుక్కి [చి]
ఎలిపిండివడు = మంటచాలక రొట్టెతెల్లనగు [తె]
ఎలిపైరు = మెట్టపైరు; వర్షాధారపుపైరు [చి]
ఎలివిరి = ఒంటిపేటత్రాడు [కృ]
ఎలిసిపోవు = (1) వానకురియుట నిలిచిపోవు; వెలిసిపోవు [నె; తె]
(2) ఓడిపోవు — ఆ పోరాటములో ఇది వెలిసిపోయింది [నె-పొ]
(3) కొత్తకుండలో పోసిననీరు, దాని సూక్ష్మరంధ్రముల గుండా వెలుపలకు ప్రవించు [గో; నె; అ]
(4) రంగువిడుచు; చాయదోవు — *చీర ఎలిసిపోయింది* [నె]
(5) శరీరముసడలిపోవు—*ఒక్కకాన్పుకే మనిషంత ఎలిసిపోయింది; వెలిసిపోవు* [వ]
ఎలుగు = (1) ఇంటిచుటూ కటు దడి [వి]
(2) నాగటికాడిని దూరముగా నొగ చివరకు జరిపికట్టుట; ఎలువు [కరీ]
ఎలుగొడ్డు = ఎలుగుబంటి; ఠద్దెగొడ్డు; కళ్ది, కరిడి,
ఎలుచు = క్రొత్తకుండనుండి నీరుబయటికి ఉట్టు [నె, కర్నూ: తె; అ]
ఎలువు = (1) ఏడ్చుటలో మధ్యనిలిపి మరల ఎత్తుకొనుట—రెండు ఎలువులు ఏడ్చినది,
(2) నాగలినొగకు (ఎడికోలకు) కాడిని దూరముగ (కొనను) పన్నుట (కట్టుట) దీనివలన లాగుట భారమగును × సవవు, ఎలుగు [నె; అ; వ]
ఎల్ల = (1) సున్నము; వెల్ల [వి]
(2) తెల్లన, ఇది యెద్లకుమాత్రమువయో గింతురు—ఎల్లై
(3) కూర కొనుటకు వేయు పిడికెడు బియ్యము — *నేను మూడెల్లెలు వేసినా* [నె-పొ]
ఎల్లదోడు = నూతులలో పేరిన పూడికతీయు [గు]
ఎల్లనీదు = (1) కష్టములను గడచిపోవు— *ఆదంతా ఎల్ల నీదినాడు.*
(2) గట్టుచేర ఈదు [నె; తె; అ]
ఎల్లబడు = పశువు ఈను [గు]
ఎల్లాపి = (1) ఎల్లమీదనిలిపి దోచువాడు
(2) చాతుర్యముగలవాడు — *వాడు వట్టి ఎల్లాపి* [నె]
(3) దొంగలలో మిన్న [నె-పొ]
(4) తలారి [తె]
(5) పనికిమాలినవాడు [అ-పె]

(6) కూలిజనము [అ]
ఎల్లాపులు = ఒకరికపు తెగవారు; తెలగాలలో చేరినవారు [కరీ]
ఎల్లాయి = (1) చాకలి ఉతికినగుడ్డలకు ఆవిరి పెట్టుటకు కట్టినపొయ్యి—ఎల్లాయికి వేసినాడు [నె; కర్నూ]
(2) చాకలి ఆవిరికి బానకుచుట్టిన గుడ్డలు [నె-పొ]
(3) ఉబ్బ [చి]
ఎల్లిపాయ = వెల్లుల్లి; తెల్లబాయ [కర్నూ]
ఎల్లిపోవు = వరికుప్పను నురుచుట పూర్తి యగు—ఆ కుప్ప ఎల్లిపోయింది [నె]
ఎల్లికొల్ల = ఏక్కువగా నుండుట—వాళ్ళకు పాడి ఎల్లికొల్ల [గు; నె]
ఎల్లెలుకలవడు = చేతగానివాడగు [మ]
ఎవకల = వేకువ [వి]
ఎసరుబెట్టు = (1) పన్నాగముపన్ను—వాడు పెద్దింటి కెసరుపెట్టాడు [వి]
(2) ముప్పుదెచ్చు; ఎసరుబెట్టు [నె; తె; అ]
ఎసలిక = వెసులుబాటు; అవకాశము; విరామము, ఎసిలిక [తె; నె]
ఎసళ్ళుపొద్దు = సాయంసమయము; వంటకు ఎసురు పెట్టువేళ అనుట [వ]
ఎసి = (1) రెంటి మధ్యగలచోటు,
(2) కట్టుటలో ఒకరాయి ఇంకొకరాయికి నడుమగలచోటు — సున్నముతో ఎసి బూయి [నె]
ఎసిలిక = అవకాశము, తీరుబడి — ఎసిలిక చూచుకొనివస్తా; ఎసలిక, వెసిలిక [నె]
ఎసుగు = వృద్ధిజెందు [కరీ]
ఎళ్లనీదు = దాటు; ఎల్లనీదు [కర్నూ]
ఎళ్ళికాయ = దబ్బపండు [అ]

## ఏ



ఏంటికి = ఎందుకు [కర్నూ]
ఏందివే = ఏమిటే [చి]
ఏకటాకి = ఒకే యొకడు [కరీ]
ఏకరువుబెట్టు = చేసినపనిని, తప్పును పదే పదే చెప్పు [నె; కర్నూ; అ-పె]
(2) కంఠతావచ్చినదానికి చదువు [నె-మెట్ట]
ఏకనశెట్టి కొంకణబారు = ఒకదేయుండి గొప్పగా శ్రీమంతము గోరువాడు.నిరంధి పురుషుడు [కరీ]
ఏకసంత = ఒకేసారివిని గ్రహించుట—ఏకసంతగ్రాహి [నె; కర్నూ; తె; అ]—ఏకసంధా [సర్కా]
ఏకసా = ఎప్పుడూ [తె]
ఏకాండి = ఒకఅండెము గలఇల్లు [కరీ]
ఏకారు = దైన్యముతో బాధపడు [అ-పె]
ఏకాణము = పూర్తిగా; అంతటికి — ఆ దూలము ఏ కాణానికి ఒకే లావుగా ఉన్నది [నె]
ఏకివేయు = తీవ్రంగా విమర్శించు—ఆయన సంగతులు ఏకివేసినారు [నె]
ఏకులొడుకు = చిక్కిపోవు [మ]
ఏకెలమ = వెలమలలో ఒకతెగ × రాచవెలమ [కరీ]
ఏకిరిచీకిరి = అనాగరికుడు — ఏకిరిచీకిరిగాడు [చి]
ఏకిరిదొరలు = పాళెగాండ్రకులము [చి]
ఏకిలి = (చూ) ఎత్తలి [అ-పె]
ఏకోరు = మిక్కిలిగా కోరు [అ]
ఏక్కిరి = అసహ్యసూచకము [గో]
ఏగాని = రెండుదమ్మిడీలు; దుగ్గాణి [శ్రీ]

ఏగిరపెట్టు = తొందరచేయు, వేగిరిపెట్టు [కరీ]

ఏగిలి = (1) ఒకయేడు బీడుబెట్టి రెండవ ఏడు దున్నినపొలము; చెలిక
(2) మెట్టభూమి [అ-పె]

ఏగిలి = ఎక్కువగా దున్నినందున బొదబొద లాడే దుక్కి—*పొలం ఏగిలిబారింది* [నె]

ఏగిలిపోరు = (1) సత్తువ ఎక్కువై పొలము దొలదొల అయిపోవు, ఉలవరపోవు. ఇది మిరప పొగాకు మొదలగునవి పండిన తర్వాతగూడ జరుగును [నె; కర్నూ; తె; అ]
(2) మసక మసకగా తెల్లవారు — *ఏగిలిపారింది; ఏగిలిపారంగ నిద్రలేచి నాను;* వేగిలివారు [వ]

ఏగిరా = ఇష్టములేకనే రమ్మనుట — *ఏగి రావయ్యా* [అ; నె]

ఏగుట = ఓర్చుకొనుట; భరించుట — *నీతో నేను ఏగలేను* [కర్నూ; నె, అ]

ఏగేస్కపోకు = చెప్పక చేయక పోకు [మ]

ఏచికాల్చు = ఎక్కువగా కష్టపెట్టు—*ఆయన మమ్మ ఏచికాలుస్తున్నారు;* వేచికాల్చు [నె]

ఏచే = యాచ—యాన [అ; నె; తె]

ఏటకట్టు = గెంటి; చలికి రెండుచంకల క్రిందుగ ముడివేసికట్టిన ఉత్తరీయపు కట్టు [వి]

ఏటి = ఏమిటి? [వి]

ఏటిపుచ్చ = చేదుపుచ్చ; వెఱ్ఱిపుచ్చ; పాపట కాయ; ఇంద్రవారుణి [చె]

ఏటిబట్టి = ఏటికాలువ [శ్రీ]

ఏటిరింత = ఒక చిన్నపిట్ట; భరద్వాజపక్షి; ఏట్రింత, [శ్రీ]

ఏటుబెట్టు = ప్రయోగముచేయు; (చాతబడి) పంపుజేయు [నె-బొ]

ఏడాటము = ఇబ్బంది— *ఏడాటంపెట్టవద్దు* [నె; అ]

ఏడిక = ప్రత్యేకముగా పశువులవెంట మేపు ఒక గొఱ్ఱెగాని మేకగాని [కరీ]

ఏడిడి = ఆధిక్యము—*ఏడిడి బొత్తిలేదు* [నె]

ఎడికోల = నాగలికి బిగించునొగ [నె]

ఏడుగళ్లు = ఎల్లప్పుడు [ప-కృ]

ఏడుగాడు = చెడుపు—*పనంతా ఏడుగాడు అయింది,-అది ఏడుగాడు చేసినాడు* [నె; అ]

ఏడె = జడుము [చి]

ఏడ్నర్థం = ఒకటిన్నర సంవత్సరం [నె; వ, కర్నూ]

ఏతావాతా = ఇంతకు [గో]

ఏతిరెంచు = ఉద్దన్నపనికి పదేపదే చేయు [శ్రీ]

ఏదారి కోదారి = అవునని కాదనుట— *ఆయన ఏదారంటే కోదారంటాడు* [నె]

ఏదుము = (1) ఐదు తూములు కొలత [నె; కర్నూ]
ఇద్దుము = 2 తూములు
ముత్తుము = 3 తూములు
నల్తుము = 4 తూములు
ఏదుము = 5 తూములు
ఆర్దుము = 6 తూములు
ఎడ్డుము = 7 తూములు
ఎనమందుము = 8 తూములు
తొమ్మందుము = 9 తూములు
పందుము = 10 తూములు
పదకొల్తుము = 11 తూములు
పదకొండ్డుము = 11 తూములు [కర్నూ]
పన్నిద్దుము = 12 తూములు
పదముత్తుము = 13 తూములు
పద్నల్తుము = 14 తూములు
పదఏదుము; పదేదుము = 15 తూములు

పదార్థము = 16 తూములు [నె; కర్నూ]
పదేడ్డుము = 17 తూములు
పద్దెనమందుము } = 18 తూములు
పజ్జనమందుము }
పందొమ్మందుము = 19 తూములు
సెలగ = 20 తూములు; పుట్టి [నె, కర్నూ]
ఏదుము = (2) పంచకం, ఐదుతూములు [వ]
(3) అరువదితూములు [కృ; గు]
ఏదురువాసన = ఒకవిధమగుదుర్గంధము — *బొప్పాయిపండు ఏదురువాసన* [నె]
ఏదోమిడ్కు = ఏదోకానియ్యి; లావుగ అయినావు అనుటకు వాడుమాట [మ]
ఏనంగ = ఏటువంటి [వ]
ఏనాదము = గుర్తించరానిధ్వని [కర్నూ-పత్తికొండ]
ఏనాళ్లు = ఒక వివాహపుతంతు; మనుగుడుపుట [గ]
ఏనె = (1) చిన్నకొండ, తిప్ప [నె-పొ]
(2) రాళ్ళగడ్డ [కరీ]
ఏబులము = (1) 30 తులములు [శ్రీ]
(2) 10 పలములు, యాబులము, యాబలము [నె]
ఏబ్రాసి = దౌర్భాగ్యుడు [తె]
ఏమార్చు = మోసముచేయు — *నన్ను ఏమార్చినారు* [నె; దక్షి]
ఏమిచేసి = ఏది ఏమైనప్పటికీ (తప్పక అని భావము) [తె]
ఏమెరుగనిఎల్లిపాయ = సుద్దపూస [మ]
ఏరడి = వేఱుగా తీసినది [కరీ]
ఏరు = (1) మడక [అ]
(2) దున్నుటకు వన్నిన (కాడి అమర్చి కట్టిన) నాగలి
ఏరునుగ్గుబు = ఏరుపిడకలు [అ]
ఏరుపడు = కుటుంబవిభాగమగు; ఏరుపోవు; వేరుపడు [కర్నూ]
ఏరుపాటు = పరిచయము [కరీ]
ఏరుపిడక = పొలములో మేస్తూ పశువులు వేసిన పేడకడి ఎండిన తర్వాత పిడకగా ఉపయోగించుటకు ఏరిపెట్టినది; ఏరుడు పిడక; ఏరునుగ్గు [వ; అ; నె]
ఏరు - మామిడికాలువ పొందు = కలిగీ కలుగక ముందే ఎడబాటగు స్నేహము, పొందిక. కోట సమీపమున గూడలి సంగముదగ్గర స్వర్ణముఖిలో మామిడి కాలువ సంగమించి, వెంటనే నూరు బారల దూరమున చల్లకాలువగా చీలిక ఏర్పడిపోవుచున్నది. దీనినిబట్టి ఈ చాటవ ఏర్పడినది [నె-కోట]
ఏరువచ్చింది = ఏటికి కొత్తగా నీరుతగిలినవి [కర్నూ; నె; తె;]
ఏరువాకపున్నమ = ఆషాడపూర్ణిమ.
ఏరుసొవు = పొడుగుగాఉండి కాలు ఈడ్చుకొనుచు నడిచేవాడు [మ]
ఏర్లుపోవు = అన్నదమ్ములు విభాగమగు [నె]
ఏఱుగట్టు సామాను = వ్యవసాయంలో అరక కట్టుటకు ఉపయోగించుసామానులు; (కాడి, మేడి, మోకు, ఎద్దులచిక్కాలు, ఎద్దుల సిగమార్లు, పగ్గాలు, కొమ్ముల కుచ్చులు మొదలగునవి) [గు]
ఏలపదము = జానపదులపాట, యాలపపము; (ఇందు బూతుఎక్కువ) [నె; అ; వ]
ఏలపాట = (మా) ఏలపదము [వి]
ఏలపాము = చిన్నబిడ్డల ప్రేవులలో ఉత్పత్తియగు పొడుగాటి పురుగు; ఏలికపాము [చి]
ఏలికపాము = మలములో (పిల్లల) వచ్చు పామువంటి పురుగు [నె; చె]
ఏలినోడు = శ్రీ వేంకటేశ్వరుడు [చి]
ఏవ = (1) ఒక విషయమునుగూర్చి అత్యంతమైన ఆసక్తి.

(2) విషయలౌల్యము; కామాతురత—*అయన బలే ఏవమనిషి;* యావ [నె; తె; అ]

ఏవది = ఏది [సే]

ఏవి = వచ్చిరొట్ట (ఆకు) ఎరువు [నె]

ఏస = పైత్యము—*నీకేమి ఏసయా* [కరీ; వ]

ఏసమాటలు = పిత్తప్రకోపపు మాటలు [కరీ]

ఏసిక = తాటిమట్టను మానుకు అతికించు పెట్టు గట్టి ఈనె; ఏసె [నె]

ఏసికి = ముంగారు తరువాతిసమయము; యాసిక [అ-పె]

ఏసుకొనుట = కొట్టుట, వేసుకొనుట [కరీ]

ఏసె = గట్టియీనె; ఏసిక [గు]

ఏళ్లసరవ = చిన్నపిల్లలకు సంవత్సరములు మారునపుడు వచ్చు జబ్బు; సంధి [చి]

ఏళ్లూరు = ఏడువంగలు; ఏడూర్లు [చి]

## ఐ



ఐకోలు = సరిపడునను భావం [అ]

ఐతికాదు = వీలుకాదు [శ్రీ]

ఐన = సంపన్నమైన—*వారిది ఐనసంసారం* [వ]

ఐనవాడు = కావలసినవాడు; బంధువు × కానివాడు [వ; గో; నె, అ]

ఐనారు = ఉక్కిరి బిక్కిరి [గు]

ఐనిల్లు = మంచిఇల్లు [గో]

ఐవు = (1) జాడ; ఉండుచోటు—*ఇంతా వాడి ఐవూ మచ్చా ఎక్కడా లేదు;* పోబిడి [గో; చి; వ; నె; గు; అ]

(2) అంగనిర్మాణములో లోపము; కుంటి—*ఐవుకాలు;* అయివు [నె]

ఐపుట్టిన = ప్రతిది [అ]

ఐమూల = (1) మూలవాటు

(2) మూలతోకూడుకొనిన ఇల్లు, ఇది దోషము [శ్రీ]

(3) ఈశాన్యదిక్కు; కార్తెమూల—*ఐమూల అగా మబ్బురేచింది, వానతప్పదు* [నె]

ఐరా = సెబాష్, బలే, అని అర్థము—*ఐరా, చిన్నాపరెడ్డి, నీవేరే బంగారపకడ్డి* [చి]

ఐరేన్లు = (చూ) అరివేణి [మ]

ఐసాపైసా = ఏదోఒకటి తేల్చుకొను —*అయన ఐసాపైసామనిషి* [అ; నె]

## ఒ



ఒంకాము = (1) వంగాలుగా చీలినది.

(2) వంగాలుగా చీలిన కొయ్యభాగము; గడ్డిని కదిలించుటకు కుప్పనురిపిడులలో దీనిని వాడుదురు, ఒంకు

(3) కొక్కెము; ఒంకెము [నె]

ఒంకి = (చూ) ఒంకాము [తె]

ఒంకీలు = స్త్రీల రెట్టసొమ్ములు [నె-పొ; నె]

ఒంకు = ఒంకి; ఒంకాము [మ]

ఒంకె = చొక్కాతగిలించు కొక్కెము [చి]

ఒంకెము = గోడకు కొట్టుమేకు; ఒంకె [నె]

ఒంగిడి = చిన్నచిన్న చినుకులు; తుప్పర — *ఈదినమంతా ఒంగిడే* [నె-తూర్పునాడు]

ఒంటిఊపిరివాడు = దుర్బలుడు; ఒంటూపిరివాడు [నె; కర్నూ; అ; నె]

ఒంటికాలిమీద నిలుచు = (1) లెక్కచేయకుండు

(2) ఒంటికాలిమీద నిలువబడి తపస్సు చేసినట్లు బలవంతముతో (ఒత్తిడిచేసి) పని చేయించుకొను — *ఒంటికాలిమీద నిలిచి డబ్బు తీసుకొన్నాడు* [అ-పె; నె]

ఒంటిజోడు = ఎవరైన చనిపోయినప్పుడు వారివారలకు ఇచ్చునటువంటి ఒక ధోవతి రెక్కగాని, రవికెలేని చీరగాని [మ]

ఒంటిపిండి = పైపింకి [ప]

ఒంటు = ఇముడు; సరిపడు; ఇందు — *అచటి నీరు నాకొంటులేదు; మందు ఒంటినది* [కరీ]

ఒంటుకొను = (1) విభజించిన భాగములలో తన కిష్టమైనదానిని కోరుకొను — *మిట్ట చేను అన్న ఒంటుకొన్నాడు* [నె]

(2) అతుకుకొను [చి]

ఒంటెత్తు = వంటరి [అ]

ఒంటెత్తుతనము = స్వార్థము [తూ-గో]

ఒంటెద్దు = పందెమువేయు ఎద్దు [అ]

ఒంటెద్దు గాండ్లవారు = ఒకే ఎద్దుతో గానుగను లాగించు గాండ్లవారు; అరవదేశంలో గానుగకు రెండెద్దులు కట్టుదురు; వీరిని నూనె గమళ్లవారందురు; తిలఘాతకులు [చి; నె]

ఒంటేలు = అల్పాచమానము; మూత్రము; బడిలో పిల్లలు ఈపనికి ఒక వ్రేలునే - ముఖ్యముగ చూపుడు వేలునే చూపుదురు. × రెండేళ్లు; అధికాచమానము రెంటికి [నె; కర్నూ; తె; అ]

ఒండకొచ్చింది = కన్నె రజస్వల అయినది. ఈ సందర్భము బంధుమిత్రులు ఆ కన్యకకు ఫలహారాదులు తెచ్చిపెట్టుట [చి]

ఒందెలుగ = బ్రాహ్మి; సరస్వతిఆకు [సే]

ఒంబాయిపట్టు = (1) ఎక్కువగా ప్రశంసించు; బ్రహ్మరథం బట్టు [గో]

(2) సేవలుజేయు. పల్లకిని, మేనాను మోయు బోయిలు "ఒంబాయ్-ఒంబాయ్" అని ఉసిమాట అంటూ మోసికొని పోవుదురు. అట్లే సేవించుట, ఊరేగించుట అని [నె]

ఒక ఒకట్లు ఒకటి = ఆ ఇద్దరూ ఒకటే అనుట [నె]

ఒక ఇరుసున నడుచు = అందరు సయోధ్యతగా మెలగు [నె]

ఒకకొలికినబడు = (1) ఒకపనిని ప్రయత్నము మీద అనుకూలముగ ముగింపునకు తెచ్చుట — *ఇప్పటికి అది ఒక కొలికికి వచ్చినది;* ఒక ఇరుసన నడచు [తె]

(2) వ్యవహారము పరిష్కార మగుటకు ఒకదారికి వచ్చుట, అనగా యిరుపక్షముల వారును ఒకమాటకు కట్టుబడుట (కొలికి = హారమును కలుపు చివరి కొక్కెము (Hook) [గో; నె; అ]

(3) ఒక స్వరూపమునకు వచ్చు — *పనులన్నీ ఇప్పుడొక కొలిక్కివచ్చినవి* [వ]

ఒకటి సగంగా = అసంపూర్ణముగ [చి]

ఒకతాయం = ఒకవిధంగాకాని; అతియైన, అసాధ్యమైన [అ]

ఒకతాయాన = (చూ) ఒకలాగు లాగాన; ఒకరాగాన [వ]

ఒకరాగాన = (చూ) ఒకలాగు లాగాన [తె]

ఒకలాగులాగాన = (1) గట్టిప్రయత్నము; కష్టముతో కూడినది — *ఆపని ఒకలాగు లాగానగాని కాలేదు* [నె]

(2) సక్రమముగా — *వాడు ఒకలాగు లాగాన కొంపచేరునా;* ఒకతాయాన; ఒకరాగాన [తె]

ఒకక్కణము = (చూ) ఒక్కణము; వక్కణము [తె]

ఒక్కణము = (1) బిరుదావళిని పేర్కొనుట.
(2) పత్రమును వ్రాయు ముసాయిదా — ఒక్కణము ముందు కుదుర్చు; వక్కణము; ఒకక్కణము [నె]

ఒక్కట్లు = గణితము, ఎక్కాలు [అ]

ఒక్కరేణి = పుష్కరిణి, కోనేరు [అ]

ఒక్కాకున చదువుట = ఒకేగుణము కలిగి యుండుట — అతడు ఒక్కాకున చదివే వాడు కాదు [కరీ]

ఒక్కి = (1) ఐక్కచిక్కన — ఆ ఒక్కి మనిషిని; ఇటు పిలువు [కర్నూ: నె; తె; అ]
(2) ఎండిపోవు — ఆకాయ ఒక్కిపోయినది [అ-పె]

ఒక్కు = ఎండిన పచ్చికాయ; ఎండినది [చి]

ఒక్కుమ్మడి = అందరుకలసి ఒక్కకడవుగా — ఒక్కుమ్మడిగా నెట్టినారు [నె; కర్నూ; అ, తె]

ఒగతాయం = ఒకపాటి — వాడు ఒగతాయం మనిషా [అ]

ఒగరించు = (1) దండవేడిమికి బాధపడు;
(2) వెనుక వెనుక చింతించు [అ]

ఒగ్గట్టు = ఐకమత్యము; ఒకకట్టు [నే]

ఒగ్గణి = తడిపి తిరుగబోతపెట్టిన బొరుగులు; ఒగణ్ణి [అ-ఉరవకొండ]

ఒగ్గము = (1) భేదము
(2) వేటాడుటకై త్రవ్వెడు పెద్దగుంట; మాటు [వ]

ఒగ్గి = (1) త్వరగా నెమ్మ అరిపోవు రేగడి నేల; తీతనేల, బెట్టనేల [న]

ఒగ్గు = విడిచిపెట్టు [శ్రీ]

ఒగ్గుకొని = లొంగి; ప్రతిమాలి [అ]

ఒగ్గువాడు = ఒగ్గు అను వాద్యవిశేషమును వాయించుచు బిచ్చమెత్తుకొను కురుమజాతి వాడు [కరీ]

ఒట్టము = (1) నష్టము, తక్కువ [గం]
(2) పెద్దరూకకు చిల్లర యిచ్చినదానికి తీసికొను కమీషను [నె]

ఒట్టారము = దండుగ; వ్యర్థము — అదిశుద్ధ ఒట్టారము [చి]

ఒట్టిపోవు = పాడిపశువు పాలిచ్చుట ఆగిపోవు; ఎండిపోవు — ఒట్టిబఱ్ఱె; వట్టిపోవు [కర్నూ; నె; తె]

ఒట్టు = (1) వరినారుపోయు [అ-పె]
(2) మొత్తము, కుల్లు [అ-పె, సే]
(3) ఒడియు, కారు [అ-పె]

ఒట్టుమొత్తం = ఆఖరుకు — ఒట్టుమొత్తానికి అది కుదిరినది; చివరకు [అ]

ఒడగాచు = అమ్మివేయు [కరీ]

ఒడగెడ్డము = పెట్టె మున్నగువానిని ప్రక్కవాటుగా పెట్టుట, ఒరగడ్డము, పరగడ్డము [గు]

ఒడిదుడుకులు = (1) కష్టసుఖములు, మేలు కీళ్లు, హెచ్చుతగ్గులు — సంసారం ఒడిదుడుగులు లేకుండా జరిగింది; ఒడిదొడుకు
(2) తొందరపాటు — ఆయన ఒడిదుడుకు మనిషి [నె]

ఒడిసిళ్లు = గడ్డిధాన్యము (చూ) ఊదర [తె]

ఒడిబియ్యము = పెండ్లిఅయిన తరవాత, కొన్నిఏండ్లపాటు ప్రతిసంవత్సరము, తల్లి అడబిడ్డకు చీరలు, బియ్యము, పండ్లు మొదలగునవి ఒడిలో పోసి అత్తవారింటికి పంపు అచారము [మ]

ఒడిబీము = (మా) ఒడిబియ్యము; ఒడిబ్రాలు [అ]

ఒడిబ్రాలు = (చూ) ఒడిబియ్యము [అ]

ఒడిశాల = (చూ) ఒడిసెల [కర్నూ]

ఒడిసిపోవు = వస్తువులేకుండా యగుట [కరీ; వ]

ఒడిసెగడ్డ = (1) (చూ) ఒడుసుగడ్డ [అ]
(2) ప్రథమసంగమమున తొడలసందున కలుగుగడ్డ [చి; నె]

**ఒడిసెల**=రాయిపెట్టి త్రిప్పి, ఒక కొసను వదలి రాయిని విసరివేయు తాడు. దీనికి మధ్య రాయి పెట్టుటకు వెడల్పు అల్లిక ముండును; వడిసెల; ఒడిశాల [నె]

**ఒడుగు**=(మందిగా) చేరి నిద్రించు [అ]

**ఒడుదల**=సమాప్తి [కరి]

**ఒడుదుడుకు**=(1) మిట్టపల్లము. అసమతలము.

(2) అస్థిరస్థితి — *ఆ విషయం ఒడుదుడుకుగా నున్నది.*

(3) దూకుడు [నె, కర్నూ]

(4) తొందరపాటు—*ఆయన ఒడుదుడుకు మనిషి;* ఒడిదుడుకు, ఒడుదొడుకు [నె; గో; తె; అ]

**ఒడుదొడుకు**=(మా) ఒడుదుడుకు [నె; కర్నూ, వ]

**ఒడుప**=(1) ఒకతిట్టు.

(2) ఆకు పూతరేక ఎండిపోయిన చెట్టు [మ]

**ఒడుపు**=(1) లాఘవము—*ఒడుపుగా పట్టుకొనినాడు*

(2) అనర్హమైన లాభము; చాన్సువంటిది—*ఒక ఒడుపుగొట్టినాడు;* వడుపు [నె; కర్నూ; తె]

(3) వరిపొలమునందలి ఎక్కువ తేమగల ప్రదేశము; ఇది కొన్ని గ్రామములలో మాత్రమే వాడుకలోనున్నది [నె]

(4) దట్టము — *పైరు ఒడుపుగానున్నది* [అ]

**ఒడుపుకత్తె** = సమయమునకు తగినట్లు నడుచుకొనునది [వి]

**ఒడుసు**=(1) దట్టము — *పైరు ఒడుసైనది* [అ-పె]

(2) నీరుకారు; సరిగా నీరుపిండక ఆరవేసిన బట్టనుండి బొట్లురాలుట— *గుడ్డనీళ్లు ఒడుస్తున్నది* [తె, నె]

**ఒడుసుగడ్డ**=ఒక సుఖరోగము: అడ్డగట్టు: ఒడిసెగడ్డ [నె; కర్నూ; తె]

**ఒడుసుపోవు**=గుడ్డలో నూలు తక్కువై ఉతుకగా కుదించుకొని తెజ్జలు ఏర్పడు—*చీర ఒడుసుపోయింది;* దుస్తులుపోవు [నె]

**ఒడ్డాణబ్బండి** = బాలక్రీడ, రెండుచేతులు ప్రక్కకు చాచి కనులు మూసికొని గుండ్రముగా తిరుగునది; ఒడ్డాలబండి [వ; కరీ]

**ఒడ్డారము**=(1) లక్ష్యము లేకుండుట

(2) మూర్ఖపుపట్టు—*వాడు ఒడ్డారపు పిల్లవాడు* [అ-పె; నె]

**ఒడ్డాలబండి** = పిల్లలాడుకొను నొక క్రీడావిశేషము, ఒడ్డాణబ్బండి [కరీ]

**ఒడ్డిగలు**= (మా) ఒడ్డిగిలు [అ]

**ఒడ్డిగలుపడు**=అశక్తతతోఉండు — *వాడు రోగమువచ్చి పూర్తిగా ఒడ్డిగిలపడినాడు* [తె]

**ఒడ్డిగిలపెట్టు**=గిన్నె మొదలగువానిని గోడచేర్పుతో ఒకవైపు ఆనునట్లు పెట్టు [గు]

**ఒడ్డిగిలు**=ప్రక్కపాటు; ఒడ్డిగలు — *ఒడ్డిగిలపండుకో* [నె; గు; వ; అ]

**ఒడ్డిబుడ్డి**=మూఢత్వము [ని]

**ఒడ్డు** = (1) లావైన — *ఒడ్డుపొడవుమనిషి* [నె; కర్నూ]

(2) అడ్డకట్ట — *మిట్టకు ఒడ్డువేసినా* [నె; అ]

(3) ఒంటుకొను, కోరుకొను—*ఆ యిల్లు నేను ఒడ్డుకొన్నా* [నె; కర్నూ; తె]

**ఒడ్డుకట్టుచేను**=ఒడ్డు అడ్డముగా వేసి నీరు పారించవలసిన పొలము: మిట్టచేను [నె]

**ఒడ్డుగట్టు** = గుణకారములోని ఒకపదతి [కరీ]

**ఒడ్డుబెట్టు**=చేనికి గట్టు నిర్మించు [కరీ]

**ఒడ్డులు**=వంతులు [సే]

**ఒడ్డెము**ఓడ్రము

ఒడ్డోరుగు=ప్రజలెల్లరు మూగిపైకొను—*జాతరకు జనం ఒడ్డోరిగినారు* [కరీ]

ఒత్తనాడివాడు=బలహీనుడు [చి]

ఒత్తాలుపెట్టుట=బియ్యము పోటీపెట్టుట [వి]

ఒత్తిచెప్పు=గట్టిగాచెప్పు [వ, నె]

ఒత్తు=(1) తాటి, ఈతమట్టను నారదీయుటకు దాని మొదలు కత్తితో సన్నటి పట్టలుగా చీల్చు [నె]

(2) సమృద్ధి—*కడుపులో ఒత్తులేదు* [నె]

(3) వ్రాయుటకు అనువుగా క్రింద పెట్టుకొనిన అట్ట మొదలగునవి — *ఒత్తుపెట్టుకొని వ్రాయుము* [నె; కర్నూ, అ; వ]

(4) పడిన నీటిని గుడ్డతో అద్దు [తె]

(5) దట్టము—*జుత్తు వొత్తుగా వుంది; పైరు ఒత్తుగాఉన్నది* [నె]

(6) అత్తకోడండ్రకు కలిగించు అన్యాయపు బాధ [గో]

ఒత్తుడుకాగితము = అద్దుడు కాగితము: బ్లాటింగు [వ]

ఒత్తుకొను=(1) చేసినపనిని సమర్థించుకొనుచు, మాట్లాడు-చేతులు ఒత్తుకొనుచు అనుట— *చాలా ఒత్తుకొంటూ మాట్లాడినాడు* [నె; వ]

(2) పెరిగివచ్చు, అదిమివచ్చు [అ]

(3) త్రోసికొనివచ్చు [చి]

(4) పొట్టలో పెట్టుకొని విషయమును (అసూయను) బహిర్గతము చేయకుండు [కరీ]

ఒత్తులు=(1) కాపులు, మురుగులు

(2) సన్నటితీగతోచేసిన బంగారు గాజులు [నె]

(3) చంటిపిల్లలకు చేతులకు వేయు బంగారు కడియాలు [కరీ; నె]

(4) పలుచని బద్దపారుగాచేసి స్త్రీలు చేతికి ధరించు గాజులవంటివి [శ్రీ]

ఒదలు=బిగువుకానిది (Loose) × గుత్తము: ఒదులు × బిగువు [వ; నె]

ఒదిపి=(1) పశువుల ప్రేగులలో పూర్తిగా జీర్ణముగాని మేత—*ఒదిపికక్కినది* [నె]

(2) కరుసు [అ-పె]

ఒదిలిపోవు = కృశించిపోవు [శ్రీ]

ఒదివేయు=గడ్డపారతో గ్రుచ్చి నేలతీరును చూచు [నె-పొ]

ఒదుగు=కూడివచ్చు—*అన్నం వాగా ఒదిగివచ్చినది* [నె; అ; వ, కర్నూ]

(2) సంగీతములో పలుకు సంగతులు

(3) ముడగదీసికొని కూర్చుండు [నె]

(4) ఎక్కువ — *ఈ బియ్యం ఒదుగు* [కర్నూ]

(5) వినయముతోనుండు — *ఒదిగిమదిగియుండు* [గో; తె]

ఒదుపు=క్రిక్కిరిసినట్లు కూర్పు [అ]

ఒద్దికలు చూచుకొను = కలిసిచేయుపనికి, ముందుగా జోడు కుదురునట్లు సరిచూచుకొను [నె, కర్నూ, అ, తె]

ఒనకులు=వల్లకాడు [అ]

ఒప్పగించు = రాజేసిన (కంఠస్థముచేసిన) పద్యములను చూడకుండచెప్పు —*పాఠం ఒప్పగించినారు* [నె]

ఒప్పమి=అననుకూలత [నె; తె]

ఒప్పారుచుట్టాలు = అన్యకులమందలి స్నేహితులు [చి]

ఒప్పు=బద్ద, ముక్క; చెక్క— *బెంకాయ ఒప్పు* [సే, అ]

ఒబ్బట్లు=బొబ్బట్లు [సే]

ఒబ్బిడి=(1) ఏకాంతము — *ఒబ్బిడిగాతిను: ఒబ్బిడి చిక్కలేదు* [అ పె]

(2) శుభ్రము [సే]

(3) పూర్తి [చి]

(4) గింజలు రాలినవెనుక కళ్ళమును ఊడ్చుట [చి]

(5) జాగ్రత్త [శ్రీ]
(6) అధికము [నె-పొ]

ఒమ్మి=అచ్చుబాటు— *మాకు ఆ సంబంధము ఒమ్మిరాదు* [నె-పొ; గు]

ఒమ్ము=(1) ఎక్కువ దట్టము — *పైరు ఒమ్ముగానున్నది* [నె]
(2) కుదురుగా నుండుట [గో]

ఒయితారము=వయ్యారము [అ-పె]

ఒర=దిండు, పరుపు మొదలగువాటి గలీబు; ముసుగుగుడ్డ [చి; నె]

ఒరక=ఏటవాలుగట్టు [వి]

ఒరకటము=ఇబ్బంది; వరకాటము [కరీ]

ఒరకట్టు=కోసినజొన్న మొదలగు వాటి దంటును కంకులు ఒకప్రక్కకే వచ్చునట్లు పేర్చికట్టువిధము [తూ-గో]

ఒరకాటము=(1) నిట్రముగానున్నచరియ; నిట్రపుఅంచు — *ఒరకాటంలో నిలుచున్నాడు* [నె]
(2) ఇబ్బంది, ఒరకటము; వరకాటము [అ; కరీ]

ఒరగడ్డము=(1)స్థిమితములేనిస్థితి—*వాడిది ఒరగడ్డపు బ్రతుకైనది*; ఒఱగొడ్డము[నె; ఆత్మకూరు]
(2) చరియప్రదేశము, నిట్రముగా నున్న రాతి పై భాగము; ఒరకాటము [నె]
(3) కొనఅంచు—*పిల్లవాడు బావికి ఒరగడ్డాన ఉన్నాడు* [తె]

ఒరటు=మోటు, మొండి; వరటు;—*ఒరటు మనిషి* [అ; సే]

ఒరబెట్టు=(1) రాపిడిజేయు
(2) బంగారము మొదలగువానిని ఒక రాయిపైగీచి బాగోగులు నిర్ణయించుట; వరపువేయు [కరీ]

ఒరలు=వదరు — *అత డెక్కువగా ఒరలును* [కరీ]

ఒరవడి=(1)వేగము—*ఏటిఒరవడి*; వరవడి [నె; అ; తె]
(2) ఆదర్శము [వి]

ఒరవడి=(1) కాపీవ్రాతకుపైన వ్రాసిన బంతి —*కాపీలకు ఒరవడి పెట్టి ఇవ్వండి*; మానా
(2) యథాతథం; [గొ; నె, తె; అ]

ఒరసందు=రెండుఇండ్ల సూరులు క్రిందకు దిగిన గొందిచోటు; సూర్లసందు[నె; వ]

ఒరిణె=నాలుగు మూలలను నలుగురు పట్టుకొని గింజలను జల్లించుట కుపయోగించు వెదురు బద్దలతో చేయబడి. సాధనము [అ-పె]

ఒరుపు=తగు సూచన [సే]

ఒర్తు=రాబడి, ఆదాయము—*ఆయనకు ఒకో ఒర్తు ఉన్నది* [నె-పొ]

ఒఱగొడ్డము=నిట్రముగా నుండు నట్టు; వరగడ్డము [చి]

ఒజ్జి=ఆటలలో ఎదిరిని రెచ్చగొట్టు పదము —*ఒజ్జి ఒజ్జొ ఒజ్జిఒజ్జి* [చి]

ఒలకిల=వల్లకాడు; ఒలికిలి [చి]

ఒలపక్షము = పక్షపాతము, వలపక్షము [నె, తె]

ఒలకబోసియెత్తుకొను = (1) ఎన్నో కష్టములుపడి అనుభవము సంపాదించుకొను
(2) వర్తకములో లాభము వచ్చునట్లు వ్యవహరించు [తె]
(3) తప్పుచేసి దిద్దుకొను [గో]

ఒలికితట్ట = పెద్దదినమునాడు (అపరక్రియలలో చివరిదినము) ప్రేతపిండమును కొనిపోవుటకు మాదిగ అల్లితెచ్చు కొత్త పేళ్ళ బుట్ట; చిన్నదినమునాడు (మొదటి దినమునాడు) దీనిని ఎరుకలవాడు అల్లి తెచ్చును — *వాతబియ్యాములేవు, ఒలికితట్టలేని వెధవ* [నె-అత్మకూరు]

ఒలిపి= (చూ) ఉలిపి [అ-పె]

ఒలుకబోసికొను = మధురానుభూతిపొందు. [కరీ]
ఒలుకు = వయ్యారంగా నడిచే స్త్రీ [గో]
ఒలుకులగడ్డ = (చూ) ఒలుకులమిట్ట [అ]
ఒలుకులుమిట్ట = వల్లకాడు [అ-పె. నె]
ఒలుచు = (1) ఉన్నఓంతా సంగ్రహించు; లాగివేయు—ఆయనను ఒలిచివేసినారు [నె]
(2) వేరుసెనగకాయ మొదలగువానిపై తొక్కతీయు [అ, నె]
ఒలుపు = (1)ఉసిరిక మొదలగు కాయలగుజ్జు తీసి ఎండబెట్టిన పలుకులు; వరుగులు [నె; వ]
(2) సాధించు [అ]
(3) దేవునికి పూసినగంధమును (సింహాచల నారసింహునికి) ఒలుచుట లేక తీయుట; ఇది చేయు దినమును గంధము అమావాస్య అందురు [గో]
ఒలులు = గడ్డికుప్ప వేసేటప్పుడు చేయు భాగాలు [గు]
ఒలువు = కొత్తగా బావులుత్రవ్వుటకుముందు సేటిమట్టము, జాలు, రుచి మొదలగువాటిని తెలిసికొనుటకు మొదటవేయు కొద్దిపాటి వైశాల్యముగల గుంట (Trail pit) ఒళువు — ఒలువులో మంచినీళ్లు పడ్డవి [నె. వ]
ఒలుసు = తప్పుకొను [శ్రీ]
ఒలుసుగా = ఒదులుగా [శ్రీ]
ఒల్లి = ఐక్కవలచన—ఒల్లోడు [అ]
ఒల్లె = (1) ధోవతి
(2) పైపంచను ఒల్లెవాటుగా వేసికొనినది [అ]
(3) చిన్నకోక [కరీ]
ఒసురు = (1) తప్పుకొను
(2) వదులుగా నుండు [శ్రీ]
ఒసులు = బిగువు లేకుండుట; వదలు [గం]
ఒళివు = (1) ఉపాయము — ఒళివుగా పని చేయు
(2) దక్షత—ఆపనిలో ఆయనకు మంచి ఒళివు ఉన్నది [నె]
ఒళువు = (1) ఉపాయము; లాఘవము, ఒలువు; ఒళివు [నె; చి; వ]
(2) పరిచయము — ఒళువు చూచుకొని దొంగతనము జరిగినది
(3) దొంగలకు సూచనలిచ్చు (స్థానికుడు) [నె-పొ]
(4) లోబడియుండుట — దానికి ఒళువైనాడు [అ]
ఒళ్లక్కదొడ్డము = అబద్ధాల ఆర్భాటము [కరీ]
ఒళ్లుచేయు = (1)చంటిబిడ్డలు ఎదుగునప్పుడు బాగుగ శరీరము పెరుగు—బిడ్డ బాగా ఒళ్లుచేసింది [నె; తె; కర్నూ; వి; అ; చి]
(2) కొట్టు; తాకు —ఒళ్లు చేసుకోవద్దురా, కొట్టవద్దని అర్థము [చి]
ఒళ్లుదాచుకొను = దేహశక్తిని పూర్తిగా ఉపయోగించి పనిచేయకుండుట [నె; కర్నూ, తె; వి; అ]
ఒళ్లునిండినది = దేవత పూనినది [అ]
ఒళ్లుబెట్టుట = (చూ) ఒళ్లుచేయుట [కరీ]
ఒళ్లువిరుచుకొను = (1) బద్ధకము తీర్చుకొను
(2) ఎక్కువగా కష్టపడి పనిచేయు [వి; నె]
ఒళ్లువొంచదు = పనిచేయదు [వి; నె]

ఓకు = (1)లోపము; హాని; అశుభము [నె-పొ]
(2) చీట్లాటలో (పేకాట) ఉపయోగించు కార్డు—*మంచి ఓకులు పడలేదు* [సిరా]
ఓగు = (మా) ఓవు [నె]
ఓగులు = ఓదెలు [శ్రీ]
ఓగోడు = తిండిపోతు; పనికిమాలినవాడు, బలహీనుడు [చి; నె]
ఓటం = కష్టము; పట్టం [సే]
ఓటారు = బాగా ఎండిపోవు — *మడి ఓటారి పోయింది* [అ]
ఓటిపోవు = పగిలిపోవు — *ఆ కుండ ఓటి పోయింది;* ఓటుబోయు [అ-పె]
ఓటివాడు = దుర్బలుడు [వి]
ఓ్రటింపు = (1) నిరసనముగా వెక్కిరించుట
(2) ఎదిరించుట [గో]
ఓడి = ఒడి—*అవిడ ఓడిచావుకొని నిల్చెను* [కరీ]
ఓడిక = తిన్నెలలికి పెట్టు ముగ్గులు, బొట్లు మొదలగునవి; ఓడిగ [కరీ]
ఓడిగ = పల్లపుపొలము; తాగేడు [నె-ఉదయగిరి]
ఓడిగలు = తిన్నెలు, గోడ అడుగులు అలికిన తరువాత అలంకారముగా పెట్టు సున్నపు బొట్లు; ఓడికలు [వ]
ఓడిగలేపు = అల్లరిపెట్టు; లేవిడిగొట్టు [మ; తె]
ఓడు = పరుగెత్తు—*ఓడిరి* [అ]
ఓడుబిల్ల = ఇంటికప్పున కుపయోగించెడి పెంకు.
ఓడ్చుకొనివచ్చు = నీరు పూర్తిగా ఒడ్డిగిలి వచ్చు [గు]
ఓణి = (1) కన్నెపిల్లలు కట్టుబట్ట.
(2) ఉత్తరీయం [వి]
(3) పెద్దబాట [సే]
(4) పైట, వాణీ
ఓదము = కందకము [కరీ]
ఓదులయ్య = ఉపాధ్యాయుడు; అయ్యవారు.
ఓ్రదుడు = ఒడ్డెవాడు [శ్రీ]
ఓనగాయ = లేతచింతకాయలు [కరీ]
ఓని = డొంక; ఓణి [అ]
ఓనెకట్టు = (1) ఎడారి
(2) దొంగలు దోచుకొనుటకు అనువైన చోటు [నె-పొ]
ఓపరికం = ఓర్పు, శ్రద్ధ [అ]
ఓపలేనిమనిషి = గర్భవతి [కరీ]
ఓబయ్య కాలము = చాలా పురాతనకాలము —*అది ఓబయ్యకాలపు సంగతి;* ఓబీయ కాలము [సే; నె]
ఓబినాటి కాలం = చాలపాతకాలం [చి]
ఓమి వాడుకొను = పొదుపుచేయు [కరీ]
ఓరడి = తేడా, వ్యత్యాసము, ఓరదాటు; వారడి; వార [కరీ]
ఓరపాక = ఓరగా వేసినపాక [అ]
ఓరబాటు = తేడా [కరీ]
ఓరవాకిలి = సగము మూయబడిన తలుపు —*ఓరవాకిలివేయి* [నె; తె; అ]
ఓరసారములు = వ్యత్యాసములు [కరీ]
ఓరుగాలి = పెద్దగాలి; పోరుగాలి [శ్రీ]
ఓరెడ్డెము = ఎకసక్కెము, ఎగతాళి [కరీ]
ఓలి = కన్యాశుల్కము—*ఓలితక్కువని గుడ్డిదానిని తెచ్చుకొంటే, దొంతికుండలన్నీ పగులగొట్టినట్లు* [నె, కర్నూ, అ; తె]
ఓలిఆట = నీటిలో పదుగురు కలిసి ఆడు ఆట; ఓలఆట [చి; నె]
ఓలిపాట = కుప్పనూరిపిడి సమయములో, పశువులను తోలుచు పాడు ఏలపదము "ఓలి ఓలన్నా ఓలో" అన్నది దీనికి మకుటము, మధ్యమధ్య కిలారింతురు; పొలిపాట [నె; అ]
ఓవు = కోసినపైరును పొలములో బారులుగా పడవేసినది; ఓదే; ఓది; ఓగు [శ్రీ]
ఓసినోటివాడు = వట్టి మాటలాడువాడు [గు]
ఓశిగలు = పోశీలు; బొట్లు; బిబ్బట్లు

# ఔ



ఔడుకొను = వరిధాన్యపుగింజలకు పొలు పట్టు

ఔతారము=(1) లేనిపోనిచేష్టలు — *ఔతారం పడవద్దు; ఏమి టా ఔతారము;* అవతారము [అ]

(2) అప్రయోజకుడు—*వాడు వట్టి ఔతారుడు;* అవుతారుడు [నె]

ఔనప్ప=(1) అన్నింటికి 'ఔనప్ప' అని ఊకొట్టువాడు; దృఢనిశ్చయము లేనివాడు; తథాస్తు దేవత.

(2) పనికిరానివాడు [అ]

# క



కంక= వెదురు [కరీ]

కంకణాయి=(1) గట్టిగా కూతవేయు ఒక చిన్నపిట్ట.

(2) బిగ్గరగా, స్ఫుటముగా మాట్లాడుట—*కంకణాయి పలికినట్లు పలికినాడు* [నె]

కంకాళం=పెద్దఆకారము [చి]

కంకి=(1) బలవంతముగా గుంజితెచ్చుట—*వాడిదగ్గరనుంచి కంకితెచ్చాడు* [గో]

కంకు=(1) నోటిలో బెట్టికొని పళ్ళతో కఱచి తినుట—*అతడు మొక్కకంకిని కంకతూ ఉన్నాడు* [కరీ]

(2) తిట్టు [కరీ]

కంకెడు=కమికెడు [కరీ]

కంకోష్టము=కొఱుకరానికొయ్య [కరీ]

కంగలు=వేయించిన (వేపిన) శనగలు [శ్రీ]

కంగాణము చేయు = ధాన్యమునురుచు [అ-పె]

కంగాలు=(1) చెడినది [కరీ]

(2) నీచము—*వాడు వట్టి కంగాలోడు* [తె]

కంగాళి=అల్లరి [ఉత్తర-వి]

కంగించు=(1)గుట్టు బైటికి లాగయత్నించు [వి]

(2) కదలించు, ప్రోత్సహించు; కోపింపజేయు [నె-పో]

కంగు=(1) సరిహద్దు—*కంగుదాటితే కాళ్లు నరుకుతా, జాగ్రత్త* [చి]

(2) మడత

(3) ఉగ్గు [గో]

కంచరబండి = కంచరసామాను (ఇత్తడి పాత్రలు) పెట్టుకొని, అమ్ముటకు ఊరు ఊరు తిరుగుబండి [కర్నూ; నె]

కంచి=కంచె [తె; నె]

కంచిఇడ్లి=మసాలావేసిన వండిన పెద్దఇడ్లి [చి; నె]

కంచిమేక = మేకలలో మంచితెగ, పొట్టివి. ఈతకు రెండుపిల్లలు ఈనును.

కంచుగంటవలె=రాపులేనికంఠధ్వనితో—*వాడు కంచు గంటవలె పలుకుతాడు* [కర్నూ; నె]

కంచుడి=అన్నముతిను పాత్ర [వి]

కంచుడు=మట్టిగిన్నె; మూకుడు [కరీ]

కంచుపదును=సున్నితము [కరీ]

కంచుపట్టలది=(1) పనిలోను పెత్తనము లోను మగవారితో సమానమైన గడుసరి ఆడుది; గయ్యాళి; నెఱజాణ [నె]

(2) పతిలో ఎంతైన అపసిపోవని ఆడుది [వి]

కంచువట్టలవాడు = ధైర్యశాలి, బలవంతుడు [అ]

కంజాయింపు = లోటులేకుండా చక్కగా నిర్వహించుట [తూ-గో]

కంజీమంచము = పేపబెత్తము చీల్చిన పోగు లతో అల్లిన మంచము; కమిజీమంచము [నె; కర్నూ]

కంజు = చేనిచుట్టూ వుంచు రాతిగోడ, కంచె గోడ [అ]

కంటసరి = మెడలో ధరించు కంటె [నె-పొ]

కంటికి ఆను = ఒకవ్యక్తి దర్శనీయుడై గౌరవమును పురిగొల్ప గలిగి యుండుట —అయన కంటికి ఆనలేదు [నె; గు; తూ-గో]

కంటనీరుపడుచు = (1) ఊరడించు, ఉపశమింపజేయు (కన్నీళ్లుతుడుచు) [అ]

(2) వట్టివట్టి ఊరడింపులుచేయు —ఆయన ఆదుకోకపోయినా కంటనీళ్లు తుడిచిపోయినాడు [నె]

కంటనీరుపోయుట = అపరక్రియలలో, కర్మ చేసినవానిని ఓదార్చుటకు పందిరిలో నిలిపిన శిలలపై (కొయ్యమేకులు) సగోత్రులు నీరుపోయుట [నె]

కంటిపులి = ఎద్దుకు కంటిదగ్గరనుండు సుడి — కంటిపులిసుడి ఉంటే ఇంటిపులి వస్తాడు [చి]

కంటిబెదురు = కొట్టక పిల్లలను కన్నుతోనే బెదిరించుట [సర్కా]

కంటిలో కారముచల్లు = మోసగించు [తె]

కంట్లపునూనె = గానుగలోనుండి అప్పుడే తీసిన కొత్తనూనె [కరీ]

కంట్లాము = 64 (అరవై నాలుగు) వీశెలు [శ్రీ]

కండ = (1) సత్తువ — కండగలనేల [నె; కర్నూ; అ; తె]

(2) శిశువు — కండ నీకుండ చేశాము; చిన్నవాణ్ణి పెద్దవానిగా చేశాము అనుట [వి]

కండ = స్త్రీ ఋతురక్తము; ముట్టుబట్ట అన్నట్లు — నీనోట్లో నాకండలు అని నిమిలిట్టు [వ]

కండసక్కెరి = కలకండ [అ]

కండ్రి = కనరు; కరుడు [గు; తూ-గో]

కండ్లవెఱ్ఱి = ఆకర్షకము — ఆవేశం కండ్ల వెఱ్ఱిగానున్నది [నె-పొ]

కండ్లుకుట్లు = కండ్లకలక [అ]

కండ్లుబైర్లుగమ్మినవి = కండ్లు కనపడకుండ అయినవి [మ]

కంత = (1) బొక్క

(2) కంచెలోనున్న చిన్న ఇరుకుదారి [నె; కర్నూ; తె]

(3) పెండ్లియందు ఉప్పు పప్పు బియ్యము పెట్టిలో ఉంచి తీసికొనిపోయి పెండ్లివారి కిచ్చునది [చి]

(4) కణత, కన్ను ప్రక్కభాగం [వ; కరీ]

కంతరిస = పెద్ద అరిస; పెద్దనిప్పటి [వి]

కంతి = దెబ్బతగిలి ఏర్పడినబొప్పి; కణితి: గంతి [కర్నూ; వ; కరీ; చి]

కంతిరీగ = తేనెటీగ, మధుపము; కందిరీగ; కందురీగ [నె]

కంత్రి = (1) నకలు

(2) బజారురకము; (అతి సామాన్యమైనది)

(3) బలహీనమైనది

(4) మోసము [అ]

(5) సంకరము—కంత్రీదొర = ఆంగ్లో ఇండియన్ [నె]

కంతు = వాయిదా — కంతులు కంతులుగా డబ్బుకట్టాడు [చి]

కంద = గణుసుగడ్డ; చిలగడదుంప; రత్నపురిగడ్డ [తె-మానికోట; వ]

కందకందయైనది = మెత్తగాయైనది [కరీ]
కందకము = పొలమునందలి నీరు బయటికి పోవుటకు తీయు కాలువ [నె-మెట్ట]
కందపెట్టె = పెండ్లిలో, పెండ్లికొడుకు వెంట ఒకరు మోసికొనిపోవు పేపపేము (Rattan) పెట్టె. ఇందు ఒక కందగడ్డపెట్టి యుంతురు. ఈ కందవలె క్రొత్తదాంపత్యము పిల్లలు బెట్టి సంసారము వృద్ధికావలెనను శుభకాంక్షను తెలుపు సాంగెము [నె]
కందమ్మ = ఐత్తులలోని శిశువు [అ]
కందమూలము = చిలకడదుంప, గణుసుగడ్డ [గం]
కందాయము = భూమిసిస్తు [అ-పె]
కందిము = పందిటిగుంజ; బాజా [గు]
కందిరీగ = తేనెటీగ; కంతిరీగ, కందురీగ [కర్నూ; అ; వ; గో]
కందిలి = ల్యాంట్రన్; లాందరు కందిలు [తె]
కందిలు = లాంచెరు, కందిలి [నె]
కందురీగ = (చూ) కంతిరీగ, కందిరీగ [నె]
కందూరి = పీర్లపండుగలో పీర్లకు భక్తులు నివేదించు మాంసభోజనము, అవలచేయు ఉత్సవము [గు; అ; నె; మ]
కండెనబెట్టు = (1) నష్టపఱచు; మోసగించు —*అతడు నాకు లెస్సగా కండెనబెట్టెను* [కరీ]
(2) పనిచేయించుకొనుటకు చేయు సదుపాయము—*ఇరుసున కందెనబెట్టక* ... *మేశ్వారుబండియైన పారదు*
కంబారి = (1) పనివాడు; నిత్యసేవకుడు
(2) పొలములలోను ఇంటిలోను పనిచేయువాడు [శ్రీ; గు]
(3) జీతగాండ్రు; కమతగాండ్రు [శ్రీ]
(బహువచనం—*కంబారులు*)
కంబి = కమ్మి; తక్కువ [సే]
కంబోరు = కమ్మవారు [కరీ]

కక్నీళ్లు = బియ్యముకడిగిననీళ్లు; కుడితి [చి]
కక్క = (1) పినతండ్రి; చిన్నాయన
(2) పాయసం [సే]
(3) సంకటి [ప]
(4) పాదె—*కక్కగట్టు* [గం]
కక్కగట్టు = ఒకతిట్టు, — *పాదెగట్ట అనుట* [గం]
కక్కరాలు = గోధుమపిండి, బెల్లము కలిపి పాకంపట్టి కొబ్బరి కోరు పూర్ణముపెట్టిన పిండివంట [వి, శ్రీ, గం]
కక్కసము = తప్పనిసరి — *అతడు నాల్ కక్కసముగా నన్ను నిలబెట్టి తబ్బుపుచ్చుకొనెను* [కరీ]
కక్కసు = మరుగుదొడ్డి [చి, నె]
కక్కాయి = పినతండ్రి, కక్క
కక్కిరాచ = చిన్నచిన్న మచ్చలుగలిగిన కోడిపుంజు, పొడకోడి, పెద్దమచ్చలది [నె, ఆత్మకూరు]
కక్కు = (1) పనికిలిబండకు తిరుగలిరాళ్లకు కత్తిపాదరకు (ముఖ్యముగా కొడవలికి) పదును ఎక్కుటకుగా కొట్టు చిన్నగాట్లు —*కక్కుకొట్టినారు; కొడవలికి కక్కు కోసినారు* [నె; అ]
(2) గంట్లు [వి]
(3) ముల్లుపోయుట [అ]
(4) బిచ్చగాళ్లలో ఒకజాతి [గో]
కక్కుటాకు = పసిబిడ్డలు పాలు కక్కుచుండగా, వ్రేలికి తొడుగు సన్నటి ఉంగరము [నె]
కక్కుర్తి = తగనిపనికి పాల్పడుట [తె; నె]
కక్లూతు = కక్కుర్తి [అ]
కచిక = పేడపిడక కాల్చిన బూడిదబిళ్ల; కచ్చిక [నె]
కచ్చు = (1) నాటు, మొరటు—*కచ్చారోడు* [తె]
(2) పగ; కక్ష [కర్నూ]

కచ్చపోతు=(చూ) కచ్చిపోతు [నె]
కచ్చపోయు=గోచిపెట్టు [తె]
కచ్చబిగించు=పోరుకు సిద్ధమగు; పంచ ఎగగట్టు [కరీ; వి]
కచ్చలుగిల్లేవాడు = విరోధాలు కల్పించే వ్యక్తి [అ]
కచ్చాపచ్చా = తెగతెంపులు — *కచ్చాపచ్చాగా మాట్లాడివేసినాడు* [నె]
కచ్చి=పోట్లాడు స్వభావముగల [అ]
కచ్చిపోతు=(1) పగసాధించువాడు
(2) కుళ్లుబోతు [నె]
కచ్చు=(1) గుడ్డలు కలిపి కుట్టునపుడు, లోపలికి పోనిచ్చిన ఎక్కువగుడ్డ [గు; అ-పెను]
(2) గుడ్డ నేసినప్పుడు రెండుమూరలకు మధ్య పేక దారం లేకుండా ఖాళీగా అట్టి పెట్టినది (చింపి వేరుచేయుటకు) [గు]
కచ్చు=(1) గోచి;
(2) గోడకచ్చు; కీటు [కరీ ;వ]
(3) దెబ్బ
(4) ముక్క (కచ్చుబెట్టు)
(5) పేనిన మోకులపైన బయటికి వెళ్లకొని వచ్చిన మోసులు — *కచ్చుకోసిన మోకు* [నె]
(6) కాటు [తె]
కచ్చె = కక్ష; పగ, కచ్చెపోతు; కచ్చి [చి, వ]
కచ్చెపోవు=ఆశ్చర్యపడిపోవు [శ్రీ]
కచ్చే=తమలపాకుల చిన్నకట్ట; పిడి [కరీ]
కజ్జ=పోరుకు సిద్ధము [కరీ]
కజ్జకాయ=(1) కరిబెల్లలు [వ]
(2) (చూ) కజ్జికాయ [నె]
కజ్జా=కొట్లాట, దెబ్బలాట [శ్రీ]
కజ్జాయము=తురిమిన కొబ్బెర, చక్కెర కలిపిన తినుబండారము; పంచకజ్జాయము [కర్నూ; నె]

కజ్జాయాలు=నిప్పట్లు; అరిసెలు [సే]
కజ్జికాయ=కొబ్బెరతురుము(సన్నగా తురిమినది) చక్కెరగాని, పప్పులపొడి బెల్లముగాని లోపలపెట్టి గోదుమపిండి పూరీలో పొదిపిచేసిన తినుబండారము; తీపిసోమాసి; కర్జకాయ [తె; నె; అ; కర్నూ]
కజ్జెము=పప్పుబెల్లము కలిపిన చిరుతిండి [కరీ]
కటంబలి = జొన్ననూకలతో వండిన అన్నము; జొన్నన్నము [కర్నూ]
కటకటఆను=జనము క్రిక్కిరిసి దట్టముగా మూగు; కిటకిట ఆను[నె]
కటవ=(1) చిన్నతిప్ప
(2) గడ్డివేయుటకై ప్రత్యేకించినచోటు[చి]
కటాంజనము=కటకటాలు [అ]
కటాకటి=(1) కచ్చితముగా [కరీ]
(2) అతికష్టము —*కటాకటిమీద ఆ పని అయినది* [నె]
కటామణి=నూర్పిడి; కుప్పలు నురుచుట[అ]
కటికనిషేకము = సమర్తాడని వివాహిత కన్యతో భర్తను కలుపుట [గు]
కటికముక్కలవాడు=కఠినాత్ముడు [వి]
కటిక్కన=(1) గట్టిగా — *కటిక్కన తుమ్మినాడు*
(2) మొగమాటము లేకుండా — *కటిక్కన లేదన్నాడు* [నె]
కటుకు=కరినము [కరీ]
కటేకారుడు = హాస్యగాడు, విదూషకుడు, ఆరవ భారతనాటకములందలి విదూషకుడు [చి]
కట్ట=(1) ఇంటిముందరి అరుగు; తిన్నె
(2) వడ్లకట్టలు (మూటలు) — *కట్టలున్న కొంపవు,పుట్టలున్న మడికి చెడుపులేదు*[వి]
కట్టకము = కట్టినభవనము; కట్టడము [కర్నూ]

కట్టుకొమ్మ=నీరు కాలువ లోనికి మళ్లించుటకు ఏటిపాయకు అడ్డముగా వేసిన అన (కట్ట); కట్టుకొమ్మ [కర్నూ]
కట్టగట్టి=(1) సిద్ధమయి; [కరీ]
(2) అందరు ఏకమై [కరీ; నె]
(3) వరుసగా మూగి [కరీ]
కట్టడము=కట్టినభవనము; కట్టకము [నె, ప]
కట్టుబెట్టు = బలవంతపుపెండ్లి; కట్టిబెట్టు [కర్నూ; నె]
కట్టరాయి=ఆయుర్వేద వైద్యులు సిద్ధము చేసిపెట్టుకున్న వంశానుగతమైన మందు (కోపు). రాతివలెనుండు ఈ ఔషధమును సాది యిత్తురు; కుప్పికట్టు [చి]
కట్టాయం=(1) దివ్యస్థలములలో దేవునకు చేసినమహానివేదనమును పూజారులందరూ పంచుకొనునది. దానినే వారు యాత్రికులకు అమ్ముదురు [గో]
(2) నిశ్చయము—*కట్టాయంగా రావాల* [నె; చి]
కట్టిపెట్టు=(1) బలవంతముగా పెండ్లిచేయు—*నాడికి వద్దనేకొంది ఆమెను కట్టిపెట్టినారు*
(2) ఇక చాలించు అనుట—*ఇక నీఆటలు కట్టిపెట్టు* [నె, తె; అ]
(3) అప్పగించు — *దానిని కట్టిపెట్టినా* [నె-పొ]
కట్టిమోత=వరి, చొప్ప మొదలగువానిని కట్టలుగట్టి మోయుట; పనమోత [కరీ]
కట్టు=(1) కులకట్టుబాటు
(2) మంత్రించి విషకీటకముల విషము ఎక్కకుండా అరికట్టునది — *కట్టువేసినాడు.*
(3) కందులు మొదలగువాటి కషాయము—*ఉలవ కట్టుచారు*
(4) కట్టకు బిగించిన లోహవలయము.
(5) రేఖామాత్రముగ ఏర్పడిన మీసము—*ఇప్పుడే మీసకట్టు ఏర్పడుచున్నది*
(6) ఇంద్రజాలములో భ్రమ—*కనుకట్టు* [నె; కర్నూ; తె; అ]
కట్టు=(1) తీవ్రము; గాఢము [గు]
(2) విరేచనములందు చివరనపడు కల్మషము [చి]
(3) అదుపు; నిర్బంధము—*కట్టులోబెట్టు* [వ]
కట్టుకాల్వ=చెరువునకు ఏటినుండి నీటిని మళ్లించు కాల్వ; వరవ కాలువ [చి]
కట్టుకున్నది=భార్య [వి]
కట్టుకొంగు=నడుమునకు కట్టిన చీరకొంగు × పైటకొంగు [తె, నె; అ]
కట్టుకొను = పెండ్లాడు — *కట్టుకొన్న పెండ్లాము* × ఉంచుకొనినముండ [నె]
కట్టుకొమ్మ=(చూ) కట్టకొమ్మ [నె, అ-పె]
కట్టుకోక = పలుమారు ధరించు చీర × దాపుడుకోక. [నె, కర్నూ]
(2) ధరించువస్త్రము — *యాచమ నాయని త్యాగము గోచులకేగాక కట్టుకోకల కగునా?* [తె; నె; అ]
(3) ధరించిఉన్నచీర—*కట్టుకోకతో వచ్చేసింది* [చి; నె]
కట్టుగాడి బిగువు = స్థానబలము; పెంటబిట్టు. గింజపొగరు అన్నట్లు [నె]
కట్టుగొయ్య=(కట్టు+కొయ్య) పశువులను కట్టివేయు గుంజ; గూటాము [కృ]
కట్టుపంచ = ధోవతి; మొలపంచ; అంతరీయము [నె]
కట్టుబడి=(1) ఒక మాన్యమునకు కట్టవలసిన పన్ను—*కట్టుబడిమాన్యం* [శ్రీ; నె; తె; అ]
(2) చేసినపనికి చెల్లించవలసిన మొత్తము
(3) భవన నిర్మాణ పరిమితి — *అది పది అంకణముల కట్టుబడి* [నె; అ; తె]

(4) గ్రామోద్యోగుల దగ్గర పనిచేయు బంట్రోతు; తలారి [కర్నూ]

కట్టుబడివాడు = తలారి [తె]

కట్టుబోతు = మంత్రాలమారి; మంత్రగాడు; కట్టుమోతు [కరీ, వ]

కట్టుమట్టు = (1) పశువులు కట్టివేయుకొట్టము ; లేక పెంట [నె]

(2) కుప్పనురిపిడిలో చిట్టచివరి పడుగులో గింజలపై నిలిచినగడ్డి [నె - ఆత్మకూరు]

కట్టుముడి = నిబంధన [కరీ]

కట్టుమోతు = (చూ) తోడుబోతు; మాంత్రికుడు; మంత్రాలమారి

కట్టువ = (1) పొలము సరిహద్దులలో నిర్మించిన రాతికట్టడము

(2) వంకలకు అడ్డముగా వేసినకట్టలు

(3) చిన్నగుట్ట [అ]

(4) రెండుచేల మధ్యనుండు ఎత్తైన గట్టు, కత్తువ [నె-పొ]

(5) ఎల్లకంచ — *కట్టువపల్లి* [నె-దక్షిణము]

కట్టె = వంటచెఱకు; కఱ్ఱ [నె; కర్నూ; అ; తె]

కట్టెగొట్టినట్లు = ఖండితముగా, కట్టె విరచినట్లు [కరీ]

కట్టెపండు = గింజలతోను; ఉట్టెలతోను ఉండు చింతపండు [నె; కర్నూ; అ; తె]

కట్టెపొంగలి = బియ్యము పెసలపప్పుతో పాలుపోయక వండినపొంగలి [నె-పొ]

కట్టెలు = (1) పుల్లలు

(2) కలప [తూ-గో]

కట్టెచరచుకొనిపోవు = (1) కట్టెవలె గట్టిగా నగు—*కాళ్లుచేతులు చల్లబడి కట్టెచరచుకొనిపోయినవి* [వ]

కట్టెపారు = (1) కట్టెవలె పొడవుగా గట్టిగా ఉండుట—*కట్టెపారుమనిషి* [నె]

(2) కొయ్యబారు [వ]

కట్టెపిట్ట = బక్కచిక్కినవ్యక్తి; కట్టెపారు మనిషి

కట్టెలోపెట్టుట = ఖైదులోనుంచుట [అ]

కట్టెవాఱు = ఎఱ్ఱబిగియు [కరీ]

కట్టెవిరచి పొయిలోబెట్టినట్లు = నిర్మొగమాటముగా, బెట్టగా మాట్లాడుట [నె]

కట్టెసామాను = గృహనిర్మాణమునకు వలసిన కలపసామాను [అ]

కట్టేత = భర్తపోయిన స్త్రీని మరొకనికిచ్చి చేయు పెండ్లి; మారుమనువు [గో]

కట్నాలు = (1) సోపానములు; మెట్లు; — *కట్నాలబావి* [వ]

(2) నిషేకముహూర్తము [నె]

కట్రాడ = కట్టుకొయ్య; గుంజ — *బఱ్ఱె కట్రాడచుట్టూ తిరుగుతున్నది* [వ-గో]

కట్లపాము = కట్లుకట్లుగా చారలుండు సన్నపాము, దీనికి విషమెక్కువ [చి]

కట్లపొడి = బీదలు వక్కాకుతో వేసికొను పొగాకు పుల్లలపొడి; కడ్లపుడి [అ]

కట్లా = వివాదము; కలహము [అ]

కట్లు = బండిచక్రపు పట్టాలు, నేములు [చెం]

కడ = (1) దగ్గర [నె; కర్నూ; అ]

(2) పశువుల చివరి ప్రక్కపన్ను—*అది కడలువేసినకోడె* [నె; వ]

(3) ప్రక్క—*కడతొలుగు* [వ]

కడంచిల్ల = (చూ) కడచీల [అ]

కడంచున = కట్టకడపట [అ]

కడంతరకాలము = జీవితాంతము — *కడంతరకాలము మరిచేమాట యిది?* [చి]

కడంతల = (చూ) కడకంతలు [తె]

కడకంతలు = దూరముగనుండు ప్రదేశము —*కడకంతల పల్లె* [నె]

కడకళ్లము = కళ్లముయొక్క అంచులు [కరీ]

కడకాలు = గోడకట్టుటకు త్రవ్విన లోతు గాడి; గుణావర్దము; గుణపర్దనము, గుణాది, కడగాలు [నె, అ; చి]

కడగ = (1) బయటచేరుట; బహిష్కయగుట; కడాగ — *కడగడున్నను తాకకు* [కర్నూ]

(2) అవతల; —*కడగాపోరా* [ఓ; నె]

కడచిల్ల = (చూ) కడచీల; కడసిల్ల, కడం చిల్ల [అ-పె]

కడచీల = బండిచక్రము ఇరుసుకు బయట బిగించు ఇనుపచీల, కడచిల్ల [నె, వ]

కడజేయు = అలక్ష్యముచేయు—*నన్ను కడ జేసినారు* [నె-పొ]

కడప = (1) ఇంటిసింహద్వారపు క్రిందపట్టె — *కడపమీద కూర్చోకు; నా కడప త్రొక్కకు*; గడప [నె; కర్నూ; చి; వ]

(2) ఇల్లు—*ఆ వూరి కడపఎంత* [మ; నె]

కడప దండాలు = (1) వాకిలిముందు సాగిల బడుట.

(2) నీచస్థితికి దిగుట [కరీ]

కడపపూజ బెట్టు = (చూ) కడపముగ్గుపెట్టు [నె]

కడపబండలు = నాపరాళ్లు, కడపరాళ్ల [కర్నూ; నె]

కడపమాను = దేహళి; కడప [అ]

కడపముగ్గుపెట్టు = కార్యార్థము ఒకరిఇంటి చుట్టు పలుమారు తిరుగుట [నె; వ]

కడమ = మిగత; తతిమ్మా [చి, వి, నె]

కడముంత = చిన్నచెంబువంటి మట్టిపాత్ర —*కడముంతతోగూడ నీళ్లు ఇవ్వలేదు* [నె; తె]

కడలకడల = దూరందూరముగ — *కడల కడల నిలబడినారు* [నె; అ; వ]

కడలు = (కడల) చివరనుండు పశువుల దంత ములు; ఇవి వయస్సు దెల్పు పండ్లు— *ఈ కోడె కడలేసింది* [నె; మ]

కడలేయు = గొంగడ అంచులుగట్టు [నె]

కడవ = (1) తలుముకు (ఏతము) నీరు ఎత్తు టకు బిగించు లోహపుబాన [నె]

(2) చిన్నమూతిగల కుండ [కర్నూ; సర్కా]

(3) బిందె— *ఇనపకడవ* [అ]

(4) మట్టికుండ [తె]

(5) పెద్దమూతిగలకుండ; [అ; మ]

(6) 33⅓ శేర్ల కొలగారపుకుండ [అ]

కడసి = కడపటి [సే]

కడసీల = బండిఇరుసు చివరన వేసిన చీల [నె]

కడాన = చివరన—*ఆయన కడాన వచ్చి నాడు*, కడన, [నె, కర్నూ; వ; అ; తె]

కడాణి = బండిఇరుసు [సే]

కడాని = బండికడచీల [చి]

కడి = భోజనపుముద్ద [తె]

కడితి = (చూ) కణితి [నె]

కడిద = నల్లగాజేసి, దానిపైన పిండి బలప ముతో వ్రాయుటకు వీలైన కాగితము. ఇది పూర్వపు లేఖక సాధనములలో ఒకటి

కడిదొబ్బు = (నీచార్థములో) పెద్దపెద్ద ముద్దలుచేసి మ్రింగు [నె- మెట్ట]

కడిపోవు = (1) చెట్లకొమ్మలు ఆకులు చిగి రింపక ఎండిపోవు

(2) పాడగు; కడబోవు [అ]

కడిమి = వరికుప్పల నురిపిడులలో త్రొక్కి నలిగిన గడ్డిని కల్లము చుట్టువేసిన తాత్కా లికమైనపోగు, మెడివామి; కడెము [నె]

కడియం = (చూ) కడిమి [సర్కా]

కడియాలు = (1) స్త్రీలు కాళ్ళకు పెట్టుకొను వెండి వలయములు—*కాళ్ల కడియాలు*; కడెము [నె; మ]

(2) చేతులకు ధరించు వలయములు — *దండకడెము* [కర్నూ]

(2) (హస్తా) ముంజేతికంకణములు — *బంగారుకడియాలవారు;* మురుగులు [నె-దక్షిణం; వ; అ]

కడుగు = బియ్యము కడిగిన నీరు, ఇది పులిసిన కుడితి అగును, గంజిలో కలిపిన దానిని కలి అందురు [నె]

కడుచిల్లలు = బండిచక్రాలకడనుండు చీలలు; కడచీలలు [అ]

కడుపాత్రం = (1) కడుపుకక్కుర్తి—*కడుపాత్రంలో అపని చేసినాడు* [నె; కర్నూచి; తె; అ]

(2) రక్తసంబంధము [కర్నూ]

కడుపుకట్టు = కడుపుమంట; ఓర్వలేనితనము—*కడుపుకట్టుతనము* [వ; నె]

కడుపుకూటివాడు = అన్నవస్త్రములతోనే ఇంటిపని, సేద్యపుపని చేయు పనివాడు; వేరేజీతములేదు. (తిక్కన ద్రౌపదిచేత యీమాట అనిపించినాడు) [నె, వ]

కడుపుకోత = పుత్రశోకము [తె]

కడుపుగొట్టు = (1) ఎక్కువగా విరేచనాలగు [కరీ]

(2) జీవనోపాధిని తొలగించు—*కడుపుగొట్టకు* [నె]

కడుపుసెగ = నీటిచురుకు వ్యాధి(గనోరియా) [చి]

కడుపుబ్బరము = ఓర్వలేనితనము; కడుపుఉబ్బరము [నె]

కడుపూదరబట్టు = చంటిపిల్లలు ఏడ్చిఏడ్చి, సహించరాని దుఃఖపుటావిరితో బాధపడు [కరీ]

కడుపోడు = తిండిపోతు, (కడుపువాడు) [చి; నె]

కడెక్కిపోవు = తపించిపోవు — *ప్రాణం కడెక్కిపోయింది* [వి]

కడెము = వలయాకారముగా వేసిన నిలువెత్తు గడ్డికుప్ప; కడిమి [సర్కా]

కడొత్తు = (కడబత్తు) ఇంటికప్పు క్రింద చివరనవేసి బిగించు అడ్డవాసము — *కడొత్తు సరిగాలేక నూరు వాలింది* [నె]

కడ్డాయము = నిర్బంధము; బలవంతము—*ఆపని చేయవలెనని కడ్డాయమా?* [తె, నె, కర్నూ, అ]

కడ్డీఅంచు = సాధారణముగా సరిగతో వెడల్పుగా పూజలు లేకుండా సాదాగా నేయు అంచు—*వెంకటగిరికడ్డీ అంచు పైపంచ* [నె; అ, తె]

కడ్డీపుల్ల = ఊదువత్తి; సాంబ్రాణికడ్డీ [చి]

కడ్డీలు = దూలములపై పేర్చు వాసములు [అ]

కడ్డు = మొరటు; హారము, పట్టుదల [అ; చి]

కడ్లపుడి = పొగాకుకాడల చిన్నతునకలు: కట్లపొడి [నే]

కణము = (చూ) కణెము; లోగాడిపుల్ల [వ]

కణయి = నూనెకాచుకొను పాత్ర; కళాయి [శ్రీ]

కణిక = పొడుగాటి తిరుమణి, బలపపు ఒండికలు—*బలవపుకణికలు;* కోపు [కరీ]

కణిజము = ధాన్యముకొట్టు [చి]

కణితి = (1) దెబ్బతగిలి దేహముమీద ఏర్పడిన మోద; బొప్పి

(2) ఆవువలెనుండు పెద్దజాతిజింక; కంతి; గంతి [నె]

కణిసించు = గమనించు; గుర్తించు — *కణిసించి పోయినాడు* [నె]

కణుజు = కుక్కలకు పట్టు పురుగు [తూ-గో]

కణెము = (1) బండికాడికి ఇరుప్రక్కల నుండు రంధ్రములలో దిగవేయు కొయ్యచీలలు; లోగాడిపుల్ల; కణము [వ]

(2) చెరుకుగానుగలోని చెరుకుల నలుపు గుండ్రని ఇరుసులు [చి]

కణెయించు = కదలక కూర్చుండు [వి]

కతకతఅని = అయినదంటే, అయినదని నట్లుగా వివాహాది కార్యములుచేయుట[మ]

కతకతఆని = సందులేకుంటా దట్టముగా జనము మూగియుండు—*అక్కడ జనం కతకత ఆనిపోయింది;* కటకటఅను[నె]

కతలుచేయు = వికారపుచేష్టలుచేయు —*ఏమంతా కతలు చెస్తున్నావే?* [ప]—*కతలుపడు* [నె]

కతలుపడు = వికారపుచేష్టలుచేయు;నటించు, —*ఆయన కతలు పడుచున్నాడు* [నె]

కతుకు = గుర్తు; కత్తితోనరికిన ఏర్పడిన గాయపుగుర్తు [చి]

కత్తవ = (1) త్రవ్వుటకు, ముఖ్యముగా చేల మడవలు తీయుటకు ఉపయోగించు వెడల్పు ఇనుపభాగము చివరన గలిగిన కట్టె [నె]

(2) కొండలవరుసకు అడ్డముగా తిరిగి యున్న కొండబోటు — *మల్లెంకొండ కత్తవ* [నె]

(3) ఏటినీరు ప్రక్కకు మళ్లించుటకు అడ్డముగా వేసిన అన—*కన్నెకల కత్తవ* నె-ఉదయగిరి]

(4) చేనుచుట్టు కట్టినగోడ; కరగోడ[తె]

(5) నీటిని, పొరుదల కాలువలకు, భూవిస్తీర్ణమునుబట్టి పంచిపెట్టు తూముల కలయిక; చిన్నయాగర (Small Regulator) [నె]

కత్తాయి = కరబంద; కలబంద [చి]

కత్తిగట్టు = విరోధము ప్రకటించు—*ఆయన నామీద కత్తిగట్టినాడు;* కోడిపుంజుకు కాలికి కత్తిగట్టి పందెమునకు వదలుటను బట్టి వచ్చినమాటగా ఉండనోపు [నె; కర్నూ; అ; తె]

కత్తిరిపడ్లు = కృత్తికకార్తెలో అలికిన (నాటిప) వరిపైరు పండు ధాన్యము; కత్తెరపడ్లు [హై]

కత్తిరిగాపు = కట్టుబాటు [ప-కృ]

కత్తిపీట = (1) కూరగాయల తరుగుటకుగా, కత్తిని నిలుపుకు బిగించియుండు పీట [నె; కర్నూ; శ్రీ; తె; కృ]

(2) చెట్లు గీయు గమునుడు తన కత్తులను ఉంచుకొను పెట్టెవంటిది [నె-ఆత్మకూరు]

(3) ఒకఆట [కృ]

కత్తు = (1) తీరు; సక్రమవిధానము—*అపని కత్తుగా చేసినాడు* [వి; నె]

(2) ప్రాయము, జోడు — *అకత్తుపిల్లలు*,

(3) కత్తిగీత [కరీ]

(4) శత్రుపక్షము [నె-పొ]

కత్తువ = ఏటికి అడ్డముగా కట్టిన అడ్డకట్ట; అన; కత్తవ [కర్నూ]

కత్తెరవడ్లు = (చూ) కత్తిరవడ్లు

కదంబము = (1) వివిధరకముల కూరగాయలు వేసి వండిన పప్పుపులుసు; దప్పళం [అ]

(2) పలువన్నెల పూలతో కట్టినదండ[నె]

కదబడు = (1) అన్నము ఉడుకునపుడు పొంగులుతగ్గి సరియైన ఉడుకువచ్చి కుదురుకొను [గు]

(2) తడిసినప్పుడు గుడ్డ నేత మొదలగునవి దగ్గరై దట్టబడు [గు; నె]

(3) దట్టమగు [నె]

కదలిక = ఉత్సాహము—*దానిపై ఇంకా కదలిక ఏర్పడలేదు* [నె; తె]

కదమ = తక్కినది; మిగిలినది. కదము—*కదమవాటిని చూడు* [అ, నె]

కదవారు = మిగిలినవారు [అ]

కదుపు = (1) కదలించు, అటునిటు ఊగించు [నె-దక్షి]

(2) ఒకేజాతి పశువులగుంపు [నె; తె]

(3) జ్ఞాపకముచేయు; కదపు [అ]

కదుము = (1) రక్తము గడ్డగట్టిన మోద—*కదుముగట్టినది*

(2) నెట్టు; గదుము [నె]

కదులు=పర్యాయము [గు]
కద్దు=సబబు; సరి [వ-కృ]
కనకపిళ్లె=కరణము; కులకర్ణి; పట్వారి; శానభోగు
కనప్పండుగ = పశువులపండుగ; కనుము [నె]
కనమ=గాయంతగిలి మానినగుర్తు [చి]
కనరు=(1) వంకాయ మొదలగునవి బద్దలుగా కోసినతర్వాత నీళ్లలో వేయకుండిన కలుగు అరుచి; నల్లబడు; కరుణ [కర్నూ]
(2) పొగరు; మదము — *వాడు కనరు మనిషి* [కరీ]
కనాకష్టం=చాలాకష్టం [అ; నె]
కనాలు=(చూ) లోగాడి, వెలిగాడిపుల్లలు [కరీ]
కనికని చీకటి=వస్తువులు కనిపించి కనిపించని చీకటి (ఉదయమునగాని సాయంత్రమునగాని)—*కనికని చీకటితో బయలుదేరితే జాము ప్రొద్దు ఎక్కునరికి చేరతాము*; కనుచీకటి [నె]
కనికెడు=(చూ) కమికెడు; కంకెడు [తె]
కనిపించి = (1) అభిమానముతోచూచి; కనిపించిపో [అ]
(2) బాగోగులు నిర్ణయించి [నె]
కనివాడు=భట్రాజు—*కని సుబ్బరాజు*[నె]
కనుకొరుకు=నిద్రకుగా కనుమూయు — *ఇప్పుడే కాస్త కనుకొరికినా* [నె,తె,అ]
కనుగప్పరగాడు=గబ్బిలము [అ]
కనుగూర్కు=(చూ) కనుకొరుకు [తె]
కనుగొట్టు=కనుసైగచేయు, కన్నుగిలుపు; కామార్థము కంటితోచేయు సంకేతము; —*దాన్ని చూచి కనుగొట్టిండు*, కన్నుగొట్టు [వ; నె]
కనుచీకటి = సాయంకాలమున వస్తువులు చూడగలిగినంత చీకటి — *మేము అక్కడికి చేరు నరికి కనుచీకటి పడింది*; కనికని చీకటి [నె]
కనుచూపులు దొరకవు= అవసానకాలము సమీపించినది [కరీ]
కనుతాలు = కంటికి గురుత్వముగా కాన్పించు; గణనకువచ్చు. చూపుకు ఆను —*ఆయన ఎవరికీ కనుతాలలేదు* [నె; అ; తె]
కనుపిరికి = కొత్తదానిని చూచినప్పుడెల్ల బెదురుగుణము — *అది కనుపిరికెద్దు*; గోవ [నె; తె]
కనుమ=సంక్రాంతిపండుగు, కనప్పండుగ; [వ]
కనుమ=కొండలలో ఉండు పచ్చికబీడు—*పశువులకనుమకు దోలినారు* [నె; అ; తె]
కనుమరుగు=(1) చూపుకు తగులకుండాపోవు— *వాడు కనుమరిగిపోయినాడు*[నె; తె]
(2) చూపుకు అడ్డము; చాటు—*తల్లికైన కనుమరు గుండాల* [నె; అ]
కనుమసక=కొంచెము మసకచీకటి [కరీ]
కనుమూయు=మరణించు [కర్నూ; నె]
కనురు=(చూ) కరుణ [తె]
కన్న=(1) నానారకాలు - *కన్నకూళ్లుగుడిచి; కన్నవారికాళ్లుబట్టి* [తె]
(2) కనుపించినదెల్ల
కన్నది=భోగముసాని; కన్నెది [చి]
కన్నట్టు= సేద్యపు పసరమునకు మెడపై ఏర్పడిన చిన్న నలుగుడు చర్మము × తెంపట్టు [నె]
కన్నవాని=కన్పించినవాని; విటుని [చి]
కన్నాకు=(1) తమలపాకులపిడికి (చిన్న కట్టకు) పైన కనుతాలునట్లు పెట్టి కట్టు మేలుఆకు
(2) శ్రేష్ఠము; ముఖ్యుడు [నె; తె; అ]
(3) తాటాకులపుస్తకంలో మొదటి-చివరి ఆకు [వ]
(4) చెట్టుయొక్క చివరి ఆకు; కోటాకు [గో]

కన్నానదు=(1) కంటికి ఇంపుగొల్పదు.
(2) తనకన్న అధికముగా కానరాదు[మ]

కన్నిడుచు=తాటికాయలలోనుంజె (ముంజ) లేర్పడు; సీతాఫలాలలో కనులేర్పడు [చి]

కన్నికలు = సప్తకన్యలు; చెరువుకట్టపై ఏర్పరచిన ఏడు మట్టిగుళ్లములు; వీటిని కన్యదేవతలుగా పూజింతురు. ముదురు వచ్చ వన్నె వీటికి వేయుదురు. వీటికి పొంగళ్లు పెట్టగనే వర్షం వచ్చి చెరువు నిండునని నమ్మకము; అగ్గారు [చి]

కన్నిరికము = (1) వెలయాలు రజస్వల అయినతర్వాత కానున్న విటుడుచేయు ప్రథమ సంపర్కము—ఆయన ఆమెకు కన్నిరకము పెట్టినాడు [నె]
(2) వేశ్యకు ప్రథమముగా విటుడు ఇచ్చు కన్యాశుల్కము. కన్నిరికము, కన్నెరకము [నె-ఆత్మకూరు]
(3) కన్యగానుండు వేశ్యను స్థిరముగా ఉంచుకొనుట [గో]

కన్నిరీకము = (చూ) కన్నిరకము; కన్నెరకము [తె, అ]

కన్ను=(1) చెరువు తూమురంధ్రము [చి]
(2) రంధ్రము—పెద్ద కన్ను చేసినాడు [నె]
(3) చెఱకు గణపులోని కన్ను; కందలోని కన్ను; [అ]
(4) పైరుకంకి [నె]
(5) పాదమునకు ఇరుప్రక్కలా ఉండు గుడుపలు; (బుడుపులు) [నె]

కన్నుంచు=కనిపెట్టు [చి]

కన్నుకురుకు=(చూ) కనుకొరుకు [తూ-గో; గు]

కన్నుచెదు=సొగసును చూచివలచు [కరీ]

కన్నుమప్పు = మోసగించు, కన్నుగప్పు [కరీ]

కన్నుమునిగ=సమృద్ధిగా [గు]

కన్నువేయు=(1) ఆశపడు — ఆవస్తువు మీద కన్నువేసినాడు
(2) వలపుగొను — ఆమెమీద కన్నువేసినాడు [నె; అ; వ]

కన్నె= (1) పశుపు; (పశువులను కట్టివేయునది) బంధము [కరీ; శ్రీ]
(2) స్వచ్ఛము; తేట — ఆనీరు కన్నెగ ఉన్నవి [అ]
(3) మొదటిది—కన్నెకయ్యము (Maiden battle)

కన్నెచెఱ=(1)కన్నెరికమనుబంధము[కరీ]
(2) పెండ్లికాకుండా అట్లే కన్యగా ఉంచుట—కన్నెచెర తగదురా [చి]

కన్నెరకము=(చూ)కన్నిరకము [తె; అ]

కన్నెఱికం=కన్యగావుండు వేస్యను స్థిరంగా ఉంచుకొనుట (చూ)-కన్నెరకము [శ్రీ]

కన్నేయు=(చూ) కన్నువేయు [కర్నూ;నె]

కన్నోడు=(1) ఎవడో ఒకడు
(2) ప్రతివాడు, తిరస్కారములో — కన్నోడికాళ్లు తావట్టుకొని (కనినవాడు) [మ]

కపాడి = (చూ) కపాది

కపాది = ఎద్దుమీదగాని,గొడ్డు ఆవుమీదగాని మోతగా రెండుప్రక్కలా వేయు బరువు ఈ కబాదిలు అమ్మి జీవించేవాళ్లు, కబాడీ లేక కపాడివారు. వీరు మాలలు; అయినను గోమాంసము తినరు. వీరిపూర్వులు తెలంగాణమున సైనికులుగానుండి, నెల్లూరుకు వచ్చిరి. వీరిని దండువాళ్లు అని గూడ అందురు. కబాడి—కపాదిపాళెము [నె]

కపిల=మోట; కపిలి; కపిలె [నె; కర్నూ; అ; తె]

కపిలి=కపిల; మోట; కపిలె [అ]

కపిల గురుజులు=దొరువుపై కపిల అమర్చుటకు బిగించిన రెండు నిలువుకొయ్యలు [చి]

కపిలబాన = మోట నీరెత్తుట ఉపయోగించు పెద్దపాత్ర. ఇది ఎక్కువగా తోలుతోకుట్టబడియుండును. దీనినుండి నీరు బయటకు వచ్చుట ఒకపొడవు తోలుసంచి—తొండముపలె నుండునది అమర్చియుండును. దీనికి తొండమనియే పేరు. [నె; కర్నూ: తె; అ]

కపిలవేళ = మధ్యాహ్నము, మూడుగంటలు [చి]

కపిలె = కపిల; మోట [అ]

కపిలెబిళ్ల = మోటతోలుట కుపయోగించు కొయ్యచక్రము; గిలకచక్రము [నె-పొ]

కప్ప = (1) తాళపుబుఱ్ఱ; కప్పతాళము, లప్ప [చి]

(2) యోని [వ]

కప్పకురుపు = గుదికాలపై లేచు పొరల కురుపు [చి]

కప్పగుల్ల = అరికాలలో లేచు పొరల కురుపు; కప్పకురుపు, దీనికి మంటఎక్కువ [నె, కర్నూ; అ; తె]

కప్పడము = కప్పుకొనునది—దుప్పటి [చి]

కప్పరచీకటి = తెల్లబడబొచ్చిన వేగుచీకటి — *కప్పరకప్పర చీకటిలో బయలు దేరినా* [నె]

కప్పతాళము = పెద్దతాళపుబుఱ్ఱ [నె, తె; వి]

కప్పతేలు = పెద్ద లావాటి తేలు, మంత్రగబ్బ [కరీ]

కప్పదాటు = (1) వరుసలో చేయవలసిన వాటిని కష్టమైనవాటిని మధ్య వదలి వేయుట [నె]

(2) పనిని నడుమ వదలినతరువాత మరల ప్రారంభించు—*వాడు ఈ పని కప్ప దాటుగా చేసెను* [నె-పొ]

కప్పదాటులు = చేసిన నేరమును చేయలేదని నమ్మించుటకు చెప్ప ఎన్నోతప్పుడుకారణములు

(2) ఒక విషయము మధ్యవదలి, వేరు విషయముల ఎత్తుట, [గో]

కప్పనాగులు = గొంతుదగ్గఱ ఏర్పడి చని పోవు కంఠవ్యాధి—*అతనికి కప్పనాగులు వచ్చినవి* [కరీ]

కప్పల తక్కెడ = అనైక్యము [కరీ, నె]

కప్పా = చొక్కా; కవిసె ]అ]

కప్పి = సున్నపురాయి కాల్చినతరువాత అందు నిలిచిపోవు చిన్నముడిరాయి [నె; కర్నూ: అ]

కప్పిరచీకటి = (చూ) కప్పరచీకటి

కప్పు = ఇంటికప్పును తాటిఆకుతో మూత వేయుట — *ఇల్లుకప్పినారు;* తుంగతో యీ పని చేసిన నేయుట అందురు [నె]

కప్పుకాలువ = (చూ) సవ్వ [అ]

కప్పుకాలువ = (చూ) యారాము [అ-పె]

కప్పులు = ఏతమునకు రెండువైపులా కాళ్లు పెట్టుకొనుటకు అమర్చు పొడవైన పలక వంటి కొయ్యలు [చె]

కప్పువేయు = పశువులు సాధారణముగా జబ్బుచేత నలుపు వన్నెబెట్టు—*ఆవుకప్పు వేసింది* [నె; తె; అ]

(2) జీవకళ తగ్గు [నె-పొ]

(3) జలుబులు పోవడానికై వేసికొను నల్లని చూర్ణము [గో]

(4) పండ్లకు దాసెనరాసి వేసికొనినరంగు [వ]

కప్పువేసినట్లు = కొంచెము కొనప్రాణముతో ఉన్నప్పుడు వాడుకొను జాతీయము; — *పైన కప్పు వేసినట్లున్నాడు* [కరీ]

కప్పూరాలు = మేకవట్టలు [వి]

కప్పెర = (1) జులపాలజుట్టు [కర్నూ]

(2) ప్రధానమైన పొడవు వెంట్రుకలజుట్టుకు ప్రక్కన కంచవలె దీర్చు పొట్టివెంట్రుకలరేక; కప్పెరజుట్టు [కర్నూ; నె-పొ]

కప్పెరచాప = వానకు తడియకుండ ఉపయోగించుగొడుగువంటి చాప [కరీ]
కబచ = చొక్కాయి; కప్చా [నే]
కబాడి = (మా) కపాది; కపాడి [నె]
కబోదినాటకము = (1) ఒకేవ్యక్తి చీకటింట జేరి, పలువురు మాట్లాడినట్లును, వివిధ ధ్వనులతోను సాగించు ఒక నాటక ప్రదర్శనము
దీనిని చీకటిలో చేయు ఏక పాత్రాభినయమనవచ్చును. దీనిని మహాప్రజ్ఞతో, ఒక కళగా ప్రదర్శించువారు గ్రామములలో చాలమందిగలరు [నె]
(2) గుడ్డివాడు చేయుపని—*అదంతా ఒక కబోదినాటకం* [నె]
కబ్బా = నిశ్చేష్టత; ఆశ్చర్యము — *కబ్బా అయిపోయాడు* [గం]
కబ్బీగా = గంభీరంగా; గబ్బీగా [అ]
కబ్బెల్లి = దయ్యం; పిల్లలను భయపెట్టుటకు గాను 'దెయ్యంవస్తుంది' అనే అర్థంలో కబ్బెల్లివస్తాడుసుమా అంటారు; కబ్బెల్లిగాడు; గబ్బెల్లిగాడు [అ]
కబ్బెల్లిగాడు = దయ్యము; పిల్లల పరిభాషలో బూచి [అ]
కమచీమంచము = (మా) కంజీమంచము
కమటము = కంసాలివారి కుంపటిసుత్తి దాకలిమొదలగుసామగ్రి—*నేను కమటము* పెట్టను, కమ్మరికొలిమివంటిది [నె-పొ]
కమతము = (1) ఒకపెద్దభూములలో ఒక భాగము, ఈడవ—*వాళ్లది పెద్ద కమతం* [నె, తె; అ]
(2) జమీందారుల సొంతభూములు, రైతు భూములు కానివి — *కమతం భూములు* [కృ]
(3) ఉమ్మడివ్యవసాయము [చెం]
(4) ఒకరైతుయొక్క వ్యవసాయం [కృ]
కమరు = (1) వెంట్రుకలు కాలి కొట్టు గబ్బు [నె; కర్నూ; అ]
(2) గుడ్డలుకాలిన వాసన—*కమురుకంపు* [వ]
కమలా తొన = నారింజతొన (బద్ద) [వి]
కమలాపండు = నారింజపండు [అ, నె]
కమాను = ఇంటికి కట్టిన ఆర్చి [నె,కర్నూ; అ; తె]
కమానుబెట్టు = (1) అదుపు — *కమాను బెట్టును చెడగొట్టుకున్నాడు* [నె]
(2) పరులకు తన మాటమీదగల లక్ష్యము [నె-పొ]
కమామిషు = వ్యవహారం [తూ-గో; నె]
కమాలు = ఎగతాళి, వేళాకోళము—*అకమాలు నంతా కట్టిపెట్టు* [చి]
కమికెడు = వ్రేళ్ల ముడువని పెద్దపిడికెడు —*కమికెడు అన్నంబెట్టు*, కనికెడు [నె; కర్నూ; తె]
కమిచి-కమ్చి = గుఱ్ఱమునుతోలు చిన్న సన్న కొరడా [నె, కర్నూ, తె; అ]
కమిజీమంచము = (మా) కంజీమంచము [నె]
కముజు = గువ్వజాతిలో చేరిన అడవి పూరిపిట్ట; కవుజు, కౌజు
కమురు = (మా) కమరు [నె, కర్నూ, అ]
కమ్మంచుచీర = గోరంచుచీర [అ]
కమ్మ = ఎండిన తాటిఆకుముట్ట బరిక [సర్కా]
కమ్మలకత్తి = పొడుగు గడకు కొనన కట్టిన కొడవలివలె ఉండుకత్తి, కత్తివోటి [మ, శ్రీ]
కమ్మచ్చుతీసినట్లు = సవరముగా ఒకేవిధమైన ఆకృతిలోనుండుట— *వ్రాత కమ్మచ్చు తీసినట్లున్నది*: కంసాలి తీగను చేయుటకు రంధ్రములుగల ఇనుపపట్టె బొక్కలగుండా లాగి పొడవుచేయును.

ఈ తీగవలె ఒకేలావుగా నుండుట అనుట; కమ్మెచ్చు తీసినట్లు [నె; అ]
కమ్మబ్రాహ్మణులు = తెలుగుబ్రాహ్మణులు [శ్రీ; గం]
కమ్మరగట్టు = నూగులు బెల్లంపాగుతో చేసిన ఉండ [చి]
కమ్మలు = చెవిదుద్దులు — *రాళ్లకమ్మలు* [అ; నె]
కమ్మాటి = పల్లెటూరివాడు — *పోరా కమ్మాటీ*; కామాటి [నె, దక్షి]
కమ్మి =(1) వంచెకు నేసిన వెడల్పు దట్టమైన అంచు [గో]
(2) బండిచక్రమునకు తొడిగే ఇనుప కమ్మి; పట్టా; నేమి [వ]
(3) ముక్కున పెట్టుకొను నగ [వి]
కమ్మి = తక్కువ—*డబ్బు కమ్మీ అయినది* [నె; కర్నూ; అ]
కమ్మించు = ఉసికొల్పు [అ, నె, మెట్ట]
కమ్మిటుబెట్టు = దాచు; గూఢముగా నుంచు [కరీ]
కమ్మితీశాడు = పారిపోయినాడు — *వాడు చెప్పకనే కమ్మితీశాడు* [చి; నె]
కమ్మినేటి = దొంగ (తిట్టుపదము) కమ్మాటి [చి]
కమ్ము = బండిపట్టా; నేమి; కమ్మి [అ]
కమ్ము కపిలె = బాననీటిని పూర్తిగా వెలువరించుమోట [నె-పొ]
కమ్ముడు = నీరు కాలువగుండా పాగిరాకుండ అడ్డగించు నిరోధము; అడ్డంకి(క్రమ్మినది) —*కాలువ కమ్ముడువల్ల పొలం పారుట లేదు* [కరీ]
కమ్ములు = చేపలు(విశ్వబ్రాహ్మణులు) [వి]
కమ్మెచ్చు =(1) లోయ; లేదా భూమిలో వానకు ఏర్పడిన కోత [వ]
(2) (చూ) కమ్మచ్చు [అ; తె]
కమ్మెదీయు = చెప్పకుండా వెళ్లిపోవు — *ఆయన కమ్మెదీసినాడు*-కమ్మిదీయు [నె]
కమ్మెరి =(1) అధికారవాంఛ
(2) తాను ఇతరులకు తక్కువగాను, అన్న అహంభావము. ఒక కార్యమునకువచ్చిన వారందరు తమ సమత్వమును దెలుపుటకు ఒకే మంచముమీద కూర్చుండి దానిని విరుగద్రొక్కినారట — *కమ్మెరి మంచం విరుగద్రొక్కింది*; కమ్మెట్టి [చి]
కమ్మెట్టి =(చూ) కమ్మెరి [చి]
కమ్మెలు = నియోగిబ్రాహ్మణులలో ఇంకొకటి; ప్రథమశాఖ
కమ్మోళ్లదంటు = తోటకూర [చి]
కయాలు = అస్థిరచిత్తము — *ఆయన కయాలు మనిషి* [తె; నె]
కయికాడి = నిండుబండిని ఎద్దులకు కట్టినట్లే నిలుపుటకు వెనుకచట్టమునకు పోటిబెట్టు నిలువుకొయ్య; ఇట్లే ముందుంచు మరియొక కొయ్యకు బంటుగూటం అనిపేరు [నె-మెట్ట]
కయిలుగింజలు = పనిబాటలవారికి ఏటేటా ఇచ్చు మేరగింజలు [నె-కందుకూరు]
కయ్య = మాగాణీచేను; చేను ; మడికాలు; దొయ్య [నె; వ]
(2) ఉప్పుపండించు పాది [నె]
(3) దంతెవంటి పొడవుకొయ్య; దబ్బ—*తాటికయ్యలు* [చి]
(4) నీటిప్రవాహముచేత భూమిలో కోయబడిన గయి (గుంట); లొయ్య — *కాలు కయ్యలో పడింది, మండు బారింది* [తె]
(5) వరిమడిలో నీరు నిల్పుటకు వేసిన మడవ [అ]
కయ్యలెత్తు = చిట్టికోళ్ల పేటకు ఉరులను పన్నునపుడు గదులు ఏర్పరచుట [చి]
కయ్యలోబడు = ఆపదలో మునుగు; బొందలోబడు [కరీ]

కయ్యారము = కుదపన (రొంపిగా) దున్నిన కయ్యలో గనిమలను (గట్లు) పారతో నరికి సరిచేయుట; చెంగోవ [నె-మెట్ట]

కయ్యాకుయ్యా = (1) పెద్దకబుర్లు [వి]
(2) నోరెత్తకుండుట—*కయ్యాకుయ్యా అన కుండా ఉండినా* [నె]

కయ్యు = పండినపంటను సరిజేసి, కొలిచి పెట్టుకొనుట [శ్రీ]

కర = (1) పొలముచుట్టు వేసినకంచ, వెలుగు
(2) పైరుదంటు—*వరికరలు బాగున్నవి*, కట్టు [నె, తె; అ]
(3) కంబళికి పోగులు పైకిరాకుండా రెండు అంచులయందు ఉన్న దారముతో కట్టిన అంచు—*కంబళికి కర కట్టించినాడు*
(4) పెదునుచేయు—*తోళ్లు కరవేసినారు* (అ)

కరకర = నిండారుగా ప్రొద్దుపొడుచునప్పటి ధ్వన్యనుకరణము — *కరకర పొదుపొడి చినది* [నె, వి]
—*కరకర ఎండఎక్కింది* [కరీ, నె]

కరకు = పైరు వెన్నుచూపుటకుముందువున్న పూవుదశ—*వరిపైరు కరకుతో ఉన్నది; కార్తీకమాసానికి కరకు*, కసుకు, కరువు [అ, నె]

కరకుట్లు = ఉప్పుకారంకలిపి ఎండబెట్టిన మాంసపు ముక్కలు, ఉప్పానులు, ఉప్పు కండలు [చి]

కరడాబత్తులు = సాలెవారు [గు]

కరడి = ఎలుగుబంటి, కరిడి [నె]

కరణకమ్మలు = శ్రీకాకుళం ప్రాంతములో నున్న ఒకతెగ బ్రాహ్మణులు; కరణీకం చేయువారు, నియోగులతో వియ్యమందు దురు.

కరణపుకచ్చ = (1) మీదికి దోపని కచ్చా (ధోవతి అంచు)
(2) విరోధము [వి]

కరదూపము = ఇంటికప్పుకు పొగ మొద లగువానివలన పట్టెడుబూజు; కరదువ్వ [వ, వి]

కరబుచ్చ = (చూ) కరబూజ [అ]

కరబూజ = ఏటి ఇసుకలో చెట్టుపెంచి కాయిం చు మేలుజాతి దోసకాయ; సిద్దవటందోస; కరబూజు; కరబుచ్చ [నె; అ]

కరబూజు = (చూ) కరబూజ [అ; తె]

కరవాక = (1) సముద్రము [శ్రీ]
(2) సముద్రతీరప్రాంతము; వాగర్త; కరాక [నె-కావలి]
(3) తాటి ఈతచెట్ల తోపులతో దట్టమైన నీటిదరి [నె-అల్లూరు]

కరవాకలవాడు = సముద్రతీరాన నివసించే పల్లెవాడు; పట్టపువాడు [శ్రీ]

కరవాద = ఉప్పువాసి ఎండబెట్టిన సము ద్రపుచేప; ఇట్టి మంచినీటిచేపను వట్టిచేప అందురు .[నె]

కరాక = సముద్రతీరప్రాంతము, వాగర్త (చూ) కరవాక [నె, కావలి]

కరాటము = ఔషధములు దాచి ఉంచు పరి కరము [శ్రీ]

కరాపాకు = కరింపాకు, కల్యామాకు [వె]

కరింపాకు = కరివేపాకు, కరియపాకు; కరేపాకు [అ; తె నె]

కరిఎక్కుట (కరెక్కుట) = తాడు పేను నప్పుడు బిగియుట, పురిఎక్కుట [కరీ]

కరిడి = ఎలుగుబంటు; కర్డి, ఎలుగొడ్డు; కరడి [అ]

కరిణి = తబలా మ్రోగు తోలు భాగాముపై కల్పించిన నలుపువలయము [అ]

కరిణె = (మా) కసరు [చి]

కరిదూపము = (చూ) కరదూపము [సర్కా]

కరిపించు = (1) అతికించు— *బంకతో కరి పించు* [నె, అ; తె]

(2) ఇరుపక్షాలను కయ్యమునకై ప్రోత్స హించుట [గో]

కరిమి = ఆవులు, గేదెలు మొదలగు పశువులలో ఆడువానిగుణి (యోని), మడి—ఆ యావు *కరిమివాచింది* [గో]

కరియపాకు = కరింపాకు

కరివేపాకు = కరింపాకు, కరేపాకు

కరుణ = కనరు—*వంకాయ కరుణ ఎక్కింది* కండ్ర; కనురు [నె, అ, తె]

కరుణు = కనరు; కరుణ [చి; నె]

కరుదుపు = ఇంటివాసములకు పట్టు బూజు [చి]

కరుదువ్వ = పొగసూరి ఏర్పడిన నల్లటి దుమ్ము; కరిదువ్వ; కరధూపము [నె; అ]

కరుధూపము = కరుదువ్వ [కరీ]

కరుబూజ = పుచ్చకాయ [చి]

కరువు = వరిపైరుమొక్క గర్భపుష్పము—*వరికజ్జులు కరువులున్నవి:* కరుగు; కరుకు, కరకు [కరీ]

కరెము = పశువులకు ఏర్పడిన ఎక్కువ ధర —*ఈ యెద్దు ధర కరెము* [కరీ]

కరేపాకు = కరింపాకు [అ]

కర్జకాయ = (మా) కజ్జికాయ; కర్జికాయ [కర్నూ; అ]

కర్ణపోతు = పీనుగుల తిను జంతువు [చి]

కర్దవ = పైనుండి వ్రేలాడునుసి—*కర్దవరాల్చు నున్నంకొట్టాల;* కర్దావ [చి]

కర్నకాయ = దబ్బకాయ [కర్నూ]

కర్మంతరాలు = అపరక్రియలు; ఉత్తరక్రియలు [నె]

కర్మంతరాల దీపము చూచినట్లు = ఒక కార్యముపట్ల పట్టీపట్టనట్లు ప్రవర్తించుట, ఆసక్తిని చూపకుండుట—*అయన అపని మందలక కర్మంతరాలదీపం చూచిపోయినట్లు వచ్చిపోయినాడు,* (బ్రాహ్మణేతరుల అపరక్రియలలో చివరినాడు రేవుకుపోయి వచ్చిన చుట్టాలు మృతుని ఇంటికి తిరిగి వచ్చి, పడమటింటిలో వెలిగించి ఉంచిన తిల్లి కనుచూచి, ఎవరితోను పలుకక ఎవరి పాటికి వారు వెడలిపోదురు, అట్లే అనుట) [నె]

కర్మాంతము = అపరక్రియలు; తీరాలు; కర్మాంతరము [నె; గో]

కర్మాంతరము = (మా) కర్మాంతము [తె, నె; గో, గు]

కర్నికాయ = (మా) గజనివక్క [రా]

కర్చుకిచ్చు = తన్ను; కొట్టు [కర్నూ]

కర్పూరపొగ = అరటికాయిలకు వేయు కర్పూరపుపొగ. ఇది బట్టిన కాయలు పరిమళించి త్వరగా మాగిపోవును [చి]

కఱ్ఱ = (1) దంటు — *జొన్నకఱ్ఱ; సజ్జకఱ్ఱ* [అ, తె]

(2) మరక — *గుడ్డ కఱ్ఱ గట్టినది;* కర [చి; అ]

(3) పొగరుబోతు [వ]

(4) చేతిబట్టు దండము; చేతికఱ్ఱ—*కఱ్ఱతో కొట్టినాడు* [నె, కర్నూ]

(5) కొయ్య (Wood) [సర్కా]

కఱ్ఱపుట్టు = చిలికినకఱ్ఱలో (కొయ్యలో) లేచు పుట్టగొడుగు [వి]

కఱ్ఱపెత్తనము = తానుచేయక ఇతరులచేత పనిచేయించు పెత్తనము—*అయనదంతా కఱ్ఱపెత్తనమే* [నె; కర్నూ, తె; వి]

(2) అధికారము చలాయించు [అ]

కలం ముట్టినగుర్తు = చదువురానివారు పత్రములు వ్రాయించి యిచ్చునప్పుడు, తమ చేవ్రాలుకు మారుగా పేనాను ముట్టి వ్రాతగానిచేత నిశాని (గుర్తు) అని వ్రాయించి పత్రమును అంగీకరింతురు. దీనినే కలం ముట్టినగుర్తు (నిశాని) అందురు. కొందరు అంటరానివారు అంగీకారసూచకముగా నేలమీద ఒకగీత గీయుదురు; నిశాని చేయు [చి; నె]

కలక=(1) చేపలు అప్పుడప్పుడు పైకి ఎగిరి పడుట

(2) ఎవరైనా అప్పుడప్పుడు వచ్చి ముఖము చూపించి పరోక్షముగా సంగతులు తెలిసికొనిపోవుట — *ఆయనవచ్చి ఒక కలక వేసిపోయినాడు* [నె]

(3) వరదకు వచ్చిననీరు పాతనీటితో కలియుట [గో; అ; తె]

కలక=(చూ) కలగరి; కలకరి [నె; ఆత్మ]

కలకండ=(1) పటికబెల్లము [నె; చి; రా; తె]

(2) నగుబోతు, నౌబోతు [వ]

కలకబారు=బెణుకులేక గాయము కదిలి నొప్పి ఎక్కువ అగు — *బెణుకు కలక బారింది* [నె; గో; అ]

కలగలుపు=(1) అన్నీ కలిపివేయు; కలెగలుపు [నె; వ; అ]

(2) అన్యోన్యముగ తిరుగు గుణముగల— *కలగలుపుమనిషి;* కలుపుగోలు మనిషి [కర్నూ; అ]

కలగా=(1) హెచ్చుగా

(2) ప్రత్యేకము—*దానిని కలగా ఎత్తి* పెట్టు [నె]

-కలగానుగు=చిత్రవధ (విశ్వబ్రాహ్మణులు) [వి]

కలగాపులగము=కలగలుపు ]తె]

కలగుమ్మటం=అన్నిటిని ఒకటిగా బాగా కలిపివేయుట—*కలగుమ్మటం చేసివేసినాడు* [నె; వ]

కలగూర=(1) పప్పు, కూరగాయలుకలిపి వండినకూర; కలుసుకూర [కర్నూ]

(2) తోటలతో మొలుచు ఒకరకపు కూర [కరీ]

-కలజోడాకులు=తెల్లని పలుచటి ఆకులు [అ]

కలదెలిసికొను=ఒక వ్యవహారం కొంత సాగినతర్వాత, నిజము తెలిసికొనుట— —*కలదెలిసికొని బయటపడినా* [నె]

కలనెత్తు=(1) క్రిందిది పైది బాగా కలసిపోవునట్లు కలియబెట్టు [గు; నె]

(2) గుదిగుచ్చు [సర్కా]

కలప=కొయ్యసామాను [నె; కర్నూ; న; వి-తె]

(2) కొయ్యలు అమ్మఅంగడి, అడితి [సర్కా]

(3) సేద్యపుసామాను—*కలపకొట్టు* [నె]

(4) మంగలి తనకత్తి మొదలగువానిని పెట్టుకొను చిన్నసందుగు (పెట్టె); పొది [కరీ; వ]

కలబంద=చేలకరలలో వేయు లావుపట్టలు గల గుబురుచెట్టు. దీనినార చాలపొడవుగా గట్టిగా నుండును; కరబంద [నె]

(2) చిన్నజాతి దానిని ఔషధాల్లోఉపయోగింతురు. గుజ్జుతో పచ్చడి చేయుదురు [నె; అ; తె]

కలమంద=(చూ) కలబంద [కర్నూ]

కలమాగు=పండు బాగుగా పక్వమగు; మదరమాగు [అ]

కలము=ఇరవైనాలుగు శేర్లు [చి]

కలమువేయు=గండివడు—*చెరువు కలము వేసినది* [వి]

కలి=(1) పులియబెట్టిన గంజిని కలిపి వండిన కొట్టునంకటి; ఇది నాలుగు రోజులైనా చెడదు [అ]

(2) బియ్యము కడిగిన (కడుగు) నీటిని, గంజినికలిపి ఉంచిననీరు. దీనితో చారు వంటి దానిని చేయుదురు; తరవాణి [నె]

కలికలియగు=నీరగు; ద్రవించు — *మనసంత కలికలయింది* [వ]

కలికుండ=తరవాణి [నె; తె]

కలిచల్లుట = బిడ్డపుట్టగానే ఆ బిడ్డపై నీరు చల్లుట [కరీ]

కలిజెం = ధాన్యమును దాచిపెట్టుటకు ఆర గుడిసెవలె ఇంటిలోగిలో కట్టబడియుండు గది; వడ్లకొట్టు [చి]

కలిజేడాకు = కారముగానుండు తమలపాకు లు; కమ్మెరాకు, కుంబకోణం ఆకు [చి]

కలినేత = రెండురంగులనూలు కలిపినేసి నది; కలనేత [మ; నె]

కలిమట్టు = బాగుగా కలియబెట్టుట—*వడుగు గడ్డిని బాగా కలిమటువేసినాడు* [నె]

కలిమట్టు = బాగుగా కలియబెట్టుట—*వడుగు గడ్డిని బాగా కలిమట్టువేసినాడు* [నె]

కలిమట్టుగడ్డి = కుప్పనురిపిడిలో ధాన్యము రాలినతర్వాత, బాగా వంకములతో కలియ బెట్టి, విదలించి ఎత్తి, బయట కడిమిగా (కుప్పగా) వేసిన తొక్కినగడ్డి; మట్టగడ్డి [నె]

కలిమికాయ = నేరేడుకాయ పరిమాణమున పుల్లగానుండుకాయ; ఇది ఊరగాయకు శ్రేష్ఠము [చి]

కలియామాకు = కరివేపాకుచెట్టు [కరీ]

కలివి = తెలివి — *ఆపిల్లవాడు చాల కలివి మాటలాడేవాడు* [చి]

కలివిడి = (1) ఆనందము — *ఆ మనిషి కలి విడిగా కనుపడలేదు*

(2) సందడి — *ఆయింటిలో కలివిడిగా లేదు* [శ్రీ; వి]

కలిసిగుద్దులు = రెండుపొట్లేళను మధ్య విడ దీయకుండా పోట్లాడపెట్టు పందెము [శ్రీ]

కలుజు = (1) స్వర్ణకారుడు [వ]

(2) అలుగు [నె]

కలుపుకూర = కలగూర [తె]

కలుపుగోలు = కలిసి మెలిసి యుండుట (Social) — *ఆయన మంచి కలుపుగోలు మనిషి* [నె; తె; అ]

కలువాయిబ్రహ్మజ్ఞానం = (చూ) కలువాయి వేదాంతము [తె]

కలువాయి వేదాంతము = మెట్టవేదాంతము. నీతులుమాత్రంచెప్పి ఆచరణలేని మాటలు; కలువాయి నెల్లూరు మండలములో వెలి గొండలదగ్గఉన్న పెద్దగ్రామము; కలు వాయి శతకమని ఒక శృంగారశతకము గలదు; కలువాయి బ్రహ్మజ్ఞానము [నె]

కలుసుకూర = (1) పప్పులు, కూరగాయలు కలిపి చేసినకూర; కలగూర [నె]

(2) పులుసుపేయని తీయకూర [చి]

(3) పుల్లగూర [అ]

కలెంగిడికాయ = పుచ్చకాయ [అ]

కలెగలుపు = (1) కలిసిపోవునట్లు కలుపు

(2) అరమరలేకఉండుట, కలగలుపు [మ]

కలొత్తుడు = కాలికి రాయి గ్రుచ్చిన బాధ [కరీ]

కల్లంలో కొలుచుకపోవు = చేసినప్రయ త్నము చివరకు ఏమీ లాభించకపోవుట; వచ్చినఫలితము చేసినకష్టమునకు, పెట్టిన పెట్టుబడికి చాలకపోయి కష్టమే మిగులుట. (పండించినధాన్యము కర్చులకు అప్పులకు కల్లములోనే సరిపోయి, ఇంటికి తోలు కొని వచ్చుటకు మిగలక పోవుట-అనుట)—*ధ్వాంసం నారాయుడు కమతం చేస్తే పాలికి పందుము, వల్లేరుకాయలు-* అన్నట్లు.

కల్ల = (1) కంచె; తెట్టు—*కల్ల కంపలుకొట్టు కరా* [చి; అ]

(2) కంపకల్లి; కల్లె [తె]

కల్లచాలు = ముండ్లకంపతో వేసిన కంచె వరుస; ముండ్లకంచె [అ]

కల్లవాపు = నొప్పిలేనివాపు, ఒకచోట వాయుటకు బదులు ఇంకొకచోట ఏర్పడి నది [నె; కర్నూ; తె]

కల్యామాకు = కరింపాకు [వ]

కల్లాపు = కలయంపి, పేడకలిపిన నీరు, కళ్లేప [చి]

కల్లి=(1) ఒకవిధమైన కలబందజాతి చెట్టు. ఒక విధమైన బంక గలిగిన పాలుగారును; వీనిని కంచెలుగా వేయుదురు [అ-పె]
(2) వెలుగు; కంచె; కల్లె [చె]
కల్లి=(1) గ్రామదేవతల కొలుపులలో (పల్నాటిపీఠుల తిరునాళ్ళు) నిప్పులగుండమునకు బదులు భక్తులు త్రొక్కుటకు పరచిపెట్టిన ముడిముండ్లప్రోగు — *కల్లి దొక్కినారు* [గు]
(2) కష్టమైనపని నెరవేర్చుట — *కల్లి దొక్కినట్లు చేసినాడు* [నె-మెట్ట]
(3) అల్లరి—*ఏమిటో కల్లిపాటు* [నె-పొ]
కల్లిచేష్టలు=చిన్నపిల్లకాయలుచేయు తెలివైన ముచ్చటచేష్టలు — *అది వట్టి కల్లి ముండ, అని గారాబముతో అనుమాట* [నె; అ]
కల్లుకూర=పలురకములకాయలతో వండిన కూర; కలుసుకూర [చి]
కల్లు=కత్తి మొదలగు వాటి వాదరలో ఏర్పడినచిన్నగండి — *కత్తి కల్లుబోయింది;* కల్లె [నె]
కల్లుగడవ=కొబ్బరికాయ [కృ]
కల్లుప్పు=పెద్దపెద్దకణములుగానుండు ఉప్పు; (సైంధవలవణముకాదు) [నె; తె; అ]
కల్లురేగు=పశువులు మిక్కిలి కలతబడు —*మాయెద్దు కల్లురేగి గుంజ విరుచుకొని పరిగెత్తింది* [నె-పొ]
కల్లూటు=అప్పుడప్పుడూ ఆగి వచ్చు (కల్లువలె) ఊటుబొట్లు [చి]
కల్లె=మొక్క—*ఆ గొడ్డలి కల్లెపోయింది;* కళ్లె; కల్లు [నె-పొ]
కల్లేగొడ్డు=ఎలుగ్గొడ్డు; ఎలుగుబంటి; కరిడి; కల్లి
కల్యాట్లు=అగచాట్లు; ప్రయాసలు—*దానికి ఎన్నో కల్యాట్లు పడవలసివచ్చినది* [నె]
కవటు=(1) లేత తమలపాకు
(2) ఇగుళ్ళతోనున్న లేతకొమ్మ; కవుటు [నె; అ; తె]
కవటు=ఇటుకఆములో రాళ్లు బాగా కాలకపోవుట—*కవటేసుకు పోయింది* [గో]
కవర=కొత్తరంగుగుడ్డ నీళ్ళలో పెట్టినపుడు కొద్దిగా రంగు కరుగుట—*కవర దిగింది;* గవర; [గు]
కవర=బలిజకులము — *కవరపేట* [నె-దక్షి]
కవరబారు=పురికొల్పకయే ఒకరిపైకిపోవు [నె-ఆత్మకూరు]
కవళము = యాచించిపెట్టించుకొను కూటిముద్ద—*కవళం బెట్టమ్మా, అని కేక* [నె; చి]
కవళికలు=(1) మొక్కట్లు; కవిళికలు — *మేనత్త కవళికలు* [నె]
(2) మార్పులు [గో]
కవిలకట్టు=(1) తాటాకుల లెక్కపుస్తకము; కవిలి [చి]
(2) లెక్కపుస్తకము — *ఆయనకు లక్షరూపాయల కవిల (కట్టు) ఉన్నది* [నె]
కవిలగుట్టు=కవిలతో నీళ్లతోడుటకు వీలుగా బావికమర్చినగుట్ట [అ]
కవిలతూము = మారెళ్ళ (దర్శి-పొదిలి) సీమలో వాడుకలోనున్న పెద్దకొలతతూము. దీనికంటె చిన్నది సింగంతూము, దీనిని సింగమరాజు అచట ప్రవేశపెట్టినాడు [నె]
కవిలెలు=పూర్వము లెక్కలనో చరిత్రనో వ్రాసి, బట్ట అతికించిన కాగితపు చుట్టలు [అ]
కవిసె=చొక్కా; కప్పా [అ]
కవిళికలు=పోలికలు; కవళికలు [నె]
కవుకులు=(1) కష్టములు [శ్రీ]
(2) ఇబ్బందులు [వి]
(3) పసిపిల్లలు [మ]

కవుజు = గువ్వజాతిలో చేరిన అడవి పూరి పిట్ట, కముజు; కౌజు [నె; కర్నూ]
కవుటు = (1) (మా) కవట [అ]
(2) మురిగిన కుళ్లనీళ్లు; కవుసు [కరీ]
కవుటుగుల్ల = పశువులగిట్టలోని పుండు [నె-పొ]
కవురు = (1) జలిజకులము; కవర—*కవురు గుంట* [నె]
(2) గుడ్డకు కొత్తగా వేసిన ఎక్కువైన ముదురు చాయ—*కవురు విడిచింది* [నె, వ; అ]
(3) ఎఱ్ఱనిరంగు— *పడమర ఆకాశము కవురు గప్పినది;* ఇది వర్షసూచకము [అ]
(4) స్తంభము [చి]
కవుసు = మురిగినకుళ్లనీరు, కవుటు [కరీ]
(2) మాంసాహారము—*ఈదినం కవుసు దినము* [నె]
(3) నీచువాసన—*కవుసుకంపు* [నె]
కవుళిగ = 50 ఆకులుగల తమలపాకులకట్ట; పిడి [నే]
కవ్వలు = గింజలులేని ధాన్యము; తరక; బొల్లుగింజ [శ్రీ]
కవ్వాళ్లు = మూడునాలుగు అంగుళములు పరిమాణంకలిగిన చిన్న మంచినీటిచేపలు [శ్రీ]
కసక్కన = గట్టిగా; ఉన్నట్లుండి — కాలు *కసక్కన తొక్కినాడు* [నె]
కసరు = (1) పసిపిల్లలు బయటికిపోవు ఆకుపచ్చ మలము [మ]
(2) పొట్టలో బాగా జీర్ణముగాని ఆహారము; ఒదిపి; కసురు [కరీ]
కసరు = తీవ్రమైనగాలి; కొద్దివర్షముతో కూడిన వాతావరణం; కసురు [గు]
కసవు = (1) ఇంట్లో చిమ్మినపెంట; కసువు—*కసవూడ్చినావా?* [నె]
(2) గడ్డి—*బఱ్ఱెకు కసవెయ్యి;* కసువు [చి; కర్నూ]
కసాయి = జేబు; కీసాయి [అ-పె]
కసాల = (1) దబ్బుకు ఇబ్బంది —*ఇప్పుడు చాలా కసాలాగా ఉన్నది* [నె; కర్నూ; తె; అ]
(2) చిక్కులు [చి]
కసింకాలవ = ఊటకాలువ [చి]
కసింత = కొంచెము; రవంత; కాసింత [తె; వి]
కసి = (1) పగ—*కసిదీసుకొన్నాడు* [నె; కర్నూ; అ]
(2) పచ్చిది, లేతది; కసిగాయ; కసికందు [అ]
కసికిపోవు = క్రమేణా తరిగిపోవు; గసికిపోవు [తూ-గో]
కసిదుక్కి = నీళ్లలో గడ్డలు బాగా కరిగిపోయి బురదగునట్లు దున్నిన దుక్కి [నె]
కసిబిసి = (1) మనస్సులోనిబాధ ఓర్వలేకపోవుట
(2) కష్టముచూచి సహించకపోవుట [మ]
(3) చిల్లాపల్లా — *కసిబిసిగా పుస్తకాలు పారవేసినాడు* [నె]
కసిలాడు = కదలు; చలించు — *ఆగుంజ కొంచెం కసిలాడుచున్నది* [నె-పొ]
కసుమూలము = అసహ్యము; కల్మషము; కసుమాలము [చె]
కసురు = (1) పశువులపేగుల్లో ఉండే మాలిన్యం, పూర్తిగా జీర్ణంకాని గడ్డి మొదలైనవి; ఒదిపి [న, అ]
(2) పశువుల మూలమలము; కసరు [నె-పొ]
(3) చీటిడబ్బు కట్టగా మిగిలినపైకము. ఈ పైకమును మరల ఏలం పాటపెట్టి ఎక్కువవడ్డీ యిచ్చువారి కిత్తురు—*కసురెత్తినాడు; కసురే ఇరవై దాటింది* [చి]

కసురు=(1) సముద్రము రేగి చేయు ధ్వని —ఈదినం సముద్రం బలేకసురుగా ఉన్నది [నె]
(2) పొగరు—తలకసురు [నె-కలువాయి]
(3) చీదరించుకొను [అ]
(4) పిందె—కాయకసురు [అ]
కసురుకొను =(1) చీదరించు [తె]
(2)పశువు కొమ్ముతో పొడవబోవు [నె-పొ]
(3) కోపంతో మందలించు —కొడుకు ప బాగా కసిరి కొట్టినాడు [నె]
కసువు=చెత్త [అ; తె; నె]
కస్తీ=(1) అప్పు వసూలుచేయుటలో చేయు ఒత్తిడి—బలే కస్తీచేసినాడు [నె;కర్నూ]
(2) అధికము—వానికి ఇంట్లో పని కస్తీ అయింది [తె]
(3) కష్టము [చి; గు]
కస్తూరిపట్టె=(1) ద్వారబంధమునకు ఇరు ప్రక్కల గోడలో బిగించియుండు నిలువు కొయ్యలు
(2) గుజ్జుపుతుండ్లు (గుజ్జుపుమెడ ఆకృతిలో చెక్కి ద్వారబంధమునకు పైన ఇరు ప్రక్కలా గోడలో అలంకారముగ బిగించిన కొయ్యతుండ్లు.)
కస్సుమను=కోపగించు [తె; నె]
కళంగిడి=పుచ్చకాయ; కళంగిరి [కర్నూ]
కళంగిరి=పుచ్చకాయ; కళంగిడి [కర్నూ]
కళపెళ=బాగా కాగుట — నీళ్లు కళపెళ కాగినవి, కలపెళ [కర్నూ; నె]
కళవళిక=పోలిక [తె; నె]
కళాచికలు=నాట్యభంగిమలు [కరీ]
కళాయి=నీలిమందు మొదలగునవి కాచు పెద్ద బాణలివంటి లోతైన లోహపుతొట్టి [నె]
(2) బాణలి, బాండీ
కళి=సంకటి—జొన్నకళి, రాగికళి; కలి [అ]
కళింగళం=ఆనకట్ట [వి; గో]
కళిక =దీపజ్వాల [నె; తె; అ]
కళిపెళ=(చూ) కళపెళ [నె; గో; తె. అ]
కళ్డి=ఎలుగుబంటి: కరిడి; కడ్డేగొడ్డు, ఎలుగొడ్డు
కళ్లి=రాశి; ప్రోగు [గం]
కళ్లె=ఉమ్మి, తెమడ, గళ్ల [కరీ]
కళ్లేప=ఉదయముపూట తలవాకిటజల్లు పేడ నీళ్లు; కళ్యాపి [చెం; నె]

# కా



కాంద్రిల్లు = నేల బీటలువారుట [నె]
కాక=చిన్నాయన [కరీ]
కాకరకాయపదును=పెంకి [వి]
కాకలుతీరిన=ఆరితేరిన, ముక్కాకలుతీరిన; గడిదేరిన [నె; రా; తె; గో; అ]
కాకా=కార్యసాధనకై చేయు హీనమైన ఊడిగము, —కాకా పట్టినాడు [చి; నె]
కాకి = నల్లటి వన్నెగలిగిన పందెపుకోడి పుంజు [నె, గు]
కాకి ఎంగిలి=చిన్నపిల్లలు గుడ్డలోపెట్టి,తిను బండారమును కొటికి, ఆ తినుబండారము నకు "ఎంగిలి లేదులే తిను" అని ఇచ్చె దరు; దానిని కాకిఎంగిలి అందురు [సరా్క]
కాకిగోల=(1) కాకులసంగమము చూచిన వానికి దోషము తగులునని దాని పరిహా రార్థముగ, వాడు చచ్చెనని బంధువులకు

దెల్పి దుఃఖింపజేయుదురు. ఈ చెడ్డవార్త విని చుట్టములు చేయుగోల—కాకిగోల; వెంటనే నిజముచెప్పి, ఈ ఓదార్చి దోషమును పారదోలుదురు [నె-పొ]

(2) కాకుల అరుపులవలె చేయు గలబా; రొద— అక్కడ కాకిగోల రేగింది [నె; కర్నూ; గు; అ; తె]

కాకిచూపు=ప్రక్కకుచూచుటకు, తలద్రిప్పి గాని చూడలేనట్టిచూపు; కాకిగూడ ఇట్లే చూచును. వీరికి గ్రుడ్లు అటునిటు తిరుగవు [నె; తె; అ; గు]

కాకిచెమ్మలమనిషి=అడ్డరపుమనిషి; విడ్డూరపుమనిషి, [వి]

కాకిబంగారు=(1) అభ్రకము; మైకా [నె కర్నూ; అ]

(2) బంగారంవంటి రంగుఉండే పూసలు [తె]

కాకిబంగారమగు=కనిపించకపోవు [శ్రీ]

కాకిబలగము=ఎక్కడెక్కడివారో కలిసిన బంధువుల సమూహము [కరీ]

కాకిబొంతరాయి = ఇటుక కాల్చుటలో మంట ఎక్కువై చిట్టెముగట్టిన నల్లటి రాయి [నె]

కాకిబొచ్చు=నల్లగాఉండు బొచ్చుచేప [ఉ-గో]

కాకిరెల్లు=శరము; రెల్లు; కాకివెదురు [నె, వ]

కాకిఱెక్కలు = ఒకరకపు ధాన్యవిశేషము [కరీ]

కాకివెదురు=కాకిరెల్లు; రెల్లు [చి]

కాకిసొమ్ములు=మూర్ఛరోగము [వ; కరీ]

కాకిసోపాలు = మూర్ఛలు; కాకిసొమ్ములు [వ]

కాకిసోమాలు=(1) వెఱ్ఱిమొఱ్ఱితనము,పిచ్చిసంచు; వెఱ్ఱిబోగలతనము—వాడిదంతా కాకిసోమాలు [నె]

(2) ఒకవ్యాధి; కాకిసొమ్ములు [తె]

కాగడా=వాసనలేని బెంగుళూరు మల్లెపువ్వు [నె]

కాగితం = ఉత్తరము; జాబు — కాగితం వచ్చింది [సే]

కాగు=(1) నీళ్లు కాచుకొనుటకు ఉపయోగించు పెద్దలోహ పాత్ర [నె; కర్నూ; అ; తె]

(2) ధాన్యమును పోయు, రొమ్ముఎత్తు మట్టికుండ [చి]

కాచిపోయు=అరసికొను, ఆపదలో ఆదుకొను [కరీ]

కాచు=గౌరవించు; లక్ష్యపెట్టు — అతడు కాచడు [కరీ]

కాజేయు = (1) చంపు — వాడిని కాస్త కాజేసినారు [నె; కర్నూ]

(2) అపహరించు [నె; కర్నూ; సర్కా; న; అ]

(3) తినివేయు; ఖాజేయు [అ]

కాట=(1) అంబలి, కొర [నె-పొ]

(2) గంజి — మాకు కాటకాచిపోసే వారెవరు [నె-పొ]

(3) తొందర [సే]

(4) పోకిరి—కాటావాడు [అ]

కాటడుబూటడు=పనికిమాలినవాడు [చి]

కాటావేయు= రంధ్రముచేయు, గుమ్మడి. కరిబూజమొదలైన కాయలకు కాటావేసి పండినదోలేదో చూచెదరు; కాటు [చి; నె; తె]

కాటికలుపోవు = జొన్నకంకి నలుపెక్కు [మ]

కాటిపాపడు = నల్లగా ముఱికి అగుట— కాటికి అట్లా పూసుకున్నవు కాటిపాపని వలె [కరీ]

(2) నల్లకాటిలో కావలి ఉండినవాడు [నె]

కాటు=(1) దోస మొదలగు వాటిగుణమును తెలిసికొనుటకు (చేదో, తీపో అని) మొదట

చాకుతో వేసిన చిన్న బెజ్జము. ఈరంధ్ర మున ఒప్పుదీసి కాయగుణమును తెలిసి కొందురు; కాటా [అ; తె]
(2) కొరికినది—దోమకాటు
(3) కొట్టినదెబ్బ—పులికాటు [నె]
కాటుకాటుగ = రుచి భంగముగా (వంటకము కాటుబోయి వాసనగొట్టుట) [కరీ]
కాటుగలియు = పెద్ద జనసమూహములో పిల్లలు తప్పిపోవు—*మా అమ్మాయి కాటు గలిసిపోయినది* [కరీ]
కాటుబొగులు = పండీపండని స్థితి [గు]
కాటుమరుగు = పులి మొదలగు అడవిమృగ ములు ఊరిపశువులను చంపుటను అల వాటుపడు; మరుగు — *కోనపులి కాటు మరిగినది* [నె; వ]
కాటేరి = (1) స్త్రీలకు మైల అగుచుండు వ్యాధి [నె]
(2) స్త్రీలకు పూను ఒక గ్రామశక్తి [నె; చి]
(3) *గయ్యాళి—అది కాటేరివంటిది* [అ]
కాటేరికోక = నల్లటిబద్దె అంచులతో నేయం చిన ముతకచీర; దీనిని కట్టుకొని దాన మిచ్చిన కాటేరివ్యాధి నయమగునని నమ్మకము [నె]
కాట్కుడు = కరినుడు [మ]
కాట్టెడుపు చీర = కాటేరిచీర [గు]
కాట్లమారి = కయ్యాలమారి [కరీ]
కాడ = దగ్గర—*నాకాడ లేదు* [కర్నూ; నె; అ; తె]
కాడిక్రిందకువచ్చు = ఎదు కట్టబడుటకు కాడిక్రిందకు వచ్చినట్లే ఒకవ్యక్తి ఇం కొకనికి లోబడుట [నె, అ; తె; గు]
కాడికొండె = కాడిమధ్య బిగించియుండు వంకీచీల [చి]
కాడిగట్లనుండు = ప్రక్కనుండు — *మీ చేను మాచేను రెండు కాడిగాట్ల వుంటాయి* [నె-పొ]

కాడితగిలించు = జతకూర్చు; పెండ్లిచేయు —*కాడితగిలిస్తే కుదిరిపోతాడు* [చి]
కాడితాకించు = కోడెను సేద్యమునకు మర పుటను శుభముహూర్తమున అట్టుకు కాడి తాకించి ప్రారంభించు; కాణిగరచు [నె; తె; గు]
కాడుబీడు = వ్యర్థము — *అపని కాడుబీడు అయినది* (వల్లకాడువలె, పచ్చికబీటి పొలమువలె అగుట అనుట) [నె; అ]
కాడువడు = దారితెలియకపోవు [మ]
కాణి = బండికాడి [తె]
కాణిగరచు = కాణి తాకిడిసేయు; కాడి తాకించు [కరీ]
కాత = చెట్టు కాచినది; కాపు, ఫలింపు — *ఈసారి తోటకాత బాగావున్నది* [చి]
కాదు = సరిపడదు—*వాడికినాకు కాదు* [నె కర్నూ; వ]
(2) విరోధము [గు]
కాదుపోదను = అంగీకరించకుండు [కరీ]
కానగచెట్టు = కానుగచెట్టు; గానుగచెట్టు;—*కానగచెట్టుగాలి మంచిది* [నె; కర్నూ; అ; తె]
కానడు = గౌరవించడు — *వారియింటివారు నన్ను కానరు* [కరీ]
కానము = మనకు కనుపించదు, చూడలేము *ఎవ్వారూ కానమే* [చి; నె-దక్షిణ]
కాని = రెండుఎకరములనేల, (అరకాని;కాలు కాని)—*జతఎద్దులు, రెండ్లుకాన్ల సేద్యం;* జతఎద్దులు దున్నగలిగిన భూమి అనుట; కాడి [చి]
కాని = (1) సరిపడని; చెడ్డ.
(2) నెరవేరని — *కానిపనికి కష్టంమెందు* [నె; కర్నూ; గు; తె]
కానికపెట్టు = గుడికివెళ్లి దేవునికి అర్పించే మొదటిపూజ [న]
కానిచ్చు = పని సాగనిచ్చు— *కానీవయ్యా* [నె, కర్నూ, తె; అ]

కానిచ్చుకో=సరేకాని [వి]
కానిపోని=అనవసరపు [కరీ; నె]
కాపది=పనిమనిషి; శూద్రస్త్రీ; కాపుది [గ]
కాపాయము = పొదుపు — *ఆమె సంసారం కాపాయముగ జేస్తున్నది*; కాపేయము [కరీ; వ]
కాపు=(1) రెడ్డి—*పంటకాపు; మోటాటికాపు* [నె]
(2) వ్యవసాయకులు; సంసారులు — *కాపులు కరణాలు* [నె, కర్నూ; న; అ]
(3) బలిజవారు [కృ]
కాపుకూలి=పశువులను కాచినకూలీ [కరీ]
కాపుదనము=(1) కాపులపెత్తనము; కాపిరకము
(2) గ్రామపెత్తనము [నె]
(3) కర్షకజాతి [కరీ]
కాపుదారి=కాపల; రక్షణ—*అతోటకు కాపుదారిలేదు* [గు; నె]
కాపున్యాయం=రైతున్యాయము; సంసారిధర్మము [చి]
కాపురానికిపంపు = కోటరికమునకు పంపు [నె; కర్నూ; తె, అ]
కాపురానికివచ్చు = పెద్దదగు, రజస్వలయగు—*ఆమె కాపురానికి వచ్చింది* [కరీ]
కాపులు=(1) చిన్నపిల్లలకు చేతులకు ఉంచు కడియాలు [అ]
(2) ముంజేతికి పెట్టుకొను ఆభరణములు [రా; మ]
(3) మురుగులు [నె-దక్షిణ, కర్నూ]
(4) గాజులు [చి]
కాపెట్టుకొని = దారిగాచియుండి; ఎదురుతెన్నులు చూచుచుండి [కరీ]
కాపేయము = పొదుపరితనము; కాపాయము [కరీ]
కాబట్టు = అవసరపడు—*అది వాడికి కాబట్టి తేగా* [వి; నె]
కాబూసి=పిల్లలను భయపెట్టుటకు "కాబూసి" పేరు ఉచ్చరిస్తారు. పరాసు 'బుస్సీ' దొర' బూసిబూచి అయినాడట [అ]
కామ=కట్టె; కాడ—*గొడ్డలికామ* [కరీ]
కామంతూతు = కాముని దహనము అను ఒక నాటకము ఈ ప్రదర్శనమున కాముని చిత్రమును దహింతురు. ఢిల్లీలో రామలీల వంటిది, కాని అందు రావణుని బొమ్మకాల్తురు. [చి]
కామక = తప్పకుండా—*కామకా రావాల* [నె; అ, గు; రా]
కామాటము=సేద్యముగాని, ఇతరపనులుగాని పెద్దఎత్తున చేయుట—*అదంతా పెద్ద కామాటం* [నె; కర్నూ; తె; అ]
కామాటకము = (చూ) కామాటము [నె; కర్నూ]
కామాటీలు=(1) తమిళనాడునుండి నెల్లూరు వచ్చిచేరిన అగ్నికులక్షత్రియులు. వీరు ధర్మరాజుల తిరునాళ్ల చేయుదురు. వీరు కర్మకారులు—*కామాటివీధి.*
(2) బొంబాయిలోనున్న తెనుగువారు—*కామాటిపుర* [నె; వ; గు]
(3) పోకిరి [అ]
కామణ్ణ=మన్మథుడు, కాముడు — *కామణ్ణ పండుగ* [అ]
కామాపుచేయు = జరిగిన సంఘటనను తెలియకుండచేయు — *హూనీ కామాపు చేశారు* [వి]
కామాల=కాబోలు, కావాల [నె; వ-గో]
కామాల=కామెర్ల రోగము [చి]
కాముక =తప్పక; కామక [వ; కరీ]
కామునిపున్నమ=ఫాల్గుణపౌర్ణమి, హోలీ
కామోసు=కాబోలు; కామాల [వి; వ; గో]
కాయ=(1) సీసా — *రెండుకాయల కిరోసిన్ తీసికొనిరా* [నె]
(2) కల్లులొట్టి—*కాయడు కల్లు* [నె]

కాయకము = మోసము [గు]
కాయకాలు = బూటకము; కల్పన [ప-కృ]
కాయతరక = సగమే పాలుబోసి గింజపట్టిన ధాన్యము, పూర్తిగా తరకబోనిది [నె; అ-పె]
కాయతాలు = (చూ) కాయతరక [నె ఆత్మ కూరు, కరీ]
కాయపొడి = బాలింతలకిచ్చు పథ్యపు పొడి [చి; గో]
కాయము = (1) గుఱ్ఱము మొదలగువాటికి బెట్టు మందు [నె]
(2) బాలింతకు బెట్టు మందు దినుసులు [కర్నూ, గో; వ]
కాయవాలు = వరిగింజ ముదిరి వెన్నువాలుట [చి]
కాయాపండా = కార్యమేమైనది? అని ప్రశ్నించుట [వి; నె]
కారం = పురిటిబిడ్డలకు పోయు ఔషధము [చి; నె; అ]
కారంచుట్లు = చక్కిలాలు, జంతికలు [అ]
కారకము = ఒళ్లు వేడెక్కుట [అ]
కారపాకులు = కారముగలిగిన తమల పాకులు; కమ్మేరాకులు; కుంబకోణపు ఆకులు [అ]
కారము = గురివిందగింజలు నీళ్లతో బండపై సాది చేసినబిగురు — *గురిగింజకారము* [గు]
కారాకు = పండుటాకు — *కారాకులు డొల్లి నట్లు కర్మము డూలుణ* [ప]
కారాలు = మురుకులు; భక్ష్యవిశేషము [చె]
కారికము = కోరాగుడ్డ [గు; నె]
కారిమడి = చవిటిపొలము [శ్రీ]
కారు = (1) రెండవపారి బెట్టుపైరు; మొక్కదుగు; ఇది నెలలుతక్కువ పైరు [నె]
(2) సున్నము, పొగాకు మొదలగువాటి ఘాటు—*సున్నంలో కారుపోయింది* [నె]
(3) పొగరు—*కారుకూతలు* [నె]
(4) తక్కువ — *పంచకారు ఇద్దుము,* (కుంచ తక్కువగా ఇద్దుము) [నె]
(5) ఆరుమాసములు
(6) అదును—*అనగా ఒక ఏడాది-కోడె మూడుకారుఅది;* దుక్కులు అనునది గూడ ఇదే అర్థము [అ; నె]
(7) ఒకపాటి — *సన్నకారు; రైతులు* [తె: నె]
(8) ఎక్కువ — *కారువౌక* (కారు = అదనునందు ఏర్పడిన తక్కువ వెల) [తె; నె]
(9) మడకకు వేయులోహపుమేకు, కఱ్ఱు [చి]
కారుకూత = వయసుకు వచ్చిన ఎడకోడి పుంజు వేయు అరకొరలకూత [నె]
(2) నీచపుమాట, పొగరుకూత [తె; నె; గో]
(3) నోటికివచ్చినకూత [అ]
(4) దబ్బరలు [అ]
కారుపాయాలు = కృత్రిమోపాయములు [కరీ]
కారుసు = ఘాటు [అ]
కారెలు = బలసినందున తెల్లపశువులకు, ముఖ్యముగా ఎద్దులకు (ముందు-వెనుక) ఎదజొబ్బలమీద ఏర్పడు నలుపు — *కారెలు దీరిన ఎద్దు* [నె]
కారొడ్డెము = అధిక్షేపము—*అతడు కారొడ్డెములో రెడ్డెములు పలుకును* [కరీ]
కార్తెమూల = వర్షఋతువులో మబ్బు తేలి వచ్చు ఈశాన్యదిక్కు, కృత్తికానక్షత్రమునకు జెందినదిక్కు—*కార్తెమూల మబ్బు ఏలింది* [నె]
కార్యము = గర్భాధానము — *కోడలికి కార్యం నిర్ణయించినారు.* [సర్కా; నె]
కాల గంజి ఒలుకు = పెద్ద యిబ్బందికలుగు [కరీ]

కాలగట్టు = మడికట్టులో (దున్నునప్పుడు) ఎద్దుకాలికి కట్టు గ్రుచ్చుట; కాలిలో కట్టెక్కు [కరీ]

కాలటువ = గొర్రెల రప్పములో (దొడ్డి) వేసిన అటువ [అ-పె]

కాలణా = పాతపైస; చినడబ్బు; కాని [నె; దక్షి]

కాలారు = పశువులు దొడ్డిలో ఉండి ఉండి, బయటకిపోయి తిరిగివచ్చుట (కాళ్లగుదులు తీరునట్లు) — *గొడ్లు కాలారా తిరిగివచ్చి నవి* [నె; గో; అ; తె]

కాలికింద నిప్పులుతోయు = తొందరపెట్టు [తె]

కాలికి బలపం కట్టుకొను = ఒకేపనిమీద అదేపనిగా తిరుగు [చి; నె]

కాలికొంది = నడచుటలోను; పరుగెత్తుట లోను కాలిలోఉన్న శక్తినంతయు ఉప యోగించగలిగినంత, కాలికొలది — *కాలి కొంది నడిచిరా* [నె, తె]

కాలికొద్ది = (చూ) కాలికొంది [కర్నూ; అ]

కాలిగుంజ = (1) ఇండ్లకు ఒకప్రక్కగా దించిన వసారాకు ఆధారభూతమైన కొయ్యకంబము [కృ]

(2) పశువులను పలుపుతో కట్టివేయుటకు నాటిన చిన్నగుంజ, లేక గూటము, మేకు

కాలిపాటు = పశువులకాళ్ల సౌష్ఠవము, పొంకము — *కోడె కాలిపాటు బాగున్నది* [నె; గు]

కాలు = పొలము — బీడుకాలు, పొగాకుకాలు [తె]

కాలుకక్కసముగ = నిక్కచ్చిగా [కరీ]

కాలుజాచు = (1) చొరబడియత్నించు

(2) సిద్ధమగు — *కాటికి కాలుచాచి కూర్చు న్నారు.*

(3) వ్యతిరేకించు [కరీ; నె]

కాలుద్రొక్కు = యువతీయువకులు కూడు కొను [కరీ]

కాలుబట్టు = కోడె, కుట్టులకు పట్టలుగొట్టు — *అదికా లుబట్టిన కోడె* [నె]

కాలు = పాతిక; పావు [అ; నె]

కాలుబోసుకొను = కోలుకొను [నె-పొ]

కాలుమడి = ఒంటేలు [తె, అ, నె]

కాలుమడచు = అల్పాచమానముచేయు — *కాలు మడచుకొని వచ్చినా* [కర్నూ; నె; వ; అ]

కాలుముడుచు = (చూ) కాలుమడచు [నె; అ; తె, గు]

కాలువకుంట్లు = గ్రామసమష్టి కాలువ త్రవ్వు టలో విధింపబడిన జరిమానాలు [అ]

కాలువపంపు = కాల్వపారకపు పొలము; కాలువక్రింద నీరు పారు పొలము [కరీ]

కాలువకుబోవు = బహిర్భూమికిపోవు; కాలవ తట్టుపోవు [అ; నె]

కాలుసాగు = పశువులను కాలుసాగుటకు విడుచుట — *కట్టుమట్టున బడివుంటే కాలు సాగదు* [నె-పొ]

కాలెత్తు = చెడిపోవు — *ఆ వ్యవహారం కాలె త్తింది* [తె]

కాల్చి గంపలకెత్తు = ఎక్కువగా బాధించు — *ఆయన మమ్మల్ని కాల్చి గంపలకెత్తి నాడు* [నె, అ]

కాల్చు = వడలు మొదలగువాటిని బాండలిలో చమురుబోసివండు — *వడలు కాల్చినారు* [నె; తె, అ] వడలు వండినారు [సర్కా]

కాల్చు = వాతవేయు, రక్షపెట్టు — *ఎద్దుకు మక్కె కాల్చినారు* [నె-పొ]

కాల్చుకొనితిను = వేధించు — *వాడు నన్ను కాల్చుకొని తింటున్నాడు* [వ, నె]

కాల్తట్టు = బహిర్భూమికి, కాలువతట్టు వెళ్లుట మామూలుగనుక, (కాలువతట్టు- కాల్తట్టుగా మారినది) బయటికిపోవు [అ]

కాల్మడి = మూత్రము (తక్కువజాతు లుప యోగించుమాట); కాలుమడి [నె; మ; అ]

కావక = నిష్ప్రయోజనము [వి]

కావటి = కావడి [శ్రీ]

కావడిపెట్టె = బోషాణంవలె చిన్నదిగాఉండు కొయ్యపెట్టె [గు]

కావవేయు = మామిడిపండ్లు మున్నగునవి పండుటకు గడ్డిలోబెట్టి మక్కవేయు; మాగవేయు [సర్కా]

కావాల = అవసరము [నె], కావాలి [సర్కా] కావాలె [తె; రా]

కావిరి = పొగక్రమ్మినట్లుండునది [చి]

కావిలిగడ్డ = చిలగడదుంపజాతికి చెందినది, దీనిని ఆకుతోటలలో (ఆకుతోట = తమలపాకుతోట) పైరుచేయుదురు [చి]

కావు = (1) నేలపాతరకు కట్టు రాతికట్టడం [నె-పొ]

(2) కాయలను మక్కబెట్టుట; కావ [సర్కా]

(3) నలుపు [చి]

(4) బలిగొను; గావు [చి; నె]

కావుగప్పు = అంతట గప్పికొనిపోవు — *గొర్లమంద కావురుగప్పె*, కావురుగప్పు [కరీ]

కావుపాతర = (1) భూమిలోచుట్టు రాళ్లుగట్టి; గింజలు పోసికొనుటకు ఉపయోగించు గుంట;

(2) భూమిలోదించి ఉంచి, ధాన్యముపోసి పెట్టుకొనుటకు ఉపయోగించు పెద్ద మట్టి బాన.

(3) బలియిచ్చిన వస్తువులను పాతిపెట్టినది — *కావుపాతర బెట్టినారు*; గావు [నె]

(4) పొగాకుకు నీరు వేయుటకై త్రవ్విన గొయ్యి [గో]

(5) నేలపాతర [అ]

కావురు = (1) రాత్రులందు క్రింది వెలుతురు శాఖ ఆకాశములోనికి వ్యాపించినకాంతి (Glare) [నె; అ; తె]

(2) సంధ్యలలో సూర్యుని కిరణములచేత మేఘములో ఏర్పడు ఎఱ్ఱరంగు [అ]

కావురుగప్పు = (చూ) కావుగప్పు [కరీ]

కావురుగ్రమ్ము = ఎఱ్ఱమబ్బువేసి ఎఱ్ఱగా కాంతివచ్చుట [గు]

కాశిగడ్డి = (చూ) పునుక (గడ్డి) [అ-పె]

కాసంత = రవ్వంత; కాసింత [నె; కర్నూ. చి; వి; అ]

కాసరికుండలు = పెండ్లిలో పెట్టే సగము ఐరేని; (8 కుండలు) [మ]

కాసి = (1) పొడవైన కొండగడ్డి; కొట్టముల పైకప్పు కప్పుట కు ప యో గి ం తు రు [అ-పె]

(2) పిల్లిని, చిన్నపిల్లలు పిలిచేపద్ధతి, పెద్దలు సైతం పిల్లిని కా-అ-ఆ-సి అని పిలుతురు [అ]

కాసింత = కొంచెము; కాసంత [తె, చి, వి, నె; కర్నూ]

కాసికోక = మొలచుట్టు బెల్టువలె పూర్వం చుట్టుకొనుచుండిన పొడవైనపట్ట, ముఖ్యముగా దీనిని వీరులు ధరించెడివారు—*వీర కాసె గట్టినాడు*;—*గోచీవదల్చి కొంగుల వీరకాసెగట్టిన అనపోతధీరుని తపస్సు*; కాసెకోక [నె, గు; కర్నూ]

కాసిని = కొన్ని; కాసిన్ని [చి; వి]

కాసిళ్లు = సజ్జ, తయిద, జొన్న, వీటి పచ్చి కంకులు కాల్చి నలిపిన వచ్చు గింజలు; వీటిని నువ్వులతో కలిపి తిందురు [మ]

కాసీవాళ్లు = రాతిపనివారు [అ]

కాసు = (1) సవర; సవరను [తూ-గో, గు]

(2) డబ్బు—*కాసులు గలవాడు* [చి]

కాసెకోక = (చూ) కాసికోక [తె]

కాసెగట్టు = భరతనాట్యము నభ్యసించుటకు ప్రారంభించు; గజ్జెగట్టు [అ]

కాసెపోసికట్టు = వితంతువులు చీరను తల క్రిందులుగాత్రిప్పి అడ్డవేసి పెట్టి (గోచీ) కట్టినకట్టు [సర్కా]

కాసెబూయు = సన్నద్ధుడగు; సన్నద్ధుడగుటకు గుడ్డ ఒకతీరుగా కట్టుట [వ]

కాళంజి = పిల్లలు గచ్చకాయలాట లాడు నపుడు ఉడ్డలు ఉడ్డలుగా ఉంచిన గచ్చ కాయలను; మొదట ప్రత్యేకముగా పెట్టు పెద్ద ఉడ్డ. ఈ ఉడ్డను చెదరగొట్టిన అన్ని ఉడ్డలను చెదరగొట్టినట్లే లెక్క; ఉడ్డ అనగా నాలుగు గచ్చకాయలు [చి]

కాళ్లకుపోవు = మలవిసర్జనకు పోవు [తె]

కాళ్లకుబెట్టు = విరేచనములగు [తె]

కాళ్లగొళ్లు = గర్భాధానము [కరీ]

కాళ్లబాతు = అధోకాయము నిడుపైనవ్యక్తి —వాడు కాళ్లబాతు [నె]

కాళ్లబేరము = ధిక్కరించి చివరకు లొంగి బ్రతిమలాడుట — *వాడు కాళ్ళబేరానికి వచ్చినాడు* [నె; కర్నూ; అ, తె]

కాళ్లమీదిగొడ్డు = కాళ్లు పొడవగు పశువు, బరువు లాగలేనిది [నె-పొ]

కాళ్లవేళ్లబడు = కడుదీనముగా వేడికొను— *వాడు కాళ్ళ వేళ్ల బడినాడు* [నె; కర్నూ; తె; అ]

కాళ్లాడకపోవు = ఏమిచేయను తోచకపోవు [వి; నె]

కాళ్లుగుంజు = కాళ్లతీయు, కాళ్లు నొప్పిపుట్టు [వ]

కాళ్లుతీపి = రోగబాధవలన కలుగు తీపులు [అ, నె]

కాళ్లుతీయు = ఎక్కువ పనివలనగాని, దూరము నడచుటచేతగాని కాళ్లు నొప్పి పుట్టుట— *కాళ్లు తీస్తున్నవి* [నె; కర్నూ; తె]





కింక = (1) పీడ — *పట్టిన కింక వదిలితే చాలు* [చి]

(2) గట్టిపట్టు

(3) విడువని ఏడ్పు

కింకలు = చంటిపిల్లలకు వచ్చు క్రిమివ్యాధి [కరీ]

కింకిరి = (1) తప్పుఆటలు ఆడువాడు [శ్రీ]

(2) అమేధ్యము [కరీ]

కింగిరి = నీచముగా ఉండువాడు [శ్రీ]

కిండలు = దురుద్దేశముతో చేయు ఎగతాళి; ఎకసక్కెము — *ఏమంతా కిండలు పడు తున్నావే* [నె]

కిగ్గు = జంకు [గు]

కిచిడీ = కమలాకాయ; కిచ్చిలి; కిచ్చిడి [సే]

కిచ్చపెట్టు = గిల్లిపెట్టు [చి]

కిచ్చిలిపండు = (1) నారింజపండు, ఆరంజి [చి]

(2) తీపికొద్దనిమ్మ — *వద్లపూడికిచ్చిలి;* కిచ్చిడి; లెమన్ [సర్కా; నె]

కిటికిగజాలు = కిటికీకమ్ములు, కిటికీచువ్వలు

కిటుకు = పన్నాగము; ఎత్తుగడ—*ఒకకిటుకు చేసినాడు* [నె; తె; అ]

కిట్టు = రెండుకొయ్యలనుచేర్చి, వేసి బిగిం చిన ముడి [చి]

కిత్తడు = కృష్ణుడు; కిచ్చయ్య [వి]

కిత్తనార = (చూ) కలబంద [గో]

కిత్తా = (1) పర్యాయము; విభాగము [గు; నె]

(2) పరిమాణము — మోయన-ఈ వామి మా బండికి మూడుకిత్తాలు వచ్చును; కిత్త [పొ]

కిత్తిలిపండు = నారింజపండు [సే]

కిమ్మ = రహస్యం [అ]

కిమ్మను = నోరెత్తు [వి]

కిరింజి = చినాలి రంగు [సే]

కిరుగు=(చూ) అడవ [చి]
కిరుదు=నాసిరకం [అ]
కిరునాలుక=కొండనాలుక; చిరునాలుక
కిర్దు=తక్కువరకము [తె]
కిఱ్ఱుచెప్పులు=కిఱ్ఱుకిఱ్ఱుమనునట్లు తయారు చేసిన చెప్పులు [అ, నె]
కిర్లుకొను=కెవ్వుమని కేకవేయు [అ]
కిలాడి = నేర్పరి (ఖిలాడీ అనే ఉరుదూ పదమునకు ఆటగాడు అని అర్థము) [నె; కర్నూ]
(2) తగవులు బెట్టువాడు [కర్నూ - పత్తికొండ; అ; తె]
(3) రంకులాడి [వ]
(4) మోసగాడు [గు; గో]
కిల్లాయి=చాడి; కొండెము—కిల్లాయి నూరి నాడు [నె - ఆత్మకూరు]
కిల్లాయిలమారి=తాట్లమారి [నె-ఆత్మకూరు]
కిల్లేగిత్తిరిగాడు=(1) తోలుబొమ్మలాటలో హాస్యగానిపాత్ర; కంబాలమారి, జుట్టు పోలుగాడు [అ-పె]
(2) తంటాలమనిషి [తె]
కిసాయి=జేబు, కిసిరి; కీస [నే; అ]
కిసికింత=కొంచెము, కొసికింత [మ]
కిసిరి=జేబు, కీస, కిసాయి [అ]
కిళ్లకేతుడు=కుచేష్ట చేయువాడు [నే]

## క్రీ



కీంద్ర=ఎక్కువగా నీరు పీల్చెడి బెట్టనేల [నె]
కీచురాయి = రాత్రులలో పొలములందు తెంపులేని రొదచేయు చిన్నపురుగు, ఈల పురుగు [నె, అ; వ]
కీచులాట=వివాదము, రెట్టించుకొనుట [నె, కర్నూ; అ, తె]
కిజీకటి=క్రిందిచీకటి; క్రిసీడ [కరీ]
కీటుకుడు=విషబుద్ధిగలవాడు [కర్నూ]
కీటు=(1) చీలిక, పగులు — *కీటుబానింది* [నె-బా, రా]
(2) మట్టిగోడ పెట్టునప్పుడు చుట్టూ ఒక్కొక్క అడుగు ఎత్తున పెట్టుకొంటూ వచ్చు గోడ భాగము [నె]
కీడిశ=(చూ) కీడిస [నె]
కీడిస=సగము పాలుబోసి గింజబట్టిన ధాన్యపుగింజ, కాయతరక — *పంట కీడిస పోయింది;* కీడిశ [నె]
కీడు=కత్తిపడను, దాళు—*ఆ త్తికికీడుపెట్టు* [శ్రీ]
కీడుతీయు= చెడుముహూర్తంలో సమర్తా డిన పిల్ల కన్నెరికము జరుపు [వి]
కీతు=(1) టెంకాయ ఆకులచావ — *టెంకాయ కీతులగుడిసె* [చి]
(2) అల్లిన టెంకాయమట్ట [చె]
కీదొడ=పల్చగా నేసినబట్టకు నేతగాళ్లు వరి పిండి పలుచగా ఉడికించి పూయునది [గో]
(2) లోదొడ; లోతొడ [నె, వ]
కీనీరు=భూమిపైననే ఉండు ఊటనీరు — *అది కీనీరుబావి;* కీనేరు [నె]
కీనెలుదీసిఅలుకు= చక్కనిగీతలుపడునట్లు వంకరపోకుండ ఇంటినేలను అలుకు [మ]
కీనేరుబావి = మంచిఊటబావి; కీనీరుబావి [చి]
కీరకాయలు=పందిరిదోసకాయలు [చి]
కీలగొంతు=సన్నటి రాపుడు గొంతు [నె]
కీలారి=గొల్ల; కోనారి

కీలుబొమ్మ = అస్వతంత్రుడు [నె, తె]
కీలుమండి = (1) కీలు లేదా అవయవ సంధిలో పుట్టే కురుపు [నె, తె]
(2) క్యాన్సర్ వంటి రోగం అని తెలంగాణాలో అర్థం [వ]
(3) అవయవములు కలియు గూడు (సంధి) [నె. కర్నూ]
[4] మోకాటిలో బుట్టు వ్రణము—కీలు మండె లేచింది [నె. నొ]
కీలుముడి = వెంట్రుకలు జారుగా వేసిన ముడి, కీలుగంటు; పిడిగంటి [అ]
కిలెరిగిన వాత = తగిన ప్రతీకారము [తె; నె]
కీస = (1) ఇంచుక, కొంచెము — కీసంత సేపు; కీసెలో గురిజప్పినది
(2) జేబు—అంగీ కీసాలో డబ్బులున్నవి కీసా; కీసర, కీసాయి [తె]
కీసర = జేబు, కీసాయి; కీసర [అ. వె]
కీసా = జేబు కీసర; కీసాయి [కరీ]
కిసాయి = జేబు, కీసాయి, కీసర [అ-పె; మ]
కిశేరు = చెరువు కట్ట క్రింద సాగుబడియగు భూమి [నే]

# కు



కుంక = కుక్క [చి]
కుంకుడుకాయ = తల పులుముటకు ఉపయోగపడు కాయ, ఈ కాయను నలగగొట్టి నీటిలో వేసిన నురుగు వచ్చును [చి, నె]
కుంచము = (1) చెరువు తూముల నుండి నీరు బయటికి వచ్చు రంధ్రము, కావల సినప్పుడు కప్పిపెట్టుటకు ఉపయోగించు గురువైన కొయ్య మొద్దు [నె-మెట్ట]
(2) ధాన్యపుకొలత పాత్ర. తూములో నాల్గవ వంతు, ఇరుసలో (ఇరస) సగము, కుంచాము [నె, కర్నూ; అ, తె]
(3) చెరువునుండి ఇవతలికి నీరు వచ్చే తూము
(4) గొడ్డలి తూము (రంధ్రము) [వ]
కుంచ సెగ = పడిశనివారణకు పట్టు సెగ. ఉడికిన వడ్లలో ఇటుక వేసి దుప్పటి కప్పుకొని ఆ సెగ పట్టిన చెమటలు పట్టి జలుబు విడుచును [చి]
కుంచాము = (చూ) కుంచము [చి]
కుంచెలు = (1) పశువుల పండుగ; కనుము [వి]
(2) పంచె కొంగులు [చి]
కుంట = (1) పాతిక సెంటు భూమి [గు]
(2) అరి యకరము [కృ]
కుంటించు = చేయగూడని పనిని చేయించు —వాడు వాణ్ణి కుంటించినాడు [అ-పె]
కుంటికత్తి = గడ్డిని ఎగదోయు కత్తి [శ్రీ]
కుంటి కునిష్టి = వికలాంగులు [నె]
కుంటి కూనాక్షి = (1) కుంటివానిని ఎగతాళిచేయు మాట
(2) చేతగానివాడు; పనికిమాలినవాడు [వ]
కుంటు = ఉమ్మడి పనికి పోకుండినవాడు చెల్లింపవలసిన జరిమానా [అ]
(2) కూలివాడు గాని జీతగాడు గాని పనిలోనికి రాని దినము; నిలవ; కుందకము [అ]
కుంటు దినము = జీతగాడు పనిలోకి రాని దినము—నీ కుంట్లు పట్టుకొని జీతమిస్తాను; నిలువ [తె]

కుంటెన = కాడికి కట్టిన వాన్నైకప (కాడికట్టు మోకు) తగిలించు లావైన త్రాటి వలయము; పొడిగింప వలసినపుడు కుంటెన వాడుదురు [నె-పొ]

కుంటెన దూలము = దూలముపైన చిన్న దూలము, గుంట దూలము, మేలుదూలము [కరీ]

కుంటెన పాము = పెనవేసికొన్న పెను బాము జంటను రక్షించుటకు కనిపెట్టి యుండు పాము [నె-పొ]

కుండ = బండి ఇరుసును చక్రములోనికి దూర్చుటకు ఏర్పరచిన గుండ్రటి మూలము; చక్ర కేంద్రము [చి; నె]

కుండ పులి = గుంటనక్కల భయపెట్టుటకు ఉపయోగించు దిష్టి బొమ్మ [చి]

కుండ మార్పు = (1) ఒక ఇంటి ఆడు పడుచును పెండ్లి చేసికొని, యీ యింటి ఆడు బిడ్డను మరల మొదటి యింటివారి వరునికి పెండ్లికి యిచ్చుట; ఒక వధువు అన్నకు ఎదిరి ఆడబిడ్డను యిచ్చి పెండ్లి చేయుట [నె, కర్నూ]
(2) ఒకటిచ్చి మరియొకటి తీసుకొనుట [శ్రీ]

కుండలో గుడ్డాలు దోలు = ఇల్లు వెడల కుండుట — *పొద్దుగూకుడు కుండలో గుడ్డాలు దోలడమేనా* [నె-పొ]

కుండలలోకి తీసికొనివచ్చుట = రజస్వలా స్నానమైన వెనుక, ఆడపిల్లను ఇంట్లోకి తీసుకొని వచ్చుట; వంటలోనికి తీసికొని వచ్చుట [నె; గు]

కుందకము = (1) కుదించుకొని పోయినది, తగ్గినది
(2) పనివాడు పనికి రాని దినము; నిలువ, కుంటు [నె]
(3) పనిచేటు [చి]
(4) త్రవ్వినది [చి]
(5) నష్టము—*నీవల్ల నావని కుందక* (6) ఆటంకము; కుందు—*పని కుందకము* [అ]

కుందనము = పెండ్లికి ముందు ముత్తైదువులు వడ్లు దంచుట [అ-పె]

కుందా = తుపాకి మొదలు [కరీ]

కుందాపన = మనస్సులో తపన [కరీ]

కుందాయి = కుందా (తుపాకి మొదలు) వేసి నట్లున్న స్త్రీ, అడ్డబలుపుతో పొట్టిగానుండు ఆడుది [కరీ]

కుంది = కుందిన; కుందెన [గు]

కుందిన = రోటిపైన దంచునపుడు అమర్చు భాగము, ఇది రాతిలో మలవబడి యుండును; కుంది, కుందెన.

కుందు = (1) పశురోగము [అ]
(2) (చూ) కుందకము [అ]
(3) మాంసమును ఖీమా (కైమా) చేయుట [నె]
(4) చిదురు చిదురుగా నరుకు [నె. గు]

కుందెన = వెదురుతో గాని; ఇనుపరేకులతో గాని చేయించబడిన కుదురు వంటి వస్తువు [తె]
(2) (చూ) కుందిన [నె, కర్నూ, చె, అ]
(3) ప్రమిద [గో]

కుంపటి = నిత్యవ్యథ—*ఈ కుంపటి నాకు పెట్టినాడు* [కరీ, నె]: *గుండెలమీద కుంపటి* [వి]

కుంపటెక్కింది = కోడి పొదుగు ప్రారంభించింది [మ]

కుంపు = (1) ఎడతెగని దుఃఖము
(2) క్రుంగిపోయిన లేక, కుంచబడిన భూభాగము [నె; కరీ]

కుంబకోణము = మోసము

కుంబీలు = పిట్టగోడలు; కుంబులు; కుమ్ములు

కుంబులు – పిట్టగోడలు; కుమ్ములు; కుమ్మీలు; కుంబీలు

కుంభము = దేవతకు వండిపోసిన అన్నపు రాసి—*పోలేరమ్మకు కుంభం పోసినారు* [నె]

కుక్కనెత్తిమీది టెంకాయ = అస్థిర విషయము [అ]

కుక్కనోమ = పైరు మొక్కలలో ఒక విధమైన కలుపు మొక్క [వి]

కుక్క పీకులాట = (1) ఒకటి చేయబోయి అవస్థలో ఇరుకుకొనుట [వ]

(2) సుఖము సులభమనిపించి కష్టముల పాల్జేయునది.

కుక్కి = (1) పాతదై వదలెక్కినది — *మంచపు కుక్కి; బండి కుక్కి* [కర్నూ; నె; అ]

(2) ముసలది—*ఎద్దు కుక్కి*; బత్తెకుక్కి [వ]

కుక్కినపేను = ప్రతిక్రియ లేకుండా అణగి ఉండు; చెప్పు క్రింద తేలు—*కుక్కిన పేనుమాదిరి పడి ఉండినాడు* [నె]

కుక్కిరి = (చూ) జల్ల; మక్కిరి [అ-పె]

కుచ్చు = బాలికల చింతగింజల ఆటలో రెండు పుంజీలు; కుచ్చి [గో]

కుచ్చుము = నాలుగు పైసలు (వెనుకటి నాలుగు కాణులు) [మ, కరీ]

కుచ్చిలు = (చూ) కుచ్చిలి; కుచ్చెల [నె; అ, తె]

కుచ్చీలు = (1) చింతగింజల ఆటలో నాలుగు గింజల పోగు [వి, తూ-గో]

(2) కుచ్చిళ్లు; మడుపులు [శ్రీ]

కుచ్చె = (చూ) కుచ్చెల [నె-మెట్ట]

కుచ్చెలి = (1) పిడకలు పేర్చినగుట్ట

(2) కోసినజొన్నదంటును కంకితోగూడ తాత్కాలికముగా వేసినగూడు [నె]

(3) చిన్నబాలికలు మొలకు కట్టుకొను వస్త్రము.

కుట్టు = (1) పొయ్యిలోనుండు వేడిబూడిద కుమ్ము [నె; కర్నూ; తె]

(2) పగ; ద్వేషము—*కడుపుకుట్టు; కడుపుమంట* [నె, అ]

కుడుపు = విందుభోజనము [మ]

కుడుమాయ = కుండ [గ]

కుడుము = (1) తీపెపూర్ణములోన నుంచి చేసిన భక్ష్యము—*కుడాలు* బహువచనము [అ; తె]

(2) పూర్ణములేనిది; ఉండ్రాయి [నె]

కుడుమురొట్టె = ఆవిరికుడుము; గుంత పొంగలి.

కుతి = ఉత్కంఠ; ఆరాటము [గు]

కుతికెనవేసుకొను = ఇష్టములేకపోయినను సహించు [నె-పొ]

కుతిగంటు = మెడకు అనుకొని ఉండు కంఠహారము; అడ్డిగ [గో]

కుతిగాఉండు = ప్రియమైన వస్తువుకొఱకు, ప్రియమైన మనిషికొఱకు తహతహపడు [గు]

కుతుంబిర్లు = కొత్తిమెరలు, ధనియాలు [సే]

కుత్తిగంటు = కంఠమునకు బిగినికట్టినపద్దెడ నగ; పట్టెడ [శ్రీ]

కుత్తెకవడ్డది = పొరపోయింది [మ]

కుత్తెము = పిక్కటము [కరీ]

కుదప = కంటిలో ఒకకొలికిలో ఏర్పడిన దుర్మాంసము [నె; తె]

కుదరవేయు = పొలములో పశువులను మందగాదోలి విశ్రాంతినిచ్చు — *మిట్ట చేలో కుదరవేసినా* [నె]

(2) సమ్మతింపజేయు [అ-పె]

కుదవ = పశువులమేత గడ్డికై ప్రత్యేకించిన పొలము; దీనిని సూచించుటకు ఈత కంపలు (మెల్లెలు) అటనటనేలపై గుచ్చియుంతురు; పొలము మలదోలుట, చదువులగొట్టు; కుదువ [చి]

కుదిచ్చు=(1) తగ్గించు; కుదించు
(3) సరిగాపట్టేటట్లు ఇటు అటు కదిలించు, కుదించు [మ]

కుదిరిక=స్థిరపడిన రూపము—*ఇంకా కుదిరిక ఏర్పడలేదు* [నె, అ, తె]

కుదిరిచ్చు=(1) కుదుర్చు; ఏర్పాటుచేయు, [నె]
(2) పొందుచేయు, సరిచేయు [మ]

కుదుపు=(1) ఆయాసము [కరీ]
(2) కదలించు [శ్రీ, నె]

కుదురు=(1) వడ్లు దంచుటకు రోటిపై నుంచు వెదురుబుట్ట ఇది రోలువెడల్పుతో ప్రారంభమై పోనుపోను వెడల్పు ఎక్కువగా నుండును; పేళ్ళకుందెన [చి; ప; అ]
(2) నెమ్మది—*కుదురుగాఉండు* [గో, నె]
(3) స్థిమితము; క్షేమము — *కుదురుగా ఉండనీయలేదు*; [నె]
(4) పాత్రలు నిలుచుటకు క్రిందబెట్టు చుట్టకుదురు [కర్నూ; నె, తె; అ]
(5) ఆధారము — *ఈ వంశంబు వకెళ్ల నీవ కుదురు* [అ, నె]

కుదురుకొను=చక్కబడు — *వాని సంసారము ఇప్పుడిప్పుడే కుదురుకొంటున్నది* [తె; నె]

కుదువపేయు=(చూ) చదువులగొట్టు, మలగొట్టు; కుదవ [చి]

కుద్దు=రెండుఅడుగులు పొడవు 3 అంగుళములు కైవారముకలిగిన రోకలి, దీనికి పన్నుఉండదు. [ఉ-వి, శ్రీ]

కుని=(1) పిదిమలుపు; తిరుగడు; మూల [నె, గు]
(2) చేనిలో నలుచదరవుగట్లకు (గనిమలకు) మీదియున్న భాగము [నె-మెట్ట]
(3) ఇంటిస్థలములో చతురస్రముగాక ఒక మూల ఎక్కువగా ఉండుట [తె]

కునిచుట్లు=(చూ) కుని [అ]

కున్ని=చిన్నది—*కున్నిముండ*. వయస్సుకు మించిన మాటలు పనులు గలది [నె-పొ]

కున్నె=ముక్క; తుంట — *పిడక కున్నె* [కరీ]

కుప్ప=(1) కోసినపైరును నురుచుటకు ముందు అమర్చిన ప్రోగు [నె; కర్నూ: తె, అ, గు; తూ-గో]
(2) ఒక చిన్నభాగము [గో]

కుప్పమీదకూర్చుండు = మేలుస్థితిలో నుండు; భద్రముగానుండు; [కరీ]

కుప్పికట్టు = ఆయుర్వేదవైద్యులు కోపులుగాచేసి పెట్టుకొనిన వంశానుగతమైన రహస్యపు మందు. దీనిని సాది, అనుపాన భేదములతో చాల జబ్బులకు యిచ్చుచుందురు, కుప్పెకట్టు [నె; తె]

కుప్పిదొల్లి=పెద్దగంప [చి]

కుప్పు=దారములతో కూర్చి బిగించిన కట్టు [వ]

కుప్పె=(1) బంగారు మొదలగువానిని కరుగు చిన్న మట్టిపాత్ర; మూస [కరీ]
(2) గాజుబుడ్డీ— *గాజుకుప్పెలోన వెలుగుచు దీపంబు* [అ, మ]
(3) కత్తి మొదలగువాటి పిడి
(4) ఉండ (ఎక్కువగా ఔషధములలోవాడు మాట) కుప్పెకట్టు [గో]

కుప్పెకట్టు=(చూ) కుప్పికట్టు [కర్నూ]

కుముటోసన=చెడ్డవాసన [అ]

కుములు=(1) పైకి మంటరాకుండ లోపలనే కుమ్మరిఆవము (ఆమ్మ) వలె రాజి మండు [కర్నూ; నె, అ; తె]
(2) లోలోన బాధపడు— *ఆయన కుమిలిపోతున్నాడు* [నె]

కుమ్మక్కు = (1) కుట్ర
(2) లోబడుట
(3) తోడ్పాటు [అ]
(4) ప్రోత్సాహముచేయుట [తె; నె]

కుమ్మరపొయ్యి = కుమ్మరిచేసిన గుండ్రని వంటపొయ్యి, ఎక్కడబడితే అక్కడ పెట్టుకొన వీలగును [చి; నె]

కుమ్మి = గొబ్బిళ్లు [చి]

కుమ్మీలు = పిట్టగోడలు; కుంబీలు, కుంబులు

కుమ్ము = (1) ఇబ్బంది; అవస్థ — *అది ఒక కుమ్మయింది. మాకు కుమ్ము దుమ్ముగా ఉన్నది* [నె]
(2) వేడిబూడిద [నె]

కుమ్ముపచ్చడి = వంకాయను పొయ్యికుమ్ము (వేడిబూడిద)లో బెట్టి కాల్చి పిసికి చేసిన ఊరుబిండి [నె, తె]

కుమ్ములు = పిట్టగోడలు, కుంబీలు; కుమ్మీలు

కుమ్ముసుద్దం = (1) తీవ్రమైన వ్యతిరేకత, నిప్పుకు ఉప్పువలె — *వాళ్లిద్దరికి కుమ్ము సుద్దంగా ఉన్నది* [నె]
(2) దుర్మార్గము
(3) వేడిబూడిద [నె-దక్షిణ]

కుయిలు = కిటికి, వాకిలిచట్టములు బిగించుటకు వాటికొయ్యలకు చివరనవేయు తొలి; కూరు, [అ]

కుయ్యన్న = పనికిమాలినవాడు [చి]

కురజాలు = పురుషావయవత్రయము బిరజాలు [శ్రీ]

కురదల = తక్కువ — *అది కొంచెం కురదల* [తూ-గో; నె]

కురదూడ = (1) కోడెదూడ [అ]
(2) బఱ్ఱెమగదూడ × పడ్డ, కుఱ్ఱదూడ [నె]

కురపగొఱ్ఱె = దట్టంగా పొడవైన రోమములు గల గొఱ్ఱె; కురపొట్టేలు [నె-పొ]

కురపొట్టేలు = గొఱ్ఱెపోతులలో బలిష్ఠములైన జాతికి చెందినది; దీనికి బొచ్చు ఎక్కువ [చి; నె]

కురబ = ఒక అడవిజాతివారు; కురవ. [చి]

కురమ = (చూ) కురవ [వ]

కురవ = (1) గొఱ్ఱెలకాపరి; గొల్లవాడు
(2) కంబళ్లునేయు ఒకజాతి; కురబ; కురమ [అ, వ; చి]

కురవదారం = ఉన్నితో చేసినదారం [అ, మ]

కురాకు = (1) మాంసము
(2) ఆకుకూర; కూరాకు [అ-ఉరవకొండ]

కురికుడుము = కజ్జికాయ [నే]

కురిడి = (1) నీరులేని ఎండుకొబ్బరి [శ్రీ]
(2) కోడెలకు ప్రత్యేకముగా అందముగానుండుటకు వేయు సన్నదారలు కలిగిన తోలు [నె, శ్రీ]

కురిపె = త్రవ్వుటకు ఉపయోగించు చిన్న పనిముట్టు [కరీ]

కురు = చిన్న (చూ) కుఱ్ఱు [నె]

కురుగు = తొడ

కురుజు = చిన్నది; కూన — *కూనకురుజు* [నె]

కురుపుకురుపుగా = అతి ఆయాసముతో — *నిండుచూలాలు కురుపు కురుపుగానున్నది; -ఈరోజు నాబళ్లు కురుపుగా నున్నది* [కరీ]

కురుమాడు = ఇంటికప్పును, ప్రక్క రెట్ట గోడమీద వెన్నుఎత్తున నిలుపక, క్రిందికి వాటముగా సూరుది చినడ; ఇందు సూరు నాలుగుప్రక్కలా ఒకే మట్టములో నుండును — *కురుమాడు దించిన ఇల్లు* [నె]

కురుమాపు = సగము మాసినది, పాతది; కొద్దిగా మాసినది (మా-కురు) [అ]

కుఱ్ఱ = ఎద్దుకు బాల్యమునందలి పేరు; *గూళికుఱ్ఱ — ఆవులను దాటుటకై వదలినకుఱ్ఱ;* ఆబోతు [అ]

కుఱ్ఱ = బఱ్ఱెమగదూడ × పడ్డ-ఆడుది. (ఇట్లే ఆవు మగదూడ కోడె, ఆడుది పెయ్య)

కుఱ్ఱి = ఆవు [వ]

కుఱ్ఱు = (1) ఎత్తు ఎదుగని పుట్టల చిట్టడవి — *ముతుకూరు కుఱ్ఱు* [నె]
(2) కోపము; గుఱ్ఱు — *వాడికి నామీద కుఱ్ఱు* [వ; కరీ]

(3) గర్వంతోకూడిన కపటం [వ]
(4) మగగురి [వ]
కుట్టిలు = గిత్తలు
కులకర్ణి = కరణము ; శానభోగం; పట్వారి
కులకులలాడు = జ్వరముతగులుటకుముందు వచ్చు గగుర్పాటు; కులకరించు [నె-పొ]
కులాకరము = అసహ్యము [నే]
కులాలవాళ్లు = హీనజాతులవాళ్ల [నె-పొ; నె]
కులాయించు = అభివృద్ధిపొందు — *వాని దశ కులాయించింది* [తె]
కులికిద్రం = నికృష్టము [వి]
కుల్లు లోతోడు = ఓర్వలేనివాడు [మ]
కుల్లేరు = సిమెంటుపూయు పనిముట్టు [చె]
కువాడము = (1) హాస్యము, పరియాచకము [కర్నూ]
(2) కుచేష్ట, వెక్కిరింత [తె]
కువ్వనేల = కువకువలాడు నేల [చి]
కువ్వాడము = (చూ) కువాడము [కర్నూ]
కువ్వెన = పొన్నలు; గరాటు; వాళిగి (Funnel)
కుశాల = ఉల్లాసము — *కుశాలైన పిల్లవాడు;* కుశాలు [నె, కర్నూ; తె, అ]

కుసంది = ఇరుకు, కుసందు; [నె]
కుసందు = ఇరుకు — *అది కుసందు గొంది* [నె. పొ]
కుసి = ఒకదానిని ఇంకొక దాని రంధ్రములో బిగించుటకు ఇరుప్రక్కలా చెక్కి చేసిన పొడవు భాగము; పిసి — *మంచపు కోడు కుసిలోకి విరిగింది* [కర్నూ; కరీ, నె-పొ]
కుసిద్దము = అసూయ [అ-పె]
కుసినివాడు = దొరల దగ్గర వంటచేయు వాడు; బట్లరు [శ్రీ]
కుసిలించు = (1) మెల్లగా ఏడ్చు; కుసిలిచ్చు.
(2) కుంటు [అ]
కుళాయి = (1) టోపి
(2) నల్ల; Tap; కొళాయి [నె]
కుళ్లాయి = (చూ) కుళాయి [కర్నూ; అ]
కుళ్లిపోవు = మాసిపోవు — *కుళ్లిన గుడ్డలు చాకలికి వేయి* [శ్రీ]
కుళ్లు = ఎదుటవారి సంపదకు లోపల అసూయ పడు; చూడలేని తనము [నె; కర్నూ; అ]
కుళ్ళుబోతు = ఓర్వలేని వాడు [చె; నె]

## కూ



కూకుడు = (1) కూర్చో; కూర్చుండు [వి]
(2) అస్తమయము — *చుక్క కూకుడు* [చి]
కూచంటి = మిక్కిలి చెంటి [కరీ]
కూచము = (1) మంచపు పట్టె.
(2) అగ్ర భాగాలు, (స్తంభం చివరలు) మరొక దానిలోనికి దూర్చుటకు చెక్కిన భాగం; కుసి; పిసి [వ]

(3) ఇంటికివేసిన కొయ్య కంబము (పందిలికి వేసినది గుంజ) [నె, అ-పె]
(4) రాతి కంబము [నే]
(5) స్తంభము; కూసము [చి]
కూచీఱుగు = విచ్చుకపోవు [కరీ]
కూచుకో = కూర్చో [నే]
కూటి కలబంద = కళ్లనొప్పికి పనికివచ్చు చిన్న కలబంద జాతి ఓషధి; ఇండ్లలో వ్రేలాడదీసిన దోమలు చేరవు [చి]

కూటి కునుకు = భోజనాయాసముతో పట్టు నిద్ర [వి]

కూటి ముచ్చు = బహు తిండిపోతు [తె]

కూటి ముత్యము = కల్ల ముత్యము [నె]

కూటీ = చిలుక కొయ్య [కరీ]

కూటు = (1) పెక్కు కూరగాయలు కలిపి చేయు ముద్ద పులుసు [దక్షిణాది]
(2) మొదట ఏత్తిన మొలక [కరీ]

కూటు పుట్టకెక్కు = ఇసుకలో లేచు చిన్న రకము పుట్ట గొడుగు; పుట్టకొక్కు [వి]

కూడబలుకు = ముందుగా అనుకొని నిర్ణయించుకొను—కూడబలుక్కొనే అవని చేసినారు [శ్రీ; నె]

కూడలి = (1) నదీ సంగమము—కూడలి
(2) వీధులు కలియుచోటు [నె: వ; అ]

కూతకొచ్చినకోడి = వయస్సు వచ్చిన మగ కోడి; అరకోడి [గు]

కూతదూరం = పిలిచిన వినబడునంత దూరము, కూతవేటు దూరము [చి]

కూతవేటు దూరము = కూత వినపడునంత దూరము; కూత దూరము; పిలుపుమేర [నె-పొ]

కూతు = వీధిభాగవతము [చి]

కూనము = చొక్కా [వి]

కూనము = జ్ఞాపకము—మేము మీకు కూనమున్నామా? [తె]

కూనరాగము = (1) పిల్ల రాగము, లోలోపలనే పాడుకొనునది; [నె; కర్నూ; తె; అ]
(2) సంతోషముతో ఏకంతమున వారిలో వారు తీయు రాగము; కూనిరాగము [నె-పో]

కూన రొయ్య = చాల చిన్నపాటి సముద్రపు రొయ్య, ఎండబెటి వాడుకొందురు; రొయ్యపొట్టు [నె]

కూనలు = పిల్లలకు కండ్లలో పెరుగు దుర్మాంసము [తె]

కూనారి = దిట్టతనము కలిగియు, పైకి ఏమియు తెలియని దానివలె నుండునది [వి]

కూవారిల్లు = పూర్తిగా దుర్బలమగు [నె-ఆత్మకూరు]

కూనిరాగము = (మా) కూనరాగము [అ; త]

కూను = (1) చెవిటివి
(2) నిండుగా; పూర్తిగా — కూనులకాన తిన్నాడు [అ-పె]

కూపీ = జాడ—కూపీ తీశావా? [చి; వి; శ్రీ]

కూబి = ఏమీ తెలియని వ్యక్తి [గో]

కూర = మాంసము (తక్కువ కులాల వాళ్లే ఈ అర్థంలో వాడుదురు, పైకులాల వాళ్లు మాంసాన్ని శాఖం అంటారు) [వ, నె; అ;]

కూరాకు = (1) వండిన శాకము—కూరాకు పెట్టు. [నె; కర్నూ; తె, అ]
(2) మాంసము [అ]

కూరాడు = ప్రతినిత్యము బియ్యం కడిగిన కడుగు, కలిపోయు కుండ; కలి కుండ; తరవాణి. ప్రతి శుభకార్యంలో పండుగు దినములలో తప్పక మాంస రహితమైన నైవేద్యము దీనికి పెట్టు ఆచారం; నూతన గృహప్రవేశ శుభ సమయమున ఇంటి ఆడపడుచు (సోదరి) ఈ కుండ ఎత్తుకొని వచ్చి కట్నం తీసుకొనును [మ; కరీ, వ; నిజా]
(2) ఈ కలి కుండకు ప్రతిదినము పసుపు బూసి కుంకుమ బొట్లు బెట్టి పవిత్రముగ జూతురు [నె]

కూరు = కిటికీలు వాకిండ్లు చట్టము బిగించుటకు కట్టెకో వేయు తొలి, కులుకు; కొళ్లు [అ]

కూరేగంట్లు = చీరపోతులు [అ-పె]

కూలు = మొదట—కూలులోనే [అ]

కూస = ముక్కు పొడుంచేసుకొను మట్టి పాత్ర [ప-గో]

కూసంత=కొంచము; కిసంత, కొసంత [వ]
కూసము=(1) కొయ్య కంబమునకు చివర తొలిచిన సన్నని తొలుపు; కూచేము [కరీ]
(2) ఇంటికి వుపయోగించు కొయ్య స్తంభము [చె; నె]
కూసి=(1) చిన్నపిల్ల [శ్రీ]
(2) కూచి—సూదిమొన కూసిగాఉన్నది; కూసిరాయి [నె]
కూసు = చిన్న—అభ్యాసం కూసువిద్యా [వి]
కూసులు=బండి పారులపై (పరములపై) బిగించు, చిన్న నిలువులు; గుజ్జులు [చి]

# కృ



కృష్ణకొండి=కృష్ణుడు పింఛమును ధరించు ముడి [చి]
కృష్ణనీలాలు=వరి ధాన్యములో ఒకరకము, సన్నని వరి [చి]
కృష్ణమూర్తి= రసికుడు — వాడు కృష్ణమూర్తిరా [వి]

# కె



కెంపు=(1) సారాయి [వ]
(2) కంకరతెగులు [గో]
కెంపెక్కు=పండబారు—మిరప కెంపెక్కుతున్నది (ఎఱ్ఱబడుచున్నదనుట) [నె]
కెంపువచ్చు=మామిడికాయలు రంగుమారి పండుటకు సిద్ధమగు [మ]
కెకమ కెకవుడు=మూర్ఖుడు [అ-పె]
కెచ్చల=తెలివితక్కువతనము [శ్రీ]
కెచ్చు=పారతో పెళ్ల గాతీసిన మన్ను; పెళ్ల [శ్రీ]
కెదకు =పెల్లగించు [నే]
కెల్లి=నుండి, నుంచి — అడికెల్లి, అక్కడికెల్లి, ఇక్కడికెల్లి [తె]

# కే



కేక =మాలలు మాదిగలు చిందుత్రొక్కుచు వేయుకేక [నె-పొ]
కేకవేయు=పిలుచుకొనివచ్చు— రామయ్యను కేకవేసిరా [శ్రీ]
కేటు=(1) అసలుమర్మము
(2) లోపలివేరు మొదలు—పెరికితే కేటు లేకుండా వచ్చినది [కరీ]
కేడి=(1) ఒకజాతి ధాన్యములో కలిసిన అన్యజాతిగింజ; బెరుకులు — మొలగొలుకులో ఇసనకోర కేడి

(2) అన్యుడు; కేళి [నె]
(3) నమ్మరానివాడు [అ]

కేతిగాడు = తోలుబొమ్మలాటలో ప్రధానమైన హాస్యాస్పదపాత్ర. వీనికి బుడ్డ ఉండుటచే బుడ్డకేతిగాడని అనిపించుకొని, జుట్టు పోలుగాడను ఇంకొకమాటకారి అయిన విదూషకునిచేత గేలికొట్టించుకొనుచు ప్రేక్షలకు నవ్వుపుట్టించుచుండును. వీరందరు సరసములాడుటకు వాడవదినె — *బంగారక్కగలదు;* ఈ ముగ్గురును ఆంధ్రుల ప్రత్యేకతను వెల్లడించుపాత్రలై శాశ్వతమూర్తులైయున్నారు. తోలుబొమ్మలాట, ఆరెలు— *మరారీలసొమ్ము.* తెరవెనుకచేరి తెరపై ఆడించు యీకళ తమిళనాడులోను, ఇండోనేషియాలోను ప్రసిద్ధము. ముఖ్యముగ రామాయణ భారతకథలనే ఆడుదురు; కేదరిగాడు [నె]

కేదరి = ఏటవాలుగా వేసిన మడవ. (మడవ = ఒకకయ్యనుండి ఇంకొక కయ్యకు నీరు పారుటకు గనిమలో చేసినగండి) కయ్యలు సమతలములో లేకుండినచో, నీరు దూకినప్పుడు గుంటపడకుండుటకుగా ఏటవాలుగా మడవను వేయుదురు; చాచుమడవ; మేను [నె]

కేదరివాటు = కేదరి మడవవలె ఏటవాలుగానుండునది; బారివాటము; క్యాదరి [నె; వ]

కేదగిబిళ్ల = మొగలిరేకు ఆకృతిగల శిరోభూషణము [అ]

కేదరిగాడు = (చూ) కేతిగాడు; గంతోళిగాడు

కేపు = (1) మోసము — *వాడు కేపు చేసిపోయినాడు;* కేపుమారి [చి; నె]
(2) దొంగతనము [వ]
(3) గింజలు పుచ్చుట ప్రారంభించు [గో]

కేపుకొట్టాడు = పారిపోయాడు [చి]

కేపుమారి = టోపీలు మార్చువాడు; మోసగాడు; కేప్మారి [చి; నె]

కేప్మారి = వంచకుడు; కేపుమారి [కర్నూ]

కేరణాలు = కేరింతలు [కరీ]

కేరాకు = పొగుకులో నాచిరకపు టాకు; పనికిరాని ఆకు [కరీ]

కేరింతలు = సంతోషముతో చేయుగోల [కరీ]

కేరు = కోడిపెట్ట గ్రుడ్డుపెట్టుటకుముందు వేయు పొడికూత— *పెట్ట కేరుతున్నది;* కొక్కుబట్టు [నె; గు; వ; అ]

కేవు = తెలివికలుగుట; మెలకువ గలుగుట [శ్రీ]

కేవుకు రాడు = దారికిరాడు; రేవుకురాడు [నె]

కేశవ = (1) అల్లరి—*దానికింత కేశవ అవుతుందనుకోలేదు* [నె-ఆత్మకూరు]
(2) వేళాకోళపుతనము—*నాడంతా కేశవులు (కేశవలు) మారోడు* [నె]

కేళి = (చూ) కేడి [గో]

## కై



కైంకర్యము = అపహరణము — *దానిని వాడు కైంకర్యము చేసినాడు* [నె; శ్రీ]

కైకలవాడు = (1) బట్టలునేయు శూద్ర జాతివాడు; వీరు బేలుబారి పని కూడా చేయుదురు; కైకాలవాడు; కైక్కులవాడు [నై]
(2) పద్మసాలి [చి]

కైకలు = కూలి; కైలు [నై-బూదకూ]

కైకాలవాడు = (చూ) కైకలవాడు

కైకిలి = (1) దినకూలీ [కరీ]
(2) అదనము [నె]

(3) కైకూలి; చేతిపని కూలి; కూలివాడు [ప]
కైకోల్లువాడు = బట్టలనేయు శూద్రజాతి, కైకాలవాడు [చి]
కైగ = (1) బాగుగ,
(2) పొదుపుగ
(3) తగురీతిగ
(4) రుచిగ [చ]
కైజారు = (1) చిన్న తెడ్డు;
(2) కఱ్ఱు;
(3) గరిటె [కరీ]
కైతకములు = సాకులు [కరీ]
కైనీడ = క్రీనీడ [కరీ]
కైరతు = చతురోపాయము [కరీ]
కైరా = తెల్లని పావురము
కైలాటము = జగడము, కొట్లాట [వ]
కైలాటకాటు = జగడాలమారి [వ]
కైలాటి = తమాషా, కైలాటగాడు [అ]
కైలు = కూలి, కైకలు (సై-బూదజా)
కైలుచేయు = ధాన్యమును పంజగొట్టి (పిడి వాటు గొట్టి) తూర్పారబట్టి సిద్ధపరచు [కరీ]
కైవాలుట = పండిన చేనుపైరు భూమిపై వ్రాలుట, మళ్లబడుట, నేలగఱచుట [గు]
కైవాసము = ధాన్యాదులు యొక్క గాదెలు వర్షమునకు తడిసిపోకుండుటకై ఇంటికి వలె యేర్పరచు ఇలారం యొక్క వాసము [నె]

# కొం



కొంక = బెత్తమునకు మొదటగల వంక; కొంగ; కొంకి [కరీ; అ]
కొంకర్లుపోవు = (చూ) కొంగర్లుపోవు [తె; అ]
కొంకి = (1) వెదురుకొనను తగిలించుకత్తి; కొంకిగడ; కత్తిదోటి [చి]
(2) చేతికఱ్ఱకు చివరనుండు వంకరకొంకి [నె-పొ]
కొంకిగడె = వాసము [చి]
కొంకిబద్ద = గొడ్లకాపరులు చేతపట్టుకొను కఱ్ఱ [గు]
కొంకిమాను = చెఱకు గానుగను త్రిప్పు మాను [చి]
కొంకుప్పులు = ఎద్దుకొమ్ము కుప్పెలు [అ]
కొంగ = (చూ) కొంక [అ]
కొంగతంత్రము = కార్యసాధనకు చాలని ఉపాయము [నె-పొ]
కొంగపార = కొంగమూతివలె పొడవుగా నుండు పార [నె-పొ]
కొంగర్లుపోవు = చలివలనగాని, వాతమువల్ల గాని అంగములువంకరబోవు [నె; కర్నూ]
కొంగవాడు = పొడవైన సన్ననివాడు; కొంగ కాళ్లోడు; బొంగోడు [నె-పొ]
కొంగాలుకత్తి = ఒక విధమైన వంకరకత్తి; జాతరలలో దీనిని పైకిఎత్తి చూపుచు చిందులు వేయుదురు. ఈ నృత్యము కొన్ని జాతులవారికి గిట్టదు [నె]
కొంగిరిచేష్టలు = కొంటెతనముగా చేయు పనులు [కర్నూ]
కొంగు బంగారము = తన స్వాధీనములో నున్న అర్థము; సులభసాధ్యమైనది [అ]
కొంగు ముడివేయు = (1) పెండ్లిచేయు
(2) గట్టిగా పదిలపరచు [నె, కర్నూ, తె; అ]
(3) భార్యాభర్తలు కలిసి అతిగా తిరుగు [గు]
కొంటబీ = తీసుకపో [వి]

కొంటె = తులిపి; చెడ్డతలంపులేని అల్లరి తనము; పోకిరి [నె, కర్నూ, తె; అ]
కొంటెకాసులు = కాసుల దండగా జేయుటకు వీలుగా కొండీలు అతికి చేసిన కాసులు [తూ-గో]
కొంటేగాలము = పోకిరి వాడు [చి]
కొండక = తెమ్ము; తీసికొనిరా; కొంౘ్రా [చి]
కొండకాసులు = కొండకు అనగా, తిరుమలకు కట్టిన మొక్కుబళ్ల ముడుపులు కొండ కాసులువాడు వెంకటేశ్వరుడు; కొండె కాసులు [అ]
కొండకెదిరిచూచు = నిరంతరము నిరీక్షించు [కరీ]
కొండచీపురు = ఏజన్సీలో దొరుకు ఒకజాతి చీపురుగడ్డి [వి]
కొండచుట్టుతిరునాళ్లు = దేవునికొండచుట్టూ చేయు ఊరేగింపు. ఇది రథసప్తమినాడు జరుగును; గిరిప్రదక్షిణము [చి]
కొండజ్వరము = మలేరియాజ్వరము, మన్య జ్వరము [వి]
కొండనాల్క = నాల్కపై నగల చిన్న నాలుక ఉబ్బి నొప్పిబుట్టుట. చిరునాలుక, కిరునాల్క [కరి; నె]
కొండన్న = తేలు; కొండెన్న [చి]
కొండపండు = అపురూపము [కరీ]
కొండమంగలి = చక్కగా క్షౌరము చేయలేని మంగలి, అరకొరలపని. పూర్వం తిరుపతి కొండమీద, మంగళ్లు ఒకరికి సగంపని చేసి నఱుమఽలిపి, ఇంకొకనికి గొరికి మరల మొదటికివచ్చి, అరకొరగా, ఎగాదిగా మొక్కుబడిక్షౌరం చేసేవారు—*వాడి దంతా కొండమంగలిపని.*
కొండి = రెక్కగాని, తోకగాని లేకుండునది. *అవక్క తోక కొండి;* మొండి—*మొండి తోక* [శ్రీ]
కొండికాసు = ప్రతి శనివారము భజన బృందము ఊరుచుట్టునపుడు గరుడ కంబంలోవేయు నాణెము [చి]
కొండిచీల = బండినొగ వెనుకభాగమున బిగించి, మోకును కట్టుటకుపయోగించు ఇనుపచీల [చి]
కొండిజడ = చిన్నపిల్లలకు ముందర జడవేసి, కొండివలె చుట్టినది [వ]
కొండిమిళ్లి = చిన్నమిళ్లి; ప్రక్కకు గొట్టము గల ముక్కుచెంబు [మ]
కొండిమొల = నాగలికి కఱ్ఱును పట్టియుంచు మొల [కరీ]
కొండెంగ = మూతి నల్లగానుండు కోతిజాతి విశేషము [కరీ]
కొండెకాసులు = కొన్ని పెద్ద విష్ణుదేవాలయములలో, ప్రత్యేకముగా వెలిగించియుండు ఒకదీపపు పెద్ద ప్రెమ్మెదలో, తేలు మొదలగు విషకీటకములు కుట్టకుండా చేయమని వేడుకొనుచు వేయు చిల్లరకాసులు, నాణెములు; కొండకాసులు [నె]
కొండెక్కు = ఆరిపోవు—*దీపము కొండెక్కినది* [కర్నూ; తె]
కొందల = తెల్లటి మంచినీటిచేప [రా]
కొందు = (మా) కుందు [చి]
కొక్కి = చొక్కాలు తగిలించు వంకరచీల; చిలుకు [అ, చి; నె]
కొక్కిరించుకొను = (1) ముడుగ దీసికొని కూర్చుండు
(2) వ్యాధిచే దుర్బలమై పోవు—*కొక్కిరించుకొని పోయినాడు* [నె; వ]
(3) వెక్కిరించు; మాటకుమాట రెట్టించు [గు]
కొక్కుబట్టు = కోడి గ్రుడ్లు బెట్టుటకు ముందు కోకో యనుచు ఇటునటు గుడ్లు బెట్టు స్థానమునకై వెదకికొనుట; కేరు [కరీ]

కొక్కువట్టింది = కోడిపెట్ట పొదుగుచునే మధ్య గుడ్లు పెట్టుచుండుట [మ]

కొక్కెరతెవులు = కోళ్ళకు వచ్చురోగము [నె]

కొటాయి = (1) అలంకరింపబడిన పెద్ద పెండ్లిపందిలి; పెండాలు [నె]

(2) కొట్టము [చి]

(3) సినిమా థియేటరు వంటిది—*ఆ కొటాయిలో ఏమిఆట ?* [చి]

కొటారము = పేర్చిన దొంతుల వరుస [కరీ]

కొటారు = (1) ఉప్పును పెద్ద కుప్పలుగా నిలువచేసి యుండుచోటు (కయ్యలలో) [నె]

(2) ధాన్యపుకొట్టు [గో; అ]

(3) ధాన్యపురాశి [చి]

(4) కొట్టకొన; చివర — *చిలుకకొటారు కొమ్మనఉంది* [తె; నె]

కొట్టము = ఓరపాక, వసారా [అ]

కొట్టి కొలారముచేయు = అనవసరమైన ఆర్భాటముచేయు [నె, గు]

కొట్టినపిండి = బాగా తెలిసియుండు విషయము, పరిజ్ఞానము — *వానికావని కొట్టినపిండి* [తె]

కొట్టిపెట్టు = ఖండించు [కరీ]

కొట్టిపోయు = మిక్కిలి ఎక్కువగా మాట్లాడు [తూ-గో]

కొట్టు = (1) గది; కొట్టెడి;—*కొట్లో పెట్టు*

(2) చెరసాల—*కొట్లో కొట్టినారు* [నె; కర్నూ]

(3) అంగడి—*కొట్టుకుపోయినారు* [కృ]

(4) వినాశము—*అవని చేసిన సీసు కొట్టు వచ్చు* [కరీ]

కొట్టెడి = గది; కొట్టు [తె]

కొట్నము = వడ్లు దంచుటకు కూలిగాఏర్పాటు చేసికొనిన బియ్యము; ఇన్నిశేర్లకిన్నిశేర్ల బియ్యము అను ఒప్పందము [అ]

కొట్ర = (1) ఉడికిన సంగటి పాకములో కలుపు నూక.

(2) ఉడుకు సంకటి [నె]

కొట్లాట = కొట్టుకొనుట, దెబ్బలాట [నె; తె; కర్నూ; అ]

కొడ = స్పర్శ [కరీ]

కొడమ = చేపలుపట్టు సాధనం; కొదమ [ఓ; నె]

కొడవటిపూజ్యము = పైరుకోయవలసిన అగత్యము లేకుండానే ఎండిపోవుట — *ఈ ఏడు కొడవటి పూజ్యమైనది* [నె]

కొడి = (1) పతాకము [నె; తె]

(2) బ్రహ్మోత్సవమునకు చేయు ధ్వజారోహణము.—*యీ దినం కొడి* [నె]

(3) నిలుకడలేని చిత్తము; పొల్లు [గో]

(4) శిఖరము [అ]

కొడిగట్టు = (1) తిరునాళ్ల ప్రారంభించుటకు ధ్వజారోహణము చేయు — *ఈ దినం కొడి గట్టినారు* [నె]

(2) ప్రయత్నం ఫలించు—*అవని కొడి గట్టినప్పుడు ఆ మాట* [చి]

కొడితి = పిడిగల చిన్న కట్టెదిమ్మ (దీనితో ఉలి మొదలైన వానిపై కొట్టుదురు) దిమ్మెన [అ-పె]

కొడివళ్లు = పిండి వంటలు

కొడిసె పొరక = దూలములపై వేయు దంతి; వావిలి పొరక [కరీ]

కొడుపు = (1) వరి వెన్నుకు బదులుగా పుట్టు ఒక తెల్లటి కాడ; ఇది ఒక తెగులు —*చేను కొడుపు ఈనింది* [నె]

(2) నిచ్చెనకు అడ్డముగా వేయు మెట్టు పుల్ల [అ]

(3) అప్పడములు మొదలగునవి ఒత్తుటకు ఉపయోగించు గుండ్రని కొయ్య [నె, వ; అ]

కొడుపుకొను = రాల్చుకొను—*కంకి కొడిపి గింజలు తిన్నాడు* (అ)

కొడుపులు = పశువులకు వాతలు వేయు ఇనుప కమ్ములు; కొఱుపులు; కొదుపులు [నె]
కొడె = గొడుగు [హోసూరు]
కొడెక్కింది = దేవాలయమున ఉత్సవము ప్రారంభమైనది; కొడి గట్టినారు [చి]
కొడెము = బండి పరముల చివర కొమ్ము— కొడెం మీద కూర్చో [నె-పొ]
కొఱతము = చేతులకు వేయు సంకెలలు [కరీ]
కొఱతాము = పెద్ద తాళపు చెవి [వి]
కొఱుజు = మట్టిలో నుండు సన్నటి పురుగు, ఇవి కుట్టును [నె-హె]
కొఱుపు = పశువులను వాతపెట్టు ఇనుప శలాక; కొడుపు; కొదుపు [కరీ]
కొత్తలెట్టుట = క్రొత్త పళ్లు దించి, ఇంట్లో వాడుటకు ముందు చేయు మంగళారంభము [మ]
కొత్తామాసా = (కొత్త అమావాస్య) ఉగాది [శ్రీ]
కొత్తాము = మెడ వెనుక భాగము; కొత్తెము; మెడ [వి]
కొత్తి = మడిగట్టు [వి]
కొత్తిని = (చూ) పుత్తెము [గో]
కొత్తి పోళ్ళు - అడవి ప్రాంతములలో కొత్తగా సాగుచేయు భూములు [కృ]
కొత్తెము = తల వెనుక భాగము, ముచ్చిన గుంట [శ్రీ]
కొదమ = (1) మిగిలిన, తక్కిన వారు— *కొదమ వారికి ఏదైనా ఇవ్వు*; కదమ
(2) మేకపిల్ల [నె, కర్నూ, తె; అ]
(3) లేత పిల్ల [చి]
(4) చేపలను పట్టుటకు వెదురు బద్దలతో కట్టిన సాధనము, కొడమ
కొదుకు = నత్తిగా పలుకు; కొతుకు [కరీ]
కొదుపులు = (చూ) కొఱుపులు [వ]
కొద్దుడ్డి = నాలుగు పైసలు (దమ్మిడీలు); డబ్బు [చి]
కొన చిలుకులు = చేపని పాడి పశువుల వల్ల లభించిన కొద్ది పాలు [నె పొ]
కొనవేయు = చిన్న మేకపిల్లకు గాని, గొఱ్ఱె పిల్లకు గాని, తల్లి రొమ్ము పట్టి పాలు కుడిపించు—*అదికొన వేస్తేనేగాని తాగ లేకున్నది* [నె; అ-పె]
కొనా మొదటికి = చివరనుంచి మొదటికి; ఏకాణానికి [నె]
(2) తెంపు లేని—*ఇండ్లు కొనా మొదటికి ఒకటిగానే ఉన్నవి* [గు; నె]
కొనుబడి = కొనుగోలు [శ్రీ]
కొనేరు = వాడిపోవు [వి]
కొన్నకాంత = భార్య [చి]
కొప్పరము = (చూ) కొప్పెర [అ]
కొప్పిరిగి = కంబళి లేక గోనె సంచితో వేసు కొను ముసుగు [అ]
కొప్పు = (1) స్త్రీలు వెంట్రుకలను మూ ఓడిగా వేసి, తలలో పాయచేసి దానిలో చెక్కిన ముడి; ఎడమ కొప్పు, పైకుల ముల వారు మాత్రమే వేయుదురు × మగ వారు వేయు వెంట్రుకల ముడిని పిడి గంట అందురు.
(2) ఇంటి కప్పులో వెన్నుగాడ భాగము —*ఇంటి నడికొప్పున* [నె; కర్నూ, గె, అ]
(3) గోనిసంచి రెండు కొసలను ఒక చోట చేర్చి వర్షములో తడవకుండ నెత్తి మీద వేసుకొను గూడ వంటిది; కొప్పెర; కొప్పరము [అ-పె]
(4) పర్వతశిఖరము [అ]
(5) తల [వి]
కొప్పు గొలుసులు = చెవినుండి వెనుక కొప్పుకు తగిలించు గొలుసు నగ [గు]
కొప్పులో కొఱవి = మహాదుష్టుడు [కరీ]

కొప్పెర = పెద్ద ఇత్తడి పాత్ర; కప్పెర [కరీ; మ]
(2) (చూ) కొప్పరము [అ-పె]
(3) గొంగడి ముసుగు [మ]

కొప్రము = నిండా; కొప్పరము [కరీ]

కొమ్మరిటి = పచ్చరిటి [వి]

కొమ్ము = (1) అల్లము మొదలగు వాటి ముక్క—అల్లపుకొమ్ము [నె; గో]
(2) చెరువుకట్టు మొదలగు వాని కొన అంచు
(3) శిఖరం [కరీ]
(4) వసనాభి (మందు నాభిని రాత్రి పూట కొమ్ము అంటారు) [గు]
(5) మాదిగెలు ఊరేగింపులలో ఊదునట్టి అర్ధ వలయాకారపు ఇత్తడి వాద్యము [తె. నె]

కొమ్ము గొడిసె = పశువులకు కొమ్ములో పుట్టు వ్రణము [నె-పొ]

కొమ్ముల గొఱ్ఱె = అరుదుగా కొమ్ములు మొలిచిన గొఱ్ఱె, అపూర్వవిషయం [నె-పొ]

కొయికాలు = (చూ) కొయ్యకాలు

కొయితా = ఒక రకమైన పొడుగాటి కామ గల వేట కొడవటి [అ]

కొయిలగోపి = పెడకట్టె మనిషి—వాడు వట్టి కొయిలగోపి [నె; కర్నూ]

కొయ్య = చెట్ల కొయ్యకు సంబంధించిన ప్రతి భాగము — *కొయ్య సామాను; కొయ్యల అంగడి* (Wood); కఱ [నె; కర్నూ; అ]

కొయ్యకాలు = (1) జాతరలలోను ఇతర ఉత్సవములలోను చేయు నృత్యములలో కాలికి గట్టుకొను చిన్న కొయ్య చట్టములు. వీటిపై నుండి ఆడుదురు; మరుకాలు [చి]
(2) చెరుకు తోటను మొదటసారి కొట్టి వేసిన తరువాత, నరికిన ముట్టెలనుండి (కుదుళ్ళయందు) మొలచిన గడలు [అ-పె]
(3) జొన్న, వరి మొదలగునవి కోసిన తర్వాత కయ్యలో నిలిచియున్న అడుగు మొక్కలు [తె; నె, అ]
(4) మడిలో పైరుకోతలు—*ఆ చెఱువు క్రింద కొయ్యా కాలు ముగిసినవి;* కోతలు [అ]

కొయ్యగూర = (చూ) పెరుగాకు [అ]

కొయ్యగెనుసు = ఒకరకమైన గడ్డ. కూరలకు ఉపయోగింతురు; చిలకడ దుంపవలె ఉడికించి తిందురు.

కొయ్యలగోపి = పెడకట్టె; కొయిలగోపి [నె]
(2) ప్రౌఢాంగన [చి]

కొయ్యలపూటీ = గొడ్లు ఈని బలహీనమైనప్పటి స్థితి

కొయ్యలు = (1) నోటిపండ్లు [అ]
(2) పశువులపండ్లు; దంతములు—*రెండు కొయ్యలదూడ* [నె-పొ]

కొయ్యాపండు = జామపండు; గొయ్యాపండు

కొరకంచు = కొరవి [శ్రీ]

కొరకచ్చు = సగము కాలిన కఱ్ఱబొగ్గు [కరీ]

కొరకరానికొయ్య = (1) లొంగుబాటుగాని వ్యక్తి; అలవిగానిది [నె; కర్నూ; తె]
(2) మూర్ఖుడు [అ]

కొరకూత = వయస్సువచ్చు సమయములో కోడిపుంజు వేయుకూత [నె]

కొరకొర = ఎడతెగని తగవులాట [కరీ]

కొరకొరలు = కొరకొరలాడుతూ చూచుట; క్రోధకషాయపుచూపు [గో; అ]
(2) అసంపూర్తిగా చేసినవి; అరకొరలు [నె]

కొరజా = ఒక ఇంటి వాకిటికి అవలయున్న చిన్నయిల్లు (Out house) [శ్రీ]

కొరట = బియ్యపు సన్ననూక ఉడుకబెట్టిన సంకటివంటిది; దీనిని దోసెపిండిలో మెదుపు (మెత్తదన మిచ్చుటకు చేయు పదార్థము) గా చేర్తురు [నె ఆత్మకూరు]
(2) అంగిలి; కాట [నె-పొ]
కొరదా = మిగతా [శ్రీ]
కొరమీను = ఒకజాతి మంచినీటిచేప [నె,అ]
కొరవ = మిగిలినది, తరువాయి — *ఆ కాస్త పనిలో కొరవబెట్టినాడు* [నె; కర్నూ. అ; తె]
కొరవ సరవ = మిగిలినది—*కొరవ సరవ ఇల్లా వేయి* [నె]
కొరవి కారము = మిరపపండ్లుచింతపండుతో చేర్చి తొక్కిపెట్టిన పచ్చడి; ఇది ఏడాది పొడుగున నిలువఉండు ఊరగాయ వంటిది [గు]
కొరసలు = ఉప్పు వ్యాపారము చేయువారు [చి]
కొరితి = బొండగొయ్య; బండకొయ్య [కరీ]
కొరిపె = ఒకరకపు చేప; కురిపె [కరీ]
కొరివి = ఒకతట్టు మండుచున్న కొయ్యపుల్ల —*కొరివితో తల గోకుకున్నట్లు* [కర్నూ; నె; తె; అ]
కొరుకు = కాలిన కట్టెముక్క [కరీ]
కొర్ట = ఒక పెద్దరకం చేప [చి]
కొర్ని = దుక్కిచేయకుండా వదలివేసిన పొలము; కొర్ను [శ్రీ]
కొర్ను = దున్ననిభూమి; కొర్ని; బీడుబెట్టిన పొలము;పడియ—*అది కొర్నుగా ఉన్నది* [శ్రీ]
కొఱ్ఱమట్ట = (చూ) మట్టగుడిశ [వ]
(2) కొఱమీను [మ; కరీ]
కొఱ్ఱాయి = (చూ) కొరకచ్చు [వ]
కొఱ్ఱు = (1) కాలుచున్నపుల్ల — *పొయిలో కొఱ్ఱు ఎగవేయు* [నె; వ]
(2) చెట్టుపైన ఎండి, సగము విరిగి మిగిలిన కట్టె; ఎండిన కొమ్మ [నె- మెట్ట; అ]
(3) ఇనుపకడ్డి [కర్నూ]
(4) ఇంద్రధనుస్సు — *తూర్పున కొఱ్ఱు వేసింది* [చి; వ]
(5) ముండ్లుతగులుకొని గుడ్డలో ఏర్పడిన చినుగు [చి; గో; నె]
(6) మరణశిక్ష—*కొఱ్ఱువేశారు* [చి]
కొలకుండ = ధాన్యమును కొలుచు మట్టిబాన; కొలబాన [నె-పొ]
కొలగారం = (1) ధాన్యము (అమ్ముటకు) కొలుచుట [ప. గో; నె]
(2) అమ్మిన ధాన్యమును కొలుచుటకు ఇచ్చుకూలి [శ్రీ]
కొలబాన = ధాన్యము కొలుచు కుండ. సాధారణంగా ఇది తూమెడుగా నుండును; కొలకుండ [నె-పొ]
కొలలు = చెంచువాళ్లు పిశాచముల కొలుచుట [నె-పొ]
కొలికి = (1) కొస వంగినది
(2)సురక్షితస్థానము—*అంతా ఒక కొలికికి వచ్చింది* [చి; నె; తె]
కొలికికివచ్చు = (1) సమాప్తికివచ్చు.
(2) సుముఖమగు [కరీ; చి; నె]
కొలికిడి = రెండుకొనలను కలుపుముడి [కరీ]
కొలికిలు = మున్నూరు కుంచములు, లేక అరగరిసె [శ్రీ]
కొలికెడు = $1\frac{1}{2}$ బండిధాన్యము [శ్రీ]
కొలిమి = సంభోగము (విశ్వబ్రాహ్మణులు [వి]
కొలుగుంట = అప్పుడే జన్మించినబిడ్డకు పురిటి దినములయందు నీరు పోయుట కుపయోగించు మురికినీటి గుంట; కొల్లి [నె]
కొలుపు = (1) గ్రామదేవతలకు గొల్లలుచేయు తిరునాళ్ల, ఇందు జంతుబలి ఉండదు.

(పోలేరమ్మ) జాతరలలో దున్నపోతును నరుకుదురు.
(2) పెద్దరచ్చ: వివాదము—*దానికిగా ఒక కొలుపుచేసినాడు* [నె]
(3) అమ్మవారిని కొలుచుట
(4) ఎడతెగని సంభాషణము, లేక ప్రసంగము—*గంటనుండి ఒకటే కొలుపు* [న]

కొలుపులు = మ్రొక్కుబడులు [కరీ]

కొలుము = వడ్రంగికొలిమి [చి]

కొలుసు = చాకళ్ల సంక్రాంతి తరువాత, తాము ఉతుకు కుటుంబాలవద్ద ఏటేటా దండుకొను మేర—*భోగిగొలుసు ఎత్తనిదే ఉద్యోగం (ఉతుకుట) లేదు* [నె]

కొల్ల = అధికము—*కొల్లగా ఉన్నది*; కొళ్ల [నె]

కొల్లడుచు = (1) పండిన ఒక పంటను వీలైనమటుకు కోసికొని, మిగతను వదలివేయు
(2) చేపలు బట్టుకొని చెరువును కొల్లడుస్తారు; కాయల కోసినదే తోటను కొల్లడుస్తారు—*కొల్లబోయినకొంప*, కొల్ల; కొల్లవిడిచు, ఈబుబోవు [చి]

కొల్లాపురము = (1) లేనిపోని జంజాటము.
(2) పెద్దరంగము [కరీ]

కొల్లికూర = తోటకూర [శ్రీ]

కొల్లు = పురిటినీళ్లు పడుటకు తవ్వినగుంట; కొలుగుంట [గు]

కొల్లుపోతు = (1) పెద్దజాతి దున్నపోతు (కొల్లుసీమనుండి వచ్చినది) [నె]
(2) ఎడ్డిమడ్డి మనిషి—*వాడొక కొల్లుపోతు* [నె]

కొవ్వొత్తులు = మైనపు వత్తులు: క్యాండిల్సు: మోంబొత్తులు

కొశాతు = బాగుగా, గుబురుగా ఎదుగు బిటిగడ్డి [నె]

కొస = (1) జడ చివర వేయుపేనిక [వి]
(2) పురు(రి) కొస [నె, గో తె]

కొసి = (1) ఏదైనా స్థలములోకాని, బాలాలలో కాని ఒకమూలకు హెచ్చుగాఉన్న స్థలము [గు]
(2) వాడి—*సూది కొసిగాఉన్నది* [అ]

కొసికంత = కొంచెము; కినికంత [మ]

కొసెట్టి = (1) ముక్కోపి [చె]
(2) కాస్త వెట్టిబోగల తనము—*ఆయన కొసెట్టి మనిషి* [నె]
(3) చపలచిత్తము [నె]

కొస్సెగా = పొడవుగా [మ]

కొళబె = లోపల బోలుగలకొయ్య [నే]

కొళాయి = నీళ్లువచ్చేనల్ల, Tap — *కొళాయిలో నీళ్లురాలేదు*; కుళాయి [నె; కర్నూ, తె; గో; గు]

కొళ్ల = అధికము; కొల్ల [నే]

కొళ్లు = (చూ) కుయిలు [అ]

## కో



కో = తీసుకో — *కోకిల తనకేమి ధనము కోకొమ్మెనెనా?* (కవికర్ణ రసాయనము)

కోకొల్లలు = బాగా సమృద్ధిగా ఉండు [తూ-గో]

కోగిరి = గుట్టముమీద పలుచుపలుపు [కరీ]

కోగిరీ భర్తీ = మోయదగినంత బరువు [కరీ]

కోచె = (1) పిరికితనము; పెట్టవాడు, కోస [అ-పె, నె]
(2) ముక్కుపొడుము నూరుకొనే మట్టిపాత్ర [గో]

కోచీలు = రెట్ట కడియములు [శ్రీ]

కోచెము = మంచి రుచిగల చిన్నచేప, పంజరి వంటి చిన్నచేప [శ్రీ]

కోటలో పాగా వేయు = కార్యము సాధించు [వి]

కోట విడిచినపొద్దు = ఓడిపోయి నిస్పృహాయుడగు ఆర్కాటు నవాబు, కోటను క్లైవుకు అప్పగించి, పగలు 11 గంటలకు బయటకుపోయిన సమయము; అనగా, పగలు పదకొండు గంటలు

ఇది మహమ్మదీయులకు అశుభ సమయము [చి]

కోటవిడుపుకాలము = దుర్ముహూర్తము (చూ) కోటవిడిచినప్రొద్దు [చి]

కోటాకు = (చూ) పోటాకు [గో]

కోటాకు = (1) లేతఆకు; కవటాకు.

(2) చెట్టుకొమ్మ చివరి ఆకు [గో]

కోటేరు వేసినట్లు = వంపుతిరిగి, అది మొదలు సూటిగానుండు ఆకారము. కోటేరువేసిన (కాడిపై తిప్పించి కట్టి పొలమునకు తీసికొనిపోవు నాగేలు)నాగిలి ఆకారములో నుండునది — వాడిముక్కు కోటేరు వేసినట్లున్నది [నె; కర్నూ; అ; తె]

కోట్రుము = కోటిరకము, కోడరికము

కోడంటికము = కోటరికము [కరీ]

కోడంత్రము = కోటిరకము. కోడరికము

కోడరికము - కోటిరకము; కోట్రము,కోడంత్రము

కోడాలు = కట్టెలనుచీల్చు గొడ్డలివంటి పరికరము [illegible]

కోడి = చెఱువు అలుగు; కలుజు—తూర్పు కోడిపల్లె, మరవ [అ]

కోడి నిదుర = (1) నిదురపోయినట్లుండు; అరకొరనిదుర [నె, అ; తె]

(2) పలుమారు నిద్రలో మేల్కొనుట [అ]

కోడిపెట్టలు = బండిఇరుసకు ఉద్దికి (అడ్డ) మధ్యనుండుకట్టెలు [శ్రీ]

కోడిపేను = చిక్కిపోయిన దూడలకు బట్టు పేలు; కోడిగోమారి [నె; ఖా]

కోడివేడి = చప్పునవచ్చు కోపము [వి]

కోడు = (1) బిళ్ళంకోడు అను బాలుర ఆటలో బిళ్ళను(ఒకవైపు కూచిచేసిన చిన్నకొయ్య తునక) కొట్టుట కుపయోగించు పొట్టికఱ్ఱ [నె]

(2) చేటలో ధాన్యం ఒకతీరుగా చెరుగుట [అ, వ; కరీ; తె]

(3) పొలాలలో అధికమైన వాననీరు నిల్చియుండే నిడుపైన పల్లము; ఇందు ఎప్పుడు నీరుంటుంది; వాదపొలము-పడివ; బాడవ [గో]

కోడుంబిళ్లలు = చేగోడీలు అను భక్ష్యములు [సే]

కోడుపోయింది = మొరవపోగింది — చెరువు కోడుపోయింది [చి]

కోడుబళ్లు = పెద్దవగు చక్కిలాలు (చేతితో చేయుదురు [అ]

కోడెకాలు = జవ్వనము; కోడెప్రాయము [కరీ]

కోడెలబేరము = మంచికోడెలను స్థానికముగా కొనుగోలుచేసి,దూరప్రాంతములకు; ముఖ్యముగా పడమట హుబ్బళ్లి, దార్వాడా ప్రాంతములకు తోలుకొనిపోయి, అచ్చటకు అమ్మివచ్చి మరుసటి ఏట పసూలు చేసికొను వ్యాపారము; ఒక్కొక్కజట్టుకు గుంపు అని అందురు. ఇది నెల్లూరులో ఎన్నదగిన వ్యాపారము [నె; అ, తె]

కోణము = మన్నుత్రవ్వుటకు ఉపయోగించు సాధనము [శ్రీ]

కోత = ఎడతెగనిబాధ, రాపిడి—నాకెప్పటికి నీతో కోతతప్పదు [కరీ]

కోతపరువు = పైరుపండి కోతకు సిద్ధమైన స్థితి—*అకయ్యా కోతపరువుకు వచ్చింది; ఆది కోతపరువు తప్పింది* [నె; అ; తె]

కోతబడు = మినహాపడు [కరీ]

కోతలు = (1) ప్రగల్భములు — *ఊరకే కోతలు కోసినాడు;* కోతలరాయడు [నె]
(2) అబద్దాలు [వి]

కోతికొమ్మంచి = పిల్లకాయలఆట; ఒకచెట్టు క్రింద గిరిలో ఒక చిన్నకఱ్ఱనుబెట్టి, ఒకడు కాపాడుచుండగా, పైకొమ్మలమీద ఉండువారు ఆ కఱ్ఱను లాగుకొనుటకు ప్రయత్నించుచుందురు. కావలావాడు సమీపించిన చెట్టుపైకి ఎక్కుదురు, క్రింద ఉన్నప్పుడు తాకితేనే దొంగ అగును. ఇట్లు తాకుడు పడినవాడు గిరిని రక్షించవలెను. [నె; తె; గో; అ]

కోతికొమ్మచ్చి = (చూ) కోతికొమ్మంచి [కర్నూ, అ; వ]

కోదండముపట్టించు = వీదిబడులలో శిక్షవిధాన, పైన ప్రేలాడగట్టి క్రింద ముళ్లు మొదలగునవి పెట్టునది [నె]

కోనంగి = గంగిరెద్దుల ఆటలో హాస్యగాడు [చి]

కోన = కొండమూలలో నీరు ప్రవహించు చోటు [అ]

కోనయ అనేటోళ్లులేరు = పల్కరించే దిక్కులేదు; ఆదుకొనేవారు లేరు [ఉ]

కోనారి = గొఱ్ఱెలను మేపుగొల్ల; కీలారి [వి; శ్రీ]

కోనేరు = దేవుని తెప్ప తిరునాళ్ళచేయుటకు త్రవ్వి, చుట్టు నాలుగుప్రక్కల మెట్లు గట్టిన చదరపు చెరువు, తెప్పాకుళం [నె, చి; కర్నూ, వ; అ]
(2) త్రాగుట కుపయోగించే మంచినీటి చెరువు; దొరువు [శ్రీ]
(3) రోలునకు చుట్టును ఉబ్బెత్తుగా చెక్కినప్పుడు ఏర్పడు చదరము — *కోనేరు తొలచవలెను* [అ]

కోపలు = (చూ) నుచ్చుపాతలు, నుచ్చు (మూత్రము, మన్ను) కలిపిన పేలికలు; మేకలు, గొఱ్ఱెల చన్నులకు పిల్లలు త్రాగకుండ వీటినిచుట్టి అంటింతురు [అ-పె]

కోపు = (1) అదను—*ముందర కోపుపైరు*
(2) బాగుగ ఎదుగుట — *మంచికోపుగా వచ్చినాడు* [నె]
(3) కోలాటంలో ఎదురు నడక [చి; వ; గో]
(4) కొడములకు చేపలెక్కుతీరు.
(5) మదము—*కోపెక్కింది* [చి]

కోపు = (1) రోడ్లు పోయుటకు కొలత ప్రకారము, మొరముత్రవ్విన గోతులు [వ]
(2) చెరువు త్రవ్వునప్పుడు, కాలువలుత్రవ్వినప్పుడు వచ్చేగుంటల లెక్కలు [వ; కరీ]
(3) ఒకకొన లావుగను, రెండవకొన కూచిగను ఉండునది—*బలపపుకోపు; తిరుమణికోపు* [అ; నె]
(4) పట్టినచేపలను ఒకదానికి గుదిగ్రుచ్చినది [గో]
(5) ఒకేపక్షమున సమర్థించుట—*వాడిని కోపువేసికొని వచ్చినాడు* [గో]
(6) పక్షబలగము [అ]
(7) వైపు—*ముందుకోపు* [నె]

కోపులువేయు = ఒకరిపేరు పెత్తనమును పరోక్షముగా విమర్శించు — *అయన కోపులు వేస్తున్నాడే* [నె-ఆత్మకూరు]

కోబలి = వంటకోయుటకుముందు పొలములో ఇచ్చుబలి [వి]

కోమటివెంకమ్మకొలువు = లాభములేని సేవ [వి]

కోయుటాకు = (చూ) పెరుగాకు [అ]

కోర = (1) బకెట్ [నై-బూదన్]

(2) చెంబు
(3) ముంత [అ]
కోరకొప్పు=ఓరగా నుండు అట్టవకొప్పు [అ]
కోరచెప్పులు =ముందు కోరగా వచ్చునట్లు చేసిన చెప్పులు [అ]
కోరజీవములు=కోరలుగల క్రూరమృగములు; కోరమెకములు [కరీ]
కోరడ=పెండె, కోరడి [ప]
కోరడి=కంచెవలె చుట్టూ వేయునది
కోరణాలు=పిల్లల జబ్బులు [కరీ]
కోరవాటము=(చూ) కోరాటము [చి]
కోరాటము=(1) ఒకజాతిగడ్డ దీనిని వండి తిందురు, నిమ్మటాయి గడ్డ జాతిది [నె-ఆత్మకూరు]
(2) ఇంటికప్పుకుగల ఏటవాలు తనము, వాటము—*దానికి కోరాటము తగ్గింది* [నె]
కోరిందదగ్గు=(చూ) కోరిశదగ్గు [నె-పొ]
కోరిశదగ్గు=కక్కాయిదగ్గు; పిల్లలకువచ్చు దగ్గు. దీనికి కోరిందనారతెచ్చి త్రాడు పేని మెడకుకట్టుదురు (గచ్చచెట్టు వంటిది) యీ దగ్గుకు కానుగ కాయలను దండగా కట్టి మెడలోవేయుదురు; కోరిందదగ్గు; కకాయ్యదగ్గు; కొక్కాయదగ్గు [నె-పొ]
కోరుగట్టు=కురుపు అంచుబెట్టు; మానుకొని వచ్చు—*గడ్డవుండు కోరుగట్టినది*[కరీ]
కోర్జాలు = కొత్తగుడ్డల మడుపులు —*కోర్జాలు తెచ్చియిచ్చినావా* [నె-పొ]
కోర్టాయి=ఒకవిధమైన అడవిచెట్టు; దీని దుంపను తిందురు; గనుసుగడ్డవంటిది [నె-పొ]
కోల=కొంచెము పొడవైన అండాకారము —*కోలమొగము; కోలనిమ్మ* [కరీ; నె]
కోలకొక్కిరాయి=రెండు మణికట్లనుకట్టి వేసి, మోకాళ్లమీదుగా దూర్చి, అడ్డముగా కఱ్ఱదోపి వెనుకకు త్రోయు శిక్షా విధానము, ఇది పీధిబడులపద్ధతి (కోల కఱ్ఱ) [నె]
కోలనిమ్మ=కోలగా (కొంచెము పొడవుగా) వుండి ఊరగాయకు మాత్రమే ఉపయోగపడు నిమ్మ; మాదినిమ్మ [నె]
కోలు=మోటబావులకు మొత్తల ఆనుకొని ఒకమూలన త్రవ్వు చిన్నబావి—*కోలు త్రవ్విన తరువాత ఆబాయిలో నీరు బాగుంది*; పిల్లబావి [నె-పొ]
కోలుకాడు=పనిచేయు కూలీలమీది పెద్ద; మేస్త్రీ; తలమనిషి [అ]
కోలుపేయు=చిగిరించు; పూతబట్టు [కరీ]
కోలె=కోయగా మిగిలినది; కొయ్యకాలు [చి]
కోవ=(1) కాలువపెద్దగట్టు —*కాలవ కోవదారి* [నె]
(2) వైపు
(3) పాలమిరాయి—*పాలకోవా*
కోవాలుబెట్టుట=పశువులకు కొడుపులవంటి వానితో కాల్చుట; వాతలుబెట్టుట [కరీ]
కోసు=(1) కూచిగా ఏర్పడినది [నె]
(2) పొగరు — *వాడికి కోసెక్కింది* [కర్నూ]
(3) లోపము ఎంచు — *పెళ్లికి తనను ముందుగా పిలవలేదని ఒకకోసు దీశాడు* [గో]
(4) వంకరగా వచ్చిన భూభాగము లేక బట్ట మొదలగునవి—*కోసెరగు* [వ,కరీ; గు; నె]
(5) కొద్దిపాటి మైల [కరీ]
కోసుగడ్డ = క్యాబేజ్; కోసుపువ్వు [నె; కర్నూ, అ]
కోసుపువ్వు=క్యాబేజ్; కోసుగడ్డ [గు]
కోస్సెగ=కోసుగా; కూచిగా [కర్నూ]
కోళ్లగమ్మతు = బండికి కట్టి ఉన్నప్పుడు ఎద్దుకాలు దునికి పడుట [మ]
కోళ్లనుగొట్టిన కోడి=అతిసమర్థుడు [నె]

కౌజు=(చూ) కముజు; కవుజు; కౌంచు [నె; కర్నూ; తె]

కౌటిగుల్ల = తెల్లపసరముల గిట్టలసందున లేచు గుల్లకురుపు; కవుటిగుల్ల [నె]

కౌటు=లేత నన; కవటు

కౌడ=వడుకు సాధనము [కరీ]

కౌడు = కపటము—*కౌడులేని ఎద్దు* [చి]

కౌదారి=కవుజుపిట్ట [చి]

కౌరు=(1) ఎఱ్ఱనిరంగు—*ఆకాశముకౌరుగా నున్నది* [అ]
(2) కొత్తగుడ్డలోనుండి విడిచిన ఎక్కు చాయ—*చీర కౌరు విడిచింది*; కవురు [నె]

కౌలు=పిల్లల ఆటయందు తీసికొను సెలవు; విరామము [అ.పె]

క్యాదరి=(చూ) కేదరివాటు [వ]

క్రియలేదు=(1) ప్రయోజనము లేదు—*నీవు చేసే పనివల్ల క్రియలేదు* [నె, తె]
(2) చేసిన ఉపకారము మరచుట—*క్రియలేనివాడు* [అ]

క్షేత్రము=ఉపవాసము [తె]



ఖందా=పెద్దకుటుంబాలలోను, జమీందారుల నగళ్లలోను చేయు ఉమ్మడి పెద్దవంట; కందా [వి]

ఖందారాజు=వంటచేయు క్షత్రియుడు [వి]

ఖందాయిల్లు=వంటిల్లు [వి]

ఖానా=తూము [వి]



ఖుల్లా=వివరాలు [అ]

ఖుష్కి=మెట్టభూమి [తె]



గంగ=బొత్తుగా — *వాడు నామాట గంగా వినడు* [గు]

గంగపెట్టె = విరదాళ్ల ఉంచి కొలుపులలో పూజించు, పుల్లలతో అల్లినపెట్టె (చూ) విరదాళ్లు [నె]

గంగ ఖరాయించు=కల్లుత్రాగు [వి]

గంగిరేగిచెట్టు=పెద్దకాయలు కాయు రేగి (రేగు) [శ్రీ]

గంగవెఱ్ఱులు=మితములేనంత తీవ్రత [గు]

గంగానమ్మ=గయ్యాళి; గంపగంగానమ్మ [గు]

గంగాళము=(చూ) అండ [నె]
గంగాళము=అండ అను దానికి పేరైనది [కరీ, వ; నె]
గంగ్గా=కొబ్బరి — ఆయన గంగ్గా ఒప్పు కొన్నా [నె]
గంజమ్మవారి=పెద్దబొబ్బలులేచు స్ఫోటకమువంటి వ్యాధి [చి, నె]
గంజలము=పంటతము [నే]
గంజాం ముసలమ్మ=మహామారి [ప]
గంజి కావడి = కుఱ్ఱవానిని ఇద్దరు చెరో రెక్కపట్టుకొని ఎత్తుకొనుట [ప-గో]
గంజు=(1) వెడల్పు మూతిగల ఇత్తడిగిన్నె [తె]
(2) పెద్దపాత్ర [వి]
(3) పశుమూత్రము [చి]
గంట=వరి, గడ్డి మొదలగునవి ప్రక్కన పెట్టు మొక్కల గుంపు — పైరు వాగా గంటగట్టింది [నె; వ]
(2) ఏమి లేకుండుట, రిక్తత — వాడి దగ్గర గంటవున్నది.
గంటకొట్టాడు=చనిపోయినాడు [చి]
గంట పగిలినది=చీలినది [అ]
గంటు=(1) కణుపు
(2) సాము
(3) ముల్లె [మ]
(4) గాయము—పెద్ద గంటు పడింది [వ]
(5) వ్యవహారం; జగడము — గంటు పడింది [చి]
(6) పేచి; వివాదము [అ]
(7) దెబ్బతగిలి ఏర్పడిన కుడుము లేక కాయ (బొప్పి) — దెబ్బతగిలి గంటు కట్టింది [అ]
(8) ముడి—తాడు గంటువేయుము [అ]
గంటునొప్పి=బుతుశూల [వి]
గంటుబడు=(1) పని సాఫీగా జరుగకుండా పాడైపోవు; ముడిబడు; ప్రతిబంధకము ఏర్పడు [మ]
(2) పెటబడు [మ]
గంటెలు=సజ్జలు, కంబులు
గంట్లు=(1) తునకలు
(2) ఇచ్చుగ విగించుటలు [మ]
గండి=మొండగాడు (తిట్టు) [శ్రీ]
గండాగొండి = ఆరితేరిన దిట — వాడు గండా గొండివాడు [చి; నె]
గండాపిండి = అనవసర ప్రయాస [గ]
గండి(డె) - కొండకనుమ — పెన్న గండి చేసిన చోటు [అ]
గండికట్టు=అత్తెసరు పెట్టు [కృ]
గండిపడు=నష్టమువచ్చు — బేపారములో గండి పడింది; తూటుపడు [వ]
గండుమీను=కొఱమీనువలె నుండు పెద్ద చేప [తూ-గో]
గండె=మంచినీటి పెద్దచేప [రా; నె]
గంతి=బొప్పి; కణితి; కంతి [కర్నూ]
గంతుకొట్టినాడు=చచ్చినాడు [గ మ]
గంతు పంగనము= (చూ) పులి బొంగరము [అ]
గంతెద్దు=సామాను మోసెడి ఎద్దు; గంతఎద్దు [నె, తె; అ]
గందపుపట్టె=ద్వారబంధముపైన వేసెడు అడ్డకొయ్య, లింటల్‌వంటిది; గందవాటి [నె; అ]
గందవడి=సుగంధ ద్రవ్యములపొడి, పెండ్లి మొదలగు శుభకార్యములలో చల్లుకొనునది; గందపుపొడి [నె; కర్నూ; అ]
గందవాటి=(చూ) గందపు పట్టె [తె]
గందిక=సందడి; కోలాహలము [వి; శ్రీ]
గందోడి=(చూ) గందవడి [అ]
గంతోళిగాడు=(చూ) కేతిగాడు; కేదరిగాడు [రా]
గంపకొల=గంపెడు [కరీ]

గంపగుత్తా=లాభనష్టములతో సంబంధము లేకుండా ఇచ్చుటకు నిర్ణయించుకొనిన మొత్తము, లేక పరిమాణము, కంట్రాక్టు మొత్తము [కరీ]

గంపగంగమ్మ=(1) తట్టలోఉంచి, తలపైన బెట్టుకొని ఊరూర ఊరేగించుచు దేవత. ఈమె పేర భిక్షమెత్తుకొందురు.

(2) ఊరకే తిరుగుచుండు స్త్రీ—*ఊరకే గంపగంగమ్మమాదిరి తిరుగుతుంది* [నె; అ; తె]

గంపగంగానమ్మ = గయ్యాళి, గంపలమ్మ [గు]

గంపజాతర = శ్రావణభాద్రపద మాసాలలో గంపలో వంటసామాను తీసుకొని చుట్టు ప్రక్కల ఉన్న గుట్టలకు వెళ్లి, అక్కడే గొఱ్ఱె, కోడికోసి వండుకొని తిని, ఉయ్యాల లూగవచ్చు పండుగ; దీనినే నాగరికులు వనభోజనాలు అందురు [మ]

గంపనబెట్టు=(మా) బుట్టలోబెట్టు [అ]

గంపనుడి=వరికి తగులు ఒకరకపుతెగులు [కరీ]

గంపపంపుట = గర్భిణీస్త్రీకి మొదటి సారి (సారె)గా ఫలహారములు పంపుట(తక్కువ జాతులు వాడుదురు), సారి (సారె) పంపుట [మ]

గంపలమ్మ=(1) గయ్యాళి, గంగానమ్మ; గంపగంగానమ్మ [గు]

(2) దద్దులుగాలేచు ఒక విధమైన మసూచి వ్యాధి [నె]

గంపరము=గంభీరము [కరీ]

గక్కడ=అక్కడ [వ]

గగ్గ=చెవిదగ్గరలేచు కురుపు [శ్రీ]

గచ్చు=(1) అబద్ధము [చి]

(2) నీళ్లు నిలువజేయుటకు కట్టినతొట్టి [కర్నూ]

(3) గారవేసిన నేల [అ; వ; నె]

గజనిమ్మ=కడపలో చీని అను మేలుజాతి తియ్య నిమ్మ. వట్రువగా, తోలు సన్నగా నున్నగా నుండుటచే మన కవులు స్త్రీ స్తనములను గజనిమ్మతో పోల్చిరి. తమిళ నాట దీనిని సాత్కుడి అని, సర్కారు లలో బత్తాయి అని పిలుతురు [నె]

(2) పెద్ద పులుసునిమ్మ; దూదినిమ్మ ఇవి వెలగ కాయలంత పెద్దవి [అ]

(3) పెద్ద నిమ్మకాయ; కర్నెకాయ [రా; వ]

(4) పొడమైన నిమ్మ, కోలనిమ్మ [చి]

(5) పొడవుగా ఉండి పుల్లగా చేదుగా ఉండు నిమ్మ [తూ-గో]

గజాలు=దవడకీళ్లు

గజిబిజి=(1) చిక్కుబిక్కురగా చిక్కుబడి నది.

(2) సంకులము [నె, కర్నూ. తె; అ]

గజ్జికట్టు=నాట్యము నేర్చుకొనుటను ప్రారంభించు—*ఆ పిల్లకు గజ్జికట్టినారు*; గజ్జెకట్టు; కాసెగట్టు [నె]

గజ్జికాయ= (మా) కజ్జికాయ [గో]

గజ్జిగాడు=వదలక వెంట తగులువాడు [మ]

గజ్జున=భయముచే వణకునప్పటి ధ్వన్యను కరణము—*వాడు గజ్జున వణకిపోయి నాడు* [ఎ]

గజ్జుమను=భయపడు [కరీ]

గజ్జెలగుఱ్ఱం=తెగతిరిగెడు భోగంసాని [చి]

(2) ఎవరిని లెక్కచేయక మాట్లాడు స్త్రీ [కరీ]

(3) సందడిచేయు వ్యక్తి, గలగల మాట్లాడు వ్యక్తి [గు]

గజ్జెలపట్టెడ = స్త్రీలు మెడకు గుత్తముగా దరించు నగ; దీనికి చివరభాగములలో చిన్న మువ్వలుండును [సర్కా; నె]

గటక =జొన్నఅన్నము [వి; కరీ]

గటు=అటు; అతట్టు; అవైపు [వ]

గట్టాలు=బెల్లపు పాకముతో చేసిన తినుబండారము—*పప్పులగట్టా; బుడ్డలగట్టా; ఉండలు* [కర్నూ]

గట్టిపిండి = పైపిండి [మ; కరీ]
గట్టివెట్టు = శరీరమునకు నలుగుపెట్టు [మ]
గట్టు = (1) చిన్నతిప్ప—నల్లరాళ్లగట్టు [చి; తె]
(2) చేనిగనిమ; కట్ట [సర్కా]
గట్టుపట్టు = పాడయిపోవు [అ]
గట్రు = మొదలైన—గింజ గట్రు [శ్రీ; నె]
గట్ల = అట్ల; అటుల; అలా [వ]
గడ = (1) వెదురుబొంగు, పొడవైన సన్నటి కఱ్ఱ
(2) పొడవుకఱ్ఱ; చెరకుగడ [అ; నె, వ]
(3) పెద్ద నిడుపాటి గుంజు దూలము—దొమ్మరిగడ (ఎకి - ఆడునది) [అ; నె]
గడంచు = (చూ) గడమంచ [తె]
గడగంచె = (చూ) గడమంచ [కర్నూ]
గడగట్టు = బండాకట్టు [గో]
గడచిబ్రతుకు = జీవితాంతమువరకు ఎగుడు దిగుడు లేకుండా జీవించు—గడచి బ్రతికిన దెవరు?
—గడచి బ్రతికినాక గండడు మిండడాయె [నె; కర్నూ]
(2) ఇతరుల సహాయములేకనే బ్రదికి పొగరుబడు—గడచి బ్రతికిన మాటలు [అ]
గడప = (1) వాచు — వాకిలి తగిలి తల గడపకట్టినది [అ]
(2) ద్వారబంధమునకు క్రిందవుండేబురద గమిలి; కొయ్యపట్టి; కడప [గో; నె]
(3) బండిఇరుసు చివరన వేయు చీల; కడచీల; చాయమేకు [గు]
గడబద్దకం = కష్టము—చాల గడబద్దకంగా ఉన్నది; గళబద్దకం, [నె; తె]
గడమంచ = (1) బరువుమూటలు పెట్టుకొనుటకు చేసిన గట్టిపొట్టి బలంపీట, చట్టము [నె; అ; వి]
(2) చిన్నమంచము [వ]
(3) చెక్కలువేసి ఎత్తుగా చేసిన బెంచి వంటి చట్రము [గు]
గడవంచి = గడమంచి; గెడంచు
గడసాని = ఈడెసాని [వి]
గడాము = చిన్నగునపము (త్రవ్వునది) [సే]
గడాన త్వరగా [అ]
గడారం కాయలు = పుల్లదబ్బ (నిమ్మ) కాయలు [చి
గడార = గడ్డపార; పలుగు [అ]
గడి (1) పశువులకాళ్ళకు కట్టు పలుపు—ఆవులకు గడివేసినా [నె]
(2) తలుపు బిగించు అడ్డకోల, గడియ [నె, తె; అ]
(3) ముడి. (ఎదురుగళ్లు) మారుగళ్లు వేసాడు అంటే, వ్యవహారము తేల నీకుండా తికమకలు పెడతాడు అని భావము [గో]
గడి కుడుకలు = వివాహాదులలో ఉపయోగించు ఐరేని కుండలుకాక మిగిలిన కుండలు వీనికి సున్నమురాసి, పైన గుడ్డకప్పెదరు. పెండ్లితరువాత తుమ్మలు కాకముందే దీనిలో బియ్యము పోయవలెను [కరీ]
గడిగ ఒకపాటి మట్టికుండ — గడిగతో నీళ్లుతెచ్చినా [నె; తె; అ]
గడిమి = కడప [గో]
గడియలుపడు = మూసికొనిపోవు—చెవులు గడియలు పడినవి; గడెలు [వ]
గడుగ్గాయ = ఘటికుడు; గడుసుకాయ [కరీ]
గడుగు = చిన్నపాత్ర [కరీ]
గడె = గడ
గడెమంచం = బరువులు మెత్తలు దప్పట్లు పెట్టే మంచం; గడమంచ; గడెవంచ [మ; వ]

గడెమాను = ప్రధానద్వారానికి లోపై పున అడ్డంగా వేయు రోకలివంటికొయ్యగడియ [అ; కర్నూ; మ]

గడెముకొట్టు = మెట్టపొలమును నాగేళ్ళతో దున్నుట × గొఱ్ఱుకొట్టు = గొఱ్ఱుతో దున్ను [నె మెట్ట, కర్నూ]

గడెముట్లు = వ్యవసాయ పరికరములు; సేద్యపుపనిముట్లు [తె]

గడెలువడు = వినబడకపోవు — చెవుల గడెలు వడినవి; గళ్ల [మ]

గడ్డ = (1) కందమూలము; దుంప — చేమ గడ్డ [నె; రాయ; తె]
(2) నేలపెళ్ళ, గట్టు — గడ్డఉంచి మట్టి వదుకు [నె; అ, తె]
(3) ప్రాంతము — ఈ గడ్డన అంతటి వాడు లేడు [నె, కర్నూ]
(4) గట్టు, ఒడ్డు [అ]
(5) కురుపు—నెత్తురుగడ్డ [అ; నె]
(6) వాగు; చిన్నఏరు [గ; శ్రీ]

గడ్డగుడ్డ = అన్నవస్త్రములు [కరీ]

గడ్డనఉండు = (1) మంచి మేలుస్థితిలోనుండు
(2) అంటకుండాఉండు [కరీ]

గడ్డపార = పలుగు, గునపము [నె, కర్నూ, తె; అ; శ్రీ; గు]

గడ్డపారఈత = ఈత రాకుండుటచే, నీట గడ్డపారవలె మునిగిపోవుట—నావు గడ్డ పార ఈతవచ్చును [వ, నె]

గడ్డబలిసినది = బాగా బలపడిపోయినది [కరీ]

గడ్డలలో కలుపుట = వెలిగడదున్ని (నీరు బెట్టక దున్ని) ఆగడ్డలలోనే విత్తనములు చల్లుట; ఇవి రాచినుకుకు, పోచినుకుకు తడిసి పైరగును; వెలిగడచల్లుట [నె]

గడ్డాలబాబు = మౌని; సన్యాసి [కరీ]

గడ్డికట్టులు = ఎండుగడ్డి × గడ్డిపరకలు = పచ్చిగడ్డి [శ్రీ]

గడ్డిగాదము = గడ్డి మొదలగునవి; ఇది ఆకు అలమువంటి జంటపదము—గడ్డిగాదము వేయి [నె, కర్నూ; తె; అ]

గడ్డిచుట్టు = నిప్పుచేయుటకై, ముందుగా అంటించుటకు చుట్టగాచుట్టిన గడ్డి [కృ]

గడ్డినూనె = కిరోసిన్ ఆయిల్; మంటినూనె [కర్నూ]

గడ్డిపరకలు = గడ్డికాడలు; గడ్డిపోచలు (పచ్చిదైనను ఎండుదైనను [తె; నె]

గడ్డిపరకలు = పచ్చిగడ్డి × గడ్డికట్టులు = ఎండుగడ్డి [శ్రీ]

గడ్డిబెండు = గడ్డికట్ట [శ్రీ]

గడ్డిబొద్దు = పెద్దగడ్డిమోపు [వ; నె]

గడ్డు = గట్టు, ఒడ్డు [అ; బ]

గణాకు = చుక్కాకు, ఒక ఆకుకూర [గు]

గణాచారి = (1) దయ్యము; లేక క్షుద్రదేవతలు పూనినవాడు, (ఆవేశించినవాడు)— వాడికి గణాచారి పూనింది [నె, కర్నూ]
(2) దయ్యమును వెడలగొట్టెడువాడు [చి]
(3) శ్రేష్ఠుడు
(4) నాయకుడు [వ]

గ–ుపు = చెరుకు వరి జొన్న వెదురు మొదలగువాటి కాడలో (కాండము) ఏర్పడిన ముడి; గుండ్రటిబోదె, గెణుపు, పర్వము [నె; అ]

గణుపుగాని తోలుగాడు = తొప్పె—[నె-ఆత్మకూరు]

గణుసుగడ్డ = చిలగడదుంప; గెణుసుగడ్డ; తెలగడదుంప; రత్నపురిగడ్డ; మొరుంగడ్డ; గనుసుగడ్డ; మొగరముగడ్డ; కందగడ్డ [నె, అ; కర్నూ; తె]

గతుక్కుమను = చచ్చు; గుటుక్కుమను [వ]

గత్తర = (1) కలరావంటి అంటువ్యాధి; ఉపద్రవము [అ, వ; మ; నె-మెట్ట; వి]
(2) గలబా—ఇక్కడ గత్తరగాఉన్నది [నె]

(3) తిరికిలేని సమయము — *ఈ గత్తర లలోకాదు మరల రా* [నె-పొ]
(4) దొంగతనము జరుగుట [గో]
గదగలమ్మ=గపదలు వాచే సోకుడువ్యాధి; ఆటలమ్మ, పిటలమ్మవలె [కర్నూ]
గది=అది—*అద్గది* [వ]
గది = (చూ) అంకణము [అ]
గది=పొడవు—*గదిచాలు ఎద్దు* [నె]
గదికురుచ = నడుము తక్కువ, పొడవు తక్కువ—*అది గదికురుచ పసరము* [నె]
గదుము=(1) దిద్దు — *గదుములు కట్టింది* [చి]
(2) నెట్టు, ఒత్తు [నె]
గదుముకొను=క్రమేణా ఆక్రమించుకొను —*ఆయన ఆ డొంకనంతా గదుముకొన్నాడు* [నె-ఆత్మకూరు]
గదురుపిల్ల= పదేండ్లలోపు బాలిక [కర్నూ]
గదువ=గవద [వ]
గద్దకూర్చుండు = కెంకాయ, చెట్టుమీదనే నీరులేకుండ పోవు; గువ్వకూర్చుండు; గూబదాకు [నె-కలువాయి]
గద్దచూపు=(1) గురితప్పని చూపు [కరీ]
(2)పైనుండి విశాలప్రదేశమును చూచుట; Bird's eye-view [నె]
గద్దరి=చాలా తగని మనిషి [గు]
గద్దరించు = (1) పైత్యపుదద్దులు ఏర్పడి దేహము ఉబ్బు; గాద ఏర్పడు [నె; అ-పె]
(2) కేకలిడు; గదిమిపెట్టు [కరీ]
గద్దవ=గవద [అ-పె]
గని=వంశము—*ఇది మంచి గనిగల గోవు, పాలు బాగాఇచ్చును;* ఆణెమ [అ]
గనిమ=పొలమును కయ్యలుగ (మళ్లుగా) ఏర్పరచుటకు వేసినకట్ట; గట్టు; గనిమి; గనిమె; గనుము [నె; కర్నూ; తె; అ]
గనిమి=(చూ) గనిమ [నె]
గనిమె = (చూ) గనిమ [చె]
గనుము=(చూ) గనిమి; గట్టు [కృ]
గనుసుగడ్డ=చిల్లగడదుంప; తెలగడదుంప [చె]
గన్న=అగత్యము, అవసరము — *గన్న వచ్చి పడిందని నేను వస్తానా ?* [కరీ]
గన్నట్లు=(చూ) ఎదురుకుతికలు [మ]
గపద=చెంప [చె]
గప్‌చిప్‌గా=(1) నిశ్శబ్దముగా [నె; అ; తె]
(2) ఎవరికిని తెలియకుండా [గో]
గప్‌చిప్‌సాంబారుబుడ్డి = ఊరకుండుము అనుట [కర్నూ]
గబాన=త్వరగా [నె]
గబాలున=(చూ) గబాన.
గబాల్న=త్వరగా; గబాన [నె]
గబుక్కుని=త్వరగా; గబాన [కృ]
గబేలున=(1) తటాలున
(2) భయముతో అదరునట్లు — *గుండె గబేలుమన్నది;* గబాలున [నె; అ; తె]
గబ్బంతాడు = మోట (కపిల)కు లోపల నుండు లావు ఇరుపురితాడు [నె-పొ]
గబ్బగీము = కారుచీకటి — *గబ్బగీము రేయిలో పోయినా* [నె]
గబ్బి = (1) తొణకకుండుట; కలతజెందకుండుట—*గబ్బిగా ఉండినాడు;*
(2) ఉబ్బినది [చి]
గబ్బిగా =ఏమీ బయటపడకుండా, గంభీరముగా—*ఆయన గబ్బిగా ఉండినాడు*[నె]
గబ్బు=మురికి; చెడ్డ; మొరటు — *వాడు గబ్బోడు* [అ; బ]
గబ్బుకొమ్మ=వజకొమ్మ [అ]
గబ్బునాయాలు = పరిహాసముగా అనెడి మాట [అ; నె]
గబ్బునూనె=కిరసనాయిలు, సీమనూనె[అ]

గబ్బుగడుగు=అవమానించు; Washing the dirty Linen అనుటవంటిది

గబ్బులేపు=చెరచు (మానభంగముచేయు) —వాడామెను గబ్బులేపినాడు [అ]
(2) పరువుదీయు [అ; నె]
(3) అల్లరిపెట్టు [తె]

గమతము=పశువులమేత [నె]

గమనము — జ్ఞాపకము—ఆ సంగతి గమనంలేదు [నె; అ]

గమనించు=(1) శ్రద్ధగా గుర్తించు;
(2) కనిపెట్టియుండు—వాడిని గమనిస్తూ ఉండు [నె; అ]

గమళ్ల=కల్లుగీయువారు; గాండ్ల; గముడు [నె; అ]

గమిడి=ఊరిగవను—గమిడి దాటకముందే (గమిట్లోనే) కనుపించినాడు [నె]

గమిడిగేదె=జంగిడిగేదె [తూ-గో]

గముడు=గమళ్ల [నె-ఆత్మకూరు]

గమ్మన=ఊరక; నిశ్శబ్దముగ — గమ్మన ఉండు [రా; నె]
(2) గంభీరంగా [కరీ]

గయగొట్టు=చచ్చు; మరణించు — వాడు గయగొట్టెండు [వ]

గయి=(1) గుంట; గుంత; గవి, [నె; మ; [తె]
(2) పెద్దకఱ్ఱ; వెదురుబొంగు [వ]
(3) లక్ష్యము; మాన్యపరచు; దీనిని వ్యతిరేకార్థముననే వాడుదురు—నామాట వాడికి గయిలేదు [గో]

గరండాలు=(1) వంతెన,(Girders) ఇనుప దూలములు (గర్డర్సు) వేసికట్టిన రైలు వంతెన [కర్నూ, నె]
(2) ఇనుపదూలాలు [అ]

గరగు=(1) రెండుకొండల నడుమ ఏర్పడిన ఇరుకు కనుమ, నరవ [నె-ఉదయగిరి]
(2) ఎఱ్ఱనిమట్టి — గరగునేల; గరుగు [అ-పె]

గరాకు=వరిపైరు మితిమీరి పెరిగిన కొస ఆకు, గరియాకు [నె-పొ]

గరాటు — పొన్నలు (ఫన్నెల్) కుప్పెన; వాళిగి

గరిగెబుడ్డి = చందనపుబుడ్డి, పెండ్లి తరువాత దీనిలో పసుపు పోయుదురు [మ]

గరియాకు=(చూ) గరాకు [నె-పొ]

గరిశ=(చూ) గరిసె [చి]

గరిసె=(1) 3 పుట్లు పరిమాణము [నె]
(2) ఆరూర్లు (600) కుంచములకొలత [శ్రీ; గో]
(3) ధాన్యం నిలువచేయు పెద్ద మట్టిబాన [నె-ఆత్మకూరు; ప; అ]
(4) ఉప్పుకొలతలో పుట్టి [నె]
(5) ధాన్యాదులు నిలువచేయుటకు ఉపయోగించు గది లేదా, తీగలతో అల్లిన గుమ్ము; గాదె [వ]
(6) ధాన్యముపోయు చిన్నగుడిసె [చి]
(7) ధాన్యము నిల్వయుంచు గాదెవంటిది; ఇది అడుగులేనిది [అ]
(8) జొన్నకంకులుకోసి, తాటా[illegible]లికముగ పోసిపెట్టిన గాదెవంటిది— జొన్న గరిసె; కరిశ [గో]

గరిసెలిల్లు = ధాన్యాదులు నిలువచేయుటకు ప్రత్యేకించిన ఇల్లు; వడ్లకొట్టు [మ]

గరుగు=తెల్లని పొడిరాయి ఉండునేల [తె]

గరేకుండ=ఇత్తడి, లేక రాగికుండ [శ్రీ]

గఱివోవు=నానబోసిన వడ్లు మొలకరాక అట్లే నిలిచిపోవు [కరీ]

గఱువునేల - ఇసుకభూమి — గఱువు మాగాణి; ఇసుకకరనేల [గు]

గఱ్ఱ=గర్వము; పొగరు [శ్రీ; కరీ]

గలగలలాడు=పొట్లాడు [కృ; గుం]

గలబరించు=(1) వక్కలముక్కలా నమలి, నీళ్లుబోసికొని మ్రింగు; గులకరించి మ్రింగు [నె]
(2) కలగలుపుచేయు; మురికిచేయు — *నీళ్లు గలబరించవద్దు* [కర్నూ]
(3) నోటిలో నీళ్లుపోసికొని గొంతువరకు పుక్కిలించు
(4) కుండలో నీరువేసి త్రిప్పి పారవేయు; గలవరించ [అ పె]
(5) బట్టను నీటిలో ఆడించు [తె]
గలస=గులక ఇసుక కలిసిన ఒదులునేల —*అది గలసపొలము* [నె]
గలాటా=(1) గోల; అల్లరులు — *హిందు ముస్లిం గలాటాలలో* [తూ-గో; నె]
(2) అంటువ్యాధి విస్తరించుట [అ; తూ. [గో]
గలీబు=పరుపు ముసుగు గుడ్డ; పరుపు వర; గౌశన; గలేబు [నె;తె;అ,గు; తూ-గో; వి]
గలుమ=ద్వారము [కరీ]
గలువరించు=నీళ్లుపోసి దేవు [కరీ]
గలుసు=గులకరాతి భూమి; గలస [నె]
గలేకుండ=బిందె; బింది [గ]
గలేబ=(చూ) గలీబు [మ]
గల్ల=(1) ధాన్యములో గింజపట్టని తరక, గడ్డి వలిగిన దుగ్గు కలిసిన పొట్టు—*గల్ల పొట్టు* [నె]
(2) పశువుల చర్మముల ఊరవేయుట కుపయోగించు తొట్టి [నె]
(3) ధాన్యము; గల్లా [తె]
(4) డబ్బులువేయు పెట్టె — *గల్లాపెట్టె* [గో; నె]
గల్లా=ధాన్యము — *పుట్టెడు గల్లా నిలువ ఉన్నది* [వ]
గల్లాపెట్టె=అంగడిలో బేరపు డబ్బు పెట్టు కొను చిన్న అరలపెట్టె; గల్ల [నె; కర్నూ; తె; అ]
గల్లు=(1) తూకు (ఉరి) దీయు మాను; ఉరి కంబము—*వానిని గల్లుకు వేసినారు* [నె-దక్షిణము, కర్నూ; తె]
(2) మరణదండన [అ]
గల్లోడు=చొంకతిరుగుడు [కరీ]
గవక్క=(చూ) పీటవక్క [అ]
గవద=చెంపక్రింది భాగము—*గవద వాచింది* గవుద; గౌద; గద్దవ [నె; కర్నూ; అ]
గవదలమ్మ=(చూ) గదగలమ్మ [నె; తె; అ]
గవాక్షి = మట్టిమిద్దెలలో గోడలో ఎత్తున బెట్టిన చిన్నరంధ్రము; ఎత్తుకిటికీ; గవాసిలి [కర్నూ; అ]
గవాటా=(1) అల్లరి; గలాటా
(2) అంటువ్యాధి విశేషంగా ప్రబలుట [అ; బ]
గవాసిలి = మిద్దెఇండ్లలోని గవాక్షము; గవాక్షి [అ; బ]
గవి=గుహ [అ]
గవి=(చూ) గయి [అ]
గవిని = కోట ముఖద్వారము, ఊరి వీధి చివర; గమిడి [నె; మ]
గవిసెన=(చూ) గలీబు; దిండుముసుగు; గవుసెన [అ]
గవురువాసన=పాలుపొంగి పొయ్యిలో పడి నప్పుడు కొట్టు వాసన [శ్రీ]
గవుసెన=దిండుముసుగు, గవిసెన [మ]
గస=(1) దగ్గురాక, ఊపిరిఆడక గొంతులో పుట్టు బాధ [నె; తె]
(2) పరుగెత్తుటలో కలిగిన ఆయాసము [అ]
గసాలు=గసగసాలు [నె, శ్రీ]
గసి= (1) వెన్నకాయగా క్రింద ఏర్పడిన మాడు [నె; కర్నూ; తె]
(2) చమురు అడుగున తేలు మడ్డి [అ; సర్కా]

(3) గానుగు ఆడినతర్వాత మిగిలిన మడ్డి; నూనె గసి [వ]

గసిక = తడిసిన నేలను త్రవ్వుటకు కొన కూచిగా చేసిన గట్టికఱ్ఱ; ఎక్కువగా దీనిని యానాదులు కలుగులు త్రవ్వుటకు ఉపయోగింతురు [నె]

గసిక = కుచ్చికలు [అ]

గసికిపోవు = తెలియకుండా క్షీణించు; తగ్గిపోవు—*వాడి డబ్బాంతా ఎట్లనో గసికిపోయింది*; గసిగిపోవు [నె]

గసిగిపోవు = (చూ) గసికిపోవు [నె]

గసిపిండి = అప్పుడప్పుడే విసిరిన మెత్తని తెలకపిండి [కరీ]

గసిపోసికొను = ఆయాసపడు [కర్నూ]

గసుకు = గెంటు; కదిలియాడు — *పీట గసుకుతున్నది* [అ]

గళబద్ధం = కష్టము, గడబద్దకం [తె]

గళబద్ధకం = కష్టము; గడబద్దకము [కర్నూ]

గళబద్ధము = (1) ఆపత్తు, గడబద్దం
(2) గొంతుపట్టుకొనుట
(3) ప్రాణముమీదికి వచ్చుపని [అ]

గళ్ల = చర్మము నానవేయుపాత్ర; గల్ల [నె-పా]

గళ్లచీర = (గడులచీర) మళ్ళచీర [మ; నె]

# గా



గాండీవము అడ్డుపెట్టు = ఒక వ్యక్తిని అడ్డుపెట్టుటకు సామర్థ్యమును చూపు—*అందుకు గాండీవము అడ్డుపెట్టినాను* [అ-పె]

గాండీవానికి వచ్చు = కష్టసాధ్యమగు — *అపని గాండీవానికి వచ్చింది* [నె]

గాండారి = నోరుగల్ల స్త్రీ; బాగా జగడమాడ గలది; గాంధారి [చి]

గాకున్నది = సులభముగా నున్నది [నె]

గాగర = పావడ [శ్రీ]

గాజ = గింజలుపోసిపెట్టుకొను పెద్దకొట్టు; గాజె; [కర్నూ; కరీ; అ]

గాజెలు = గాదెలు [అ]

గాటాలు = అనుభవాలు; దెబ్బలు — *మంచి గాటాలు తిన్నవాడు*; ఘాటీలు [నె]

గాటిబిగువు = స్థానబలము — *గాటిబిగువు చూచుకొని కోడె బుసకొట్టుతున్నది* [నె]

గాటిమేపు = పశువులకు గడ్డిని గాటిలోవేసి మేపబెట్టునది. (పొలములలో తిరిగి మేయకుండా) [నె]

గాటు = (1) విగ్రహముల పోతకు సిద్ధము చేసిన అచ్చు [గో]
(2) కాటు [అ]
(3) బెబ్బగుర్తు; గాయము; కాయ—*కత్తిగాటు* [నె]

గాడ = అడ; అక్కడ [వ]

గాడి = (1) పశువులకు గడ్డివేయుతొట్టి—*గాటిలో నివుక్క తానుతినదు, పశువును తిననీయదు*
(2) పొలములో పశువులకు నీటికిగా కట్టిన పొడవుతొట్టి—*పశులను నీటికి గాటికి తోలు* [నె]
(3) పొడవుగా లోతుగా త్రవ్విన నేలగుంట—*గాడిచేసినారు; గాడిపొయ్యి*

(4) కొయ్యచట్టములలో(తలుపులకు) మల సినగుంట—*గాడిదీసి చెక్క ఎక్కించు* [నె; వ; అ]

(5) బండ్లు నడచి చక్రములు ఏర్పరచిన బాట—*గాలు గాడి తప్పింది* [నె]

(6) బావి (గిలకలు) బిళ్ళలు మొదలగు వానిలో త్రాడు తిరుగుటకు మలచిన (చేసిన) కాలువ—*చేంత్రాడు గాడి తప్పినది* [అ]

గాడికడుగ = ఒక సామాన్యమైన తిట్టు—*ఓరి నీగాడి కడగ* [తె]

గాడిపట్టు = నివాసస్థలము; కొట్టము—*ఎద్దు గాడిపట్టు వదలనేలేదు;* గాడిపాటు [కర్నూ]

గాడిపాటు = (చూ) గాడిపట్టు [కర్నూ]

గాడిపొయ్యి = గుంటచేసి, నాలుగైదు కుండలకు ఒకేసారి కాగునట్లు చేసినపొయ్యి; పెద్ద ఎత్తు వంటలలో దీనిని త్రవ్వుదురు. [నె; కర్నూ; అ; మ; వ]

గాడు = (1) తిననిపొగరు — *తిన్నగాడు; గాడుబట్టి ఎగిరినాడు* [నె; కర్నూ]

(2) దూసిపోవు [కరీ]

(3) అంగపిచ్చి, దుర్మదము—*అది గాడు పటిన మనిషి; గాడుపట్టి చేసినపని* [అ; నె]

గాడుపు = కలరా [వి]

గాడెము = బండ్లునడచిన మెదుగుడు దారి—*ఎద్దు గాడెము తప్పిపోయినది.* గాడి [కరీ]

గాణి = గానుగ [నే]

గాతము = (1) గుంజ (కంబము) నాటుటకు త్రవ్విన గుంట [కర్నూ; నె]

(2) గడ్డపారతో నేలను పొడిచి ఏర్పరచు సన్నటి లోతుగుంట—*రెండుచోట్ల రెండు గాతములు వేయి;* గాతాము [చి; నె; అ]

గాతాము = (చూ) గాతము [అ; నె]

(2) శవాలను పూడ్చుటకు త్రవ్విన గుంట వంటిది [గో]

గాతాలుపొంగు = చెరకుపాలు కాచినప్పుడు వచ్చు చివరిపొంగు (ఎఱ్ఱగా పొగు దశలో గాతాలు (బెజ్జములు) పడినట్లుండును) [చి]

గాతు = గద్దింపు — *గాతే స్తేచాలు గప్‌చిప్‌గా ఉండిపోతాడు* [చి]

గాత్రము = (1) గంభీరము; చూపుకుఎక్కినది; దర్శనీయము—*అది చాలా గాత్రంగా నున్నది* [నె; కర్నూ]

(2) లావు; మందము [అ]

గాథ = గొడవ—*అదంతా ఒక పెద్ద గాథ* [అ, నె]

గాద = పైత్యపు దద్దులు — *గాద లేచింది* [నె; వ]

గాది = ధాన్యముపోయుటకు గుండ్రముగా, పెద్దదిగా నిర్మించిన శాశ్వతమైన గట్టి కట్టడము. తాత్కాలికముగా కూటులోను(పురి) పాతరలలోను గింజలు పోయుదురు. గాదె; గాజ [నె; కర్నూ]

గాదిరి = దేవదారు; జాజి చెట్టు లేక కొయ్య [అ-పె]

గాన-కాన = అయితే; కనుక— *నేనే గాన వస్తినా చూడు;* [నె; కర్నూ; అ; వ]

గానుగచెక్క = ఎట్టి నూనెగింజలతో తీసిన పిప్పి [అ]

గానుగపిండి = (1) గానుగలో చమురుతీసిన నువ్వులపిండి చెక్కలు [నె; కర్నూ; వ]

(2) చమురుతీసిన వేరుశనగపిండి [అ]

గాపతాడు = కపిల (మోట) బొక్కెన తొండపు తాడు [చె]

గాబ = (1) చెవిగూబ — *దెబ్బకు గూబ గాబెళ్లు ఎగిరినవి* [నె]

(2) కలుపుగిద్ది [అ-పె; నె]

గాబు = (1) కలుపు. పొలములోని పిచ్చిచెట్లు. వగైరా [ప. గో; శ్రీ]

(2) నీళ్లుంచుకొను బాన, కొప్పెర [శ్రీ]

గాయకం = (1) ప్రియము; ఎక్కువవెల [శ్రీ]

(2) లోకజ్ఞత

గార=(1) గచ్చు.
(2) మరక—*తమలపాకుతో పండ్లు గార బట్టినవి* [నె; కర్నూ; తె; అ]
గారకాళ్లు=మేక, పొట్టేళ్ల మోకాటిక్రింది కాళ్లు. జబ్బుపడి లేచినవారికి ఈ ఎముకల సారమును పొంగించి యిత్తురు, గేరకాళ్లు [చి; నె]
గార్వము=గారాబము [తె]
గారె=మోటగిర; బారి [కరీ]
గాలప్రోగగు=అన్ని అనుకూలించి వచ్చు [కరీ]
గాలి = దయ్యము — *గాలి సోకింది; దయ్యము పట్టింది* [నె]
(2) చులకదనము—*ఈ పని గాలికి లేదు* [నె-పొ]
గాలించు=(1) తీవ్రప్రయత్నముతో వెదకు —*గాలించి వెదకినా.*
(2) బియ్యము నీళ్లలోబోసి, పాత్రను అటునిటు ఆడించుచు, అరచేతిలోనికి నీళ్ళ లోని గింజలు వచ్చునట్లుచేయుట. దీనివల్ల రాళ్లు క్రిందకు దిగిపోవును. [నె, కర్నూ; తె]
(3) వస్త్రగాళితము (పొడిని పాత్రమీద కట్టిన బట్టగుండా జారునట్లు రుద్దుట) [అ]
గాలిఅమ్మవారు = ఎద్దులకాళ్ళకు నోటికి సోకు అమ్మవారు; గాలికుంటు [చి]
గాలికడుపు=గర్భముగా వచ్చినట్లు కనుపించి, పిండములేనిది, బల్ల [నె]
గాలికుంటు = పశువుల కాళ్లకు నోటికి తగులు వ్రణవ్యాధి; గాలిఅమ్మవారు; గిరసకాలు [నె]
గాలికుండలు=ఒకజాతి పొంగు రోగము. ఇదికూడ అమ్మవారి విశేషమే [గో]
గాలిగంత = గుడ్డనేయు మగ్గము దగ్గర నుండు గోడకంత [నె-పొ]
గాలిగవాక్షి=చెఱకుపాలు కాగు పొయ్యికి బూడిద రాలుచోటు [చి]
గాలిగాడి=గాడిద
గాలిగుడి=చంద్రునిచుట్టు దూరముగ పెద్దదిగ వేయుగుడి; పరివేషము. దీనివల్ల త్వరలో వానలేదని తెలిసికొందురు [నె; తె; అ]
గాలిగుడ్డు=పుంజు తొక్కకనే పెట్టు గుడ్డు; ఊబగుడ్డు (Vegetable Egg) [నె]
గాలిగుమ్మటము=గాలి బాగుగా వచ్చునట్లు ఎత్తుగా కట్టిన గోపురము [వ]
గాలిజల్లు = చిన్న స్ఫోటకము; ఆటలమ్మ [శ్రీ]
గాలితెగులు=(చూ) గాలికుంటు [చి]
గాలిపోసింది=మశూచి సోకింది [వి]
గాలిమాట=నీలివార్త; పుకారు; అవాయి; వినికిడి.
గాలివాటు=(1) గాలివీచు దిక్కు.
(2) అకస్మాత్తుగా దొరకు అవకాశము [నె]
గాలు=(1) బండిచక్రము; రోద; కల్లు
(2) బండిచక్రములు ఏర్పరచినబాట — *గాలులోనే పోసి* [నె, తె; అ]
గావు=(1)తూర్పు ఎత్తునపుడు గాలికివేరగు పొల్లుగడ్డి మొదలగునవి [అ]
(2) నోటితో కొరికి చంపవలసిన బలి పశువు [తె]
(3) బలి — *ఇంటికి గావు యిచ్చినారు* [నె]
గావుకేకలు = వెఱ్ఱెత్తిన వానివలె పెద్ద గొంతుతో అరుచుట [గో; వి]
గావుగుండె=ధైర్యము కలవాడు [అ]
గావుతీయు=కలుపుతీయు [శ్రీ]
గావుబట్టు = పండ్లతో కొఱికి చంపు [కరీ]
గాసగాడు - (1) కోడెల బేరములో దళ్ళు వసూలు చేసికొని వచ్చుటకు నియమింపబడినవాడు (చూ) కోడెలబేరము [నె]

(2) అప్పటి కప్పటి సేద్యపు సేవకుడు; జీతగాడు [కర్నూ; తె]

(3) ఏడాది సరి కూలివాడు; సంబళగాడు [అ]

గానము = ధాన్యరూపములో చెల్లించు నెల, లేక సంవత్సరజీతము (గ్రాసము)

(2) తిండిగింజలు — ఈ పూటకు *గానము లేదు* [తె. అ]

గానము అయిపోవు = ఆయువు ముగిసి పోవు; గింజలు తీరిపోవు [వ]

గాళ్లు = గోడలు కట్టుటకై త్రవ్వు గుంటలు; కడగాళ్లు; గోడకాళ్లు [చి; నె]





గింగిరాలు = (1) గుండ్రముగా తిరుగుటలు

(2) కొట్టిన దెబ్బకు తల తిరుగుట — *గింగిరాలు తిరిగేటట్లు కొట్టుతా;* గింగిర్లు [నె-పా]

గింగిర్లు = (చూ) గింగిరాలు [తె]

గింజపొగరు = (1) చిన్న మొలకలకు దాని విత్తనము జీర్ణించి పోవునంతవరకు చూపు పోడి — *పైరు గింజ పొగరుమీద ఉన్నది* [నె]

(2) యౌవనము — *అయ్యో గింజ పొగరు మీద ఉన్నాడు* [నె]

గింజలు తీరిపోవు = చనిపోవు; గానము అయిపోవు

గింజా గిరువు = ధాన్యము [కరీ]

గింజెలు = అనుములు [పే]

గింది = మోసము; గిందిరి [గం]

గిందిరి = మోసము; దొంగపని; గింది [గం]

గిక్కడ = ఇక్కడ [వ]

గిగిరెట్లు కొమ్ము కుప్పలపై (కుప్పెలు) తగిలించు గజ్జెలు [చి]

గిజరు = దోసకాయి మొదలగు వానిలోని గింజలతో కూడిన గుజ్జు, గుజురు [నె]

గిటకబారు = (1) ఎదుగకుండ ముదిరిపోవు; గిటుకుబారు; గిడసబారు; నరిగెపారు [నె; కర్నూ]

(2) లోపలనే ఎండినది — *గిటక కొబ్బెర* [అ]

గిటక = ఎండు కొబ్బరచిప్ప [అ]

గిటిక = ఎండిన కొబ్బరి [సే]

గిటికె = కుండపిడత [సే]

గిటు = ఇటు [వ]

గిటుకు = పొట్టి; గిటక [అ; బ]

గిట్టిగడ్డ = చెరువులు, మడుగులు మొదలగు జలాశయములలో పెరుగు ఒక దినుసు గడ్డ, దీనిని ఉడుకబెట్టి తిందురు. [నె]

గిట్ల = ఇటుల; ఈలాగున [వ]

గిడసబారు = (చూ) గిటకబారు [గు; గో]

గిడసవల = మంచినీళ్ల చేపల వేటలో పారుదలకు అడ్డంబెట్టు వెదురు పేళ్లబుట్టలు; మావులు [గు-బాపట్ల]

గిత్త = కాలుబట్టిన (వట్టగొట్టిన) మట్టసమైన కోడె [నె; కర్నూ; వ; తె]

గిత్తూడు = గిడ్డమనిషి; గిత్తోడు [అ]

గిద్ద = (1) సోలలో నాల్గవభాగము

(2) 8 కుంచాల కొలమానం [కరీ]

గిర = చక్రము; గీర [కరీ]

గిరక = బావినీరు చేదుటకు ఉపయోగించు చక్రము; పుల్లి; గిలక [కరీ]

గిరజ=మగవారు జుట్టుపెంచి, ముందు భాగములో కొంత గొరికించినది — *ఆయన పెద్ద గిరజా పెట్టించినాడు;* గిరదా [నె]
(2) తల వెంట్రుకలను ముందు వెనుక గొరిగిన చోటు, నడినెత్తిన వెంట్రుకల భాగము నిలిచియుండును — *గిరజాలు పెట్టినాడు* [నె]

గిరదా=(చూ) గిరజ [వ]

గిరదావడి=కొసరి కొసరి బేరమున తగ్గించునది [నె-ఆత్మకూరు]

గిరసకాలు=పశువులకు గిట్టలకు, నోటికి సోకు పుండ్లవ్యాధి; గాలికుంటు; గాలి అమ్మవారు [కర్నూ; నె-దక్షి]

గిరసటబాయి=గట్టివడు; గిరసబారు [కరీ]

గిరి=గొల; గెల [వ]

గిరి=(1) నేలమీద గీచిన గీత— *గిరి దాటి అడుగు పెట్టకు;* గెరి [నె; అ, తె]
(2) చెర [మ]

గిరిగ = పాదములకు పైభాగము; గిరిస; గిరస [చె]

గిరిగె=మడమక్రింది భాగము [అ]

గిరివాటు =ఏదైన ఒకదానిని చుట్టు త్రిప్పి విసరివేయుట; గిరవాటు [నె; అ; తె]

గిరివి=కుదవపెట్టుకొనుట [తె]

గిరివీ=కుదవ; తాకట్టు [కరీ]

గిఱ్ఱ = (1) బండి చక్రము ఏర్పరచిన గాడి, లేక బాట
(2) గీత [చి]
(3) తల బిరుసుతనముగా, అతిశయముగా ప్రవర్తించు [గో]
(4) గిలకబిళ్ల
(5) బండిచక్రము, గాలు, కల్లు [మ]

గిఱ్ఱున=త్వరగా—*గిఱ్ఱున తిరిగి వచ్చినాడు* [నె; కర్నూ]

గిలక = బండ్లపైన, లారీలపైన వేసిన సరుకు బిగించే తాళ్లకు చివర కట్టియుండు గిలక బిళ్ళగల మోకు [గు]

గిలక =(1) బావినుండి నీళ్లు చేదుటకు పైన అడ్డముగా వేసిన మానుపై బిగించిన కప్పి, పుల్లి, గిఱ్ఱ
(2) కదలించిన గిలగిలలాడు పిల్లల ఆట వస్తువు; [నె; కర్నూ; తె]
(3) ఒకవిధమైన పట్టరోగము [గో]
(4) ఉల్లాకు [వి]

గిలకకాయ=ఊపిన గలగల మను పిల్లల ఆటవస్తువు; గిలక్కాయ, గిలక [వ]

గిలావ=సన్నగచ్చు [మ]

గిలుకు=(1) వచ్చిరాని గీతల వ్రాత—*ఏదో గిలికినాడు* [నె; కర్నూ; తె; అ]
(2) (వ్యంగ్యముగ) వ్రాయు—*రెండక్షరములు గిలికితే* చాలునా [వ; నె]

గిల్ల=పిల్లల ఆటలో ఉపయోగించు పెంకు ముక్క [కరీ]

గిల్లకన్ను=మెల్లకన్ను

గిల్లవేయు=పిల్లల ఆటలో అంక్ష విధించు [కరీ]

గిల్లికజ్జా=కోరి తెచ్చిన కయ్యము—*వాడు గిల్లికజ్జా తెస్తాడు* [వి]



గీ



గీచె=నువు కట్టలకుప్ప— *అక్కడ నువు గీచె పెట్టిరి* [కరీ]

గీచెక్క=దోరగిలిన తాటికాయను పొక్క వలచి సన్నని తాళ్లవంటి ముక్కలుగా

చేసినది; దీనిని ఉడుకబెట్టకనే తిందురు.
గిచిన చెక్క [నె]
గీట్లు=చదువు సంధ్యలు [అ]
గీడ=ఇక్కడ [ప]
గీత=చెట్లను కల్లుకుగా కోసి ఉట్టజేయుట—*కల్లుగీత* [కర్నూ; నె]
గీతాకు=మడిద్రొక్కని కోసిన తాటిఆకు (మడిద్రొక్కు=అణగవేయు) [నె]
గీత గీయువారు = ఈడిగవారు; మాకు లెక్కువారు [చి; నె]
గీనంగ=ఇటునుండి [వ]
గీపెట్టు=(1) గట్టిగా ఏడ్చుట—*ఎంత గీపెట్టినా ఇవ్వాలేదు* [నె; కర్నూ; తె; అ]
(2) చెవులు గింగురు మనేలాగ అరచు [గో]
గీమాలు=బ్రతిమాలు—*అతడు నన్ను గీమాలెను* [కరీ; వ]
గీర=(1) గర్వము [వ; గో]
(2) చక్రము; గిర [కరీ]
(3) నీరసము [ఉ; వి]
గీరు=(1) పాలు పూర్తిగా పితుకు—*వాళ్లే గకు లేకుండా పాలు గీరుకొన్నాడు* [కరీ]
(2) మట్టిని కదలించు [అ; మ]
గీర్వాణము=గర్వము; టెక్కు [సర్కా]
గీస=సగబాలు; వాటా [కర్నూ]
గీసుకత్తి=(1) చిన్నకత్తి, వంగి ఉండునది
(2) మల్లి ముల్లు [చి]

# గు



గుంగురు=చిన్నముప్వ [కరీ]
గుంజె=(1) పందిలికివేయు కొయ్య నిలువు కంబము; (ఇండ్లకు వేయునది కూచము) [నె; కర్నూ; అ; తె]
(2) గూటము [కృ]
గుంజమ్మ=ఒక తిట్టు [ప]
గుంజాటన=ఆవేదన; ఆరాటము [వ]
గుంజాటము=లంపట; తగులము [కరీ]
గుంజిగాడు=వ్యర్థుడు; పనికిమాలిన వాడు [శ్రీ]
గుంజు=గుజ్జు—*తాటిగుంజు* [నె; తె; అ]
గుంజుకొను=(1) రోషపడు—*ఏమిగుంజుకొంటున్నావు* [నె]
గుంట=ఎటు పదకొండు గజాల కొలత గల చచ్చవకపు నేల [కరీ]
గుంటదూలము=ఇంటి పెద్దదూలముపైన అడ్డముగావేయు చిన్నదూలము, కుంట దూలము; మేలుదూలము [నె; వ]
గుంటి = నీటిపారకమునకై (పారుటకై) వీలుగా ఏర్పరచుకొన్న కొంత భూభాగము [కరీ]
గుంటుకు=నేలను చదునుజేయు కృషిసాధనము; గుంటక [కరీ]
గుంటుకుగొట్టు=(వ్యంగ్యముగా) నశించు; నశింపజేయు—*వానికొంప గుంటుకుగొట్టినది;* గుంటుక (గుంటక అను సాధనముతో చేను చదరము చేసినట్లు) [కరీ]
గుండము = పెద్దసున్న— *అతడు గుండము చుట్టినాడు* [తె]
గుండారు=చీర [వి]
గుండావర్తం=గుణవర్దం, గోడకాలు [అ]

గుండి = చిన్నమూతిగిన్నె; ఒక వంటపాత్ర [వ]

గుండిక = పెద్దబిందె [శ్రీ]

గుండిగె = గొంతు [కరీ]

గుండీ = (1) గుండ్రని వంటపాత్ర [కరీ]
(2) చొక్కా-బొత్తాము [కరీ, నె]

గుండుజల్ల = వెదురుదబ్బలతో అల్లిన గుండ్రని పెద్దతట్ట బండిజల్ల [నె-పొ]

గుండ్రలు = విత్తనాలకై ప్రత్యేకించి పెట్టిన వేరుశనగ గింజలు [న]

గుండ్రాళ్లు = (1) జొన్నలు నానవేసి దంచిన తర్వాత నిలబడు గట్టిగింజలు [నె]
(2) బెల్లము మొదలగునవి పొడిగా దంచుటకు ఉపయోగించు రాళ్లు, సకిలరాళ్లు [అ]

గుంతపొంగలి = ఆవిరికుడుము, కుడుము రొట్టె.

గుంయ్యిమను = (1) సొమ్మసిల్లు
(2) అధికారం తగ్గు [వి]

గుక్కబట్టు = పిల్లలు ఎక్కువగ తెంపు లేక ఏడ్చినప్పుడు ఊపిరాడకుండుట [అ; నె]

గుజగుజలుపోవు = (చూ) గుబులుపడు [అ-పె]

గుజినీవేళ = నలుగురు ఒకచోటచేరు సమయము [నె-పొ]

గుజిరీ = (చూ) గుజిలి [కర్నూ]

గుజిలీబజారు = అనుదినావసరములకు కావలసిన సామాను అమ్ము అంగళ్ళబారు [వె-దక్షిణం; తె]

గుజురు = గుజ్జు; గిజరు, గుంజు.

గుజ్జు = (1) గుంజు
(2) బండిప్రక్క పరములమీద సాలుగా నిలువున గుచ్చిపెట్టు పొట్టికొయ్య, ఇది జల్లకు గాని, వేసిన మూటకుగాని ఆనుగా, (అండగా) ఉండును—*గుజ్జులు లేకుండా జల్లపెట్టుట* [నె, కర్నూ; అ]
(3) మొరటు పొట్టిబడిత—*గుజ్జుతో కొట్టినాడు* [నె]

గుజ్జెన = ఆకులబుట్టి [మ]

గుటగుట = అవమానము [కరీ]

గుటిక = (చూ) బుటక [అ]

గుటుక్కుమన్నడు = మృతిబొందినాడు [మ; నె]

గుట్టుకూలు = (1) పూర్తిగా వడిపోవు
(2) పాడుచేయు—*వాడిగుట్టు కూల్చినాడు* [నె; తె]

గుడబండి = పిల్లలు ఆడుకొనేబండి [వి]

గుడాంబ = బెల్లము, పొగాకు మొదలగునవి దంచి ముద్దగాచేసి హుక్కాత్రాగుటకు ఉపయోగించునది [కరీ]

గుడాకు = తంబాకు; పొగాకు [శ్రీ]

గుడాటికాపు = కాపులలో (రెడ్లలో) ఒక తెగ; గొనెకాపు; కమ్మకాపు, మొటాటికాపు; పంటకాపు; దేసూరుకాపు; పాకనాటికాపు; వెలనాటి కాపు మొదలగునవి [కరీ]

గుడాణము = చిన్నమూతిగలపెద్దకడవ [సే]

గుడాలు = గుగ్గిళ్లు; చుండలు [మ]

గుడి = పారశాల—*దేవాలయాలే పల్లెటూరి పంతులయ్యా పారశాలలుగా వుంటూవచ్చినవి* [అ; బ]

గుడికట్టు = (1) దేవాలయములలో ధన నిక్షేపములున్నచోట్లు తెలుపు పుస్తకము [తె]
(2) దేవాలయమునకు సంబంధించిన నియమములు.
(3) గుడిసేవకులు [అ]
(4) ఉమ్మడి [శ్రీ]

గుడిగ = చిన్నమట్టిపాత్ర [అ]

గుడిగి = నిక్కరు; ట్రవుజరు [కర్నూ]

గుడిగె = దొంగఎద్దుకు మెడలో వేసే కఱ్ఱబందము; గుదికొయ్య [మ]

గుడిదొమ్మలు - వాలగవంటి చిన్న మంచి నీటి చేపలు [ఉ గో]

గుడిపల్లికూటము=పాఠశాల, బడి [చి]

గుడిపాము=ఇల్లువదలి బైటికి వెళ్ళనివ్యక్తి (కూపస్థమండూకము అనుట) [గో]

గుడిశెన గుళ్లు = దేవుని రథయాత్ర ఉత్సవము ముగిసినతర్వాత ఉత్సవమూర్తిని వేంచేయింపు జేసి పదిదినము లుంచు మందిరములు [గ; వి]

గుడిసెలోకూచున్నది = రజస్వలయైనది [చి]

గుడిసెవేటు=నీచపులంజ; గుడిసేటి [చి]

గుడిసేటి=(1) గుడికిచేటి. దాని=దేవదాసి.
(2) లంజ — *అది గుడిసేటిముండ* [నె; కర్నూ; సర్కా; అ]

గుడుగు=ఉరుము [సే]

గుడుగుడుగుంచెము = అంతర్ రహస్యము [కరీ]

గుడుగుడుగుండం = (1) పిల్లలాడుకొను ఆట.
(2) స్థలాంతరము నెఱుగకుండుట—*నీవు మీ ఊళ్లో గుడుగుడుగుండంగావుంటే నీకు లోకము ఎట్లు తెలుసును* [నె-పొ]

గుడుగునాట=చెడుగుడు (గుడుగుడుమని శబ్దంచేయుచు ఆడుదురు) కబాడి; బలిగుడు [అ; బ]

గుడుగుడుపంచెం=పిల్లలందరు కూర్చొని ఒకరి పిడికిలిపై ఒకరు పిడికిలి పెట్టి "గుడుపంచెం గుండేరాం" అని పాడి "చేతు లెక్కడబోయినవని" అడిగి సమాధానం పొందుచు ఆడు పిల్లల ఆట [మ]

గుడ్డ - ముట్టుగుడ్డ అన్న బూతుమాట; బట్ట [గో]

గుడ్డ=వస్త్రము [నె; రా] బట్ట [సర్కా] నెల్లూరులో బట్ట అనిన తిట్టు; నాముట్టు బట్ట-అని. సర్కారులలో దీనినే గుడ్డ అందురు

గుడ్డము=చేనివంపు [కరీ]

గుడ్డికుంకాళమ్మతిరునాళ్ల= మబ్బు చినుకులతో మూగాము వేసియుండుట—*ఇప్పుడు గుడ్డికుంకాళమ్మ తిరునాళ్లగా ఉన్నదే!* ఈమె లేబూరుగ్రామదేవత (ఈమె తిరునాళ్ల సాధారణముగా మంచి వర్షఋతువులో జరుగుచుండుటచే యీ సామెత వచ్చినది) [నె]

గుడ్డియంత్రము = అసాధ్యమైన పదకము [కరీ]

గుడ్డుపెట్టు=(1) అకస్మాత్తుగా చనిపోవు, పీడవదిలినదని భావముతో అందురు — *వాడు గుడ్డుపెట్టినాడు* [నె, కర్నూ; అ]
(2) పరీక్ష మొదలగువానిలో తప్పు.
(3) పని చెడిపోవు [వ]
(4) ఆరిపోవు— *దీపము గుడ్డుపెట్టినది* [అ]
(5) సున్నాపెట్టు; ఇయ్యవలసినది ఇవ్వకుండా ఎగవేయు

గుడ్డెంగలము=కొంచెము వెడల్పుగానుండి ఎక్కువ ముల్లుగలిగిన చిన్నచేప; గుడ్డెంగాళ్లు [శ్రీ]

గుణవర్ధము = గోడలుకట్టుటకు భూమిలో తీసిన గాడులలో గట్టిగా కంకరతో దట్టించినది; గుణాది; అస్తిభారము; పునాది; గుణావర్తము— *ఆ యింటికి గుణార్ధం బాగాలేదు* [నె]

గుణాది=(చూ) గుణవర్ధనము, అస్తిభారము

గుణావర్తము=పునాది; అస్తిభారము; గుణవర్ధము [చి]

గుణిపింపు=లోపలి ఉద్దేశమును బయటపెట్టకుండ ప్రతిదానికి అడ్డముచెప్పుచు చేయు సణుగు; బులిపింపు [గో]

గుణుపు=(చూ) గుణిపింపు [గో]

గుతుపకట్టె=దుడ్డుకఱ్ఱ; బడితె [మ]

గుత్తము=బిగువు × ఒదలు [వ]

గుత్తా=జట్టీ [కరీ]

గుత్తి=పప్పును పాము (ఎనించు) గుండ్రని కొయ్య. చిప్పవంటిది చివరన బిగించిన కొయ్య; ముద్దకవ్వము [చి]
(2) కాలిమొదలు [కరీ]
గుత్తికాయ = వేరుశనగకాయ; బుడ్డలు, గుత్తి సెనగ [కరీ]
గుత్తిసెనగ=వేరుశెనగ [కరీ]
గుత్తు=(1) గెల,
(2) తాళంచెవుల గుత్తి [చి]
(3) శిస్తు [అ]
గుత్తులుగున్నాయి = స్త్రీల ఆభరణ విశేషము [కరీ]
గుది=(1) గోవపశువులు బెదిరి పరుగెత్తి పోకుండ అడ్డుపడుటకు మెడలో జార విడిచి కట్టిన లావు పొడవు కొయ్యతుంట — *గుదికట్టిన* ఆవు, గుదిపెండెము; గుదిమాను [నె]
(2) చేరిక; గుత్తి [కరీ]
గుదికట్టె=గుదిమాను(చూ) గుది [అ]
గుదిగాళ్లు=సరిగా నడువరాక పోవుట (పశువులకు మంచగుది అందురు) [నె; మ]
గుదిగ్రుచ్చినట్లు = దట్టముగా పేర్చబడి యుండు [కరీ]
గుదిపి=చేతికట్టె; గుదియ [చి]
గుదిపెండెము=(చూ) గుది—*ఆ పెయ్యకు గుదిపెండెము కట్టవచ్చు* [నె]
గుదులుకట్టు=కీళ్లనొప్పిపుట్టు— *నిలుచుని, నిలుచుని కాళ్లు గుదులు కట్టుకొనిపోయినవి.*
గుదులుగుదులు = గుంపులు గుంపులుగా [అ; నె]
గుదులుపడు = రహస్యాలోచనకుగా వేరు వేరుగా గుంపుగట్టిమాట్లాడుకొను—*ఏదో గుదులు పడుచుండినారు* [నె]
గుద్ద నోరుతెలియదు = ఏమీ తెలియదు అనుట; కేవలం అజ్ఞానము—*గుద్ద నోరు తెలియకుండా మాట్లాడినాడు* [నె]
గుద్దలిపెట్టు = వినాశకారణము(గుద్దలి = నేల త్రవ్వు కొరముట్టు) [అ]
గునియు = గొణుగు; లోలోన వల్లించుకొనుచు బాధపడు [కరీ]
గునుకు=(1) దీపపువత్తిని రెండువేళ్లతో ఒత్తి ఆర్పివేయు — *తిళ్లకట్టు గునికిరా* [నె]
(2)ఊగు [అ]
(3) మలుపు [గు]
(4) మూయు—*కన్ను గునుకు* [అ]
(5) చన్నవరుగు [కృ]
గునుగు=ఒకజాతిగడ్డి; తృణము [కరీ]
గునుచు=చిన్నగా ఏడ్చు [శ్రీ]
గున్నపెంకు=పూలతోట్టి—*ముందు గున్న పెంకులో నాటు* [హై]
గుప్పు=(1) గుప్ అనుశబ్దము వచ్చునట్లు రోటిలో దంచు
(2)రోకటిపోటు—*రెండుగుప్పులు వేయు* [నె; తె; అ]
(3) బాలికల చింతగింజల (గచ్చకాయల) ఆటలో ఒకటికంటె యెక్కువ గింజలున్న పోవును ఒక్కమాటుగా దూసి యెత్తుట; పల్లంచి ఆట [గో]
(4) వెదజల్లు [కరీ]
గుప్పెడు=పెద్ద పిడికెడు—*గుప్పెడు అటుకులు* [నె; కర్నూ; వ; అ]
గుబలకమ్మ = (1) స్తనములు మొలవని ఆడుది × సమర్తగానిది మాచకమ్మ [నె]
(2) ఏ పనిగాని చేయక కూర్చుండు స్త్రీ—*అది గుబలకమ్మవలె కూర్చున్నది* [నె-పొ; కర్నూ]
గుబావరీ = స్త్రీలు చెవిగూబలకు ధరించు ఆభరణము; గూబ్బారి [అ]
గుబాళింపు=ఉక్కపెట్టుట [వి]
గుబురు=పొట్టిగా, దట్టముగా ఎదిగినపొద (Shurb) [నె; కర్నూ; అ; వ; తె]

గుబులు = (1) మతిచాంచల్యము; ఏ పనిని గాని నిలుగడగా చేయనివాడు — *గుబుళ్లు మారివాడు* [నె; రా; తె; కృ]
(2) వేసంగిలో ఉక్కబోతగా ఉన్నప్పటి అనుభూతి — *చాల గుబులుగా ఉన్నది* [గో]
(3) భయము [చి; వ]

గుబేలున = (చూ) గబేలున; గబాలున [కర్నూ; వ]

గుబ్బగొడుగు = గుడ్డగొడుగు [వి]

గుబ్బావిలాలు = కమ్మకు తగిలించి పైకి లాగి బిగించు నగలు [రా; నె]

గుమర = సన్నటి పొడుగాటి మద్దెలవంటి వాయిద్యము [శ్రీ]

గుమాను = అనుమానము; సందేహము —*ఆ దొంగతనంలో వాడిమీద గుమాను పడినారు* [నె; అ]

గుమ్మ = (1) బొంగరమును తాటితో (జాలి) చేతికొంది విసరికొట్టినది — *అది మంచి గుమ్మ* [నె, కర్నూ; వ; అ]
(2) అందమైనపడతి — *ముద్దలగుమ్మరా* [చి]
(3) ఉష్ణధార (అప్పుడేపిండిన నురుగుతో గూసి వేడి నుండు పాలు) — *ఈమందు గుమ్మపాలతో తీసికొనవలెను;* పాల ధారలు, ఆవుపాలు [నె-పొ; కరీ]

గుమ్మటము = దేవాలయములు మొదలగు వాని పై భాగమునందలి గోపురము; విమానము
(2) పొగగుమ్మటము; బెలూన్
(3) వంటఇంటి పొగపోవుటకు ఎత్తుగా కట్టిన గూండ్లచట్టము; పొగగూడు [అ; తె]

గుమ్మడ = వాననీరు క్రిందికి కారునట్లు మిద్దె పైనఏర్పడిన రంధ్రము; బుంగ [తె; అ]

గుమ్మడపడు = మిద్దెలో కన్నమేర్పడు [అ-వజ్రకరూరు]

గుమ్మపాలు = ధారోష్ణములగు పాలు [కరీ]

గుమ్మి = (1) ధాన్యము నిలువ ఉంచుటకు ఎండుతీగెలతో అల్లిన పెద్దగంప; బొట్ట [మ; గరీ]
(2) నీరునింకిన చిన్నగుంట [శ్రీ]
(3) ధాన్యము నిలువజేయు తడికెలగూడు [వ-కృ]

గుయ్యారం = చీకటి

గురక = గుఱ్ఱుమనుశబ్దము. మరణలక్షణము —*గురకట్టివుంది, ఇక బ్రతకడు* [నె-పొ; తె]

గురాలు = గొబ్బిబొమ్మలు; గురిగెలు [అ]

గురిక = చిన్న మట్టిపిడత [తె]

గురికిబెత్తెడు = దాదాపు; ఇంచుమించుగా [కరీ; నె]

గురిగి = (1) *గయ్యాళి*
(2) పతివ్రతవలె నటించునది [అ]

గురిగెలు = గొబ్బెమ్మలు; గురాలు [అ; బ]

గురుకు = శ్లేష్మావరోధముచే కలుగు కంఠధ్వని; గురక [కరీ]

గురుకు = పిండిముద్దపై దీపారాధనకు చేయు గుంట [నె]

గురుకుళు = శివార్చకుడు; తంబళ [నె-దక్షిణ]

గురుగాకు = ఒక ఆకుకూర [చి; నె]

గురుగు = (చూ) గురుకు [కర్నూ;సర్కా]

గురుగుముంత = పెళ్ళికాలమందు చిత్ర వర్ణము గలిగి యుపయోగించెడి మట్టి పాత్ర [కృ]

గురునాథపొంగలి = కొత్తపెండ్లికొడుకు పెండ్లికూతురు ఇంట మొదట ప్రవేశించి నప్పుడు చేయు పూజాక్రమము;ఈ గురు నాధుడు దక్షిణామూర్తి అంశము. ఇట్లే వరుని ఇంట వధువు చేయునది అక్కల ముత్తయిదువ పూజ [నె]

గురుమెకము = చమరీ మృగమువంటి జంతువు; దీనితోక వెంట్రుకలు స్త్రీలు సవరములుగా వాడుదురు [మ]

గుసగుస వెంట్రుకలు = ఉంగరాల కురులు [కరీ]

గురుజు = స్తంభము [ఓ]

గుజ్జుపుతుండ్లు = గుజ్జుపుమెడ (తల) ఆకృతితో చెక్కి, ద్వారబంధమునకు ఇరుప్రక్కలా గోడకు, అలంకారార్థముగ బిగించిన కొయ్యతుండ్లు; కస్తూరిపట్టెలు [నె]

గుజ్జుమెక్కు = త్రాగి నిషాలో ఉండు—వాడు *గుర్రమెక్కి ఉన్నాడు* [వి. నె]

గుజ్జు = పగ, కంటు — *గుజ్జుపెట్టుకొని యుండినాడు* [నె, కర్నూ, అ]

గుల = (1) దేనియందైనను అధికవాంఛ—*ఆయనకు చీట్లాట గుల* [నె]

(2) కామవాంఛ [కర్నూ; నె; అ, వ]

గులక = (1) చిన్నచిన్నరాళ్లు—*చిన్న గులకరాయి*

(2) బొంతరాయి పలుకులు; [అ; నె]

గులకరాయి = (1) చిన్నచిన్నరాళ్లు బొంతరాళ్ల రాయి (Latarite) [కరీ; అ]

గులకరించు = (1)నోటనున్న వస్తువును వక్కల ముక్కలగా నమలి నీళ్లుపోసికొని మింగు [నె]

(2) సుఖపడు; ధరించు—*ఇక్కడ ఏమి గులకరిస్తామని వచ్చినావు* [నె-పొ]

(3) నోట నీళ్లుపోసికొని బాగా గొంతువరకు దిగునట్లు చేసి పుక్కిలించు—*గులకరించి ఉమ్మివేసినాడు* [నె]

గులాంకాయలు = నాగజెముడు పండ్లు [అ]

గులాలు = ఎఱ్ఱకుంకుమవంటి ద్రవ్యము — *గులాల్ రంగు* [కరీ; మ]

గులుగు = (1) లోలోన గొణుగు [కరీ]

(2) విలాసముగా వర్తించు [అ]

గులుగులుసేయు = గిల్లంతపెట్టు [కరీ]

గుల్బందు = చిన్న ఉన్నిగుడ్డ, మఫ్లర్ [కరీ]

గుల్ల = (1) బలహీనము—*వాడు గుల్లైనాడు* [గు; నె]

(2) చిన్నకురుపు — *పడగుల్ల; తీటగుల్ల* [నె, అ]

(3) పండి ఎండిన చింతకాయ [నె, కర్నూ]

(4) ఆస్తి నాశమగుట—*వాడి యిల్లు గుల్ల అయినది* [నె. కర్నూ]

(5) లోతైనగంప [నె మ, శ్రీ]

(6) గంప [వ]

(7) చిన్నబుట్ట [అ, వి]

(8) బోలు (లోపల ఏమీలేనిది)

గుల్లయగు = శిథిలమగు, బలముతగ్గు—*వీనితో సంసారము గుల్లయైనది* [నె-పొ]

గుల్లసున్నము = సముద్రపుగుల్ల (నత్తచిప్ప) కాల్చిచేసిన సున్నము × రాతిసున్నము [నె, అ]

గుల్లి - (1) చిన్నది

(2) తోకలేనిది — *గుల్లెద్దు, గుల్లిపక్కి* [నె-మెట్ట]

గుల్లు = గొణుగు, సణుగు [మ; కరీ]

గువ్వకూర్చుండు = టెంకాయ, చెట్టుమీదనే నీరులేకుండా చెడిపోవు; దీనినే గద్దకూర్చుంట అని పరమటి తాలూకాలలో అందురు; గూబదొక్కు [నె; అ]

గువ్వగుత్తులు = స్త్రీలభూషణ విశేషములు [కరీ]

గువ్వదొక్కు = (చూ) గువ్వకూర్చుండు; గూబదొక్కు [చి]

గువ్వము = గుజ్జు [కరీ]

గుష్కప్పీలు = డంబాలు — *గుష్కప్పీలు కొట్టినాడు* [నె]

గుష్టి = (1) ఎరుక; చూచిన పరిచయము —*ఆయన నాకు గుష్టిలేదు*

(2) గురుతు;దృష్టి—అది గుష్టికి ఆనలేదు [నె]

గుస=వెడల్పుగా అల్లిన లోతుతక్కువచేట వంటి అల్లకము [అ-పె]

గుసాయి = వంటచేయు ఓఢ్రబ్రాహ్మణుడు [శ్రీ]

గుసులు=(1) కుసులు; పిసులు [మ]

(2) కూసాలు [వి]

గుల్లారిగాడు = పొడుగాటివాడు [చి]

# గూ



గూకు = (1)గుద్దు; దెబ్బ — ఒక్కగూకు ఇచ్చినాడు [నె]

(2) కొట్టుట—వీపున గూకినాడు [నె]

గూజు=గుజ్జు [చి]

గూటము = (1) మేలును కీడుగాచెప్పుట (అనభీష్టము)

(2) ఇబ్బంది; వ్యతిరేకత — ఒకగూటం వచ్చింది, ఒక మేకు వచ్చింది [నె]

(3) నిలువెత్తు కొయ్య — చెరుకుతోట గూటాలు [చి]

(4) గట్టివస్తువులను మెదుపు (నలగగొట్టు) గట్టి కఱ్ఱ తుంట [కరీ; నె]

(5) భూమిలోనికి దిగగొట్టు గట్టికొయ్య; పెద్దమేకు

గూటాయించు = బాగా చీవాట్లుపెట్టు: నూకులుపెట్టు [నె]

గూటించు = బాగా చీవాట్లుపెట్టు; గూటాయించు [నె]

గూటిబండి=మనుష్యులు కూర్చుండుటకు పైన గూడువలె కప్పుకట్టిన సవారిబండి × వట్టిబండి [నె]

గూటిమడవ=చేనులోవేసిన మడవ (అడ్డుకట్ట) క్రింద ఏర్పడిన బొక్క [నె]

గూటీలుద్రోయు = కఠినవాక్కులు విని పించు [కరీ]

గూటు=సంఘము (కమిటీ) [కరీ]

గూడ=(1) బండిపైనుండు జల్ల ముందరి భాగము [నె-ఆత్మకూరు]

(2) వల్లె—బోయగూడ; యానాదిగూడ [శ్రీ; తె]

(3) తుంటి, సడుగు చెప్పునకు, తొడిగి కొనుటకు వీలుగ నమర్చబడు తోలుపట్టె [నె-పొ]

(4) భుజపుకీలు—గూడ ఎగురుదన్నెను [కర్నూ]

(5) వర్షములో ఉపయోగించుటకు తాటి యాకుతోగాని, జమ్ముతోగాని చేసి నెత్తిన దిగవేసికొను అల్లిక— జమ్ముగూడ

(6) నీటిని ముంచిపోయు, వెదురుపేళ్లతో చేసిన సాధనము—చేనికి గూడవేసి నీరు పారించినారు [చె; నె]

(7) రెట్టపై బంతికీలు, గూడు [చి]

(8) చొప్పను నిలువునకు కుప్పగా పెట్టినది—జొన్నగూడ; గూడు

(9) మేకలు మందగా మేతకువెళ్లినప్పుడు అడవిలో వాని పిల్లల నుంచు పెద్దవెదురు అల్లకము, ఇది బోర్లించిన బెంకాయ చిప్పవలె నుండును. [నె; అ]

గూడగట్టు=(1) దెబ్బతగిలి నెత్తురుకదుము గట్టు [నె]

(2) తమిళులు మొలపంచను అడ్డముగా (దట్టీగా) కట్టినది; బ్రహ్మచారికట్టు [నె]

గూడదాసరి = మాల దాసరికులంలో ఒక తెగవాడు [చి]

గూడబాతు = పెద్దజాతి బాతు (Swan) [నె; వ]

గూడలి = నదులకూడలి — గూడలిసంగం [నె]

గూడు = (1) రెండు ఎముకలు కలియు కీలు —గూడు తొలిగినది, గూడ [నె]
(2) పశువుల గుదస్థానము — ఆ కోడెకు గూట్లో పొరకసుడి గలదు [నె-పొ]

గూడుపుటాని = (1) మోసము చేయుట [కర్నూ]
(2) కుట్రబన్నుట—వాళ్ళందరు గూడు పుటాణి చేసిరి (ఇది హిందీపదము); గూడ్ = బెల్లము; పుటాణీ = శనగలు; ఈ శనగలు బెల్లం అనుపదము తెనుగులో కుట్ర చేయుట అను అర్థమున వాడుట ఎట్లు ఏర్పడినదో)

గూడుబండి = తాత్కాలికముగా గూడువలె చాపతో కప్పినబండి; గూటిబండి [శ్రీ; నె]

గూన = (1) బాన; పెద్దపాత్ర—కవిలగూన [అ]
(2) పెంకు [కరీ]

గూపెట్టు = ప్రోగుజేయు [ప-కృ]

గూబ = ఒక తిట్టు; గోల [అ-పె]

గూబదొక్కు = (చూ) గువ్వకూర్చుండు [చి]

గూబబావిలీలు = స్త్రీలకర్ణ భూషణం; గూబ్బాలీలు [నె]

గూబము = గుంజు; గూవము [కరీ]

గూము = (1) ఐదారు చెరకుగడలపాది — పదిగూములలో తెగులుపడింది [చి]
(2) ఆభరణము [చి]

గూరు = చాలకాలముగా ఉండుదగ్గు [అ-పె]

గూవము = గుజ్జు; గూబము [కరీ]

గూస = దెబ్బ — ఒక్కగూసా ఇచ్చినాడు [నె]

గూళి = (1) ఆంబోతు (Stud Bull) [అ; నె]
(2) బలిసిన కుఱ్ఱవాడు [అ]
(3) చేపలుపట్టు సాధనము; (చూ) ఊత [శ్రీ]

గూళికుఱ్ఱ = (చూ) ఆపడెద్దు [అ]

గూళియెద్దు = ఆఎడెద్దు, దేవరపేర వదలిన ఆపోతు—దేవరపోతు; దేవరెద్దు [అ]

గూళ్లు = జొన్న, సజ్జదంటు పేర్చిన కుప్పలు [చి; నె-మెట్ట]

# గె



గెంగమ్మ = దూము; కలర; గంగమ్మ [చి]

గెంజరిగడ్డ = క్యారెట్ [అ]

గెంటించు = (1) నాటిపెట్టిన గూటము మొపి లగు వాటిని పెరికుటకు అటునిటు నెరిమి బెంపడిచేయు [నె; వ]
(2) సాధనములచే గింటుట [గో]

గెంటె = చలికి రెండుచంకల క్రిందుగా ముడి వేసి కట్టు ఉత్తరీయపు కట్టు; ఏటకట్టు [ఓ]

గెట్లించు = (చూ) గెంటించు [కర్నూ]

గెండి = వెడల్పుగానుండు మంచినీటి చేప [నె; వ]

గెందిరి = అసూయపరుడు; ఉడుకుబోతు [శ్రీ]
గెగ్గెలు - గడ్డలు—రేగడి గెగ్గెలలో నడువ వీలుగాదు [కరీ]
గెచ్చు = పొడవుగా పెరిగినవాడు [కరీ]
గెడ = గడియ [శ్రీ]
గెడంచు = (చూ) గడమంచి; గడవంచి [అ]
గెడవు = క్రింద పడవేయు; కెడవు [అ; బళ్లారి]
గెడపులాట = పోట్లాట [అ]
గెడిగె = (1) కుండ [నె]
(2) చిన్నమూతిగలగిన పంటికంచె (బుంగ) చిన్నకుండ; గెడిగ [నె]
గెణుసు = కందగడ్డ; రామకంద; రత్నపురి గడ్డ; చిలగడదుంప; తెల్లదుంప [వ]
గెణుసుగడ్డ = చిలగడదుంప; గణుసుగడ్డ గెనసు; గెనిసెగడ్డ [అ]
గెత్తం = ఎరువు [శ్రీ]
గెన = గెడ [శ్రీ]
గెనసు = గెణుసు; చిలగడదుంప [చి]
గెనిసెగడ్డ = గణుసుగడ్డ; తెల్లదుంప [నే]
గెనుసుగడ్డ = చిలగడదుంప; [కర్నూ]
రత్నపురిగడ్డ [హై]
కంద [వ]
గెర = గొల; గెల [వ]
గెరవయ్య = (చూ) గౌరవయ్య [వ]
గెరవాటు = (చూ) గిరివాటు [కర్నూ]
గెరి = గిరి [అ]
గెల = అరటి, తాటి, టెంకాయల గుత్తిగా పుట్టిన మోము; గొల [నె; కర్నూ; వ]
గెల్ల = పార్శ్వము [కరీ]
గెళెము = (1) వ్యవసాయ పరిభాషలో కాడి
(2) ఒక కాడెద్దులతో సేద్యము చేయగలిగిన విస్తీర్ణముగల సేద్యపుభూమి — *మాకు రెండుగెళెముల సేద్యంవుంది. ఒంటి గెళెంవానికి ఒక తిప్పలాః* (అరక, గొర్తు అనుసట్లు) [అ, బ]
(3) కాడెద్దులు [అ]

## గే



గేగులు = తాటికాయముట్టెలోనుండి పుట్టు మొలకలు; తేగలు [కరీ; చి]
(2) తీగలు [చి]
గేడి = (1) నిలువుప్రక్క — *రాతిని గేడికి (గేడిపాటున) బెట్టు;* గోడు [నె, వ; కర్నూ]
(2) ఉబ్బెత్తు—*రాతికూసంలో గేడితీసేయి* [చి]
(3) నిలువు, నిటారు [అ]
గేడివల = రాత్రిపూట చేపల వేటలో ఉపయోగించే వల; దీనిలో మొయ్యచేపలు పడును [గు-బాపట్ల]
గేడు = రాతి కూచములో ఉబ్బెత్తుగా తీసినది; గేడి [చి]
గేతు = మిడత [వి]
గేరా = గిరజాలు [వి]
గేరకాళ్లు = పొట్టేలు, మేక, వీటి మోకాళ్ల క్రిందిభాగము; వీటలో చేసినకూర పథ్యకారి, రుచికరము [నె]
గేరావేయు = గిరివేయు; చుట్టు ముట్టడించు (ఇప్పటి గెరావ్) [కరీ]
గేరి = (1) మూర్ఛ — *నాకు గేరివచ్చెను* [కరీ]
(2) వీది; సందు [మః కర్నూ; అః బ]

# గై



గైరంగము＝(1) ఉమ్మకాపు
(2) చెట్ల రెండవకాపు [చి; క]
(3) కారుపంట [చి]
(4) అకాలము [తె]

గైరంగామీ＝అనావృష్టి [కరీ]

గైరు＝మిన్నయైనది [ప-కృ]

# గొం



గొంగడిబామళ్లు＝గొల్లలు [కరీ]

గొంచి＝తరిభూమి భాగము. మాగాణి [అ]

గొంచికాడు＝(1) ఉమ్మడిసేద్యమున నాయకుడు;
(2) పిన్నలోపెద్ద [అ]
(3) కమ్మ భూస్వామి [అ]

గొంచిసేద్యము＝ఉమ్మడిసేద్యము [అ]

గొంటు＝లావైనమొద్దు వక్క × సిగిరపు వక్క (పీటివక్క) [నె; కర్నూ; అ; తె]

గొండ＝కోయకొండజాతి [కరీ]

గొండాలు ＝ లేతటెంకాయలు; ఎడనీరు కాయలు; ఎడకాయలు [శ్రీ]

గొండెము＝గొళ్ళెము; తలుపు చిలుకు [శ్రీ]

గొండ్లెము＝గొళ్లెము [వ]

గొంతుకోయు＝పాడుజేయు—*దానిగొంతు గోయడ మెందుకురా* [తె; నె]

గొంతుకూర్చుండు＝(1) భూమికి ముడ్డి ఆనించక పాదాలపై కూర్చుండుట
(1) ఎంతకష్టము వచ్చినా చెదరకుండుట [మ]
(2) వ్యర్థప్రయత్నము గలవాడగుట—ఆయన *గొంతుకూర్చున్నాడు* [నె]

గొంతెమ్మ＝నిష్ఫచ్ఛరము; శూన్యము.

గొంతెమ్మలు＝సంక్రాంతి (భోగి) పండుగలలో ఆవుపేడతో ముద్దలుజేసి, దానిపై గరిగపెట్టి పసుపుకుంకుమబొట్లు పెట్టి, ముగ్గు మధ్య పెట్టి, నవధాన్యాలు, రేగుపండ్లు, జీడిపండ్లు పెట్టి, ప్రతి గడపపైన రెండు వైపుల రెండు వాకిట్లో చల్లుదురు. ఆ ముద్దకు గొంతెమ్మలు అనిపేరు [మ]

గొంది＝(1) వెలుతురులేని ఇంటిగది — *గొందిగది* [అ]
(2) సన్నటి ఇరుకైనది వీధి — *సందు గొందులు* [నె]

గొగ్గు＝(1) వంకర టింకర — *గొగ్గపండ్లవాడు* [కరీ]
(2) కొస్పేటి (కూచియైన) మొనలు తేలియున్న నేల [కరీ]

గొగ్గులు＝గడ్డలు—*రేగడగొగ్గులు;* గెగ్గెలు [కరీ]

గొజ్జటుకులు＝చింతపులుసు వేసి, నానిన తర్వాత తిరుగుపోతవేసిన అటుకులు [అ]

గొజ్జుపులుసు ＝ పచ్చిపులుసులో సువ్వలు, బెల్లం, ఉల్లిపాయ, వంకాయ కాల్చివేసి చిక్కగాచేసిన పులుసు [మ]

గొటిక = పరాణి మొదలగువాటిలో గట్టి గొంటు గింజ; గొటికకాయ; గొటుకు— అన్ని *గొటికలె* [నె]

గొటికి = చెట్టు ఎదుగకుండుట; గిటక [అ-పె]

గొటుకు = కరినమైన; గొటిక [కరీ]

గొట్టికాయలు = (1) గట్టి ముడికాయలు — *పటానాలలో గొట్టికాయలు నిలిచినవి* [నె]

(2) గోలీలు [వి]

గొట్టిగడ్డ = చెరువులలో గొట్టు కాలములో దొరకు తృణమూలములు, కరువుకాలము లందు ప్రజలు త్రవ్వి తిందురు; గిట్టిగడ్డ [చి]

గొట్టిపండు = పండిన చిన్నపాటి చింత కాయలు [వ]

గొట్టు = (1) నీటికరవు: వరపు [నె]

(2) డబ్బుకు ఇబ్బంది—*గొట్టు తగిలింది* [నె; అ]

(3) కఠినము, క్లిష్టము — *ఈ పద్యం గొట్టుగా ఉంది* [వ]

(4) అర్థము లేని ప్రసంగము — *వాడు గొట్టు మాటలాడును* [గో]

(5) తాలింపుదాకలో మిరపకాయముక్కలు ఎక్కువగా వేగితే దగ్గువచ్చే వాసనపొగ [గో]

గొడిసె = (1) చింత మొదలగువాని పెద్ద కాయ; గొరిసె [చి; వ]

(2) పశువుల తోకచివరన, కొమ్ములోపల తగులు జబ్బు [నె-పొ]

(3) పశువుల కాలిగిట్ట; గొరిసె [నె; వ]

(4) తలుపుకు గొళ్లెము తగిలించుటకై చేసిన ఇనుప ఊచ [గో]

గొడుగుకట్టు = (చూ) గొడుగెత్తు [అ]

గొడుగులేచు = (చూ) గొడుగెత్తు [కర్నూ]

గొడుగుసుడి = ఎద్దుమూపురం క్రింద ఉండు సుడి, శ్రేష్ఠము [చి]

గొడుగెత్తు = మజ్జిగ పొంగినట్లు పైకిఉబ్బుట. ఇది బూజువాసనతో వాడుకకు పనికిరాదు; గొడుగులేచు; గొడుగుకట్టు [కర్నూ;అ]

గొడుసులు = మొదలైన — అన్నంగొడు సులు; కొడుసులు [నె]

గొడ్డ = (1) తొడలలో ఉబ్బెత్తుగా లేచిన ఎఱ్ఱటిగడ్డ, బిళ్ల

(2) సనికలు రాయివంటి రాయి [శ్రీ]

గొడ్డు = కేవలము; ఒట్టి—*గొడ్డుకారం* [వ; నె; సర్కా; అ]

గొడ్డుపులుసు = పప్పువేయకుండా కాచిన పులుసు × కొళంబు. పప్పువేసిన పులుసు, దప్పళము; సాంబారు [అ]

గొడ్డెలుగు = ఎలుగుబంటి [కరీ]

గొత్తు = (1) పశువుల కట్టివేయు కొయ్య మేకు; గూటము [నే]

(2) గుత్తి; గెల [చి]

(3) గుర్తు, జ్ఞాపకము—*నాకు గొత్తులేదు* [అ; ఖ; వి; శ్రీ]

గొప్పలు = దాంభికములు [తె]

గొప్పులు = మడిలో పనికిరాని మొక్కలను ఊడబెరికినప్పుడు ఏర్పడు చిన్నగుంటలు [శ్రీ]

గొబ = (1) చీకటిల్లు

(2) హీనపరచి మాట్లాడునప్పుడు ఇల్లు అనుటకు ఉపయోగించు మాట—*వాడి గొబలో అడుగుపెట్టను* [నె]

గొబ్బ = కల్లులొట్టి [కరీ]

గొబ్బకోమటి = కోమటిజాతిలో నొక విశేషము [కరీ]

గొయ్యాపండు = తెల్ల జామపండు;కొయ్యా పండు; జామిపండు [చి]

గొరక = (1) బల్లెము; బరిశ — *కొరకతో పొడిచినాడు* [కర్నూ]

(2) చీపురు [గు]

గొరకలు=మాగాణిలో దొరకు చిన్నచేపలు [ఉ.గో]

గొరమాలిన = పనికిమాలిన; ఉపయోగము లేని—*అది గొరమాలినపని*; కొరమాలిన [నె, అ; గో; తె]

గొరవయ్య= (1) శైవభక్తుడు [అ]

(2) గురువులు [అ]

(3) ఒకానొక యాచకుడు. గొంగడి చొక్కా, మేకతోలు కిరీటము, నుదుట విభూతి, లేక కుంకుమరేఖలు, నిడుపాటి మీసాలు, ఒకచేతిలో పెద్ద డమరుకము, ఇంకొకచేతిలో పిల్లనగ్రోవి, చంకనజోలె — *ఇది ఇతని వేషము*: పిల్లనగ్రోవి ఊదుచు డమరుకాన్ని వాయించుచు విచిత్రముగా నాట్యము చేయును. వీరు ఇద్దరు, ముగ్గురుగాను కలసి జట్టుగా వత్తురు. ఒక్కొక్కసారి పిల్లకాయలు వీరిని చూచి జడుచుకొందురు. "*గొరవయ్యవచ్చె*" అంటేచాలు పిల్లలు భయపడుదురు; గెరవయ్య [అ; బ]

గొరిజ=(1) ఎద్దులకొమ్ములకొనన బిగించు లోహపు కుప్పె; కుప్పె

(2) విత్తులజల్లుట కుపయోగించు సాధనము [కృ; గు]

గొరిమి=(చూ) గొలిమిడి [అ]

గొరిశ=చీపురు [వి]

గొరిస గొరిసి=ప్రాణంపోక బాధలు పడిపడి [చి]

గొర్కొయ్యెలు ఏసేటి యాళ్ల =తెల్లవారు జాము; ఈ చుక్కలు పొడిచే సమయము ప్రయాణమునకు పనులకు అనుకూలము [మ]

గొఱ్ఱు=మూడు ఎకరముల సేద్యపు పొలము —*అయనకు పదిగొఱ్ఱులు భూమిఉన్నది* [నె; గు; తె; అ]

గొఱ్ఱుపట్టినది=చినిగినది [అ]

గొఱ్ఱచెలి = చెవివెనుక పుట్టు కురుపు [వి]

గొల=(చూ) గెల [నె; అ; సే]

గొలఉట్టు=యువకునికి యౌవనప్రాదుర్భావమగు [నె]

గొలక=(1) మేయగా మిగిలిన కసువు.

(2) గుత్తి [తె]

గొలిక=గొలుసు [కరీ]

గొలిమిడి=చేలలో మొలచు ముండ్లచెట్టు; ఈముల్లు గుచ్చుకొనిన నొప్పితోగూడిన నవ ఏర్పడును; గొరిమిడి [నె; అ; క]

గొలుక=చేరిక, పంక్తి, పేరు—*ముత్యాల గొలుక*; గొలిక [కరీ]

గొలుసు=(1) ఇసుక; దీపావళి వ్రతములలో నోముకుందకు క్రిందపోయినది—*గొలుసు పోయి* [వ]

(2) వరి మొదలగు పైరుల వెన్ను, కంకి [కరీ]

గొలుసుకట్టు=తెంపులేకుండ వ్రాసిన వ్రాత [తె; నె]

గొలుసువ్రాత=జిలుగువ్రాత; గొలుసుకట్టు వ్రాత [నె; కర్నూ; తె; అ; గో; అ]

గొల్లబామ = మిడుతవంటి ఒక పురుగు; గొల్లభామ [తె; నె]

గొల్లబుద్ధి=మూర్ఖత్వము [వి]

గొల్లసుద్దులు = మూర్ఖభాషణములు [కరీ]

గొళ్లెము=(1) గొలుసుకు అమర్చిన తలుపు చిలుకు; నాగవాసము — *గొళ్లెముపెట్టు* [నె; కర్నూ; అ]

(2) నాగవాసమునకు (చిలుకు) తగిలించు ఇనుప వలయము [నె.పొ; తె]

గోంద్రకప్ప = గోదురుకప్ప; పెద్దకప్ప, వర్షమునకై ఈ కప్పను ఊరేగింతురు [చి]
గోందు = బంక (హిందీ) [నె; తె]
గోకరకాయ = (చూ) గోకిరికాయ; గోరు చిక్కుడు
గోకలు = (1) కొంగలు — *వరి మొలకను గోకలు త్రొక్కినవి* [చె]
(2) పెంపుడు బాతులు [కరీ]
గోకిరికాయ = (1) గోరుచిక్కుడు [నె]
(2) గోకరకాయ [హై; వ]
(3) శ్రీరామచిక్కుడు
(4) మటికకాయ [రా, నె- మెట్ట]
(5) మొటికికాయ
(6) చేమలేకాయ [అ]
(7) చౌళేకాయ [అ]
(8) గోరీకాయ [కర్నూ-పరమడ]
(9) చౌదేకాయ [అ]
గోకుడు = గజ్జి—*నాకు మెయినిండా గోకుడు పుట్టినది* [కరీ]
గోకర్ణము = చారు మొదలగునవి వడ్డించుటకు లోతు, పొడవు ముక్కు, పట్టుకొనుటకు ఉగ్గము (Handle) వంటి పైకాడ గలిగిన పాత్ర [నె; గు, తె; అ]
గోగాకు = గోంగూర [నె; కర్నూ; అ]
గోచిపాతలరాయుడు = నిరుపేద [నె]
గోజాడు = (1) బాధపడు [తె]
(2) దేబిరించు [అ]
గోజు = విసుగెత్తించు—*అది గోజుపని* [తె]
గోజారు = (1) పలుమారు దేబిరించి అడుగు [నె, అ; తె]
(2) గోసరిల్లు; గోజాడు [వ]
గోటు = (1) వనభోజనము; విందు (పదిమంది కలిసివెళ్లి అక్కడేవంటి భుజించుట)—*గోటుపోయినారు; గోటుచేసినారు* [చి; నె]
(2) మాంసముతోకూడిన వనభోజనము
(3) పానగోష్ఠి — *తెల్లవార్లు గోటులో ఉండినారు* [చె; నె]
(4) బడాయి [గు]
(5) గర్వము [వి]
(6) గుడ్డలకు కుట్టిన అంచు — *గోటు రవిక* [నె]
గోటులు = మూడేసి వలయములు కలిగిన వెండికడియాలు [శ్రీ]
గోటువాయిద్యము = వీణెలో భేదము. తీగెలను ఏడమచేతి వ్రేళ్లతోగాక, ఒక గుండ్రని కొయ్యతునకతో రాయుదురు; రుద్రవీణ
గోడంబి = ముంతమామిడిపప్పు; జీడిపప్పు [అ]
గోడంబీ = వేయించని (పచ్చి) ముంతమామిడి పప్పు. పచ్చి జీడిపప్పు
గోడకి కొట్టానికి తగులకుండా = విషయము అంటీ అంటకుండ మాట్లాడు; ఆకుకు అందక, పోకకు పొందక [నె; అ]
గోడకాలు = గోడలు కట్టుటకుగా భూమిలో తీయు పొడవు గుంటలు—*గోడకాళ్లు తీసినారు; (త్రవ్వినారు)* కడకాలు [నె]
గోడలు = గోవులు [కరీ]
గోడలుదూకు (దాటు) = ప్రియునికొరకు అభిసరించిపోవు; వ్యభిచరించు [నె]
గోడదొమ్మ = జంతువులలో గుండెప్రక్కనుండు అవయవము; దూదిగుండె [చి]
గోడాడు = (1) తలుచుకొని తలచుకొని ఏడ్చు [మ]

(2) గోలుగోలున ఏడ్చు [అ]
గోడు=(1) కొయ్య మొదలగు వాటి ఎత్తు వైపు—*రాతిని గోడుగాపెట్టు*; గేడి [కృ]
(2) గొప్ప [శ్రీ]
(3) బాధ [తె; నె]
గోదాము=ధాన్యపుకొఠా; గోడౌన్ [కరీ]
గోనుగోజు=బంక [గు]
గోనె=(1) సరకుతోనింపిన గోతాము; లేక మూట [చి]
(2) కాశీబస్తా
గోపి=గొల్లభామ
గోపిపువ్వు=కాలిఫ్లవర్; ముట్ట కోసుకూర
గోపురము=ఎద్దు వీపుమీద ఉండు మూపురము; చెండు [అ]
గోబీ=క్యాబేజికూర [కరీ]
గోమారి = పశువులకు వట్టు గుడ్డు పురుగు [నె; కర్నూ; అ; తె]
గోము=(1) పొగరు—*వాడికి బాగా గోము పట్టింది* [నె; కర్నూ]
(2) బులిబుజ్జికము — *వాడు గోముతో చెడినాడు* [నె; ఆత్మ; తె; అ]
(3) గుట్టు [కరీ]
గోయిందగొట్టు=(1) మృతినిపొందు [మ]
(2) వ్యర్థమైపోవు, దొంగిలింపబడు [నె]
గోర=చెంబు, ముంత; కోర [అ]
గోరంచు = (1) కట్టు పంచలకు నేసిన సన్నటి రంగుఅంచు — *గోరంచు పంచ* [నె; కర్నూ; సర్కా; తె]
(2) ఎఱ్ఱని సన్నఅంచు [చి]
గోరచెక్క=నేలలో, మిట్ట పల్లములను చదునుచేయు పలక [చె]
గోరాము=వ్యాధితో నసబెట్టు— *గోరాము వెళ్లబోస్తున్నాడు* [నె-మెట్ట]
గోరించు = వ్యాధివలన నస వెళ్లబోయు; గోరాము చేయు [నె]
గోరికాయ=గోరుచిక్కుడు [కర్నూ - పరమడ]
గోరు=తమలపాకుల కత్తిరించు ఇనుపవ్రేలి కొడువు [చి]
గోరుకల్లు=ముల్లుదీయు ఇనుప ఉబ్బనము; గోరుకాలు [నె]
గోరుకాలు=(చూ) గోరుకల్లు [అ; నె]
గోరుగల్లు=ముల్లుదీయు లావుసూది; గోరు కల్లు [కర్నూ; అ; నె; వ]
గోరుగాలము = ముల్లుదీయు లావు ఇనుప సూది వంటిది; గోరుకాలు [చి]
గోరుగోలు=(1) (మంగలి) గోళ్లను దీయు పనిముట్టు
(2) (చూ) గోరుకల్లు [అ]
గోరుచిక్కుడు=(శ్రీ)రామచిక్కుడు; గోకిరి కాయ; మటికకాయ; చౌళేకాయ; గోరీకాయ [నె]
గోరు ముద్ద=చిన్నపిల్లలకు కథలు చెబుతూ అన్నము చిన్న చిన్న ముదలుగా బొటన వ్రేలు గోరుతో ఎత్తి నోటి కందించు ముద్ద [చి]
గోర్జి=సందు, మార్గము [ఉ-వి]
గోలిముట్టు=పూరిల్లు పై భాగము చివరన కట్టిన రెట్టగోడ [నె; వి]
గోలుట=తపించుట [కరీ]
గోలె=నుండి; అది మొదలు — *జ్వరము వచ్చింది గోలె బిడ్డడు కోల్కొన లేదు* [కరీ]
గోలెము=(1) మూతి వెడల్పు అయిన తొట్టి [శ్రీ]
(2) కుడితి తొట్టి [కరీ]
గోవ=(1) బెదురుపశువు; కనుపిరికి ఆవు— *అది గోవ ఆవు* [నె]
(2) ఇండ్లు మేడలు కట్టునప్పుడు పని వారు పైకి ఎక్కి కూర్చొనుటకు, నడచుటకు ఉపయోగపడునట్లు అమర్చిన వెదురు

చత్రం; సారవ (Scaffolding) [వ; కరీ]

(3) దినదినాభివృద్ధి [ప-గో]

గోవతాడు=పిల్లల మొలకుబెట్టు ఆభరణము [గు]

గోవురాయి=పశువులు ఒంటిని రాచుకొనుటకు నాటిన నిలువు బండ; పల్లె పొలిమేర లోపల అక్కడక్కడ పుణ్యాత్ములీ రాతిబండ్లను నాటింతురు [చి]

గోవుగ పెరుగు = (1) బాగా గట్టిగ పెరుగు [వ]

గోస=గొప్పతనము [కరీ]

గోసంగి=(1) పసికిమాలినవాడు

(2) మాలలో ఒక తెగ [నె]

(3) మాదిగలను యాచించు ఒక జాతి వాడు [గో]

(4) సన్న్యాసి; మాలసన్న్యాసి [అ]

గోసరిల్లు=దుఃఖించు [కరీ]

గోసాయి=బైరాగి; గోషాయి [అ; నె]

గోసాయిచిట్కా=పెద్దవ్యాధికి చిన్న మూలికతో త్వరలో పోగొట్టు ప్రక్రియ; గోషాయిచిట్కా; పరమౌషిక్రియ [అ;నె]

గోసిరము=గొప్పజేసి చెప్పుట [మ]

గోసు=కోసు; క్యాబేజి [నె; అ]

గోళించు=(1) నూనెలో వేయించు [అ]

(2) తాళింపు; వేపుడుచేయు

## గౌ



గౌచన=దిండుగుడ్డ; గవుచెన [నె; అ]

గౌడిబఱ్ఱె=(1) పొట్టికొమ్ముల ఎనుము [నె-మెట్ట]

(2) పెద్దజాతి బఱ్ఱె [తె]

గౌడు=గౌండ్లవాడు, ఈడిగవాడు [కరీ]

గౌత్తి=పనివాడు, సంవత్సర జీతమునకు పనిచేయు సేవకుడు; నిత్యసేవ [గు]

గౌర=నూనె మొదలగు ద్రవద్రవ్యములు పోయు సాధనము [కం]

గౌరిపున్నవ= కార్తీక పౌర్ణమ, నోముల పున్నమ

గౌరమ్మ = పసుపుతో నిర్మించు గౌరిదేవి ప్రతిమాచిహ్నము [కరీ]

గౌశనగుడ్డ = దిండు, పరుపు ముసుకుగుడ్డ; గౌచన [నె, కని]

గౌసుబోవు=(1) పైరు ఎదిగినను పంట తగ్గిపోవు — *ఈ యేడు పైరు గౌసు బోయింది* [నె-కోవూరు పరమట]

(2) వరి గొలుసు (వెన్ను) పాలుబట్టక చెడుట [కరీ]

గౌసెన=ఒక వస్తువుకు పైన తొడుగుగుడ్డ; ముసుగు గుడ్డ; — *తంబూర గౌసెన* [వ, అ]

గౌళిగేదె=(చూ) గౌడిబఱ్ఱె [గు]

గౌళివాడు = గోవులను పెంచి పాల నమ్ము వాడు [అ]

గ్రంథం=వ్యవహారము—*దానికి ఒక పెద్ద గ్రంథ మున్నదిలే;* [తూ-గో; గు;నె]

గ్రంథం పొంగుడు=అన్ని అవలక్షణముల లోను ఆరితేరినవాడు (వ్యంగ్యము) [గో]

(2) అన్నివిధాలా సమర్థుడైన వ్యవహర్త [గు]

# ఘా



ఘాటీలు=(మా) గాటాలు [వ]

# చ—చే



చేంకచేయు = ఈనబోవు పశువు పొదుగు చేయు [నె; అ-పె]

చేంకపట్టెలు=బండి పై చట్టములో ఇనుసు పై అడ్డనుండి కోణాంకారముగ దిగించిన కొయ్యలు; దీనిమీదనే వరములు బిగింతురు [నె]

చేంకపాప = ఎత్తుకొనదగిన చిన్నిపాప [కరీ]

చేంకబాటు=బిడ్డా పాప గలుగుట [కరీ]

చేంకసన్నము=(1) బక్కప్రాణి (2) పేదవ్యక్తి [కరీ]

చేంగోబిళ్ల = చెప్పక చేయక పసిగెత్తుపోవుట [కరీ]

చేంచేకరువు=బయానా; Advance; చేంచేకారము [నె] సంచేకరువు; సంచేకారము [కర్నూ; వ, నె]

చేంచేకారము=బయాన [నె]

చేంటితనము=శైశవము [కరీ]

చేంటిపాప=చంటిబిడ్డ [వ]

చేంటిబిడ్డ=చనుబాలు త్రాగుచున్న పసిబిడ్డ [నె; కర్నూ. అ; తె]

చేంటోడు=(1) స్తనములుగల పురుషుడు; (ఎగతాళికి అనుమాట) [నె-పొ] (2) పసిబిడ్డ [నె]

చండరబండర = ఎంపేమిందో [కరీ]

చండివాళము=నష్టము [అ]

చండాలము=చేసిన అపరాధములకు అపరాధముగా నిచ్చు డబ్బు [నె]

చేందప్ప=చేందమామ [కరీ]

చేందమామ = (1) తాటితేగ నడుమనుండు మెత్తటి మోము; తాటిముజ్జ [నె; అ] (2) కోడిగ్రుడ్డులోనుండు పచ్చని వన్నె ముద్ద [చి; వ]

చేందవ=చిన్నదిగా, గబ్బిలపు రెక్కలు విప్పినట్లుండు సముద్రపు చేప, ఎండబెట్టుటకుకూడ పనికివచ్చును. (Bat Fish [నె, శ్రీ]

చేందా=గుల్లగ (లోపల బోలుగా) వెడల్పుగా నుండు వెండి చేతికడియము [శ్రీ]

చేందుగుపెట్టె=చిన్నపెట్టె [శ్రీ]

చంద్రవంక=(1)చెరకు గానుగలోని పైవలయము [చి] (2) స్త్రీల శిరోభూషణము [నె]

చేంపివేళ=(మా) బిడ్డపాలవేళ [అ]

చకడా=తెలివితేటలుగల వ్యక్తి [కరీ]

చకలు=ఎగతాళి పడుటలు; పరిహాసములు; చాత్రీలు;—చకలు పడినారు [నె]

చకణ్ణాలు=చాత్రీలు; చకలు; చకండాలు ఎగసికములు; పరిహాసములు—అబ్బ చకణ్ణాలు పడుతున్నాడే! [నె-అ; పె]

చకిలము మకిలము=పద్మాసనము; భోజనమునకు కూర్చుండు పద్ధతి, ఇందులో పాదాలు క్రిందికి ఉండగా పద్మాసనంలో పైకిఉంచును [వ; కరీ]

చకోరపక్షి=(వ్యంగ్యముగా) ఎదురుచూపుల మనిషి [కరీ]

చకోత్రపండ్లు=పంపరపనసపండ్లు [చి]

చక్కండాలు=(మా) చకణ్ణాలు [అ-పె]

చక్కణాలు=పొంకపుమాటలు [తె]

చక్కా=(1) చక్కగా, నేరుగా, తిన్నగా. —అదారిన చక్కాపో

(2) సక్రమముగా [నె; చి; తెల]

(3) ఉన్నట్లుండి — చక్కా లేచిపోయి నాడు [నె]

చక్కి=(1) మంచమునకు నేయు నవారు

(2) ఎఱ్ఱగా మెత్తటి గడ్డలగట్టి ఉండు చక్కెర [శ్రీ]

(3) తూగుటూయల మంచపు చట్రము లేదా, నవారు అల్లినచట్రము [వ]

చక్కిలము=మణుబూపంటి తినుబండారము; దీనిని చేతితో మెల్లిగా, గుండ్రముగాత్రిప్పి చేసి కాల్చెదరు, చక్కిలాలు [నె; కర్నూ; తె]

చక్కిలము=ముచ్చార్ల పీట [అ]

చక్కు=తరిగిన చిద్రుపలు; తురుముడు [కరీ]

చక్కెర=పంచదార [నె; చి; రాయ; వ]

చగుడు=అనపకాయ నూగు [అ]

చచ్చదును=సమపాళము; Square; చచ్చౌకము [కరీ; నె]

చచ్చు=(1) అంగములు దుర్బలములై పోవు వ్యాధి—కాళ్లకు చచ్చువచ్చింది

(2) ఉత్సాహరాహిత్యము — వాడు వట్టి చచ్చుమనిషి [నె; కర్నూ; వ; అ]

చచ్చుబడు=చెట్టు ఎండనారంభించు [చి]

చటాయింపు = అసహ్యముతో కూడిన కోపము; రోత; విసుగు [అ; బ]

చటాకారి=(1) మోసము చేయువాడు,

(2) ఆంగ్లోయిండియన్ [నె; శ్రీ]

(3) మర్యాదలేని మనిషి; సటాకారివాడు [నె-పా]

చట్టు=(1) తమలపాకులు మట్ట పరచునపుడు ఒకచేత ఇమడగలిగిని ఆకులపేర్పు. ఇందు సాధారణంగా నూరుఆకులుండును [నె-ఆత్మ]

(2) విత్తులు పట్టని కాయ [కరీ]

చట్టున=(1)చప్పున [వ]

(2) అకస్మాత్తుగ [నె]

(3) చాపల్యముగ [తె]

చట్టుబండ=(మా) చట్టుబండలు [అ]

చట్టము=(1) నలువైపుల పట్టెలతో బిగించినది—(Frame) చట్రము [నె, కర్నూ]

(2) అంగసౌష్టవము — ఆమె చాల చట్టమైన మనిషి

(3) అందమైన [నె]

(4) రీతి, విధము—ఆయనదంతా దొర చట్టము [నె; కర్నూ; అ]

(5) వంశరీతి; చాలు

(6) గుమ్మలక్రింద పేర్చు కఱ్ఱచట్టము [కరీ]

(7) చక్కి [వ]

చట్టుమెత్తు = దూలాలు, మొగురాలు నిలవేయు [కరీ]

చేట్టాంబిళ్ల = బడిపెద్ద [చి]

చేట్టా = ఒకరకపు వ్యాపారము [కరీ]

చేట్టి = (1) మూతివెడల్పుగలిగిన చిన్నమట్టి పాత్ర; దీనిని కూరలు చేయుటకు ఉపయోగింతురు [నె; కర్నూ; అ; తె]
(2) అణగిన; చప్పిడి—చటీముక్క [అ]

చేట్టు = (1) మొత్తసమైన సిరి (సంపదలు)
(2) మూలధనము [కరీ]

చేట్టుబండలు = వ్యర్థము — నీ చదువంతా చేట్టుబండలైంది [నె, కర్నూ; తె]

చేత్ర = (1) చెరువులో నీరు వ్యాపించుమేర; చద [నె]
(2) నీటి మునుక నేల [అ]

చేత్రము = బండిచక్రమునకు మధ్యగాను, ఇరుసు నిలబడుటకు ఆధారమైనది; చట్టము; Frame [కృ]

చత్రాన్ = విల్లలగరిటె [శ్రీ]

చడావు = ఎగుగడ్డ, మిట; ఎక్కుడు [కరీ]

చేడీచప్పుడులేదు = నిశ్శబ్దము [వి; నె]

చడ్డీ = నిక్కరు [నె, సే]

చేతుకు = అణగిపోవు; చేదుకు [కరీ]

చేత్తూరి = ఎముకలు గొట్టుట కుపయోగించు కత్తి (చురకత్తి కంటె లావైనది) — చూరుకత్తి, సత్తూరికత్తి [అ-పె]

చద = (1) చెరువు గుంట మొదలగు జలాశయములలో నీరు వ్యాపించు అంచు; చేత్ర
(2) రాత్రులందు ఆకాశములో కనుపించు క్రింది దీపములకాంతి వ్యాపకము; కావురు [నె]

చేదర = (1) చచ్చౌకము [తె]
(2) నలుచదరము గలిగిన చిన్న తాటి ఆకు చాప, పల్లెకూటములో విద్యార్థులు వాడునది [నె]

చేదరకట్టు = మిట్టపల్లములు లేకుండా సమతలముగా నుండునది—చేదరకట్టువేల; సదాటం, చేదును [కర్నూ; నె]

చేదరము = (1) నాలుగుతట్టులా సమానమైన కొలతగలది—Square [నె; వ; అ]
(2) సమతలము—చేదరమైనచోటు
(3) సక్రమము — చేదరంగా నడుచుకో [నె]

చేదికిలబడు = స్ఫోటకము పోసిన పొక్కులు తగ్గుట × పొంగు — పెద్దమ్మవారు తొమ్మిది దినాలు పొంగి తరువాత చదికిలబడును [నె-పొ]

చేదుకు = అణగిపోవు; చేతుకు [కరీ]

చేదుకము = శృంగాటికము; నాలుగు వీదులు కలియుచోటు; కూడలి [అ]

చేదును = (చూ) చేదరకట్టు [కర్నూ; నె; తె]

చేదుమలగొట్టు = బీటిలో గడ్డి బాగుగ ఎదుగుటకు పశువులు అందు తిరుగాడకుండ చేయు; మలదోలు; చేదుమలతోలు [నె]

చేదురు = (1) లోగిలి [అ]
(2) పెండ్లిసమయములలో జరుపు నాట్య ప్రదర్శనము — సంధ్యారేవులో చేదురు జరుగుతున్నది [నె]

చేద్ది = పులిహోర [వి]

చేద్దికూటిబిగువు = చద్దన్నం తిన్నతర్వాత మధ్యాహ్నం వఱకు పనిచేయగల్గు బలము, శక్తి [నె]

చద్దివాసన = వండిన పదార్థములు పాచిపోయినప్పుడు కొట్టు వాసన—సద్దికంపు [నె; తె; అ]

చనుపవాడు = గోనెసంచులు కుట్టువాడు; సాతువాడు [చి]

చన్నుకుదురు = చన్నుపై లేచు గుల్ల (పుండు)

చపటా = నీరుజారుటకు చేసిన ఏటవాలు; చప్పట [చి]

చపాయించు = దొంగిలించు [వి]

చప్ప = మేక, గొఱ్ఱెయొక్క కోసిన ముంగటి జబ్బ [కరీ]

చప్పట = మిద్దెలాదిన తర్వాత (సన్నటి రాయితో కప్పుమూసిన తర్వాత) పైన నీరు కారిపోవుటకు వేయు వాటము; చప్టా [నె]

చప్పడి = వెడల్పును పొడుపును గలిగిన రాతి పలక [సే]

చప్పరం = పందిరి—పూచప్పరం [సే]

చప్పరుమంచము = దోమతెర మంచము [కరీ]

చప్టా = (చూ) చప్పట [అ]

చప్పాంకాలు = పద్మాసనము [చి]

చప్పిడి = ముక్కుదూలము అణగియుండుట —చప్పిడిముక్కు [నె; కర్నూ; తె; అ]

చబూత్రా = తిన్నె; అరుగు; గద్దె [కరీ]

చమను = (1) సదును; చదును; పమతలము. (2) దుక్కి ఎక్కువ అయినందున ఏర్పడు చలువ—చమను చలువ బాగున్నది [నె; ఆత్మకూరు]

చమురు కాళ్ల పెద్దమ్మ = ఏమిచ్చినా దరిద్రం తీరనివాడు [గు]

చరచు = (1) మొక్కబోయిన కత్తి మొదలగు వాటి వాదరను కాచి సరిజేసి, పదనెక్కించు — కత్తి చరిపించు; సరచు [నె; అ; ప; తె]
(2) గట్టిగాకొట్టి—వీపున చరచినా [అ; నె]

చరపట్టె = చిన్నఅటుక [చి]

చరి = బంక [అ]

చరుగుడు = (1) రాళ్లు మొదలగువాటిని లాగుటకు ఉపయోగించు నలుచదరపు మొద్దు కొయ్యచట్టము; సరవడి
(2) బందెడు గడ్డి [నె మెట్ట; తె]

చర్కిపంచదార = ఆస్కాపంచదార [వి; శ్రీ]

చర్ణా = రివాల్వరులోని (లేక) చక్రాలలోగాని సీసపుగుండు, Ball [కరీ]

చలంపారు = చిందరవందర; గజిబిజీ — *ఇంట్లోసామానంతా చలంపారుగా పడి ఉన్నది* [నె-ఆత్మకూరు]

చలకము = వంశముతీరు — *వాళ్ల చలక మట్టిది*; ఆణెము; చాలు [కరీ]

చలకోల = కొరడా [నె-కనిగిరి; ప; అ; తె]

చలచల్లయగు = అంతట ప్రచురమగు [కరీ]

చలప పైరుపట్టక కయ్యలో ఏర్పడిన తెఱ్ఱ —*పైరు చలప పోయినది; చలపవేయి* [నె]

చలవ = ప్రమిదక్రిందనుంచు పేడముద్ద [చి]

చలాకీ = చురుకైన—*చలాకీపిల్లవాడు* [నె]

చలాకు = బంగారమును కత్తిచేయు [వి]

చలికిపార = (చూ) దోకుడుపార [అ]

(2) గడ్డిచెక్కుట కుపయోగించు పార [అ-పె]

చలిదీరు=ఉన్న సంకోచముగాని భయపు గాని తీరిపోవు—దానితో వాడికి చలిదీరి పోయింది [నె; అ; తె]

చలిపిండి = బెల్లముకలిపిన పచ్చిఎయ్యపు పిండిముద్ద—చలిబిండి పానకాలు; చలి బిండి, చలిమిడి [నె; కర్నూ; అ, తె]

చలిపిడుగు=చాలా గట్టివాడు [గు]

చలి పుతక నేల=నెమ్మ ఆలస్యముగా ఆరు పొలము, ఒగినేల—చలిపుతకనేం ఉల పకు మంచిది (నె-మెట్ట)

చలిపూట=మంచువేళ [కరీ]

చలిమిడి=చలిబిండి

చలివింద్ర=చలివేంద్ర [నె]

చలివేందిరి=చలివేంద్ర [అ]

చలివేంద్ర=ఎండాకాలము బాటసారులకు. మంచినీళ్లు యిచ్చుటకు, మార్గ మధ్యమున నిర్మించిన పూరిపందిలి, చలివిందల, చలి వెందల; చలివేంద్ర; చలివెందిరి; ప్రప

చలుప=బండిచెక్క [కరీ]

చలుపు=చలిపి (తట్టువంటి వ్యాధి) కలిగించు బాధవంటి బాధను కలిగించు [నె]

చలువ=దయ; అభిమానము; వాసి—మీచేతి చలువన బాగుపడినాము [నె; కర్నూ; అ; తె]

చలువపందిలి = తిరునాళ్ల ఉత్సవములో బయలుదేరిన దేవుడు వచ్చి దిగుటకు, పెద్దవారియిండ్ల తలవాకిట, వీదిలో వేయు ఎత్తుపందిలి. దీనికి కలంకారి గుడ్డలతో చాందినీ కట్టి చుట్టు మామిడిఆకుతోరణము లతో అలంకరింతురు. ఇచట దేవుడు దిగగానే, కాసేపు చెదురువేసి, (నట్టువుల నాట్యము) పందేరములు పంచిపెట్టు చుందురు [నె, తె, అ]

చల్లకము=విత్తనములను, మోములెత్తిన మొలకను, దుక్కిచేసిన చేనిలో (కయ్యలో) మొలచి పెద్దవగుటకుగా చల్లుట, బీజావాపము— ఈదినం ఇద్దుం చల్లకమైంది [నె; తె, అ]

చల్లడము=లాగు; చల్లాడము [అ]

చల్లనితల్లి=ఎక్కువ ఘాతచేయని స్ఫోటక వ్యాధి; చల్లనిది [కరీ]

చల్లమిరప=ఉప్పు గలిపిన మజ్జిగలో ఊర బెట్టిన మిరపకాయ; ఉప్పు మిరప [తె]

చల్లాగూడు = గ్రామదేవత కొలుపులకు ముందురోజు గ్రామమంతట అడిగి తెచ్చు మజ్జిగన్నము [నె-పొ]

చల్లాడము=(1) పొడవు లాగు; ప్యాంటు [నె]

(2) నిక్కరు, చల్లడము [అ]

చల్లుగొట్టు=వాన జల్లు నీరు ప్రక్కవాటుగా లోన ప్రవేశించు; చళ్లుగొట్టు, జల్లుగొట్టు, సళ్లుగొట్టు [నె; కర్నూ; తె; అ]

చవకచెట్టు=సరుకుచెట్టు, క్యాషురీన. ఇది ఆస్ట్రేలియా నుండి కొనిరాబడిన చెట్టు. నిట్రముగా పైకి ఎదుగును. దీని కాండ ములు పందిళ్ళకు నిలువులుగను, వరకి వంటచెరుకుగను విశేషముగ వాడుదురు. ఇది మంచి కాకనిచ్చును; సముద్రతీరపు ఇసుకనేలలందు బోదిగాఎదగును; సర్వి; సరుగుడు; సరుగు; సరుదు [నె; చి]

చవణము=కంసాలివారి యొక రకపు పని ముట్టు. దీనితో చిన్న పిసరులను పట్టు దురు; శ్రావణము; Pincer [కరీ]

చవలము = మాడ; మూడు రూపాయల ఎత్తులో సగము—*గొడ్డు చవలము, ఐందె ముప్పలము* [నె]

చవిక = (1) గ్రామ దేవతలను నెలకొల్పిన నలుచదరపు చావిడి, దీనికి చుట్టు గోడ లుండవు; గ్రామ దేవతాలయము; చవికె; రచ్చ—*పోతురాజు చవికె* [నె; తె]

(2) పెండ్లి చవిక [అ]

(3) కొలువు చవిక [వ]

చవికె = (చూ) చవిక [కర్నూ]

చవుకము = తువ్వాలు; తుండుగుడ్డ [చి]

చవుకు = నీట తడిసి మెత్తగిలిపోవుట—*కొయ్య చవికిపోయినది;* జవుకు [కర్నూ]

చవురు = చవుడు [చి]

చవుకులు = (1) చెప్పటివీళ్లు; జవ్వలు

(2) నీళ్ళలో నానిన తోలు మెత్తబడుట; [తె]

చవుశకాయలు = గోరుచిక్కుడుకాయలు, చెవళకాయలు [కర్నూ] (చూ - మనీక కాయలు; గోకిరికాయ

చవ్వాకులు = (1) అంత తీపి, అంత ఉప్పు గాని పిప్ల [గు]

(2) చెవిలో పెట్టుకొను రంగు బూసిన తాటి ఆకు చుట్ట. — *చవ్వాకు పోయి నమ్మకు దుఃఖమూ లేదు, దొరికినమ్మకు సంతోషమూ లేదు.*

(3) నిష్ప్రయోజనమైన వస్తువు [నె]

చవ్వు = చావు—*చవ్వా నివ్వాడు బతకా నివ్వాడు* [వి]

చళ్లకొట్టు = (చూ) చల్లగొట్టు, సల్లగొట్టు [నె; కర్నూ]

## చా—చా



చాందవా = చందవ అను సముద్రపు చేప [కృ; గు]

చాకండాలు = హెచ్చుట, తగ్గుట; శాకండాలు [గు]

చాకిచేయు = పూర్తిచేయు [నె-పొ]

చాగ = కట్టెలోని చేవ; చేవగల కట్టె—*చాగకట్టె* [వ; కరీ]

చాగడ = గ్రామ సాముదాయక ఉపయోగమునకుగా వదలి పెట్టబడిన మంచి పొలము—*అడేరి చాగడా నూరెకరాలు* [నె]

చాగబారు = జవగలిగి, నిగనిగలాడు; ఈ పదమును మనుష్యులకు గూడ ఉపయోగింతురు [వ]

చాగము = త్యాగము [కరీ]

చాగినవాడు = (1) మాట చెల్లినవాడు; సాగినవాడు [నె; అ]

(2) శ్రీమంతుడు [గో]

చాచా = చిన్నాయన [కరీ]

చాచుమడవ = ఒక కయ్యనుండి ఇంకొక కయ్యకు నీరు పారుటకు చేసిన చిన్న గండినుండి, నీరు మెల్లగా దిగుటకు ఏటవాలుగా వేసినగట్టు (మడవ) [నె]

చాచేటు = అశ్రద్ధ; ఉపేక్ష—*అది చాచేటు పని అయినది; చాచేటుగా ఉండినా* [నె]

చాటభారతము = (చూ) చేట భారతము [తె; నె]

చాటవ = (1) నానుడి; సామెత — ఏదో చాటువ చెప్పినట్లు; చాటువ; సాటవ; సాటువ [నె; కర్నూ; అ]
(2) బండి నొగపైన అమర్చినచట్రము— చాటువతోనే లాగినవి [వ]
(3) పోలిక—అయనకూ మాకూ చాటువ చెప్పవలెనా? [గో]

చాటింపు = గ్రామదేవతల జాతర ప్రారంభమును గూర్చి గ్రామములో తుడుమో, తప్పెటో కొట్టి ప్రకటించుట — పోలేరమ్మ జాతరకు చాటింపు అయినది; సాటింపు [నె]
(2) గ్రామాధికారులు చేయించు ప్రకటన [వ]

చాటు = (చూ) చాటింపు—గంగచాటు [చి]

చాటుగా = రహస్యంగా [వి; నె]

చాటువ = (చూ) చాటవ [నె; కర్నూ; వ; అ]

చాటువ = బండి నొగలపైన అమర్చిన చట్టము — చాటువునైన లాగివేస్తవి; సాటువ; చాటవ [వ]

చాడ = చేను దున్నుటకు మొదటి తడవగా నీరుపెట్టుట—చేనుకు చాడ వేసినారు; చేడ [నె]

చాణి = (1) పరిహాసము; చకణ్ణము; చాల్తి— విల్లోడు చాణీలు పడుతున్నాడే: అని పడుచువారి మాట [నె]
(2) జాణతనము [అ]

చాతబడి - (చూ) చేతబడి; శాతబడి [నె]

చాతాని = బోడిదాసరి [కరీ]

చాద = (1) బావినీళ్లు చేదుకొను త్రాడు [తె]
(2) బావినుండి నీరు చేదుకొను చిన్న బిందె వంటి పాత్ర — చాద బావిలో పడింది [నె]

చాదవ = (వ్యంగ్యముగా) చేసినపని అనుట —ఏమి చాదవ చేసినావయ్యా; శాదవ [నె; అ]

చాదానము = (చూ) చాదవ [కర్నూ]

చాదు = (చూ) సాదు [తె; నె]

చాన = ఎక్కువ— చానామంది వచ్చినారు; శాన [నె; చి]

చాపకూడు = కులగోత్రములు లేకుండ కలిసి భుజించు కూడు; దొడ్డికూడు [అ]

చాపటి = బెల్లం కలిపిన లావుదోసె [నె]

చాపు = జత; పంచెల చాపు [చి; వి; నె]

చాపుఊట = బావిలోపలి భాగము అంతటి లోను ధారాళముగ నీరూరుట; మంచిజల

చామనచాయ = లేతనలుపు — చామనచాయ ఒంటివాడు; చాయనలుపు [నె; కర్నూ; తె; అ]

చాయనలుపు = కొంచెము నల్పు, చామనచాయ [కరీ]

చాయపప్పు = దంచిన మినప, పెసల బేడలు [నె]

చాయపసుపు = స్త్రీలు స్నానము చేయునప్పుడు చాది పూసికొను పచ్చి పసపు × కూరపసుపు (ఉడుకుబెట్టినది) [నె; కర్నూ; తె]

చాయమడవ = ఒక మడవకు నేరుగానుంచు మరియొక మడవ (గనిమలో చేసిన గండి) [నె]

చాయమేకు = బండి ఇరుసుకు బయట చివరన వేయు మేకు, కడచీల [గు]

చార = నిలువు గీత [చి]

చార = (1) చేరెడు — చారతో బియ్యాము పెట్టినారు [కరీ; నె]

(2) గీత [కరీ]

చారపప్పు = ఒక అడవితీగ చెట్టుకు కాసిన గట్టి చిన్నకాయలలో గల మెత్తటి పప్పు. దీనిని తినుబండారములలోను, వక్కపొడి లోను కలుపుదురు; సారపప్పు [నె; తె; అ]

(2) చాయపప్పు [గో]

చాలాకీ = నేర్పరి; చలాకి [కర్నూ]

చాలాకోలి(ల) = ఎద్దులను తోలుటకై చిన్న కొయ్యకు దారము కట్టినది; జాటీ [నె]

చాలినవాడు = సమర్థుడు — ఆయన అన్నిటికీ చాలినవాడు [నె, అ; తె]

చాలియా = తెల్లవక్కలు [కరీ]

చాలీ = అదొక ధోరణి — వాడొక చాలీ మనిషి [తె]

చాలు = (1) వంశానుగతమైన గుణము — ఆ యింటి చాలు తప్పలేదు; ఆణెము; తీరు [నె; తె; అ]

(2) ఒకవైపు నుండియే దున్నిన ఒకే చాలు దుక్కి, అడ్డము దున్ననిది; — మిట చేనుకు చాలుగొట్టినాము [నె; కర్నూ]

(3) ధర్మపద్ధతి [కరీ]

(4) పోలిక — వాడు తల్లిచాలు [తె]

(5) సంప్రదాయము [గు]

చాలు మూల = క్రమవిధానము; పద్ధతి — చాలుమూల లేనిపని చేసినాడు [నె]

చాలువు = (1) ఏరు మొదలను వాటిప్రక్కనే చాలదూరము వరకు వ్యాపించి యుండు ప్రదేశము — పెన్న చాలువున; చాల్వు, సాల్వు [నె, వ]

(2) మిక్కిలిగా [కరీ]

(3) వరుస [తె]

చాత్రి = (1) వేళాకోళము; చాతుర్యము; శాణి — అంతా చాత్రి కతక్షణము పడుతున్నాడు [నె]

(2) ఒక ఉరువు; లెక్కకు ఒకవస్తువు; శాత్రి [గు]

(3) రివాజు; సంప్రదాయము [కరీ]

(4) వరుస (బంతి) (కూ్యీ) [అ]

చాల్వు = (చూ) చాలువు; సాలువు [నె]

చావు జంపులు = ప్రాణావస్థ: ప్రయాస — మావని చావుజంపు లైంది [నె; కర్నూ; తె; అ]

(2) ఎక్కువ ఇబ్బంది, కష్టము — ఇంట్లో పని చావు జంపులుగా ఉన్నది [నె]

# చి



చింగితము = చేపలుపట్టు సాధనము [చి]

చింగిబింగియాడు = ఏగిసిపడు [కరీ]

చింగు = తలపాగ చివరి అంచు; చెంగు [నె-పా]

చింగుడు = పెద్ద మొత్తములో చివర నున్న చిన్న సంఖ్య — రూపాయలలో చింగుడు తోసివేయి [నె; అ-పె]

చిండ = (1) అడుగురి; సింద [గో]

(2) (పరిహాసముగా) చీర [అ]

చింతంబలి = చింత (గింజలు) పిక్కలతో చేసిన జావ [వి]

చింతాలు = తూకము చేయు [అ; బ]

చింతొక్కు = (1) పచ్చి చింతకాయలు ఉడుక బెట్టి తొక్కి చేయు పచ్చడి; ఇది

ఊరగాయవలె నిలువ ఉంచుదురు [అ-పె]

(3) చింతకాయ దంచిన ముద్ద

(3) కొంగజాతిలో ఒకటి. దీని నెత్తిన ఒక అందమైన ఈక అర్ధ చంద్రాకారములో కలికితురాయివలె నుండును. [నె]

చిందు = యానాదులు, మాలలు మొదలగు వారు చేయు నృత్యము [నె; కర్నూ; తె, అ]

చిందుగ = చిరుతపులి [గ]

చింబిలి = అణుకు అణుకుగా నుండు ఫలహారము; బియ్యపు పిండితో చేయుదురు. ఇందు నూగులు బెల్లము సద్దలు కలిపి చేతురు [చి]

చికిని = నల్లగా వండిన వక్క [తె]

చికిలి = (1) బిడ్డలు, పెద్దలకు ముదము గూర్చునట్లు చేయు తులిపిచేష్ట [నె]

(2) కత్తికి పదునుపెట్టుట, సానబెట్టుట, మెఱుగుబెట్టుట [నె-ప్రొ; కరీ]

చిక్కంటి = చిక్కువడిన వెంట్రుకలను సరిచేయు పెద్ద సందులు గల దువ్వెన; చికాకుపుగారు [కృ, గుం; అ]

చిక్కబట్టు = (1) ధైర్యముగా నుండు— *కాస్త మనసు చిక్కబట్టు* [నె; ప; అ, తె]

(2) ఓర్చుకొను [అ]

చిక్కము = సద్దినుంచు వలసంచి —*సద్ది చిక్కము* [అ]

చిక్కరబక్కర = (1) వెఱ్ఱిమొఱ్ఱి [అ]

(2) ఎక్కువగా చిక్కుబడిన; గజిబిజి— *చిక్కర బక్కరగా వ్రాసినాడు* [నె]

చిక్కాపుగారు = వెంట్రుకలు చిక్కులు తీయు దువ్వెన; చిక్కంటి [చి; వి]

చిక్కాళ = ఒకవిధమైన దువ్వెన [నె]

చిక్కు = గొళ్లెము—*తలుపుకు చిక్కుబెట్టు*; చిలుకు [నె]

చిక్కుగడ్డి = నూరిపిడి చేసినతర్వాత కళ్లంలో నుండి తీసిన గడ్డి; మట్టగడ్డి [గు]

చిగిరపు వక్క = మేలైన వక్క; పీటి వక్క; శిగిరపువక్క × గొంటువక్క [నె; అ]

చిగిరాకావు = తెల్లని జాతి పశువు, బహురోషము గలది [చి]

చిగిరింత = (1) కొఱ్ఱకంకివలె కంకివేసి, బట్టలకు అంటుకొను గడ్డి [తె, అ-పె; మ]

(2) వెడల్పు వరకలు గల గడ్డి, పశువులు దీనిని ప్రీతితో మేయును [నె]

(3) వెంట్రుకలు సంస్కార రహితముగా నుండుట [మ]

చిగురు = నరముల మొదట, ఎముకల చివరనగల మెత్తటిభాగము—*చిగిరపు ఎముక తిను; ముల్లు చిగురంటినది* [నె; తె, అ]

చిగురుపొట్ట = పంటచేలలో పైరుకు గింజ ఏర్పడుటకు ముందు, పొట్టయొక్క లేత స్థితి, లేతపొట్ట.

చిటచిట = అసూయ [కరీ]

చిటపటలాడు = కోపించు [కరీ]

చిటిగోరుకు = చిఱుతిండి [ప-కృ]

చిటుకు = పావలా [వి]

చిటాకా = చిన్న వస్తువుతో పెద్ద వ్యాధిని కుదుర్చు ప్రక్రియ; పరమాషి క్రియ; గోసాయి చిటాకా (పార్శ్వపు తలనొప్పికి వేకువన తిను పెరుగన్నము ఒక చిటాకా) [తె; నె; అ; కర్నూ]

చిట్టా = పట్టిక [కరీ]

చిట్టాముదము = (1) చంటిబిడ్డలకు భేదిఅగుటకు కాచిన మందు ఆముదము × వంటాముదము = తలకు పెట్టుకొనునది [నె, కర్నూ; వ]

(2) చిన్నగింజల జాతి ఆముదపు చెట్టు గింజలతో తీసిన ఆముదము, శ్రేష్ఠమైనది [గో; అ]

చిట్టి = చిన్న కొలపాత్ర — *చిట్టెడు నూకలు* [నె; కర్నూ; తె]

చిట్టు=(1) తవుడు [అ]
(2) తవుడులో కలసిన సన్నటి ఊక;నున్న [కరీ; గో]

చిట్టుడుకు నీళ్లు = (1) కాగే ఎసరులో ధాన్యము పోసిన తర్వాత కాసేపు కాగిన నీళ్లు, ఇవి పథ్యమునకు పనికివచ్చును
(2) గోరెచ్చనైన నీళ్లు [నె, కర్నూ]

చిట్లాకుప్ప=కనుమపండుగనాడు కాటమ రాజుకు పొంగళ్లు పెట్టిన వెనుక పెద్ద ముండ్ల కంచెల తిప్పను కాల్చెదరు. ఈ కంపలరాశికి చిట్లాకుప్ప అని పేరు [చి]

చిడతలు=ఎద్దు అటుయిటు తప్పుకొనకుండ కాడికి తగిలించిన తాళ్లు; పలుపులు [కృ]

చిడిపోతు=(1) చింబోతు; మేకలలో మగ దాని పేరు [నె]
(2) చిడిమాను (సిడిమాను)కు వేయదగిన మేకపోతు గ్రామశక్తి కొలుపులో ఏతము వలె అమర్చిన చట్టము చివరి కంబమునకు మేకపోతును వ్రేలాడగట్టి, చుట్టుత్రిప్పి బలి ఇత్తురు, ఇది చిడిమాను [నె]

చిడిముళ్లు=అడ్డంకులు; ఇడిముళ్లు [నె-ఆత్మకూరు]

చిడుము = చీముతో నున్న చిన్నగుల్ల [చి]

చితక=చిన్నది — *చిన్నాచితక అనుటలో జంటపదము;* చిడుగ [నె]

చితకలు=దుమ్ములు (ఎముకలు) కలసిన మాంసము కూర [వి]

చితచిత = వానవల్ల నేల అడుసగుట; చిత్తడి. [నె; కర్నూ; వ; అ]

చితనాపి = తులిపి పనులు చేయువాడు— *వాడు చితనాపి చింతకాయ* [నె]

చిత్తఎండ=చిత్తకార్తెలో వానవెలసిపోయిన వెంటనే కాయు ఎండ, ఇది చాల తీక్ష్ణముగా నుండును—*ఆయన కోపము చిత్తఎండ వంటిది* [అ, నె]

చిత్తకార్తె కుక్క=కుక్కలకు చిత్తకార్తె కట్టుడు అదను; అట్లే అదను పదను లేకుండా సంభోగము చేయు వ్యక్తి; ఆ మనిషో లంజకాడు అను లోకోక్తివంటిది [నె; కర్నూ; అ; తె]

చిత్తజల్లు= (1) చిత్తకార్తెలో ఉండి ఉండి ఉమ్మరిముగా కురియు వాన జల్లులు [నె]
(2) ఎడతెరిపి లేనిది [కర్నూ; వ]

చిత్తారు=(1) చిత్రలేఖనము [మ]
(2) చిత్తరువు [కరీ]

చిత్తు=ఎగజల్లు—*పేడ కొట్టమునిండ చిత్తు* [కరీ]

చిత్తుబొత్తు=కాయాపండు అనుట [కరీ]

చిత్రాలుపోవు=వింతగా ప్రవర్తించు, లేక వింతగా మాట్లాడు [గ]

చిదగుదలు = అలజడులు; విభేదాలు — *వాళ్లలో అప్పుడే చిదగుదలు ఏర్పడినవి;* చిదగొాదలు [నె-ఆత్మ]

చిదచిదలు = ముక్కలు ముక్కలు [కరీ]

చిదుగ = అల్లరి, కొంటెతనము; చిలిపి తనము; చిదుగు [అ, బ]

చిదుగొాదలు = అడ్డంకులు; ఇడిముళ్లు; చిదగుదలు [నె-ఆత్మ]

చినకాటం=చినుకులు; చిన్నవాన — *చినకాటం ఆరంభించిందే* [చి]

చినదబ్బు=పాత మూడు దమ్మిడీలు; కాని; పైసా [నె]

చిన్నగడ్డ=వెల్లుల్లి (చూ) తెల్లగడ్డ [గు]

చిన్నతనము=అవమానము— *నాకు చాల చిన్నతనమైనది* [నె]

చిన్నది=పిల్ల, స్త్రీ, పడుచు [కరీ]

చిన్నదినము = (1) శవ దహనమైననాటి మరుసటిదినము, సంచయనదినము; పాల దినము [నె]
(2) మరణించిన నాటినుండి మూడవదినమున చేయు ప్రథమ ఉత్తరక్రియ [గో]

చిన్నమాటలు = అవమానము కలిగించే మాటలు, దూషణవాక్యములు — *అతడు చిన్నమాట లనిపోయినాడు* [నె]

చిన్నల్లు=ఇంటిలోపలి గది [అ-పె]
చిన్నాచితక=అన్నెముపున్నెము ఎరుగని పసితనము సూచించుమాట — *ఆయన సంగతి తెలిసికోలేకపోను ఏమి చిన్నా చితకా* [నె]
చిన్నాయన=పినతండ్రి; చిన్నాన్న [నె]
చిన్నాలుక=చిరినాలుక; కొండనాలుక [నె-పొ]
చిన్ని=పిన్ని [కరీ]
చిన్నె=క్రొత్తమార్పు—*అమెలో ఒక కొత్త చిన్నెగల్గెను* [కరీ]
చిపిలి=చిలిపిచేష్టలు [అ]
చిప్ప చేతికిచ్చు = దరిద్రునిచేసి భిక్షమెత్తు కొనునట్లు చేయు [నె; కర్నూ]
చిప్పమొగము వేయు=వెల్వెలబోవు [కరీ]
చిప్పర=ఒకరకపుగడ్డి [కరీ]
చిపోళ్లు=దర్జీ వారు; కుట్రపువాళ్లు [మ]
చిమ్మన్న చీకటి=గాఢాంధకారము [శ్రీ]
చిమ్మానూనె = సీమనూనె; కిరసనాయిలు [అ; బ]
చిమ్మెలు=ప్రమిదలు [అ. బ]
చిమ్మెట=ముక్కులో వెంట్రుకలు పెరుకు ఇనుపసాధనము; చిమ్మట [శ్రీ]
చిరత=(1) రెండు గట్టి కఱ్ఱతుంటలను ఒక కొసలో గట్టిగా చేర్చికట్టినది. దీనిసందున కోడెల వృషణముల బిగించి నలుగగొట్టు దురు
(2) ఒకనికి దుర్భరస్థితిని కల్పించుట — *వానికి చిరతలు వేసినారు* [నె; వ; అ]
చిరతనవేయు=బాధించు; చిరతలోవేసి కష్ట పెట్టుట-అనుట [నె; వ]
చిరతలి - దాసరులు వాయించు కొయ్య తాళము; చిరతలు [తె; నె]
చిరతలు=భజనచేయునపుడు తాళము వేయు కొయ్యపలకలు. వీటికి ఇత్తడిరేకులు, మువ్వలు కట్టెదరు. అవి చప్పుడు చేసి తాళమును తెలుపును; చిటికెలు [గు; నె]
చిరిచాప = (1) సన్నటి తుంగపోచలతో రంగు రంగులుగా అల్లిన మెత్తటి చాప. సిరిచాప [నె, కర్నూ, తె. అ]
(2) చిన్నచాప [అ]
చిరిపట్టె=బాలక్రీడా విశేషము [నె-పొ]
చిరుకుంట = చెరువుకటక్రింద కుంట [చి]
చిఱ్ఱు = (1) కోలతో కొట్టినదెబ్బ
(2) చిన్నకఱ్ఱముక్క [కరీ]
చిఱ్ఱగోనె = ఒకరకపు బాలక్రీడావిశేషము [కరీ]
చిఱ్ఱపోతు=మూసినగడ్డలలో నుండు క్రిమి; చీరపోతు [కర్నూ]
చిఱ్ఱి=(1) ఒక ఆకుకూర
(2) బిరుసు పొట్టి వెంట్రుకలు—*చిఱ్ఱితల* [నె, కర్నూ]
చిఱ్ఱుబుఱ్ఱు = ముకోపము చూపుట — *—ఆయన చిఱ్ఱుబుఱ్ఱు లాడుతున్నాడు* [నె; కర్నూ, తె; వి; అ]
చిలక=బీడా, కిళ్లీ [చి]
చిలకట్టు = (1) పలుపుముడిని దూర్చుటకు ఇంకొక చివరన అమర్చిన తాటి ఉంగరము [నె; కర్నూ; తె]
(2) పంచకట్టు [వి]
చిలకడ=గొళ్లెము; చిలుకు [అ]
చిలకలమందిరము=అస్మాన్‌గిరి; ఉయ్యాల చక్కి [నల్ల]
చిలకొట్టు = మజ్జిగ మొదలైనవానిని చిలు కుట, జిలగొట్టు [తె]
చిలప=(చూ) చెలప [అ]
చిలవ=(1) ఆరేటిబాతువలె ఎగిరే నీటిపిట్ట. ఇది దానివలె అందమైనదికాదు.
(2) వ్యభిచారిణి—*అది చిలవముండ,*

(3) కొంటెపనులు చేయునది [నె]
చిలవమాటలు = వచ్చీరాని ఇంపుగూర్చే పసిబిడ్డల మాటలు [నె-ఆత్మకూరు]
చిలవలు పలవలు = కల్పించిన లేనిపోనివి—*చిలవలు పలవలు చేసి చెప్పినాడు* [నె]
చిలిపి = పిల్లలుచేయు తెలివైనకొంటెపనులు; చికిలిచేష్టలు [నె; కర్నూ; అ; వరం; తె]
చిలిపిజాడ్యము = సుఖరోగము [నె-పొ]
చిలుము = ఛంగి (గంజాయి) త్రాగు గొట్టము [చి; తె; నె]
చిలుము వదలింది = (1) బాగా నష్టము వచ్చినది [నె]
(2) కర్చుపెట్టించు [తె]
చిలుమూచీద్రం = పాతకాలంనుండి ఉన్నదంతా వదలించవలె అనే అర్థంలో—*వాడి చిలుము చీద్రమంతా వదిలింది* [గు; నె]
చిల్ల = (1) కట్టెమేకు [అ]
(2) పిల్లలను, పందులను పొడుచు ఈటె [కరీ]
చిల్లంగి = చేతబడి; శాతబడి; వంపు, చిళ్లంగి
చిల్లకట్టె = చివరన ఇనుపమొనగల కట్టె, పొడుచుటకు ఉపయోగింతురు [వ]
చిల్లకోల = (1) ఐదారుతాళ్లు విడివిడిగా కలిగిన కొరడా [నె]
(2) శలకోల [అ]
చిల్లరచితుకు = రాసికి రంగానికి రానట్లు అయిపోవు [కరీ]
చిల్లరజనము = కూలినాలి చేసికొనువారు; చిల్లరవాళ్లు; సన్నజనము; చిల్లెరగాళ్ల [తె; నె]
చిల్లాకట్టె = ఒక ఆట. సుమారు రెండడుగుల చిన్నకట్టె, జానెడు చిన్నకట్టెలతో ఆడు ఆట [అ]; కోడుబిళ్ల; బిళ్లంకోడు [నె]
చిల్లాకు = చిన్నఆకు; ఎంగిలాకు [చి]
చిల్లాడు = కుప్పను కాళ్లతో చెదరగొట్టు—*కోళ్లు చిల్లాడినవి* [చి]
(2) విడివిడిగా తొలగిపోవు [కరీ]
చిల్లాపల్లా = చెదరిపోవు—*జనమంతా చిల్లాపల్లా అయినారు*; చిల్లాపిల్లా [నె; తె]
చిల్లికోల = చిరతల బుడ్డివాళ్లు. దండలమీదుగా కొట్టుకొనే, మొదలులావు చివరసన్నముగా పేనినత్రాడు; విరదాడు [గో]
చిల్లులగంటె = చిల్లులుగల లోతులేని పెడల్పుగంటె, దీనితో బాణలిలో కాలే పదార్థములను బయటకు తీయుదురు బల్లిగంటె [తె; నె]
చిల్లెరగాళ్లు = తక్కువ కులాలవారు; కులాలవాళ్లు; చిల్లరజనము [నె; వ]
చివాలున = తటాలున; ఉన్నట్లుండి—*చివాలున లేచిపోయినాడు* [నె; కర్నూ; తె]
చివ్వ = పొడవైన వాసము [అ]
చివ్వరలు జేసికొను = చంటిబాలలు చిదురుకొను [కరీ]
చిళ్లంగి = కోయజాతులవారు మనిషిని అడవి జంతువుగా మార్చు క్షుద్రవిద్య; చిల్లంగి; శాతబడి [గో]

# చీ



చీకటిగుయ్యారం = చాలా చీకటి [గు; తూ-గో]
చీకటిమడి = నగ్నంగాఉంటూ ఊరగాయ మొదలగు వాటిని ముట్టుకొను ఆచారము;

కొందరు వంటగూడ ఇట్లే చేయుదురు; పెద్దమడి [సర్కా]

చీకటీగ = (1) రాత్రులందు పశువులపై వ్రాలి నెత్తురు త్రాగు నల్లటి ఈగ; ఇది దోమ కాదు [నె]
(2) గాలికాలములో కండ్లచుట్టు ముసురు చిన్నపురుగులు; సిట్టీగ [తె]

చీకురువాయి = కీచురాయి.

చీకూచింతా = బాదరబందీ; సంకటములు —*చీకు చింత లేనివాడు* [తె; నె]

చీటిచీర = రంగుపూవు లద్దబడినచీర—*చీటి గుడ్డ* [కరీ; నె]

చీట్లాట = ఇస్పేటు కాగితాల ఆట; ప్యాకీ ఆట; పేకాట (Cards Play) [నె; కర్నూ; నె]

చీట్లాడు = కలహించు [కరీ]

చీడపేలు = గుడ్డలపై బ్రాకు పేలు; చీరపేను; చీరపోతు [కరీ; నె]

చీడి = అరుగు; తిన్నె [శ్రీ]

చీడీ = అరుగు గట్టు [గ]

చీడీలు = మెట్లు; తావలు; పాంటికెలు; మెటికెలు.

చీదు = పొలాల మధ్యనుండు కాలువ [గు]

చీద = ఒక చిన్న సముద్రపు చేప; ఇంచుమించు చీట్లప్యాకిలోని (Pack of cards) ఆటీన్ (అర్టున్) ఆకృతిలో నుండును

చీదరించుకొను = అసహ్యించుకొను [నె]

చీద్రము = రోత [వి]
(2)శని—*నా చీద్రము వదలిపోయిందిరా;* చీద్రిము [కృ; గు]

చీనాకలకండ = చిన్నపలుకుల పటికబెల్లము [నె; కర్నూ; సర్కా]

చీనాచక్కెర = తెల్లటిబరక పంచదార; హస్కాచక్కెర × బూరాచక్కెర [నె; కర్నూ; సర్కా]

చీనిపండు = గజనిమ్మ, బత్తాయి, మూసంబి, [క; తె; కర్నూ]

చీనీ = పంచదార [వి]

చీపిరికన్ను = (1) రెప్పలార్చు చిన్నటి మూసురుకన్ను; చీకిరికన్ను [నె; కర్నూ; అ]
(2) పుసులుగట్టిన కన్ను [తె]

చీపురు = (1) పొరకకట్ట.
(2) పుల్లలుగా ఎదుగు అడవిగడ్డి, ఈనెలను చీల్చి విస్తళ్లు కుట్టుదురు; కటగట్టి చిమ్ముటకు ఉపయోగింతురు [నె; తె; అ]

చీమూ నెత్తురూ లేదు = పరువు ప్రతిష్ఠలేదు; సిగ్గు ఎగ్గు లేదు; పౌరుషము లేదు [వి;నె]

చీరగట్టించు = బాల వితంతువునుగాని, భర్త విడిచినదానినిగాని మరల వివాహమాడుట; మారుమనువు చేయు [అ; ఉ; మ]

చీరచిక్కు = గర్భవతిఅగు; నీళ్లపోసుకొను; నెల తప్పు.

చీరపోతు = (1) మాసిన గుడ్డలలో నుండు క్రిమి; చిఱ్ఱిపోతు [నె]
(2) పెద్దజాతి పోతుపేను [తె; రా; నె]

చీల = ఇనుపమేకు—*తంతిచీల* Wire nails మళ; శల [నె; కర్నూ, తె]

చీలకట్టు = చేపలబట్టు కొడమ రంధ్రము లోపల అల్లిన చిక్కుకట్టు [నె]

చీలగొట్టింది = దయ్యం వదలింది. ఒకనికి దయ్యం పూనినప్పుడు మాంత్రికుని మాట మీద అతడు పెద్దగుండును నెత్తిపై ఎత్తుకొనిపోయి ఒక వృక్షం క్రింద పడవేసినపుడు, ఆ మ్రానుకు ఇనుపమేకు దిగగొట్టుదురు. అంతటితో దయ్యం వదలినట్లు భావింతురు [చి]

చీలమండ = చీలమడిమ [తె]

చీలమడిమ = కాలిమడమ పైభాగము; చీలమండ [నె; గో; అ]

చీలమన్నిచ్చు = పైభాగమున మన్నుమేదు (మెత్తు) [కరీ]

చీలి = మాటకుముందే యేడ్చువ్యక్తి— *అది చీలిముండ, నమ్మరాదు* [చి]

చుంగుడు = పెద్ద మొత్తములో చివరి చిన్న సంఖ్య; చింగుడు—*చుంగుడు కొట్టివేయి* [చి]

చుండ = కపిలబానకు అమర్చిన తోలు తొండము; సుండ [అ-పె]

చుండలు = తిరుగమాత (పోపు) వేసినశనగ గుగ్గిళ్లు; శుండలు [నె; చి; అ, గు]

చుండు = (1) మెల్లిగా వ్రేలితోకొట్టు—*బుగచుండినాడు* [నె-మెట; అ]

చుండుకాయ = కాయలుగాయని మగతాటి చెట్టు వేయు కడ్డీలవంటి గుండ్రటి పొడవు కాయలు, వీటి మొదలును కల్లు గీయుటకు ఉపయోగింతురు [నె]
(2) నసపెట్టుకొనుట — *ఇతడు నోటి చుండువాడు* [కరీ]

చుండెలుక = మూతి సన్నగానుండు విషపు ఎలుక; చుంచు [కరీ]

చుంబడాలు = అవ్యక్తచేష్టలు; బులుబుజ్జిక ములు. ఇది సాధారణముగ స్త్రీలే వాడు మాట—*ఆమె అంతా చుంబడాలు పడు తున్నది* [నె]

చుక్కకూకుడు = శుక్రాది గ్రహముల యొక్క అస్తమయము; మౌఢ్యము [నె-దక్షిణ]

చుక్కపొడిచింది = వేకువైంది [చి; నె]

చుక్కవేయు = సారాత్రాగు—*వాడు చుక్క వేశాడు* [వి; నె]

చుక్కా = వేయించి వండినమాంసము(Fried Mutton); సుక్కా [అ]

చుక్కెదురు = ప్రాతికూల్యము. శుక్రుడు పరమట ఉదయించియుండు కాలములో, ఆ వైపుకు శుభకార్యములకుగా బయలు దేరరాదని, అది అశుభప్రదమని శాస్త్రము.

చుట్టంచూపు = పిల్లపెత్తనము [చి]

చుట్టకుదురు = (చూ) చుట్టుకుదురు [నె; అ]

చుట్టపుచూపు = (1) ఎప్పుడో అరుదుగా కలుగు దర్శనము [కరీ]

చుట్టపురాలు = ఒకనితో అశాస్త్రీయ సంబంధము గలిగిన స్త్రీ; చుట్టమురాలు [కర్నూ]

చుట్టము = ఒక స్త్రీతో అశాస్త్రీయసంబంధము గలవాడు—*ఆమెకు అతడు చుట్టము* [నె, కర్నూ; తె]

చుట్టమురాలు = ఉంపుడుగత్తె; మిండత; చుట్టపురాలు [అ]

చుట్టారము = చుట్టు [చి]

చుట్టిల్లు = గుండ్రముగా కట్టిన గోడలమీద దూలములేకుండా అమర్చిన ఇల్లు; సాధారణముగా యిది వంటయిల్లుగానే ఉండును. ఈ ఆకారము సర్వవాస్తు దోషములను పరిహరించునని శాస్త్రవిశ్వాసము [నె]

చుట్టు = (1) తిరుగాడు—*ఊరకే ఊరుచుట్టి వచ్చినాడు* [నె-దక్షిణము, చి]
(2) దూరము—*చుట్టుదారి* × అడ్డదారి [నె; కర్నూ; తె; అ]

చుట్టుకుదురు = గుండ్రటిఅడుగుగలపాత్రలు నిలుచుటకు క్రింద వుంచు వలయపు పరికరము, దీనిని సాధారణముగా గడ్డి చుట్టతో చేయుదురు; చుట్టకుదురు [నె; సే]

చుట్టుగుడిసె = చుట్టుయిల్లు [చి]

చుట్టుచెంగావి = నాలుగు అంచులలో లేత ఎరుపుచాయ అద్ది, నడుమ తెలుపు వదలి

పెట్టిన చీరరంగు; ఇది అందమును పెంచు నని ప్రతీతి-చుట్టుచంగావి చీర [నె; చి; వ]

చుట్టుపట్టెలు = చేనిలో దుక్కి అయిన తర్వాత, చుట్టు నాలుగు గనిమల ప్రక్క నసే దున్ను చాలు [నె; వ; అ]

చుట్టేయు = అపహరించు [వి]

చుట్లు = స్త్రీల పాదాల ఉంగరములు [నె-ఖా]

చుడి = తమలపాకుల చిన్న కట్టలు (పిడులు) కొన్ని పేర్చి కట్టిన పెద్ద కట్ట—*తమల పాకుల చుడి; సుడి* [నె; తె]

చుమ్మనాదం = (మా) సింగినాదం [నె-ఆత్మ]

చుమ్మలుచుట్టు = కడుపులో అర్లు బుట్టు—*కడుపులో చుమ్మలు చుట్టుచున్నవి* [కరీ]

చుమ్ముగుడ్డ = తలపైన బరువు మోయుటకు పెట్టుకొను గుడ్డచుట్ట; చుట్టగుడ్డ [శ్రీ]

చుమ్ములు కట్టుకొను = చుట్టుకొను [శ్రీ]

చురక = (1) కాల్చి వాత పెట్టుట [గు; కరీ]
(2) చుఱుకు, తీక్షణమైన

చురుకు = (1) వాతకమ్మలు గప్పు కొయ్య సాధనము [కరీ]
(2) మూత్ర విసర్జనప్పుడు కలుగు బాధ [నె]

చులుగూరు = గజకరణవ్యాధి [కరి]

చుల్ల = చిల్లి [అ]

చుల్లకూతలు = అబద్ధపుమాటలు--*చుల్లోడు, చుల్ల పలకవద్దు* [కర్నూ]

చుల్లాయిమాటలు = ఎత్తి పొడుపు ఎగతాళి చూడలేనితనము కలగలుపుగా ప్రదర్శించే మాటలు—*వాడివి వట్టి చుల్లాయికూతలు; సుల్లాయి;* చొల్లాయి మాటలు [నె; గు; గో; అ]

చువ్వ = దబ్బనములాంటి లోహసాధనము [కరీ]

# చూ



చూచాయగ = (1) అస్ఫుటముగ —*చూచాయగా కనిపించింది*
(2) చూచీ చూడనట్లుగ, ఉపేక్షభావముగ —*చూచాయగా ఉండినా* [నె; కర్నూ; అ; తె; గ]

చూటిది = చూలుతో నున్నది; కట్టినది [కరీ]

చూడవచ్చుట = క్రొత్తగా మనువు కుదిరించు కొనుటకై వచ్చుట; పెండ్లిచూపులు

చూపరానిచోటు = మర్మస్థలము; చూపనిదే —*చూపనిదే చూపెనయ్యా సూరవరాజా* [కరీ]

చూపుకు = పైకిమాత్రం (వ్యర్థము) —*అతడు చూపుకున్నాడు* [కరీ; నె]

చూపుడుకత్తి = (1) జాతరలలో బలి పశు వును నరకునపుడు అందరికి తెలియు నట్లుగా పైకిఎత్తి కనుబరచు పెద్దకత్తి

(2) చూపుకేగాని పనికి పనికిరానిది—*అది వట్టి చూపుడుకత్తె* [నె]
(3) చూపులకేగాని పనికి గొరగాని ఆడుది [అ]

చూపుడుకోడె = బాగామేపి చూచుట కంద ముగా చేసియుంచు పశువు. దీనిని సాధా రణముగా అమ్ముదురు; మేపుకోడె [నె-పా]

చూపుదోషం = ముట్టుమైల, చూపు మైలవల్ల కలిగిన దోషం [కరీ]

చూరకత్తి = (చూ) చూరుకత్తి [వ]

చూరుకత్తి = (1) వాదరలో కొంచెము నద్ది ఏర్పడి, ఒకేతట్టు వాదరగలిగిన కత్తి; దీనిని మాంసాదులను కోయుటకే ఉప యోగింతురు; చూరకత్తి; సూరుకత్తి [నె; అ; తె]
(2) పౌరుషముతో పనికయ్యాలాడు స్త్రీ [గో]

చూరుబల్ల = ఇంటి చూరుక్రింద వాసాలకు బిగించు బల్ల (చెక్క) [వి]

చూరొక్కు = వక్కలను నిలువుగా సన్నగ చీల్చినది; చూరవక్క [అ]

# చె



చెంక = ఒకప్రక్క భాగము — *బావిమొత్త ఒక చెంకపడ్డది* [నె-పా]

చెంగలి = మేలైన అడవిగడ్డి జాతి [నె; వ]

చెంగావి = లేత ఎఱుపుచాయ; పాలచెంగాయి. [నె; కర్నూ; అ; వ]

చెంగినాడు = తప్పుగా ఆడినందున ఓడి పోయినాడు; ఫౌల్ (ఆటలలో ఉపయోగిం చెడు పదము) [చి]

చెంగోవ = మాగాణి పొలమును రొంపి దుక్కిగా దున్ని, గనిమలను పారలతో నరికి సరిచేయుట; కయ్యారము [నె-తూర్పునాడు]

చెండు = ఎద్దు మూపురము— *ఆ ఎద్దు చెండు వాలినది.* [నె; కర్నూ]

చెండుపూలు = బంతిపూలు [అ]

చెంపకాయ = ముక్కు చెంపలు [అ]

చెంపసరాలు = స్త్రీల కర్ణభూషణములు; మాటీలు [నె; పా; గు]

చెంబడి = చేపలుబట్టి జీవించు బెస్తలలో ఒక శాఖ. వీరిలో సముద్రతీరమందున్న అర వలను పట్టపువారందురు. [నె]

చెకడా = తలమీద చేతితో వేసినదెబ్బ [శ్రీ]

చెకుముకి రాయడు = తంటాలు, కొండె ములుచెప్పి విరోధములు పుట్టించు వ్యక్తి, నారదునివంటివాడు [గో]

చెకోర్త = పంపరపనస; పంపరదబ్బ.

చెక్క = (1) మానులో కోసిన పలక (బల్ల —plank)
(2) వరిపిండిలో ఉప్పుగాని బెల్లముగాని చేర్చి చమురుబోసి బాండలిలో కాల్చిన తినుబండారము—*ఉప్పు చెక్కలు, సజ్జ చెక్కలు* [నె]
(3) వక్కపొలుకులు; బాగాలు [తూ; గో]
(4) చెప్పు; మెట్టు—*చెక్కతో కొట్టాడు* [చి]
(5) పొలములో ఒక భాగము [గు]
(6) వంటచెరకు [అ]

చెక్కనీళ్లు=(1) మేకలకు గొఱ్ఱెలకు చీడ పట్టినప్పుడు అనేకములగు చెట్లుబెరళ్లు వేసి కాచిన నీరు (కషాయము) [నె-పొ]

చెక్కపొడి=చీకినేరుచెట్టు ఆకు ఎండించి, పొడిచేసి, అభ్యంగన స్నానములో తల పులుముటకు ఉపయోగించు పొడి, సీకాయ పొడి వంటిది [నె; అ]

చెక్కబెల్లం=శనగపప్పు, కొబ్బరి, నెయ్యి, ఏలకులు కలిపి బెల్లపు పాగులో పోసి ఆరినపెనుక చెక్కలుగా కోసిన రుచికర మైన తినుబండారము [చి]

చెక్కు=(కత్తితో) పొడుచు [అ]

చెక్కుగట్టు=(1) పుండు మానుకొని వచ్చు (2) ఒకపని ఫలోన్ముఖమగు — *ఆ పని చెక్కు గట్టు కొంటున్నది; పొక్కు గట్టు* [నె; అ]

చెక్కులు=గానుగ ఒకమారు ఆడకము— *నాలుగు చెక్కుల నూనె* [చి]

చెక్కేయు=ఏదైనా ఎత్తుకొని వెళ్లిపోవు —*నూరురూపాయ లెత్తుకొని చెక్కేశాడు* [చి]

చెక్కేశాడు=(1) చెప్పకుండా పారిపోయి నాడు [గో]
(2) తీవ్రంగా విమర్శించినాడు [నె]

చెటాకు=అరతవ్వ [చి]

చెట్టరికిపాము = చెట్లమీద నుండు తెల్లటి పాము; ఎక్కువ విషము గలది; చెట్టిరిక పాము [నె; పొ]

చెట్టుగట్టు = పెద్దవారగు — *పిల్లలు ఎదిగి చెట్టు గట్టితే కదా* [చి]

చెట్టుడుగు పాము=చెట్లపై నుండు పాము; చెట్టిరిక పాము [కృ]

చెట్లపాది=తీగపారు,పొట్ల కాకర మొదలగు వాటి పాది — *చెట్లపాదులు పెట్టినారు;* చెట్లపాదు [నె; తె]

చెట్లపాదు=(చూ) చెట్లపాది [కర్నూ; వ]

చెడాబడ=(1) క్రమము దప్పు—*చెడాబడా తిట్టినాడు* [కరీ; నె]
(2) విచక్షణ లేకుండ—*అన్నీ చెడబడా తిన్నాడు;* చెడిదిబడిది [తె; నె]
(3) ఎడపెడగా; నోటికి వచ్చినట్లు — *చెడాబడ తిట్టినాడు* [నె; కర్నూ; అ]

చెడమడా =ఎక్కువగా; చెడాబడా [గో;వి]

చెడిది = చేళబటి; పంపు [కరీ]

చెడిది బడిది = చెడిపోయినదెల్ల, చేతికి దొర కిన దంతా—*చెడిదిబడిది తిని ఒళ్లు చెడ గొట్టుకొనినాడు* [నె]

చెడిపె = జారిణి; చెడుపైనది [కరీ]

చెడిబడి = మంచిది, చెడ్డది—*చేనికి చెడిబడి ఆకు తొక్కినారు* [చి; నె]

చెడిబ్రతికినవారు=హీనస్థితిలోనుండి శ్రీమం తులై నడమంత్రపు సిరిచే ఎగుడు దిగుడుగ ప్రవర్తించు వారు × బ్రతికి చెడినవారు [నె]

చెడువాకతనము = చెడగొట్టు లక్షణము [కరీ]

చెడ్డ = ఎక్కువ—*చెడ్డ మంచి* [వి]

చెత్తతోయు=చిమ్ము [అ]

చెదలుకాళ్లు = ఒకచోట కాసేపుగూడ నిలు కడగా నిలువనివాడు (నిలిచిన చెదలుబట్టు నవిన భీతితో నేమో అనునట్లు) — *వాడు చెదలు కాళ్లవాడు* [నె]

చెనికె=పార [సే]

చెన్నంగివడ్లు=తోకవడ్లు; నెమలివడ్లు [అ]

చెన్నంపల్లి పంచాయతి = (చూ) దుప్పటి పంచాయతి; తాడిపత్రి పంచాయతి; రామాయపట్నం మధ్యస్థం [అ]

చెన్నపల్లి మధ్యస్థం=(చూ) రామాయపట్న మధ్యస్థం [నె-ఆత్మకూరు]

చెప్పరానివాడు=మంగలి [సే]

చెప్పిచూడు=వినునో లేదో చెప్పి ప్రయ త్నించు — *చెప్పి చూడు ఏమిపోయింది* [నె; కర్నూ; తె; అ]

చెప్పుచేతలు = ఒకరు చెప్పినట్లు, చేసినట్లు చేయుట; విధేయత—*రామయ్య ఆయన చెప్పుచేతలలో ఉన్నాడు* [నె; కర్నూ; అ; ప]

చెప్పుక్రింద తేలువలె = ప్రతిక్రియ చేయ లేక అణగియుండు; కుక్కినపేనువలె.

చెప్పుడు మాటలు = కొండెములు — *చెప్పుడుమాటలువింటే చెడుతావు* [నె; కర్నూ; అ; తె]

చెప్పుమీద తుచ్చువలె ఎగురు = హీనుడు వడు ఎక్కసపు పాట్లు [హై]

చెముక = నేతవస్త్రముయొక్క తుదిలోఉండు విడియంచు—*గొంగడి చెముక* [కరీ]

చెమట దీయించుకొను = ముఖక్షౌరము చేసి కొను [అ]

చెయికోలు = కుడిప్రక్క—*చెయికోలెద్దు;* సెయికోలు [అ]

చెయి గరచింది = నష్టము వచ్చింది — *ఆ వ్యాపారంలో వెయ్యి చెయి గరచింది* [చి]

చెయిచేసికొను = (1) కొట్టు [నె]

(2) స్వయంగా పనికిసగు—*ఆయన చెయి జేసికొన్నదాకా అది కాలేదు* [వి; నె]

చెయివాటు = దొంగతనం [గు]

చెయ్యిచ్చు = మోసముచేయు [అ]

చెయ్యిపెద్దది = (1) ధారాళమైన దానగుణము కలిగయుండుట [నె; సర్కా]

(2) కొట్టుట

(3) ఎక్కువ అగుట [సర్కా]

చెర = కష్టము — *ఇంట్లో ఏదో చెరగా నున్నది* [నె, కర్నూ-పత్తికొండ]

చెరగు = (1) బండిపైన ఎత్తుగా వేసినగడ్డి మొదలగువాటిని లాగి, బిగించు లావుపాటి పొడవుమోకు; చెరుగు [నె; తె]

(2) పెద్దతాడు; మోకుతాడు (వ)

చెరగుమూయు = స్త్రీలు బహిష్టయగు, చెరగుమాయు [తె; అ; నే]

చెరచెర = బిరబిర [అ; నె; గో]

చెరపనాబత్తుడు = ప్రతిపని చెడగొట్టువాడు (పని చెడగొట్టిన కంసాలి అంతటివా డనుట); ధ్వంసం నారాయుడు [నె]

చెర వదలు = (1) వచ్చికబీడు మొదలగు వాటిలో, సొంతపశువులు మేసిన తర్వాత ఇతరుల వాటికి వదలివేయు [నె]

(2) పీడ వదలించుకొను—*వానిచెర వదలింది* [తె]

చెరిగొట్టు = మోపెద్దులను మోటబారిపై వెన్కకు నడుపు; వెనుక తపిల [కరీ]

చెరివి = (1) పెదవి మూల; సెలవు; చెలివి [కరీ]

(2) నాల్కపై వచ్చిన వ్యాధి.

చెరుగు = (చూ) చెరగు [నె-పొ]

చెరుకుమోకు = (చూ) చెరగు [అ]

చెరువుకి వెళ్లు = మలవిసర్జనకు వెళ్లు; నీళ్లచాయబోవు, చెంబట్లకుపోవు; దొడ్డికి పోవు; పెళ్లకుపోవు [వి]

చెలక = (1) పనికిరాని పొలము [వ]

(2) మెట్టచేను; చెలిక [కరీ]

చెలకోల = కొరడా [కర్నూ]

చెలగ = (1) యౌవనము తొణికాడు స్థితి.

(2) ఎదకానున్న ఆవుపెయ్య; చెలపెయ్య

(3) ఊరకే రంకెలువేయు కావరపుకోడె [నె]

(4) కొనరు [గో]

చెలగబారు = చిలువలు, పలువలుబెట్టి విస్తరిల్లు [కరీ]

చెలప = (1) ఎదిగిన, ప్రాయపు బత్తెదూడ.

(2) పైరుచేనిలో పైరుచచ్చి అక్కడక్కడ ఏర్పడిన తెట్టు; చలప; చిలప; చెలిపె [నె]

చెలపెయ్య = ఎదకారుకు వచ్చిన ఆవుదూడ; చెలగ [గు]

చెలించు = టంకముబెట్టు; లోహములను అతుకు [వ]
చెలిక = ఏడుమార్చి ఏడు పైరుబెట్టు మెట్ట పొలము; చెలక [నె]
చెలిపె = మధ్య మధ్య పైరుపట్టక ఉండు నది; చలప [కరీ]
చెలిమె = చెలివి; పెదవిమూల; చెరివి [కరీ]
చెలివి = పెదవిమూల; చెరివి [కరీ]
చెలిపొ పెట్టు = (1) కొట్టివేయు
(2) పంక్తిక్రింద హంసపాది గుర్తుపెట్టు [కరీ]
చెల్క = మెట్టపొలము; ఖుస్కి; చెలక; చెలిక [వ]
చెల్లుబడి = (1) మాటసాగుట; పలుకుబడి—*చెల్లుబడి కలిగిన మనిషి.*
(2) అప్పులోకి చెల్లించబడిన పైకము—*చెల్లుబడులు తోసి పేరీజుచేయు* [నె; కర్నూ; అ; తె]
చెల్లోకి = మాటసాగుట — *చెల్లోకి అయిన మనిషి;* చెల్లుబడి [నె]
చెవళకాయలు - గోరుచిక్కుడుకాయలు; చవులేకాయలు, మటికాయలు; గోకిరి కాయలు [కర్నూ]
చెవి = (1) తంబూర తంతెలను బిగించు కొయ్యమేకు [అ]
(2) రాటములో కదురు అమర్చుటకు బిగించిన తోలుముక్క. కదురు ఆడు టకు దీని తలలో గాడికోసియుంతురు
చెవి = బీగపుతాళము [అ; నె]
చెవిగుట్టు = చాడీలు
చెవిన పేనుబాఋ = మాటగైకొను [కరీ]
చెవిపేద = చెప్పుడుమాటలు నమ్మువాడు [కరీ]
చెవుకట్లు = కపిలెబిళ్లను అమర్చుటకు అడ్డ దూలముపైన బిగించిన రెండు నిలువు కొయ్యలు. వీటికి అడ్డముగా ఇనుపకడ్డిని ఇరుసుగా అమర్తురు [నె]
చెవుడు బడుట = విని విని విసుగుజెందుట [కరీ]
చెవుగోసికొను = (1) వినుటకు కుతూహల పడు
(2) ఉత్సాహపడు; ఆశపడు — *అదంటే చెవిగోసికొంటాడు* [కరీ; నె]
చెవులు జాడించు = వెళ్లిపో [మ]
చెవులు దుల్పు = నిర్లక్ష్యము చేయు [మ]
చెవులు బిదెర్లు వడ్డవి = చెవులు వినపడకుండ అయినవి [మ]
చెవ్వ = చంటిబాలలకు కలుగు *గండము;* బాలారిష్టము [కరీ]
చెవ్వంగము = నూనెతోడు గొట్టము, బొం బాయి; పంపు [అ]
చెవ్వలాట = కామపరవశులు చేయులీల [నె-పొ]
చెవ్వాకు = చెవికి ఆకు — బీబకుటుందాల ముండమోపులు కమ్మలకు బదులుగా, చాయ అద్దిన తాటి ఆకును గుండ్రముగా చుట్టి చెవిలో పెట్టుకొను ఆకు. వీటి పెద్ద పెద్ద చుట్టలను పసుపు కుంకుమతోబాటు ఇత్తురు — *చెవ్వాకు పోయినమ్మకు దుఃఖమూలేదు, దొరికినమ్మకు సంతోషమూ లేదు* [నె; తె; రా]

చేకావలి=తాత్కాలికావసరములకు చేతిలో నుంచుకొను డబ్బు—రెండు రూపాయలు చేకావలి ఉంచుకున్నాను [నె]

చేకునేల=గడిబలిసి దున్నుటకు కష్టమైన నేల; సీకునేల [గు]

చేజేతుల=తామైతాము [కరీ]

చేటుకొమ్ముకు చేరెడు విత్తులు లేవు=అతి దరిద్ర స్థితిలో మసలు [కరీ]

చేట భారతము = (1) విషయమును దీర్ఘముగా చెప్పుట — ఏదో ఒకచేట భారతం చెప్పిపోయినాడు. రామాయణము భాగవతము, భారతము మొదలగు పుస్తకములు పూర్వము డెమీ 1/4 సైజులో పెద్ద ఆకారములో అచ్చువేయుచుండు వారు. చేటంత పుస్తకమనుట; చాట భారతము [నె; కర్నూ; తె]

(2) అక్కఱకు రాని దీర్ఘప్రసంగము [అ]

చేటుమారి=పొగరుబోతు [అ]

చేడ=(మా) చాడ [నె; రా]

చేడె=చెఱువు కట్టలకు కలిగిన బొక్క; గండి [కరీ]

చేతడి = క్షుద్రదేవతలను ఆరాధించి సముపార్జించిన శక్తితో, విరోధులపై మంత్రము ప్రయోగించి చంపుట; పంపు చేయుట. అందువల్లనే పూర్వము పల్లెలలో మాంత్రికులనుచూచి భయపడుచుండువారు; చాతబడి; శూన్యం చేయించుట, చేతాళము [వ; అ]

చేతడి ఆరింది = దగ్గరనున్న ధనమంతా వ్యయమై పోయినది [నె: అ; తె]

చేతడిచేయు - లంచమిచ్చు [తె]

చేతడుపు కొద్దిగా పనిచేయు [మ]

చేతప్పు=చేతితోచేసిన పొరపాటు × వాతప్పు [నె]

చేతబడి = (మా) చేతడి, శాతబడి; పంపు; చాతబడి

చేతాకిడి - చేతముట్టినట్లు జేయుట [కరీ]

చేతాళము = (మా) చేతడి [కరీ]

చేతి చముకు=లాభములేని పని; పెట్టుబడి దండుగ వ్యాపారము [గో; వ]

చేతిచమురు భాగవతము=సొంతకర్చుతో యితరులకు చేయుపని [నె, కర్నూ; తె; రా]

చేతివట్టుము=(1) అనవసరంగా దెబ్బలు కొట్టు గుణము [గు]

(2) చేతిలో లోపము [నె]

చేతి సరసము=కొట్టుట [వి]

చేతులు నెత్తినబెట్టు = ఎవరిని వారికి ఫలింపజేయు

(2) భస్మాసురునివలె నాశనముచేయు [కరీ]

చేత్తాడు=చేంద్రత్రాడు; చేంతాడు [అ]

చేద=(1) బావి త్రవ్వుటకు ముందు ఊట కనుగొనుటకు త్రవ్వు చిన్న నూయి; ఒలివు [అ] —చేదలో నీళ్లు పడింది; ఒళవు

(2) బావినుండి నీరు చేదుటకు ఉపయోగించు పాత్ర — చేద బావిలో పడిపోయింది [నె]

చేదారము=నష్టము; చెడిపోవుట — గాలివానకు పైరంతా చేదారమైంది [చి]

చేదు=ప్రక్కలు శ్వాస ముమ్మరముచే ప్రవలించు [కరీ]

చేదునోటివాడు = తిట్టుబోతు, పరుషముగ మాటలాడువాడు [నె]

చేదుపిందెలు గోయు = పరోక్షములో తప్పులు వెదకు — ఈమధ్య వాడు నా

మీద చేదుపిండెలు (కాయలు) కోస్తు న్నాడు [నె]

చేను=(1) సాధారణముగా సేద్యపుపొలము —చేలోకి పోయినాడు; కయ్య, మడి కాలు; దొయ్య

(2) మాగాణి — చేను తడిసినది, మడి [నె, కర్నూ]

(3) మెట్టపొలము — చేనుచేసి చెడినవాడు మడి (మాగాణి) చేసి మనినవాడు లేడు [రా]

(4) పైరు [వి]

చేపట్టుగోడ = మిద్దెలు, బావులకు అంచు లందు రక్షణకుగా కట్టు పొట్టిగోడ; పిడి గోడ [నె]

చేపాకు=పశువులు పాలు చేపుటకై పెట్టు ఆకు ఓషధి [నె-పొ]

చేపారు = కొంచెము పెద్దవగు — దోస కాయలు చేపారినవి [నె-పొ]

చేపాలు = శ్రమఫలితము — చేపాలుప దున్ను ప [కరీ]

చేపు=(1) ఎగచేపిన గొడ్డు

(2) పాలీయని పశువు

(3) దాన మీయనివాడు [వ]

చేపులు మలుపులు=చేసి మలిచిన వడ్లులో మిగులు ధాన్యము [కరీ]

చేపెక్కు=వానవలన నేల చితచితలాడు; జోడెక్కు [నె]

చేప్పలుకు=చేప వన్నె పలుకులున్న మట్టి; బావి త్రవ్వునపుడు యీ మట్టి కన్పించిన మంచి ఊట పడు నందురు [చి]

చేబియ్యము=దంపినబియ్యము, దంపుడు బియ్యము × మిషను బియ్యము

చేమిరి=(1) తోడుబెట్టుట; తోడంటు [నె; కర్నూ-మార్కాపురం, గిద్దలూరు]

(2) మిరప, వంగ మొదలగు వాటి నారు నాటినవెంటనే పొది మొదటపోయు కొద్ది నీళ్లు—ఈ పేడు చేమిరికే నీళ్లులేవు [నె]

(3) విరుగుడు — బాగున్న ఊరిలో వాడు చేమిరేవాడు [చి; నె]

చేయికలుపు=(1) సాయముచేయు [తె]

(2) జగడమునకు దిగు — వాళ్లిద్దరు చేతులు కలిపినారు [నె]

చేయిచూచు=(1) నాడి పరీక్షించు [మ]

(2) యాచించు

చేయిచేసికొను = కొట్టు — చేయి చేసు కొన్నతర్వాత నోరుమూసినాడు [తె; నె]

చేయి జారు=కొట్టు [తె]

చేయి మించు=(1) ఆధిక్యమగు

(2) తొందరపడు [నె]

చేరదీయు=(1) దగ్గరకుదీసి సహాయము చేయు

(2) సన్నిహితుడుగా దగ్గరకు చేర్చుకొను [నె; కర్నూ; తె]

చేరదోలు=విడిపోయిన పశువులను ఒక్క చోటికి చేర్చుట; కుదుతవేయు — ఆవు లను చేరదోలండి [చి]

చేరవేయు=(1) దొంగతనముగా ఒక్కొక్క వస్తువును బయటకు పంపివేయు—తావ లనినదంత చేరవేసినాడు [నె; కర్నూ; అ; తె]

(2) ఒక్కచోట చేర్చు [అ]

చేరి=గూడెము, వాడ [చి]

చేరు=(1) పశువుల మగగుత్తి

(2) లావు మోకు; చెరగు [నె]

(3) గర్భకోశము — ఆమె పిల్లల చేరు గలది (సంతానవతి అనుట); సేరు [నె; కర్నూ; అ; వ]

చేరుదల=దగ్గరగా నుండునది—అది చేరు దల పల్లి [నె; కర్నూ; వ]

చేర్పు=చేనిగట్టును బలపరుచుట; చెంగోవ; కయ్యారము [శ్రీ]

చేవదలు=దానము సేయు [కరీ]

చేవపండు=జామపండు [సే]

# చై



చైనాలు=స్త్రీలు కాళ్లకు ధరించెడు వెండి ఆభరణములు [అ]

# చొ





చొంగ=(1) గంజాయి పీల్చు మట్టిగొట్టము; చిలుము

(2) హుక్కా [కరీ]

చొంగచక్కిలాలు=పురుడుపోసిన తర్వాత మూడవ నెలలో పుట్టింటివారు పురిటి సారెలో పెట్టు చక్కిలాలు [వి]

చొంగారొట్టె=మొహరము పదో రోజున, పీర్ల భక్తులు నైవేద్యము కోసం చేసే గోధుమరొట్టె [అ]

చొ-అర్=(1) కుడి, ఎడమవైపు ఎద్దుని తోలు, సంజ్ఞ [చె]

(2) దాపల వెలుపల ఎద్దులను అదలించు పదము [నె]

చొట్టు=చొట్ట [కరీ]

చొతుకు=లొంగుబాటు [కరీ]

చొన=సొన [కరీ]

చొన్నారి=రసిక కారెడి వ్రణము [కరీ]

చొప్ప-(1) బద్దపాటుగా, కొన వెడల్పుగా నుంచు కొయ్య మేకు (Wedge). దీనిని తాటిమానులు చీలదీయుటకు ఉపయోగింతురు.

(2) దేవునితేరు చక్రములను మరలించుటకు వాటి క్రిందబెట్టు ఏటవాలు వీపు గలిగిన చిన్న కొయ్యమొద్దు [నె]

[3] బలహీనమైనది

చొప్పదంటు = పనికి మాలిన — చొప్పదంటు ప్రశ్నలు [అ]

చొప్పు చొప్పు అగు = (1) వాలి పోవు; శుష్కించు

(2 నుజ్జు నుజ్జగు [కరీ]

చొరవ = (1) కపిలబావికి రెండు మొత్తలకు వేయు కొయ్యలు

(2) రథచక్రమునకు త్రోవ వదలకుండునట్లు వేయు అడ్డతెడ్డు (బ్రేక్) [అ]

(3) కయ్యలలో మిట్టపల్లములను సరిచేయుటకు మటి ఎత్తిచేసిన గుంట; వతి [నె-మెట్ట]

చొశుదల=ప్రవేశసమయము [కరీ]

చొల్లాయి మాటలు = (చూ) చల్లాయి మాటలు [గో]

## చో

చో = ఎడమచేతిప్రక్క యెద్దునకు పేఎ × అర్ [కృ]

చోడమేక = బొట్టిగా నుండి కవలపిల్లలను ఈను మేక; కంచిమేక [కరీ]

చోడిజావ = అంబలి [కృ]

చోరప్రాయము = లేత పడుచు వయసు [కరీ]



## చౌ

చౌక = పావులా [వి]

చౌకట్టు = ద్వారపు చట్టము [కరీ]

చౌకట్లు = కపిలబిళ్లను తగిలించు కొయ్యలు [చె]

చౌకము = చేతిగుడ్డ [అ-పె]

చౌకీలు = నల్లపూసల గుండ్ల పేరులోని బంగరుపూసలు [కరీ]

చౌట = (1) చవిటినేల (2) అప్రయోజకుడు; చవట [నె,కర్నూ; తె; అ]

చౌడుముళ్లు = మగ్గము మీద నేతగుడ్డను బిగించుటకై ఇరుప్రక్కల చివరి అంచున కుట్టు ముళ్లు [చె]

చౌరముగా = సక్రమముగ [కరీ]

చౌలేకాయ = గోరుచిక్కుడుకాయ; మటికాయ, గోకిరికాయ [కర్నూ - పత్తికొండ]

చౌళకాయ = గోకిరికాయ; మటికకాయ; గోరుచిక్కుడుకాయ.



## ఛ

ఛట్నా = తటాలున [కర్నూ]

జంక=వికారము [గు]

ౙంగ=అంగ; కాలుకొలది వైచిన యడుగు కొలత [కరీ]

ౙంగబిల్లి=అడవిపిల్లి; ౙంగుబిల్లి [కరీ]

ౙంగమయ్య=సీతాకోకచిలుక

ౙంగిడి=(1) గుంపుజేసి ఒకటిగా మేపు చిల్లర రైతుల పశువుల మంద; ౙంగిలి —*జంగిడి పశువులు*

(2) స్వల్పబుద్ధి—*వాడిది జంగిడి గుణము* [నె]

(3) పళ్లెములాగ అల్లిన సన్న వెదురు బద్దల అల్లకము [గో]

(4) ఊరి పశువులు **ఒకచోట** గూడుచోటు, మందబైలు [తె]

జంగిడిపూట = సన్నకారు రైతులు కలసి చేలకు నీరు పారించుకొను కాలపరిమితి; ఉమ్మడి వంతు [నె]

ౙంగిడీ=ధాన్యమును సంచులలో బోయుట కుపయోగించెడి పాత్ర [కృ]

ౙంగిలిగొడ్లు = (చూ) ౙంగిడి పశువులు [గు]

ౙంజెరుదొడ్డి=(చూ) బందెలదొడ్డి [వ]

ౙంతి=(1) రెండు దూలాల మధ్య వేయు అడ్డకొయ్యలు

(2) చిన్నదిండు [అ-పె]

జంతికె కురుపు=చాల రంధ్రములు బడు కురుపు; రాచకురుపు; ౙల్లెడకురుపు [నె-బొ]

ౙంతికెలు=(1) మణుగుపూలు (పిండివంట పేరు) తేనెతెల [నె-పొ]

(2) చక్కిలాలు [శ్రీ]

ౙందివారము=జందెము [సే]

ౙందెపుకాడి = కాడి వెనుక కట్టిన కాడి [కృ]

ౙంపాలు=తీగ యుయ్యేలలు —*ఉయ్యాల ౙంపాలు* [కరీ]

ౙంపు = (1) పురుషుల చెవుపైన వ్రేలాడ కుట్టిన భూషణము [నె]

(2) తూగు; నిద్రమత్తు [తె]

జంబాలము=బంధము [గు]

జంబాలు=తన్నుతానే ఎక్కువగా చేసికొనుట; ఎచ్చులు—*ఆయన జంబాలకారి: ఎచ్చుల కారి* [నె; అ; తె]

జంబు=అబద్ధము—*జంబు కొనింది కొనిందే* [చి]

జకాతి = బొరుగూరికి వచ్చినపుడు బండ్లకు ఆఊరి పంచాయతీ వసూలుచేయు పను దొడ్డిపన్ను [అ]

ౙక్కించుకొను=తప్పుకుండు [కరీ]

జగాయించు=(1) దులుపు

(2) బాగాతిట్టు [మ]

ౙగిలిగాడు=తోడి అల్లుడు; ౙగిలోడు [శ్రీ]

జగ్గడు=పూరీ జగన్నాథస్వామి [వి]

ౙగ్గు=(1) తగ్గు

(2) వాలిపోవు [అ]

ౙగ్గులాడి=వగలాడి [మ]

జజ్జరిల్లు = దద్దరిల్లు; భయపడు — *వాడు దెబ్బతో జజ్జరిల్లి పోయాడు* [వి]

జట్టీ = గుత్తా వ్యాపారము [కరీ]

జడపత్తి = పొడవైన గింజలవరుస అతుకు కొనియుండు పత్తి, జంధ్యాలపత్తి [నె]

జడుము = అడవిపారి — *జడుంత ప్పుకుండా ఎండిని పోనీ* [చి]

జత్త = రెండు గలిసినది [కరీ]

జత్తి = మంకు, పిచ్చి [శ్రీ]

జత్తీ = మూగ, తెలివితేటలు లేనిది [గు]

జతపడు = లభించు; కుదురు — *అది నాకు జతపడలేదు* [శ్రీ; నె]

జన = చేపలగుడ్లు ఒకటిగా కలిసియుండు కోవు — *జనచేపలు*

(2) కంటిగుడ్డులోని పదార్థము — *జన వారి పోయింది.*

(3) కోడిగ్రుడ్డులో పాగు [నె; తె, అ]

జనపవారు = ఒక కులము [చి]

జనముద్దు = అల్లారుముద్దు [కరీ]

జనలు = కిటికీ; జనాలు; జనారులు [చె]

జనాగాయి = రెండు పక్షము లున్నపుడు అటూ ఇటూ తిరుగువాడు; దొర్లుడు పుచ్చ కాయ [గు]

జనారులు = కిటికీ; జన్నలు [బ; అ; నె-దక్షిణ]

జనార్లుగూడు = కిటికీ [అ]

జనాలు = కిటికీ; జనలు [చి; నె-దక్షిణ]

జనిగెపట్టు = జలగపట్టువంటిది; గట్టిపట్టు [మ]

జన్నలు = కిటికీ; జనారులు [నే]

జన్నెకు యిడిచినది (విడిచినది) = ఎత్తు కట్టినపశువు. దేవునిపేరుపై ఒకకోడెను వదిలెదరు. ఆవులను దాటుచే దీనిపని. అది ఎవరిచేనులో మేసినను ఏమి అనకూడదు; అచ్చువేసిన ఎద్దు; ఆపకెద్దు.

(2) స్వేచ్ఛానువర్తియైన ఆడుది [మ]

జపజప = త్వరగా [కరి]

జప్పన = త్వరగా; చప్పున [కరీ]

జమ = అవపు; గుర్తింపు, లక్ష్యము — *వాడికి ఎవరన్నా జమలేదు; అది ఒక లెక్కా జమలేనిది* [నె; కర్నూ]

జమాయించు = బెదురులేకుండు — *జమాయించి చెప్పినాడు* [అ; నె]

జమికిచ్చు = నాని మెత్తబడు; జవికిచ్చు [నె]

జమిలి = రెండు; జముకిక [నె]

జమిలిక = గ్రామ తిరునాళ్లయందుపయోగించు, తోలుగప్పిన గుండ్రని మద్దెలవంటి వాద్యము. ఇవి జంటగా చేర్చియుండును.

జముడుక = పంబాలవాని పంబ అను వాద్యము; జమిలిక [కరీ]

జమ్మకతారా యని = నిర్విచారముగా [కరీ]

జమ్మికిపోవు = దసరాపండుగనాడు శమీ దర్శనమునకేగు [కరీ]

జమ్మిక్రిందివ్రాతలు = ఆధారరహితములైన వ్రాతలు [కరీ]

జరిగిపోయెను = చనిపోయెను [కరీ]

జరీ జరాబు = సరిగంచు దుస్తులు [కరీ]

జరుగుబాటు = సంసార నిర్వహణమునకు చాలియుండుట — *ఇక్కడ జరుగుబాటు లేక పట్నం పోయినాడు* [నె; కర్నూ]

జర్తి = జలపాతము — *తలకోన జర్తి* [చి]

జలగడుగు = (1) పూర్తిగ నాశనముజేయు [మ]

(2) పూర్తిగా వెదకు, జల్లగడుగు [నె]

జలదారి=(1) గదినుండి నీరు అవతలికి పోవుటకు ఏర్పరచిన గోడరంధ్రము [అ]
(2) మురికి నీటిగుంట; జలారి [నె]

జలాతంత్రము=చిల్లులపాత్ర [కరీ]

జలారి = (1) జలదారి, మురికినీటిగుంట, Cess pool
(2) స్నానముచేయుచోటు [అ]
(3) స్నానాలగది; బచ్చలి; జాలారి జాటల [అ; బ]

జలుగురు=జారుమాంసము [కరీ]

జలుబు వడిశము; రొంప [నె; రా; తె]

జలువు=(చూ) సలుపు × ఎలువు [చి]

జల్ల=(1) బండిమీద ధాన్యాదులు పోసికొని వచ్చుటకు అల్లిన పొడవైనబుట్ట—*జల్లనిండా పోయి మక్కెడవ;* డొల్ల [నె; అ]
(2) తల వెనుక భాగమున చేతితో కొట్టుట [శ్రీ]
(3) చెంపకాయ; లెంపకాయ [వి]
(4) నాగమీదబండితోలువాడుకూర్చుండు చోటు [గు]
(5) ధాన్యము నిలువ చేసుకొనుటకు ఇండ్లలో పెట్టు పేళ్లబుట్ట; బొట్ట [గు]

జల్లకడుగు=(1) బంగారుపనివారి కుంపటి బూడిదను, ఒక గుంట కొయ్యపళ్లెములో బోసి, నీరుబోయుచు నుసిని త్రోసివేయుచుండుట; ఇట్లు చేయగా చేయగా బంగారు కణములున్న అవి క్రింద నిలిచిపోవును. ఇదేవృత్తిగా కలిగిన ఒక కులముగలవారు *జల్లకడుగువాండ్రు;* జలగడుగు
(2) ఏదైనా ఒక వస్తువును తుదముట్ట కర్చుచేయుట—*దాని జల్లకడిగివేసినారు* [నె]
(3) చీవాట్లు పెట్టు—*వాడిని బాగా జల్ల గడిగినాడు* [తె]

జల్లబండి=ఎరువు తోలుటకు పైన జల్ల అమర్చిన బండి [మ]

జల్లబుట్ట=పెంట (ఎరువు) తెచ్చుటకు తీగలతో అల్లిన పెద్దగంప [నె; మ]

జల్లి=(1) పలుచన, ఎడఎడముగా నుండుట—*జల్లికంకి,* నక్కలది జల్లితోక [నె; వ; గు]
(2) అబద్ధము [చి]
(3) ఇటుక నూలలకు (బట్టీలకు) బయటి మూతగా రాతినిపేర్చి అలికిన కప్పు—*జల్లిరాతితో గోడబెట్టినాడు* [నె]

జల్లిగంటె=నూనెనుండి దేవునది; చిల్లుల గంటె [తె]

జల్లు=బియ్యములేని వరిగింజలు—*అసంతా జల్లు పొల్లు* [చి]

జల్లుగొట్టు = వానచినుకులు ప్రక్కవాటుగా ఇంటప్రవేశించు; చల్లకొట్టు [నె]

జవ=(1) సన్నటి అంచు
(2) లోతుగీత—*చెక్కకు జవదీసినారు* [నె; అ]

జవగొట్టుట = రేకులను మడచి గొట్టములు చేయునపుడు, కలసిపోవలసిన అంచులు ఒకదానిపై ఒకటి చేర్చినపుడు ఎత్తు కాకుండా ఒక అంచువేపు చప్టాచేయుట [గు]

జవజవ=మాగి మెత్తనగు [నె; అ]

జవుకు=(1) ఎక్కువ వానవలన నేలలో ఏర్పడిన జోడు [నె-మెట్ట; అ; వ]
(2) నీట తడిసి మెత్తబడుట — *కొయ్య జవికిపోయినది;* చవుకు [నె; కర్నూ; వ;]

జిడ్డుకిరపడు = తేటకలిగా ఏర్పడు [వి]
జితించు = జీర్ణించు [తూ-గో]
జిదుగు = చిన్నమొత్తము; చిల్లర [కరీ]
జిద్దు = శరము [కరీ]
జిన్న = ప్రతినిధి [కరీ]
జిన్నిపళ్లు = సేరేడి పళ్లు [వి]
జిబ్బి = నిబ్బి [వి]
జిబ్బాట = గచ్చిలము [అ]
జిమ్మ = (1) నోరు — *వాడి జిమ్మ పడి పోయింది* [శ్రీ]
(2) నాలుక [వి]
జిమ్మలు = చేపలు [వి]
జిరతాడు = మోట బొక్కెన తొండమునకు క్రింద కట్టే చిన్నతాడు; తొండాపుతాడు [మ]
జిల్లుకాక = లోహములు ఎక్కువగా వేడియగుట — *జిల్లుకాక పుట్టింది;* తెల్లకాక [నె]
జిల్లుమను = అసహ్యముగొల్పు [మ]
జిలపుట్టు = (1) కొద్దిగా తడికలుగు
(2) నవకలుగు [కరీ]
జిలుకర = పిండివంట [మ]
జిలుగు = (1) సన్నని నూలుపోగులతో నేసిన వస్త్రము [అ]
(2) నగిషిపని [గో]
జిల్ల = కపిలకాడికి గట్టిన వారిణిలో (పన్నిన మోకుముడి) జాన తొండపు తాటిని చొప్పించి బిగించు గట్టి కొయ్యపుల్ల (మేకు) [నె - మెట్ట]
జిల్లా = బొద్దెంక [నే]
జిల్లేదారు = రివిన్యూ ఇన్స్పెక్టరు [అ]
జివ = జవము చచ్చినది [గు]
జివురు = కొడవలితో (కట్టె) నునుపు చేయు [అ]
జివ్వలు = మెడ [శ్రీ]
జివ్వు = నరంమీది పుండు పెట్టు బాధను తెలుపు పదము — *నెత్తురుగడ్డ జివ్వు జివ్వుమంటున్నది.* [నె]

# జీ



జీగురుమను = ఈసురో యను; జీగురులాడు [కరీ]
జీడి = (1) ముంతమామిడి (సర్కా)
(2) భల్లాతకి అను ఓషధి [నె, కర్నూ]
(3) మామిడి విత్తనములోని పప్పు [తె]
జీతులు = లాలస; అభిలాష — *ఆతనికి ఆ కూరపై జీతులు కలిగినవి* [కరీ]
జీనిగపని = కొయ్యబొమ్మలకు, దేవునివాహనములకు వేయు రంగుపని; బచ్చెన [నె]
జీనిగలవాడు = బచ్చెన వేయువాడు [నె]
జీబు = అరటిగెలలో వరుసగా ఏర్పడిన కాయలగుత్తి — *ఒక జీబుకోయి* [నె]
జీబుకొను = మంచుపొగ క్రమ్ము [అ]
జీబుగా = దట్టముగా; జూబుగా [శ్రీ]
జీర = కసురు ధ్వని; బొంగురు — *గొంతు జీరపోయింది* [చి]
జీరలు = గీతలు (శ్రీ)

# ౙు



ౙుంకపోగు = చెవితూటపై నిడుకొను మగవారి నగ [కరీ]

ౙుట్టుపోలిగాడు - పోలుగాడు = (మా) (1) కేతిగాడు.
(2) ప్రతిదానికి అడ్డు వచ్చు అనామకుడు —ౙుట్టుపోలిగాడు వలె ఎవడురా వీడు అడ్డం [కర్నూ]

ౙునిపించు = మోసగించు [నె-హా]

ౙునుగు = పని చేయక పొద్దు పుచ్చుకొను [తె]

ౙుబ్బా = షర్టుగాని చొక్కా — ౙుబ్బా వేసికో [నె]

ౙుమాలుమను = సొమ్మసిల్లు; ౙుమ్ముమను [వి]

ౙుమ్ముపట్టు = తెలివి తప్పిపోవు [వి]

ౙుమ్ము మను = సొమ్మసిల్లు; ౙుమాలుమను [వి]

ౙుఱ్ఱుపాము = కాలిబాటలో వాననీరు నిండిన గోయి; నక్కగోయి [వి]

ౙుఱ్ఱుతు = జోరు [కరీ]

ౙువ్వ = 3, 4 అంగుళముల మధ్య కొలతతో మూరెడు పొడవున పెద్ద కండ్లతో అల్లిన చేప వల. దీనిలో చొచ్చుకొనిన చేప మరల బయటికి రాలేదు [నె]

# ౙూ



ౙూకాలు = స్త్రీలు ధరించు కర్ణ భూషణములు; ౙూకీలు [నె]

ౙూబుగా = దట్టముగా; జీబుగా [శ్రీ]

ౙూమాల = జోడు హారము. జోమాలు [కరీ]

# జె



జెంకులు = బొంతజెముడు చెట్లు; త్రాచులు మగది ఆడది దీనితో పెనవేసికొని సంగమించును, ఆ సమయమున మఱియొక పాము సమీపముననే ఉండి వానిని రక్షించుచుండును. దానికి కుంచెన పాము అని పేరు. ఇట్టి చెట్లను జెంకులందురు [నె-పొ]

జెగ్గు = వాయించు వాద్య విశేషం [కరీ]

జెటబట=త్వరత్వరగా [తె]
జెట్టి=గోరుచుట్టు; జెష్ఠ [తె]
జెట్టున=త్వరగా; చట్టున [తె]
జెన=సొన
జెప్ప జెప్ప=త్వరత్వరగా; జెపజెప [తె]
జెప్పున=త్వరగా [తె]
జెయ్యతుగా=విజయ ప్రదముగా [కరీ]

జెల్ల=(1) మంచినీటి చిన్న చేప, ఇది కుట్టును [నె; చి; తె; అ]
(2) ఒక జంటపదము—*వీలా జెల్ల అంతా బాగున్నారు* [నె; కర్నూ; అ]
(3) చేతిదెబ్బలు—*నాలుగు జెల్లలు వేయి* [గో]
జెల్లకాయ=నెత్తిన వెనకాల చేతితో కొట్టిన దెబ్బ [గో]

## జే



జేజెమ్మ=ఎందుకూ పనికిరానివాడు; తెలివి మాలినవాడు [గో]
జేడు - (1) గట్టి—*జేడు నేల*
(2) బాగ బిగుసుకొన్న బంకనేల [చి]
జేరుగండి=స్నానము చేసిన నీరు బైటకు పోవు గోడ కన్నము: జలదారికంత [అ]

## జొ



జొడ్డా=(1) ఆముదము, (ఒరియా తెనుగు వారి వాడుకలో)
(2) నష్టము
(3) అవసరశ్రమ [గ]
జొపానున్నట్లు = ఇంటో పిల్లల సందడి చేయక ఉండు స్థితి [మ]
జొబ్బురుగ=పలుచగ బాగుగ చారు కలుపుట—*జొబ్బురుగ కలిపితిను* [మ]

జొల్లు = పసిపిల్లలకు నోటినుండి కారుచుండు ఉమ్మినీరు [తె]
జొల్లుకూతలు= (1) పొల్లుమాటలు [తె]
(2) నిందా వాక్యములు; జొల్లు కార్చుకొనుచు అనునవి, అని [నె]
(3) నెరవేర్పలేని మాట; జొల్లు కార్చుకొంటూ అనే మాట — *జొల్లు కూతలు తప్పు* [నె]

## జో



జోకిచ్చు =తూనిక వేయు [మ]
జోకు=(1) నీటి ఊటలు, నీరు ఊరెడి నీటి కాలువలు [అ; వ]
(2) తిట్టు; కొట్టు—*బాగా జోకినాడు*[నె]
జోకుమారుడు=కుమారస్వామి [అ]

జోగి=గ్రామదేవతల జాతరలలో దేవతల ఆరాధనకు ఇంటింట దండు బియ్యము మొదలగునవి. ఇట్లు దండుటకు ఒక పెద్ద వెదురు పళ్లెమును పసుపు కుంకుమ పూసి ఉపయోగింతురు; జోగు [శ్రీ]

జోగు=దేవుని పేరట ఎత్తు బిచ్చము; జోగి [కరీ]

జోటిబట్ట=దోటి [అ]

జోడాలు=వరిపైరులో కలిసి ఎదిగే ఒక విధమైన గడ్డి విత్తనము; ఊదరగింజ వంటిది [శ్రీ]

జోడుతపేలా=నీళ్ల కాచు అండా

జోనంగి= బొచ్చులేకుండా సన్నగా నుండు వేటకుక్క జాతి. శ్రీహరికోట దీవిలో ఇవి ఎక్కువగా ఉండేవి రామనాథపురం జిల్లా, రాజాయపాళెం జాతికుక్క [నె; అ]

జోపానము=జాగ్రత్తగా పోషించుట [అ]

జోపు=తొలగించు (చేతులతో)

జోబడి=(చూ) కొటాయి; పెండ్లిపందిలి [చి]

జోము=(1) చాలసేపు నిలువబడినందువ కాళ్లకు తిమ్మిరిబట్టి, మీగాలు పైకి దిగు వీరు—జోము *దిగింది,* తిమ్మిరి; [నె; కర్నూ; అ]

జోమెక్కు=ముఖము కాళ్లుచేతులు వాచు; ఇది మరణావస్థ [చి]

జోర=ఉన్నితో నేసినది; కంబడి [మ; నె]

జోరు=(1) చిక్కగా లేకుండ నీళ్ల నీళ్లగా పలుచగా నుండుట [కర్నూ]
(2) ద్రవము [తె]

జోర్తాడు = జుట్టు రేగిపోకుండా పెటుకొను వెండి రేకు [శ్రీ]

జోలి=(1) ముచ్చట
(2) భార్యాభర్తల రహస్యము
(3) ఊసు [మ]

జోళ్లు=(1) చెప్పులు [వి]
(2) సులోచనములు; ముక్కద్దాలు ;కంటి అద్దాలు [సరాక]

## జౌ



జౌకు = (1) నీట తడిసి మెత్తనగుట — *కొయ్య జౌకిపోయింది;* చవుకు [నె; వ; అ]
(2) జోరు; వర్షబాహుళ్యముచే జో దెక్కుట —*మాతోట జౌకెత్తింది* [నె]
(3) ఊగుట యందలి విశేషము—*కావిడి జౌకు జౌకున ఊగుచున్నది*

## ట



టంక=ఒక సవశేరు [మ]

టంకము ఒక్క తూకపు కొలత [మ]

టంకము బెట్టు = (చూ) తోదుబెట్టు [వ]

టంకు = లావైన—*టంకుమనిషి* [నె; అ]

టంచనగా = నిష్కర్షగా; సూటిగా; సరిగా —టంచనగా చెప్పు [నె]
టకాటకి = వరుసగా [కరీ]
టకాయించు = బాధపెట్టు [కరీ]
టకారము = తట్టవంటి ఇనుప పళ్లెము, బేలు దారి పనులలో ఉపయోగింతురు. [నె]
టకీమని = యోచించుకోకుండా, తటాలున చేయుట—జవాబు టకీమని చెప్పినాడు [నె]
టక్కాయమ్మ = దద్దమ్మ [కరీ]
టక్కోరపు వంకాయ = టొమాటొ [నె]
టపాకాయ = టపాసా [సర్కా]
టపాస = టపాకాయ —టపాసాల పండుగ [నె; అ]
టపాసకాయ = టపాసా [తూ-గో]
టపాసాల పండుగ = దీపావళి [నె]
టపాసులు = టపాసాలు [గు]
టప్పా = (1) అబద్ధము [ఉ - వి]
(2) నవీన సంగీత పద్ధతులలో ఒక చిన్న పాట—నాటకంలో టప్పాలు బాగున్నవి [నె]
టలాయించు = (1) ఆపు [కరీ]
[2] పనిచేయక తిరుగువాడు [నె]
టస్సావేయు = చాలకాలము మకాముచేయు —ఊరిలో టస్సా వేసినాడు [నె]

## టా



టాకా = (1) రంధ్రము; కరిబూజకాయ, గుమ్మడికాయ పండినదీ లేనిదీ, బాగున్నదీ లేనిదీ టాకా వేసి చూతురు; టాకు; డిబ్బి [చి; నె]
(2) పరుపు కుట్టడములో నడుమ కుట్టిన ముడి [అ; నె]
టాకు = (1) కరుబూజ, కలంగర కాయలను కొద్దిగాకోసి పండినవేమో అని చూచు బెజ్జము; టాకా; డిబ్బి
(2) రివిట్ వేయు (బిగించు) [అ-పె]
(3) పనితనము లేకుండా కమ్మితోచేసిన ఉంగరము [నె]
(4) కలమునకు (పేనాకు) అమర్చు ముక్క; నిబ్; పాళీ [అ]
టాకుటీకు = హడావిడి—టాకుటీకున వచ్చినాడు; టీకుటాకు [నె]
టాటు = ఠీవి — టాటుబూటున వచ్చినాడు [కరీ; నె]
టానికి = కొరకు; డానికి; దానికి — రావటానికి; పోవటానికి [తె; నె]
టాపూ = కాగితము రీములలోని ఒక్కొక్క కాగితము; షీట్; టావు [కరీ]
టాలాటోలి = (1) ఊరకే పనిలేకుండా తిరుగాడువాడు [నె; కర్నూ; అ]
(2) మోసము [తె]
టావు = కాగితపు పెద్ద షీటు; రావు, టాపూ [నె; కర్నూ; అ; తె]

## టి



టింగణ = (1) పొట్టిగా లావుగా ఉండునది; —*టింగణావు* (ఆముక్తమాల్యద)
(2) బరువులుమోయు ఆవు [నె-పొ]

టిక్కిపోయినది = చిక్కుకొని పోయినది [వి]

టిన్ను = డబ్బా (టిన్ - Tin) తో చేసిన దనుట) —*కిరోసిన్ టిన్ను* [నె]

## టీ



టీక = (1) బొట్టు; తిలకము [కరీ]
(2) వాక్సినేషను —*టీకాలు వేయించినారు*
(3) ఒకజాతి పందెపుకోడి [శ్రీ]
(4) పతకము [నె]

టీపనుబుక్కు = అప్పటికప్పుడు వ్రాసికొను నోటుబుక్కు [కరీ]

## టు



టుంగిరి = పనికిమాలినవాడు, కొంటె —*వాడు టుంగిరి నాయాలు* [కర్నూ]

టుక్కా = బేలుపుచ్చుమాట —*ఒక టుక్కా కొట్టినాడు* [నె]

టుమికి = క్షత్రము; టూకీ [అ]

## టెం



టెంకము = లోహమును అతికించునది [అ]

టెంకాయ పగులగొట్టినట్లు = సూటిగా; నిర్మొగమాటంగా; కుండ పగులగొట్టినట్లు; కట్టె విరచి పొయిలో బెట్టినట్లు [అ]

టెంకి = తలకాయ —*టెంకి జెల్ల* [వి]

టెంకిస = ప్రొద్దు పొడుపు పువ్వు జాతికి చెందినది. కాని ఇది సూర్యుని గమనముతోపాటు మొగము త్రిప్పదు [శ్రీ]

టెక్క = డింకు [శ్రీ; వి; తూ-గో]

టెక్కు = బెట్టుసరి —*టెక్కు చేసినాడు* [గో; నె]

## టే



టేకా = (1) దిండుపై అనుకొనుట (2) అను

## టొ

టొంగా టొళ్లు

టొంగా = మొట్టికాయ; దప్పి [కర్నూ]
టొంప = గుదికట్టి
టొంపు = మిష; వంక; లోపం [శ్రీ, అ; గు]
టొట్టి = మొట్టి [వి]
టొళ్లు = బోలు

## టో

టోకు టోళీ

టోకు = లోపము; తక్కువ — ఏకరాకు ఒక పుట్టికి టోకులేదు [నె-పొ]
టోకుర్లు పెట్టు = గుజ్జుపెట్టు [వి]
టోలా = తలవెనుకగా వేసిన దెబ్బ — ఒక్క టోలా వేసినాడు [నె]
టోలారోలి = (1) గుంపులు
(2) బాధ్యతలేని మూక [వి]
టోలి = (1) గవ్వ — (గుడ్డిగవ్వ) [మ]
(2) పాతకాలమున మారకమునకు ఉపయోగింపబడిన గవ్వ లేక ఒక దమ్మిడీ [శ్రీ]
టోలీ = అరదమ్మిడీ [అ; వి; శ్రీ]
టోళీ = కానిలో అరవవంతు [ఉ-వి]

## ఠ

ఠకిలున

రకిలున = ఆమాంతముగా [కరీ]

## ఠా

ఠాటు

రాటు = వైభవము [కరీ]

## ఠొ

ఠొణ్ణె

రొణ్ణె = ఖంర [కర్నూ]

## రో



రోకరా = నడకలో లేక పరుగులో రాతి గట్టుకు కాలుకు దగులు దెబ్బ—గుజ్జం రోకరా తిన్నది [నె]

రోకరుగొట్టు = కాలదన్ను [కరీ]

## డ



డంగడోలు = పశువులమెడ క్రిందిభాగము నందు వ్రేలాడుతోలు; గంగడోలు [నె]

డంగుబోవు = భయపడు; ఆశ్చర్యపడు

డంబాచారి = డంభములు ప్రదర్శించువాడు; ఎచ్చులకారి—వాడు పటి డంబాచారి [నె; చి]

డక్క బిళ్ల = బండిగాలు దిండుకు, కుండకు మధ్య నుండు వాషర్; ఉలవాయి [చి]

డక్కు = ఆపద తప్పదని నిర్ణయించుకొని, లోపలనే బాధపడు [గో]

(2) భయము—అదే డక్కుపడినది [నె-బొ]

డచ్చి = తృప్తికరము; ఎక్కువ—డచ్చిగా తిన్నాను; డచ్చి [నె]

డప్పుస = తప్పెట [నె-మెట్ట]

డప్పాలు = డంబాలు; కోతలు — డప్పాలు కొట్టినాడు; గప్పాలు [నె]

డబ్బ = (చూ) డబ్బా

డబ్బా = (1) వ్యభిచారిణి— అది ఒక పెద్ద డబ్బా [నె]

(2) పెట్టె—రైలు డబ్బా [సర్కా]

(3) నిందాశబ్దము [కర్నూ]

(4) పదరుబోతు [అ]

(5) పనికిరానిది [అ]

(6) సత్తు (టిన్) రేకుతో చేసినది—కిరోసిన్ డబ్బా [నె; తె]

డబ్బాటుగా = హఠాత్తుగా [కరీ]

డబ్బావాయించు = అభిమానంతో ప్రచారాలు చేయు; పొగడు; ముఖప్రీతిగా ప్రశంసించు [వ; నె]

డబ్బి = చమురుపోసుకొను టిన్ను; డబ్బా [నె; కర్నూ; తె]

డబ్బు = (1) నాలుగుదమ్మిడీలు [నె, కర్నూ; అ]

(2) డంబము [చి]

డల్లి = మాంసపు ముక్క—డల్లీలు బాగా పడినవి [చి; నె]

డవులు = (1) ఒకగ్రామము చెల్లించవలసిన శిస్తుమొత్తము—అపూరి డవులు మూడు వేలు [నె]

(2) డాంభికము—ఆయన డవులు వెళ్ల బోసినాడు; డౌలు [నె, కర్నూ; వి; అ]

(3) సొంపు

డవులుదప్పి = మతిచెడి [కరీ]

డాంబరీ = ఇనుపతంతి; ఇనుపతీగ; తారు [తె]
డాకావేయు = కన్నమువేయు [కరీ]
డాబా = (1) బోడిమిద్దె, పై అంతస్తులేనిది [సర్కా]
(2) పందెమునకు తగిన మేలుజాతి కోడి పుంజు [నె]
డాబు = (1) గజ్జెలులేని వడ్డాణ్యము; డావు [రా]
(2) గాంభీర్యము; డంబము—ఆయన బలే డాబుమనిషి [నె]
డాల = పెద్దగంప [కరీ]
డాలు = కాంతి వ్యాపకము—దీపాల డాలు చాలదూరం కొట్టింది [నె]
డావలపల = డావల వల్పల; ఎడమకుడి [కరీ]
డావు = (1) ఉగ్ర ఉడియమైన లాభము—బలే డావు కొట్టినాడు [నె]
(2) ఒడ్డాణము; డాబు [కర్నూ]



డింకాకొట్టు = పరీక్షతప్పు; డింకీకొట్టు [గు; అ]
డింకి = పందెమునకు పనికివచ్చు కోడి; చాలా పౌరుషము గలది; బెరసకోడి [శ్రీ]
డింకికొట్టుట = చేసేపనిలో తప్పుదారినిపడి మోసపోవుట [గో]
(2) పనిచెడుట; డింకాకొట్టు [గు; అ]
డింకికోడి = పందెపుకోడి (చూ) బెరస [గో; వి]
డిక్క = పశువుల కాలిగిట్ట; గొరిసె; డెక్క [సర్కా]
డిబ్బ = (1) దుకాణము
(2) పాక—సారాడిబ్బ; కల్లుడిబ్బ [వ]
డిబ్బవేయు = పందులో బెజ్జము పడునట్లు ముక్కతీయు; టాకావేయు [తె]



డీలాపడు = జబ్బుచేత దుర్బలమగు —ఆయన చాలా డీలాపడినాడు [నె; కర్నూ తె]
డీలుపడు = (చూ) డీలాపడు [నె]



డుమ్మాగొట్టు = తప్పుకొను [కరీ]

## డె

డెంకి = కాలితో వత్తు దంచు మర రోకలి [వి; శ్రీ]

డెంగా = పొడుగైనది; పొడుగరి [గ]

డెక్క = (చూ) డిక్క [నె; వ]

డెక్కలి = మాదిగజాతి వారలలో ఒక తెగ [కరీ]

డెప్ప = ఎత్తుప్రదేశము; దిబ్బ; డెప్పి [గ]

డెప్పి = దిబ్బ [వి]

డెల్టా = ఏటి అనకట్ట క్రింద పారుదల అగు మాగాణిభూమి—*డెల్టాభూములు* [నె]



## డే

డేకిచ = బక్కెట్టు [శ్రీ]

డేగ = ఎరుపు తెలుపు ఈకలు కలిగిన పందెపుకోడిపుంజు; డేగ, కాకి, నెమలి, ఔరస అని వన్నెలనుబట్టి పందెపు కోడిని పిలుతురు. వీటికి గెలుపు వేళలు గలవు, వాటి ననుసరించియే పందెమునకు దింతురు [నె]



## డొ

డొంక = పొలముల మధ్య సాగిపోవు వెడల్పు దారి — *డొంకన బండి పోని* [నె; కర్నూ: తె]

డొంకి = తెడ్డువంటి సాధనము; డోకి [వి]

డొంగు = మోసము [కరీ]

డొక్క = కొబ్బరిబొండము ఒలువగా వచ్చిన డిప్ప; చిప్ప [గో]

డొక్కలు తేలినవి = చిక్కిపోయినాడు [మ]

డొక్కశుది = చదువుకొని యుండుట—*వాడు డొక్కశుద్ధి లేనివాడు*; అక్షరాస్యత [నె]

డొక్కు = (1) ముసలిది—*డొక్కుబొజ్జ*
(2) చెడినది [నె; కర్నూ; తె; గు; అ]
(3) పాతది [గో]
(4) అణగినది; చొట్ట—*డొక్కుపోయిన డబ్బా* [అ]

డొలక = బండిమీద గూడుగా బోర్లించి కట్టినది; *డొల్ల—డొలక బండి*; గూటిబండి [కర్నూ]

డొల్ల = (1) ధాన్యాదులు పోయుటకు బండి మీద అమర్చుటకు అల్లిన పెద్దబుట్ట; జల్ల; మక్కెడ [చి]
(2) గుజ్జు తీసివేసిన నిమ్మకాయ పొక్కు [నె; తె]
(3) బండిమీద గూడుగా బోర్లించినది [కర్నూ]
(4) పెసర, మినప మొదలగు వానిని మాసూలు (నురిపిడి) చేయగా వచ్చిన

పొట్టును నిలవ చేసికొనుటకై కంది కంప లతో (కర్రలతో) చిక్కగా కట్టి పైన యిలా రము వేసిన గూడు [గో]
(5) దొన్నె; దొప్ప [వ]

డొల్లు =(1) గింజ పట్టని వేరుశనగ— డొల్లు చెనిక్కాయ [అ-పె]
(2) వదరైన [నె]

డొల్లుట = దొరలుట [కరీ]

## డో

డోకా — డోల్గొట్టి

డోకా =(1) భయము;
(2) సందేహము — ఏమీ డోకా లేదు [నె; తె; అ]

డోక్కి = వెచ్చనినీరు తీయుటకు ఉపయోగించు కాడగల గిన్నె [గు]

డోరి = దారము [కరీ]

డోలాయమానము = నిర్ణయమునకు రాలేని మానసిక స్థితి— డోలాయమానంలో పడి నాడు; (డోల = ఉయ్యెలవలె అటునిటు ఊగుట అగుట) [నె, కర్నూ; తె; అ]

డోల్గొట్టి =(డోలు గొట్టి) చాటించి [కరీ]

## ఢ

ఢప్పాలు

ఢప్పాలు = మొట్టికాయలు [కరీ]

## ఢో

ఢోకా — ఢోకిరి

ఢోకా = సందేహము; డోకా [కర్నూ]

ఢోకిరి = తుచ్ఛుడు [కరీ]

## ఢౌ

ఢౌలు

ఢౌలు =(చూ) దవులు [నె; గు]

తంగ=చాదస్తము; వెఱ్ఱితనము [గు]
తంగి=ఆగి— *తంగి చూచుకొని రా* [చి]
తంట=అవినీతి సంబంధము — *వానికి అది తంటా అయింది* [అ]
తంటాలమారి=(1) తాట్లమారి
(2) తగవులు బెట్టు ఆడుది [అః నె]
(3) కొండెములు చెప్పువాడు [నె]
తండలు = గుంపులు—*లంబాడీతండలు* [వ]
తండలు=అప్పుయిచ్చి, నిర్ణయప్రకారము, ప్రతిదినము వసూలు చేసికొను పద్ధతి; ఇందు వడ్డి కలిపి ప్రతి వాయిదా మొత్తము నిర్ణయించబడును [నె]
తండా=సుగాలి; తాండ [అ]
తండు= (1) తంతి [గో]
(2) కాయతీసిన వెనుక కట్టిన వేరుసెనగ చెత్తమోపు [గు]
తండువేయు = కాపుకాయకుండా పైరు బలియు [గు]
తండేలు=పడవ పనివారిమీద పెత్తనము చేయువాడు [శ్రీ]
తండ్లాడు= (1) బాధపడు
(2) ప్రాణము పోక కొట్టుకొను [వి]
తంతి=పర్యాయము; పారి; మారు; తూరి
తంతి తీగ=లోహపు తీగ; Wire [తె;నె]
తంతె=(1) కాలువ త్రవ్వునపుడు ప్రక్కన కొంత విడిచిన ప్రదేశము [అ]
(2) మెట్టు [కరీ]
(3) గుంట త్రవ్వుటలో అండగా నిలిపిన మెట్టువంటి గడ్డ; తంతి [నె]
తంద=తొందరపాటు [అ]
తందర = బెదురు; బిత్తర— *తందర పోయినా* [నె]

తందర బిందర = మానసిక కల్లోలము— *నావని తందర బిందరగా నున్నది* [నె]
తందాడు = మోట (కపిల) తోలి నిలుపు నపుడు బొక్కెన (బాన) వ్రేలాడగట్టి యుంచుటకు బిళ్లకు కట్టు త్రాడు [నె-పొ]
తందాన కత = బుఱ్ఱకత; జంగమకథ [అ]
తంప=బరువు [శ్రీ]
తంపర =జొన్న, సజ్జ మొదలగు కంకులను ఉముకు బూడిదలో కాల్చునది; తంపటి [తె]
తంపి=పిడకలతో గుండ్రముగా అమర్చిన పొయ్యి మంట; పిడకల దాలి: పుటము [శ్రీ]
తంపు= జ్ఞాపకము — *ఆ మాట యిప్పుడు తంపుకు వచ్చింది;* తనువు [అ]
తంపులు=పోట్లాటలు [కృ; గు]
తంబ = (1) పుక్కట బెట్టుకొని యుండు, పొగాకు తమలపాకు గలసిన ఉండ
(2) ఒక కూరగాయ [నె; చి]
(3) చేతగానివాడు, తమ్మ; తంబు [తె]
తంబు=(చూ) తంబ
తంబోజి=పారుదల కాలువలు చీలు చోటు; యాగర; Regulator [నె-తూర్పునాడు]
తకతకలాడు=ఆవేదన పడు [నె; కర్నూ; అ; తె]
తకిసా=పర్యాయము; తడవ — *ఈ తకి సాకు ఇది చాలును;* తక్కసా [నె-పొ]
తక్కాళి=టొమేటా; టక్కోరపు వంకాయ [చి]
తక్కిడిది=పనికిరాని వస్తువు [నె]
తక్కిడి బిక్కిడి=(1) నిలుకడలేని
(2) అడ్డదిడ్డము [నె]
తక్కిరిబిక్కిరి=గందరగోళము [తె]

(2) మోసము [సే]
(3) ఉక్కిరి బిక్కిరి (ఊపిరి తిరగక పోవు [కృ]

తక్కిసా = పర్యాయము; తడవ, తకిసా [నె; ఖ]

తక్కు = (1) అబద్ధం
(2) రాయు; రాచుకొను [అ]

తక్కుబిక్కు = మంచిచెడ్డ — *వానికి తక్కు బిక్కు తెలియదు* [నె]

తక్కైదడుగు = పెండ్లిలో మామ అల్లుని, పిల్లవాని తండ్రి పెండ్లి కూతురును, ఇంకొకసారి ఇట్లే పెండ్లికొడుకు పెండ్లికూతురును ఎత్తుకొని, పందిరిచుట్టు ఆడుచు తిరుగునది. ఇది కురవ, గొల్ల మొదలగు వారిలో నున్న ఆచారము. మహమ్మదీయులు వధువును వరుడు విడిదికి మోసికొనిపోవు ఆచారము వంటిది [మ]

తక్కైడు = తూకపు కొలత- [మ]

తగల = కంచెయందు దారి కడ్డముగా పెట్టబడిన తలుపు (చూ) పెండెము

తగలాటము = బంధము — *లంజకు బిడ్డ తగలాటము;* తగులాటము; తగులము [నె; తె]

తగులాటము = (చూ) తగలాటము [నె]

తగులు = ఏర్పడిన గట్టి సంబంధము; బంధము [కర్నూ]

తగులుబడి = అచ్చుకోవలసి వచ్చిన ధనము, తగిలినది [నె]

తగ్గుమొగ్గు = (1) సరాసరి, సగటు
(2) డబ్బుకు ఇబ్బంది — *తగ్గుమొగ్గులకు ఆదుకోవాల* [నె; కర్నూ; అ; తె]

తచ్చాడు = (చూ) తారాడు [గు]

తటపటాయించు = వెనుకముందాడు; సంకోచించు — *ఆయన మాయింటికి రాను తటపటాయించినాడు* [నె]

తటాకమగు = పూర్తిగా నిండు — *చెరువు తటాకమైనది* [అ]

తటుక్కున = తటాలున; పుసుక్కున [నె; అ]

తటుక్కుమని = వెంటనే; అకస్మాత్తుగా [చి]

తట్టి = (1) పొలముచుట్టు పెద్దరాళ్లతో కట్టిన గోడ [అ-పె]
(2) కంచము; పళ్లెము [కరీ]

తట్టివేయు = (1) అపహరించు — *దానిని మెల్లిగా తట్టివేసినాడు* [నె]
(2) కొట్టివేయు [అ]

తట్టు = (1) ఒకవిధమైన స్ఫోటకము; ఇది పిల్లలకే సోకును, సీతాళాలు [నె; కర్నూ]
(2) కొయ్యచట్టములో, తలుపు మొదలగునవి అమర్చుటకు తీసిన గాడి (పొడవు గుంట) — *కొయ్యలో తట్టు తీసివేయి*
(3) ధన నష్టము — *యీ ఏడు బలే తట్టు తగిలింది* [నె]
(4) జనపనారతో నేసిన చిక్కటి గుడ్డ [వ; కరీ]
(5) గుఱ్ఱము; తిట్టువ; తట్వా [వ]
(6) తీగలు లేని పిడీలు [గో]

తట్టుకొను = (1) నడచునప్పుడు కాలికి రాయి మొదలగు వాటిని తాకించుకొను — *రాయి తట్టుకొని ముందుకు పడినా* [నె; కర్నూ]
(2) విభజించుకొనిన భాగము ఎన్నుకొను; ఒడ్డుకొను — *నేను మిట్టచేను తట్టుకొన్నాను* [నె; అ; తె]
(3) ఆగియుండు; నిబాయించు — *ఈ దెబ్బకు వాడు కాబట్టి తట్టుకొన్నాడు* [నె; వ]
(4) బాగుపడు — *ఈమధ్యా ఆ కుటుంబము తట్టుకొన్నది* [నె]

తట్టు తగులు = (1) అడ్డు దగులు
(2) లోపము కలుగు, కళంకము ఆపాదించు [నె]

తట్టువ=(1) క్రిందపరచుకొను పట్ట [కర్నూ-పత్తికొండ; తె]
(2) గడుసరి స్త్రీ; తట్టువ [గో]
తడప=పేనని సన్నటిదారము — అరటి తడప [నె; వి; అ]
(2) వాన కురిసినపుడు నాగలికి జుట్టుకొను బరవ [గు]
తడవపుగుడ్డ=వార్పు (గంజి మొదలగునవి వార్చుటకు ఉపయోగించు) గుడ్డ [కరీ]
తడాకు-తడ+ఆకు=హోటల్సు మొద లగు వాటిలో తినుబండారములు కట్టుటకు ఉపయోగించు వెడల్పుఆకు. ఇది మందా రపుఆకు ఆకృతిలో నుండుటచే కొందరు మందారపాకు అందురు [నె; చి; అ]
తడాపిడా=ఒకటి వెన్క ఒకటి [కరీ]
తడి=(1) పొలమునకు కట్టిన ఒక పర్యా యపు నీరు; తడుపుట—ఇక రెండుతడ్లు చాలును. తడితక్కువైనది [నె; కర్నూ; గో]
(2) భాగ్యము—వానిచేతికి తడిలేదు [తె; గు; నె, అ]
తడిక=తార్పుడుకత్తె [చె]
తడికడ్డముబెట్టు = రావద్దని నిరోధించు [కరీ]
తడితగిలించుట=కొట్టుట [నె-పొ]
తడికదాసరి=అప్రయోజకుడు— వాడువట్టి తడికదాసరి. చిత్తూరుప్రాంతమున తడిక (తడక) అను గ్రామములో ఒక గొప్ప సిద్ధుడు యుండినట్లును, ఆయన ఎంత గొప్పవాడో, యితడంత అప్రయోజకుడు అనుట—అని కొందరి వివరణము, అవు తారుడు అన్నట్లు. ఇంగ్లీషులో డన్సు క్రోసెటిస్ అనుటవంటిది
తడిసిముప్పందుము = లాభమువలెగన్పడు గొప్పనష్టము [వి]
తడిసిముప్పైపందుమైనది = స్వయంకృతా పరాధముతో బాధపడుట. మోయు బరువును తానే తడిపి బరువును ఎక్కువచేసి కొనుట; బహుశః ఉప్పుమూటలనుకొని గడ్డిమోపును తడిపి మోయలేక అవస్థ పడిన గాడిద కతనుబట్టి వచ్చిన నానుడి కావచ్చును; పందుము ముప్పందుమైనది (ముప్పందుము = మూడు పందుములు; పందుము=పదితూములు) [నె]
తడిసి మోపెడగు=అసలే కష్టమైనపనికి ఇంకొకటి ముడిబడి మరింత కష్టమగు [గో]
తడుపు=(1) కాన్కముట్టజెప్పు
(2) ముడుపు ఒప్పజెప్పు [కరీ]
(3) స్నానము — తడుపుకోర్చును గాని తడుపుకోర్చాడు
తడుప్పాత (తడుపు+పాత) = స్నానము చేయునప్పుడు కట్టుకొను చిన్నగుడ్డపాత; తడుబ్బాత; తడుబోత [నె]
తడుబోత=స్నానముచేయునప్పుడు పెట్టు కొను గోచి; తడుప్పాత [చి]
తడ్డలు=మురుకులవంటి పిండివంట [మ]
తతంగము=అనవసరమైన ఆర్భాటము— దానికి పెద్ద తతంగం చేసినాడు [నె; కర్నూ; అ; తె]
(2) సన్నాహము [తె]
(3) ఎత్తు
తతి=(1) అదను
(2) సమయము — విత్తనం వేసే తతి [అ; ఐ; నె]
తత్తరేణిని = తాబేలు ఆకృతిగలనీటిపాత్ర [అ]
తత్తవలు = దరువులు; ఆటలు; విపరీతపు చేష్టలు—అంతా తత్తువలు పడుతున్నాడే [నె]
తత్తుగలియు=తంతు సరిపడు — అతనికి నీకు తత్తుకలియదు; పొత్తుగుదురు
తనకలాడు = అవస్థపడు; గింజుకొను; తన్నుకలాడు [అ; ఐ; నె]

తనఖా = (1) జీతము [తె]
(2) భూమి ఆయకము; ఆడుమానము [సర్కా]
తని = (1) క్రొత్తదనము—తనిమజ్జిగ [తె]
(2) కలకలలాడుట — పూలు తనిగా ఉన్నవి [అ]
తనిసికోలు = ఎక్కువ, తనియ జేయునంత —అన్నం తనిసికోలైంది [నె]
తనివిగా = వేరుగా, స్వేచ్ఛగా [చి]
తనీగా = ప్రత్యేకంగా — తనీగా కూర్చున్నాడు [నె; చి]
తనుకులాట = ప్రాణము పోవుటకుముందు అటుఇటు పడుచుండుట ; తన్నుకలాడు [తె; నె]
తనుపు = (1) చల్లని
(2) జ్ఞాపకం—ఆమాట తరువాత నాకు తనుపుకు వచ్చింది; తంపు [అ]
తనువెత్తు = జన్మించు; పుట్టు—నేను తనువెత్తిన నాటినుంచి ఇలా ఎరగను [వి]
తనుసుకొను = పుచ్చుకొను [వి]
తన్నుకలాడు = (1) చేసేపనిలో, ఎక్కువ శ్రమపడు—ఎంత తన్నుకలాడినా పని కాలేదు
(2) బాధచే కాలుసేతులు విదల్చు
(3) బాధపడు [నె]
తన్నుకొయ్య = క్రిందపడకుండా ఆపుగా ఉంచినకొయ్య; తన్నుడుకొయ్య [చి]
తన్నుకోళ్లు = పందెమున తన్నుకొను కోళ్ల [చి]
తన్నుడు = (1) ఆను; ఆనిక — గోడకు తన్నుడు పెట్టు
(2) నీరు పైకిఉబ్బుట— కాలువలో నీళ్ల తన్నుడైనది [నె, తె]
(3) బోటులు [గో]
తపసించు = (1) ఎక్కువగా కష్టపడు (తపస్సు చేసినంతటిపని) — ఎంత తపసించినా పని కాలేదు
(2) ప్రాధేయపడు— ఎంత తపసించినా అయన ఒప్పుకోలేదు [నె; తె]
తపిక్కున = తటాలున; తక్షణం; గబుక్కున [శ్రీ]
తపిల - (1) వంటచేసికొను కంచుపాత్ర
(2) క్రింద పైన ఒకేకొలత గలిగిన చిన్నదబర, తపేల [నె, కర్నూ]
తపుకు = పళ్లెము; తబుకు [వ]
తపెల = (చూ) తపిల [అ; నె]
తప్పేల = (చూ) తపిల [తె]
తపెలంటు = తపెల లోపలిభాగముచుట్టు వరిపిండి అప్పచ్చులు అంటించి, వేడిచేసి పాకముజేసిన పిరుతిండి; తప్పేలంటు; తప్పాలచెక్క; తప్పాలపిండి [నె; తె]
తప్పాలచెక్క = (చూ) తపెల అంటు [మ]
తప్పాలపిండి = (చూ) తపెలంటు [వ]
తప్పిడిగుండ్లు = జాతరలలో ఉపయోగించు చిన్నమృదంగ విశేషము [శ్రీ]
తప్పిదారి = (1) అనుకోకుండా — తప్పిదారి వచ్చినాడు
(1) అరుదు; అప్పుడప్పుడు — ఆ చెట్టు తప్పిదారి కాయును [నె; కర్నూ; తె; అ]
తప్పుడు = చెడ్డ; విశ్వాసపాత్రము కానిది— వాడు తప్పుడోడు [నె; కర్నూ; అ; వ]
తప్పుడోడు = (తప్పుడివాడు) వంచకుడు; చెడ్డవాడు—వాడు బలే తప్పుడోడు [నె]
తప్పుడుసాక్ష్యము = అబద్ధపు వాఙ్మూలము; కూటసాక్ష్యము [నె, కర్నూ; అ; తె]
తప్పెట = డప్పు; పటహము; తబట [నె; కర్నూ; తె; అ]
తప్పేలంటు = (చూ) తపెలంటు [కర్నూ]
తప్పేసినారు = అపరాధము విధించినారు— వాడికి ఐదురూపాయలు తప్పేసినారు [చి]

తబట = తప్పెట [సే]
తబాయగు = చెడిపోవు [కరీ]
తబుకు = (1) వెదురుపళ్లెము [అ]
(2) ఆసనము [గు]
(3) పళ్లెము [నె]
తభావతు = అనుకొనిన నిర్ణయమునకు వ్యతిరేకముగ నడచుకొనుట [గో]
తమకు = చలించు—వాడు దానికి తమకడు; తముకు [నె]
తమర = కొమ్మలో చీలు కొమ్మ పుట్టినచోటు —*తమరకొయ్య; తమరవుల్ల;* ముడి [చి]
తమలపాకు = స్త్రీలశిరోభూషణ విశేషము [నె]
తమాయించు = (1) నిదానించు; వేగిరపడకుండు [నె]
(2) నిగ్రహించు [తె]
(3) సంబాళించు [అ]
తమిరె = (1) కాడిమానుకు మధ్యనుండు చిన్న ఇనుపచీల
(2) బుడుపు — *వాడు తమిరెతలవాడు* [నె]
తముకు = దండోరా; చాటింపు [చి; కరీ]
తమ్మ = (1) ఎంగిలి [కరీ]
(2) నోటబెట్టుకొనియుండు పొగాకుముద్దతంబు [చి; నె; అ]
తమ్మట్లు = రాళ్లు బిగించని బంగారుకమ్మలు; సాదాకమ్మలు [శ్రీ]
తమ్మి = చిన్న త్రాడు [నె]
తమ్మె = (1) దారము [చి]
(2) పశువులను కట్టివేయుతాడు [నె]
తమ్మెట్లు = దుద్దులు [వి]
తరక - (1) ఉతికినబట్టలలో అక్కడక్కడ రంగువెలసి తెల్లనైన భాగము [తె]
(2) నూక [సే]
(3) వెన్న చిలికిన తరువాతకూడ మజ్జిగలో మిగిలిపోయిన కణములు—*మీగడ తరకలు* [గు]
(4) గింజ పట్టని ధాన్యపు గింజ; పొల్లు గింజ—*ఆపంట చాలా తరకపోయింది* [నె]
తరబడి = పద్ధతి [నె-తూర్పు]
తరము = (1) నిండుబండి కదలిపోకుండా చక్రాలదగ్గర పెట్టురాళ్లు [వ]
(2) బండలు మొదలగు బరువులుమోయునప్పుడు, ఒక గట్టిత్రాటి అల్లకముమీదనో గోతముమీదనో బరువునుంచి, దానినాలుగు మూలలకు నాలుగుత్రాళ్లు గట్టి ఆత్రాళ్లను కావడిగా ఒక అడ్డకొయ్యకు (కాడి) గట్టి ఇద్దరు మోసికొనిపోవు సాధనము [నె-ఆత్మకూరు]
(3) భూమికి శిస్తు నిర్ణయించుటలో చేయు విభాగము—*దానికి రెండో తరము శిస్తు వేసినారు* [నె]
తరమువేయు = బండి గీఱలకు (గాలులకు, చక్రాలకు) అడ్డముగా రాళ్లు అడ్డుట [కరీ]
తరలదోలు = మట్టిని పాశముజేయుకొఱకై ఎత్తునుండి వంతకు దోలు [కరీ]
తరలబట్టు = బావిని ఒకవైపు పెంచిత్రవ్వు [కరీ]
తరలు = చనిపోవు [కరీ]
తరాలనాటి తాటికాయ = (వ్యంగ్యముగా) చాలకాలమునాటి మనిషి [కరీ]
తరి = (1) వెన్న
(2) వెన్న ఎక్కువగా కలిగినపాలు —*తరిబజ్జ* [నె]
(3) మాగాణిపొలం [తె, అ]
తరికుండ = చిలుకవలన పేరిన పాలు (పెరుగు) గలిగిన కుండ—*తరిబొట్టి* [నె]
తరిగలగొడ్డు = బాగుగా వెన్నవచ్చు పాలు గల గొడ్డు [గు; నె]

**తరిణబట్టు**=(చూ) తరినబట్టు [నె]
**తరిణె**=(చూ) తరినబట్టు [చి]
**తరిదివసము**=ఋతువు; అదను
**తరినబట్టు**=కఱ్ఱను త్రాటిచే త్రిప్పుచుండగా దానిపై రూపులు తీర్చుట; తరిణబట్టు; తరివెనబట్టు [తె; నె]
**తరిపి**=(1) పాలుద్రాగుట విడిచిన వయస్సు—*తరిపిదూడ*
(2) ముదురు—*తరిపిఎండ* [నె; కర్నూ; తె]
**తరిమణ**=(చూ) తరినబట్టు [చి; నె]
**తరివెనబట్టు**=(చూ) తరినబట్టు [నె]
**తరుగు** = (1) పచ్చిధాన్యము ఎండింపగా వచ్చిన తగ్గుదల—*పుట్టికి తూము తరుగు పోయింది* [అ: నె]
(2, వ్యాపారములో ఇచ్చు కమీషను [చి]
**తరుగులు**=ఎండిన అరటి ఆకులు [నె]
**తరుపు**=(1) దూడలు పెట్టిన (ఈనిన) పసరము [చి]
(2) కట్టుకురాని ఆవుపెయ్య [నె]
(3) ఫలమునకు సిద్ధమైనది [చి]
**తర్జీకాయ**=విత్తులులేని తాటికాయ; లొట్ట [కరీ]
**తర్లుబెండ్లి**=స్థలాంతరమునకు పెండ్లికొడుకు పోయి చేసికొను పెండ్లి — *పెండ్లివారు తరలిపోయినారు* [నె]
**తల**=పెద్దవాడు—*అతడు మాకు తల* [అ]
**తలకట్టు**=(1) జత — *భార్యాభర్త తల కట్టుకు రూపాయచందా* [చి]
(2) ప్రయోజకుడగు — *పెద్దోడు తల కట్టిన నాటినుంచి* [వి]
**తలకశిం**=ఏటిలో ఊటకాల్వ ప్రారంభమైన చోటు [చి]
**తలకాయలుమార్చుట**=మోసగించు సమర్థత—*వాడు తలకాయలు మార్చేవాడు* [నె]
**తలకొట్టినట్లగు** = సిగ్గగు; అవమానమగు [తె; నె]
**తలకొట్టు** = ధాన్యము మొదలగువాటిని కొలుచునప్పుడు, కొలతపాత్రపై అంచు వరకు ధాన్యమునుసరిపెట్టు—*తలకొట్టిన సేరుబియ్యం; తలగొట్టి కొలువు* [నె; కర్నూ, తె; అ]
**తలకొట్టుమారి**=మోసగాడు; దెబ్బలాడు వాడు; పోకిరి [అ]
(2) వివాదములు పెట్టు మనిషి [తె]
**తలగుడ్డ**=తలపాగా — *నెత్తిన తలగుడ్డ పెట్టుకో* [నె; కర్నూ; అ; తె]
**తలగొడుగు** = దేవునికి ఉపయోగించు భూచక్రగొడుగు (పెద్దగొడుగు) [చి]
**తలచావిడి** = (1) ఇంటిముందున్న పసారా భాగము [నె]
(2) ఇంటిముందున్న లోగిలి, మిట్ట [నె]
**తలజీవాలు**=పేలు [తూ గో]
**తలదాకింది**=అనుభవమైంది; *తలకు దాకినది* [మ]
**తలదాపి**=తలబెట్టి నిదురించు పడకవైపు —*దక్షిణం తలదాపి పెట్టకు, తలమాడు; తలాపి* [నె]
**తలదిండు**=(1) చిన్న కట్టెలమోపు; గడ్డి మోపు [చి]
(2) తలగడ [అ]
**తలనెరసినోడు** = మంచి చెడ్డలు తెలిసిన అనుభవశాలి [చి]
**తలపని**=క్షౌరము — *తలపని చేయించుకో* [నె]
**తలపడు**=(1) కనుపించను ప్రారంభమగు —*కాలువకు నీళ్లు తలపడినవి; నీళ్లు తగిలినవి* [నె]
(2) ఎదురుపడు, మార్కొను—*వాళ్లిద్దరు తలపడినారు* [నె; ప]
(3) ప్రారంభించు [అ]

తలపరిగి = చిన్నవాగుగా పారే ఊటనీరు; తలిపెర; తలిపిరి [అ]

తలపొగురు = (1) గర్వము — *తలపొగురు మనిషి*

(2) ఔద్ధత్యము, పొగరు [నె]

తలకుపోసుకొను = శిరస్నానముచేయు [చె; నె]

తలబిడ్డ = తొలిబిడ్డ [చి]

తలబిరుసు = (1) పొగరు [తె]

(2) *గడుసుతనము* [నె]

తలబీకనకాయ = అర్థముగాని స్థితి, *గందరగోళము — అదంతా తలబీకనకాయగా ఉన్నది* [నె]

తలబీల్చుకొను = చీకాకు పడు [వి]

తలమట్టు = గట్టి నార [నె]

తలమనిషి - (1) సేద్యపుపనులు చేయించే మేస్త్రి (Head-Farm Servant); సేరిదాసుడు [నె]

(2) ఉద్ధారకుడు [గో]

తలమాడు = (చూ) తలదాపి [నె]

తలమాసినవాడు = అప్రయోజకుడు [గు; నె]

(2) తక్కువవాడు [వి]

తలమించినపని = శక్తికి మించినపని; తలకు మించినపని [అ; వి; నె]

తలమునకలు = ఎక్కువ కష్టములలోమునిగి తేలుచుండుట (తల మునుగు నట్లుండుట) — *నాకిప్పుడు తల మునకలుగా నున్నది.*

(2) అవమానంలో మునిగి తేలుట — *తల మున్కలు గండుమీలకున్* [విజయ విలాసము]

(3) తల మునుగునంతలోతు నీరు.

(4) అసాధ్యము [తె]

తలమునిగి తాటిప్రమాణమగు = పూర్తిగా కష్టములలో పడిపోవుట [గో]

తలలు పట్టు = తార్చు [అ]

తలలోనాలుక = (1) ఆదరాణీయుడు— *ఆయన అందరికీ తలలో నాలుక.*

(2) ముఖ్యుడు [తె; నె]

తలవాకిలి = (1) సింహద్వారమునకు ముందున్న ప్రదేశము—*తలవాకిటముగ్గు వేయు*; మిట్ట [నె]

(2) ద్వారమునకు అవతల ఇవతలప్రక్క [తె; అ]

తలవాపి = పడకలో తలుపెట్టుకొనువైపు; తలదాపి; తలాపి × కాళ్ళకట్టు [వ; కరీ]

తలాకిలి = వీధిగుమ్మము; తలవాకిలి [చె; నె]

తలాతోకలేని = అనకొనలేని; పద్ధతి దప్పిన [కరీ; నె]

తలాది = పునాది; అస్తిభారం [సే]

తలాపి = (1) (చూ) తలదాపి; తలాపు [కర్నూ]

(2) దిండు [తె]

తలాపు = తలపైపు; తలాపి, తలదాపి [కరీ]

తలిపిరి = వాగుగాపారే చిన్న ఊటనీరు; తలపరిగి; తలిపెర [అ]

తలిపెర = ఊటకాల్వ కాధారమైనచోటు; బుగ్గ; తలపరిగి [అ]

తలుపుగూడు = గోడలోనే అమర్చిన అల్మేర [మ]

తలుము = ఏతము [నె]

తలుముపీట = తలుము [నె]

తలువాలు = తలంబ్రాలు [మ]

తలె = (1) కంచము [కరీ]

(2) భోజనము చేయుపాత్ర [మ]

తలెత్తు = (1) ప్రయోజకుడగు [వి]

(2) సగర్వముగ ప్రవర్తించు — *ఎట్లా తలెత్తుకొని తిరిగేది* [నె]

తలేరు = ఎక్కువ బరువును లాగించుటకు ఒక కాడి ఎద్దులకు ముందు ఇంకొకకాడి

ఎద్దులను కట్టి పూన్చినది—*తలేరు కట్టి లాగించినారు;* తల్లేరు [నె; తె]

**తల్మలాయించు**=తనలో తాను మధనపడు [కరీ]

**తల్లడమల్లడమగు**=తపించు [కరీ]

**తల్లిపడి**=చెరువు అరగాణి [నె]

**తల్లి మాలక్ష్మి**=స్ఫోటకము [శ్రీ]

**తల్లివర**=కుంపుడు బావులలో క్రింద మొదలుగా నుండు నట్టి వర [నె]

**తల్లాకు**=విడాకులు [కరీ]

**తలారి**=కామ (కర్ర) లేనిగొడుగు; గిడుగు [వి, శ్రీ]

**తల్లేరు**=(చూ) తలేరు [నె - ఆత్మకూరు; కర్నూ]

**తవర**=తంటా — *తవర కూతలు; తవర నోరు* [నె-కలువాయి]

**తవుడు**=(1) మెలకువగా అపహరించు—*వాడి జేబు తవిడినారు* [నె]

(2) వ్యభిచరించు—*వాడు అందరిస్త్రీలను తవిడినవాడె* [నె]

**తవుళి**=అబద్ధము [నే]

**తవ్వ**=రెండు సోలలు [కరీ]

**తవ్వకము**=(చూ) తొవ్వాటకము [కర్నూ]

**తవ్వగాము**=తవ్వేడు జీతమునకు పని చేయువాడు [కరీ]

**తవ్వితలకెత్తు**=పెద్దగా కూర్చు [కరీ]

**తవ్వోడ**=(దెబ్బరు) సముద్రము త్రవ్వే ఓడ [వి]

**తసుకు**=జారుకొను; తప్పించుకొను [తె]

**తళుకు** = చిన్నబిళ్లవలెనుండు రాళ్లలేని కమ్మ [నె; కర్నూ]

**తళ్లు**=(1) పనికిరానిది; తక్కువది — *అది పట్టి తళ్లుపసరం* [నె]

(2) వంతులుగా పొలమునకు నీరుపారించు కొమ్మలు; పూటలు [అ]

(3) తొందర కలిగించు కారణం—*పెండ్లి తళ్లులో ఉన్నాడు* [నె]





**తాకట్లు**=(1) స్పర్థను పెంచు చేష్టలు—*తాకటుమారి*

(2) తంటాలు [నె; కర్నూ; అ; తె]

**తాకనాడు**=తాకునట్లుగా ఆడు; అన్యాపదేశముగా దూషించు — *ఆయన నన్ను బాగా తాకనాడినాడు* [నె; తె; అ]

**తాకబాక** = ముట్టుకోకు — *గుంటువారి ముట్టుకోకను నెల్లూరువారు తాకబాక అంటారు* [నె]

**తాకి ముగినోళ్లు**=అనుభజ్ఞులు [మ]

**తాకుడుకాళ్లోడు**=కాళ్లు ఒకదానితో ఒకటి రాస్తూ నడుచువాడు; తొంటకాళ్లవాడు; యాసకాటము [మ]

**తాకునబడు**=అనుభవమును పొందు [కరీ]

**తాకొను**=తలపడు; ఎదురుపడు [నె; తె]

**తాకేయు**=నాగలి మొదలగువాటిని దిగగొట్టి అమర్చి సిద్ధముచేయు [అ; నె]

**తాగగలుగు**-త్రాగగలుగు = కూడుగుడ్డకు కొదవలేకుండా ఉంచు [నె]

**తాగడ**=గంజి మొదలగు ద్రవమైన ఆహారము — *జబ్బు జలమై తాగడగూడ పోవుటలేదు* [నె-పొ]

**తాగేడు**=పల్లపుపొలము [నె]

**తాచ్ఛారము**=(1) ఉపేక్షభావము; తాస్కారము

(2) తిరస్కారము

(3) నిర్లక్ష్యము [అ; బ; నె]

**తాటు**=(1) బ్రాహ్మణుడు [వి]

(2) చెట్టు మొదలగువాటి బెరడు;చర్మము

**తాటుదీయు**=హింసించు — *వాడి తాటలు దీసినారు; తాటలు బలియు* [తె; నె]

**తాటుసిరపడు**=బ్రాహ్మణమనిషి [వి]

**తాడిగుంపులు**=తాటితోపులు [గు]

**తాడిపత్రిపంచాయతి** = (చూ) దుప్పటి పంచాయతి; చెన్నంపల్లి పంచాయతి[అ]

**తాడులేనికట్టు**=ప్రేమబంధము [కరీ]

**తాడోపేడో** = అటోఇటో తేల్చివేయు; కాల్చో పూడ్చో అన్నట్లు [గు, నె]

**తానకం**=ఉనికిపట్టు [శ్రీ]

**తాపకము**=ఒకదాని కింకొకటి జతపఱచుట; పోటి [కరీ]

**తాపలు**=మెట్లు; అంచీలు; చీడీలు; పాంటికెలు; మెటికలు [తె]

**తాపు**=వంపలజత; ధోవతుల చాపు; చాపు [అ]

**తాయం**=తినుబండారము పేరు మరుగుజేసి పిల్లలను ఊరించి బేలుపుచ్చుట కుపయోగించుమాట—*నీకు ఒకతాయం పెడతారా;* తాయిలం [నె; తె]

**తాయారు** = (1) తల్లి (అర్ - అనునది తమిళమున గౌరవపదము; రెడ్డియార్, మొదలియార్)

(2) ఒక పేరు—*మంగతాయారు* [కరీ; నె; చి]

**తాయి**=పిన్ని; చిన్నమ్మ [కరీ]

**తాయిలము**=(చూ) తాయం [గో]

**తాయిలాడి**=తంటాలమారి; తారి [అ; పె]

**తారంగము**=పిల్లలను మురిపించు హస్తాభినయ విశేషము [కరీ]

**తారకక్కియ్య**=అభినయముతో మాట్లాడు ఆడది [పే]

**తారము**=(1)తూచుటయందు వస్తువుంచిన పళ్లెము, పెట్టె మొదలగువాటి బరువు; Tare — *బెల్లంతూకంలో బదుపలాలు తారం తీసివేయి* [నె; కృ]

(2) నాణ్యమైన సరుకు గానపుడు తూకమున మినిహాయింపు [కృ]

**తారాడు**=(1) సమీపించకనే దూరదూరము గనే ఉంటి తిరుగాడు — *వాడు ఇంటి చుట్టు తారాడు చుండినాడు;* తారికాడు [నె; తె; గు]

(2) చీకటిలో వస్తువు కనుపించక వెదకు *గ్రుడ్డివాడు తారాడు చున్నాడు* [అ; కర్నూ]

**తారాతిగిడి** = మోసము; తాలాతిగిడి [అ-పె]

**తారాముళ్లు**=తంటాలు—*అది బలే తారాముళ్లది;* మారాముళ్లు [తె]

**తారి**=ఇక్కడిమాట లక్కడ, అక్కడమాట లిక్కడ చెప్పెడు ఆడుది; మాటలు మోయునది [అ-పె]

**తారికాడు**=పని సమయములో పనిమందల వదిలి, చాటు చాటున తిరుగాడు—*పుట్టల సందున తారికాడి వచ్చినాడు;* తారాడు [నె; అ]

**తారిపోవు**=దురెండిపోవు; కోడుతారు [కరీ]

**తారు**=(1) నల్లటిటార్—*తార్ రోడ్డు* [నె; కర్నూ; అ]

(2) ఇనుపతంతి [తె]

(3) ప్రాకు—*తాబేలు తారేజతికింది* [వి]

తారుకులాడు = (చూ) తారకాడు [చి]
తారుపు=భూమిలో సొమ్ము దాచుకొను రాతి పాత్ర [నె-పొ]
తారెట్లాడు = సంకోచించు [నె]
తాలాతిగిడి = మోసము; తారాతిగిడి [అ-పె]
తాలి=మంగళసూత్రము; తాళిబొట్టు; తాళి [నె: కర్నూ; తె; అ]
తాలింపు = తిరగమాత (బోత) (పోపు) ముందుగావేసి ఉడికించిన కూరగాయల వలుకుల కూర—వంకాయ తాలింపు; తాళింపు [నె; కర్నూ; గు; వ; అ]
తాలిపోవు=తగ్గిపోయి; తీసిపోవు [గు]
తాలు=(1) లోపల గింజపట్టని ధాన్యము, తరక; పొల్లు [కర్నూ; అ]
(2) రాగి వెన్నులు కోయగా మిగిలినగడ్డి [అ]
(3) పైరు వెన్ను దీయకనే ఎదిగి ఎండిపోవు — ఈ ఏడు పొలమంతా తాలు పోయింది [నె]
తాలుకట్టు = (చూ) పొల్లుకట్టు [గు]
తాలుబోలు=(1) పనికిరాని తట్టుధాన్యము [కరీ]
(2) పైరు వెన్నుదీయకపోవు [నె]
తాలూకులు=రాళ్లబిగించని సాదా కమ్మలు; తళుకులు [అ]
తావారేకు = పెరము [వి]
తావు=వద్ద— అది నా తావున లేదు [నె; కర్నూ; తె; అ]
తాసార్కరము= నిర్లక్ష్యము; తాచ్చారము [అ; బ]
తాళించు=కూర మొదలగు వాటిని పొరటు; పొరుట [చి]
తాళింపు=(చూ) తాలింపు
తాళు=నిలుచు;తమాయించు—కాసేపుతాళు [అ; నె]
తాళువారము = ఇంటి ముంగలి భాగము; మిట్టు; లోగిలి [చి]





తిండి=గోకుడు; దురద [మ]
తిక్కతీత = తీతువు పక్షి [కర్నూ]
తిక్క దిప్పు=గర్వమణచు [మ]
తిక్కపాసు=తిక్కమనిషి [కరీ]
తిక్కబుచ్చిగాడు = అమాయకుడు, ప్రపంచజ్ఞానము లేనివాడు [కర్నూ]
తిక్కడి=మూడు కట్టెలతో నిర్మింపబడిన అనుగట్టు [కరీ]
తిక్కు=(1) రుద్దు; తోము; దులుపు [సే]
(2) తక్కెడ తాడులో బడిన మెలిక [తె]
తినుబండారము = చిరుతిండి, ఫలహారము [నె; అ; తె]
తిన్న=జాగ్రత్తగా ఒళ్లు దగ్గర పెట్టుకొనుట [వ]
తిన్నగా=(1) మెల్లిగా—తిన్నగా మాట్లాడు
(2) క్షేమముగా—తిన్నగా వున్నాడు [నె; అ; తె]
(3) చక్కగా, నేరుగా — దారి తిన్నగా పోతుంది [నర్కా]
తిపారం=పోయ్యేకాలం [శ్రీ]
తిపిరి=వ్యత్యాసము — ధరలో తిపిరి వచ్చింది [నె]
తిప్ప=కుప్ప—ఎరువు తిప్ప; దిబ్బ [అ]
తిప్పకాయ =తిరుగుబోతు [కరీ]

తిప్పలాడి = మగవారిని వలలో వేసుకొను స్త్రీ [తూ-గో]

తిమతిమ = ఏదేని పురుగు కుట్టినచోట కలుగు చిన్నబాధ; చిమచిమ [కరీ]

తిముకు = వేడుకచూడ నిచ్చగించు [అ]

తిమురు(1) ఉరుము లేకుండా తళుకు తళుకు మని మెరయు— *మఖ (కార్తె) తిమిరితే మంచి వానలు: మఖతిమిరితే మదిటిమీది కర గూడకొస్తుంది* [నె]

(2) నొప్పి—*కాళ్లతిమురు:* తీపి [అ]

తిమ్మిరి = మదము— *నీ తిమ్మిరి బాపెద* [కరీ]

తియ్యకూర = (1) లోటకూరకు అల్లము చేర్చి వండినకూర [తూ-గో, తె]

(2) పులుసువేయక, పాలుబోసి ఎనించిన ఆకుకూర [నె]

తియ్యపచ్చడి = చింతపండు వేయకుండా నూరు పెసల ఊరుబిండి [నె]

తిరకాసు = (1) వంకర; తిరకసు

(2) వివాదము [నె]

(3) తిపిరి; వ్యత్యాసము [గు]

(4) గ్రాసులోని తాడుకు ఒడు మెలి; తిక్కు [గ]

తిరగా = మరల, తిరగాచెప్పు, తిరిగి చెప్పు [అ; బ]

తిరగమాత = తిరగబోత, పోపు, తిరగ మూత; తిరగమోత; తిరగవాత [నె; రా]

తిరగమూత = తిరగబోత; పోపు; తిరగ బాత, తిరగమాత; తిరగవాత; వగ్రణ

తిరగవాత = తిరగమాత; తిరగబోత; పోపు

తిరిగిణి చెంబు = మరచెంబు, రైలు చెంబు [అ]

తిరిబెట్టు = ప్రేరేపించు; పురెక్కించు [గో]

తిరుకసు = వంకర; తిరకాసు [కరీ]

తిరుగటిపళ్లు = దవడపళ్లు; సొక్కపళ్లు

తిరుగుజేసికొను = మార్చుకొను [కరీ]

తిరుగుడు = (1) వీదిమలక, మలుపు,కుని— *తిరుగుడులో దాగినాడు*

(2) మాటలలో విభేదము; మెలి—*చిన్న తిరుగుడు ఏర్పడింది* [నె, తె]

తిరుగుడుకండ్లు = కనుగుడ్లు ఎక్కువగా చుట్టూ తిరుగు చుండునవి [నె, కర్నూ; అ; తె]

తిరుగుడు కపిల = రెండు జతల ఎడ్లతో తోలు కపిల. ఇందు ఎడ్లు వెనక్కి రాక, బావిపైకి ఎక్కి తిరిగి వచ్చుచుందును. ఈలోపల ఇంకొక జత బానను లాగును.

× వెనుక కపిల (మోట) [చి]

తిరుగుడుపువ్వు = (1) బిళ్లవలె చేయించి జడపై పెట్టుకొను నగ

(2) పొద్దుపొడుపు పువ్వు [గు]

తిరుగుడు వడ్డీ = చక్రవృద్ధి (*Compound* Interest) ఏటేటా వడ్డిని మొదలులో కలిపి లెక్కించునది; ఏటేటా అంతకపు వడ్డి

తిరుపు = మర; స్క్రూ [అ]

తిరుపుచెంబు = మర చెంబు; తిరిగిణి చెంబు; రైలుచెంబు [సే]

తిరుప్పళ్లై = సమాధి [కరీ]

తిరుగుబాత = తాలింపు; పోపు [సే]

తిరుగబారు = (1) కాయలు పక్వస్థితికివచ్చు; పండబారు [గు]

(2) నీరు పొలమంతయు పూర్తిగా బారు [అ]

(3) మడికయ్యలో నీరు నిండుగ ఉండు

(4) నీరు ఎక్కువై పైకి ప్రసరించిపోవు— *వర్షమువలన పొలములో నీరు తిరుగ బారినది*

(5) గింజలు ముదిరి పైరు పండబారు [నె]

(6) కల్లు మొదలగునవి ఎన కలిసిపోవు [కరీ]

తిరుగమాత = పోపు; వగ్రణ [నె, తె, అ]

తిరుగవాత = పోపు; తిరుగమాత [కర్నూ]

తిరువళక్కి = దేవుని దీపము [అ]

తిరూాసు = (చూ) తిరకాసు [వ]

తిర్లమర్ల = లోభాగము పై భాగముగా, పై భాగము లోభాగముగా తొడుగుట — *అతడు చొక్కా తిర్లమర్ల తొడిగినాడు* [కరీ]

తిత్తి = (1) చేపలు వేసుకొను బుట్ట [శ్రీ]
(2) తాటికి ఈతమండలు కట్టి రెండు కొనలను ఇద్దరు పట్టుకొని, చేపలు పట్టుచు సాగిపోవు వారి వెనుక లాగికొనుచు పోవునది [నె]
(2) గుంటలో నీటిని చల్లి వేసిన తర్వాత చేపలు పట్టు సాధనము [చె]
(4) తక్కువ తనమును సూచించు పదము [మ]

తిలాలో = ఒలిసెలు [గ]

తిష్ఠవేయు = వెళ్లకుండా ఒకేచోట ఉండు [తె, నె]

తిళ్లిక = దీపము — *తిళ్లికబెట్టు*: తిల్లిక; తిర్లిక [నె-మెట్ట]





తీగతొక్కి వచ్చు = మతిభ్రంశము పొందు; కొన్ని విషపుతీగలు త్రొక్కిన ఇది కలుగునందురు.

తీగూర = తియ్యగూర; పులుసు వేయని కూర [నె, తె]

తీగెట్టు = పారిపోవు [వి]

తీటకసిందు = (చూ) తీట గజ్జెలాకు [అ]

తీటగంజిరాకు = (చూ) తీటగజ్జెలాకు [అ]

తీటగజ్జెలాకు = తాకిన దురదయగు ఆకు; తీట గంజిరాకు; తీటకసింద; దురద గొండి [అ]

తీడు = (1) బ్రతిమాలు
(2) రాచు—*అతనిని తీడవలె* [కరీ]
(3) దారము మొదలగు వాటిని నోటి ఉమ్మితో పదనుచేసి సరిచేయు—*ఆదారం నేను తీడినా* [నె - పొ]

తీత = అలసి, నరములు లాగు బాధ(తీయుట) —*కాళ్లు తీస్తున్నవి* [నె]

తీతనేల = చెమ్మ త్వరగా ఆరిపోవు పొలము; ఒగ్గిపొలము [నె]

తీతబొత్తంచు = అరంగుళము వెడల్పుండి, బట్టతో అతుకు అంచు [వి]

తీనెపొయ్యి = చిన్నపొయ్యి [మ]

తీనెలు = ఓటికెలు [కరీ]

తీన్‌తేరా = ఇవి ఉరుదూ సంఖ్యలు — *మూడు, పదమూడు* అని. ఇవి మహమ్మదీయులకు అశుభమైన సంఖ్యలు, కాబట్టి అశుభము (వ్యతిరేకము అను అర్థములో వాడబడుచున్నవి.) ఆపని తీన్‌తేరా అయినది. ఇస్లే ఆట్ అరార్ (ఎనిమిది పద్దెనిమిది) గూడ అశుభములు,

తీపరము = (1) నొప్పి—*ఏమమ్మా అంత తీపరము ?* (వ్యంగ్యము) [నె]

తీపు = (1) నొప్పి — *ఒళ్లు తీపుగా ఉన్నది* [నె; తె]
(2) అతృప్తిని కనబరచకుండు — *ఆ మాటంటే వాడిమొగం తీపుగా వుండినది* [నె]

తీయు = నీళ్లు తగ్గు—*ఏరుతీసింది* [నె]

తీరవ = (1) విధము, న్యాయము — *అదేమి తీరవ ?* [నె; తె; అ]

(2) పారుదల నీటిని పంచిపెట్టి, వేరు వేరు కాలువలకు పారించు చోటు—*తీరవలు వేసినారు;* యాగర; తీరు (Regulator) [నె]

తీరా=చివరికి—*తీరాచూస్తే తెలిసింది* [చి; నె; కరీ]

తీరాల ('రా' ఉచ్చారణ తాటాకువలె)=అపరక్రియలు; కర్మంత్రాలు [నె]

తీరికదీర్చు=నిశ్చయించు.

తీరు=కొయ్యలో ఏర్పడియుండిన ముడి—*వానం తీరులో విరిగింది* [నె; అ; చె]
(2) రూపొందు—*అది అందంగా తీరినది.* [నె; కర్నూ; అ]
(3) మరణించు—*తీరిపోయినాడు* [అ]
(4) దంతె (లాదిన మిద్దెకు అడ్డముగవేయు కొయ్య) [చి; అ]
(5) బాణము — *ఒక్కతీరు వేసినట్లుగా నున్నది* [నె-పొ]
(6) పంటపొలంలో ఒకభాగం [అ]
(7) సభ్యత—*తీరుమాలినవాడ* [నె]

తీరుతీరు=రకరకాల [కరీ]

తీరుతెన్నులు=(1) అందచందాలు [వి; నె]
(2) క్రమవిధానము;ఔచిత్యవిధములు[నె]

తీరు దినుసు=(1) అందచందము
(2) క్రమము—*తీరుదినుసులేని పనిచేసినాడు* [నె; అ]
(3) అన్నిరకముల వస్తువులు [తె]

తీరుబడి=తీరుబాటు; పనితీరిక — *తీరుబడి దొరకలేదు* [నె; కర్నూ; అ; తె]

తీరుభోగ్యము=అప్పుగా ఇచ్చినడబ్బు తీరువరకు ఋణస్థుని భూమి ననుభవించుట; స్వాధీనాడుమానము [అ]

తీరుమానము=(1) పనిని వగదెంచు; తీర్మానము [వి; నె]
(2) పూర్తిగా—*చెప్పు తీర్మానంగా తెగిపోయింది* [నె]

తీరువ=(చూ) తీరవ [నె]

తీర్పు = అప్పు మొత్తముమీద వడ్డిని గుణించి, మొదలులో చేర్చుట—*ఏటేటా తీర్పు:* అంతకము—*మూడేండ్ల తీర్పులో వడ్డి* [నె]

తీర్థము=(1) జాతర
(2) నీరు [కరీ, చి]

తీసిగుద్దులు = రెండు పొట్టేళ్లను విడదీసి మరల వదలుచు వచ్చు పోట్లాటపందెము [శ్రీ]

తీసివేయు=తక్కువ పరచు—*అంతతీసేసి మాట్లాడవద్దు* [తె; నె]

# తు



తుంట=(1) తునక; ముక్క
(2) పోకిరి—*తుంటరి* [అ]

తుంటెము=కుఱుచ; తొంటెము [కరీ]

తుండు=(1) గట్టి చిన్నకొయ్యమొద్దు
(2) తడి తుడుచుకొను చిన్నగుడ్డ; టవల్ [నె; కర్నూ]
(3) లావైనవాడు [అ]

తుండుగుడ్డ=తువాలు [వి; నె]

తుండుకోల=చెట్లుగీయు గముడు (గమళ్ల) కత్తి నూరుటకు ఉపయోగించు రెండు మూరల గట్టికర్ర [నె - ఆత్మకూరు]

తుంప=ముక్క, తునక [నె-పొ]

తుంపర=సనసన్న పొడి చినుకులు; తుప్పర [నె]

తుంపు=(1) జగడము — తుంపులు పెట్టకోకు [చి]
(2) పేలిక; బట్టముక్క [తె; గు]
తుంబ=గింజలుతీసి ఎండబెట్టిన సొరకాయ; తుంబి [ఉ-వి]
తుంబి=(చూ) తుంబ [వి]
తుక్కు=కావలసినన్ని; ఎక్కువ—వంకాయలు తుక్కుతుక్కుగా ఉన్నవి [అ; నె]
తుటాయించు = విరిగిపోవు; తెగిపోవు [కరీ]
తుటుము=(చూ) తుట్టి [చి]
తుట్టమార=బొత్తిగా, పూర్తిగా— అది తుట్టమారా పనికిరాకుండా పోయింది [నె]
తుట్టి=(1) చింతపండు మొదలగునవి చెడిపోయి ముద్దగట్టినది [నె; అ]
(2) చెత్తగలిసి ఒకటిగా ఏర్పడినది—ఏటిలో తుట్టెలు కొట్టుకొని వచ్చినవి [నె; కర్నూ; తె]
(3) నష్టము [కరీ; మ]
తుట్టునార = ఒకటిగా కరచుకొనియున్న నార (తడప); గుత్తినారు [నె]
తుట్రు=(చూ) తుట్టి [నె; కర్నూ]
తుట్రపురుగు = చిన్నపాము; దీనికి విషమెక్కువ [చి]
తుట్టె=బొత్తుగ [నె]
తుడాయించి=మాటను కాదని; ఎగురవేసి [కరీ]
తుడుము=చిన్న నగారా, దీనిని తోలు అట్టలతో వాయింతురు—తుడుముతో చాటించినారు [నె; వ]
తుడుముగ=పొట్టిగ-లావుగ [నె-పొ]
తుడుము వేసినారు=ఏదైన ఒక విషయమును గ్రామములో ప్రకటించుటకు తుడుము వాయించుచు చెప్పుట — అమిజీకి రమ్మని తుడుము వేసినారు [నె]
తుత్తర=(1) తీవ్రమైన ఆసక్తి — తుత్తరగాడు
(2) తగినశాస్తి అని వ్యంగ్యము — ఆయన తుత్తర అణగింది [నె; అ]
తునక=తుంట; తునుక; తుంప [గు; నె]
తునకలు = (1) మాంసపు ముక్కలు [అ-పె, నె]
(2) గారెలు, వడలు [గు]
తునకాలు=ఒకవైపుననే పళ్లెము (తట్టు)గల త్రాసు; తునకోల (దీనిని ఎక్కువగా ఎరుకలవాండ్రు ఉపయోగింతురు)
తునకోల=(చూ) తునకాలు [వి]
తునాతునకలు = ఎక్కువగా ముక్కలూ ముక్కలగు — కుండ తునాతునకలైంది [కరీ; నె]
తునితగవు = (చూ) రామాయ పట్నమధ్యస్థం (వంటిది) [గో]
తుపర=జల్లువాన; తుప్పర [అ]
తుపాకిలొట్టోడు=(చూ) పగటి వేషగాడు; బైరూపోడు; లక్కోరోడు [మ]
తుప్ప=గంటగట్టిన పైరు [నె-పొ]
తుప్పడ=తోలు [కరీ]
తుప్పతాలు=కుచ్చితములు [గు]
తుప్పర=(1) కొద్దిపాటి సన్న వాన చినుగులు—తుప్పర చినుకులతో నరిపెట్టుకొన్నది.
(2) కొందరు మాట్లాడునప్పుడు ఉమ్మి ఊరకే బయటపడుట — ఆయన తుప్పరతో చొక్కా తడిపింది; తుంపర; తుపర [నె]
తుప్పలు=వెంట్రుకలు [కర్నూ]
తుప్పుడు=(1) పక్షియాకలు
(2) గొట్టె బొచ్చు [అ]
తుమ్మకాయబిళ్లలు = పడుచులు కాళ్ల వ్రేళ్ళకు బెట్టుకొను మెట్టెలవంటి నగలు [కరీ]

తుమ్మోతుస్కారో = శుభములను అడ్డగా ఏర్పడు అపశకునములు [కం]

తురక చామంతి = బంతిపూలు [చి]

తురక రాయి = బొంతరాయి; ల్యాటరైట్ [తె]

తురాయి = పాము కరచిన వానికి మంత్రగాడు గుడ్డపీలికలో చెడ్డముక్కనుంచి, మంత్రించి ముడివేసి, దానిని వానిదండకు కట్టినతాడు [గో]

తురిమిలి = (చూ) తురుము పీట [అ]

తురుగు = (చూ) తురుము [నె]

తురుము = కొబ్బరి మొదలగువాటిని సన్న సన్న ముక్కలుగా చేయు విధానము—*కొబ్బరి తురిమి పంచకజ్జాయంలో కలుపు* [నె]

తురుముపీట = తురుముటకు ఉపయోగించు సాధనము; తురిమిలి [నె]

తులిపి = పోకిరిచేష్టలు చేయు పిల్లకాయ (Playful) — *తులిపి పిల్లకాయ* [నె; కర్నూ; తె]

తుల్లి = తొలి; రంధ్రము; చెజ్జము; [నె-ఆత్మకూరు]

తువ్వ = (1) చాలసన్నటి దుమ్ము—*తువ్వ ఇసుక* [నె; అ-పె; తె]

(2) ఇసుకవాటు పొలము [తె]

(3) లేగదూడ, తువ్వాయి [గో]

తువ్వాయి = లేగదూడ; తువ్వ [గో]

తువ్వనేల = దుమ్ము ఇసుకతో కలిసి వదులుగా నుండునేల [కర్నూ; అ]

తువ్వర = కొద్దిపాటి సన్నటి వానచినుకులు; తుంపర; తుప్పర [నె]

తుసికిలపడు = (1) జారిపోవు

(2) అక్రమ సంబంధమును పొందు

(3) వెకిలిగా నవ్వు [గు]

తుళ్లు = ఒక విధమైన చేప [చె]

# తూ



తూకము = బరువు—*నిండా తూకమైంది* [అ]

తూకమున్నమనిషి = లెక్కింపదగిన; మంచిమాటగలవాడు; గౌరవమున్నవాడు [అ]

తూకి ఆకు = బీడీలను చుట్టు ఆకు, ఇది పుంగనూరు అడవులలో విశేషము [చి]

తూకు = (1) ఎత్తుట—*దానిని తూకు*

(2) వ్రేలాడగట్టు—*తూకుమాను*

(3) మరణశిక్ష—*వాడికి తూకుకు యిచ్చినారు* [నె; చి]

(4) దుత్తకు కట్టిన త్రాడు; ఉగ్గము

(5) నీళ్లుతోడు సాధనము [చి]

(6) టిఫిన్‌క్యారియర్ [నె-వెంకటగిరి]

తూగిటించు = కునుకు [సే]

తూగు = ఒకవిధమైన బిందె; కడవ; బుంగ; బిందె [గు]

తూగు = (1) సిద్ధమగు [శ్రీ]

(2) భరించగలశక్తి—*దానికి నేను తూగలేను*

(3) ఉత్సాహము [కరీ]

తూచినట్లు = హెచ్చుతగ్గు లేకుండగ; సరిగా —*ఆ మాట తూచినట్లు సరిపోయినది* (Balanced) [నె]

తూటికూర=(1) పెరళ్ళలో మొలచు ఒక ఆకు కూర [చి]
(2) మడుగులో మొలచు తీగ ఆకు [కరీ; నె]
తూటు=ఆడు గురి [అ-పె]
తూట్లుచేయు=డబ్బు నిలవనిచేయి—వానిది తూట్లుచెయ్యి [అ]
తూపరము=(1) రంధ్రము [అ]
(2) పిల్లకాల్వ; జాలారు [కరీ]
తూము = గొడ్డలి, పార మొదలగువాటికి కట్టె బిగించుటకు చేసిన రంధ్రము [నె; కర్నూ; తె]
తూర=నీళ్లపారు తూము [శ్రీ]
తూరు=(1) గద్ద మొదలగు పక్షులు తటాలున ఏటవాలుగా వేగంతో క్రిందికి దిగి, వెంటనే పైకి ఎగిరిపోవుట (Dive)—*గద్దతూరి కోడిపిల్లను కొట్టింది* [నె, వ]
(2) ఉదయించు
(3) వెలువడు [అ]
తూరుగడపోయు = పొలములలో గట్టి గింజను వేఱుపఱచుటకై చేటలతో ఎత్తి తూర్పారబోయు; తూరుపానబట్టు; తూరుపోత [గు]
తూరుపానబట్టు = (చూ) తూర్పానబట్టు; తూర్పారబట్టు [నె, కర్నూ]
తూరుపోత=పొల్లు పోగొట్టుట, తూర్పాన బట్టుట [కృ]
తూర్పానబట్టు=తీవ్రంగా విమర్శించు—*వాడిని తూర్పాన బట్టినారు;* ఏకివేయు [నె; కర్నూ; వ]
తూలివాడు = చేపలను పట్టువాడు, బెస్త [చె]
తూలు=(1) వ్యర్థమైనది—*తూలుమాటలు*
(2) మాటజారు—*మాట తూలినాడు* [అ]
(3) అనవసరంగా మాట్లాడు, తిట్టు [గో]



## తె



తెండి=చిన్న గడ్డికుప్ప [అ-పె]
తెండు=పైరులకు నీరు తోడిపోయు [శ్రీ]
తెండె=(1) ప్రవాహమున తేలివచ్చు కంపా గట్రాలముద్ద; తెండి [చి; నె]
(2) చేపలగుంపు [నె]
తెంపట్టు=కాడిమోసి ఎద్దు మొదలగు భారవాహకములకు ఏర్పడిన మెడమీది పెద్ద కాయ × కన్నట్టు [నె]
తెంపు=ఉదారము—*తెంపైన మనిషి* [నె; కర్నూ; తె]
తెకాల్పడు=చేతగాగ సొమ్మసిల్లు [కరీ]
తెగజేయు=మిరాసి జేసికొను [కరీ]
తెగడ=(1) చిక్కటిసొంగ—*బరువు లాగలేక ఎద్దుకు తెగడపడింది* [నె; గో]
(2) కోపము [అ]
(3) పరిష్కారము — *అది తెగడ పడలేదు* [తె]
తెగతెంపులు=(1) విడాకులు [వి; మ]
(2) పరస్పర సంబంధము పూర్తిగాతెంచుకొనుట—*నాకు వాడికి తెగతెంపులైంది;* తెగదెంపులు [నె]
తెగబడిపోవు = మేకలు, గొఱ్ఱెలు గుంపు నుండి భయముతో విడిబడిపోవు; బెదబడిపోవు [నె-పొ]

తెగబెరుకు = గొప్ప వెలగలదానిని అవసరమునుబట్టి కొద్దికి తగ్గించి అమ్ము—*సొమ్ములు తెగబెరికి వేసినాడు* [నె]

తెగవ = బాటలందు నీరు పారుటచే ఏర్పడిన పెద్ద దారి (తెగినది) [నె]

తెగాయించు = తెగువచేయు [కరీ]

తెగినది = రంకులాడి—*ఈమె తెగినమనిషి: విడిచినది* [కరీ]

తెగినమనిషి = సాహసికుడు; తెగించిన మనిషి; తెంపరి [మ]

తెట్టు = కంచె; వెలుగు [క]

తెడ్డు = (1) అడుసుమట్టి
(2) పెళ్ళ—*తెడ్లెత్తి కయ్యాలో వెయ్* [చి]
(3) పురుషాంగము — *వాడి తెడ్డయినా యివ్వడు* [చి; నె]

తెడ్డుజాపు = ఎగనామము బెట్టు [కరీ; నె]

తెనుగుజాతి = తెలగజాతి, తెలగాలు [కరీ; న]

తెప్ప = ఒక పెద్ద మడత [కరీ]

తెమడ = (1) తేమ [అ]
(2) (చూ) తెగడ—*తెమడ పడింది* [నె]

తెమలు = (1) కదలు
(2) పని పూర్తిచేసుకొని బయలుదేరు—*తెమలడు; తెమలిరాడు* [నె; గో; అ]
(3) పరిష్కారమగు; వగదెగు [వి; నె; అ]

తెయ్యమ్మ = తెలివితక్కువవాడు [గు]

తెయ్యిమను = మిడిసిపడు [వి]

తెర = ఆగిఆగి వచ్చునది — *దగ్గు తెరలు తెరలుగా వస్తున్నది* [నె, వ; అ]

తెరకము = (చూ) తెరబంగి, తెరకవ; వెట్టి బోగుల [నె-ఆత్మకూరు]

తెరకవ = వెట్టిబోగుల; తెరకము; వెట్టి బోగుల; తెరబంగి [నె-మెట్ట]

తెరగవాత = తిరుగపోత; పోపు [అ]

తెరప = (1) బయలు — *తెరపన ఆరబెట్టు*
(2) చిక్కులనుండి బయటపడుట—*తెరపన ఒడినాడు*
(3) విషయము దాచుకోకుండుట—*తెరపగా చెప్పివేసినాడు* [నె]

తెరపి = (చూ) తెరిపి; తెరిపిన [కర్నూ; గుః అ; వ]

తెరిపి = సందు; వీలు—*ఏమీ తెరిపి దొరుకలేదు* [నె; ద; గో]
(2) వాన వెలిసిపోవుట — *వాన తెరిపి యిచ్చింది* [నె; కర్నూ; అః వ]

తెరిపిన = (చూ) తెరిపి

తెరబంగి = వెట్టిబోగుల—*వాడు వట్టి తెరబంగి;* తెరకము [నె]

తెఱ్ఱు = (1) మధ్య ఏర్పడిన ఎడము—*పైరు తెఱ్ఱులు పోయింది* [నె; అ]
(2) తెలివిలేనివాడు [గో]

తెలగబాముల మనిషి = పెద్ద మోసకాడు [కరీ]

తెలగదుంప = చిలగడదుంప; గనుసుగడ్డ; తెల్లదుంప; గణుసుగడ్డ; రత్నపురిగడ్డ; కంద [వి]

తెలుగుమీఱు = నాగరికత చెందు [గు]

తెలుపుకొను = వ్యాధినుండి బయటబడి క్రొత్తనెత్తురు బెట్టు—*ఈతడు కొంచెము తెలుపుకొన్నాడు* [కరీ; నె]
(2) తన సంగతి వివరించి నమ్మబలుకు [కరీ]
(3) తనకు జరిగిన అన్యాయము పెద్దవారితో చెప్పుకొను — *మీ అబ్బతో తెలుపుకో పో* [కరీ; నె]

తెలె = కంచము [సే]

తెల్లకాక = (1) అత్యంతమైనకాక White-heat, జిఱ్ఱుకాక
(2) ఉచితమైన సమయము — *తెల్లకాకమీద ఇనుమును సాగగొట్టినట్లు* [నె]

తెల్లగడ్డ=వెల్లుల్లి; తెల్లబాయ; ఎల్లిపాయ [చి; నె; నే; అ]

తెల్లగడ్డ కొప్పుది = చిన్న కొప్పు గల ఆడుది; ఎట్టిగడ్డ కొప్పుది [అ-పె]

తెల్లదుంప=(1) చిలగడదుంప; గణుసుగడ్డ తెలగదుంపు; రత్నపురిగడ్డ; కంద [నే]

తెల్లనక నల్లనక=ఒకరిని ఎన్నక; ఇతరుల ను విమర్శించక [కరీ]

తెల్లపోలు=పెండ్లిలో చాకలివాడు బియ్యముతో వ్రాయునది; లగ్గపుపోలు [మ]

తెల్లబట్ట, పచ్చబట్ట = సుఖరోగ విశేషాలు; గనోరియా [వ; నె]

తెల్లబాయ=వెల్లుల్లి; తెల్లగడ్డ [నె]

తెల్లవార్దులు=తెల్లవారు నంతవరకు (రాత్రి అంతా అనుట)—తెల్లవార్దులు మేలొకనే ఉండినాము; తెల్లవార్లు [నె]

తెల్లవార్లూ = రాత్రి అంతా— వాడు తెల్లవారు మేలుకున్నాడు; తెల్లవార్దులు [వి]

తెల్లాకు = సాధారణమైన తమలపాకు × కమ్మేరాకు [చి]

తెల్లారగట్ల=వేకువ [వి]

# తే



తేగడ=అరిగినది [ఓ]

తేగము = ఆలస్యము [నె-పొ]

తేగుడు=(1) తడి ఎక్కువ అయి నిలువ ఉండుటచేత, తీగలు సాగు పాగువంటి పదార్థము—రేగుడు తేగుడుగా ఉన్నది [గు]
(2) వెట్టిమొట్టి ఆకారముతో జొల్లు కార్చుకొనుచుండు వాడు—ఒక తేగుడు మనిషి
(3) చురుకుదనము లేనివాడు; దేబె [నె]

తేనెతెల=మణుగు బూవు అను తినుబండారము [హై]

తేనెపెరడు=తేనెతుట్టి, తేనేరేడ [చి]

తేనెరేడ =తేనెతుట్టి, తేనెపెరడు [చి]

తేప=(1) బొంగ
(2) అందరాని దానికై ఆలోచన [గ]
(3) జొల్లు, సొంగ [గ; గో; వి]
(4) దుక్కివానలో సగము; అనగా అంగుళము లేక ఒక పదునులో పాతిక (నాల్గవ భాగము), ఇప్పటి 6 మిలిగ్రాములు—రెండుతేపల వాన కురిసింది [చి]
(5) అతుకు—తేపల బొంత [అ]
(6) పర్యాయము: తడవ; వంతు, దఫా—ఇది మూడో తేప తిండి [నె]

తేపి=ఆగి, ఆపి—తేపి తేపి ఏడ్చారు [చి]

తేభ్యం=(1) వట్టి అప్రయోజకుడు; చచ్చు మనిషి—ఆయన ఒక తేభ్యం [నె]
(2) తిండిపోతు [వి]

తేలబలుకు=విషయమును నిలువబెట్టకుండా మాట తేల్చివేసి పలుకు—ఋణువుకు వస్తే తేల బలికినాడు [నె; కర్నూ; అ; తె]

తేలుమీను = (1) కుట్టే చిన్న మంచినీటి చేప, మట్టగుడిసె ఆకారంలో నుండును; కొఱమట్ట
(2) ఇంగిలీకము [వ]

## తై



తై అమావాస్య = పుష్య అమావాస్య; చోళంగి అమావాస్య (చోళంగి = ఘటికాచల నరసింహస్వామి క్షేత్రము; చోళంగి వరమనిగూడ)

తైతకలాడు = (1) వ్యర్థముగ తిరుగు

(2) ఇబ్బందిపడు—అంతా పోగొట్టుకొని ఇప్పుడు తైతకలాడుతున్నారు [నె-పొ]

(3) నాట్యము చేయు [తె, నె]

తైనాతీ = నిత్య సేవకుడు; అంటిపెట్టుకొని వుండువాడు [గ]

## తొ



తొంగటాలు = కమ్మలతో వ్రేలాడు రాళ్లు పొదిగిన పతకములు; లోలాకులు [చి]

తొంటు = లోపముతో కూడిన—తొంటుచేయి [కరీ]

తొంటి = (1) కుంటి [నె. దక్షిణ]

[2] తొడయొక్క కీలు—తొంటి విరుగదన్నాను [కర్నూ; నె; వ]

తొంటికాళ్లు = మోకాళ్ల దగ్గర రాచుకొని తగిలే వంకరకాళ్లు [నె]

తొంటెము = కుఱుచ [కరీ]

తొండలు గుడ్లుబెట్టు నేల = సారహీనమైన నేల— పెద్దమ్మకు పసుపు కుంకుమ కిచ్చినది అనుట [నె; అ; తె]

తొండు = 1) బ్రతిమాలు

(2) వరిగడ్డిని లావుగా పురిబెట్టిన పొడవు మోపు (బండిమీద వేసికొని పోవుటకు వీలైనది) [చె]

తొండుమెండుగా = ముడుచుకొని పెద్ద పాటుబడు [కరీ]

తొండెము = (1) మోట బొక్కెనలనుండి నీళ్లు బయటకు పారించునది; తొండము

(2) తెడ్డుజూపుట [కరీ]

తొందర = కష్టము; బాధ—తొందర పెట్టకు [నే; నె]

తొంపు = సాకు; టొంపు [కరీ]

తొంబ = (1) అరిబిగా ఏర్పడిన కాలువ, అక్వడక్టు [నె]

(2) శక్తిలేని వాడు — తోలుకాళ్ల తొంబ [కర్నూ]

(3) ఏమియు చేతగానివాడు

(4) లావైన [తె]

తొక్కటు = (చూ) తొక్కిడి [చి]

తొక్క = టెంక; తొడిక [గో]

తొక్కముక్క = ధాన్యము పంటయొక్క బాహుళ్యము [కరీ]

తొక్కిడి = (1) తొక్కినట్లుండుట; ఎక్కువ—జనం తొక్కిడి అయినది; తొక్కుళ్లు

(2) ఇబ్బంది [నె; కర్నూ; చి; అ; తె]

తొక్కిడి కూడు = సత్రాన్నము. జనం తొక్కిడి అయినప్పుడు పెట్టు భోజనము; తొక్కుడు కూడు [కరీ]

తొక్కు = (1) రోటిలో వేసి తొక్కిన పచ్చడి లేక ఊరగాయ (తొక్కినది)

(2) కూర [మ; నె]
(3) చెరుకు నాటుట—చెరుకుతోట తొక్కు పూర్తి అయినది
(4) అసత్యము—తొక్కుమాట
(5) ముద్దు—తొక్కు పలుకులు [అ]
(6) పెంటప్రోగు [ఉ-వి]

తొక్కుడు = (1) తొక్కినది; దంచినది—తొక్కుడు పచ్చడి
(2) రెండు గడలను ఒకటిగా కలిపి కట్టునపుడు, బిటువుగా నుండుటకు రెంటి కొనలు ఒకదానిపైన ఇంకొకటి బాగా సాగి కలిసి ఉండునట్లుగా చేర్చుట (over lapping); దూలము మొదలగునవి గోడ మీద ఆనుటకు తగిన పొడవు ఉంచుట—దూలమునకు బాగా తొక్కుడు ఉండనీయండి.
(3) ఆను [నె; కర్నూ; తె; అ]
(4) చెడ్డ స్థలానికి పోయిన వచ్చు కీడు [నె]
(5) ఎవరో దిష్టిదీసి ఊరి వెలుపల పారపోయగా దానిని తొక్కిన వాడికి పట్టు రోగము [గో]

తొక్కుడుబండ = కపిలె బావిపై నుండు బండ [నె]

తొక్కుళ్లు = సందడిలో (జనసమ్మర్దములో) ఏర్పడు ఒత్తిడి; తొక్కిడి [మ]

తొగట = (1) రంగు గుడ్డలు నేయు శూద్ర జాతి; దేవాంగులకు వలె వీరికి జందె ముండదు; తొగటి; తొగరి [కర్నూ; నె]
(2) సాలెవారిలో ఒక శాఖ [తె]

తొగటి = (చూ) తొగట; తొగరి [నె]

తొగరి = (చూ) తొగట [ఖ]

తొగరు నీరు = రంగు కలిపి పెండ్లిండ్లలో వధూవరులకుపోయునీరు; వసంతము [వి]

తొగు = త్రవ్వుట [అ]

తొగుళము = త్రవ్వుట; తొవ్వాటము [అ-పె]

తొట్టికట్టు = పెద్ద భవంతులలో మధ్య వదలి పెట్టిన పైకప్పు లేని భాగము, మండవ [నె]

తొట్టు = (1) నీటి ఆనిక. కాలువ వాలుగా లేక కొంత ఎగుడుగా ఉన్నపుడు నీరు వెళ్లక అనుకొని ఉబ్బునది.
(2) నష్టము
(3) ఎక్కువ కర్చు — పిల్లలవల్ల ఎక్కువ తొట్టు అయినది [నె]
(4) బొట్టు— నీళ్లు తొట్టు తొట్టుగా పడుతున్నవి [తె]

తొట్లించు = (చూ) తొట్టించు [నె-ఆత్మకూరు]

తొట్లె = ఊయెల [కరీ]

తొట్లెలేస్కుం = చిన్నబిడ్డను మొదటిసారిగా, ఇరవై ఒక్కనాట ఉయ్యాల తొట్లలో వేయుట, ఆరోజు పాపకు నామకరణం చేయుదురు. బారసాల (తొట్లలో వేయుట) [మ]

తొడకపోవు = వెంట తీసికొనిపోవు—నిన్ను తొడకపోతానులే; తోడుకొనిపోవు [నె]

తొడప = బండ్లు మొదలగు వాని చక్రముకు అంటుకొనిన బురద [నె]

తొడపాము = స్త్రీలకు తొడపై ఏర్పడిన ఉబ్బిన నరము లేక మచ్చ, ఇది భర్తకు చెడుపు, అని గిలి [కరీ; నె]

తొడారిగడ్డ = తొడకు లేచు వ్రణము [నె]

తొడుకులు = దారిలో ఏర్పడిన ఎగుడు దిగుడులు [అ]

తొడుగు = (1) స్వామివారికి తొడవు లలంకరించు [కరీ, న]
(2) తెట్టె; తెట్టెము [తె, రా]
(3) కంప కలిపి కట్టిన పెద్ద మోపు; దీనిని ఎద్దులచేత యీడ్పించుకొని వత్తురు—తొడుగు తోలుకొనిరండి

(4) గజిబిజిగా అయినది—అదంతా ఒక తొడుగైనది

(5) అందికపొందిక లేక విసుగుబుట్టించు దీర్ఘసంభాషణము — ఏదో ఒక తొడుగుగా చెప్పినాడు [నె; అ]

తొడుసు=(1) చెప్పు మొదలగునవి ఊడి పోక కఱచుకొని అడ్డగించునది — కాలి తొడుసు; చెప్పుతొడుసు

(2) కాలికి అంటుకొనిన బంకమన్ను [అ]

తొణుకు=గొల్లవారు, పెండ్లినిశ్చితార్థములో జరపు ఆచారము; వక్కలు కుప్పబోసి ముందు పెండ్లికూతురుచే దోసెడు తీసి కొన జేయుదురు [నె-పా]

తొత్తడము = మోసము [చి]

తొన్ని=(1) బొల్లి; శ్వేతకుష్ఠము [అ-నె]

(2) మగగురిపై తోలు [నె]

తొపిక = (చూ) తొబక; ముడతలు పడిన మేని చర్మము — తొపికలు ఊగులాడు తున్నవి [వ]

తొబక=(1) కాయలపై తోలు [నె; అ]

(2) గుజ్జు తీసివేసిన దొప్పవంటి పండ్ల చర్మము—తోలు తొబక తిని పిల్లి పెద్దపులి అయినది; తొక్క; తొపిక [నె; కర్నూ]

తొల్గు = నష్టము [కరీ]

తొలగద్రోయు = (1) బాధ్యత వహించకుండా తప్పించుకొను

(2) అడిగిన వాటికి నేరుగా ప్రత్యుత్తరమివ్వకుండా మాటల దాటవేయు [నె; కర్నూ]

తొలగాన=బట్ట లుంచుటకు వ్రేలాడ గట్టిన దండెము [వి]

తొలికోడి = వేకువజామున కూతవేయు మొదటికోడి; మొదటి కోడికూత—తొలికోడితో గూడ బయలుదేరినా [నె;కర్నూ; అ; తె]

తొలుచు = శిక్షించు — అతడు శిష్యుని తొలిచినాడు [కరీ]

తొల్కులు = స్త్రీ పొట్టపై గల ముడుతలు; త్రివళి

తొవ్వకము=(చూ) తొవ్వాటము [తె]

తొవ్వాటము=మిరపతోటలో సాళ్ల నడుమ కదలించుటకు త్రవ్వుట — ఇది రెండో తొవ్వాటకము; తవ్వకం; తొవ్వకం [నె]

తొళ్ల = గుజ్జులేని తొక్క; డోళము — తొళ్లలు పారవేసినారు [నె]





తోకఆడించు=(1) చిలిపిచేష్టలు చేయు[తె]

(2) దుర్మార్గము చేయు — వాడు తోక ఆడిస్తే కోసి సున్నం బెట్టినాడు [నె]

తోకకోయు=(1) పనినుండి తీసివేయు [తె]

(2) తగిన శాస్తిచేయు [నె]

తోకతొటారము = ఎడతెగని ఒకే యొక వరుస [కరీ]

తోకపీకు = పిరికితనంతో పరుగెత్తి పోవు [నె; వ; కర్నూ]

తోకపీకుడు=(1) వదలిపెట్టకుండా గోజారుచు వెంటబడుట— తొకపీకుడు గాడు [నె]

(2) మార్కొనక పారిపోవు వాడు

(3) ఉన్నట్టుండి జారిపోవువాడు [అ]
(4) తప్పించుకొని పోవుట
(5) పారిపోవుట — *వాడు తోకవీకుడు గాడు* [తె]

తోకముడుచు = (1) పారిపోవు [తె; నె]
(2) చేష్టలు విరమించు [తె]

తోగు = చిన్న వాగు [కరీ]

తోజు = (1) సన్నాహము
(2) తోడ్పాటు [అ]
(3) తోడు; గుంపు; సహాయము — *వాడి తోజు చేసికొని వచ్చినా* [తె; నె; అ]
(4) ఉత్సాహము — *వాడు చాల తోజుగా యున్నాడు* [అ-పె]

తోట = సేద్యం చేసి పెంచినది — *అరటి తోట × తోపు;* తాటితోపు [నె; కర్నూ; అ; తె]

తోటకూర = కాడలుగా పెరుగు ఆకుకూర — *తోటాకు,* కంబాలకూర [నె, కర్నూ; అ]

తోట పరువుకు వచ్చు = కాయలు ముదర జొచ్చు — *మిరపతోట పరువుకు వచ్చింది* [నె]

తోటాకు = కాడలుగా పెరుగు ఆకుకూర - తోటకూర × క్రిందనే ఆలముకొని కోసే కొంది ఎదుగునది పెరుగాకు [నె, కర్నూ; అ]

తోటాలేదు, తొండములేదు = ఏమీలేదు; అనకొనలేదు [అ]

తోటిది = పాకీ పనిచేయుఆడుది [నె; కర్నూ]

తోటివాడు = పాకీ పనివాడు, తోటీడు; తోచ (తోడివా రనుటకు తోటివా రనుట తప్పు) [నె; కర్నూ]

తోటివాడు = సాటివాడు [తె; సర్కా]

తోటీడు = తోటిపని చేయువాడు — *పాకీ పనివాడు* [నె; కర్నూ]

తోడంటు = పాలలో చేమిరివేయు; తోడు బెట్టు [అ]

తోడిడి = (1) ఎదురు పోవు
(2) మార్పిడి
(3) సహాయము [అ]

తోడిడి = (తోడు + ఇడి) సేద్యపు పనులలో, మనుషులుగనో, పశువుల తోడనో ఒక రైతుకు ఇంకొక రైతు సహాయపడి, తిరిగి యిట్లే పని చేయించు కొనునది; యార పోటి [నె]

తోడిపెట్టు = లాభము కలుగజేయు — *నీ కక్కడ ఏమితోడిపెట్టిరి* [కరీ]

తోడు = విరుగుడు; చేమిరి — *పాలు తోడు* పెట్టుట [తె; అ; సర్కా]

తోడు = (1) స్నానమునకు నీళ్లు సిద్ధము చేయు [అ; నె]
(2) సహాయముగా పోవు — *ఊరికి నాకు అయన తోడు వచ్చినాడు* [నె]

తోడుతపిల = నీళ్లు బోసికొనుటకు వాడు చిన్న పాత్ర, తోడుతపెల [నె; కర్నూ]

తోడుతపెల = నీళ్లు పోసికొను లోటా వంటి పాత్ర; తోడుతపిల [నె]

తోడుబోతు = క్షుద్రోపాసనలతో, పంపుజేసి మనుషుల చంపువాడు. (పంపుచేయుట = ప్రయోగించుట) థగ్ అను క్రూరులు కొన్ని వందల ఏండ్ల క్రితము దేశములో తిరుగాడుచుండేవారు, అట్టివాడే యీ తోడు బోతు. థగ్గులను డాల్‌హౌజీ అను రాజ ప్రతినిధి అణచివేసినాడు. — *దొంగలు తోడుబోతులు* [నె]
(2) దొంగలవెంట బోవువాడు; సాయము చేయువాడు; కట్టుమోతు [నె-పొ]

తోడెంగ = వరి చేనిలో మొలచు ఒక రకపు కలుపుగడ్డి [కరి]

తోదు = (1) ఒద్దిక — *వారిద్దరికి తోదు కుదరలేదు.*
(2) ఒకదానికి ఇంకొకటి సరిపోయి అందగించుట — *ఆ స్తంభానికి తోదు కుదర లేదు.*

(3) ఏకముగా; కలసికట్టుగా—*అందరము తోదుగా పోదాము* [నె: అ; పె]

తోదుబెట్టు = (1) లోహములు కరగుటలో సహాయకారిగా ఇంకొక వస్తువును చేర్చుట, బంగారమునకు వెలిగారమువలె; టంకము బెట్టు [నె]

(2) తోదుబెట్టు; చేమిరివేయు [గో]

తోప = (1) అట్లతదియనాడు అట్లుతో నంజు నందుకు బెల్లంతోచేసే తీపిపదార్థము [గో]

(2) సంకటి [రా; శ్రీ]

తోపారము = ఇంటి పైభాగము [శ్రీ]

తోపు = (1) పూర్వము ప్రయోగింపబడు చుండిన మారణాస్త్రము

(2) బండికివేసి బిగించిన పెద్ద చొప్ప మోపులు—*జొన్నతోపుబండి* [నె-ఆత్మ; అ; నె-పొ]

తోపు = (1) నీరుగట్టి, సేద్యముచేసి పెంచ నవసరములేని చెట్లగుంపు—*సవకతోపు; తాటితోపు* × సేద్యముచేసిపెంచినది-తోట-అరటితోట [నె; కర్నూ-మార్కా-పురం; తె]

(2) నెట్టుట—*ఒక త్రోపు తోచినారు* [నె]

తోపుడు = (1) చిత్రి

(2) ఒక మొత్తములో త్రోసివేసినది —*దానిలో రెండురూపాయలు తోపుడు*[నె]

తోపుతోపగు = తడిసిపోవు [కరీ]

తోపులాట = జనసమూహములో ఒకరి నొకరు తోసుకొనిపోవుట; నెట్టుకొనుట [శ్రీ]

తోపెల = చేపలబట్టు వల [కరీ]

తోపెలగొట్టు = నష్టపడు [కరీ]

తోమడపెద్దు = ఆబోతు; ఆంబోతు; దేవర ఎద్దు; ఆపటెద్దు; అచ్చువేసినఎద్దు

తోమాలసేవ = దేవునికి పువ్వులతో మాత్రము అలంకరించుట—*వెంకటేశ్వ్వ దుడికి శుక్రవారం తోమాలసేవ* [నె-దక్షిణం; చి; అ]

తోముడు = (1) ఊరకే బలవంతముచేయుట [నె; అ]

(2) కొట్టుట [తె]

(3) చీకాకుపరచుచుండుట [వి]

తోలు = (1) వీచు—*గాలి తోలలేదు* [నె]

(2) రొప్పు [కరీ]

తోలుకాళ్లు = చచ్చుకాళ్ల [నె-పొ]

తోలుకొమ్ములు = వ్రేలాడబడి ఊగులాడు చుండు పశువుల కొమ్ములు — *తోలు కొమ్ములు ఎద్దు* [నె, కర్నూ; అ]

తోలుగుడ్డు = కొంత ముందుగా పెట్టలచే పెట్టబడి మెత్తగానుండు గుడ్డు; కానేపటికి దీని చెక్కు గట్టిబడును, నెలతక్కువ బిడ్డవంటిది. ఈ గుడ్డు అశుభసూచకమని ఇది పెట్టిన పెట్టను కోసివేయుదురు [నె, కర్నూ; అ]

తోలుతొండము = కపిలబాననుండి నీళ్ల వెడలివచ్చు తొండమువలెనుండు పైపు [అ]

తోల్పలువడు = దెబ్బలు, తిట్లుతిను [మ]

తోశెము = తక్కువ [శ్రీ]

త్రావులు = ఇంటివాసములు [చి]

# ద



దంగాసేయు = ఇంటిపైకి వెళ్లి అల్లరి సేయు [కరీ]

దంటపడు = తోడగు [కరీ]

దంటు = (1) బాగుగ ముదిరినవరికాడ, జొన్న

కాడ—*దంటు ముదిరినది* [నె; తె; అ]
(2) మగగురి [వ]
(3) పొడుగాటి కాడగల ఆకుకూర [సే]
దండకడియాలు = (1) రెట్టలకు ధరించు కడియములు [మ]
(2) హస్తభూషణములు [కరీ]
దండగవిలె = గ్రామ పొలిమేరలెక్క—హద్దులు తెలుపుస; దండకవిల [నె]
దండి = (1) దేవుని వాహనములను మోయుటకు చట్టమునకు ఇరుప్రక్కల పొడవుగా కట్టు తేలికైన పొడవు దూలము. మట్టి ఊదతోనే దీనిని సాధారణముగా చేయుదురు—*దండిమోతగాండ్రు;* దండె
(2) ముళ్లకర్రతో పొడుచుటచే, దుక్కిపసరములు జొబ్బమీద ఏర్పడిన గాయపు అట్ట (కాయ) [నె తె; అ]
(3) మంచము దండి (పట్టె) [వి]
(4) మగ్గములో నొక పనిముట్టు [చె]
(5) తక్కెడకట్టె [అ]
దండింపు = అనుకూల్యము [కరీ]
దండికట్ట = పంట నూర్చునపుడు ఒకటిగా బోసిన కుప్పలో ప్రక్క నిలిచేవట్లు [చి]
దండుగ = జుల్మానా, ధనశిక్ష [మ]
దండె = (1) తక్కెడకఱ్ఱ
(2) మోకాలు, గిరస మధ్యభాగము [నె-పొ, తె]
దండెగొట్టు = మోసగించు [తె]
దండెము = (1) గుడ్డలు వేసికొనుత్రాడు లేక కఱ్ఱ; దణ్ణెము — *నా చొక్కా దండెము మీద ఉన్నది* [నె; చి; తె]
(2) చెఱకుతోటలో చెరుకుగడలకు అడ్డముగా కట్టిన వెదురు [చి]
దండోడు = ఘటికుడు [కరీ]
దండోరా = తప్పెట, తుడుము మొదలగు వాద్యముల సహాయముతో చేయు గ్రామ ప్రకటనము; చాటింపు—*ఊళ్లో దండోరా కొట్టినారు;* దండోరా వేసినారు [నె; తె; అ]
దంతి = (1) ఒక అడవిచెట్టు [నె]
(2) భవంతులలో మిద్దెలాడుటకు అడ్డముగా పరచిన కొయ్యమాను; దంతె; దెంతె — *దంతులు బిగించినాడు* [నె; కర్నూ; తె]
దంతిక్రవణము = నడిజొబ్బలోపుట్టిన పుండి [కరీ]
దంతె = మిట్టపైరులో సాళ్లనడుమతోలుకృషిసాధనము — *జొన్న దంతెకు వచ్చినది* పండ్లదంతె, అచ్చుకట్టుదంతె, దంతె పలుగు అనునవి వీటి భేదములు [నె-మెట్ట]
దందెడ = మోటగిరకపైకివచ్చే దొడ్డుతాడు; కపిలమోకు [మ]
దందా = వ్యాపారము [కరీ]
దంపకము = వడ్లుదంచుట [నె, కర్నూ; అ; తె]
దంపుడు = మైకా గనులలో సరుకు సాలు ననుసరించి ప్రక్కన ఏర్పడియుండు మెత్తటిరాయి సాలు, దీనితో రాతిచిప్పలు చేయుదురు [నె-గనులప్రాంతము]
దంపుళ్లది = వడ్లుదంకొని జీవించునది [వి]
దక్కించుకొను = పోవుదానిని నిలుపుకొను —*ప్రాణాలు దక్కించుకొన్నాడు* [తె]
దక్కిన = నాగజెముడు; బలరక్కస [సే]
దట్టి = (1) అడ్డముగా చుట్టు కట్టుకొనిన పంచకట్టు; బ్రహ్మచారికట్టు; అడ్డకట్టు; పిడిచుట్టు, అరవకట్టు; లుంగీకట్టు [నె, చి; తె]
(2) చిన్న ఆడపిల్లలకు కుట్టు పావడ వంటిది [కర్నూ; అ]
(3) తువాల; తుండుగుడ్డ (టవల్) [ఉ-వి; నె]
దడ = తూకపుకొలత [మ]
దడబిడలు = తొందరపాటు — *అంతా దడబిడలె;* దడబుడలు [తె]

దడబుడలు = అర్భాటము— ఆయన దడబుడల మనిషి; దడబడలు [నె]
దడాన=(1) తక్షణం; వెంటనే [నె]
(2) హఠాత్తుగ — దడాన వచ్చినాడు [అ; బ]
దడుగ్గున=తటుక్కున; వెంటనే [అ; బ]
దడెము=మణుగులో నాల్గవవంతు [అ]
దత్తంవచ్చు=దత్తుజేసుకొను [మ]
దద్ద=పినతండ్రి; దద్ది [శ్రీ]
దద్దగించు=(చూ) గద్దగించు [కర్నూ]
దద్దరగట్టు=(చూ) మెత్తుకూటి గుడ్డ [అ-పె]
దద్దరగట్టు=(చూ) వాసనకట్టు [అ]
దద్దరించు=(చూ) గద్దరించు [కర్నూ]
దద్దమ్మ = అసమర్థుడు — వాడు వటి దద్దమ్మ [నె]
దద్ది=పినతండ్రి; దద్ద [శ్రీ]
దన్ను=(1) అండ — సుగ్రీవునకు ఆంజనేయుడు దన్నుగా ఉండెను [శ్రీ, వి]
(2) తీగలు పైకిప్రాకుటకు అండగాపెట్టిన పుల్లలు; దరువులు, అల్లుడు [శ్రీ]
దన్నులు=సలుసు; నొప్పిపెట్టు [శ్రీ]
దపిక = మెతుకులు గలిసిన కూటిగంజ— కాస్త దపిక పోయమ్మా: దప్పి; దప్పిక [నె]
దప్పడము=(చూ) దప్పళము [వ]
దప్పళము=(1) కూరగాయ దబ్బలు ఎక్కువగా వేసిన కందిపప్పు పులుసు; సాంబారు —పప్పుదప్పళము [నె; గో]
(2) ఎక్కువ — దప్పళంగా భోజనము చేసినాడు [నె]
(3) పిండికలిపి చేసేపులుసు [వ]
దప్పా = మొట్టికాయ; టొంగా [కర్నూ; కరీ]
దబదబ=శీఘ్రముగా [నె]
దబర=(1) క్రింద, పైన ఒకేకొలత గలిగిన లోహపాత్ర: దబరా; దబారా [నె; తె]
(2) గిన్నె [కర్నూ]
దబరకము = ఉన్నట్లుండి నొప్పిజేసి, మోకాలు వంగకుండుట; దామరకము [నె]
దబరా=గిన్నె [కరూ]
దబరిగి=జేసిన్; ఇత్తడితో తయారుచేసిన పాత్ర [అ-పె]
దబాటు=అకస్మాత్తుగ [నె]
దబాడీ=ధైర్యముగల ఆడుది [అ-పె]
దబాలున=ఉన్నట్లుండి [నె]
దబ్బ=(1) పలుకు, ముక్క — మామిడి దబ్బ
(2) తాటిపచ్చికమ్మ — బజ్జిని దబ్బలో కొట్టు [నె; అ; గో; తె]
(3) తాటిమాను మొదలగు పొడవుమొద్దులను నిలువుకు చీల్చినది — తాటి దబ్బలతో పందిలి వేసినారు
(4) చదరపువైపు—దబ్బపాటున నిలువుగేడిపాటు; గోడుపాటు [నె; కర్నూ]
దబ్బట=అణుకు; అనుకు; పలుచనగు— సంగటి దబ్బట అయినది: దబ్బటి [అ]
దబ్బటి=అనుకు; అణుకు; దబ్బట [అ]
దబ్బనిమ్మకాయ=కరిణికాయ [కరి]
దబ్బాటుగా=అకస్మికముగా [అ]
దబ్బుకొను=పట్టుకొను [చి]
దమ్మ=పశువుల తెగులు, దొమ్మ [కరీ]
దమ్మచ్చు=ఇనుప గుదియ; నేల గట్టిబడుటకై దీనితో పైన చరతురు, దిమ్మెస (Ram) [అ-పె]
దమ్మస్=నేలను గట్టిచేయుటకు, కంకర వేసిన తర్వాత చదరము చేయుటకు మొద్దుతో దంచుట; దిమ్మెసవేయు [అ]

దమ్మస్తు = గచ్చు మొదలగువాటిని గట్టి పరుచునది; దిమ్మెస [అ]
దమ్ము = (1) ఊపిరి—*దమ్ము తీసికో*
(2) చుట్ట సిగరెట్టు మొదలగువాటిని ఒక సారి పీల్చుకొనుట Puff—*ఒక దమ్ము కొట్టు* [నె, కర్నూ; తె; అ]
(3) తడుపుట — *మిరపకాయలు దమ్ము చేసినాడు* [నె]
(4) కల్లుదమ్ముపట్టుట
(5) ధైర్యం [వ; సరా౯]
దమ్ముకపోవు = చెమ్మగిల్లు [గ]
దమ్ముకొను = తేమ పైకి ఎక్కు [గు]
దమ్ముచేయు = (1) పొలమునకు నాటువేయుటకు ముందు తడుపు; చేడవేయు [గు]
(2) తడిపి చేను దుక్కిచేయు
దయ్యపుతాడి = ఏడాదిపొడుగున గలలువేసి పిందె పాటుననే రాల్చివేయు తాటిచెట్టు; తప్పిదారి ఒకకాయ నిలిచినా, దానిలో ముంజకట్టి యుండదు [నె-తూర్పునాడు; తె]
దరువు = (1) అలబడివాళ్లు వేయు చిందు, నాట్యము
(2) చులకనగా ప్రవర్తించు; ఆటలాడు—*ఏమంతా దరువులు వడుతున్నావే* [నె]
(3) పాటలు [కర్నూ; తె]
(4) చమత్కృతి—*దరువువేయు* [కరీ]
దరువులు = కూరగాయ పాదుల తీగలు అల్లుటకు ప్రక్కన నిల్పిన పుల్లలు; అల్లుడు; దన్ను [శ్రీ]
దల్లాలు = మోసకాడు [కరీ]
దవ = ఈదరగాలి [కరీ]
దవకలు = పనిచేయకుండా సోమరిగా తిరుగాడుటలు—*వాడు దవకలు పడుతున్నాడు* [నె]
దవతి = సిరాబుడ్డి; దొంటి
దవుడు = వరుగు—*గుజ్జువుదౌడు* [నె]
దవును = తాలు, ధాన్యపుతాలు [అ]
దశమంతుడు = అదృష్టవంతుడు [శ్రీ; నె]
దసరాపుట్టకొక్కు = దసరా నెలవులో పుట్టు పెద్దరకము పుట్టగొడుగు [వి]
దసవోదలేదు = కనుపించలేదు [శ్రీ]
దసొటాలు = బొబ్బలు—*అతనికి దసాటా లిచ్చితిని* [కరీ]
దసిలి = (1) నెరియ—*రాయి దసి లిడిచింది* [చి]
(2) వదులుగానుండి—*భోక్కా దసిలీగా ఉన్నది* [నె; తె]
(3) బలహీనమగు—*అతడు దసలినాడు* [అ]
(4) చాలిసంత—*చోట దసలీగాఉన్నది* [నె; తె]
దసిలిపోవు = (1) ముదుసలిఅగు [అ-పె]
(2) ఎండచేతకానీ, పని ఒత్తిడిచేతకానీ ముఖము వాడు [గు]
దసులు = (1) అలసిపోవు
(2) చిక్కిపోవు
(3) పాతబడు [నె]
దస్కం = (1) డబ్బు [శ్రీ]
(2) పది; దశకము [అ; బ]
దస్తరము = కాగితములు, పుస్తకములు ఒక గుడ్డలో కట్టినకట్ట—*బడిపిల్లలు దస్తరాలు కటినారు;* దప్తరము (అరబ్బీపదము) [నె; కర్నూ; అ; తె]
దప్తరము = (చూ) దస్తరము [కర్నూ]
దళగట్టు = పాసంగము లేకుండ సరిచేయు [కరీ]
దళము = (1) లాదిన మిద్దె కప్పుమీద, నీరు ఉరవకుండా ఉండుటకు వేయు చదరపు బిళ్లల వరుస—*దళము వేసినారు* [నె; తె]
(2) పాత్ర క్రిందిభాగము [సే]
(3) మూడాకుల తులసిరెమ్మ [అ]
దళ్లి = గుంట [గు]

దాంట్లో=దానిలో [నె; కర్నూ; అ; తె]
దాక = వరకు—*అంతదాక;* దనుక [నె; కర్నూ; తె]
దాగర = పళ్లెమువంటి పెద్ద వెదురుతట్ట [శ్రీ; కరీ]
దాగిడ = వస్తువులు ఆరబోయుట కుపయోగించు పెద్ద వెదురుపుల్లల అల్లికము [శ్రీ]
దాగిరి = అంచుగల వెడల్పయిన పెద్ద వెదురు జల్లెడ, దీనిమీద తిరుగలిపెట్టి గింజలు విసురుదురు [అ]
దాగిళ్లు మూగిళ్లు=దాగుడు మూతలు [మ]
దాచన=స్త్రీలు పండ్లుకు పెట్టుపొడి—దీనిని వాడిన, పండ్ల చిగుళ్లు నల్లగా అగును; దాసాని; దాసెన [మ]
దాచెన=(చూ) దాసాని; దాసెన [కర్నూ]
దాట = వాయిదా వేయుట—*పనిచేయను దాటలు వేస్తున్నాడు* [నె - ఆత్మకూరు]
దాటుకట్టు = చేపలకు వేసిన కొడమ దిగుదాల, ఎగిరినచేప పడునట్లు, కొడమకు ఆనించి కట్టిన గుడ్డగాని, వలగాని [నె]
దాటుదోలు = పశువులను దొంగతనముగా తోలుకొనిపోవు—*మంచి పెయ్యాను దాటు దోలినాడు* [నె]
దాటువేయు=(1) రహస్యముగా వస్తువును వేరొకచోటికి చేర్చి దొంగిలించు—*మంచి మంచి వస్తువులను దాటువేసింది* [నె; కర్నూ; అ; తె]
(2) మోసగించు
(3) సమయము తప్పించు
(4) జవాబుచెప్పక వేరే ప్రస్తావనలోనికి దించు
(5) ఏదైన ఆడవసరమును సంగమింపజేయు [నె]
దాటవేసి పోవు=వదలిపెట్టిపోవు [కరీ]
దాటవేసుకు పోవు=పశువులను దొంగతనముగా తోలుకొనుపోవు; దాటవేయు [గు]
దాటింపు = (1) కాపేరి (స్త్రీలకు మైల స్రవించు వ్యాధి) మొదలగు వ్యాధులుగలవారిని, పూజచేసి ఉంచిన వస్తువు మీదుగా దాటిపోవునట్లుగా చేయుట [నె; తె]
(2) గరిగెను దాటించుట. కలరా వచ్చినపుడు చిన్న త్రోపుడు బండిలో గరిగె నుంచి ఊరిని దాటింతురు, ఆ ప్రక్క ఊరివారు దానిని మరల ఇంకొక పల్లెకు దాటింతురు. ఇట్లా ప్రతి ఊరివారు దాటించగా దాటించగా, అది తూర్పు వైపు ఒక దేవళం చేరును [చి]
దాటు = (1) చిన్న కాలువను దాటుటకుగా అడ్డము వేసిన మాను
(2) పశువుల సంగమము — *దానిని మంచెద్దే దాటింది* [నె, అ; తె]
(3) రోగము నశించుటకు దిగదీసి, మూడు త్రోవల కూడలిలో దిష్టిబొమ్మతోడి పూజాద్రవ్యములకు దిష్టితీయు దిగ దుడుపు పెంకు [అ]
దాటుడుదీయు=పుండ్లు మొదలగు వ్యాధులు గలవారి పైనుండి క్రిందికి మంత్రించిన వస్తువును త్రిప్పి తీయు [కరీ]
దాటులు=వెంద్రుకలుక త్తెరింపులో ఏర్పడు ఎగుడుదిగుడు చారలు [వ]
దాట్లు దాట్లుగా = అందు కొంత, ఇందు కొంతగా; అరకొరలుగా [కరీ]
దానపుకొత్తలు=(చూ) సీరుకానులు [కరీ]

దానరాసులు = కార్తీకమాసములో మంచుకు పండు ధాన్యము [శ్రీ]

దానికి = కొరకు—*వచ్చేదానికి, పోయే దానికి* (పోవుటకు); డానికి [నె; అ; తె]

దాపకట్టు = నిచ్చెన [వి]

దాపరికము = విషయమును దాచిపెట్టుట—*వాడికి దాపరికం లేదు;* దాపిరికం [నె, కర్నూ,]

దాపిరికము = (చూ) దాపరికం [తె; అ]

దాపు = చాటు [తె]

దాపుడు కోక = దాచియుంచి, పండుగలలో కట్టుకొను చీర (ఎప్పుడూ వాడుకొనక దాచిపెట్టి యుంచుకొను చీర) × కట్టుకోక [నె]

దాపులు = దూలము మొదలగు వాటికి అండగా క్రింద నిల్పిన నిలువు కొయ్యలు [శ్రీ]

దామిడి = చాలదూరము [కరీ]

దామెన = కన్నెపిల్లలు వేసికొను పమిట, (పవిట, పైట) — *మొగ్గలదామెన తొడిగింది, సిగ్గు బుగ్గలను చూపింది* [చి]

దామోదరుడు = అప్రయోజకుడు - *దరిద్ర దామోదరుడు* [నె, గో, అ; తె]

దాయము = పాచికలు, దాయలాట [చి; నె]

దారకము = (1) మజ్జిగలో అన్నం పిసికి, అన్నం తీసివేసి జ్వరం తగ్గిన తరువాత త్రాగించునది, వాంతులు అగుసమయంలో కూడ ఇట్లు దారక మిచ్చెదరు

(2) కొఱ్ఱ అంబలిని చిక్కగా కలిపిన గంజి [నె-మెట్ట]

(3) ఆహారము [తె]

దారబందము = ద్వారముయొక్క చట్టము [నె]

దారబంద్రము = ద్వారబంధము; దార బందము [సే]

దారబోయు = పోగొట్టుకొను— *పది రూపాయలు దారబోసుకొన్నాడు* [చి]

దారిజరుగు = నడకలో గాని పరుగులోని దూరమును త్వరగా అధిగమించు, త్వరగా పయనించు; దారి కలసివచ్చు—*ఆ గుఱ్ఱం పరుగెత్తినట్లే ఉంటుంది గాని దారి జరుగదు* [నె]

దారితల = ప్రయాణములో దారి నడుమ తగులు చోటు, మార్గమధ్యస్థగ్రామము—*అది దారితల పల్లె* [నె]

దారులుకాచు = మంచికి గాని, చెడ్డకు గాని, ఒక వ్యక్తిని కలుసుకొనుటకు, అతడు పోవు త్రోవలలో కనిపెట్టుకొని యుండుట — *ఆమెను దారులుకాచి పట్టినాడు; దారులుకాచి వాడిని చంపినారు* [నె; కర్నూ; అ]

(2) బందెపోటు చేయు [అ]

(3) దొంగతనముచేయు; దార్లుకాయు [తె]

దారుబోతు = వ్యర్థుడు [నె; ఆత్మకూరు]

దార్లు = జలపాతము; ఎత్తిపోతలు

దార్లుకాయు = (చూ) దారులుకాచు [నె]

దాలమందరము = ద్వారబంధము [చి]

దాలమంద్రము = ద్వారమునకు అమర్చిన కొయ్య [చి]

దాలి = (1) పాలు మొదలగునవి కాచుటకు పిడకలతో పేర్చిన మంట, ఇది సాధారణముగా గుంటలోనే యుండును

(2) గుంటచేసి, పెద్ద బానపెట్టి నీళ్లుపోసి. చుట్టూ దుగ్గువేసి మంటజేసి, నీళ్లు వేడిజేసి కొనునది. నీ మొగాన దాలిబెట్ట అని ఆడంగుల తిట్టు — *దాలిబానలో నీళ్లు పోయి* [నె; కర్నూ; తె; అ]

దావంతము = ఆత్రము [అ]

దావబట్టు = పైరులకు తెగులుతగులు [కరీ]

దావిడి = పావురములను పెంచుచోటు [గు]

దాసంగము = ఉత్సవాదులలోను, పెండ్లి పేరంటాలతోను భక్తులకు, బంధువులకు ఆశ్రితులకు, పంక్తిభోజనముపెట్టు వైష్ణవ సంప్రదాయము [అ; బ]

దాసరేణి = మొక్కజొన్న [కృ]

దాసాని = దంతరోగములు పోవుటకు ఉపయోగించు నల్లటి పొడి; దీనిని వాడిన చిగళ్లగూడ నల్లగ పోవును; దాసినము దాచెన; దాసెన [నె]

దాసినము = (1) (చూ) దాసాని; దాసెనము [నె, తె]

(2) కప్పు [గో]

దాసినవేయు = వేశ్యకు చేయు కన్నెరికపు తంతు [తె]

దాసెన = (చూ) దాసాని [కర్నూ]

దాళి = (1) ధాన్యము నుడక బెట్టుమంట [చి]

(2) (చూ) దాలి

దాళించిరి = దాడిమ; దానిమ్మ [సే]

దాళు = (1) పదను—*కత్తికి దాళు పెట్టు*

(2) కీడు [శ్రీ]

దాక్షిణి = పండ్లు నల్లనగుటకు వాడే పొడి; దాసాన పొడి [అ]





దించి దిగువబెట్టు = (1) చనిపోయిన వానిని మంచముమీద నుండి దించి, క్రింద పరుండబెట్టు

(2) ఆశలుతుగు [నె; తె]

దించు = (1) గూటము మొదలగు వాటిని లోతుగా దిగగొట్టు [నె; కర్నూ; తె; అ]

(2) గీయు; వ్రాయు; ఫోటోదించు; (ఫోటో దీయు) బొమ్మదించు [వ]

దించుకొను = (1) స్ఫోటకపు బొబ్బలు అణగి పోవుటకు ప్రారంభించు — *అమ్మవారు దించుకొన్నది;* దిగజారు [నె]

(2) గర్భపాతము చేసుకొను — *అది మూడో నాలుగో దించుకొన్నది* [నె; వి]

దిండిగము = కన్య మొదట ఈడేరినప్పుడు పరచే బట్ట [మ]

దిండిగెం బుట్టి = బట్టలు పెట్టుకునే బుట్టి (బుట్ట), సాధారణంగా మైలబట్టలు ఇందు వేస్తారు [మ]

దిండు = (1) చిన్న చిదుగుల కట్ట

(2) రమారమి ఒక మబుగు తూకమునకు సరియగు వంటచెరకు బరువు — *రెండు గుండ్ల కట్టెలు* [నె]

(3) మనిషి మోయునంత పచ్చిక మోపు [చి]

(4) బండికి మధ్య అమర్చు కొయ్య మొద్దు, అడ్డ [చి]

(5) మోపు; కట్ట [అ]

దిందింమను = నిర్జనంగా ఉండి దిగులు గొలుపు [వి]

దింపుడుకళ్లము = శవదహనానికి ముందు మధ్యమార్గంలో శవాన్ని ఒకచోట దించెదరు; అప్పుడే అధ్వాన్న మిచ్చెదరు [వ; నె]

దింపుడు కళ్లమాశ = నిరాశ స్థితిలో చేయు చరమ ప్రయత్నము; శవమును కాటికి ఎత్తుకొనిపోవునప్పుడు శ్మశానానికిముందు కొంతదూరాన చివరి ఆశతో జీవి మరల బ్రతుకునేమో అను ఆశతో శవమును దించి మరల ఎత్తుకొందురు. పూర్వము

ఎప్పుడో ఎవడో మరల బ్రతికినాడట ; అట్టి చరమ ఆశతో చేయు ప్రయత్నము అనుట [నె]

దిక్కు_మొక్కు = అండదండలు — *వాడికి దిక్కుమొక్కు లేరు* [నె; కర్నూ; తె; అ]

దిగజారు = (1) స్ఫోటకము మొదలైనవి పోసి తగ్గుట— *అమ్మవారు పోసి చిన్న దిగజారింది;* దించుకొను [నె పొ]

(2) చతికిలబడు

(3) నీచమునకు ఒడిగట్టు—*అంత పెద్ద మనిషి ఎంత దిగజారిపోయినాడో చూడు* [నె]

దిగదీయు = దృష్టి పరిహారముగా దిగదుడుపు తీయు [కర్నూ]

దిగదుడుపు = (1) ఎందుకు పనికిరానిపని— *దిగదుడుపుగూడ పనికిరానిది* (దిష్టి దీసి పారవేసిన దనుట) [నె]

(2) పైనుండి దిష్టి తీసివేయుట [మ; నె]

దిగద్రొక్కు = అప్పులో కొంత వడ్డీని తీసి వేయు [కరీ]

దిగనూదు = బంగారు మొదలగువాటిలో కేడి పోవునటుల కాచు [కరీ]

దిగబడుట = (1) వచ్చుట—*ఆయన ఇప్పుడే దిగబడినాడు* (వ్యంగ్యము) [వి; నె]

(2) మిగిలిపోవు; నిలిచిపోవు [నె]

(3) అనుకోకుండా (తలవని తలంపుగా) బంధువు వచ్చు — *మామగారు దిగబడి నారు* [వ-గో]

దిగబెట్టు = (1) తోడుగా పోయి వదలిపెట్టి వచ్చు-*అమెను ఊర్లో దిగబెట్టి వచ్చినా* [సర్కా]

(2) వదలు; వదలివచ్చు [కరీ]

(3) మధ్యదారిలో వదలిపెట్టిపోవు [నె]

దిగవేయు = (1) ఎక్కువ సొమ్ములు పెట్టు కొను—*పెండ్లికొడుకు బాగా దిగవేస్తా రులే* [తె; నె]

(2) చదువుచు మధ్య భాగమును వదలి వేయు — *బాబు దిగవేసి చదివినాడు* [నె]

(3) మట్టిని పల్లపు ప్రాంతమునకు జారు నట్లు చేయుట, తోయుట

(4) నీటిని కాలువవైపు మరలించు— *నీళ్లను దిగవేసుకురా;* ఎగవేసుకరా [చి]

దిగు = (1) టెంకాయ మొదలగువాటి గొలకు కాయలు పుట్టు—*ఇంకా ఆ చెట్టుకు టెంకా యలు దిగలేదు* [నె; తె]

(2) పని ప్రారంభించు—*నే నింకా దాని లోకి దిగలేదు* [నె; వ, అ]

దిగుడు = (1) దూకుడు × ఎక్కుడు = చవావు

(2) దిగదగినది — *దిగుడు బావి* [నె; కర్నూ; అ]

(3) తక్కువ, లోపము — *నీకేమి దిగు డెట్టినదా?* [తె]

దిగుదారినూనె = గానుగలలో చివరన క్రింద నిలిచిపోయిన చమురు [గో]

దిగుబడి = (1) వడ్లు దంచగా తేలిన బియ్యము — *ఆ చేని వడ్లకు దిగుబడి తక్కువ* [నె; కర్నూ; అ; తె]

(2) పంట ఫలింపు; రాలుబడి; కనుబడి— *ఆ చేను మంచి దిగుబడి నిచ్చింది* [నె]

దిగుముడి = వదులుగంటు; వాలుముడి [అ]

దిగుమోటు = నీరుబెట్టిన, ఎక్కువగా దిగ బడు నల్లపొలము — *అది దిగుమోటు పొలము, దిగుమోటు సేద్యము* [నె]

దిగువరికి వచ్చు = క్షీణించు [కరీ]

దిగుడుబోవు = అన్నము మొదలగునవి గొంతులోనికి దిగు—*ముద్ద దిగుడుపోతు లేదు* [వ]

దిగూడు = గోడలో దీపము పెట్టుటకు చేసిన చిన్నగూడు; దీగూడు [నె]

దిగ్గనాధీరుడు = అసలైన ధీరుడు [కరీ]

దిచావు = లెక్కపెట్టుట; పరిగణించుట; దిసాయించు [చి]
దిచ్చెగొట్టు = నొసలుతో దాకించు [కరీ]
దిడిగి=చిన్న గొఱ్ఱె, మేకపిల్లలు మూయుట కుపయోగించెడు వెదురుబద్దలతో చేయ బడిన పెద్దజల్ల, (గంప); గూడు, అ-పె]
దిడ్డింజాము=పిల్లకాయలు చేయు అల్లరి [శ్రీ]
దిడ్డికంత = వామిదొడ్డి మొదలగు వాటి గోడలోగాని, కంచలోగాని మనిషిమాత్రమే దాటిపోవుటకు ఏర్పరచిన ఇరుకు దారి, ఇరుకు వాకిలి [నె; కర్నూ-అ; పె; తె]
దిడ్డితలుపు=ఇంటి పెరడుకు వెనుకనున్న చిన్న తలుపు [మ]
దినమ్మూ=ప్రతిదినము [చి; నె]
దినుసు=(1) చెయివాసి — *అది వాడి చేతి దినుసు* [అ; నె]
(2) రకము, రీతి — *మీ దేశపు దినుసు వంటకములు మాకురావు* [అ; నె, పొ]
(3) క్రమము, పద్ధతి—*లేదు దినుసు లేని పని* [నె]
(4) వస్తువులు—*మందుదినుసులు* [నె]
దినుసుగడ్డలు=దుంపలు [చి]
దిన్న=మెట్ట—*దిన్నెనేల*; మెరక [అ-పె]
దిప్పకాయ=అల్లరిచేయు చిన్నవయసువాడు [శ్రీ]
దిబిడీ=లావుగవున్న మనిషి [గ]
దిబ్బ = (1) పేడ గడ్డి కలిసిపోసిన ఎరువు కుప్ప—*పెంటదిబ్బ* [నె; కర్నూ]
(2) చిన్నగుట్ట—*దిబ్బచాటున మరగినాడు* [నె; కర్నూ, అ; తె]
దిబ్బకాయ=గడుసరి [గో]
దిబ్బణము = ఎదుర్కోలు సన్నాహము; నిబ్బణము
దిబ్బళించు=పాత్రలను, మూతి నేలపై అను నట్లు బోర్లించు, దబ్బలించు [నె-ఆత్మ]
దిబ్బళించు=(చూ) దిబ్బలించు [నె]
దిబ్బు=చెవి వినరామి—*చెవిలో దిబ్బవేసి నట్టయ్యెను* [కరీ]
దిమాకిదీయు=గర్వమణుచు [మ]
దిమిస=కంకర మొదలగువాటిని గట్టించు టకు ఉపయోగించు సాధనము (Ram) దిమ్మెస; దిమ్మీస్; దిమ్మిస [నె]
దిమ్మస=(చూ) దిమిస [వ]
దిమ్మిస=(చూ) దిమిస [నె; కర్నూ]
దిమ్మీస్=(చూ) దిమిస [కర్నూ]
దిమ్మె=(1) చెవికమ్మలు, ముక్కుపుడకలు వీటి వెనుకభాగములందు బిగించు మర చీల—*దిమ్మె ఊడులయి ఎక్కడో పడి పోయింది* [వ; నె-పొ]
(2) గోడలలో దారబంధము బిగించుటకు ఏర్పరచిన లావుభాగము
(3) గోడలో, బలువుకొరకుఅక్కడక్కడ కట్టిన దళసరిభాగము — *ప్రహరీకి దిమ్మెలు పెట్టినాడు*; మొత్త [నె]
(4) ఎత్తుగా నుండునది [కర్నూ; వత్తి-కొండ]
(5) గుడ్డలకు రంగులతో చిత్రములు ఒత్తు దిమ్మెలు (బ్లాకులు) [అ; నె]
(6) స్తంభమువలె రాళ్లతో పేర్చినట్టిది[తె]
దిమ్మెస=(చూ) దిమిస, దమ్మను [నె]
దియగూడు=దివ్వెగూడు [అ]
దియ్యె=దివ్వె—*దియ్యెలిగించావా?* [చి]
దిఉడ్డి=కిటికి క్రిందిభాగము [ఉ-వి]
దిలాస=విలాసము [మ]
దివసాలు=అపకర్మలు; దినాలు [అ]
దివాణపు అమ్మవారు = ప్రభుత్వమువారు వేయించు అమ్మవారు, అనగా వ్యాక్సి నేషన్ [నె; అ]
దివిగూడు=దీగూడు; దియగూడు [చి; అ]
దివ్వెలమాసము=దీపావళి

దిష్టి = చెడ్డమాపువలన కలిగిన అశుభము, ఆనారోగ్యము—*బిడ్డకు దిష్టి తగిలింది* [నె; కర్నూ]

దిష్టిదీయు = దృష్టిదోషమునకు, ఎఱ్ఱనీళ్లు దిగదుడిచి చేయు పరిహారము [నె]

దిష్టిపిడత = దిష్టికుండ

(1) దృష్టిదోషము (దిష్ట) తగులకుండుటకు, తోటలందుగాని, ఇండ్లముందుగాని చేసి ఉంచు వికారపుబొమ్మ; దీనికి కుండను గూడ పెట్టుదురు; సీతాకుండ [కర్నూ]

దిష్టిబొమ్మ = (1) దృష్టిదోష పరిహారముగా చేసిపెట్టిన వికారపు బొమ్మ. దక్షిణాదిన ఇండ్ల ద్వారములకు బూడిద గుమ్మడి కాయ కట్టుదురు

(2) మిరపుమసిషి [అ; నె]

దిసమూకుడు = చిల్లులులేక మట్టితో చేయబడిన మూత [చె; నె]

దిసాయించు = (1) కనిపించ జేసికొను లెక్కబెట్టు—*ఆయన చెప్పుడు ఏమీ దిసయించడం లేదు*, దిచావు [నె; తె]

దిసించు = కనురాలు; దృష్టిని ఆకర్షించు గురింపుకువము —*అదేమీ దిసించడం లేదు* [నె]

దిస్టికుండ = పొలములలో వచ్చిపోవువా దిస్టి(చెడ్డచూపు) సోకకుండుటకు సున్నము పూసి పైన నల్లటి మసిచుక్కలు బెట్టిన ఓటికుండ; దిష్టిపిడత; ఇట్టిదే దిష్టిబొమ్మ [నె; తె; అ]

## దీ



దీగూడు = దీపము పెట్టుటకు గోడలలో చేసిన గూడు; దీపపుగూడు; దిగూడు; దియగూడు [నె, రా, తె; గు]

దీపంతె = దీపపు ప్రమిదె; దీపాంతి [తె]

దీపాంతి = ప్రమిద; దీపంతె [అ; బ]

దీపాలనాగి = దీపములు వెలిగించిపెట్టు చెలికత్తె [చి]

దీబెగడ్డ = దిబ్బ [కరీ]

దీబూసి = బోసితనము, శూన్యరూపము—*ఇల్లు దీబూసిగా ఉన్నది; కమ్మలులేక చెవులు దిబూసిగా వున్నవి;* దూబూసి దోబూసి; దోబూచి [నె; తూ-గో]

దీలుపడు = బలహీనమగు; డీలుపడు [నె]

దీవి = మనసు [వి]

దీసుడు = దీపముుంచుట కాధారమైనది [కృ]

దీసూడు = దీపస్తంభము; దీసుడు; దీసెమ్మె [కృ]

దీసెమ్మె = దీపస్తంభము; దీసుడు [అ]

## దుం



దుంగ = నాగలివేయుటకు ఉపయోగించు వంపుమొద్దు [హై]

దుంబాలు = సమాప్తి, నాశము [కరీ]

దుండు = లావు —*వాడు బాగా దుండుగా ఉన్నాడు* [తె]

దుంప = (1) నీరుబెట్టి దున్నిన దుక్కి; రొంపిదుక్కి [ప-గో]

(2) దున్నెనాగలి [శ్రీ]

దుక్కతన్ను = కండపుష్టిచేయు [వి]
దుక్కసిల్లు = దుఃఖించు [కరీ]
దుక్కి = (1) దున్నిన నేల [మ]
(2) దున్నుట [నె]
(3) అరపదును - ½ అంగుళము వాన (12 మిలిమీటర్ల వాన) [సర్కా]
(4) సంవత్సరము—దుక్కి అనగా ఒక సంవత్సర కాలమును (సేద్యము) సూచించును; పూర్వము సాధారణముగా ఏటికి ఒక పంట, దానికి కావలసిన ఒకేమారు దుక్కి (దున్నుట) వాడుకలో నుండుటచే సంవత్సర కాలమును యీ మాటతో సూచించేవారు. సంస్కృతము ఇంగ్లీషు మొదలగు భాషల రెండు వేసవులు అన్నట్లును, పది వసంతములు (ఋతువులు) అన్నట్లును ఈ పదము ఉపయోగింపబడుచున్నది. రెండు ఈతల బఱ్ఱె అనుటగూడ ఇట్టిదే—*అది నాల్గుదుక్కుల ఎద్దు* [నె]
దుక్కిఅయింది = సాగు అయింది [మ]
దుక్కిటెద్దు = దున్నుటకుమాత్రము ఉపయోగించి ఉన్న ఎద్దు × బండెద్దు (పెద్దది; దీని కంటె పెద్దది కపిలఎద్దు-మోటెద్దు) [నె]
దుక్కిదుక్కి = (1) మంటి ఇంటికి పేడతో అలికినది
(2) పిల్లలు ఆడి రేగగొట్టిన దుమ్ము [మ]
దుక్కులగొడ్డు = ముసలిగొడ్డు; చాలసార్లు దున్నినదనుట [తె]
దుక్కెద్దు = (చూ) దుక్కిటెద్దు [అ]
దుగదచ్చియను = కయ్యమునకు కాలు ద్రవ్వు [కరీ]
దుగదాయము = దుఃఖము — *నా కేమంత దుగదాయం లేదులే !* [నె]
దుగుద = ఆందోళన; శంక — *ఏమంత దుగద* [కరీ; నె]
దుగ్గాణి = (1) డబ్బు (నాలుగు దమ్మిడీలు) [చి; నె]
(2) రెండు డబ్బులు [కరీ]
(3) రెండు దమ్మిడీలు [నె]
దుగ్గి = పిడకలతో పేర్చినదాలి, తంపి [కరీ]
దుడుము = నిర్బంధము [నె-పొ]
దుడ్డు = (1) చేతికఱ్ఱ చివరిముడి (బుడుపు) [నె]
(2) డబ్బు; ధనము [చి; నె; కర్నూ]
(3) నాలుగుపైసలు (దమ్మిడీలు) [అ; చి; కర్నూ]
(4) బడితెకఱ్ఱ [నె; కర్నూ]
దుడ్డె = (1) దూడ [కరీ]
(2) బఱ్ఱెదూడ [వ]
(3) బాలకుడు [వ]
దుడ్డెగాడు = యౌవనవంతుడు [మ]
దుడ్డెలు = (1) దూడలు; దూళ్లు—*బఱ్ఱె దుడ్డెలు* [కరీ]
(2) ఈడు వచ్చిన మగపిల్లలు [మ]
దుణువు = జ్వరము; ఉష్ణము
దుత్త = (1) నీళ్లు తెచ్చు మట్టిపాత్ర [నె; చె; అ; తె]
(2) చేపబుపట్టు వలకు వెనుక కట్టుటకు వెదురుపుల్లతో తయారు చేయబడు సాధనము [చె]
దుత్తపాడు = శూన్యము—*అక్కడేముంది దుత్తపాడు* [తె]
దుత్తలు = ఎద్దులను బండికి పూన్చునపుడు వాటిమెడలకు కట్టు బారెడు తాళ్లు; మెడవలువులు [క; న]
దుద్దుగలుపు = (1) ఒకనిని మధ్య దిగవిడిచిపోవు—*వాడిని దుద్దుగలిపి పోయినారు* [నె]
(2) ఒక కార్యమును మధ్య వదలివేయు —*ఆ పనిని దుద్దు కలిపినాడు* [నె]
దుద్దులు = (1) కమ్మలు [నె; కరీ; చి; అ]
(2) దిండ్లు

దుప్పటి పంచాయతి = ఇద్దరి తగవును పెద్దలు కలిసి అక్రమమైన తీర్పు చెప్పట. దీనినే చెన్నంపల్లి పంచాయతి; తాడిపత్రి పంచాయతి అనియు నందురు; దొంగిలించిన దుప్పటిని సొంతగానిని దొంగను చెరి సగముగా పంచుకొనమని తీర్పుచెప్పుట [అ]

దుప్పి = ఉపవాసము—*ఇవాళంతా నాకు దుప్పే; దుప్పి భోజనము* [వి]

దుబ్బ = (1) లావైన (శరీరము)— *వాడు దుబ్బగా ఉన్నాడు* [అ]
(2) దూళి [కరీ]

దుబ్బు = (1) ఏపు; అతిశయము — *గడ్డి దుబ్బుగా పెరిగింది* [చి]
(2) చిన్న గడ్డికట్ట [శ్రీ]

దుబ్బుచేయు = పంట చేలలో మొక్కలు బాగా పిలక లేర్పడి బలముగా విస్తరించు; గంటకట్టు [గు]

దుబ్బులు=తుప్పలు [కరీ]

దుమ్మాడు=తిట్టు [కృ: గు]

దుమ్ముగా=కావలసినన్ని [అ]

దుమ్ములపండుగ = కణుగుపండుగ [వి]

దురదగొండి = ఒంటికి తగిలిన దురద బుట్టించు, తీగపారు చెట్టు; దూలగొండి [నె; కర్నూ; అ, తె]

దురాయి=(1) ఒట్టు [తె]
(2) రాయివలె గట్టిపడి పోయినది — *వాడికి మలం దురాయి గట్టింది* [నె]

దురిసిపోవు=కట్టె మొదలగునవి చెదలెక్కిపోవు [కరీ]

దురెండు = (1) పూర్తిగా ఎండిపోవు
(2) ఎండీ ఎండకుండు [కరీ]

దుల్లగొట్టు = పూర్తిజేయు—*మామిడి చెట్ల కాయలు దుల్లగొట్టినారు* [శ్రీ]

దుల్లడీల దండ=(చూ) పలకలసర్లు [నె]

దువ్వాని = దువ్వేన; దువాని; దువ్వెన్న; పన్నె; దూబానె; పైనా

దుసెళ్లిపోవు=దూసుకుపోవు [వి]

దుస్తురుమాల = గీరలు గల చిన్నరంగు రుమాలు [మ]

దుస్తులు=అతిసారము [మ]

దుస్తులు తీయు=ముడతలు దీయు [మ]

దుస్తులుపోవు = చీరలు ఉతకగనే నేత మంచిదికాక దూర దూరమగుట; ఒడుసుపోవు [మ]

దుస్సు=పశువులు పుష్టిగాపారినది [అ-పె]

## దూ



దూంద్రు=ధాన్యాదులు కొలుచునపుడు రేగు దుమ్ము; దువ్వ [శ్రీ]

దూకుడు=(1) క్రిందికి వాలుగా నుండు దారి —*బండిదూకుడు(దూకిటి)లో పడినది;* దిగుడు;ఉడీరావు × ఎక్కుడు; చెడావు[నె]
(2) ధూర్తత్వము [తె]
(3) తొందరపాటు — *వానికి దూకుడు ఎక్కువ* [గు]
(4) త్వరగా [గు]

దూగ=పచ్చీసు మున్నగు ఆటలలో రెండు చిత్తుల పందెము [కరీ]

దూట=(చూ) బొందె; అరటి దిండు [అ]

దూడలపండుగ=(చూ) కనప్పండుగ [చి]

దూదినిమ్మ = (1) కోలగా ఉండి, ఊరగాయకు మాత్రమే పనికివచ్చు నిమ్మకాయ జాతి; కోలనిమ్మ [నె]

(2) దీనినే గజనిమ్మ అందురు, దీని రస ముతో చిత్రాన్నము (పులిహోర) చేయు దురు; కర్నెకాయ [రా]
దూపకుచెప్పు = కల్లుకు పైపలిచ్చు [మ]
దూపుడు చిల్ల= మోట తోలునపుడు మోకు నకు ఎద్దుల మీది కాడికిని మధ్య కొలికిలో నుంచుకఱ్ఱ (చిన్నమేకు) [నె-పొ]
దూమధార = పొగమంచు; గూడమంచు [కర్నూ]
దూబర తిండి = (1) వితరణలేని ఆహార వ్యయము; తిండిబోతుతనము—*దూబర తిండిగాడు* [నె]
(2) దుర్వ్యయము [నె; అ; తె]
దూబానె=దువ్వెన [చి]
దూము=కలరా — *ఊళ్లో దూము తగులు తున్నది* [నె; తె; అ]
దూముగంగ=కలరా దేవత [చి]
దూముడి = వదులుగా జారవిడిచివేసిన వెంట్రుకల ముడి; దూగంటు [అ; నె]
దూయు = కోడి మొదలగునవి కాళ్లతో చెదరగొట్టు [శ్రీ]
దూరాబారము = ఎక్కువ దూరము—*దూరాబారంనుండి జనం వచ్చినారు;* [నె; కర్నూ; తె]
దూల= (1) గుల; జిల; అనవసరముగ ఏర్పడిన అపేక్ష—*దూల తీర్చుకొన్నాడు;* గుల [కర్నూ; వి]
(2) దుమ్ము [అ]
దూలగొండి = (చూ) దురదగొండి [చి]
దూవాని = దువ్వెన; దువ్వెన్న; పన్నె; పైనా; పన్నె; దువ్వాని; దుబానె
దూసర =బుట్టలల్లుటకు ఉపయోగపడు ఒక తీగచెట్టు [కర్నూ]
దూసి=దూళి; దువ్వ [చి]

# దె



దెంతె=(చూ) దంతి [కర్నూ]
దెబ్బతిను=నష్టపడు—*వాడు చాలా దెబ్బ తిన్నాడు* [తె; నె]
దెబ్బలముచ్చు = దెబ్బలు తినుటకు అల వాటు పడినవాడు [శ్రీ]
దెబ్బలసుడి = (1) పశువుల వీపుననుండు సుడి; ఇది ఉన్న దెబ్బలు ఎక్కువగా తిన వలసివచ్చును—*వాడికి దెబ్బలసుడి ఉన్నట్లున్నది*

# దే



దేకు = గెంతు; చంటిపిల్లల యంబాడుట [కరీ]
దేగిచ=పలావు, బిర్యానీలు వండు మూతి వెడల్పు రాగిపాత్ర; దేకిసా [తె]
దేపరవ=తాత్సారము; ఏమరుపాటు [చె]
దేమ్మ=దేవమ్మ; దేవుడు [అ]
దేల=నీరసము, నిస్సత్తువ [గం]
దేవయ్య=మూర్ఖుడు; అప్రయోజకుడు [గో]

దేవరఎద్దు = వేంకటేశ్వరునిపేర అచ్చు వేసిన ఆబోతు [చి]

దేవరగంగమ్మ = ముత్యాలమ్మ మొదలైన దేవతల జాతర [అ-పె]

దేవరపోతు = (1) క్షుద్రదేవతలకు బలి ఇచ్చుటకుగా వదలిన దున్నపోతు. దీనిని ఎవరును అడ్డగించరు మేకపోతు, పొట్టేలునుగూడ వదలుదురు.
(2) (నిందార్థకమున) స్వైరవిహారి; బసివి
(3) ఎడ్డిమడ్డివాడు [అ]

దేవరిల్లు = దేవతాగృహము, పూజాగృహము [అ]

దేవిడీమన్నా = ద్వారనిరోధము [వి]

దేవుడివల = ముక్కోణముగా కట్టిన కట్టెలకు జోలిగా కట్టిన చేపలవల [నె]

దేవుడు = చంద్రుడు [వి]

దేవునిరంగు = ఒక రంగుపేరు [వ]

దేవులాట = (1) దీనముగా అర్థించుట [నె, గో; తె]
(2) వెదకులాట [అ, మ]

దేహబాధ = మలవిసర్జన — *వాడు దేహబాధకు వెళ్లినాడు* [వి]

## దై

### దైత

దైత = ఆడుది [అ-పె] (వ్యంగ్యముగ) — *అది ఒక దైతమ్మ* [నె]

## దొ



దొంగగొడ్డు = దొంగతనంగా పైర్లు మేయునది [చి; నె]

దొంగతూము = సైఫన్ (పైకి కనబడనిది) [నె; అ]

దొంగపిప్పికడ్డీ = గానుగలో నలిగిన చెఱకును పెద్ద కణెముల మధ్యకు మళ్లించు సాధనము [చి]

దొంగమేపు = ఇతరుల పొలములలో దొంగతనముగా పశువులను మేపుట [నె-తె]

దొంగదోపు = దేవతల తిరునాళ్ల వేడుకకు చేయు నాల్గవనాటి ఉత్సవము. ఈ వేడుకలో నాట్యముచేయు దేవ దాసీలను, అర్చకుని దొంగలు ఎత్తుకొని పోయినట్లు ఒక ఆట సాగింతురు, అలకలతోపు [నె-పొ]

దొంగల పట్టిమంచము = సప్తర్షి నక్షత్ర మండలము [కృ]

దొంగవాడు = దొంగిలించు [వి; గ]

దొంగోడ = (దొంగఓడ) జలాంతర్గామి, సబ్ మెరైన్ [వి]

దొంగకుండలు = పల్లెలలో బీదల ఇండ్లలో వరుసగా ఉంచుకొను పెద్దకుండలు: సంసారులు అన్ని వస్తువులను వీటియందే ఉంచుకొందురు; దొంతికుండలు [అ; వ]

దొంపు = (1) కయ్యల (చేల) నిడుపునఉన్న వరుస — *మిట్టచేను రెండు దొంపులది;* దోరవ [నె]
(2) పొలము [తె]
దొగ్గాడు = దోగాడు [అ; ని]
దొడుసులు = మొదలైన — *గుడ్డ దొడుసులు;* గొడుసులు [నె]
దొడ్డమ్మ = పెత్తల్లి; పెద్దమ్మ; పెదమ్మ
దొడ్డికి పోవు = చెంబట్లకు పోవు; (చెంబు పట్టుకపోవు,. కక్కసు ఉన్న ప్రాంతాల వారంతా ఇట్లే అందురు; బయటికిపోవు; పెళ్లకుపోవు — *(వెళ్ల)* [నె; వ; అ]
దొడ్డికూడు = కార్యము పట్ల బీద సాదలకు సమూహంగా, పశువుల దొడ్డి పత్రంచేసి బంతులు బంతులుగా కూర్చుండ బెట్టి అన్నదానం చేయునది — *రెడ్డోరి పెండ్లికి దొడ్డికూడు వేసినారు;* చాపకూడు [నె]
దొడ్డిగోడ = ప్రహరీ గోడ; పారిగోడ
దొడ్డిసంభావన = శుభకార్యములలో బ్రాహ్మణులను దొడ్డిలోబెట్టి ఇచ్చిన సంభావన; దొడ్డికూడువంటి విధానము [నె]
దొడ్డిగ అయినవి = లావుగ అయినవి [మ]
దొన = (1) కొండలనడుమ బావివలె లోతుగా ఉన్న నీటిగుంట — *గుళ్లదొన;* సొన [నె-ఉదయగిరి; కర్నూ; అ, తె]
(2) బండలమీద నీరునిలుచు పల్లము [చి]
దొనకట్టు = జొన్నకంకు లుంచుటకు కట్టు అంచ (కట్ట) [నె]
దొన్నె = ఆకుతో గిన్నెగా కుట్టినది; పొత్తర; దొప్ప; దొప్పి [నె]
దొప్ప = (1) ఆకుతో గిన్నెగా కుట్టిన దొన్నె [తె]
(2) ముసలివాడు [మ]
దొప్పి = (చూ) పొత్తర [అ]
దొబ్బగ అయినవు = లావుగ అయినావు [మ]
దొబ్బు = (1) త్రోయు [రా]
(2) సంభోగించు [నె]
(3) అపహరించు — *డబ్బు దొబ్బినాడు* [సర్కా]
(4) తిట్టు — *దొబ్బులు పెటినాడు.* సర్కారులలో ఈ "దొబ్బు" అనే మాటను నెల్లూరు మొదలగుచోట్ల "నూకు" అను దానివలెనే అనేకార్థములలో వాడుదురు. (చూ) నూకు [నె]
(5) వెళ్లి పోవు — *వాడు చెప్పకుండా దొబ్బినాడు* [సర్కా]
దొమ్మ = (1) గుండె
(2) ధైర్యము [అ; నె]
(3) పశువులకు వచ్చు వాపు తెగులు [నె]
దొమ్మపొగరు = గుండె పొగరు; గుండె బలము, ధైర్యము [అ]
దొమ్మరిడోలు-దొమ్మరివానిడోలు = అనేకులను మార్చిమార్చి సంభోగింపజేయు వ్యభిచారిణి. దొమ్మరివాండ్రు గరిడీవసులు చేయునప్పుడు, పనిచేయనివారు డోలును వాయించుచు, మరల వారి స్థానే ఇంకొకని వాయించుటకు నియోగింతురు — *వాని ఇల్లాలు దొమ్మరివానిడోలు* అని "హంస వింశతి" ప్రయోగం [నె]
దొయ్య = వరి మడి; చేను; కయ్య; మడికాలు [కరీ]
దొరింపు = అనుకూల్యము [కరీ]
దొరువు = (1) పొలముల మధ్య పశువుల నీటికిగా త్రవ్విన గుంట (ఏటిలో ఏర్పడిన గుంట మడుగు) [నె; తె]
(2) బావికి కపిలతోలు చోట కట్టిన కట్టడము — *దొరువు బండలు దొరుకొన్నది.* [చి]

(3) ఏటిలో ఒడ్డునకు చేరువగా త్రవ్విన బావి; దానినుండి నీళ్లు కపిలదోలి పొలమునకు పారింతురు—*దొరువు బావి* [అ]

(4) ఏటిలో నీటికై త్రవ్విన పల్లము; చలమ [చి]

దొర్లుడుపుచ్చకాయ = ఏ పక్షమునకు గాని అంటబెట్టుకొనియుండక సమయానుకూలముగా పక్షములుమార్చువాడు; జనాగాయి; మైనపుముక్క; ఏ గాలికి ఆ చాప ఎత్తువాడు [నె]

దొలుపు = (1) ఇరుసు రక్షణకైన కొయ్యతొడువు [కరీ]

(2) ఎట్లో పని పూర్తిచేసికొను—*దొలుపు కరా!* [మ]

దొసి = కట్టె [అ-పె]

దొళ్లదోపుగ = కొల్లగ [నె-ఆత్మకూరు]

## దో



దోకా = మోసము [కరి]

దోకు = దోకుడుగడ్డ (దోకినది, కోసినదిగాదు) [వ]

దోకు = గోళీల (గోలి) ఆటలో మోచేతితో గోళీత్రోయు [అ; నె]

దోకుడుపార = గడ్డి మొదలగునవి దోకుటకు (ఎదురువాటుగా చెక్కుట) ఉపయోగించు వెడల్పు వాదరగల సాధనము. దీని ఇనుప అలుగు ఒక కట్టెలో బిగించబడియుండును; చవికిపార [తె, నె; కర్నూ]

దోక్కొనిపోవు = గీచుకొనుటచే శరీరముపై తోలు లేచిపోవు — *క్రిందపడి చేయి దోక్కొనిపోయింది* [నె]

దోణి = వాననీరు పోవు అర్ధవలయాకారపు గొట్టము; దోనె; దోని

(2) మిద్దెటిండ్ల మీది వర్షపునీరు క్రిందికి పోవుటకు ఉంచిన మట్టి, లేక లోహపు గొట్టము [అ; బ]

దోని = (1) మిద్దెపైన వాననీళ్లు పోవుటకు పెట్టిన మట్టిగొట్టము; దోణి [రా]

(2) నీళ్లు ప్రవహించుట కేర్పరచిన సాధనము, దోనె [మ; నె]

దోనె = (1) బెల్లము పాగుపోయు పెద్ద పెనుము [అ]

(2) అరటి ఆకులతో కుట్టినదొప్ప; దొన్నె [చి]

(3) నీరు పారించుటకు అర్ధవలయాకారములో నిర్మింపబడిన పొడవు సాధనము; ఇది రేకుతోగాని. తొలచిన తాటిమానుతో గాని చేయబడును; అరిణ [నె]

(4) ఇంటిలో రెండు సూరులనీరు బయటకు పంపుటకు సూరులకు ఆనించి కట్టిన అరిణ [నె; వ; అ]

(5) నీటితొట్టె [అ; బ]

దోనెమొద్దు = బండికి రెండుచక్రముల మధ్యన అడ్డముగా అమర్చిన మొద్దు. దీని మీదనే ఇరుసును దింపి రెండుకొనలలో చక్రములు తగిలింతురు; అడ్డ [అ]

దోపు = దోపు ఉత్సవము, పెరుమాళ్లకు జరుగునది [కరీ]

దోఖిరి = అజీర్ణ విరేచనములు [గో]

దోముబాలు = మొద్దువాలు — *నా ఒడలు దోముబారినది* [కరీ]

దోరవ = కయ్యల (చేల) నిడుపువరుస; దొంపు [నె-వింజమూరు]

దోరుగాలము = పొయ్యే (వచ్చే) కాలం; పోగాలము [అ; చి]

దోర్ణపుపట్టె = కపిలె (మోట) గిలక బిగించిన అడ్డదూలము [నె]

దోర్ణము = మోదుగ, మఱ్ఱి మొదలగువాటి ఆకులను తోరణముగా ఒక దారమునకు గుచ్చి ఎండబెట్టిన దండవంటిది. ఇందుండి ఆకులుదీసి, కావలసినప్పుడు విస్తళ్లుకుట్టు కొందురు; తోరణము [నె]
(2) పైన వ్రేలాడగట్టు తోరణము [అ; నె; తె]

దోర్చు = (1) పీళ్ల చేరలతో ఊడ్చితీసికొను —చలమనీళ్ల దోర్చుకోని వచ్చినా [నె]
(2) చేటతో చెఱగుటలో ఒక మాదిరి [సర్కా]

దోవకవళం తినువాడు = స్థిమితము లేనివాడు [నె]

దోసె = పులిచావటి; అట్టు × చావటి = బెల్లముకలిపి లావుగా పోసినది [నె; రాయ; చి; సర్కా]

## దౌ

దౌటి

దౌటి = సిరాబుడ్డి, మసిబుఱ్ఱ; దవతి

## ద్వా

ద్వావరసేయుట

ద్వావరసేయుట = దేవరకు పెట్టుట; అనగ పోసమ్మ, ఎల్లమ్మ, బాలమ్మ మొదలగు క్షుద్రదేవతలకు నైవేద్యంబెట్టి పూజించుట [మ]

## ధ

ధగడమియ్యా ధర్మకవిలె

ధగడమియ్యా = అసాధ్యుడు [వి]

ధర్మకవిలె = ఒకరి చలవన బ్రతుకువాడు [నె-ఆత్మ]

## ధా

ధావళి ధాళి

ధావళి = మడుగున కుపయోగించు తెల్లని కంబడి; ధోవతి [అ]

ధాళి = పెద్దపళ్లెము [శ్రీ]

ధూప్‌చాప్ = పడుగు పేకలకు వేర్వేరువన్నెల నూలు వాడి నేయుట; కలినేత; కలనేత [మ]

# న



నంగ = అమాయకునివలె నటించువాడు [అ]

నంగనాచి = తెలియనట్లు నటించు వ్యక్తి (వ్యంగ్యము) (అసలు నంగనాచి కంచిలో వుండిన ఏలేశ్వరోపాధ్యాయులవారి కూతురు, అతిసమర్థురాలు)—*నంగనాచి తుంగబుఱ్ఱ*; నంగబక్క [తె; నె]

నంగబక్క = (చూ) నంగనాచి [అ-పె]

నంగా = రౌడీ [కరీ]

నంగాచంగా = మానహీనుడు [కరీ]

నంగి = ఏమీ తెలియనట్లు నటించువాడు; నంగ [నె; కర్నూ]

నంగిరిమాటలు = అబద్ధాలు; మాయమాటలు [శ్రీ; వి]

నంగు = (1) నతుకు; నక్కొను, ఒదిగి వర్తించు [కరీ]

(2) మాంసము, నంజుడు; నంజర; నంజిర [అ; బ]

నంగుదుణంగు = సిగ్గు; మానము [కరీ]

నంజ = లంజ [వి]

నంజర = మాంసము; నంజిరి; నంజుడు [చి]

నంజరి = వండినమాంసము; కూర [అ]

నంజిరి = మాంసము; నంజర; నంజుడు [అ]

నంజిలి = కారణము తెలియరాని లోపలి గిలి — *ఏదో నంజిలిగా ఉన్నది* [నె]

నంజు = (1) అవయవములు కృశించువ్యాధి [నె]

(2) శ్లేష్మము; కఫము [కరీ]

(3) పెదవులపై లేచు పుండ్లు—*బాగా నంజు పొంగింది* [తె]

నంజు = మాంసము (నంజుకొనునది); నంజుడు [తె]

నంద = ధాన్యాదులు నిలువజేయుకొట్టు; వాడ

నంబి = (1) సాతాని [అ]

(2) వైష్ణవార్చకుడు × శైవార్చకుడు = *తంబళి*

నకరాలు = విధవచేష్టలు; పోకిరిపనులు—*ఏమంతా నకరాలు పటిస్తున్నావే* ] నె; అ]

నకిలీ = (1) వెకిలి

(2) నాసిరకము

(3) హాస్యపాత్ర

(4) హాస్యము [అ]

నక్కగోయి = బాటలో వాననీరువల్ల కోసుకొనిపోయిన గాడి

(2) కాలిబాటలో నీరు నిండినగోయి, జొబ్బు పాము [వి]

నక్కకొమ్ముదొక్కు = అదృష్టవంతుడగు; సులభముగా పని నెరవేరు — *ఈదినం నక్కకొమ్ము తొక్కివచ్చి నట్లున్నది*; నక్కనుజూచు; నక్కనుదొక్కు [నె]

నక్కనుజూచు = అదృష్టము ఎదురగు నట్లు; నక్కకొమ్ము దొక్కు [తె]

నక్కనుదొక్కు = అదృష్టమును పొందు, అనుకొన్నపని నెరవేరు; నక్కనుజూచు; నక్కకొమ్ము దొక్కు; నక్కమొగము జూచు [కర్నూ; గో; సర్కా; వ]

నక్కనైచుకాలు = నక్కవినయాలు [కరీ]

నక్కబిగువు = కావలయుననియే నరములను, అంగములను బిగబట్టి, చచ్చినట్లు నటించి, ఎదుటవారిని బెదరించుట—*వాడు నక్కబిగువు బట్టినాడు* [నె]

నక్కమొగము చూచు = మంచి కలుగు సూచన; నక్కకొమ్ముదొక్కు; నక్కను జూచు [అ]

నక్కలగండి = గట్టిగా పూడ్చినను ఎప్పుడు పడితే అప్పుడు తెగిపోవుచుండు చెరువు కట్టలోని గండి [చి]

నక్కలు నగాలె = ఎందుకూకానిది [మ]

నక్కాసి = రాతియందుగాని, కొయ్యమీదగాని సున్నితపు పనిచేయు నగిషీకారుడు: తక్షకుడు [మ]

నక్కిరిమాటలు = దొంగమాటలు [వి]

నక్కిళ్లువడు = చలికి దౌడలు గట్టిగ బిగించుకొను [మ]

నక్కు = (1) త్రెంపివేసెడి ముడి
(2) అతుకు [కరీ]

నక్కోరు = పశువ్యాధి. ఈ వ్యాధి తగిలిన పశువులు నల్లశవప్పు వేసి నిస్సారముగా నుండును [గు]

నగ = 48 మణుగుల పల్లి [అ]

నగా నట్రు = నగలు (జంటపదము)—*నగా నట్రుపెట్టుకోని వచ్చింది* [నె]

నగిడి = చలి కాచుకొను పెద్ద మొద్దులమంట; నెగడి; నెగడు [వి]

నగిరిపాప = జమీందారుల నగళ్లలో పని వేయు అవివాహిత స్త్రీ, దాసి; కాసాది; ఆడపాప [నె]

నగ్గ = ఎక్కువ—*నగ్గ తిన్నాడు; నగ్గ తిట్టినాడు*; నగ్గా [అ-ఉ]

నగ్గా = అధికము; ఎక్కువ; నగ్గ [అ; ఐ]

నగ్గు = (1) చనిపోవు [అ]
(2) అణగు; లొంగు [అ; ఐ]

నచ్చు = చీము—*రసివుండు నచ్చు బట్టింది* [చి; తె]

నచ్చురుకు = చీకిపోవు [అ]

నజ్జి = నుజ్జు; నుగ్గు [తె]

నజ్జు = జలుబుతో కూడిన జ్వరము [శ్రీ]

నటికలు = మెటికలు (వ్రేళ్లతో విరచునవి) [సే]

నటువది = వేశ్య; నట్టువది [సే]

నట్ట = (1) ఏలికపాము [కరీ]
(2) తాలుపదార్థము [తె]

నట్టము = భోగంవాడు — *నట్టంవాళ్ల సుబ్బయ్య* [నె]

నట్టల నారిగాడు = ఎండి, నరాలు తేలినవాడు [వ]

నట్టింట పుట్టిమునుగు = (1) అకారణముగా సంసారము క్షీణమగు (నీళ్లు లేనిచోటనే పుట్టి (పడవ) మునిగిపదనుట)
(2) పెద్ద యాపద యొదవు [కరీ]

నట్టు = (1) కొన్ని వరిచేలు గలసిన పొలము —*తూర్పునట్టు* [నె]
(2) గుట్టగట్టిన బస్తాలు (Stake) [నె; అ]
(3) పని వగదెగకుండుట — *ఆ సంగతి నట్టుబడినది* [నె; వ]
(4) బీడుబడిన భూమి—*ఆ పొలం నట్టు బడినివది* [కర్నూ; అ]
(5) తక్కువ; పని మిగులు — *ఇంకా ఏమైన నట్టు ఉన్నదా* [వ]
(6) వంశము—*నీ నట్టు తెంచనిదే వాడు మానడు*
(7) పైరు మొదలగు వాని బీజములు వేరుల భూమిలోపలకు పారిన ముట్టె—*గకరినట్టు* [నె-పొ]
(8) అనుమానము [గు]

(9) పొరపొచ్చెము; నెట్టె [అ]
నట్టె= (1) ముక్కుపుడక [తె]
(2) (చూ) నట్టు [గో]
నట్టేట ముంచు=(1) నాశనముచేయు [తె]
(2) నమ్మించి నడుమ ద్రోహము చేయు [నె]
నడక=ఏటిలో నీరుతీసి, నడచి పోవుటకు వీలైన స్థితి; నడవ — *ఏట్లో ఇప్పుడు నడక* [నె]
నడచు మర్యాదలు = (చూ) నడవడికలు [కర్నూ]
నడపు = ఉత్తరక్రియలనాడు మాంగల్యము త్రెంచుటకై సుమంగళి వెళ్ళు పద్ధతి, దారిపొడుపునా చలువ చీరెలను పరచి వాటిపై ఆమెను నడిపింతురు [చి]
నడమంత్రపు సిరి=మధ్యకాలమున వచ్చిన ఐశ్వర్యము, ఇది మనిషిని ఎగురవేయునని నింద; చెడిబ్రతుకుట—*నడమంత్రపు సిరి, నరముమీద పుండు మననీయవు* [నె]
నడమంత్రము=(1) మధ్యకాలము, ఇటీవల (2) లేని ఆధిక్యమును ప్రదర్శించుట—*అయనదంతా ఒక నడమంత్రములే* [నె]
(3) మధ్య — *వాడు ఏమీ నడమంత్రముగా పోతున్నాడు* [తె]
నడవ=(1) ఇంటిలో గదులమధ్య గల దారి (corridor) — *నడవలో కూర్చున్నారు* [నె; కర్నూ; అ; తె; గు]
(2) ఏటిలో వెల్లువ తీసిపోయి, నడచి దాటుటకు వీలైనస్థితి ;నడక— *ఇప్పుడు ఏట్లో నడవ* × *పడవ* [నె]
(3) నూతులు (దిగుడు బావులు) మొదలగు వానియందు దిగుట కనువుగా నేర్పరిచిన మెట్లవరుస [నె; అ]
నడవడికలు=పెండ్లి అయినతర్వాత, పెండ్లి కూతురు వాళ్లు చేయవలసిన మర్యాదలు, ఇవ్వవలసిన వస్తువులు, సారెలు—*నడవడికలకు రెండు వేలయినది;* నడవళ్లు; నడచు మర్యాదలు; నడుతులు; నడుపులు [నె]
నడవళ్లు= (చూ) నడవడికలు [నె; అ; తె]
నడి=తాటికమ్మ (దబ్బ, కాడ) పై గల దళసరి తొక్క; తోలు; తాటిపట్ట [శ్రీ]
నడికొను = మధ్యవయస్కుడు — *వయసు నడికొన్నది* [నె; తె]
నడిపాత=వాడుకలో సగము పాతబడినది — *పోయిన చెప్పులు నడిపాతవిలే* [కమ్మ]
నడిపెట్లు=నట్టనడుమ [శ్రీ; వి]
నడిబొడ్డు=నట్టనడిమి భాగము—*ఊరి నడిబొడ్డులో పోతురాజు చవిక ఉన్నది* [నె, కర్నూ; తె; అ]
నడుతులు=(చూ) నడుపులు [గు]
నడుపు=వస్తువులిచ్చి సహాయపడు—*ఆమె అమ్మగారింటికి అన్నీ నడిపింది* [నె; కర్నూ; అ; తె]
నడుపులు=పెండ్లిండ్లలో మగపెండ్లివారికి నడుప (చేయ) వలసిన లాంఛనాలు, నడుతులు; నడవళ్లు [గు]
నడుముబట్టువారు=మంత్రసానులు [చి]
నడుమూడు =స్థలనమగు [నె]
(2) కష్టమగు [చి]
నడ్డి = నడుము — *నడ్డివిరుగా పనిచేసినా* [నె; తె]
నడ్డినీళ్లు = ఎక్కువబరువును మోయుటలో కలుగు కష్టము—*అది నడ్డి నీళ్లే బరువు* [నె, కర్నూ, అ; తె]
నడ్డు=కొండలమధ్య ఏర్పడినదారి; నరవ; నారప [నె-ఉదయగిరి; అ]
నత్తు=(1) ముక్కున ధరించు ఆభరణము —*నత్తుబులాకీ*; ముక్కర [చి; నె; రా; కరీ]

(2) ముత్యాల ముక్కర [మ]

నదురు = మృదువు [నె]

ననాటాలు = ఇబ్బందులు [కరీ]

ననుపు = ఒకదేశపు పసరము, ఇంకొక ప్రాంతపు గడ్డి, నీటికి అలవాటుపడుట—*బెంగుళూరెద్దు మనకు ననపదు* [నె]

ననుపుకాడు = ప్రియుడు [మ]

నన్నమ్మ = 'మాయమ్మ' అని బిడ్డనులాలించునపుడు ఉపయోగించు పదము [సే]

నన్నూగాడు = నపుంసకుడు [సే]

నప్పతల్లవాడు = అప్రయోజకుడు [కరీ]

నప్పు = సరిపోవు—*వారికి మాకూ నప్పదు* [వి]

నఫా = సులభసాధ్యమైన లాభము — *మంచి నఫా కొట్టినాడు* [నె; కర్నూ; తె]

నఫాచేయు = మోసముచేయు [అ]

నమయు = కష్టపడు—*మొదటినుంచి వాడు కూటికి నమసిపోతున్నారు* [నె - ఆత్మకూరు]

(2) నమయు [అ]

నములు = ఒంటిలోని ఒకనర మేదైనా నొచ్చుట—*నా నరము నములుతున్నది* [కరీ; నె]

నయి = కంటకము; నవి [కరీ]

నయిమట్టి = గొడ్ల పెంట, పేడ ఒకచోట కుప్పవేయగా, అది చీకి మట్టిగా మారినది; మక్కినమట్టి [గు]

నరకడు = (1) తిట్టుమాటగా పురుషునికి ఉపయోగించు పదము [చి]

(2) స్త్రీలు పురుషునికి ఉపయోగించుపదము—*ఆ నరకుడు ఇంకా ఇంటికి రాలేదు* [నె]

(3) భర్త—*మా నరకడు* [తిరుపతి]

నరమానవుడు = మనుష్యుడు అనుట—*అక్కడికి నరమానవుడు అడుగుపెట్టడు* [నె; కర్నూ; అ; తె]

నరవ = రెండు పెద్ద మిట్టలనడుమ ఏర్పడిన పల్లపు ప్రదేశము—*బోగోలు నరవ;* నారవ, నడ్డు [నె; తె]

(2) మచ్చిక (మాశెము) గాని ఆవు [నె; తె]

నరవఏర్పడు = దారిఏర్పడు [గు]

నరవాది = సమర్త—*ఆ పిల్ల నరవాది అయినది;* నెరవాది [అ]

నరాలు దేలేసు కున్నాడు = చిక్కిపోయినాడు [మ]

నరిగ = పొట్టి—*నరిగమనిషి;* నరిగె [వ]

నరిగి = ఒక్కటి [తె]

నరిగె = పొట్టి; మరుగుజ్జు; నరిగ [కరీ]

నరిగెపారు = ఎదుగకుండ ముదిరిపోవు; పెరుగకుండుట; గిటకబారు [వ]

నరుకు = ప్రగల్భములు పలుకు; కోతలు కోయు—*ఆయన బలే నరుకుతాడు* [నె; కర్నూ; అ, తె]

నరుకుడు = నరకబడుట — *ఆ అడవి నరుకుడు బడినది* [నె; కర్నూ; అ; తె]

నరుసొకుక్కలు = (1) సుకుమారము

(2) రోగాలకుప్ప [కరీ]

నర్క = చిరుతపులి [అ-దక్షిణతాలుకా]

నర్లు = గొణుగు [అ]

నట్టావు = నట్టి-ఆవు

నలక = నాచిరకపు; తక్కువరకము; నలిగినది—*నలకపొగాకు* [కరీ]

నలబై జరిగింది = పరాభవం జరిగింది. ప్రభవాది సంవత్సరములలో నలువదివ సంవత్సరం పరాభవ [నె]

నలమాటు = నాల్గుసారులు [శ్రీ]

నలి = (1) మానసికబాధ — *ఏదో నలిగా ఉన్నది*

(2) అంతుబట్టని వ్యాధిచే శరీరము నలిగిపోవుట — *ఒంటిలో నలి ఏర్పడింది;* తెవులులేని వేదన—[నె; తె]

నలిక = కాలిమడిమ [నె-కోవూరు]
నలికిరి = నలికీచు (తొండజాతికి చెందినది) [చి]
నలినలి యగు = పొడిపొడియగు [అ]
నలుగుడుబడు = (1) దబ్బునకు ఇబ్బందిపడు; (2) మనస్సులో బాధపడు [గు]
నలుగుబెట్టు = (1) బాగా కొట్టు — *వాడికి బాగా నలుగుబెట్టినారు*
(2) కుప్ప నురిసినతర్వాత, పొట్టుతో గల సిన ధాన్యమును అడ్డపోతగా బోసి ఇద్దరు గడ్డిఎంటిని రెండుకొసలలో పట్టుకొని, రాసిని చదరపెట్టు — *రాసికి నలుగుబెట్టి కప్పినారు* [నె; అ]
నల్లకుండలు = గడికుడుకలు [మ]
నల్లతెల్ల అనక = మంచీచెడ్డ చెప్పక [కరీ]
నల్లపచ్చడి = ఉసిరికపచ్చడికి, రాత్రి అనే మాట [సర్కా]
నల్ల పొడి = గొఱ్ఱె మొదలగువాటి నెత్తురుతో చేసిన పొడికూర [మ; నె]
నల్లబద్ద = నేలమట్టము చేయుటకు సాధనము [శ్రీ]
నల్ల మొగము = తలవమ్ము [కరీ]
నల్లవడ్లు తేబోయినాడు = చచ్చినాడు [గు; నె]
నల్లికాయ = ఉసిరిగకాయ; నెల్లి [నే]
నల్లిబడు = కనరెక్కు [కర్నూ]
నల్లు = కుప్ప నురుచునవుడు బాగా మెదిగిన తర్వాత గడ్డిని ధాన్యమును వేరుచేయు [శ్రీ]
నవరస = (చూ) నవర [సర్కా]
నవారము = నవ్వు; దురద, జిల [కర్నూ]
నవి = కందకము; నయి [కరీ]
నవిసింది = (1) జబ్బుపడి లేచినది [తె]
(2) దీర్ఘవ్యాధితోగాని చింతతోగాని తీసి పోవు [వ]
నవిసి పోసికొను = జబ్బుపడు [కరీ]
నష్టరు = నేర్పరి అయిన దుర్మార్గుడు [నె]
నస = (1) ఎప్పుడూ అతృప్తితో గొణుగు కొనుట — *నసగాడు* [నె; కర్నూ; అ]
(2) దురద [తె]
(3) పొగరు [అ]
నసక = తెల్లవారుజాము; నసుకు [అ]
నసకలోనే = పెందలకడనే, చీకటిలోనే [అ; బ]
నసిపిరి = అత్యంత స్వల్పము [నె]
నసిమిరి = (1) కామోద్రేకము — *నసిమిరి గాను* [నె]
(2) నూగువల్ల కలిగే జిల [నె - ఆత్మ కూరు]
(3) గజ్జి [వ]
నసుకు = (1) రొంపి దుక్కిలో ఏర్పడిన బురదముద్ద — *నసుకులు వేయండి* [నె]
(2) తెల్లవారుజాము; నసక [అ]
(3) తెల్లవారుటకు ముందటిచీకటి [తె]
(4) తోరాలు తొక్కుట [గో]
(5) ఎత్తు; పన్నాగము — *నీ నసుకులు మాకాడ సాగవు* [తె]
నసుగు = (1) నసగొట్టుకొను [నె; కర్నూ]
(2) గొణుగు; అస్పష్టముగా చెప్పు — *సరిగా చెప్పక నసుగుతా వెందుకురా?* [తె]
(3) సిగ్గుపడు
(4) అతృప్తితో గొణుగుకొను [కరీ]
నస్కులు = టక్కులు, నటనలు [కర్నూ]

నాకిసాని = వేశ్య [మ]

నాకేసి = వాచాయ; నాతట్టు — నాకేసిచూడు [సర్కా]

నాగ = పనిలోనికి రాకుండా నిలుచుట — నాగా బెట్టినాడు [నె; కర్నూ; గో; తె]

నాగజెముడు = అరచేతివెడల్పునముండ్లతో ఉండు కంచె; నాగమల్లి, నాగదాళి, బలరక్కసి, దక్కిస [నె]

నాగదాడి = కంచెలకు పాతు నాగజెముడు; వీటికి "కొచినీలియన్" అను తెల్లని (బూజు) పురుగులుపట్టి పూర్తిగా నశించినవి [చి]

నాగజోడు = ఒక చెవినగ [వి]

నాగదాళి = దక్కిస; బలరక్కసి; నాగమల్లి; నాగజెముడు [సే]

నాగమల్లి = (1) నాగజెముడు [నె; శ్రీ]
(2) నాగజెముడులో పెద్దమాను [చి]

నాగరము పాముబొమ్మ చెక్కిన ఆడవారి తళబిళ్ల [నె; కర్నూ; న; గు, మ]

నాగరము = నాజూకుతనము [నె-పొ]

నాగిలిచాలు = నాగలి కట్టు [శ్రీ]

నాగవత్తు = స్త్రీలు సందిటి (రెట్టిన) ధరించు బొమ్మ; వంకీ [నె]

నాగవల్లి పిడతలు = (చూ) అరివేణి [నె-మెట్ట ప్రాంత బ్రాహ్మణులు)

నాగవాసము = (1) గొలుసుతో కలిసిన తలుపు గొళ్లెము; చిలుకు [నె - దక్షిణ; అ; తె; న]
(2) అంతఃపురస్త్రీలు [అ]
(3) భోగమువారి ఇండ్లవీధి

నాగవేలి = పెండ్లితరువాత జరిపేతంతు; నాగబలి; నాగేలి [మ]

నాగసలిపి = నల్లని విసర్పిరోగము, ఇది ప్రమాదకరమైనది [నె]

నాగేలి = పెండ్లితరువాత జరిగేతంతు; నాకబలి, నాగవేలి [మ; అ]

నాగు = గింజలు అప్పుగ ఈ సంవత్సరము తీసుకొని, వచ్చేసంవత్సరము ఒకటికి ఒకటిన్నరగ కొలిచి యిచ్చునది; ధాన్యరూపకమైన వడ్డి; నాము; ధారణి; లాకు; లాగు [నె-మెట్ట; మ; అ, వ; తె]

నాగప్పసాని = బలిజెజాతిలోని పెద్దముత్తయిదువ [కరీ]

నాచి - చెడ్డ [కరీ]

నాచు = సన్నటి; స్వల్పము — నాచుగా తలనొప్పి ఉన్నది; నాదు [కర్నూ]
(2) వరిపంటకు వచ్చురోగము [ప-కృ]
(3) సంగ్రహించు — సొమ్ము నాచుకొన్నాడు [అ]

నాచుబడు = ఆలస్యమగు — పని నాచబడినది; నానుడు బడినది [నె; అ]

నాచుబెట్టు = (1) పిల్లి పులి మొదలగు క్రూరజీవములు తమ బాధ్యజంతువులపై (చంపితిను జంతువులు) దూకు
(2) ముందు కనిపెట్టుకొనియుండు; పొంచియుండు [కరీ]

నాజూబారు = బలహీనమగు; పోదిలేకుండు [నె-ఆత్మకూరు]

నాటకము = నాట్లువేయుట, పైరు నాటుటలు [అ-పె]

నాటకమాడు = (1) తగులబెట్టు
(2) ఇద్దరిమధ్య ద్వేషము కలిగించు [అ]
(3) నటించు
(4) మాయోపాయమును ప్రకటించు — పనిచేసుకోను బలే నాటకమాడినాడు [నె]

నాటజెప్పు = మనసుకో పాతుకొనునట్లు చెప్పు; నచ్చునిలుకు [కరీ; నె]

నాటారు = కల్లుగీయు అరవవాడు; నాడారు [నె; నె-దక్షి]

నాటు = (1) మొరటు—*నాటుమనిషి*, మోటు మనిషి

(2) స్వదేశమునకు సంబంధించిన; దేశీయ మైన—*నాటుమందు* [నె; తె; అ]

నాటుకాయ = అంటుకట్టక విత్తముతో మొల చిన చెట్టుకాయ — *నాటుమామిడి* × *అంటుమామిడి చెట్టు* [చి; నె]

నాట్లు = (1) బండివరమున నిలువున నుంచు కొయ్యలు; గుజ్జులు [నె-మెట్ట]

(2) పైరు ఊడ్పులు [నె]

(3) కొయ్య మొదలగు వాటిలో, తాడు కట్టుటకు చేసినగాడులు (కోత)—*జడి తెకు నాటుగొట్టి తాడుగట్టు* [నె]

నాడా = గుఱ్ఱము గిట్టకు గొట్టు లోహపుపట్టీ; లాడము [కరీ]

నాడెము = గుర్తు—*నాడెము సేయుమ*

నాణెము = (చూ) ఆణెము [అ]

నాదు = (1) అతిస్వల్పము — *తలనొప్పి నాదుగా తగిలినది*; నాచు [నె; కర్నూ; వ]

(2) గోధుమపిండిని తడిపి చేతితోరుద్దు [తె]

నాన = బలహీనమైన; నాసి [అ; బ]

నానవాలు = నానవేసి, బెల్లము కలపిన బియ్యము; నానబియ్యము [గో; నె]

నానబియ్యము = (చూ) నానవాలు [నె]

నానాగుండ = కంఠమునకు క్రిందగల పల్లము; నాముగుండము [చె]

నానాగోత్రేభ్యం = అన్నిజాతుల సంకరం [గు]

నాను = అల్లిన స్త్రీలకంఠభూషణము—*నాను ఖాగా అల్లినారు* [నె; అ]

నానుడుబడు = విషయము వగదేగక నిలిచి పోవు [నె; కర్నూ; అ; వ; తె]

నానుతాడు = మంగళసూత్రం వేసికొనుటకు నులకతాడువలె బంగారంలో తయారు చేసినహారం; బొందుదారము; సరడు [నె]

నానుడువాన = (1) చిన్నచిన్న చినుకులుగా చాలదినములు కురియువాన (నానబెట్టువాన) [నె]

(2) పెద్దవాన [కర్నూ; తె; అ]

నానుపు = ఇచ్చకము — *నానుపుమాటలు* [వి]

నాన్పువాన = నేలను నానుడు (నానుపు) గా చేయు వానచినుకులు; నానుడువాన [కరీ]

నాప = (1) అసమర్థుడు

(2) షండుడు [గు]

నాపకల్లు = ఋతువుగాని ఋతువులో ఉట్టిన కల్లు [కరీ]

నాపకుదు = మంగలి [కరీ]

నాపచేను = (1) పైరుకోసిన తర్వాత (కొయి కాలునుండి) ఆమోట్లనుండి పుట్టినకాడలు (నాము) గలచేను (Ratoon) —*నవ్వినన నాపచేనే పండినది* [నె]

(2) లేత పైరుగల చేను [తె; వ-కృ]

నాపలు = పనికిరాకుండ పోయిన నాచిధాన్య ములు [కరీ]

నాపసాని = (1) నంగనాచి [కృ]

(2) పెద్దవారివలె మాట్లాడు చిన్నపిల్ల (గు)

(3) ప్రౌఢురాలు [తూ-గో]

నామాలు = పైరువిత్తులు గర్భముచేయుట; —*గింజలు నామాలు చేసినవి*; పాలు పోయుట [కరీ]

నాము = (1) ధాన్యము అప్పుగాఇచ్చి ధాన్య రూపముగా తీసికొనువడ్డి; ధారణి; నాగు; లాకు; లాగు — *తూముకు ఇరన నాము* [నె; గు]

(2) ఒక్కొక్క జొన్నదంటుకు, ఆముదపు కాడకు ఒక్కొక్కప్పుడు ఎక్కు విషము, ఇది మేసిన పశువు వెంటనే చనిపోవును — *కోడెకు నామము తగిలినది* దీనికి విరుపు చిలుముగాని అమేధ్యము గాని [నె; వ, అ]

(3) కోసిన వరికాడలనుండి మొలసివచ్చిన కొత్తకాడ, ఇది వెన్ను గూడ తీయును; ఇట్టి పొలమును నావచేనుఅందురు; లాట; లేట [నె; వ]

(4) అసూయ—*వాడు నామీద నాముగా ఉన్నాడు* [నె వ]

(5) పొగరు [అ]

నామముబెట్టు = ఎగవేయు: ఎగనామము బెట్టు, పంగనామము బెట్టు [నె; కర్నూ; అ: తె]

నాముగుండము = కత్తుకలో నుండు గుంట — *నాము గుండములో సున్నము పూసిన గొంతురాపు తగ్గును;* నానాగుండ [నె]

నామునాము = (1) పప్పునానిన వాసన

(2) చెడిన వాసన; కంపు [కరీ]

నాముచాసన = కొత్తవడ్లు వెడల గ్రకుక్క వాసన [నె; అ; పె, వ]

నామెక్కు = (1) నెమరుతిరగకుండా ఉండు [అ]

(2) పశువులు తవుడు కాని, మరేది గాని అధికముగా తిన్నందున ఒక విధమైన రోగము వచ్చి, నాలుకను కరుచుకొనుట [మ]

నాయకము = (1) అందము, ఎక్కువ నాజూకుతనము

(2) శ్రేష్ఠము [రా]

నాయాల = ఇది మగవారు, వరుసైన మగవారిని ఎగతాళిగా అను తిట్టు — *ఓరి నాయాలా, గుడ్డినాయాల;* (అలు = భార్య అనుట) [నె; కర్నూ; అ; తె]

నార = (1) మాంసము [వి]

(2) పిసినగొట్టు [అ]

నారకురుపు = (చూ) నారికురుపు [గో]

నారదబ్బ = (1) ఊరగాయకు మాత్రమే పనికివచ్చు పెద్దనిమ్మకాయ

(2) నారగలిగిన తాటికమ్మ; పచ్చికమ్మ [నె]

నారపీచు = (1) దయలేనివాడు; కఠినుడు [కరీ]

(2) చాల పట్టుదలతో, గోజారువాడు—*నారపీచుగాడు*

(3) లోభి [నె]

నారపీనుగ = ఎంతకూ అంగీకరించని వాడు —*వాడాః నారపీనుగే* [చి]

నారవ = (చూ) నరవ; నడ్డు [అ]

నారికురుపు = కాలిలో లేచు బాధాకరమైన వ్రణము. తీగవంటి తెల్లటి దారము కురుపు నెత్తి రంధ్రముగుండా బయటికి వచ్చును. ఇది నడుమ తెగిన అపాయకరము. కాల్చిన పటిక గలిపిన వెంకాయ నీరు దీనికి అద్భుతమైన ఔషధము; నీటిగుండా సంక్రమించునది [నెః కర్నూ; అ; తె]

నారిగాడు = బక్కచిక్కిన మనిషి [కరీ]

నారు = కందెన; నూనెకందిన—*బండికి నారేసుకో* [మ]

నారు = (1)పడియుండు, నిలువయుండు [చె]

(2) ధాన్యాదుల మొలకలు—*నారుకయ్య* [చె; నె; రా]

నారుకయ్య = ఆకుమడి; నారుమడి [నె; తె]

నారుకొను = లోపలనే స్వల్పరూపున నిలిచి పోవు — *జ్వరము లోన నారుకొని పోయింది*

నారుగోర్లు చేయు = అజాగ్రత్త చేయు [అ-పె]

నారువ = చిన్న కాలువ: నాలువ [అ; బ]

నాలుకచేర్లు = పాడి పశువులకు నాలుక క్రింది భాగములో కలిగెడి ఒక రకమైన

వ్యాధి; ఇదివచ్చినచో పాలు విరిగిపోవును [నె]

నాలువ=చిన్న కాలువ; నాడువ [అ; బ]

నాల్గు నగలుపెట్టు = శుభ కార్యాలలో ధోవతి, అంగి; రుమాలు, అంగవస్త్రము (కండువ) పెట్టుట [మ]

నావ=పనికిమాలినవాడు [గు]

నావకాయ పిండివంటలు = అనేకవిధములైన పిండివంటలు [గో]

నాస=(1) బలహీనము [అ]

(2) కృశించుట [గు]

నాసి=(1) తక్కువరకము

(2) చచ్చుగింజలు ఎక్కువగానున్న ధాన్యము [చి]

(3) కితరకము, తక్కువది [నె - ఆత్మకూరు]

## ని



నింజిలి=(1) లోపలి గిలి; [నె-పా]

(2) అనుమానము వల్ల వచ్చిన దిగులు; నంజలి [నె]

నిండా=ఎక్కువగా; శానా, పూర్తిగా—*ఇది నిండా బాగున్నది;* మంచిగా [నె-దక్షిణ; చి; అ]

నిండు మనిషి=గర్భవతి [అ; నె]

నిండుకొను = అయిపోవు — *ఇంట్లో బియ్యము నిండుకొన్నవి* [తె; వి]

నిండుబట్టలు=లాంఛనప్రాయముగ పూర్తి (తుంటలుగాని) బట్టలు పెట్టుట [మ]

నింపుకొను = నెమ్మది చేసికొను—*ఖ్వారం నింపుకొనవలె* [కరీ]

నింపుడుకాయ = గుత్తి వంకాయ వంటిది; కోసి మసాలా ద్రవ్యములు లోపల బెట్టి పాకము చేసినది [మ]

నికానికలు=త్రోయుటలో ధ్వన్యనుకరణము —*నికానికలు బడ త్రోసె* [కరీ]

నికాలసు = (1) అప్పటమైన — *నికాలసు నూనె;* నికాలస్తు

(2) యోగ్యమైన — *నికాలసు మనిషి;* పెద్దమనిషి [నె]

నికాలస్తు = (1) అప్పలమైన

(2) నిర్లిప్తత; నికాలసు [అ, బ; నె]

నిక్కచ్చి=(1) తేడా లేకుండా [గో]

(2) నిశ్చయము—*నిక్కచ్చిగా చెప్పివేసినాడు* [అ; నె]

నిగిడి నిమ్మాకు పెరికినాడు= చచ్చినాడు [గు]

నిగ్గదీసి=కచ్చితముచేసి; నిలబెట్టి [తె; నె]

నిగ్గి=మట్టితో వేసిన మిద్దె, అటిక [శ్రీ]

నిచ్చెరపోవు=నివ్వెరపోవు [వి]

నిజారు=లాగు; ప్యాంటు [చె; నె]

నిట్టనిలువు= (1) నిట్రము

(2) నిలుచున్నది నిలుచున్నట్లే — *నిట్ట నిలువున చంపినారు* [నె; కర్నూ; అ; తె]

నిట్టాడు = (చూ) నిట్రాడు [కృ]

నిట్టు = నియతి — *నిట్టు లేకుండా నిద్ర బోయెను; నిట్టు తప్పి తినెను* [అ; బ]

నిట్రము=(1) గోడబెట్టినట్లు చక్కగా పైకి లేచినది—*ఆ రాయి నిట్రంగా ఉన్నది* [నె; కర్నూ; తె]

(2) నిట్రాయి [అ]

నిట్రాడు=గుడిసెకు మధ్య నాటిన ఆధార స్తంభం; నిట్రాయి [కరీ; నె]

నిట్రాయి=(1) వసారా దించుటకు నడుమ నిలిపిన పెద్ద కంబము; నిట్రాడు [నె; కర్నూ; గో; వ]
(2) పశువులు రుద్దుకొనుటకు పాతినరాయి [అ]

నిడిగాలి=విడువకుండా కొట్టు పరమటగాలి; నిడుగాలి [నె]

నిడుదాడు = కపిలబాన (మోటబొక్కెన) తొండము చివరనకట్టు సన్నపాటి పొడుగు మోకు. బానను లాగు లావు మోకు పైన గిలకమీద నడువగా, ఇది క్రింద బారి మీద రెండు మూడు చోట్ల అమర్చిన అడ్డ గిలకలమీద సాగి. చివరన రెండును చేర్చబడి ఎద్దులకాడె వార్నెలో (మోకుల జొనిపి చిల్ల (మేకు)తో బిగించు వల యము) చొప్పించి బిగించబడును. మోట తోలువాడు బారిక్రింద ఎద్దులను విడిపించి, దీనిని ఒకచేత కొంచెము ముడిచి పట్టు కొని, పెద్దమోకును రెండవచేత పట్టుకొని బారిపైకి వచ్చి (గూటిమీదకు, దోనెదగ్గ రకు) పెద్దమోకును, అచట వచ్చి నిల్చి యున్న ఎద్దులజత కాడె వార్నెలోచిల్లతో బిగించి దీనిని వదలును. వెటనే బాన ఒక ప్రక్కనుండి నీట మునిగి, నీటిని నిండుగా నింపుకొనును. ఈ మోకులను రెండు చేతుల బట్టుకొని, ఒక ప్రక్కకు వంచిన మెడక్రింద కొరడా బిగించుకొని, బరువు తూకమును సరిచేసుకొనుటకు వెనుకకుబడి పైకి నడచి వచ్చునప్పుడు, కపిల తోలుమనిషి చాల ధీరముగ, గంభీ రముగ గానిపించును.
అనగా—నిడుదాడు పెద్ద మోకు ననుస రించి పోవుచుండునట్లు ఒకరిని మరి యొకరు ధీరముగనే అనుచరించుట అని అర్థము [నె]

నిడుదాట పోనిమ్ము = ఒకరు చెప్పిన ప్రకారము అంగీకరించి, నడుచుకొనుము (మా) నిడుదాడు — *ధీరవృత్తి నిడుదాట బోనిమ్ము; కమ్మ కపిల యనగ (= నీరు నిండిన తర్వాత ఎక్కను పూన్చునట్లు చేయు మోకు) కమ్మి (=వ్యాపించి) చెఱువు (ము)*-తిక్కన ఆశ్రమవాసపర్వము [నె]

నిదానము = ఎగుడు దిగుడులేని; స్థిమిత మైన—*ఆయన నిదానమైన మనిషి* [నె; కర్నూ; అ; తె]

నిద్ద = గట్టియైన [శ్రీ]

నిద్రకాయు = నిద్రపోకుండా ఉండు — *జ్వరం వస్తే నిద్రకాయాల* [అ; బ]

నిద్రజేయు=పిల్ల పుట్టినతరువాత 3, 5 నెల లలో తల్లి వెళ్ళి పుట్టి నింటిలో నిద్ర చేసి వచ్చుట [అ-పె; నె; చి]

నిద్రవాటు=నిదురబట్టుచోటు [కరీ]

నిప్పటి = (1) నురిసిన ధాన్యము తూర్పార బట్టినప్పుడు, రాసి అంచున, గట్టి గింజ లతో కలసి ఏర్పడిన భాగము [నె]
(2) అరిసె [నె; చి; చె; రా]

నిబ్బణము=పెండ్లిలో చేయు ఎదుర్కోలు సన్నాహము; దిబ్బణము

నిబ్బనము గంప=పెండ్లిలో పెండ్లికొడుకు వెంబడి కొనిపోయెడి గంప; కందపెట్టె [అ]

నిమ్మటాయి=(1) నల్లటి గట్టి-చిన్న చెరువు చేప
(2) *గట్టి శరీరము గలవాడు—వాడు నిమ్మ టాయి మాదిరి ఉన్నాడు* [నె]
(3) ఒకఅడవిగడ్డ, ఉర్లగడ్డవలెనుండును. తియ్యగా నుండును. తీగె, చిలగడదుంప తీగెవలె నుండును. [చి, నె-ఆత్మకూరు]

నిమ్ము=నెమ్ము; తడి [కరీ, చి]

నియ్యతు=స్వభావము [కరీ]

నిరాదరువు = నిరాధారము, ఆదరువు లేక పోవుట [కరీ; నె]

నిరాపనింద=వట్టి బదనామీదూరు; నీలాప నింద [కరీ]

నిరాబందరము = పనికిమాలినతనము—వాడు వట్టి నిరాబందరపు మనిషి [నె-ఆత్మ]

నిరుకు = (1) ధనవంతుడు [వి]

(2) నిశ్చయము — వాడిమాటకు నిరుకు లేదు [గో]

నిర్గముబెట్టు = (మా) నిర్గెముపెట్టు

నిర్గెముపెట్టు = ప్రయాణమునకు శుభ ముహూర్తంలో చిన్న మూటకట్టుకొని స్థలాంతరమున నుంచుట. ఇది మరు దినం ప్రయాణం చేయదలచినవారు ముందు దినము చేయుపని; నిర్గముపెట్టు; నెర్గ్యము పెట్టు [నె-పొ; కరీ]

నిలదొక్కుకొను = స్థిరపడు—ఆ ఊరులో బాగా నిలదొక్కుకొన్నాడు [నె; కర్నూ; తె; అ]

నిలదీసి = అడ్డగించి నిలువబెట్టి—వాడు నిల దీసి తన బాకీని వసూలుచేసుకొన్నాడు; నిలవేసి [తె; నె]

నిలబలుకు = ఒకమాట నెగ్గునట్లు గట్టిగా వాదించి మాట్లాడుట, తెగనాడు—ఆ సంగతి నిలబలికి పోయినాడు [నె]

నిలవ = సెద్యగాడు పనికిరాకుండా నిలిచిన దినము. నిలువ—ఈ నెలలో రెండు నిలవలు [నె. కర్నూ]

నిలవరము = ఒక మొత్తములో ఇంకొక మొత్తము తీసివేయగా నిలిచినది (Balance) నిలవరమెంత తేలింది [నె]

నిలివేసి = నిలువబెట్టి బలవంతముగా పని చేయించు—నిలవేసి ఒప్పించినాడు; నిల దీసి [నె; కరీ]

నిలికి = విశ్రాంతి— నిలికి నిబందరం లేనివని [చి]

నిలుపు = (1) జాతరలలో తాత్కాలికముగ కొలుచు, పోలేరమ్మ మొదలగు దేవతలను ప్రతిష్ఠించుట—ఈ దినం అంకమ్మ నిలుపు

(2) సంసారుల అపరక్రియల ప్రారంభములో ఇంట కొయ్య మేకులను (శిలలను) నెలకొల్పుట

(3) ఓపిక—నిలువులేని మనిషి [నె]

నిలువ = (మా) నిలవ [నె; కర్నూ]

నిలువజేయు = చేర్చిపెట్టి—రాగులు నిలువ జేసినారు [నె]

నిలువు = (1) మనిషి పొడవంత కొలత, ఆరడుగుల పొడవు; మట్టు — ఆ బావి మూడు నిలువులలోతు [నె; కర్నూ; తె]

(2) పండి కోయుటకు సిద్ధముగా నున్న పైరు—ఆ చేను నిలువున తడిసినది [నె; తె; శ్రీ; అ]

(3) తాటిచెట్టు ప్రమాణం—రెండు నిలువలలోతు [గు]

(4) నిలువవేయి; ఒకదానిమీద ఇంకొక్కటిగా పేర్చు [అ]

(5) నిలువుగఉన్న కొయ్య — పందిలికి నిలువులు పాతినారు [నె]

నిలువుకాళ్లు = (1) మ్రాన్పడి నిలిచిపోవుట —చూడగనే నిలువుగాళ్ల పడిపోయాయి [చి]

(2) నిలుచున్నవాడు నిలుచున్నట్లుగనే అనుకొనిన పని చేయుట; ఒకేపట్టుతో పనిచేసికొనుట—నిలువుకాళ్లమీద నే అప్పు వసూలు చేసుకొన్నాడు [నె]

నిలువుజీతము = ఎప్పుడూ కనిపెట్టుకొని యుండుటకు యిచ్చుజీతము — నిలువు జీతముగాదు నిలిచి మిమ్మడుగ [నె, కర్నూ; వ]

నిలువుతాళము = పొడవుగా కడ్డీవలెనుండు తాళపు బుఱ్ఱ [నె]

నిలువుదోపిడి = (1) ఇంటఒంటనున్న దానినంత దొంగలు అపహరించుట [నె]

(2) మొక్కుబడి ప్రకారం ధరించిన నగలన్నీ దేవునికి కానుకబెట్టుట — నిలువు దోపు

నిలువుదోపు=(చూ) నిలువు దోపిడి — *వెంకటేశ్వరునికి నిలువుదోపిచ్చినాడు* [కర్నూ; నె]

నిలువున=(1) నిలుచున్నట్లుగానే—*నిలువున నీరైనాడు*
(2) ఆపాదమస్తకము [నె; కర్నూ; తె; అ]

నిలువు మంద = పొలములలో రాత్రిపూట లందు పశువులను తాత్కాలికముగా మంద బెట్టించుచోటు [చి]

నిలువు నిస్తారము = ఆపాదమస్తకము [కరీ]

నివ్వు=రాతిచుట్టూ బంగారమును పొదుగుట [గు]

నిశిందా = ధనవంతులవలె గొప్పలు ప్రకటించుకొనువాడు [గు]
(2) దేవాలయములలో అర్చనాదిక వ్యవహారములు చూచు గుమస్తా [నె]

నిక్షేపరాయుడు=ఎంతటి క్లిష్టపరిస్థితులలోనైనను బాధ్యత తప్పించుకొని తిరుగు వ్యక్తి [గో]
(2) ఏమీ డబ్బులేకపోయినా వ్యసనపడకుండా కులాసాగా తిరుగువాడు [గు]

# నీ



నీచు=(1) మాంసము, చేపలకూర — *ఈ దినము నీచు తినము*
(2) పొలుసు కంపు; నీసు [నె; తె]

నీటికాయ ఉప్పు కారపు నీటిలో ఊరవేసిన మామిడిపిందె, వడపిందె [వి]

నీతకము=(1) నియమము [చి]
(2) (వ్యంగ్యముగా) కపటవాక్యము; నియతములు— *ఆయన బలే నీతకాలు పలికి పోయినాడు* [నె]

నీరడికాడు = చెరువు నీరు పొలాలకు పారించువాడు; నీరుకట్టుగాడు; నీరుగంటి; నీలారి; ముదాము [కరీ]

నీరాబ=తీరభూమి; వాగర్త [కరీ]

నీరుకట్టుగాడు = చెరువునీరు గ్రామ పొలము లన్నిటికి సమముగా పారించు గ్రామ నౌకరి; ముదాము; నీరడికాడు; నీరుగంటి; నీలారి [నె; కర్నూ; తె]

నీరుకాకి=ఆరేటిబాతు, చిలవలవలె నీటిపైనుండు కాకివలెనుండు పిటిపిట్ట — *కవి యను నామంబు నీరుకాకికి లేదే* [నె;తె]

నీరుకాళ్లు = కపిల దోర్ణపు పట్టెను (గిలక బిగించిన అడ్డ దూలపు పట్టెను) నిలువబెట్టు గుంజలు [నె-మెట్ట]

నీళ్లుకారు=(1) పాసి, చెడు [అ]
(2) నిర్వీర్యమగు—*ఆయనకు నీళ్లు కారి పోయినవి* [నె]

నీరుకావి = పదేపదే గుడ్డ నీటదీసి, నీడయందు ఆరవేయగా పట్టు లేత గవరచాయ; నీర్కావి

నీరుకాసులు = (1) నదీతీరాలలో సంకల్పములుచెప్పి సంపాదించిన డబ్బు
(2) కల్లు అమ్మి సంపాదించిన డబ్బు [తె]

నీరుకూడు= గాయము చీముబట్టి బాధించు —*కురుపు నీరు కూడింది* [నె; కర్నూ, అ; తె]

నీరుగంటి = (1) నీరుకట్టుగాడు [అ-పె]
(2) (చూ) మడవకట్టుగాడు [అ]

నీరుగడ్డి = నిరపాయకరమైన పాము; నీళ్ల పాము [శ్రీ]

నీరు గారిపోవు=హతాశుడగు [తె; నె]
నీరుచిచ్చు=నీరు నిల్చిన కయ్యలో పైరు ఎండిపోవు తెగులు— *ఈ వానకు సగం పైరు నీరుచిచ్చు పడిపోయింది* [నె-పొ]
నీరువట్టు = పొగరెక్కు; చియ్యపట్టు [గు]
నీరుబుడ్లు = గింజపట్టని వేరుశెనగకాయ [అ]
నీరువంక తుంగ = గెలుపువారి పక్షం వహించు వ్యక్తి; ఏగాలికి ఆచాప ఎత్తువాడు; దొల్లుడుపుచ్చకాయ [కరీ]
నీరుసోబ=పొట్టలో నీరు నిలిచి గడ్డగామారు వ్యాధి [కరీ]
నీలాంజనము=దీపపుసెమ్మె [తె]
నీలాంబ్రము=ఎప్పుడు మంచినీటి పారుదల గల భూమి — *వారితోట నీలాంబ్రము* [నె-పొ]
నీలాజాలము=సులభము — *వాడు ఎంత పుస్తకమైన నీలాజాలముగా చదువుతాడు* [తె]
(2) అజాగ్రత్త, లెక్క లేకుండుట [అ-పె]
నీలారి= చేలకు మడవకట్టుగాడు; నీరుకట్టుగాడు; నీరడికాడు; నీరుగంటి [నె-ఆత్మ]
నీలాలు = (1) కన్నీళ్లు — *పడితే నీకళ్లు నీలాలు కారు* [వి]
(2) దేవునికి మ్రొక్కుబడి యిచ్చిన తల వెంట్రుకలు [గో; నె; చి; తె]
నిలిగించు=తిండిలేక మాడ్చు [తె]
నీలుగుడు=పొగరు [తె]
నీసు=(చూ) నీచు [నె; అ]
నీసుబోతు=అసూయాపరుడు [నె]
నీళ్లకుఎల్లుండి=బిడ్డ నామకరణంనాడు దిన బాలెంత మొదటి పర్యాయము చేద (బొక్కెన) బావిలో వేసి మొదటి బిందెడు నీళ్లు చేది తెచ్చుట [మ]
నీళ్లచాయ=నీళ్లున్న దిక్కుకు కాలప్రవర్తికి బోపుట; బహిర్భూమికి పోవు; దొడ్డికి పోవు; బయటికి పోవు; కాలువతట్టుపోవు; నీళ్ళచాయ పోవు; చెరువుకట్టు పోవు మొదలగునవి— *వాళ్లు నీళ్లచాయ పోయినారు* [నె]
నీళ్లతట్టు = (చూ) నీళ్లచాయ [నె]
ఇది ఆ యా ప్రాంతమునుబట్టి వాడుకలోనికి వచ్చును — *చెంబట్లకు పోవు* [సర్కా]
దొడ్డికి పోవు [నె-పట్టణం]
పెళ్లకుపోవు [చి]
బయటికి పోవు — *ఇంగ్లీషులో* Stools అన్నట్లు
నీళ్లదీయు=గుడ్డను పూరకే నీటముంచి ఆరవేయు (చాకలి ఉతికినట్లు గాక)— *పంచ నీళ్లదీయి* [నె; అ; తె]
నీళ్లవేయు=(చూ) నీళ్లదీయు [అ]
నీళ్లుకారు = నిర్వీర్యమగు—*అలటికి నీళ్లు కారిపోయినవి* [నె; అ; తె]
నీళ్లుతట్టుకు బోవు=బయటికి పోవు, చెంబట్లకు పోవు, కాలవతట్టుపోవు [అ; నె]
నీళ్లుత్రాగు=కల్లుత్రాగు—*నీళ్లు తాగిన వాడి మాటకు నిలకడలేదు* [నె; అ; వ]
నీళ్లుతోడు = (1) స్నానమునకు వేడినీళ్లు పాట్లు చేసిపెట్టు — *నీళ్లు తోడినావా?* [నె; అ]
(2) అపకారముచేయు [తె]
నీళ్లు పోసికొను= (1) గర్భవతి యగు— *ఆమె నీళ్లు పోసికొని యున్నది* [నె,కర్నూ; అ; తె; గు]
(2) ఋతుస్నాతయగు [నె-పొ]

# ను



నుంజ = తాటి ముంజ; నుంజు [చి; నె; పొ]

నుంజు = తాటినుంజు; ముంజె [అ]

నుగ్గులు = పేడపిడకలు — నుగ్గులకుచ్చిలి; నుగ్గులదాళి [అ, మ]

నుచ్చు = మేక, గొఱ్ఱెపిల్లలు, నడుమ పాలు త్రాగివేయకుండుటకుగా, మూత్రముతో మట్టిగలిపి, ఒక గుడ్డపేలికమీద అప్ప ళించి, ఈనిన జీవము రొమ్ము చుట్టుచుట్టి ఉంచు గుడ్డపేలిక [నె; వ; తె]

నుచ్చుపాత = (చూ) నుచ్చు; నుచ్చుటకు ఉపయోగించు గుడ్డపేలిక, కోపలు; నుచ్చు పేలిక [నె; అ; తె]

నుచ్చుపేలిక = (చూ) నుచ్చుపాత [తె]

నుచ్చులు = పశుజాతి పాలు త్రాగినపుడు నోటివెంట కారు పాలచారలు [సర్కా]

నుచ్చులు నుచ్చులుగా వచ్చు = వ్యాధిచే నోటివెంట వచ్చు ఉమ్మి [గు]

నుజ్జు = నుగ్గు; నజ్జి [నె, వ, తె]

నున్నబెట్టు = కరిగించు [వి]

నున్న సిరపడు = మంగలి (తల నున్నగా చేయువాడు) [వి]

నురుసు = నురుగు — కుంకిడి నురుసు [తూ-గో]

నులుము = ఒత్తివేయు — బిడ్డను నులిమి వేసినాడు [నె; కర్నూ; అ; తె]

నుసి = బురద [శ్రీ]

నుసిమిరి = (1) పశువుల తోక వెంట్రుకలు ఊడిపోవు రోగము

(2) కురుపు రోగము [నె-పొ]

(3) గొడ్లకు చర్మంపై సన్నితంగా ఏర్పడు వ్యాధి [గు]

నుసుగులాడు = కీచులాడు; కలహించు [నె]

నుసుము = (చూ) నసుకు [నె-ఆత్మ]

# నూ



నూక = అక్షతలు — తలమీద నూకలేస్తే చాలు; పెండ్లి అయినట్లే [చి]

నూకవాటు = నూకపారు, నూకలగు ధాన్యము [కరీ]

నూకిడి = ధంచినచో ఎక్కువ నూక అగు వడ్లు [నె]

నూకు = (1) ప్రయత్నము — నీ నూకులు చెల్లవు

(2) సఫలమగు — నీ నూకులు నూకవు [నె]

(3) అపహరించు, సర్కారులలో "దొబ్బి నావు" అనునట్లు — నూకేసినాడు [నె; తె; అ]

(4) తిట్లు — బాగా నూకులు పెట్టినాడు [నె, తె]

(5) దెబ్బ — ఒక్క నూకు నూకినాడు

(6) నెట్టు, గెంటు — మెడబట్టి నూకినాడు; మెడబట్టి నూకించమనియె [భీమఖండము-శ్రీనాథ] [నె; తె; అ]

(7) పరుగెత్తు — కాలుకొంది నూకినాడు ఇట్లు ఇది నానావిధాల ఉపయోగించబడు చున్నది [నె; అ]

(8) చిమ్ము—కసవూడ్చు [అ; వి]

(9) లోనికి పోవు, దిగు (నిందార్థముగ) —అన్నం నూకడు పోతేదు [వ]

నూటు = కూరగాయల పాదులకు తీగలు ఎగ బ్రాకుటకు ప్రక్కన ఉంచిన పుల్లలు; పాకులు; అల్లుడు [శ్రీ]

నూటి కర్థము = సారాంశము [కరీ]

నూనె గమళ్ల = ఒంటెద్దు గానుగతో నూనె ఆడువారు, తిలఘాతకుడు. వీరికి శెట్టి బిరుదము గలదు [నె]

నూరు = వంద; ఇన్నూరు - 2 వందలు; మున్నూరు - 3 వందలు; నన్నూరు - 4 వందలు; ఏన్నూరు - 5 వందలు (ఐన్నూరు) [నె; వ; చి]

ఆర్నూరు - 6 వందలు; ఏడ్నూరు - 7 వందలు; ఎనమన్నూరు - 8 వందలు; తొమ్మన్నూరు - 9 వందలు— వెయ్యిన్నీ తొమ్మన్నూరు అరవై ఎనిమిది; ఈ నూర్ల ప్రయోగము నన్నయాదులు కూడ వాడిరి. ఇప్పుడు ఇది ఈ ప్రాంతముల నుండి గూడ మారిపోవుచున్నట్లున్నది [నె; చె; రాయ]

నూరుగాలము = ఎల్లప్పుడు; ఆఽగాలము [నె ఆత్ర]

నూలు పున్నమ = జంధ్యాల పున్నమ; శ్రావణ పున్నమ; ఆవని అవిటము

# నె

నెగడి నెత్తిగోడ

నెగడి = (చూ) నెగడు [అ]

నెగడు = కట్టె మొద్దులతో చేసిన మంట, సాధారణముగా చలికాలములో పొలములలో దీనిని వేసి ఎప్పుడూ ఆరిపోకుండా చూతురు; నెగడి; నెగళ్ల [తె; నె; కర్నూ]

నెటిక = వ్రేళ్లవిరిచి చేయు శబ్దము; మెటిక [చి]

నెట్టి = వరి కోసివేసిన కుప్ప [శ్రీ]

నెట్టు = (1) కష్టము

(2) రాసి; నట్టు—నెట్టేసినారు [అ-పె]

(3) సూటిగా; నేరుగా; తిన్నగా — నెట్టు తూర్పు [కరీ]

(4) అహంకారము [చి]

నెట్టికాయ = తీగకు గాక, వేళ్లలో గుత్తిగా కాసే వేరుసెనగ రకము [అ]

నెట్రాడి = పొడుగాటి కొయ్య; కుటీరమునకు మధ్యలో వరుసగా నిలువున పాతెడు కొయ్య; నిట్రాడి; నిట్రాయి [చి]

నెడ్డిన = గర్వము—ఈమెదంతా బలె నెడ్డి నలే (స్త్రీలలో వాడుక) [నె-ఆత్మ]

నెత్తళ్లు = ఒకే ముల్లుతో నుండు చిన్న సముద్రపు చేప; ఇది ఒక వేటకు కొన్ని గరిసెలు పడును. ఇవి అదునును బట్టి దొరకును; మెత్తాళ్లు; మెత్తళ్లు [శ్రీ; కరీ; కృ; వి]

నెత్తాలు = చిన్న రకం ఎండుచేపలు [చి]

నెత్తిగోడ = ఇంటికప్పును వాలుగా దించుటకు అనువుగా ప్రక్క గోడలమీద, అటు నిటు ఏటవాలుగా కట్టినగోడ; రెట్టగోడ [నె]

నెత్తి గోతలవాడు = (1) ఒకజాతి ముష్టి వాడు
(2) కరినాత్ముడు — *వాడు ఉత్త నెత్తి గోతలవాడు* [వి]

నెత్తినజాజమ్మ దింపు = గర్వమణచు [మ]

నెత్తిన నోటివాడు = మర్మములేక అరచి చెప్పువాడు [నె]

నెత్తిన నోరు బెట్టుకొని చెప్పు = వలు మారు బహిరంగముగా హితమును చెప్పు — *ఎంత నెత్తిన నోరు బెట్టుకొని చెప్పినా, వాడు అది మానలేదు* [నె]

నెత్తి బుఱుకు కొను = పశ్చాత్తాప పడు [కరీ]

నెత్తెణచు = (1) హానిచేయు, క్షుద్రవిద్యలు బెడసి ప్రయోగించిన వానిమీదనే మరల తిరిగివచ్చి బడుట — *చాతబడి వాడిని నెత్తెణిచింది* [నె-పొ]
(2) నష్టపరచు; హానిచేయు [నె]

నెమరు = వెదకు [శ్రీ]

నెమరుకు తిరుగు = యోచనకు అందు — *ఆ సంగతి నెమరుకే తిరుగలేదు, నెమరుకు వచ్చు* [నె; చి; వ]

నెమరువేయు = ఆలోచించు [తె]

నెమలి = నీలివన్నె గలిగిన పందెపుకోడి పుంజు. దేగ, బెరస, కాకి మొదలగునవి వీటి భేదములు [నె]

నెమలివడ్లు = గుంటలలోను, దొరువులలోను అడవి మొలుపుగా మొలచి పంట పండు వడ్లజాతి. దీనికి మీసముపంటి పొడవు యాక ఉండును. వీటిని ఉడుకబెట్టి దంచ నిచో పొడి అగును. నీవారము; నివ్వరి; నెమిలేరు [నె]

నెమిలేరు = నివ్వరి ధాన్యము పంట; సూదుల వలె ముండ్లు గల వరిపైరు; నెమలివడ్లు [చె]

నెమ్మతి = (1) చప్పుడు చేయకుండా — *నెమ్మతిగా రా* [నె; కర్నూ; అ]
(2) సంపన్నత — *ఆయన ఇప్పుడు నెమ్మదిగా ఉన్నాడు* [నె; తె]
(3) వ్యాధి నయమగు — *ఒళ్లు నెమ్మతిగా ఉన్నది* [నె; గో; తె]

నెమ్మది = (చూ) నెమ్మతి

నెమ్మ = పడిశము; జలుబు; రొంప [గు]

నెయ్యాలు = పేలాలు (లియాలు) [గం]

నెయ్యిలవాళ్లు = నెయ్యుండలుచేసి అమ్మే ఒకజాతి [వి]

నెయ్యుండలు = పేలాలు పాకము పట్టి చేసిన ఉండలు; బొరుగుముద్దలు [వి]

నెరపెట్టు = కలుగజేసుకొను [వి]

నెరయు = ఆవిర్భవించు — *గుట్టగుండుకు నరసింహస్వామి నెరసినాడు;* వెలయు [కరీ]

నెరవాడ = రజస్వలయగుట, నెర్వద, నెరవేద; నెరవాద; నెరవాడి [అ: బ]

నెరవాద = నెరవేద (అగు) రజస్వలయగు [అ]

నెరవాది = ఆడపిల్ల అగు సమర్త; నెరవాద [అ]
పెద్దమనిషిఅగు, రజస్వలఅగు [అ-పె]

నెరవు = మేలు, మంచి [శ్రీ]

నెరవేద = రజస్వల అగు; నెర్వేద; నెరవాది [అ]

నెరాబరతు = ఆరుబయలు [తూ-గో]

నెరిక = సందు; చీలిక — *గోడ నెరికిడిచింది;* నెట్టిబాసింది; పట్టి [చి]

నెరిడి = గుండె

నెరుము = గడ్డపారను దిగవేసి, బెండడి ఎక్కువగుటకు అటునిటు నెట్టి ఆడించు — *గాతాము నెరుము.* పూడ్చిపెట్టినమేకు మొదలగువాటిని ఊడబెరుకుటకు గూడ ఇట్లే నెరుమవలెను, గదుపు [నె; తె]

నెరుములు = ఎక్కువగా కదలుటలు [గు]

నెర్గ్యము=ఒక సుమూర్తమున ముందుగా ప్రయాణ సన్నాహముగ ఒక వస్తువును అన్యస్థలమందుంచి, ఆవల వీలైనప్పుడు బయలుదేరుట; ఇప్పుడు ఎట్టి ముహూర్తమైనను ఒకచే; నిర్గెముపెట్టు [శ్రీ]

నెర్వెద = రజస్వలయగు; నెరవాద; నెరవాద [అ]

నెల =(1) చంద్రవంక; అర్ధచంద్రుడు—నెలయిప్పుడే పొడిచినది [నె, కర్నూ; గు, తె]

(2) ఆడువారు ముతుపయ్యేరోజు సమీప దినములు [గో]

నెలతప్పు=గర్భవతియగు; నీళ్లుపోసుకొను [వి, నె; చి; తె]

నెలపొడుపు=శుద్ధపాడ్యమి, ప్రతిపత్తు—నెలపొడుపునాడు ప్రయాణం [నె, కర్నూ; తె]

నెలలు = ప్రసవకాలము — ఆమె కిప్పుడు నెలలు [నె-పొ]

నెలలునిండు = ప్రసవసమయమగు [కరీ]

నెలవు=చనువు; పరిచయము — ఆయన నాకు నెలవులేదు: నెలువు; నెళవు; నెళువు; నెలువు [నె; కర్నూ, చి; శ్రీ]

నెలసరవ=నెలపెట్టిన తొలిదినము, ఒకటో తేది [చి]

నెలింపోట్లు=పూరిల్లు వేయునప్పుడు కట్లు కట్టుటకు పైకప్పులో పొడుచు పోట్లు[వి]

నెలువు=పరిచయము — ఆయనకు నాకు నెలువులేదు

నెలవు; నెళువు [నె; కర్నూ; అ; [తె]

నెళవు=(చూ) నెలవు, నెళువు [నె; కర్నూ; అ; తె]

నెల్లూరు నెఱజాణ= ఈమె కాంచీపురపు ఏలేశ్వరోపాధ్యాయుని కూతురు నంగనాచి వంటి నేర్పరి. మాటలు పొంకము గలది. ఎన్నియో ఛలోక్తులు చమత్కారములు చేష్టలు ఈమెకు అంటగట్టబడి యున్నవి. ప్రతిది తెనాలి రామలింగనికి అతికించబడినట్లు, గడుసు మాటలన్నియు యీమెకే అంకితమై యున్నవి. నెల్లూరు దక్షిణంలో దుర్గా (దర్గా) మెట్టతో నున్న యామాలసెట్టి (వేములసెట్టి) బావి నీళ్ల త్రాగినందుననే యీ చమత్కారము నెల్లూరువారికి అబ్బినదని ప్రతీతి. ఈమెకు ఎదురు ఉద్ది - రావూరు రసికుడు. ఈ గ్రామము నెల్లూరుకు తూర్పున, సమీపమున నున్నది. నెల్లూరు నెఱజాణ, రావూరు రసికుడు అన్నది జంటమాట అయిపోయినది. ఈమె 'దోమతలనెల' అంటే, మార్గశిరమని, 'నపుంసకుని గుద్దలో వెంట్రుకలంటే నెమలి ఈక అని రసికుడు అర్థము వేయును. 'పిల్లా పెట్టనిస్తావా?' (కోడిపెట్ట) అని అంటే 'అమ్మనయాం' (తల్లిని అనుట) అని చెప్పివేసింది నెఱజాణ. ఇట్టివి వీరి ఛలోక్తులు - చమత్కారము!

## నే



నేతిగోకుడు = (చూ) గసి [గో]

నేతిపుట్టిగూగు=పుట్టపై లేచు సన్నని పుట్ట గొడుగు, నెయ్యివాసన గలవి [చి]

నేదు=లేదు [శ్రీ-ఉత్తర తాలూకాలు]

నేబులు = డబ్బులు—నీవద్ద ఎన్ని నేబులున్నవి?

నేము = నీళ్లలో వేసి బియ్యమును చేతితో అటుఇటు కదలించి రాళ్లు అడుగున చేర్చు [అ; నె]

నేయు=పూరింటికితుంగ,విడవలితో కప్పుగ పేర్చు—*తుంగతో నేసినారు;* తాటాకుతో చేయుటను కప్పుట అందురు. - *ఇల్లు కప్పినారు* [నె: వ]

నేరని మంగ = ఏ మెరుగని స్త్రీ, (వ్యంగ్యము) [కరీ]

నేరుగా= (1) తిన్నగా; చక్కగా — *దారి నేరుగా మాయింటికి పోతుంది*

(2) స్వయముగా, ముఖ వచనముగా — *ఆమాట నేరుగానే చెప్పినా* [నె; చి; కర్నూ]

నేరువు= ఎండుటకుగాను ధాన్యాదులను పలచగా నేలమీద పోయుట; నెరుపు [అ]

నేర్పు= ఎండబోసిన ధాన్యమును పలుచగా వేసి ఇటునటు కలియబెట్టుట [మ]

నేల=పొలము — *మీకు ఎంత నేలున్నది?* [చి]

నేలంటు బాయని = చాల లేతప్రాయపు [కరీ]

నేలచూపుజూచు = ఎదుటివానిని తలఎత్తి చూచుటకు (తాను చేసిన తప్పువల్ల) శంకించు [నె; వ; అ]

నేలమాలాలకు చిచ్చుబెట్టు = కయ్యాలు లేనిచోట కయ్యాలు బుట్టించు [కరీ]

నేలముచ్చు=(1) తలవంచి పిలిచినా పలుకనివాడు

(2) అన్ని తెలిసియు అమాయకునివలె ప్రవర్తించువాడు

(ముచ్చు=కోతిలో ఒకజాతి) [నె]

నేలశనగ—వేరుశెనగ; పల్లికాయ; ఇలాతికాయ [మ]

నేలీడ్పులోడు=నేలనురాస్తూ పాదము ఎత్తివేయుచు నడచువాడు [మ]

నేవుట=దేవుట [గో]

## నై

నైకలుచేయు

నైకలుచేయు=పిల్లలు పరస్పరం నమ్మించుకొను [అ]

## నొ



నొక్కు=పాత్రలకుపడినతగ్గు; చొట్ట[తె;నె]

నొల్ల=చేని దుక్కిని చదరపెట్టుసాధనము, దీనితో సరిసిన ధాన్యమునుగూడ కుప్ప చేయుదురు [శ్రీ]

నొల్లు=ఒక వస్తువును పూర్తిగా తీసికొను —*దానిని నొల్లేసినాడు* [శ్రీ]

నోటగడ్డిపెట్టు = బుద్ధిచెప్పు — *వానికి మీరైన నోటగడ్డి పెట్టండి* [తె]

నోటనాల్కలేనివాడు = అమాయకుడు [కరీ; నె]

నోటనువ్వుగింజనానదు = ఏరహస్యము గాని మనసులో దాగియుండదు [నె; కర్నూ; అ; తె]

నోటనువ్వుగింజపడు = చనిపోవు — *"నీనోట నువ్వు గింజపడా" అని తిట్టు* [అ]

నోటికడితీయు = ఒకనిసొత్తు హరించు— *వానినోట కడితీయకు;* నోటికాడ కూడు తీయు [తె]

నోటిగారడితనము = మాటకారితనము [కరీ]

నోటితుత్తర = (1) ఏమాటైనా చెప్పకుండా ఊరుకోలేకపోవుట—*వాడికి నోటి తుత్తర ఎక్కువ* [నర్సా]

(2) విన్నది విన్నట్లు బయటకు చెప్పి వేయవలెనను నాలుక తీట; గుల

(3) వాచాలత [నె]

(4) పొగాకు వేసుకొనవలెననిగాని ఏదైన తినవలెననిగాని కలుగు తీవ్రవాంఛ — *నోటి తుత్తర అణచుకొన్నాడు* [నె]

నోటిపూత = నోటిలో ఏర్పడు చిన్నపుండ్లు; ఆస్యపాకము—*నాకు నోరుపూసింది* [నె]

నోటిలోగడ్డపడు = (1) లాభమగు—*వాడి నోటిలో గడ్డపడినది* [తె]

(2) రానుండిన లాభము దక్కకపోవు [నె]

నోటిలోదుమ్ముపడు = నష్టమగు [తె]

నోటిపట్టం = అనకూడనిమాటలను దురుసుగా అనుట; వక్రవాక్కుకలిగియుండుట [గు; నె]

నోటివాడు = (1) నోటిమాటలతోనే పని చేయించుకొనువాడు

(2) మాట సాగించుకొనువాడు

(3) మాటకారి—*వాడు నోటివాడే కాని కూటివాడుగాడు;* నోటోడు [నె, అ; తె]

(4) అదరించి బెదరించి పనులు చేసుకొనువాడు [నె]

నోటోడు = (చూ) నోటివాడు

నోట్లోకి = నోటిలో వేసికొనుట పొగాకుకాడ, ఆకు, వక్క — *నోట్లోకికట్టు* [నె; కర్నూ; తె; అ]

నోట్లోనాలుక లేనివాడు = గట్టిమాట అన లేని సాధువు [గు]

నోములనెల = ఆశ్వయుజము [చి]

నోములపున్నమ = కార్తీకపూర్ణిమ [హై]

నోములముడి - నోముదారము కూర్చు బంగారుముడి; ముత్తైదువలు ఏటా ఒక ముడిని కూర్చుకొందురు; ఇవి బంగారుతో చేసినది [చి]

నోరాచనివాడు = మాటలు నిలుపుకోలేక వదరువాడు [కరీ]

నోరు = (1) పెద్దగా అరచుట—*నోరు పెట్టుకు బ్రతుకుచున్నావు.*

(2) మాటలతో పనులు చేసుకొనుట [నె]

నోరుకాయు = వద్దనిన తినకుండ ఉండు— *నోరు కాయకపోతే మందు పట్టదు* [కరీ]

నోరుగలదేవత = మాటకారి, నోటివాడు [కరి]

నోరుగొట్టు = (1) ఒకరు అనుభవించకుండ పాడుచేయు — *వాడి నోరు గొట్టినాడు; అందరినోళ్ల గొట్టి బ్రతికినాడు* [నె, కర్నూ; తె]

(2) వాదములో దబాయించు [అ]

నోరుజేయు=(1) గట్టిగా కేకలువేయు [తె]
(2) ముందుమిగిలితిట్టు—*నోరుచేసుకొన నిదే మాటవినదు* [నె]
నోరుతిరుగు = సులభముగా ఉచ్చరించు—*అమరము నోరుతిరుగదు* [నె; కర్నూ; అ, తె]
నోరునెత్తిన బెట్టుకొను=(1) పెద్దగా వాగు [కరీ: నె]
(2) ఒక విషయమును నమ్మబలుకుప్రయత్నము—*ఎంత నోరునెత్తిన బెట్టుకొని చెప్పినా వినిపించుకోలేదు* [నె]
నోరుపారవేసికొను=అకారణంగాదుర్భాషలాడు [తె; నె]
నోరుబట్టుడు=పథ్యము ఉండకుండుట[కరీ]
నోరుముద్దెర్లు (ముద్రలు) వడ్డవి (పడినవి)=మాట్లాడకుండ ఉండుట [మ]
నోరువాయి లేనివాడు = మెత్తటివాడు; అమాయకుడు—*నోరువాయి లేనివాడిని అన్యాయం చేసినారు* [నె; తె; అ]
నోరెగసు=నోటినుండి మాటలు పిగులు—*అది అడుగను నానోరెగసలేదు;* నోరాడు [నె]
నోళ్లుకొట్టిబ్రతుకు = ఇతరుల జీవనాధారమునుచెడిచి తాను లాభపడు [సర్కా; నె]

# నౌ

నౌటు

నౌటు=చాలా సన్నని పేను [నే]

# ప

పంకు  పంచె

పంకు=మొండిపట్టు — *అతడు తనపంకు వదలడు* [కరీ]
పంగకాలు=ఒంకాము
పంగలమాదు=చేతివ్రేళ్ల మధ్య అరచేతిలో పుట్టు పుండు [వి]
పంగలుకట్టె = కంపలోదూర్చి ఎత్తుకట్టె [తె; నె; కర్నూ]
పంగాలు=కట్టె మొదలగునవి చివరనరెండుగా చీలినది—*పంగాలుకట్టె,* పంగల; పంగలు [నె; వు; అ]
పంగి=అనుకూలకాలము—*ఇప్పుడిది కోత పంగి* [కరీ]
పంగించు=మాటలతో దెప్పు [అ]
పంగిడి=ఎత్తుగడ; కుట్ర [వి]
పంగు=(1) (వ్యంగ్యముగా) పని—*నీకేమీ పంగులేదా?* [నె; కర్నూ; తె]
(2) వంగ [అ]
పంగెస = ఎత్తిపొడుపు (వంగించునది) [అ; బ]
పంచ = మగవారు కట్టుకొను ధోవతి; పంచె—*పంచకట్టుకో* [నె; కర్నూ; తె]
పంచె = (1) ఇంటిలో ఏ వరండాయైనను పంచెయే [గు]
(2) ఇంటబయటి వరండా [నె]

(3) ఆశ్రయము — *అయన పంచేన బ్రతికినా* [నె; తె; కర్నూ]

పంచేకజ్జాయము = (1) తురిమిన ఎండు కొబ్బరి, చక్కెర కలిపినపొడి; ఇది దేవుని పంచేరమునకు ముఖ్యము [నె; కర్నూ; తె]

(2) పప్పులు బొరుగులు బెండు బత్తాసు బెల్లము కలిపిన పణ్యారము [అ]

పంచకూళ్లకషాయము = 5 రకాల మూలికలుతో కాచిన కషాయం, పంచకోలకషాయము [గో]

(2) నానాజాతి సంకరం [గు; నె; తె; అ]

పంచకోళ్లకషాయం = (చూ) పంచకూళ్లకషాయము [కర్నూ]

పంచది = చెడ్డది; పోకిరిది — *ఆయెద్దు పంచది, దగ్గరకు పోవద్దు* [నె-పో]

పంచాతయింది = తెగని విషయమగు; బాధాకరమైన విషయమగు [అ]

పంచాది = (1) వీదికొట్టు [ఉ-వి]

(2) ఇంటిపంచె, వరండా, పంచోది

పంచపాది = ముగ్గులుంచెడి అరలకట్టపెట్టె. ఇందు పసుపు, కుంకుమ, ముగ్గుపిండి, గులాలు మున్నగునవి యుండును [కరీ]

పంచిక = ప్లాను (Blue Print) [కర్నూ]

పంచులు = పంచాయతీ దారులు [కరీ]

పంచేటు = పాడు, చెడు — *అదంతా పంచేటైంది* (పనిచేటు, పనిచెడుపు) [తె, అ]

పంచేరు = (1) వీసె

(2) మణుగులో $\frac{1}{4}$ వ వంతు [అ]

పంచోది = పంచె; పంచాది

పంజె = (1) కురుపువలన నరములు నొప్పి చేయు — *కాలు కురుపు ఊరక పంజుతున్నది* [నె-పో]

(2) వ్రణము మున్నగునవి నొప్పిబెట్టుచు లాగు [కరీ]

పంజెగొడ్డు = బెంజిగొడ్డు; గొడ్డుబోతు [అ-పె]

పంటలు వేసుకొను = పిల్లల ఆటలలో దొంగను నిర్ణయించుటకు ముగ్గురు ఒకరి చేతులు ఒకరు పట్టుకొని చేతులు తట్టుచూ, ఆ ముగ్గురిలో ఒకరు వ్యతిరేకముగా చేతులు తట్టినవారిని దొంగగా నిర్ణయించెదరు. ఆ ప్రక్రియను పంటలు వేసుకొనుట అందురు [సర్కా]

పంటి = (1) కుండ [అ]

(2) చిన్నమూతిగల కుండ; బుంగ; కడవ — *పంటెడు నీళ్లు*; పంటె [నె; చె]

పంటె = (1) శాలెవాండ్లు నూలును చుట్టు పనిముట్టు [కరీ; నె]

(2) చిన్నమూతిగల గుండ్రటి మట్టిపాత్ర; దీనిని నీళ్లతెచ్చుటకు మాత్రమే ఉపయోగింతురు, బుంగ; పంటి [నె]

పండ = కోసిన పంటకంకులు ఉంచుటకు చొప్పతో కట్టు తాత్కాలికమైన గూడు — *కంకులపండ తడిసిపోయినది* [నె-పొ]

పండా = దేవాలయ పూర్ణాధికారి [కరీ]

పండారము = శివపూజచేయువారు; తంబళ; గురుకుల [చి]

పండు = పండుకో [వి]

పండుకాల్పు = ఇటుక, మొదలగునవి బాగుగా కాలినది [గు; నె]

పండుకప్ప = చాల పెద్ద తెల్లటి ఉప్పుచేప; ఉప్పువేసి ఎండబెట్టుటకు పనికి వచ్చును [కృ]

పండుగ డబ్బు = బహుమతి; ఇనాము [అ]

పండుగ నెల = ధనుర్మాసము [చి; నె]

పండుతడి = పైరు కోతకు ముందు చేనికి పెట్టిన చివరి నీటి తడి [నె]

పండుతల = నెరిసిన తల [వి]

పండు పక్కి = చిన్న మంచినేటి చేప [నె; రా; కృ]

పండ్ల పరి = ఏదైనా తినవలెనని కలుగు నోటి దురద, కోరిక; నోటితుత్తర — *పండ్లపరి అణగాలంటే ఉప్పు చెక్కలే సరి* [నె-ఆత్మకూరు]

పండ్లు అమ్ము = ఒకరి తప్పును గూర్చి ఊరంత తెలియజెప్పు [మ]

పండ్లెల్లు = చిక్కిపోవు [మ]

పంత = పణత; తల వెనుకభాగము [కరీ]

పంతులయ్య = ఉపాధ్యాయుడు × పంతులమ్మ [మ]

పంతులు = గ్రామకర్ణం [నె. కరీ]

పంతోల = నీళ్ల తూముయొక్క అడుగుభాగము [చి]

పంద = కొన్ని తమలపాకుల చిన్న కట్టలను (పిడులను) చేర్చి కట్టిన పెద్దకట్ట; సుడి; బంద [నె-ఆత్మ]

పందకము = బండి నొగకు కాడికట్టుట — *బండి పందకము వేసి సిద్ధముగా నున్నది;* పన్నకము [నె-మెట్ట]

పందా = పగ దీర్చుకొను చర్య; తగినశాస్తి — *వాడి(ని) పందా పట్టించవలెను* [నెతె]

పందార = చక్కెర [వ; కరీ]

పంది చెక్కలు = పంది మూతితో నున్న ధూమవన్నె మంచి నీటిచేప [ఉ-గో]

పందిబరువు = మోయలేనిబరువు, ఎక్కువ బరువు — *వాడు పందిబరువు* [నె]

పందిబలుపు = చాల లావైన బలుపు [కరీ; నె]

పందిరికొమ్మ దించు = పెండ్లి అయిన పదహారవవాడు పందిరికి వేసిన పాలగుంజను పూజించి, ముత్తైదువలు పందిట్లో కూర్చొని, అట్లు (తినుబండారము) తిన్న తరువాత ఆ గుంజను కదిలింతురు. దాని తరువాత పందిరి ఎప్పుడైన తీసి వేయవచ్చును [మ]

పందిరిపాటు = బల్లపాటు (వాలు లేనిది) — *ఈపాక పందిరిపాటుగా నిర్మింపబడినది* [కరీ]

పందిరి మంచం = అలంకారముతో కూడిన మంచము; చాందినీ మంచం; అరడాలమంచము [మ]

పందిలి = సంసారుల తీరాలలో (అపరక్రియలు) ముఖ్యమైన చివరదినము [నె]

పందేరము = (1) దేవుని ప్రసాదమును పంచిపెట్టుట [నె; కర్నూ]

(2) వికరణ లేకుండ వ్యయము చేయుట — *ఉన్నదంతా పందేరము చేసినాడు;* పంద్యారము [నె]

పంద్యారము = (చూ) పందేరము; పన్యారము, పణ్యారము [అ; తె. నె]

పంపర = ఎద్దుచెంపకు బుట్టు గడ్డ [కరీ]

పంపరమాస = పంపరపనస అను పెద్ద జాతి నిమ్మకాయ, చెకోర్త, పంపరదబ్బ

పంపు = (1) తోట, చేను మొదలగు వాని లోని ఒక భాగము [అ]

(2) విభజింప బడిన భూ భా గ ము — *తోటలో మీపంపు వెంట వెంట ఉన్నాయి* [నె-పొ]

(3) చంపుటకు చేసిన క్షుద్ర విద్యా ప్రయోగము (పంపబడినది) — *పంపు చేసినాడు;* శాతబడి; నట్టు [నె; గు]

(4) శూన్యము [అ]

(5) ఒక్కచోట ఒకపారకము (పారుదల) గల పొలము — *మారేగడిపాయ పంపు కోతకట్టినారు* [కరీ]

(6) వీశలో $\frac{1}{4}$ వంతు; ఏబలము [అ]

పంపుగొట్టు = (1) ప్రేరేపించుట [తె; నె]

(2) ఉబ్బించు [నె]

పంబ = ఏకినపుడు విడిబడిన దూది [నె; తె; అ]

పంబరాలగొట్టు = (చూ) పంబరేపు [కర్నూ]

పంబరేపు = విమర్శించు, పనిపట్టించు—*వాడి పంబ రేపివేసినాడు* (దూది ఏకుటలో వలె [నె; తె]

పంబలోళ్లు = గ్రామదేవతల పూజలలో పంబ జోళ్లు అను వాద్యమును వాయించు వారు [చి, నె]

పంబోది = పంచపాళి [వి]

పక్క = పరుపు — *పక్కేసినాను పండ బెట్టాను పండుకోనంటాడు* నా మొగుడు (పల్లెపదం) [చి; నె]

పక్కి = బిళ్లపాటు చిన్న మంచినీటిచేప[నె]

పక్కు = పొక్కు — *అమ్మోరుపోని పక్కు రాలింది* [చి]

పక్కుగట్టు = కురుపుమానుచు పైన గట్టి ఏర్పడు; చెక్కుగట్టు [వ]

పక్వము = వంట [అ]

పక్షులుపొయ్యేటివేళ = ఉదయం ఏడుగంటలు [మ]

పగటిదివిటీ = రాజులు మొదలగువారి వెంట పట్టపగలుగూడ తీసికొనిపోవుకాగడ; ఇది రాజలాంఛనము; దేవునికి దప్ప ఇతరులకు ఇది లేదు—*ఆ సంస్థానానికి పగలే దివిటీలు పట్టుదురు అని జడాయ కొట్టుకొనుట పరిపాటి* - పగటి దివ్వెలవారు పంజులెత్త అని ఒక కవి ప్రయోగము; పగటిదివ్వె; పగటి దీపములు [నె]

పగటిదీపములు = గురువు ఎదురు వచ్చినప్పుడు గౌరవార్థము పగటిపూటగూడ వెలిగించు దివిటీలు; పగటి దివిటీలు[అ]

పగటివేషగాడు = (చూ) పైటివేషగాడు; బైరూపోడు; పరాశక్కపోడు [నె]

పగిరి = ఏరు, నది [అ; బ]

పగులదీయు = కార్యము సాధించు (వ్యంగ్యముగా)—*అయన పగులదీసినదేమీలేదు*; పగులబాడుచు [నె; కర్నూ; అ; తె]

పచ్చడము = జంటపొరల దుప్పటి [వి]

పచ్చపూస = అమాయకురాలు కానిది అమాయకురాలుగా కనబడు స్త్రీ; నంగనాచి [కరీ]

పచ్చరము = (చూ) పచ్చడము [అ]

పచ్చి = ఎక్కువైన — *పచ్చిదొంగ*; *పచ్చిమోసము* [వి; నె]

పచ్చిక = సంతల్లో గంపగంపకూ సుంకముగా కాయలు తీసుకొనే పద్ధతి; పసిక [చి]

పచ్చికరువు = అతివృష్టివలన ఏర్పడిన క్షామము; రొంపికరువు [తె]

పచ్చిగడ్డమిత్త = వగలాడి [మ]

పచ్చిపులుసు = ఉడుకని (చింత) పులుసు కూర [నె; మ]

పచ్చురము = చేతితో వడికిన నూలుతో గట్టిగా నేసినది [మ]

పచ్చెలు = ముక్కలు—*వాని తల పచ్చెలు చేసినాడు* [తె]

పజీతు = నవ్వులపాలగు, అవస్థపడు, అవమానము పొందు, పసీతు, బజీతు [అ; బ]

(2) మానహాని, వజీతచేయు; బజీతు (ఉర్దూపదము మూలము పుజీత) [తె; నె]

పటుంగి = పొగరుబోతు [చి]

పటాకా = టపాకా; టపాసా [కరీ]

పటాకి = గాలిపడగ [అ; బ]

పటాకులు = టపాకాయలు [చి]

పటాల్న = ఎదుట—*వాడు పటాల్న అంత మాట అన్నాడు* [తె]

పటుకు = అభ్యంతరము; ఆక్షేపణ—*ఆ పనికి ఒక పటుకు ఏర్పడింది* [నె]

పటుక్కున=(1) మొగమాటము లేకుండా —*వాడు పటుక్కున అంటాడు* [తె]
(2 తటాలున— *పటుక్కున మాట అని వేసినాడు* [నె]

పటువ=మధ్యరకపు కుండ—*పటువనిండ నీరు* [కరీ]

పట్టు=గొట్టుతో,అటుఇటు రెండుసాళ్లతోలిన దుక్కి [నె-మెట్ట]

పట్టుదు=(1) వలదు [కరీ]
(2) ఇష్టపడదు—*అదంటే నాకు పట్టదు* [నె - దక్షిణము; చెన్నపట్నము]

పట్టునెత్తి = బట్టతల [అ]

పట్టుపగటి టపాకాయ=వ్యభిచారి [వి]

పట్టుపువాడు = సముద్రతీరములో నుండు అరవ బెస్తవాడు—*పట్టుపుపాళం* [నె]

పట్టా = బండిచక్రములో పూటీలను బంధించు ఇనుపపట్ట, బద్దె—*బండిపట్టాలు తొలగినవి*; నేమి [నె, వ; అ]

పట్టా=ఒకజాతి పందెపుకోడి [శ్రీ]

పట్టాచేయు=ఆస్తిని తన పేర మార్పించు [కరీ]

పట్టించు=(1) చిన్నగా లాగికొను—*అతడు నా డబ్బు పట్టించాడు* [కరీ]
(2) చదువులో విద్యార్థికి వాచకము అలవడుటకు పద్యకావ్యమును చదివించుట ప్రారంభించు — *వాడికి పెద్దపుస్తకం పట్టించినారు* [నె]
(3) గిత్తలకు వట గొట్టించు [గో]

పట్టించుకొను=కలుగజేసుకొను — *ఇంటి సంగతి వాడేదీ పట్టించుకోడు* [వి; అ; [నె]

పట్టింపు=(1) ఆచారము—*అది మాకు బతే పట్టింపు* [నె-పొ]
(2) ఆచరణలో పట్టుదల; విశ్వాసము—*శాకాహారమంటే నాకు పట్టింపులేదు* [నె]

పట్టిచ్చు = (1) రహస్యమును బయటకు వెడలబెట్టు—*సంగతి పట్టించలేదు* [నె; తె]
(2) మందు గుణమునిచ్చుట [గో]

పట్టు=(1) మంత్రకాడు వేయు ముగ్గులు [కరీ]
(2)గడ్డి మొదలగు వాటిని ఒంటిపురిగా పట్టు; మెలిబెట్టు—*ఎండ్లు నుపట్టినారు* [నె]
(3) రసవత్తర ఘట్టము—*మంచిపట్టులో కత నిలిపినారు* [నె]

పట్టుపంతాలమారి = మిక్కిలి పంతగొట్టు [వి]

పట్టుకపోవు=తీసికొనిపోవు [సర్కా: తె]
(2) నేరమునకై బంధించి తీసికొనిపోవు —*ఢిల్లీసుల్తాన్ పట్టుకపోతాన్* [నె]

పట్టుకరా=(1)తీసికొనిరా [సర్కా; వ]

పట్టుకొనిపోవు=(1) నిర్బంధించి తీసికొనిపోవు — *వాడిని పోలీసులు పట్టుకొనిపోయినారు*; పట్టుకపోవు
(2) దొంగతనముగ ఒకవస్తువును తీసికొనిపోవు — *వాడు చెంబు పట్టుకని పోయి పోయినాడు* [నె; అ; తె]

పట్టుడు=(1) బెణుకు—*అది పట్టుడునొప్పి* [నె; వ]
(2) పట్టుకొన్నది [అ]

పట్టుబడి = (1) జీతములోనికి గాని, కూలిలోనికిగాని ముందుగా తీసుకొను వేతనము, ఇది ధన ధాన్యరూపకముగా నుండును; అడ్వాన్సు—*పట్టుబడిపోను మిగతజీతం తీసుకో* [నె]
(2) గాథ—ఒక పట్టుబడిచెప్పు [తె]

పట్టుసోగ=నాగలి పాలెకుందుకొయ్య,దీనిని పట్టుకొనియే దున్నుదురు; మేడి [కరీ]

పట్టెడ=(1) బండ్లు మరామత్తు చేయుచోటు [చి]

(2) స్త్రీ కంఠభూషణము
(3) ఎద్దులకు మెడకు కట్టు తోలుపట్టె
(4) పైరుచాలు [నె]
(5) మంచపు నవారు [గ]

పట్టెమంచము = (1) కమిజీమంచము, పేము బెత్తముతో అల్లినది [నె]
(2) పట్టెలు గలిగిన నవారుతో అల్లిన మంచము [కర్నూ; తె, అ]

పట్టెలు = చిన్నకాలువలనుదాటుటకు అడ్డంగా వేసిన (తాటి పట్టెలు) తాటిదబ్బలు; దాట్లు [గు]

పట్టెలుతోలుట = ప్రత్తితోటలో నాగలి తోలుట [గు]

పట్టెవర్ధనము = (1) శాస్త్రయుక్తము [నె]
(2) మోసగించు—*పట్టెవర్ధనంపెటినాడు పంగనామముపెట్టినాడుఅన్నట్లు* [కర్నూ]

పట్కారి = (1) పట్టుగుడ్డలు నేయువారి తెగ [కరీ, మ]
(2) జరీ కుట్టువారు [మ]

పట్నమాసము = పటణము — *పట్నమాసం కాపురం* [నె; అ; తె]

పట్లు = (1) బూజు [గ]
(2) జగడాలు—*జుట్లుపట్లు*
(3) కుస్తీలో పట్లు [చి]

పట్నాలు = ఉప్పుకారము పెట్టి వేయించిన ఉలవ అలసందులు పెసలు మొదలగునవి [అ]

పడక = (1) గొఱ్ఱెమందలను సత్తువకొఱకు పొలములో రాత్రులలో తోలి కుదుర వేసినది, పండుకొన్నది అనుట — *ఒకటి రెండు పడకలు*; మందట్టు
(2) సమతలము [అ]
(3) పల్లపునేల; బాడవ; పడవ [నె-పొ]

పడకవాసి = ఈగలు లేకుండ పశువులకు బాగుగ నిద్రపట్టుచోటు — *ఆ బీడు పడకవాసి గలది* [నె]

పడకపట్టు = జబ్బుపడు [అ]

పడకవేయు = రోగముతో మంచములోపడు [తె]

పడకలమూరిగొడ్డు = ఎప్పుడూ పనిలో పడుకొనునది; దానికి కారం కళ్లలో పెట్టి లేపెదరు [గు]

పడదు = అతకదు; పగ — *నాకు ఆయనకు పడదు* [కరీ; నె]

పడమటిల్లు = పూజాగృహము— *అరపరమటిల్లు* [నె; మ]

పడవ = (1) బొరియ — *ఎలుకలు పడవలు చేసినవి* [అ-పె]
(2) మొదట — *పడవలో తెలియలేదు; ఇపుడు రోగము ముదిరింది* [నె-పొ]
(3) సారి, పర్యాయము — *ఈ పడవలో నీ పని తప్పక చేస్తా* [నె-పొ]
(4) వెల్లువ పారు పల్లపుపొలము; వాద; మునకపొలము—*పిడూరు పడవ*
(5) ఏటికి నీరు వచ్చి పడవలో దాటిపోవు స్థితి—*ఏరు పడవ × నడవ* [నె]

పడవరంగుల ఆడుది = రంకుల ఆడుది [కరీ]

పడవా = బీడు [క; న]

పడసాల = ఇంటిముందు బంకుల తరువాత ఉండే వరండా వంటిది [మ]
(2) మిద్దెటిండ్లలో ముందుహాలు — *పంరెండు కంబాల పడసాల* [అ, తె]

పడావా = పనికిమాలినది [తె]

పడాలు = గ్రామపెద్ద [వి]

పడి = దేవాలయములలో పనివారికిచ్చు ప్రసాదపు ముద్ద; దినవెచ్చము, పడికట్టువారు [అ]

పడికట్టు = ఆచారము [కరీ]

పడిగాపులు = పెద్దవారి కడపలకడ కనిపెట్టు కొనియుండుటలు, పడగాపులు

పడిగె = ఎద్దులకుండు దుర్లక్షణపు మాంసము, ఇది ముచ్చెనగుంటలోను ముడ్డిలోను ఉండును [నె-పొ]

పడిచచ్చు = మిక్కిలి ఇష్టపడు — *నేనంటే తాను పడి చస్తుంది* [వి. నె]

పడిదల, పడుదలు = ఇంటికప్పు వాటము *పడిదలతగ్గి ఇల్లంతా ఉరిసింది* [నె]

పడిపడక = అతుకక; అనుకూలతలేక [కరీ]

పడిపడినవ్వు = అధికముగా నవ్వు [అ, నె]

పడిమారు = మారిపోవు [నె-పొ]

పడియ = (1) దున్నక బీడుగా ఉంచిన పొలము [శ్రీ]

(2) లోతులేని చిన్న నీటిగుంట — *జింకలు పడియలో నీళ్లు త్రాగినవి* [నె]

పడివచ్చు = కూడుకొను; తగులుకొను— *నేను పడి వచ్చినదానను గాను, పెండ్లి పెండ్లమును* [కరీ]

పడుగాపులు = ద్వారముముందు పడియుండి దర్శనమునకై చేయు నిరీక్షణలు, పడిగాపులు [కరీ]

పడుగు = (1) కుప్ప నురిపెడిలో తొక్కించుటకు అనువైన మాత్రపు పన—*ఇప్పటికి రెండు పడుగులైనవి; పడుగు బాగా మెదిగింది* [నె, తె, అ]

(2) వంశము

(3) పోలిక; సంప్రదాయము, చాలు— *'మీ పడుగంత ఇట్లాటిదే' అని తిట్టు* [నె-పొ]

పడుబాటు = చిన్నదిగా క్రిందికి పడు నీటి జాలు [కరీ]

పడోలు = ఉపేక్ష, తాత్సారము [నె-ఆత్మకూరు]

పడ్డ = ఎదిగిన ఆడబఱ్ఱెమాద × మగిది కుఱ్ఱ. *ఇట్లే ఆవుమాదను పెయ్య అంమరు × మగది కోడె* [నె; అ; తె]

పడ్రంగము = నదీ ముఖద్వారమున, ఆటుపోటుల వలన పెట్టిన దిబ్బ, ఏర్పడిన ద్వీపము; డెల్టా [నె]

పణ = నొసలు; నుదురు, పన [అ; బ; కర్నూ]

పణుకు = ఆశ్రయము — *హైదరాబాదులో నాకు ఒక చిన్న పణుకు చిక్కింది* [నె-పొ]

పణ్యారము = పణ్ణేరము [అ]

పతంగి = గాలిపటము [తె]

పతి = పొలములో పొడవుగా తీసినగుంట— *చేలో పతులు బెట్టినాడు* [నె]

పతిపేయు = అమ్మవారు పూని భవిష్యము చెప్పు [వి]

పతుకులాట = (1) దేవులాట

(2) ఇటునటు వెదకులాట [కరీ]

పత్తల = ఇద్దరు ముగ్గురు కలిసి చేయుపని [అ-పె]

పతేర = పరిపతి —*అతడు పతేర పోగొట్టుకొన్నాడు;పత్యార* [కరీ]

పత్తికాయలు = మెత్తటి పకోడీలు

పత్తిరించు = చెక్కుటయందు, నరుకుటయందు, కట్టుటయందు క్రింది వరుస కంటె పై వరుసను కొంచెము లోపలికి నెట్టుట—*గోడను పత్తిరించి కట్టు* [నె]

పత్తివిడుచు = పత్తికాటనములో ముడిపత్తిని పెట్టి, అందలి గింజ వేరుచేయు [గు]

పత్సార = పరపతి; పతేర [కరీ]

పదను = (చూ) పదును [నె, కర్నూ; అ; తె]

పదలము = అరవై తులముల పరిమాణము [శ్రీ]

పదస్తు = అధిక్యమైనది, అమూల్యమైనది— *ఐతే పదస్తుగా దాచిపెట్టినాడు* [నె]
పదస్తుడు = అధికారములోనున్నవాడు [అ]
పదార్థం = (1) పదహారు కుంచములు [శ్రీ]
(2) 16 తూములు [నె]
పదుగు = కొయ్య, చెక్క మొదలగు వాటి వెడల్పువైపు — *ఇటుకరాతిని పదుగున పెట్టు* × గేడి, నిలువు [నె]
పదును = (1) తడి—*పదను చేను*
(2) దున్నుటకు తగినంత వాన— *పదును పడినది*
(3) ఒక అంగుళము వాన; రెండు దుక్కులు, 0.24 మిలిమీటర్ల వాన—*ఈ దినం రెండు పదునులు వానపడింది*
(4) వాడిఅయినది—*పదునుకత్తి;* పదను [నె, కర్నూ]
పద్దు = (1) వైఖరి — *వారిది దొరపద్దు* [కరీ]
(2) పంతము—*పద్దుపట్టినాడు* [నె]
పద్దుకు మాలినవాడు = కొరమాలినవాడు; అప్రయోజకుడు [శ్రీ]
పద్దుపట్టు = (1) బాధించు, సాధించు — *ఇదైన తరువాత ఇక నీ పద్దు పడతాను*
(2) పట్టుదల [నె-పొ]
పన = నుదురు; పణ [కర్నూ]
పనకాయి = (1) (చూ) తాయం, పనాయి [వ]
(2) పిల్లలకు పెట్టెడి కజ్జము [కరీ]
పనగడి = పెండెము; దొడ్డికి అమర్చిన గేట్ (చూ) పలగాడి; పనడ [వ]
పనటి = (1) పంటి
(2) కల్లుగీయుటలో ఉపయోగించు చిన్న కడవ; లొట్టి [అ]
పనత్రాడు = (1)ఎద్దుల కొమ్ములకుగట్టు చెవి త్రాడు [కరీ]
(2) కోసిన వరిని పనకట్టు సన్నటి త్రాడు [కరీ, నె]
పనబడు = అలవాటుపడు— *క్రొత్తపొయ్యి సరిగా పనబడలేదు;* పనుపడు
పనాయి = (మా) తాయం; పనకాయి [వ]
పనికిమాలినవాడు = అప్రయోజకుడు [నె]
పనిపట్టించు = శిక్షించు; ప్రతీకారము చేయు — *వాని పని పట్టించినారు* [నె; కర్నూ; అ; తె]
పనిపెట్టు = (చూ) పనిపట్టించు [వ]
పనిబాటుల వాళ్లు = (1) నౌకర్లు; చాకిర్లు
(2) కూలినాలిచేసి జీవించువారు [నె]
పనిలేదు = అక్కరలేదు; అవసరములేదు —*నాకు అది పనిలేదు* [నె;కర్నూ;అ;తె]
పనిలేని పని = అనవసరమైన పని [కరీ;నె]
పనివాడు = (1) జీతగాడు [హై; కర్నూ]
(2) పనియందు నేర్పరి — *వాడు మంచి పనివాడు* [నె; తె]
(3) పనిచేయువాళ్లు—*పనివాళ్లు పనిలోకి దిగినారు* [నె]
పనుగడ = పని—*ఏమి పనుగడ చేసితివి?* [కరీ]
పనుగడి = గలుమ తలుపు; పలగాడి; పనడ [రీ]
పనుపడు = (1) సేద్యమునకు భూమి అనువగు—*ఆచేను పనుపడినది* [నె]
(2) ఫలించు— *ఆ కార్యము పనుపడింది* [అ]
పన్గడ = పశువుల దొడ్డితలుపు, పెండెము; పలగాడి; పనగడి [మ]
పన్నా = బట్ట వెడల్పు కొలత; — *లాంగ్ క్లాత్ కు పన్నా పెద్దది* [చి; నె]
పన్ని = దువ్వెన; పన్నె [గ]
పన్ను = (1) నాగలికి కాడి మేడి సరిచేసి, దున్నుటకు సిద్ధముచేయు, ఇట్లా పన్నిన దానిని ఏరు అందురు: పమ్ము [నె; గు]

[2] ఒడ్డుట—వల పన్నుతాను [తె]
పన్నె = దువ్వెన; పన్య, పైన; పన్నీ [శ్రీ; వి]
పన్నెండూళ్ల పారాపత్తు = ఉన్న పనికి లేనిపనికి ఊరక తిరుగుచుండు వ్యక్తి; ద్రిమ్మరి — *ఆయన పన్నెండూళ్ల పారాపత్తు* [నె]
పన్య = దువ్వెన; పన్నె, పైన [శ్రీ; వి]
పన్యారము = తినుటకు నానవేసిన పెసర పప్పు — *పానకం పన్యారం చేసినారు* [తె]
పప్పులు = పిండివంటలు [శ్రీ]
పప్పుచారు = (1) పప్పు పులుసు
(2) కందిపప్పు వేసి చేసిన చారు; రసము
పప్పుతెడ్డు = (చూ) పప్పుసుద్ద [గో]
పప్పుపత్తి = పప్పు ఉడికినతర్వాత ఎనించు కొయ్యసాధనము; ముద్ద కవ్వము [శ్రీ]
పప్పు సుద్ద = ఎక్కడబడితే అక్కడ చతికిల బడువాడు; పప్పుతెడ్డు [గో]
పబ్బతి బట్టు = అంజలిఘటించు [కరీ]
పమిడిపత్తి = ఒకే పెద్ద గింజగల పత్తి; ఇది మేలుపత్తి. దీనిని కాంబోజి (కాంబోడియా) పత్తి అందురు [నె-పొ]
పమ్మ = (చూ) పన్న [అ]
పయిబరువు = సోమరి [కర్నూ]
పయ్యాట = పయ్యెట [వి]
పయ్యెద్దు = ఎరుపు, పసుపువన్నె కలిసిన వన్నెగల యెద్దు [కరీ]
పరంగి = బొప్పాయిచెట్టు; పాపాయ; మదనాసవ; పరాందప [అ]
పరంగి = పాశ్చాత్యుడు [అ; బ; నె]
పరక = (1) రెండుకానులు, అర్ధణా [వి]
(2) చీపురుకట్ట [సే]
పరకలు = (1) ⅛ భాగము [నె; కర్నూ; తె; అ]
(2) ఒక రకపు చిరుగు చేపలు — *పరకలు; జెల్లలు* [కరీ]
పరకాయించు = బాగుగ పరిశీలించి చూడు —*పరకాయించి చూస్తేనేగాని కనుబడదు* [నె; తూ; గో]
పరకామణి = నిధి (హుండీ)లో వేయబడిన నాణెములు ఎంచుట—*కొండపైకి పరకామణికి పోయాడు* [చి]
పరగడపు = మఱపు [గో]
పరప = (1) ప్రదర్శనము
(2) తిరుణాళ్ళ [అ; బ]
పరపతి = అగౌరవము [అ]
పరపవాళ్లు = యాత్రికులు [చి]
పరబడు = తప్పించుకొని తిరుగాడు—*పరబడ్డపనరము;* బెడబడు [నె-ఆత్మకూరు]
పరబారా = ఇతరుల ద్వారా—*సంగతులు పరబారా తెలుసుకొన్నాను* [తె]
పరమటిల్లు = పల్లెలలో పెద్ద భవంతులతో పరమటితట్టు ఉండు పూజా మందిరము; గ్రామాలలో ఇండ్లకు తూర్పువాకిలే ఉండును [నె]
పరమహంసక్రియ = పరమాషిక్రియ (చూ) గోసాయి చిట్కా [తె]
పరమాషిక్రియ = (చూ) గోసాయి చిట్కా [నె]
పరమాయిషీ చీర = భారముగా నేసిన చీర [కరీ]
పరము = (1) బండి నొగకు ఇరుప్రక్కలా బిగించిన పొడవు దూలము — *పరము బట్టి నెట్టు* [నె]
(2) వశముగ, ద్వారా—*అది వానిపరంగా ఇచ్చి పంపు* [నె; కర్నూ; వ]
(3) పక్షము—*నేను వారిపరము* [అ]
(4) బియ్యములో కలిసిన మిక్కిలి సన్న నూక [తె]

పరవదోలు = (1) అడవి జంతువులను వేటాడుటయందు, వలయాకారముగ దూరమున మనుష్యులు చేరి, తప్పెటలు కొట్టి బాకాలు ఊది గలభాచేయుచు, క్రమ్మకొని వచ్చుచు, లోపల జిక్కిన మృగములను మాటులలో వేచి యున్న వేటకాండ్ర గుండుదెబ్బ మేరలోనికి తోలునట్టి వేట పద్ధతి, నేటి మైసూరు కెడ్డా వంటిది — *పరవదోలినారు*

(2) నిర్బంధముగా జనమును ఒకచోటుకు చేర్చుట — *పరవదోలినట్లు జనాన్ని తోలినారు* [నె]

పరష = (1) బ్రహ్మోత్సవములో రథోత్సవానంతరపు ఉత్సవము

(2) ప్రదర్శనము, సంత—*ఎద్దుల పరష*; పరస [అ]

పరస = పశువుల సంత—*పలమనేరు పరస* [చి]

పరసళు = మృతి చెందిన యెదవవాడు గాని, తొమ్మిదవనాడు గాని చేయు క్రియ [కృ; గుం]

పరసాల = ఇంటిలోని ముందు హాలు; ముందరిల్లు [అ; స]

పరస్థలము = (1) చెక్కడు పనిలో అక్కఱ లేని భాగము [గు]

(2) గోడ కట్టుటలో రెండు రాళ్ల మధ్య వదలుచోటు, బెందడి—*పరస్థలం జాగా వదలు* [నె]

పరాందప = బొప్పాయి; పరంగి; పాపాయి [అ]

పరాటుచెక్క = (1) రీపర్ కఱ్ఱ

(2) పెద్ద మ్రానులు కోయగా ప్రక్కన తేలిన ఎచ్చుతక్కువలు గల చెక్క [నె]

పరాశక పోడు = నానావిధ వేషములు వేసి గ్రామములలో తిరిగి హాస్యము పట్టించి డబ్బు దండుకొనువాడు, పయిటివేషగాడు; లకోర్కిరోడు; బైరూపోడు [మ]

పరి = (1) కాడిని నొగకు గాని, ఏడికోలకు గాని కట్టునపుడు ఏర్పడిన మోకు వరుస —*చిలకు అటుఇటు రెండేసి పరులు రానీ* [నె-ఆత్మకూరు]

(2) భారము—*వలవజెద్దుమీద పరిపడ్డాది* [నె-మెట్ట]

(3) బాధ—*ఈపరి పడలేను* [చి]

పరింగి = బొప్పాయి [చి]

పరిగిలి = (1) కొల్ల బోయినది

(2) చెట్లకాపు కోసుకొనిన తర్వాత వదలి వేయబడుట — *పరిగిలి చేను; పరిగిలి తోట*; ఈటుబోయిన [చి]

పరిటు = పయట [కరీ]

పరిటి = మారు, పర్యాయము — *ఈ పరిటి ఇలా చెయ్యి* [వి]

పరిటీలు = నేలమీద చేతులుంచి ప్రక్కలకు లంఘించుటలు [నె-పొ]

పరిడి = రూఢి — *పరిడీ పడిపోయినది* [కరీ]

పరియా మామిడి = దేశవాళి మామిడి; నాటు మామిడి [వి]

పరుగుడు = (చూ) బక్కబరుకు [గో]

పరుపు = (1) పలకలు కోయని (సానబెట్టని) వజ్రము [వి]

(2) పైభాగపు వైశాల్యము; పరపు [నె]

పరువు = (1) చెట్లు కాచి, కాయలు పండబారజొచ్చుట- *తోటపరువుకు వచ్చింది*; పలకబారు [నె]

(2) రెండుమైళ్ల దూరము; పరుగు [తె]

పర్కలు = చేపలు [మ]

పర్వతము = శ్రీశైలము [కర్నూ]

పట్టి = నెట్టి—*నేల పట్టిలు పడింది*; పట్టె [హై]

పట్టె = చిన్నవాగు [కరీ]

పట్టెగడ్డ = పట్టె (చిన్నవాగు) దాపునగల భూమి [కరీ]

పట్టానము = పిట్టలు [గ]
పట్టానము = ఉద్దులు (పరములు) పాకలు (అడ్డ చెక్కలు) మొదలైనవి కలిసిన బండిపై చట్రము; చాటవ [శ్రీ]
పలకపుల్ల = బలపము; బళపము [అ]
పలకబారు = మామిడి మున్నగునవి పక్వస్థితికివచ్చు; పరువుకువచ్చు; పండబారు [తూ-గో]
పలకలనిచ్చెన = మెట్లనిచ్చెన
పలకసర్లు = ఆరు పలకల (పార్శ్వముల) గంట్లుగల బంగారు పూసలతో ఒక పేట కంటె ఒక పేట పెద్దదిగా చేసిన హారము, దుల్లడీలదండు (కాని యీ దుల్లడీలదండ గుండ్లు గుండ్రముగా నుండును) [సర్కా]
పలకుండు = ఊరకుండ, పల్లకుండు [నె]
పలగాడి = కొట్టములు, వామిదొడ్లకు బెట్టు వెడల్పు కొయ్యచట్టపు తలుపు, పెండెము, పలుగడి; పనుగడి; పనడ [నె; కర్నా]
పలపల = (1) పలుచన — పైరు పలపల పోయింది [నె]
(2) అస్ఫుటము — పలపల తెల్లవారినది బలబల; బల్లున [నె; అ; వ]
(3) ఉన్నట్లుండి — జనం పలపల లేచినారు [నె, వ]
పలవ = (1) వ్యభిచారి [చి]
పలుకు = (1) గట్టి; గట్టితనము — పలుకురాయి; అన్నములో పలుకున్నది [నె;గు]
(2) సీతాఫలంలోనిగింజ పలుపుబారి కాయ పండబారు దశకు వచ్చు—కాయలు పలికినవి [మ]
పలుకుబోళ్లు = పెల్లకి మోయు బోయలు వేయు కేకలు [నె-పొ]
పలుకూటము = పాఠశాల; వీధిబడి; పల్లెకూటము [చి]
పలుగు = (1) ఇనుపకమ్మి—గుంటకపలుగు
(2) తెల్లని కఠినమైన రాయి [నె-పొ]
పలుగుడు = విషముగల ఒకజాతి పాము; ఇది కఱచిన ఒళ్లంతా మచ్చ లగును — నూనె పలుగుడు; నూనె కద్దెడ పాము
పలుజు = వ్యర్థము—నీళ్లు పలుజు పోకుండ వాడు [నె]
పల్కమంచం = మధ్యచెక్కలు పఱిచిన మంచము [మ]
పల్చాము = ఉర్లగడ్డల తాలింపు [నే]
పల్ల = (1) తెలుపు—పల్లావు; పశావు
(2) గుఱ్ఱము, నష్టము నిలువకుండా పోగలిగిన దూరము — అది పదిమైళ్లు పల్లా పోగలదు [నె]
(3) నాల్గుకాళ్లు ఒకేసారి ఎత్తి పరుగెత్తుట; గ్యాలప్ [వ]
పల్ల = 120 సేర్ల ధాన్యప్రమాణము [తె]
పల్లకుండు = ఊరకుండు; పలకుండు [వి]
పల్లకో = ఊరుకో; వల్లకో [శ్రీ]
పల్లమీసము = వచ్చిరాని మీసము — పల్ల పల్ల మీసాలు వస్తున్నాయి [నె-పొ]
పల్లా = (1) 100 శేర్ల కొలత [అ; చ]
(2) 120 సేర్ల తూకము [కరీ]
(3) అంతయు [అ-పె]
పల్లాయి = (1) చులకన; పల్లాలు
(2) హేళన
(3) ఎకసక్కెము [అ; బ]
(4) ప్రతిదానికి బొనను; ప్రక్కతాళము వేయు; బలకొట్టు—ప్రతిదానికి పల్లాయి పలికినాడు కాబోలు [నె]
పల్లాలు = చులకన, ఎకసక్కెము; పల్లాయి [అ]
పల్లిక = ఊరక [వి]
పల్లికాయ = వేరుశనగ; ఇలాతికాయ; గుత్తిశనగ; వేరుశనగ [కరీ; మ]

పల్టీ=(1) పైకిఎగిరి, వలయముగా తిరిగి క్రింద కాళ్లపై వ్రాలుట; పిల్లేరుగంతు; సమ్మర్‌సాల్ట్ [నె]
(2) బండి మొదలగునవి తలక్రిందులుగా పడుట; వాటుబడుట; బోల్తాగొట్టుట — *బండి పల్టీకొట్టినది* [సర్కా]

పల్లెపుట్టి=మార్కెల్ల సీమలో (దర్శి - పొదిలి) వాడుకలోనున్న 20 తూముల చిన్నపుట్టి. ఇచట వాడుకలోనున్న ఇంకొకపుట్టి — *సింగంపుట్టి అనుదానికి 30 తూములు* [నె-మార్కెల్ల సీమ]

పల్లెము=పల్లెకూటము; పలుకూటము; బడి [చె]

పశాకు=ఔషధమున కుపయోగించు ఆకు; మందాకు (మందు+ఆకు) [చి]

పశావు = అప్పటమైన తెలుపు వన్నెగల ఆవు; ఇట్లే—*పసెద్దు*; పస్పెద్దు [నె; కర్నూ; అ]

పసరము = ఆవు, ఎద్దు మొదలగు తెల్ల జంతువు మాత్రమే; బర్రెను పసరమనరు [నె; కర్నూ; అ; తె]

పసరుకట్టు=(చూ) పసురుకట్టు [నె]

పసలపోలిగాడు=పశువులపై వ్రాలిగంతులు వేయు తోకపొడవు చిన్న నల్లనిపిట్ట; పసుల పోలుగాడు [చి, నె]

పసి=(1) పశువులు [కరీ]
(2) తెల్లని

పసించు = (1) ఆహారము జీర్ణమగు; రుచించు;—*అది తినకు, నీకు పసించదు*.
(2) నోటికి రుచించు; — *నాకు నోటికి పసించడంలేదు*. ఈపదము వ్యతిరేకార్థము నందే వాడుదురు [గు]

పసిక =(చూ) పచ్చిక [చి]

పసిగుబ్బంశాకిరి = వ్యర్థమైనది; సాధ్యము కానిది. తెల్లని గుబ్బమునకు చేయు మాలీసు పనివలె కష్టమైనది; సాధ్యము కానిది [అ; నె]

పసిమిసి=ప్రస్తావన; సందర్భము; ప్రసిమిసి —*దాని పసిమిసే ఎత్తలేదు* [నె]

పసిరి=లేత [కృ]

పసీతు=అవమానము; బజీతు [అ]

పసుపు కుంకుమకు = (1) పేరంటమునకు
(2) బిడ్డకు అరణమునకు — *ఆ భూమిని ఆమెకు తండ్రి పసుపు కుంకుమకు ఇచ్చినాడు* [అ; నె]

పసుపులు నొక్కుట=పసుపులు చిట్లిచ్చుట [మ]

పసురుకట్టు=కనుకట్టువిద్య: లేనిది ఉన్నట్లు అగపడుట; గారడీ; పసరుకట్టు— *వాడు పసురుకట్టు గట్టివాడు* [నె]

పసులపండుగ = సంక్రాంతి మరుసటిదినము, కనుము. ఈ కనప్పండుగ పశువులను పొలములకు తోలుకొనిపోయి, అచట వాటి కొమ్ములకు రంగులు బూసి, పొంగళ్లుబెట్టి పశుపాలకులు వినోదముగా కాలము గడుపు గ్రామీణుల పండుగ. దక్షిణ ప్రాంతమున ఎడ్లకు పందెములు బెట్టుదురు [నె; వ; అ]
(2) దూడలపండుగ; ఆనాడు కాటమ రాజుకు పొంగళ్లు బెట్టుదురు [చి]

పసులు పోలుగాడు=(1) పొడుగుతోక గలిగిన చిన్నటి నల్లని పిట్ట. ఇది పశువులపై వ్రాలి తోక క్రిందికిపైకి ఆడించుచుండును; పసలపోలిగాడు; పసులపోలిగాడు, భరద్వాజ పక్షి
(2) లెక్కబడనివ్యక్తి — *ఒక ఊరిరెడ్డి ఇంకొక ఊరిని పసులపోలుగాడు* [నె]

పళము=రీతి, ఆలాగునే; ఉన్నట్లుండి — *ఆ పళంగా వెళ్లిపొయ్యాడు* [గో]

పళి=నింద—*ఎందుకీ పళి?* [చి]

పళ్లము = కూర [సే]

పళ్లకాయ=పొట్లకాయ; పొళ్లకాయ [సే]

పాంగెము = (1) ఒక కులకట్టుబాటు— *సెట్టి పాంగెము వాళ్లంతా వచ్చినారు* [నె]
(2) చుట్టములు — *మా పాంగెము చాల పెద్దది* [నె]

పాంటికి = సోపానము; మెట్లు; చీడి; తావ; మెటిక [అ]

పాంటికిలు = దసరాపద్యములు వ్రాసినపుస్తకములు. వీటిని రంగుకాగితములు, పూసలు రంగుదారముఃతో బైండుచేయుదురు — *పాంటికిలు చదువు* [అ]

పాంటికెలు = మెట్లు; చీడీలు; తావలు; మెటికలు

పాకంపప్పులు = బెల్లపు పాగులో వేసిన పప్పులు [అ]

పాకపుగు = పండగు [తె]

పాకము = బెల్లము మొదలగు వాటిలో చేసిన చిక్కటి ద్రవము; పాకు; పాగు—*నిప్పట్లకు పాకము బట్టినారు* [నె: తూ-గో]

పాకలు = బండిపై చట్టమున అమర్చిన అడ్డచెక్కలు [శ్రీ]

పాకు = (1) తీగ ప్రాకుటకు ప్రక్కనపెట్టిన కట్టెలు; అల్లుడు [శ్రీ]
(2) వ్యాపించు [తె]

పాకు = చిక్కటి ద్రవరూపము; పాగు. పాకము— *బెల్లపు పాకు* [కర్నూ]

పాకుట = కొట్టుట [వి]

పాకుడు మబ్బులు = అగడప

పాకురు = బండపైన, నేలపైన, నీటానుడుచే ఏర్పడిన ఆకుపచ్చని జారుడు ద్రవ్యము
(2) పాచి; పాకుడు. [కరీ]

పాకులాడు = పట్టి కోరికతో ప్రయత్నము చేయు; ప్రాధేయపడు [నె-పొ]

పాకోళ్లు = పావుకోళ్ళు; పామకలు [కరీ]

పాగడ = (1) పాపడ; పరికిణి [కర్నూ]
(2) నూలు కొలత విశేషము — *32 పోగులు ఒక పాగడ,* ఆరు పాగడాలు ఒక పుంజె [నె-పొ]

పాగా కొయ్యలు = గుడ్డలు తగిలించుటకు గోడకు కొట్టిన కొయ్య మేకులు: చిలుక కొయ్యలు [వి]

పాగా సెల్లా = రెండు బట్టలు పెట్టుట (ఇచ్చుట) [మ]

పాగి = (1) వసతి; వీలు — *ఎవరి పాగి వాళ్లు చూచుకొన్నారు* [నె; తె; అ]
(2) దారి— *ఎవరు పాగిన వాళ్లు పోయి నారు* [నె; అ]
(3) వంశము [గు]

పాగిచేయు = (1) చేను కోతకు వచ్చినపుడు నీళ్లు బయటకు పట్టు (తీసివేయు) [గు]
(2) అనువుచేయు [నె]

పాచి = ఉదయమున ఊడ్చే కసవు [కరీ]

పాచిపని = ఉదయమున ఇంటియందు, వెనుక ప్రదేశములందు చిమ్మి పేడ కళ్లేప జల్లునది— *పాచిపని అయినది* [కర్నూ; తె; అ; నె]

పాటు = తర్వాత—*ఆ పాటు ఏమన్నాడు* [నె] ఆమాయన—*తిన్నపాటు కాస్త పండుకో* [నె; కర్నూ; అ; తె]

పాటాకొట్టు = పద్దు కొట్టివేయు [గు]

పాటాబెట్టు = కొట్టివేయు [గు]

పాటింపు = (1) మతింపు — *అతడంటే పాటింపు లేదు* [చి]
(2) పనిచేయు వాడుక — *అది నాకు పాటింపు లేదు;* పాటిన [నె]

పాటికి = (1) ప్రత్యేకము—*ఎవరి పాటికి వాళ్లు చేసినారు* [నె; కర్నూ; తె]
(2) ఆ సమయానికి [కరీ; తె]

పాటిన = పాటింపు; నియమము; అనుసరింపు — *ఆ విషయంలో నా కంతగా పాటిన లేదు;* పాటింపు [నె]

పాటిబద్ధముతేని = సత్యములేని [కరీ]

పాటు = (1) స్థితి—*కుదురుపాటుగా ఉండు*
(2) ప్రవర్తన — *నీ యిష్టము వచ్చిన పాటువడు ఆ తర్వాత చూచుకొందాము* [నె]
(3) ఎరువులు బాగా వేయుట [కరీ]
(4) దెబ్బ [తె]
(5) వైపు—*పైపాటుగా త్రిప్పు* [నె; కర్నూ]

పాటు గొట్టు=పిల్లలు క్రింద బడినప్పుడు కలుగు కీడు; గాలి సోకు [నె-ఖా]

పాటు దీయు = దిగదుడుపు తీయు; దృష్టి దీయు [తె]

పాటున బడు = (1) దేవుని రథము ఉత్సవమునకు బయలుదేరి, తిరిగి యథాస్థానమునకు చేరు — *తేరు పాటున బడినది* [నె]
(2) క్లిష్టపరిస్థితులు తీరి కుదుటపడు — *అన్నీ పాటున బడినవి* [నె]

పాట్లుచేయు = వేడినీళ్లు, చన్నీళ్లతో కలిపి, స్నానమునకు తగినట్లు చేయు; పాళాలు చేయు [నె; కర్నూ; తె]

పాట్లువడు = మామిడికాయలు పండుటకు తగిన స్థితికివచ్చు. దీనికి గుర్తు ఒకకాయ తనంత తాను రాలి క్రిందపడవలెను [మ]

పాడి = ఆవు, బఱ్ఱె పాలు ఇవ్వగలిగిన స్థితి —*మాకు ఇప్పుడు పాడిలేదు* [నె; కర్నూ; అ; తె]

పాడిచేయు=పాలు పితికి, కాచి, చిలికి ఉపయోగమునకు సిద్ధముచేయు [నె; కర్నూ; అ]

పాడిపనులు=పాలుదీసి చేయు పనులు [అ]

పాతరబెట్టు = (1) నాశము చేయుదు నన్న తిట్టు; శాతబడి చేసిన మంత్రద్రవ్యములను, ఆ ప్రయోగమును గురి అయిన వ్యక్తి, వచ్చేపొయ్యే దారిలో పూడ్చి పెట్టుదురు; ఇట్లు పాతరలో బెట్టుకుసు అని బెదరించు తిట్టు [నె; తె; అ]
2) వడ్లు మక్కుటకు నేలగుంటలో గడ్డి దొక్కి పాతిపెట్టుదురు; దీనితో వాటికి మొలకెత్తు గుణము పోవును; ఇట్లే నీ శక్తులను ఉడిగించుసని తిట్టు

పాతరవేయు = చంపు [తె]

పాతాళభేది=గాలము; నూతిలో చేదతీయు గాలం [చి]

పాదికట్టు =చిన్న పాదులవలె, చిన్న చిన్న కయ్యలు గల పొలము—*అది పాదికట్టు పొలము* [నె]

పాదు=నాటు—*వాడు గుంజపాదెను;* పాతు [నె]

పాదుట్టు = పాజుట్టు [కరీ]

పాదులు = తీగలు అల్లుకొను కాకర మొదలగు చెట్ల కుదుర్లు; చెట్లపాదులు [శ్రీ; నె]

పాన = ప్రాణం [వి]

పానకాలబిందె = లగ్నమునకు పిలుచుటకు పెండ్లికొడుకు విడిదిలోకి, ఆడపెళ్లివారు బెల్లపు పానకమును తీసుకొనివెళ్ల బిందె [గు]

పానాది = బాజారుతోవ—*పానాదిలో పిల్లయాడుచున్నది* [కరీ]

పాపచ్చి = బ్రహ్మజెముడు; పాపచ్చి కళ్లి [అ]

పాపొసులు = చెప్పులు — *పాపొసితో కొట్టాడు;* మెట్టు [చి]

పామరము = ప్రేమ [కరీ]

పాము = నేలకురాయి [నె]

పాము చేప = (చూ) మలుగు [మ]

పామునాలుకవారు = (1) వంకు మరగిన వారు [చి]
(2) పామువలె చీలిన రెండు నాలుకలు గలిగినవాడు అనగా, అబద్ధములాడువాడు, రెండు నాలుకలవాడు [నె]
పాముపొట్ట = పొట్టపైకి కనుపించకయే ఎక్కువ అన్నము తినువాడు — *నోటి దగ్గరనుండి గుద్దదాకా పొట్ట గలవాడు అనుట* [నె]
పాములనారి = పెద్ద మెడ కొంగ [వి]
పాముల నారిగాడు = పాముల తిను తెల్లని కొంగ జాతి పెద్దపక్షి [చి]
పాయ = (1) ఏటినీరు తీసిపోయిన తర్వాత జాలుగా ఏర్పడిన ప్రవాహశాఖ; జాలు— *ఈ తడవ ఏటిపాయ ఆఒడ్డుకు నొక్కింది*
(2) వేరుచేయు — *పాయగా తీయు* [నె; ౧]
(3) పొరలు పొరలుగా వీడి వచ్చునది— *ఉల్లిపాయ; తెల్లపాయ* [నె; కర్నూ: అ; తె]
పారచిప్ప = త్రివ్వెడి పార [నె, చి; తె]
పారదమ్ము = మెట్ట చేలలో నారు వేయుటకు ముందు పారతో మట్టి చెక్కి, నీరు పెట్టుట (చూ) దమ్ముచేయు [గు]
పారదోలు = (1) పశువులను విప్పి, దొడ్డి నుండి బయటకు దోలు
(2) ఎదిగిన కోడిపిల్లలను తల్లి పెట్టనుండి వేరుచేయు — *పిల్లగా పారదోలినా* [నె; అ]
పారబట్టు = తీవ్రముగా విమర్శించు— *ఆయన సంగతంతా పారబట్టినారు* [నె]
పారాడు = ప్రాకులాడు
పారి = పార్వతి [వి]
పారికత్తు ఇచ్చు = విడాకు లిచ్చు [మ]
పారికాడు = పురుగు మెల్లిగా తిరుగాడు— *చీమ పారికాడింది;* పారుకాడు [నె; అ]
పారిగోత = ప్రహరి [అ; నె]
పారిరా = పరుగెత్తిరా [శ్రీ: వి]
పారివేట = (చూ) పారువేట [తె; నె]
పారు = విస్తీర్ణము— *మూడంకణాల పారు మిద్దె* [తె]
పారుకాడు = పురుగు తిరుగాడు; పారికాడు [గు]
పారుగోడ = ప్రాకారపు గోడ [చి]
పారుడు నొప్పి (వాపు) = ఉండి ఉండి చోట్లు మార్చు నొప్పి (వాపు) [నె]
పారుపట్టె = బండి కిరువైపులను వేయు పొడవు కొయ్యలు; పరములు [చి]
పారుబోతు = (1) పనికి లొంగకుండా పరుగెత్తిపోవు ఎద్దు—*పారుబోతెదు* [నె]
(2) పిరికి—*పారుబోతు దనంబున పంది పిల్ల* [అ; వ]
పారువేట = (1) తిరునాళ్ల చివరనాడు, దేవుని గుఱ్ఱపు వాహనము మీద, ఊరి మంద బయటికిపోయి, వేటాడినట్లు ఆడుట —*ఈదినం పారువేట*
(2) వ్యభిచరించుటకు తిరుగుట— *అయ్యో పారువేటకు బయలుదేరినాడే;* పార్వేట [నె, కర్నూ: అ]
(3) పందెపు వేట. దేవుని ఉత్సవాలలో ఒక గూటమునకు పొట్టేలునుకట్టి దూరం నుండి తుపాకులతో కాల్తురు. గురిగా కాల్చి చంపిన వాడి కా పొట్టేలు ఇచ్చి వేయుదురు [చి]
(4) దసరా పండుగ చివర జమ్మి కొట్టుటకు వెళ్లుట; పార్వేట [సర్కా]
పారోళి = పప్పులతో వండిన ఒక రకము కూర [వి]
పార్వేట = (చూ) పారువేట [నె; కర్నూ: సర్కా; అ]
పాలకడాలు = (1) పుట్టిన పాపకు నామకరణ దినమున, వెండి రాగి తీగ కలిపి చేసివేయు కడియాలు

(2) గోధుమ పిండి, బెల్లము కలిపి వండే పిండివంట [మ]

పాలకత్తి = కల్లు గీయువారు, టెంకాయ గొలను చివురు వెడల్పు వంకరకత్తి[చి]

పాలకాయలు = పిండివంటలు; బియ్యపు పిండిలో కారము, జిలకర కలిపి చేయు చిన్న ఉండలు [మ; నె]

పాలగచ్చు = నున్నటిగచ్చు, ఇందు ప్రతిబింబము కనుపించును; దుబారు పూత (దోబాక్) [కరీ; నె]

పాలచేలుపులు = చన్నులలో పాలెక్కువై కలుగు నొప్పి [కరీ]

పాలచాయ = చాల లేతనైన రోజా రంగు —*పాలచాయ రేశు (చీర)* [నె]

పాలదారలు = ఉష్ణధారలు. మరుగుతో ఉష్ణముగా నుండు అప్పుడే పిండిన పాలు; ఇవి పథ్యకారులు [నె-పొ]

పాలపంచె = గచ్చు వేసిన పంచెటరుగు [అ]

పాలపిట్టఘోష = తన గోడే గొప్పగాచెప్పుకొనునది [చి]

పాలపూసలు = దృష్టిపరిహారముగ పసిపిల్లలకు కట్టు పూసలు [మ]

పాలబాన = కుప్పలు నురిసి ధాన్యము మేలు రాశి చేసిన తర్వాత, గ్రామపురోహితుడు పాలకడవతో కల్లముల దగ్గరకు వచ్చి మామిడి మండలతో పాలను రాశిపై చల్లును. ఇట్టి సంసేళన క్షీరము కలిగిన పెద్దబాన. దీనివలన పండిన వడ్లకు పొలి (కలసివచ్చుట) కలుగునని రైతు విశ్వాసము—*ఇప్పుడే మా కల్లానికి పాలబాన వచ్చిపోయింది* [నె-తూర్పునాడు]

పాలసిబ్బెము = శరీరముపై కలుగు తెల్లని పొడ, ఈపొడ కన్పించిన అదృష్టమందురు; తెల్లసోవి [ఛ]

పాలాడి = పిల్లలకు పాలుపోయు సాధనము; ఉగ్గుగిన్నె [సే]

పాలాన్నము = పాలు బియ్యపుపిండి శర్కరతో కలిపి చేసిన జావగంజి; దీనిని మొక్కజొన్న గారెలతో తిందురు [మ]

పాలికాడు = భాగస్థుడు [అ-పె]

పాలివాడు = దాయ; దాయాది [కరీ; చి]

పాలీయువేళ = పిల్లతల్లులు చేనిపనికి వెళ్లి మధ్యన చంటిపిల్లలకు పాలు యిచ్చుటకు ఇండ్లకు వెళ్లి వచ్చువేళ; పాలవేళ [కరీ; నె]

పాలు = శవమును దహనము చేసిన మరునాడు చేయు సంచయనము—*ఈ దినం పాలు* [నె]

పాలుబోయు = వరి, జొన్న మొదలగువాటి గింజ ఏర్పడు —*ఆ చేను పాలుబోసింది* [నె; తె; అ]

పాలుమాలిక = కక్కురిపడు—*ఆ కూలోకి పాలుమాలినాడు* [అ; నె]

పాలేరు = (1) రోజు లెక్కకాక సంవత్సరానికి ఏర్పరచుకొని పొలంపని చేసేవాడు; సేద్యగాడు [మ]

(2) పాలికాపు [గో]

పాలేరుకాడు = సేద్యపుకూలి, పాలేరు [కర్నూ]

పావంచాలు = మెట్లు; మెటికెలు; పొంటికెలు; అంచీలు

పావడాలు = కాలియందెలు [కరీ]

పావిడి = ఏటిలో నీటిపాయ, జాలు [నె. మెట్ట]

పావు = పావలా [అ, వి, నె]

పావుతి = రైతు చెల్లించిన శిస్తురశీదు పుస్తకము [మ]

పాసికము=పాయసము, పాసెము [అ]
పాసు=(1) పిసినిగొట్టు — వాడు పాసోడు [కర్నూ]
(2) ఏపు, శక్తి—నీ పాసుగాల; నీ పాసు విల్లిజారక అని తిట్టు [నె]
పాసుట్టు=ఇంటికి వచ్చే బూజు [కరీ]
పాసుది=(1) లోభి
(2) తక్కువ జాతి స్త్రీ [మ; నె]
పాళముచేయు = చదునుచేయు [కరీ]
పాళాలు=స్నానమునకు వేడినీళ్ల చన్నీళ్లు కలిపి అనువు చేసినవి; పాట్లు [సర్కా]
పాళి = పేనాముక్కు; నిబ్ [అ; శ్రీ; వి]

# పి



పింగటించు = (1) వ్యంగ్యముగా - నిర్వహించు—ఇక్కడ ఆయన పింగటించింది ఏమీలేదు
(2) గజ్జలలో బాధకు ఎడము ఎడముగా అంగలువేయు [నె; కర్నూ; అ; తె]
పింజ=ధోవతి గోచి అంచును, బిళ్లగా మడచి దోపుకొనిన పంచకట్టు, ఇది పెద్ద వరుస వారు కట్టుదురు; బిళ్లగోచి;—పింజబోసి కట్టినాడు [నె; తె; అ]
పింజరీపీకు = ఎడతెగని వాదముచేయు [కర్నూ]
పింజలు=జందెము వడుకు పద్ధతి—నాలుగు పింజలు వడకినాడు [కర్నూ]
పింజుకొను=పెద్దజేసికొను—గొంతు పింజుకొను [కరీ]
పింజేరి = బలహీనుడు; పీల, పింజేరి మనిషి [చి]
పిండము మీది బరాతము = తప్పనే తప్పనిది [కరీ]
పిండి దీపారాధన=తిరుమల వేంకటేశ్వరునికి మొక్కుబడి తీర్చుటకుగా శనివారం, పచ్చిబియ్యపు పిండి ముద్దలో దీపము వెలిగించి ఆరాధన చేయుట — పిండి దీపారాధనతో మొక్కుబడి తీరింది
పిండిపిడుగు = రాగి-జొన్నపిండి ఎసటిలో పోసిన తర్వాత, తెడ్డుతో గెలుకుట తక్కువైనప్పుడు అదిగడ్డకట్టి ఉడుకుచుండును. ఒక్కొక్కప్పుడు ఇది నల్లమందు ప్రేలినంత దెబ్బతో ప్రేలి ప్రమాదమును కలిగించును — పిండి పిడుగు కొట్టింది [నె-పొ]
పిండిమర్యము = ఒక దినుసు పుష్పము; పిండి మిరియము [సే]
పిండిమిరియము=మిరియాలు ఎక్కువగా వేసి, అనుకుగా చింతపండు వేయక చేసిన కందిపప్పు వంటకము [నె; కర్నూ; తె]
పిండిముగ్గు = బియ్యపుపిండి కలిపిన ద్రవముతో వేయు కడపముగ్గు [చి; నె]
పిండ్లు = పిండితో చేసిన ఫలహారములు; పిండువంటలు [మ]
పిందె=జంబాలకారి; ఎచ్చులకారి— ఆయన బలే పిందె [నె]
పింపిణి=తలపై పెట్టుకొను నగ [మ; అః బ]
పింపిరి త్రుప్పు [గ]
పికరు=జాద—వాడివికరలేదు, పికిరి [ఉ-వి]
పికాపికలు = నిండుగా [కరీ]

పికిరి = జాడ; ఉదంతము; పికరు — *వాడి పికిరియే లేదు* [నె]

పికులు = (చూ) పిగులు [వి]

పిక్క = (1) మొలక; పిలక — *వరి పిక్కలు బెట్టింది* [తె]

(2) పిరికి — *వాడు పిక్కామనిషి* [అ]

(3) మామిడిపండులోని టెంకె [వ]

(4) గింజ — *చింతపిక్కలు* [వి]

(5) మోకాటి క్రిందిభాగములో గల గట్టి మాంసభాగము [నె]

(6) ఒకటి మూడు మొదలగు బేసిసంఖ్య

(7) గోళీలలో చిన్న పరిమాణము గలవి [శ్రీ]

పిక్కండ్లు = పిక్కలు

పిక్కటబిజ్జు = ఎక్కువగా కూరినది — *తిండి పిక్కట బిజ్జు అయింది* [గో]

పిక్కబలముజూపు = పరుగెత్తిపోవు; కాళ్ల బల చూపి పారిపోవు [తె; నె]

పిక్కలు = పిజ్జలు [అ]

పిక్కి = చిన్నగోలి: పిక్క [నె-అ క]

పిక్కు = (1) బాలురు గోలీల ఆటలో గోలీని ఉన్నచోటనే మరల ఉంచుట లేక కొద్దిగా కదిలించుట [నె]

(2) బలపపుముక్క [కరీ]

(3) రాబట్టుకొను [వి]

పిగులు = (1) గ్రుడ్డునుండి పిల్ల బయటపడు — *పిల్లలు పిగిలినవి*

(2) మాట వెలువడు — *నోటినుండి వాడికి మాట పిగలలేదు;* పికులు [నె; తె]

(3) గుడ్డ పాతదై చినుగు [అ; నె]

పిచ్చకుంట్లవాడు = వ్యర్థుడు; పిచ్చగుంట వాడు

పిచ్చపాటిది = చిన్నది, తక్కువది — *పిచ్చకంచము* [అ; నె]

పిచ్చాపాటి = కాలక్షేపానికి ఏదో మాట్లాడుట [గు]

పిచ్చలపీట = పిచ్చలాడుటకు ఉపయోగించు గుంతలపీట; ఓమనగుంటల పీట [కర్నూ]

పిచ్చిగుంటలవారు = రైతుల గోత్రములను మాత్రము వర్ణించుచు భిక్షమెత్తుకొను కులమువారు. వీరికి ఏటిమిరాసి ఒక్కొక్క గ్రామమునకు గలదు. దీవనలు గాని, శాపములుగాని పలుకక, ప్రతి కుటుంబము వారి గోత్రములను చెప్పిపోవుచుందురు, అందువల్లనే — *పిచ్చిగుంట వాళ్లకు పాపము లేదు పుణ్యము లేదు* — అని సామెత కలిగినది; పిచ్చకుంట్లవారు [నె; చి]

పిచ్చిచెట్టు = ఉమ్మెత్త [కరీ]

పిచ్చుక సరసము = మాటిమాటికి చేయు పని [వి]

పిచ్చె = చింతగింజ — *చింత పిచ్చెకలు* [చి]

పిచ్చు = తక్కువ; హెచ్చు × పెచ్చు [అ]

పిటుకు = గట్టిది [కరీ]

పిట్ట గూసింది = పిట్ట అనగా, గుడ్లగూబ అరిచింది [మ]

పిట్టగోడ = (1) మిద్దెపై చుట్టును కట్టు మూరడెత్తు గోడ; చేపట్టు గోడ [తె; సర్కా]

(2) కొండమార్గాలలో (ఘాట్‌రోడ్) మలుపులలో పక్కరాళ్లతో పేర్చిన చిన్నగోడ [వి]

(3) వంట ఇంటిలో పొయ్యి కనబడకుండ పెట్టిన పొట్టిగోడ [నె]

(4) ఇంటిచుట్టు కట్టుగోడ; ప్రహరి [అ]

పిట్టగోడలు = కుమ్మీలు; కుంబులు

పిట్టపిల్ల = దుర్బలుడు — *అతడు నాతో పోరాడగలడా, అతడొక పిట్టపిల్ల* [కరీ]

పిట్టతుండు = తోట సేద్యమునందు, దుక్కిలో ఏర్పడిన గడ్డలను నలుగగొట్టు చిన్న కొయ్యతునక [నె-ఆత్మ]
పిట్టపోటు = వెదురు బొంగులు మొదలగు కొయ్యలకున్న రంధ్రములు, ఇవి లేతలో పిట్ట పొడువుగా పుట్టినవి [నె-పొ]
పిట్టమాసి = సన్ననివాడు; పొట్టివాడు [నె-పొ]
పిట్టమేత = మిల్లిభోజనము; చాల కొంచెముగా తినుట [కరీ]
పిట్టరొమ్ము = చిన్న వక్షస్థలం [నె]
పిట్టికత = చిన్న కల్పిత కథ; పిట్టకత (Fable) [నె, తె; అ]
పిట్టు = (1) రసము తీసికొన్నతర్వాత మిగిలిన మడ్డి [అ]
(2) సెనగ పిండిలో ఉప్పుకారము వేసి తిరుగబాతతో ఉడికించినది [తె]
(3) తీపు గలిపి పొడిగా చేసిన వరిపిండి పదార్థము; పుట్టు [నె]
(4) పిండిలో బెల్లము కలిపి ఆవిరికి ఉడికించిన తినుబండారము [నె]
(5) సొంచేప మొదలగు వాటిని ఉడుకబెట్టి పొడి పొడిగాచేసి తిరుగమాత వేసిన కూర [నె]
పిట్టుగట్టు = (1) ఇబ్బంది అగు— *వాడికి డబ్బులేక పిట్టుగట్టింది*
(2) మలబద్ధకమగు [తె]
(3) గట్టిపడు [అ-పె]
పిట్టుపిట్టుగా = జాఱుగా గాక [కరీ]
పిట్టోల్సతము = ముడిబియ్యము; చేరుడు బియ్యము [మ]
పితా = తీపియైన భక్ష్య విశేషము, అరిసె వంటిది [గ]
పిడచ = (1) పిడికిలిలో ఇముడు అన్నపు ముద్ద—*ఒకపిడచగూడ తినలేదు* [అ;నె]
(2) పన్నుఊడిన పశువు గడ్డి నమలలేక బయటికి ఉమియు గడ్డిముద్ద — *ఎనుము పిడచలు వేస్తున్నది* [అ; నె]
పిడచగట్టు = (1) గొంతు ఆరి మాట్లాడలేకపోవు
(2) వెంట్రుకలు అట్టగట్టుకొనిపోవు [నె; కర్నూ; అ, తె]
పిడాత = అకస్మాత్తుగా — *పిడాత ప్రాణము తీసెను*; పిడివాత [కరీ]
పిడి = తమలపాకుల చిన్న (చేతి) కట్ట— *ఒక పిడి అంతా వేసుకొన్నారు* [నె; తె]
పిడిగంట = తల వెంట్రుకలను అరటిమొగ్గ ఆకారములో వేయు ముడి; ఇచట దీనిని మగవారే వేయగా, మలబారులో స్త్రీలే వేయుదురు [నె]
పిడిగుద్దు = గట్టిగుద్దు [నె]
పిడిగోడ = మిద్దెలు, బావులకు అంచున కట్టు పొట్టిగోడ, చేపట్టుగోడ; పిట్టగోడ [అ]
పిడిచుట్టు = (1) దట్టి; అడ్డకట్టు; బ్రహ్మచారి కట్టు; లంగీ కట్టు [నె; అ]
(2) బాలెంతలు నడుము బిగింపుకై కట్టుకొను దట్టి [గో]
పిడితరుగు = పండిన వరిచేను కోయుటకు ముందుగా, మంచిముహూర్తమున,మూడు పిడికిళ్ల పైరుకోసివచ్చుట; ఇది ఏరువాక వంటి సాంగెము — *కనప్పండుగనాడు పిడి తరిగినాము* [నె; తె]
పిడివాటు = కోసిన వరి ఓదెలను కుప్పగా వేయక, ఎండిన తరువాత, పట్లుపటుగా పట్టుకొని, కొయ్య చక్కపై బాది గింజలను రాల్చునది. ఆవల చెత్తను తొక్కింతురు; పిడేట [నె; తె]
పిడివాత = అకస్మాత్తు; పిడాత—*పిడివాత ప్రాణం పోయింది* [కరీ]

పిడివాదము = మొండివాదము; వితండ వాదము [నె; తె]
పిడుపు = పొడిపొడిగా వండిన కూర; పొరుటకూర [వి]
పిడేటు = (చూ) పిడివాటు [అ-పె; మ]
పితకలాటకం = (1) లోపిరికి వెలిపిరికి, వెనుకముందాడుట [నె, కర్నూ]
(2) మోసము; పితలాటకం
(3) తంట [అ]
(4) వెంట తగులుట [గు]
పితలాటకం = (చూ) పితకలాటకం [నె]
పితుకు = కొంచెకొంచెముగా యిచ్చు— *పితికి పితికి ఇస్తున్నాడు* [నె]
పితుకుడు పప్పు = (పితికిన పప్పు) అనప గింజలు పచ్చివి నానబెట్టి, చర్మమును పితికివేసి ఎండబెట్టిన పప్పు, చాలా రుచి [చి]
పితుకు పప్పు = (చూ) పితుకుడు పప్పు; పిసుకు పప్పు [అ]
పితుకులు = గేదె, ఆవు వీటి స్తనములు [శ్రీ]
పిత్తకోళ్లు = ఎడ్లబండి వెనుకనుండి, ఎక్కుటకు బిగించిన పట్టుకొను కొయ్యలు [వి]
పిత్త పరిగలు = చేదుగా ఉండు చిన్నచేపలు [శ్రీ]
పిత్తర = చిన్న గోలి — *పిత్తరతో బద్ది (గుంట) కాల్చినాడు (గుంటలో పడ వేసినాడు)* [నె]
పిదప = లోభి—*వాడు పిదప మాని* [నె-పొ]
పిదప కాలము = వినాశకాలము— *వాడికి పిదప కాలం వచ్చింది* [నె; గు]
పిప్పికాయ = బాగా నమలలేక పశువు ఉమ్మివేయు గడ్డిచుట్ట—*ఎద్దు పిప్పికాయ ఊసివేస్తున్నది* [నె]
పిటికి = తలుపునకు వేయు కఱ్ఱతాళము [శ్రీ]
పిలం పిలాయమానము = నిర్లక్ష్యము [కరీ]
పిల్లకల్లు = పసిపిల్లల ఉపయోగార్థము రెడ్డి యింటికి ఈడెగవారు, వంతులుగా పంపు నట్టి ఒక ముంతెడు ఏమి కలుపని కల్లు [న]
పిల్లకాయలు = పిల్లలు (ఆడ మగ కలిసిన వారు) [నె; కర్నూ; తె; అ]
పిల్ల పొరు పత్యంపెట్టని ఒక్కనిపొద్దు = అసంగతము; అసంభవము [అ-పె]
పిల్లబావి = పెద్ద బావియందు క్రింద త్రవ్విన చిన్నబావి, బావిలోపల త్రవ్విన చిన్న బావి [నే; నె]
పిల్లల ఎచ్చము (వెచ్చము) = పిల్లలకు వాడు మందులు [మ]
పిల్లాండ్లు = స్త్రీలు కాలి వ్రేళ్లకు ధరించు ఉంగరము వంటి సొమ్ము [నె-పొ]
పిల్లాది మేర = అందరును; ఆ బాలవృద్ధము [కరీ]
పిల్లిగంతు = (చూ) పిల్లేరు గంతులు [అ-పె]
పిల్లి పేగులవాడు = జాలిగలవాడు [నె-పొ]
పిల్లి బిత్తరకాయలు = పెసరలో చిన్న రకము కాయలు గాయు మొక్కలు; పిల్లి బీసరకాయలు
పిల్లెత్తకపోవు = చేయుచుండిన పనిని నడుమ నిలుపగా, అప్పటివరకు చేసిన దంతయు వ్యర్థమైపోవు; పెట్టవలసిన ఇరమై గుంజిళ్లకు నడుమ పది దగ్గర నిలిపిన అవి మురిగిపోవును—*నీ పది గుంజిళ్లను పిల్లి ఎత్తుకపోయింది* [నె]
పిల్లేరు గంతులు = పై కెగరి పలయముగా తిరిగి, మరల కాళ్లమీద నేలపై వ్రాలుట; పిల్లిగంతులు; (సమ్మర్ సాల్ట్) [నె]
పిసి = కుసి [అ]
పిసికిళ్లు = (చూ) పిసుకళ్లు [వ]
పిసినాసి = పిసినారి; లోభి

పిసుక మనిషి = అతి దుర్బలుడు; పిచ్చుక మనిషి [కరీ]

పిసుకు = కుదించుకు పోయిన — చిన్న *పిసుకు కళ్లు: పిసుకు మొగము* [గ]

పిసుకుపప్పు=(చూ) పితుకుడు పప్పు [అ]

పిసుకళ్లు=చేతితో నులిమి తినుటకు యోగ్యమైన లేతకంకులు; పిసుకుళ్లు [అ]

పిసుకుళ్ల పండుగ = ఆడ మగ కలిసి ఉత్సవమున త్రొక్కులాడునది, ఇది వైష్ణవులు ఎక్కువగా చేయుదురు [చి]

పిసుకుళ్లు= ముదురని పాలజొన్న కంకలు [నె; కర్నూ]

పిస్స = పిచ్చ; పిచ్చి [కరీ]

పిళ్లేళ్లు = (చూ) మించు [సర్కా]

పిళ్లేరాయుడు = దిష్టి దీయునపుడు తట్టలో పెట్టు పేడబొమ్మ [అ-పె]





పీకదీయు = బలవంతపెట్టుచు; బ్రతిమాలు —*ఆయనను పీకదీసి పని చేయించవలసి వచ్చింది*; పీగదీయు [నె]

పీకుట= వెళ్లిపోవుట (వ్యంగ్యముగా) ఆతడు కాలికొంది పీకినాడు [కరీ, నె]

పీకుదాన = ఉమ్మి వేయుట కుపయోగించు పాత్ర [శ్రీ]

పీకులాట=(1) పెనకులాట; తగవులాట (2) వివాదము — *దానిమీద బలేపీకులాటయింది* [నె; కర్నూ; తె] (3) అనవసర మగు బాధ; సంకటము, బాధ [అ]

పీకె=(1) వెడల్పు తక్కువగా గోచిపాతవలె నుండు చేలవరుస, సన్నటి దొంపు — *ఆ పీకెను కయ్యలో కలుపుకొన్నాడు*[నె] (2)సన్నాయి (నాదస్వరము) మొదలగునవి ఊదుటకు తాటి ఆకుతో చేసిన నాళము [వ; నె; గో] (3) సగము కాల్చి ఆర్పి, ఒక చోట యుంచిన పొగచుట్ట [గో]

పీకెలు= ప్రయత్నము; పన్నాగములు — *ఇక నీ పీకెలు సాగవు* [నె]

పీగదీయు=(చూ) పీకదీయు [నె]

పీచు=లోభి—*వాడు పీచుమనిషి*; నారపీచు [తె; అ]

పీచోడు=సన్ననివాడు [నె-పొ]

పీజె= నీటి పారకమునకు సుళువుగా ఏర్పరచిన ఒకటి రెండు చాళ్లు; బోదె [కరీ]

పీటుకోడు = కత్తిని బిగించిన పీట — *కాయలు పీటుకోడుతో కోయి* [నె]

పీటముడి=ఒకరకపు గట్టిముడి × దూముడి *అతడు త్రాడుకు పీటముడి బెట్టెను* [కరీ; నె; వ]

పీటవేయు=(1) స్థిరపడి కూర్చుండు (2) వీపును రాతికో,గోడకో ఆనించి ఎదురు తిరిగి కూర్చుండు [అ; నె; తె] (3) భోజనము చేయుటకు సిద్ధము చేయు —*పీటలు వేసినారు, లేండి* [నె]

పీడనెల=కార్తీకము; ఈ నెలలో శుభకార్యములు చెయ్యరు [చి]

పీడిశకాళ్లు = ఈడుపుకాళ్లు [నె-పొ]

పీనాశి=పిశినారి; లోభి; పినిష్ఠి

పినిష్ఠి=లోభి; పీనాశి [వ; కరీ]

పీర్లు గుండానబడు= (1) అనుకొనిన దానికంటె, ప్రతికూలముగా ఒక పని ముగియు [నె, కర్నూ; అ] (2) ఏదో విధముగా ముగిసినది [తె]

పుంగనూరు=వెట్టిబోగుల మనిషి (పుంగనూరు చిత్తూరుజిల్లాలో ఒక గ్రామము) —పోరా పుంగనూరా [నె; కర్నూ]
(2) పిరికి; తెలివితక్కువాడు [అ]
పుంగనూరు జవాను = ప్రతిపనికీ అడ్డు చెప్పువాడు [చి]
పుంగనూరు దాసప్ప=అమాయకుడు [అ]
పుంగనూరు దాసరి=తెలివితక్కువ బిచ్చగాడు [తె]
పుంగపుటార=ముళ్లెమూట [కరీ]
పుంగిడి=ఒకవిధమైన ఆట; ఆడపిల్ల లిద్ద లిద్దరు చేతులు పట్టుకొని గుండ్రముగా తిరుగుచు "పుంగిడి పుంగిడి పుల్లికాక, రాయికంటె ఎలకాక" అంటూ ఆడుదురు
పుంచే=మందబయలు [నె-మెట్ట]
పుంజాలు తెంపుకు పరిగెత్తు = భయపడి పారిపోవు [వి]
పుంజి=సమృద్ధి [సే]
పుంజీ=నాలుగు [వి]
పుంజుకొన్నది=(1) తేరుకొన్నది [చి]
(2) అరువు తెచ్చుకొన్నది
(3) కూర్చుకొన్నది [కరీ]
పుంజులూరు = అవ్యక్తుడు: వెట్టిమనిషి; పుంగనూరు — పుంజులూరు నెల్లూరు తాలుకాలో ఒక గ్రామము. మోసమునకు కుంబకోణమన్నట్లు [నె]
పుంజెడు=లావుపాటి [కరీ]
పుంటికూర=గోగాకు, పుండాకు; గోంగూర [తె]
పుండాకు=గోగాకు, పుంటికూర; పుండికూర [అ]
పుండాకోరు=(1) దుష్టుడు [శ్రీ]
(2) అప్రయోజకుడు—పోరా పుండాకోరు వెధవా [నె]
(3) చాడీకోరు; లుచ్చా, నీచుడు [వి]
పుండిఆకు=గోంగూర, పుణ్యాకు [అ; బ]
పుండికూర = గోంగూర; గోగాకు, పుంటికూర (కర్నూ-పత్తికొండ]
పుణ్యాకు=పుండికూర, గోంగూర [అ]
పుగిరిసు=కపిలబానకు కట్టిన తాడు తిరుగునట్టి బిళ్ల (గిలక) యిరుసు [అ; బ]
పుగిశెట్టి = ఇతరులది; తేరగా వచ్చినది; పూశెట్టి [అ, బ]
పుగ్గాలు = బజ్జీలు [కర్నూ]
పుచ్చిపోవు=(1) అధికమగు—అంగట్లో వంకాయలు పుచ్చిపోయినవి, అడిగే దిక్కే లేదు [మ]
పుచ్చె=కమ్మల సీలలు డిప్ప [గు]
పుటక=(1) పుట్టుక స్వభావము — వాడి పుటకే అంత [చి; నె]
(2) అందము—మంచి పుటకైన మనిషి; పుటుక [కర్నూ; నె]
పుటకతేనె=పుట్టలలో బెట్టు తేనె [నె-పొ]
పుటాన పుటుకులు=పుట్టినదాది [కరీ]
పుటిక=దొన్నె ఆకారంగా తాటాకుతో కట్టినది; దీనితో కల్లు తాగుదురు; రేక
(2) అంచు ఉన్న గంప; పుటికి [వ, నె]
(3) చిన్నగంప—బోనపుటిక [నె]
పుటికపొత్తెర = తాటి ముంగము [చూ] పొత్తెర [వ]
పుటుక్కైన = హఠాత్తుగా; పుసిక్కున, పుసుక్కున [తె, నె]
పుటుక=(చూ) (1) పుటక; పుట్టుక [నె; కర్నూ]

(2) గర్వము (వ్యంగ్యముగ) [అ]
పుట్కా = (చూ) పుటిక [మ]
పుట్టకూడు = పుట్ట లోపలి భాగమునుండు మెత్తని మట్టి, ఇది పురుగుల తెట్టివలె నుండును, వైద్యమునకు వాడుదురు [నె]
పుట్టగతులు = తిరిగి పుట్టుటకు అవకాశములు అనగా జీవితమును గౌరవముగా గడపు అవకాశములు — *ఇక వాడికి పుట్టగతులు లేవు* [నె]
పుట్టబంగారము = పాము పుట్టమట్టి; నాగుల చవితినాడు, నాగమయ్యకు పాలు నైవేద్యము తెచ్చినవారు ఆ పుట్టమన్ను చెవులకు కనులకు రాచుకొనుదురు [కరీ]
పుట్టమన్ను = (1) తల పులుముట కుపయోగించు మట్టి [చి]
(2) ఇటుకరాతి ఇండ్లు కట్టుటకు ఉపయోగించు జిల్లపురంగు గల మెత్తటి మట్టి [నె]
పుట్టరేపిళ్లు = (చూ) పుట్రేపిళ్లు [నె-పొ]
పుట్టాలమ్మ = గవదల గంగమ్మ వంటిది; మెడలో బంగారుగొలుసు (దండ) వేసిన ఈ అమ్మవారు తగ్గిపోవును [చి]
పుట్టి = ఏరు దాటుటకు, ఉపయోగించు గుండ్రటి బుట్టవంటి చిన్నపడవ. దీనికి వెలుపల తోలు కప్పుదురు; ఇది గుండ్రముగా తిరుగుచు ముందుకు సాగిపోవును. — *నీ పుట్టి ఏమి మునిగింది?* అరిగిండ్లు హరిగిండ్లు [రాయి]
పుట్టి = పెద్దగంప; అరిగిలి [తె]
పుట్టిసెలగ = 21 తూములు [నె-కనిగిరి, వ]
పుట్టు = పచ్చిబియ్యంతో చేసిన వంటకము; కన్నెపిల్ల రజస్వలయైనపుడు వండిపెట్టెదరు; పిట్టు [చి]
పుట్టుకొత్త = సరికొత్త [నె]
పుట్నాలు = కందులు అధికముగా వేచగా వచ్చిన బొరుగులు [నె-పొ]

పుట్రేపణ = చెడ్డచేయమన్న ప్రోత్సాహము; పుట్రేపిళ్లు [గు; నె]
పుట్రేపిళ్లు = చెడ్డకు ప్రేరేపించుటలు- *ఏవో పుట్రేపిళ్లు బెట్టి పగదోలినాడు* [నె; తె]
పుట్లుపుట్లు = అధికసంఖ్యగలది అనిచెప్పుట [మ]
పుడంగాసురుడు = అధికులలో ఘటికుడను కొనువాడు — *వాడు పెద్ద పుడంగాసురుడా?* పుడింగి [చి]
పుడత = మడిలోనికి నీరు పారించు చిన్న బోదె; శానకాలువ [శ్రీ]
పుడా = పొట్లము [కరీ]
పుడింగి = అధికు డనుకొనువాడు — *పెద్ద పుడింగిమాదిరి ఉన్నాడు*; పుడంగాసురుడు [నె]
పుడిగెలు = స్వల్పమైన బిచ్చములు — *వాడు పుడిగెలెత్తి బ్రతుకును* [కరీ]
పుడిసెడు = (చూ) పురిసెడు [అ]
పుడీ = చిన్నపొట్లము; పుడా [కరీ]
పుడుకుట = చేతితో తడవుట [కరీ]
పుణికిరింతలు = (1) సన్నిపాతగ్రస్తునికి కలుగు దుర్లక్షణము
(2) వ్రేళ్ళతో తడుముకొనుట [నె-పొ]
పుణుకు = (1) నీళ్ళను గబ్బిళ్ళతో వట్టి వదలుచు చేపలబట్టు [నె]
(2) తడువులాడు; వెదకు — *ఒళ్లంతా పుణుకుతాడు* [తె; అ; గో]
(3) పెసలతో చేసిన ఒకవిధమగు భక్ష్యవిశేషము [కరీ; సర్కా]
(4) అచ్చము, యథామాతృక — *తండ్రి పోలికలు పుణికి పుచ్చుకొన్నాడు* [గో]
పుతుకు పుతుకులు = తెగిన దారపు ముక్కలు [కరీ]
పుత్తరంజి = పుత్రజీవి [సే]
పుత్తెము = (1) తాటిపండు మొదలగువాటిలో తొడిమ దగ్గరనుండు కండగల భాగము

(2) ముఖ్యస్థానము—*వాడికి పుత్తెంగోని పంపినారు;* కొత్తివి [నె]

**పుత్యాము** = ఏమీ ఎఱుగనట్లు నటించునది [గు]

**పునుక**=పుల్లపారు అడవిగడ్డి, ఇది చెరువు తొట్టులతో ఇడవలి, తుంగవలె పెరుగును. కీవీతో ఇండ్లకప్పు నేయుదురు; కానిగడ్డి [నె]

**పున్నెమంతుడు** = భర్తపేరు చెప్పుటకు బదులుగా స్త్రీలు వాడు మాట—*మాపున్నెమంతుడు వచ్చినాడు;* మా యింటాయన

**పురమాయించు** = (1) ప్రోత్సహించు—*ఆయన బాగా పురమాయించినాడు*

(2) ప్రారంభించు—*పని పురమాయించి వచ్చినా* [నె; కర్నూ; తె; అ]

**పురపురలాడు**=అనవసర విషయములకు ఎక్కువ ఆశక్తి చూపు [సర్కా]

**పురి**=(1) ధాన్యము నిలువజేయుటకు తాత్కాలికముగా గడ్డి ఎంటులతో కట్టినగాదె; కూటు [గు]

(2) నులుకదారపు ఉండ [కరీ]

**పురిఎక్కించు**=ప్రేరేపించు; పురిబెట్టు [తె; నె]

**పురికొస** = (1) సంచులుకుట్టు జనపనార దారము [అ; నె]

(2) ఒకజాతి పురుగు, ఇది కుట్టిన బ్రతుకదు [నె-పొ; గో]

**పురిసెడు**=పెద్దచేరెడు — *పురిసెడు నీళ్ల త్రాగు;* పుడిసెడు. ఘనపదార్థమైన కమికెడు అవి అందురు—*కమికెడు అన్నము* [నె; తె]

**పురుగుదొలుచు**=మనస్థిమితము లేకుండు; చలించు; గుబులెత్తు — *వాడికి ఏదో పురుగు దొలిచింది* [అ; నె]

**పురుగుముట్టు**=పాము కఱచు [అ]

**పురుఱు**=పందెము గెలిచిన పిగిలి పిట్ట[శ్రీ]

**పురుబియ్యము**=దొంగలను పట్టుటకు పెట్టు తాంత్రిక బియ్యము (మంత్రాక్షతలు)[కృ]

**పుర్మాయించు** = (1) పుట్టు — *నాకు గెజ్జలలో కురుపు పుర్మాయించెను;* పురమాయించు [కరీ]

(2) ప్రోత్సాహపరచు; పురమాయించు

**పుల్లుగడ్డి**=అల్లుకొను ఒక విధమగుపచ్చిక, పశువులకు యిష్టము [నె-పొ]

**పుల్లుగొట్టు**=పశువులు బండికి కట్టినప్పుడు అనుకు పేడవేయు [మ]

**పులక**=(1) పైరునాటిన తర్వాత కయ్యలో ఉన్న నీరు తీసి మరల పెట్టిన నీరు [నె]

(2) చేలనుండి బయటకు పోవలసినమురికి నీళ్లు, వెల్లువనీళ్లు; మురుగుడు నీరు [నె]

(3) కలికము వేసిన తర్వాత కంటిరెప్పలార్చుట [నె-ఆత్మ]

(4) ముఱుగు నీరు [గు]

**పులకట్టె**=పచ్చజొన్న కొయ్యకాలు [కరీ]

**పులకరము**=కొద్దిగా జ్వరము తగిలినట్లుండుట [సర్కా]

**పులకకాలువ**=మురుగునీరు బయటకుపోవు కాలువ (Drainage) [నె]

**పులకతడి** = (1) పైరు నాటిన తరువాత వేయు తడి

(2) కొట్టుట—*వానికి పులకతడి పడినది* [నె-పొ]

**పులకాలు**=పల్చని గోధుమ రొట్టెలు [కరీ]

**పులగము**=పొంగలి [అ]

**పులట**=కోడిగ్రుడ్డు సొన; జన [వి]

**పులపులమను**=అధిక శ్రమవల్ల ఎముకలు నొప్పెక్కు [కరీ]

**పులమారుట**=తిన్న పదార్థము గొంతులోనికి మఱల వచ్చి ఉక్కిరి బిక్కిరి చేయుట; పొలమారుట; పొరబోవుట [తూ-గో]

**పులవరి**=గడ్డిమేపుకు చెల్లించు శుల్కము; పుల్లరి [నె; అ]

పులవరింపు=పుల్లని వస్తువును తిన్నప్పుడు కలుగు వికారము [తె]
పులికాపు = దేవుని విగ్రహములను శుద్ధి చేయుట [సర్కా; తె]
పులికాయ = మిరపపండ్లలో తాలుకాయ; కాటుకకాయ
పులిగిరింతబెట్టు = ఆశకలుగజేసి కార్యములో దించుటకు మాటలు చెప్పు [నె- పొ]
పులిగోర=పులుసుచద్ది; పులిహోర; పులిహోర; చిత్రాన్నము [కరీ]
పులిచేరునాను=స్త్రీలకంఠభూషణము; పుదిచ్చేరినాను [నె]
పులిజీతము=నేలపై గీతలు గీచి, పావులకు పులులు, మేకలు అని పేరు పెట్టి ఆడు ఆట; పులిజూదము [తె]
పులిజూదము=(చూ) పులిజీతము [నె]
పులిపొంగనాలు = (చూ) పులిబొంగరాలు [చి]
పులిపొంగరము=పులిబొంగరము [గో]
పులిబొంగరము=పులిసిన పిండితోకాల్చిన తినుబండారము; పొంగలము [నె,కర్నూ]
పులియు = (1) దెబ్బలు తగిలి దేహము నొప్పిఎత్తు — *ఒళ్లు పులిసేటట్లు కొట్టినారు* [నె; అ]
(2) అలయు
(3) జ్వరమువచ్చు [కృ]
పులిరుసు = కపిలతొండము త్రాడు (నిడుతాడు) జారు ఇరుసు; పుల్లిరిసు [చి]
పులిసిఉన్నాడు = డబ్బు బాగా కలిగి ఉన్నాడు [శ్రీ]
పులుకరము=సన్నజ్వరము [కరీ]
పులుగు=(1) కోమటి
(2) పురుగు [సే]
పులుచుగూర = పప్పులో చింతపండువేసి వండిన ముద్దకూర; పుల్లకూర, పులుసుకూర [అ; తె]
పులుమిట్టు=పచ్చికబీడు—*పులుమిట్టిన పశువులు మేస్తున్నవి* [నె]
పులువరించు=కళ్లు అల్లార్చు [కరీ]
పులుసుకూర = చింతపండువేసి ఎనించిన తోటకూర; పులుచుకూర [నె; కర్నూ]
పుల్ల=(1) వంటచెరకు — *పుట్టెడుపుల్ల పది రూపాయలు* [గో]
(2) బలపము (వి)
(3) లేత ఎరుపువన్నె — *పుల్లావు* [నె; కర్నూ; వ: అ]
పుల్లగూర=(1) తోటాకు మొదలగు వాటిని ఇగురబెట్టి ఎనించిన ముద్దకూర [నె; కర్నూ; అ; తె]
(2) గోంగూర [గు]
పుల్లటు = కోడిగ్రుడ్డుతో తయారుచేసిన భక్ష్యము [గో]
పుల్లనీళ్లు=(1) కల్లు [గో]
(2) పుల్లినీళ్లు; కలి [నె; రా, తె]
పుల్లపోటు=సూటిపోటుమాటలు [తె]
పుల్లబెట్టు=(1) ప్రోత్సహించు
(2) అడ్డుపెట్టు—*ఆ పనికి వాడు పుల్లవేసినాడు, ఇక కాదు* [నె]
పుల్లలుపెట్టు = (1) కొండెములు చెప్పు [వి; నె]
(2) చెడ్డకు ప్రోత్సహించు
పుల్లర=పుల్లరి, పులవరి [వ]
పుల్లవంపు=ఎక్కువగా ఏవైపుకుగాని మొగ్గుచూపకుండా మధ్యస్థముగా రాజీచేసికొనుట — *వివాదాలలో పుల్లవంపుగా పోవాల* (ఎక్కువగా ఒకవైపుకు వంగక అని) [నె]
పుల్లవిరుపుమాటలు=మనసును నొప్పించునవి; పని చెఱుచునవి [అ; వి]

పుల్లశాస్త్రము = బావి త్రవ్వుచోట నీరున్నదీ లేనిదీ రెండు పుల్లలచేత కనుగొను శాస్త్రము [చి]

పుల్లసిల్లు = (1) పోయిన వస్తువుకై చింతించు
(2) అనినమాటకై చింతించు
(3) అధికశ్రమచే దస్సిపోవు [కరీ]

పుల్లాకు = హీనుడు; లెక్కబడనివాడు — *వాడొక పుల్లాకు; ఎంగిలాకు* [నె; తె; అ]

పుల్లింగాలు = ద్వేషముతో ఒకరిపై మోపిన నిందలు; పుల్లింతాలు [గో]

పుల్లింతాలు = (చూ) పుల్లింగాలు [గో]

పుల్లిరుసు = మోటబాన తొండముతాడు (నిడు త్రాడు) క్రిందబడకుండ జారి ఆనుకొని యుండు గుండ్రటి కొయ్యదిండు; ఇది మోకుతోగూడ తిరుగుచుండును; పులిరుసు [నె-పొ]

పుల్లుడునేల = గువ్వరాయిగల భూమి [కృ]

పుల్లెలు = ఎంగిలి విస్తళ్లు; పుల్లాకులు [కరీ; అ]

పుత్వైన = సీమంతమునకు దెచ్చు సూడిద; సారె [మ]

పుసి = (1) చుట్టరొయ్య, మడతరొయ్య; మడపరొయ్య
(2) బొగ్గునుసి [శ్రీ]

పుసికిపోవు = కార్యము భంగమగు [శ్రీ; వి; మ]

పుసిక్కున = తటాలున; అప్రయత్నముగ — *పుసిక్కున ఇచ్చివేసినాడు;* పుసుక్కున [నె; అ; తె]

పుసుక్కున = హఠాత్తుగా; తలవనితలంపుగా; పుసిక్కున [నె; కర్నూ; తె]

పుసుకుడు = గొప్ప పురుషుడు కాడని వ్యంగ్యముగా అనుమాట — *ఇది ఆ పుసుకుడు చేసినపని;* పుసుడు; పుస్కారయ్య; పుసుగు [నె]

పుసుగు = పురుషుడు అని వ్యంగ్యముగా అనుట; పుసుకుడు [అ]

పుస్కారయ్య = (చూ) పుసుకుడు [గు]

## పూ



పూచి = పురుగు; రిక్క [అ]

పూచిక = చీపురు — *పూచికపుల్ల* [నె-దక్షి; తె; అ]

పూచిపెట్టు = నిజమును కప్పిపుచ్చి మాట్లాడు — *ఆయన సంగతి పూచిపెట్టి పోయినాడు;* పూత మాటలాడు [నె]

పూజలు = కుచములు [వి]

పూజా = ఆడవాళ్లు మెడలో కట్టుకొను బంగరు గుండు పూచ [కరీ]

పూజిచ్చు = అలంకరించు — *దేవుండ్నింకా పూజియ్యానే లేదు* [మ]

పూజు = కాడి [వి]

పూజేప = శరీరముపై పూలమచ్చలున్న పెద్ద చేప [చి]

పూటు = పొలములకు నీరు పారించుకొనుటకు భూవిస్తీర్ణమును బట్టి రైతు చెరువునీరు పారించుకొను క్లుప్తకాలము — *మాది ఒక జిన్నర పూటు* [నె]
(2) బరువు — *బండికి కట్టిన ఎద్దులలో ఒకదానిపైననే పూటుపడింది* [అ]
(3) హామి, జామీను — *వానికి పూటుబడినాది* [కర్నూ-పత్తికొండ; నె-పొ]

(4) బాధ్యత [గో]
(5) ఎక్కువ—ఎద్దు పూటాగా మేసింది; పూటు [నె]
పూటగాలి = పరమటగాలి కొట్టికొట్టి, మరలిన తూర్పుగాలి, పైరుగాలి; మూలగాలి [నె]
పూటి = బండిచక్రమున కైవారముగా ఏర్పడిన గుండ్రటి లావుచక్క—బండిపూటి విరిగింది [నె; తె]
పూటిమన్ను = పేరినమట్టి [చి]
పూటు = (1) సంకరము — వాళ్ల వంశము పూటు [నె]
(2) నిండుదనం; డబ్బు కలిగియుండుట [గ]
(3) పూర్తిగా, ఎక్కువగా—చేలో బడి యీ ఎదు పూటుగా మేసింది; పూటాగా [నె]
పూడిక = (1) శూన్యంపెట్టిన వస్తువులను యింటిలో నడుమ పూడ్చి పెట్టినది — ఆ యింటిలో పూడికెత్తినారు; గావు [చి]
(2) బావి మొదలగు జలాశయాలలో క్రమేణా పేరుకొని, దాని లోతును పూడ్చిన మట్టి మొదలగునవి — బావిలో పూడిక తీసినారు; పూడు [నె]
పూడు = బావిలో పేరినమట్టి — బావిలో పూడెత్తుతున్నారు; పూడిక [చి]
పూడుమాను = మోటకు గిలకచట్టము అమర్చుటకు అమర్చిన కొయ్యలు [నె-పొ]
పూడ్చినాడు = (1) వెళ్లినాడు — ఆయన నేరుగా పూడ్చినాడు [చి; దక్షిణము]
(2) శిక్షించు—వాడిని పూడ్చినాడు [అ]
పూత = (1) పూచినది—చింత పూత
(2) నోటిపుండు—నోరు పూచిండి, అన్యపాకము; పెచ్చు [నె; కర్నూ]
(3) ఆవు ఎద్దుల ఒంటిమీద మచ్చలుగా ఏర్పడిన వెంట్రుకలు, ఇది దుర్లక్షణము [నె]
(4) శ్వేత చర్మకుష్ఠవ్యాధి; బొల్లిరోగము [కరీ; వ]
(5) బచ్చెన (రంగువేయుట) [అ]
పూతమాటలు = సత్యమును (కప్పిపెట్టు) పూసిపెట్టు మాటలు [నె-పొ]
పూతరేకులు = వరిపిండితో పల్చగా చేసుకొని, కుండపై నెయిపూసి, పంచదార చల్లి మడతపెట్టి పాకముచేసిన తినుబండారము [వి]
పూతికనాట్లు = చిన్నమేకులు [వి]
పూద్రాగు = గొలుసు పాలుపట్టు [కరీ]
పూనకము = పూనినది; ఆవేశము—అమ్మవారి పూనకము [చి; తె]
పూనిక = గ్రామదేవతల తిరునాళ్లకు, కోడిగట్టి ప్రారంభించుట — సంగం పూనిక [నె]
పూను = దిగువ పొలమునకు నీరుపోకుండా అడ్డముగా వేసినగట్టు; అడ్డ మడవ [శ్రీ; తె]
పూను = బండి లాగుటకు ఎద్దులు గట్టిగా మోకరించు—దాపబెద్దు పూనలేదు [నె; అ; తె]
పూన్కొంవచ్చు = ఏదో దేవత ఆవేశించు [మ]
పూరాపడు = కృతార్థత జెందు — దానివల్ల ఆయన పూరాపడింది ఏమీలేదు [నె]
పూరికోడి = దేశీయమైనకోడి; నాటుకోడి [తె, నె]
పూరేడు = (చూ) పూరేలు [వ]
పూరేలు = కము జుజాతి చిన్న అడవిపక్షి; పూరేడు [నె]
పూర్ణంకాయ = గుత్తి వంకాయ [మ]
పూర్ణము = సెనగపప్పు, బెల్లముతో ఉడికించి రుబ్బినది [తె]
పూలకొబ్బి = కాలిఫ్లవర్ [శ్రీ]
పూలముడుపు = గర్భవతికి చేయు ఒక వేడుక [నె]

పూలు పుటకలవడ్డది = అదృష్టం కలిసి వచ్చింది [మ]
పూవరసి=గంగరావిచెట్టు [నే]
పూశెట్టి=తేరగావచ్చిన ఇతరులసొత్తు; పుగిశెట్టి [అ; బ]
పూస = నేవు—వాంపూన - కారపు పూస [మ]
పూసపోగు = ఒంటిపైగల నగా నాణెము [కరీ]
పూసినట్లు = రవిక, (జాకెట్టు) శరీరమునకు సరిగ్గా అంటుకొనునట్లు సరిపోయినట్లుండుట [తూ. గో; గు]
పూసినది=ఒళ్లంతా వ్యాధిచే తెల్లమచ్చలు ఏర్పడిన స్థితి [కరీ]

# పె



పెంకుతీయు=మాడు పగులగొట్టు; గట్టిగా శిక్షవిధించు [గు]
(2) అవమానపరచు
(3) దృష్టిదోషమునకు శాంతిచేయు[చె;నె]
(4) పూర్తిగా నష్టపెట్టు [నె-పొ]
(5) ఇచ్చెదనని మాటయిచ్చి తప్పు — *ఆయన, వాడికి పెంకుదీసి కొంకిన వేసినాడు* (కుండపెంకులో కొన్ని వస్తువులు దిష్టిదీసి పోకిన చెడ్డను పోగొట్టునట్లు చేసినాడనుట) [నె]
పెంట=(1) పశువులను, రాత్రులందు కుదుర వేయు అడవితల చోటు—*తుమ్మలపెంట* [నె]
(2) కల్లు అమ్మెడుచోటు, కల్లుపెంట[అ]
(3) ఎరువు [అ; నె]
(4)అమేధ్యము—*పెంటదొక్కినాడు*[నె]
పెంటబిఱ్ఱు=స్థానబలము; కట్టుమట్టుబలము —*పెంట బిఱ్ఱుతో ఎద్దు పొడువబోయింది* (పెంట=పశువుల కట్టివేయు చోటు)
పెంటితనము=(1) పౌరుషము లేమి [నె; కర్నూ; తె; అ]
(2) నపుంసకత్వము—*వాడు పెంటోడు* [నె]
పెంటిముడి=ఊడిపోవుముడి; దూముడి[చి]
పెండ్లిపెండ్లము=ధర్మపత్ని(ఉంచుకొనినది కాదు) [కరీ]
పెండ్లి, పెటాకులు = (చూ) పెండ్లి పెడాకులు
పెండ్లిపెడాకులు=ఇది జంటపదము,పెండ్లి పేరంటము — *వాడు పెండ్లీ పెడాకులు లేకుండా తిరుగుచున్నారు* [నె, కర్నూ; అ; తె]
పెండె=(1) జేడు (ముద్ద) బెల్లం—*బెల్లం పెండె కట్టేసింది* [చి]
(2) గడ్డివామి వేయుటకు ముందు నేల మీద కట్టెలతో కట్టిన చట్టము. దీనిమీద గడ్డివామి వేయుదురు [అ-పె]
పెండెకట్టు=తాటాకు దడికట్టునపుడు దడికాధారముగా అడ్డముగా కట్టిన కట్టె[గు]
(2) పెండెలతో (పొడవు కట్టెలతో) కట్టి బిగించినది [నె]
పెండెము = దొడ్డి దారికి బిగించు కొయ్యచట్టపు తలుపు (Gate); పలగాడి: తగల [నె]
పెండెమోపు = పెండెవాసము కలిసినది; పెండెకట్టు — *ఆ ఇంటికి పెండెమోపు పూర్తి అయినది* [నె; వ]

పెందలకాడ = ప్రొద్దుక్రుంకకముందు; పెందలాడి, పెందలాడ—పెందలకాడనే యిల్లు చేరినా [నె]

పెందలాడ = పెందలాడి; పొద్దు ఉండగనే; పెందలకాడ; పెందలకడ [నె]

పెంపకంవచ్చు = దత్తుగా వచ్చు; పెంపుకము [కరీ; వ; ని]

పెకాయించు = పారవేయు [కరీ]

పెగ్గి = పొగరు—వాడు పెగ్గీమనిషి; పెగ్గె [అ-పె]

పెగ్గె = (1) పొగరు; పెగ్గి [అ-పె]
(2) ప్రతిజ్ఞ; బడాయి— ఆయన పెగ్గెలు పలికినాడు; ఆయన వన్నీ బొస్తు పెగ్గెలు [నె]

పెచ్చిక = (చూ) బెచ్చిక [నె]

పెచ్చుట = ఉష్ణాధిక్యముతో నాలుక, నోరు పూయుట; పుండగుట; ఆస్యపాకమగుట [తె]

పెచ్చులు = (చూ) బెచ్చిక; బెచ్చులు [వ]

పెచ్చె = బడిపెద్ద (బడిలో పెత్తనము చేయు విద్యార్థి) [తె]

పెటకం = ( ) విరోధం
(2) తంటా; వండ — వా రిద్దరి మధ్యా పెటకం వచ్చింది; పెటకం పెట్టినాడు [నె; గు]
(3) తమాషాచేసి పంపు [నె]
(4) అవరోధం [వి]
(5) పితలాటకము [నె-పొ]

పెటకొయ్య = గర్విష్ఠి; పెడకట్టె [శ్రీ]

పెటకొట్టు = అసాధ్యుడు; మాట వినని వాడు [వి]

పెటాకు = పెండ్లి పదమునకు వ్యతిరేకార్థముగా వాడు జంటపదము, పెటాకులు — పెండ్లిపెటాకులు లేకుండా [నె]
(2) వ్యర్థము, భంగము — వాడి పెండ్లి పెటాకులైంది [నె]

పెటార = పెట్టె

పెట్టమార్పుకోడి = అటు పుంజు, ఇటు పెట్ట కాని పేడికోడి [నె-ఆత్మ]

పెట్టిందాక = పెట్టినన్ని నాళ్ల [అ]

పెట్టిబండి = బాగుగ గట్టిగా పెట్టెవలె నిర్మించిన సవారిబండి, తాత్కాలికముగ చేసినది గూటిబండి; పెట్టెబండి [నె]

పెట్టు = దూరము— ఆ ఊరు చాల పెట్టు ఉంది [తె]

పెట్టుకొను = లంజను ఉంచుకొను—ఆమెను పెట్టుకొని ఉన్నాడు [నె; కర్నూ; అ; తె]

పెట్టుపోతలు = (1) అన్నం పెట్టుట, గంజి పోయుట. అనగా, పోషణ, రక్షణ— ఆయన పెట్టుపోతలలో లేను [గు; నె]
(2) చీర సారెలు; నగ నాణెములు [కరీ]

పెట్టుబడి = (1) సేద్యగాండ్రకు (వ్యవసాయమున నెల జీతగాండ్రకు) జీతము గాక ఏటేటా యిచ్చు అదనపు ధాన్యము (ధాన్యరూపకమైన బోనస్) — మా ఊళ్లో పందుము పెట్టుబడులు [నె]
(2) నలుగురికి వస్తువులను పంచుట [తె]

పెట్టుమందు = (1) అపచారము చేయుటకై ప్రయోగించు మందు [తె]
(2) వశపరచుకొనుటకై స్త్రీలు పురుషునికి పెట్టుమందు; పెట్టుకు మందు, గరము [నె]

పెట్టుశాపన = ఎడతెగని తిట్లు [కరీ]

పెట్టెబండి = పెట్టెవలె గట్టి చట్టము అమర్చినది. ఇది ఒంటెద్దు, రెండెద్దులకుగూడ గలవు × గూటిబండి — వెదురు తడకలతో వంచి కట్టిన గూడుకలది [నె]

పెట్టె = రైలు డబ్బా — ఆమెను ఆడవాళ్ల పెట్టెలో ఎక్కించినా [నె]

పెట్లదుమ్ము = (చూ) పెడిదుమ్ము [నె]

పెట్లు = (1) చర్మము గీతలు గీతయగా చిట్లు —ఒళ్లు పెట్లిపోయింది

(2) ప్రేలునట్టి ఉప్పు—పెట్లుప్పు [నె; తె; అ]

పెడ=(1) అరటికాయలు వరుసగా అంటుకొని యుండు గుత్తి; జీబు

(2) దిక్కు [శ్రీ; గో]

(3) చిన్న పరికయ్య [నె-మెట్ట; అ]

పెడకేక = పెద్దగా వేసిన అరపు— *పెడకేకలు పెట్టుచూ వచ్చిందిః* పెడబొబ్బ [నె]

పెడద్రము=మూర్ఖము— *వాడు బలే పెడద్రుడు, పెడద్రానికి పేద్దరోగానికి మందు లేదు;* పెడార్ధము [నె]

పెడసరము=(1)మోటు—*వాడు పెడసరం మనిషి;* మూర్ఖుడు [అ; తె]

(2) ఎగురు బోతుదనము — *పెడసరపు మనిషి* [నె, కర్నూ; అ]

పెడాకులు=(1) శ్రాద్ధము—*పెండ్లీ పెడాకులు;* పెటాకులు [వి]

(2) (చూ) పెటాకులు [నె]

పెడార్ధము= పెడసరముగా ఉండుట; పెడద్రము [అ]

పెడిదుమ్ము=నల్లమందు దట్టించి ప్రేల్చు సాధనము. ఒక గట్టి కఱ్ఱకు చివరన ఒక ఇనుపచిట్టెను బిగించియుందురు. మందు దీనిలో కూరి, చిట్టెకు క్రిందనున్న సన్న బెజ్జములో జానకి తాటితో నిప్పంటించి ప్రేల్తురు. ఇది పెద్ద శబ్దము నిచ్చును; పెట్లదుము [నె]

పెడుచు = కంచుపదును; Temper [కరీ]

పెడుముకొను = భోజనముచేయు [వి]

పెడుసు = (చూ) పెళుసు [వ]

పెణక= ఇంటి గోడలమీద నుంచి ఏటవాలు పందిలిగా దించిన భాగము; వసారా; వరండా [శ్రీ]

పెత్తనము=(1) పెండ్లిపెద్దలు పిల్లనిమ్మని అడుగుటకు వెళ్లుట

(2) పెత్తనము చేయు [అ; పె; నె]

పెత్తనాలు = పనికిమాలిన సుద్దులు—*ఆ పిల్ల పెత్తనాలమారి* [తె, నె]

పెదరాప్పూరు కాతా = మోసము, ఇచ్చిన ద్రవ్యము తిరిగి యివ్వకపోవుట [గు]

పెద్దకత్తిపెరుమాళ్లు=పెద్దలకు పెద్ద; బాగా మాట సాగించుకొనువాడు (పెరుమాళ్లు= విష్ణువు) [నె]

పెద్దకుక్క=లోడేలు

పెద్దకొత్త=రెండు కానులు [వి]

పెద్దజేయు=దీపమును ఆర్పివేయు—*ఆర్పివేయు అనుటలో అశ్లీల మున్నదని పెద్ద జేయి అంటారు;* ఇవి లేవు అనుటకు ఇవి నిండుకున్నది అన్నట్లుగా - *దీపము పెద్దయింది* [అ; బ]

పెద్దపండుగ = మకరసంక్రాంతి [నె]

పెద్దపిట్ట = గుడ్లగూబ [కర్నూ]

పెద్దపుస్తకము=పాత అచ్చు భారత రామాయణాది కావ్యము. ఇవి పూర్వం పెద్ద ఆకారంలో (¼ డెమ్మీ) అచ్చు వేయబడుటచే పెద్ద పుస్తకము లనబడేవి; చేట భారతము అన్నమాట గూడ ఈ ఆకారమును బట్టియే ఏర్పడి యుండును [నె; వ]

పెద్దపుస్తకం పట్టించు = విద్యార్థికి రామాయణాదులను చదువ నేర్పించుటను (పెద్ద పుస్తకము) ప్రారంభించు—*పిల్లకాయలకు పెద్దపుస్తకం పట్టించినాము* [నె]

పెద్దపేరీగలు=కొండలలో బెట్టు తేనెటీగలు —*పెద్ద తేనె, పుట్టతేనె* [నె-పొ]

పెద్దబండి=(1)సామానుల బండి [కరీ]

(2) రెండెద్దుల బండి × ఒంటెద్దు బండి [కరీ; నె]

పెద్ద మనిషగు= రజస్వల యగు [అ, బ; నె; తె]

పెద్దమ్మ=(1) దౌర్భాగ్యరాలు, జ్యేష్ఠాదేవి; గ్రామదేవత [తె]

(2) దౌర్భాగ్యుడు—వాడు పట్టి పెద్దమ్మ [నె]
పెద్దమ్మకు పసుపుకుంకుమకిచ్చిన భూమి =పనికిమాలిన క్షేత్రము [నె]
పెద్దమ్మవారు = స్ఫోటకము [చి; నె]
పెద్దరూక=రెండున్నరణా [చె]
పెద్దరెక్కము = పెత్తనము; పెద్దరికము [మ]
పెద్దలు = పితరులు [వి]
పెద్దాయన=అన్ని రంగములకోను నాయకుడు అయినవారికి వాడు పదము—పెద్దాయనతో చెప్పిరా [నె]
పెద్దవరుస = (1) పెద్దవయసు — ఆయన పెద్ద వరుస మనిషి
(2) యోగ్యత [నె]
పెద్ది = పెద్దతల్లి [చి]
పెద్దింటివాడు=మాదిగవాడు [నె, మ]
పెనబడు=పని చిక్కులలో పడు (పెనవేసికొనుట) [గు]
పెనము=బాణలివంటి మట్టిపాత్ర [చె; నె]
పెబ్బ=పెద్ద—బడిపెబ్బ; తరగతి పెబ్బ [వ]
పెయ్య=కట్టుకురాని ఆవుదూడ × బత్తెది పడ్డ [నె; తె; అ]
పెయ్యనాకుడు=తలమీద వెనుకకు మొలిచిన వెంట్రుకలగుడి. ఇది స్త్రీలకు వైధవ్య హేతువని వాడుక [వి]
పెరడు = ఇంటి వెనుక ఉండు విశాలమైన స్థలము, ఇందు కూరగాయలు మొదలగునవి వేసుకొందురు; పెళ్లు ;సంచు [చి]
పెరుగాకు = తోటకూరలో ఒకజాతి, ఇది కాడలుగా పైకిఎదుగక, కుకురుగా క్రిందనే అలముకొనును, కోసిన మరల ఎదుగుచుండును — పెరుగాకు పుల్లగూర; పెరుగు తోటకూర [నె]
పెరుగు తోటకూర = (చూ) పెరుగాకు [కర్నూ; అ]
పెరుమాళ్లు మాడు= అపచెద్దు; గంగెద్దు దక్షిణ దేశం]
పెల్ల వేయు = పైరు నాటుటకు ముందు కయ్య చదరము చేయు; నుసుగులువేయు [నె-పొ]
పెళుసు=(1) తాకిన విరుగునది— మునగ కొమ్మ పెళుసు
(2) స్వల్పమునకే విరాగము జెందు వ్యక్తి —ఆయన మనసు బలే పెళుసు; పెడుసు [నె; అ; తె]
పెళ్ల=(1) చిన్న మట్టి ఉండ—బియ్యంలో మట్టిపెళ్లలు ఉన్నవి; లోష్టం
(2) పారతో, గరికతో గూడ లేవదీసిన వెడల్పు భాగము — కట్టకు పెళ్లలు అతికించు
(3) ముక్క—పెళ్లలు పెళ్లలుగా లేచినది [నె; కర్నూ; తె; అ]
(4) ఇటుకపెళ్ల, పోతగా పోసి కాల్చినది. ఇండ్లు కట్టుటకు ఉపయోగించునది [అ]
పెళ్లు=అల్లరి, ఉద్రిక్తస్థితి— వ్యవహారము ఎందుకు ఇంత పెళ్లుకు రానిచ్చితిరి [కరీ]
పెళ్లు = పెరడు; ఇంటివెనుక దొడ్డి [చి]

పేకాట = చీట్లాట; ఇస్పేటు కాగితాలాట [సర్కా]

పేట = బజారు [సే]

పేటు = (1) కొండచివరన ముందుకు నెట్టు కొని వచ్చిన రాయి [నె-ఉదయగిరి]
(2) పర్వతాగ్రమున కోటగోడవంటి ఆకారము [చి]
(3) పనితనంతో అల్లిక వస్త్రపుటంచు—పేటంచు పంచ [నె]

పేటు = నిండుగా, పికాపికలుగా — పేటు రెండు బండ్ల చొప్ప [కరీ]

పేత్రేగు = కోపంతో హెచ్చుగా కేకలు వేయు [తూ-గో]

పేడ పుట్టకొక్కు = పేడకడిపై లేచు పుట్ట కొక్కు, పుట్టగొడుగు [వి]

పేడబుట్ట = పేడపురుగు

పేడెత్తు = మానులో పేడు లేచినట్లు అభి ప్రాయ భేదము కలుగు [నె, అ; వ]

పేతర = వివాదము; రగడ [గో]

పేదరాజు పెద్దమ్మ, పేదరాల పెద్దమ్మ, పేదరాసి పెద్దమ్మ = యాభై అరవై ఏండ్ల దాక, ఆంధ్రదేశ కథా వాఙ్మయంలో ఈమె ఒక కీలకపాత్ర. ప్రతి పల్లెలోను, పట్టణములోను ఉండవలసిన ధర్మశాలకో, సత్రానికో ఈమె పాలకురాలు. నైమిశారణ్య సత్రయాగాలలో శౌనకాది మహర్షులకు పురాణము చెప్పుచుండిన సూతుల స్థానము వంటిదే, ఆంధ్రదేశ జానపద కథాశ్రవణ ప్రకరణమున ఈ పెద్దమ్మ పాత్ర. వచ్చే పొయ్యే బాటసారులకు ఈమె మంత్రాలోచనలు చెప్పి కాలక్షేపము జరిపి, కతలుచెప్పి ఊరడించి దారిచూపేది. దేశంలో జరిగిన జరుగుచున్న సమాచారము ఈమె నోటిగుండానే ప్రసారితమగుచుండును. ఈమె కతలకు పుట్ట, మాటలకు నేర్పరి. సత్రంలోనే ఒక మూల ఉండే పూటకూళ్లిల్లు ఈమె సొంతము. తిన్నవారు ఎగవేసి పోయినట్లు మాత్రం ఇంత వరకు వినికిడి లేదు.

పాంథులు వచ్చి రాత్రి విడిది చేసి, ఈమె చేతి అన్నంతిని, నోటిమాటలు విని, దేశ కాలపరిస్థితులు ఆకళింపునకు దెచ్చుకొని, పరిశ్రాంతిని పొంది, తొలి కోడితోగూడ లేచి, ఎవరిపాటికి వాళ్లు పొయ్యేవాళ్లు.

విజయజిగీషులైన రాకుమారులకు దుర్గాధిపతుల వార్తలు సవిస్తరంగా చెప్పేది. ప్రణయార్తులైన యువకులకు ప్రియలబ్ధోపాయముల ఉపదేశించేది. వర్తకులకు సాగరాంత సీమ వాణిజ్య పద్ధతుల వివరించేది. ఇక స్థానికులకు ఈమె కథలే ఊరట; ఊరివారంతా వేసవి రేయి ఈమె దీపంచుట్టూ, చలికాలంలో ఆమె కుంపటి చుట్టూ మూగి ప్రపంచ వృత్తము వినే వారు.

ఈమెకు మగడుండిన పోలకువే కాన రాదు. అయినా "శివదీక్షాపరురాలనురా, శీలమెంతైనా విడువజాలనురా" అని ఒక జావళిలో ఆవేదన పడిన ఇల్లాలు వలెనే నడతలో కొరత లేకుండా నడచుకొన్నది. కాంచీపురానికి నంగనాచి, నెల్లూరుకు నెఱజానవలె, యావదాంధ్ర దేశానికి, ఈ పేద రాజు పెద్దమ్మ, తెనుగు దనంతో తొణికే మహిళామణి. ఆమెతో గూడానే, రస వత్తరమైన ఆ కథలు గూడ తెనుగునాట నుండి నిర్వాసనం పోయినవి

పేనుకొరుకు = తలలో బిళ్లలు బిళ్లలుగా వెంట్రుకలు ఊడిపోవు చర్మవ్యాధి [నె; [కర్నూ; అ; తె]

పేనుట=కయ్యమునకునమోదుచేయుట[కరీ]
పేరయ్య=శివుడు [వి]
పేరిగి_త్తితనం=పురోభాగిత; తానే ముందు పడుట [మ]
పేరుడు=(1) పేరుకొనినమట్టి
(2) వట్టినపాచి [నె; అ; తె]
పేరువాసి = (1) ప్రసిద్ధి—ఆయన పేరు వాని గలవాడు
(2) ఒకపేరు కలిగించిన అదృష్టము; పేరుబలం [నె]
పేరెము = (1) పందెము వేసుకొని పరు గెత్తుట [గో]
(2) పరుగు [నె-కనిగిరి]
పేలిపోవు=రంగు వెలిసిపోవు [కరీ]
పేలు=దట్టముగా, అట్టగా మొలచు — అత్తిపేలినది; అత్తి పేలినట్లు చెమట కాయ పేలినది
పేశము = మామిడిపండు మొదలగువాని రసము [గ]

# పై



పై=శరీరము — పైలోబాగలేదు [తె; నె]
పైకిపోవు=గర్వించు [కరీ]
పైకిపోసుకుసు=(శరీరమునకు) స్నానము చేయుట [నె; మ]
పైగడుగు=స్నానముచేయు; ఒంటినికడుగు [మ]
పైటన్నము = పైటివేళ సాయంత్రము (4-5 గంటలు) దిను అన్నము. ఫలహారమునకు మారుగా తినునది [నె; అ]
పైటాల=(1) మధ్యాహ్నము [కర్నూ]
(2) సాయంత్రము 4-5 గంటల సమయము పైటాళ; పైచేళ [నె]
పైటాళ=(1) మధ్యాహ్నం [కర్నూ]
(2) సాయంత్రము 4-5 గంటలవేళ. పైటాల; పైచేళ; పొగిటాళ [నె; కర్నూ; తె]
పైటివేళ = సాయంత్రం 4-5 గంటలు; పైటాల; పైచేళ [కర్నూ; నె; అ; తె]
పైటివేషము=(1) ఉదయం సాయంత్రము ఖిన్నభిన్న వేషములతో ఊరుదిరిగి, చివరన డబ్బు దండుకొను వేషధారి వృత్తి
(2) ఊరకే దుస్తులు మార్చువాడు, వేషధారి—వాడు పైటివేషగాడు [నె]
పైటివేషగాడు = బైరూపోడు; పరాక్కపోడు; లక్కోరోడు; బౌరూపోడు; తుపాకి లొట్టోడు, పగటి వేషగాడు [నె]
పైడికంటి=గూబవలెనుండు ఒక చిన్నపిట్ట, దీని కూత శుభసూచకము, చాల గట్టిగా కూయును — పైడికంటి మాదిరి అరచినాడు; పైడికంటె [నె]
పైడికాయ = నీళ్లకొబ్బరికాయ; ఎడనీరు కాయ; ఎళనీరుకాయ [శ్రీ]
పంపు = పెళ్లిలో మగపెళ్లివారికి, ఆడ పెళ్లివారు పంపు ఫలహారములు; బోనగిరి [మ]
పైడిముడుపు = పెండ్లికి ముందునాటిరేయి వధువుయింట జరుగు శాస్త్రము [చి]
పైడియన్నము = మొక్కజొన్న గటుక (అన్నము) [కరీ]
పైతూగు = ఒకనిపై ఒకడు పైకొనుచు పవాలుచేయు [కరీ]

పైత్యకారి=పిచ్చివాడు [నె; చి]
పైత్యం కుదుర్చు=గర్వమణుచు; గుణము కుదుర్చు [మ; నె]
పైత్యము=(1) పిచ్చి — పైత్యం పట్టింది [నె]
(2) వాంతి [అ]
పైనట్టినవు=లావుగ అయినావు [మ]
పైనా=దువ్వెన; పన్నె [శ్రీ; వి]
పైనిండు=(1) దేవత ఆవేశించు [తె]
(2) శివమెత్తు [మ; అ]
పైనీళ్లు = వెల్లువ, వరద—*పేటికి పైనీళ్లు తగిలినవి* [నె]
పైపంచ = ఉత్తరీయము, అంగవస్త్రము, ఖండువ × కట్టుపంచ, మొలపంచ; అంతరీయము [నె; కర్నూ; వ; అ]
పైపగులగొట్టు=బిళ్లవాయు గొట్టు; (పై=దేహము) [అ]
పైబట్టు = బండినొగ పైకి ఎత్తి వెనుక ఆనించు [కరీ]
పైమేపు=(1) పశువులకు గడ్డిగాక ఇతరముగా బెట్టు ఉలవలు, నున్న మొదలగునవి; బుట్ట మేపు [నె; వ; అ]
(2) గొప్పలు చేసి చెప్పుమాట—*పైమేపు మాటలెందుకు* [గో]
పైయి=శరీరము; పై [అ: తె]
పైరగాలి = (చూ) పైరుగాలి [సర్కా: కర్నూ]
పైరగు (పైరు+అగు)=ఆడపశువు ఎదఅగు—*పెయ్యా పైరైనది* [నె, వ]
పైరుగాలి = సాయంత్రము తోలు (వీచు) అగ్నేయపు గాలి, ఇది పైరులను బాగుగ పెంచును; పైరగాలి, సోలకము [నె; తె; అ]
పైవట్టించు = బండ్లు కలిసి వెళ్లేటప్పుడు పందెముతో ఒకదానిని దాటివేసి పరుగెత్తించు; బడాయించు [మ]
పైవట్టు=చియ్యబట్టు; బలియు [మ]
పైసలు = డబ్బు; ధనము; పైసాలు [క, కర్నూ, అ; తె]
పైసాలు = పైసలు; డబ్బు; పైసలు [కర్నూ]
పైసేద్యము = పైరుచేసి, అది కోతకువచ్చు లోపల చేయవలసిన ఇతర పనులు —*మిరపకు పైసేద్యం ఎక్కువ* [నె; తె, అ]

## పొ



పొంగడం=పులిబొంగరంవంటి తీపు తినుబండారము (పొంగించ బడినది) [నె]
పొంతణాలు=పొంగెడితీయటి అప్పచ్చులు [కరీ]
పొంగటినెల = మకరసంక్రాంతినెల; ధనుర్మాసము; పండుగనెల [చి]
పొంగన్నాలు = బురుబురీలు, హోటళ్లలో బజ్జీ అందురు
పొంగలాలు = పులి బొంగరములు [నె]
పొంగలి=మకరసంక్రాంతి; ఈనాడునట్టింట బొంగళ్లు పొంగించి, వచ్చిన పొంగులను బట్టి అగామి శుభాశుభముల నిర్ణయించుకొందురు. గుమ్మడిఆకులలో ఈ పొంగలిని వడ్డించుకొని తిందురు [నె-దక్షిణము చి; అ]
పొంగు=(1) స్ఫోటకము మొలుపుచూపు—*జ్వరము వచ్చి నిన్న పొంగుచూపింది* [నె-పా]

(2) ఉద్రేకము — *అంత పొంగెందు కయ్యా?* [నె]

పొంగురసము = మందుకుగా పొంగించిన ఒక విధమైన కషాయము — *జ్వరానికి పొంగురసం త్రాగించు* [నె; కర్నూ; తె; అ]

పొంగెత్తు = రాగి సంకటి చేయునప్పుడు వచ్చిన పొంగును తెడ్డుతో మెల్లిగా ఎత్తుచు తగ్గించు [నె-పొ]

పొంజు = పంజు; చివ్వేటి [సే]

పొంతె = (1) ఒక జాముకాలము — *ఎన్ని పొంతెలు మోట దోలినావు;* పూటలు [కరీ]

(2) వెంబడి — *నా పొంటినడువు; బాట పొంటి పో* [మ]

పొంతెలు = చాలసేపు [నల్ల; కరీ]

పొంతెపోవు = కొంచెముసేపు మోటకొట్టుటకు తోడుగపోవు [న]

పొంత = పొంతకుండ; వంటచేయు పొయ్యికి ఒకతట్టు గడ్డ, ఇంకొకవైపు గడ్డకు మారుగా అమర్చిన కుండ. దీనిలో నీరు బోసి యుంతురు. వంటతోబాటు స్నానమునకు ఇంచలి నీరుగూడ కాగియుండును [నె; కర్నూ; అ; తె]

పొంతనీరు = పొంతలో కాగిన నీరు — *పొయిలో వేస్తే పొంతలో తేలేవాడు* (అసాధ్యుడు) [అ]

పొంతికుండ = (చూ) పొంత

పొందిక = (1) అందము; అంగసౌష్టవము — *బొమ్మ పొందికగా నున్నది*

(2) సామరస్యము — *వారికి పొందికలేదు* [నె; కర్నూ; అ; తె]

(3) ఉండవలసినట్లు వుండుట [గో]

పొందుబాటు = ఎవరికైనా భూములను కౌలుకిచ్చి తిరిగి పొందించుకొనుట; మరల స్వాధీన పరచుకొనుట — *ఇంకా మా భూములు పొందుబాటు కాలేదు* [కరీ]

పొందువాట్లుచేయు = భూములు తొలకరికి ముందు కౌలుకు ఇచ్చి, వ్యవసాయమునకు ఏర్పాటుచేయు [మ]

పొందెయ్యి = జోడు కుదుర్చుకొని పనిని సాధించు [చి]

పొక్క = రంధ్రము; పెద్దతొఱ్ఱ [కరీ]

పొక్కబొడుచు = (1) అప్పు బుట్టించు

(2) కేపుగొట్టు [కరీ]

పొక్కు = (1) వడ్లు మొదలగు ధాన్యపు గింజలు తడిసి తెల్లబడిపోవు — *వడ్లు పొక్కిపోయినవి*

(2) మజ్జిగలలో ఏర్పడిన మీగడతొక్కలు [నె]

(3) శరీరము వాపుఎక్కు; పుండునుండి నీరుకారు — *పండ్లు పొక్కినవి* [కర్నూ-ప. కో]

(4) పుండుపై ఏర్పడిన ఎండుచెక్క [తె; నె]

(5) ముక్కపొక్కలు [అ]

(6) వదంతిరేగు, లేక రహస్యము వ్యాపించిపోవు — *ఆసంగతి ఊరంతా పొక్కిపోయినది* [నె]

పొక్కలి = ఇంటి నేలలో, అలుకనందున రేగు దుమ్ము, సాధారణముగ మట్టిఇండ్ల నేలను పేడ, ఎఱ్ఱమట్టి కలిసి అలుకుటకు ఆలస్యము అయిన ఇల్లు దుమ్మురేగి, పైపేడ వచ్చివేయును. దానిని పొక్కలైంది అందురు [మ]

పొక్కుగట్టు = (చూ) చెక్కుగట్టు; పక్కగట్టు [తె; అ]

పొగచూరు = వంటకములు పొయ్యిపై పెట్టినప్పుడు పొగచేత, రేగు ఒకవిధమైన వాసన — *కూర పొగచూరినది* [నె]

పొగపు = (చూ) పోపు; తిరుగబోత పొగచు; [అ]

పొగరు ఎగురవేయు = కావరముతో త్రుళ్లి పడునట్లు చేయు — *నీవు పొగరు ఎగర వేస్తున్నట్లున్నదే!* [నె]

పొగాకుతంబ = పొగాకు వేసికొని నమలు వారు నోటిలో నానబెట్టు పొగాకుముక్క — *నోటితంబతోనే మాట్లాడినాడు* [నె]

పొగిటాలవేళ = (చూ) పైటాల [అ; బ]

పొగిటాళ = సాయంకాలము 4-5 గంటల మధ్యకాలము, పగటివేళ; పైటాళ [అ]

పొగరుసింక = సముద్రపు పోటువలన కొంత కాలువవలె వెనుకకు వచ్చిన సముద్రపు నీటిపాయ (Back Water) సముద్రపు పొగరువలన ఏర్పడిన సింక అని; [గు-బాపట్ల]

పొచారించు = క్షేమము విచారించు [వి]

పొటమరించు = వ్యాధి అంకురించు — *పెద్ద రోగం పొటమరించినది* [నె; కర్నూ; అతె]

(2) బయటపడు [గో]

పొటుకరించుట = వెదకివెదకి సాధించుట [కరీ]

పొటుకు = (1) చిన్న అభ్యంతరము, ప్రతిబంధకము — *పరిష్కారానికి ఒక చిన్న పొటుకు ఏర్పడింది;* పటుకు [నె. అ]

(2) మిద్దెలో నీరు వెలయు

(3) పోరు; జగడము — *వారిని ఊరకే పొటుకు పెడతాడు* [తె]

(4) ఓర్వజాలని తనము [అ]

పొట్టకొచ్చు = పైరు పాలు బట్టి, గింజ కట్టుటకు ముందు పొట్టగా ఏర్పడు [తె; నె]

పొట్ట చేతబట్టుకొను = జీవనాధారమును చూచుకొనుటకు ప్రయత్నించు — *పొట్ట చేతబట్టుకొని ఇంత దూరం వచ్చినా* [నె]

పొట్టతాపత్రయము = అన్నచింత, సంసార చింత; కడుపాత్రము [కరీ]

పొట్టతిప్పలు = దినచర్యనుగురించి చేయు ప్రయత్నము; అనుదినాహారములేక అవసరములకు సేకరించుకొనుటకు పడు కష్టములు [కరీ]

పొట్టా? గట్టా? = నష్టమా? లాభమా? [చి]

పొట్టాత్రము = కుక్షింభరాసక్తి — *పొట్టాత్రానికి వచ్చినా;* కడుపాత్రము [నె]

పొట్కు = వాన పెద్దగా పడి, తరువాత ముసురు వేసినప్పుడు పాతఇండ్లు (మట్టివి) బొట్టుబొట్టుగా ఉరియుట [మ]

పొట్టి = మత్రగబ్బ; మంత్రగబ్బ [శ్రీ]

పొట్టు = ఉలవపొట్టు; బొత్తు [నె]

పొట్టుచేట = కళ్లములో ఏర్పడినపొట్టుకుప్ప; పైవిసరుచేట [నె-పొ]

పొట్టుబ్బరము = అసూయ — *వాడికి పొట్టుబ్బరం ఎక్కువ;* కడుపుబ్బరము [నె; తె; అ]

పొట్టురాసి = కుప్ప నురిసిన తర్వాత, గల్లపొట్టుతో కలిసిన ధాన్యమును చేసినకుప్ప × మేలురాసి [నె; ఆత్మ]

పొట్టురొయ్యలు = కూనరొయ్యలు [మ]

పొట్లి = పొట్లెలు

పొడఎండ (పొడెండ) = చెట్లక్రింద ఏర్పడు నీడతో కలిసి, కొమ్మలసందున దూరి తగిలిన ఎండ — *పొడఎండ పశువులకు మంచిది* [నె; తె]

(2) ప్రొద్దుగూకుటకు ముందువుండే ఎండ

(3) నీలాకాశంలో చిరువర్షంలో వుండే ఎండ [గో]

పొడకోడి = పెద్దమచ్చలుగల కోడి [నె]

పొడ గిట్టదు = ఒకరి నీడయైనా నచ్చదు; ఇష్టముగాదు — *వాడి పొడే నాకు గిట్టదు* [కరీ]

పొడ మరలక = గర్భములో పిండమునకు తిరిగే వీలులేక [కరీ]

పొడెండ=(1) అధికముగాని ఎండ [అ]
(2) చెట్లక్రింద ఏర్పడిన చిన్నచిన్న ఎడములు గల ఎండ; పొడ ఎండ [నె; కర్నూ; తె]

పొణకా=ఇంచుమించు బండి ధాన్యము పట్టు పెద్దబుట్ట; బొట్ట; పొనుక [శ్రీ]

పొణుకు=(1) బావి లోపలిభాగము
(2) బావి రాతి కట్టడములో క్రిందరాళ్లు తొలగి ఏర్పడిన వివరము — *బావిలో పొణుకు పడింది* [చి]

పొతక=ఆకు తోకుట్టిన చిన్నదొప్ప; పుటిక; పొత్తర [కరీ]

పొతుపు=చెడ్డను మంచిదానిగా సర్ది చెప్పు [కరీ]

పొత్తర=(1) తాటియాకుతో శంఖాకారంగా కట్టిన (అరటిమొగ్గ మాదిరి) పొట్లము; దీనిలో తాటిముంజులు తెస్తారు, ముంగము [తె]
(2) ఎండిన ఆకుతో చిన్న గిన్నెవలె కుట్టినదొప్ప, దొన్నె [నె; కర్నూ]
(3) పెద్దల పేరు జెప్పి పితృకర్మలలో బ్రాహ్మలకిచ్చు స్వయంపాకము [గో]
(4) ఆకులకట్ట [చి]

పొత్తిపోయు=ధాన్యపు కుప్పచుట్టు గుర్తుగ (ముద్రవలె) బూడిదపోయు [మ]

పొత్తివల్లె = పెండ్లికూతురుకు తెచ్చేపెండ్లి చీర [మ]

పొత్తెము = (చూ) పుత్తెము

పొత్తుల కుడుపు = ఒక కంచములోనే ఇద్దరు ముగ్గురు కలిసి తినుట— *పొత్తుల కుడుపువారు ఆత్మబంధువులు* [అ]

పొత్రము = పుస్తకముల కట్ట—*పుస్తకాల పొత్రం విప్పి చూడు* [చి]

పొదుగు చల్లారు = కోడిపెట్ట పొదుగుట పూర్తి అగు. కొన్ని పెట్టలు గుడ్లు పిగులక చెడిపోయినను పొదుగుచునే యుండును. అప్పుడు పెట్టను నీటముంచి పొదుగును చల్లార్చెదరు [నె]

పొదువు = వేయించు [అ]

పొద్దుంగాల = వేకువ [వి]

పొద్దు = దూషణము [నే]

పొద్దుగలక = పెందలకడ; పొద్దు క్రుంకక ముందే [అ-పె]

పొద్దుగాల = సాయంత్రము ప్రొద్దు క్రుంక కుండగనే [మ]

పొద్దుగూకులు = పొద్దస్తమానము; దినమంతా; ఎల్లప్పుడు—*పొద్దుగూకులు ఒకే పనిగా చేసినా* [నె; అ; బ]

పొద్దుపొంటె = రెండు పూటలు పని చేయుట [కరీ]

పొద్దుపోవు = (1) కాలక్షేపము చేయు; ఉబుసపోక — *నాకేమీ పొద్దు పోవడం లేదు* [నె; కర్నూ]
(2) ఆలస్యమగు — *పొద్దుపోయి వచ్చినాడు; పొద్దుపోయి నిద్రలేచినాడు* [అ; నె; తె]

పొద్దుమూకి = సంధ్యాసమయము; పొద్దుగూకి [మ]

పొద్దు వడసారము తగ్గు = ఎండ వేడిమి, తాపము తగ్గు [నె]

పొద్దొస్తము = పొద్దుగూకులు; ఉదయాస్తమానము—*వాడికి పొద్దొస్తం తీరికే లేదు* [నె]

పొనుక = ధాన్యమును బండిపై గొంపోవు కంకిగంప; పొణక [కరీ]

పొన్నద్దుకము = వప్పులు పోటు పెట్టుట [వ]

పొన్నూరు=ఒక గ్రామమునకు, పైనున్న గ్రామము — *బుచ్చిరెడ్డిపాళెమునకు పవ్వూరు పొన్నూరు* [శ్రీ]

పొయిలు = (1) వేళ—*ఎండ పొయిలు*

(2) గుబులు — *జ్వరం పొయిళ్లు పొయిళ్లగా వస్తున్నది* [నె]

**పొయ్యి అరచు** = వంట సమయములో ఒక్కొక్కప్పుడు, కట్టెలు కాలుచు ఒక శబ్దము చేయును, ఇది చుట్టములు వత్తురను సూచనగా భావింతురు; పొయ్యి ముసురు [నె]

**పొయ్యిముసురు** = పొయ్యి అరచు — *ఇది చుట్టాలు వస్త రనుటకు సూచన* [మ]

**పొరక** = (1) కాగితాల పైల్ [కరీ]

(2) వాసాల పైకప్పు, వావిలి పొరక; కొడిసె పొరక; దంతి [కరీ]

(3) చీపురుగట్ట — *పొరకతో కొట్టింది* [నె]

(4) చెడ్డ—*పొరకసుడి* [నె]

**పొరకసుడి** = పశువుకు ఏర్పడిన చెడ్డసుడి, పొరకసుడి ఎద్దుకు ఉన్నయెడల ఇల్లు పొరకతో ఊడ్చినట్లు నాశన మగునని విశ్వాసము [అ; నె]

**పొరకసుడివాడు** = దౌర్భాగ్యుడు [నె; కర్నూ; అ; తె]

**పొరటు** = (1) వేపు; పొరుట

(2) ఒక కూరను పొడిపొడి అగునట్లుగా వేయించు—*పొరటు కూర* [నె]

**పొరి** = వండిన శాకము (ఇది వైష్ణవ పరిభాష) [కరీ]

**పొరికి** = ఇల్లిల్లు తిరుగువాడు [చె]

**పొరుకాసు** = సగము కాలిన కట్టె [మ]

**పొరుటు** = చిన్న చిన్న చిదురుగా బాణలిలో వేయించినది — *కోడిగుడ్డు పొరుటు;* పొంటు [నె]

**పొరుటుకూర** = వరిపిండిలో మసాలా కలిపి, బాణలిలో పొడిగా పొరిటిన కూర [నె]

**పొరుపు** = అంటు; పొరుపు [కరీ]

**పొరులు** = చెరువులో అదనపు నీరు పొర్లి పోవు కలుజు; అలుగు [శ్రీ]

**పొరువులు** = అననుకూలత — *వాళ్లిద్దరి మధ్యా పొరువులు పుట్టాయి* [గు]

**పొర్లు** = (1) పశువు మూపు, కట్టుట, నాటుట [శ్రీ]

(2) పుల్లిరుసు (మూ)[అ-పె]

**పొలం** = (1) మాగాణి [కరీ]

(2) అడవి [మ]

(3) సేద్యపు భూమి (మెట్టగాని మాగాణి గాని)—*పొలం పోయినాడు* [నె]

**పొలపరి** = అడివిలో కట్టెలుగొట్టి అమ్ముకొని జీవించువాడు. ఇది Filfer=చిన్న దొంగతనము చేయు, అను మాట నుండి పుట్టియుండు నని కొందరు. [నల్లమల ప్రాంతం]

**పొలస** = రుచికరమైన ముళ్లచేప [అ-గో]

**పొలి** = (1) పంటలో ధాన్యము ఉబికి వచ్చుట—*ఈయేడు మంచి పొలి అయినది* × పొలి పోయింది

(2) జాతరలలో బలిగా అర్పించు రక్తాన్నము [నె; కర్నూ: అ; తె]

(3) పోలిక [శ్రీ]

**పొలికట్టె** = నురిసిన ధాన్యమును తూర్పార బట్టిన వెనుక, క్రిందబడిన గింజల రాశి నుండి, తప్పటాలు అరకాయ గింజలను వేరుచేయు పరక [గు]

**పొలికలుగు** = కళ్లములో ధాన్యమును తూర్పార బట్టునపుడు ఎత్తిపోయు తొలి చేట, ఇది ఎత్తుచు "పొలికలుగు పొలో పొలి" అని అందురు; పొలిగలుగు [చి]

**పొలికేక** = (1) జాతరలలోను, కుప్ప నురుపిడులలోను వేయు పెద్ద కేక, పెడబొబ్బ

(2) పెద్దకేక —*పొలికేక వేసినారు* [నె; కర్నూ; అ, తె]

**పొలిగలుగు** = ధాన్యమును కొలుచుటలో ఒకటి అనుట. రైతు పొలిగలుగు అనగా, వ్యాపారి లాభం కలుగు అనును. ఆవల యుద్దమను రెండు అందురు. చివరన

ఇరవై బదులు వెలగ అందురు [నె; కర్నూ; వ]

పొలిగాడు = కళ్ళములో ధాన్యము తీయునపుడు (పొలి కలుగుటకు = పెరుగుటకు) పూజించు దేవత; వినాయకుడు [గు]

పొలిగోలిగ పాట = (చూ) ఓలిపాట [వ]

పొలిజల్లుట = గ్రామదేవతల కొలుపులలో పొలి అనగా, బలితీసిన వస్తువులను గ్రామ మేరలందు చల్లు పూజా విధానము; పొలి దిరుగుట [చి]

పొలిదబ్బ = పచ్చి తాటిదబ్బను, చేత పట్టుకొనుటకు అనువుగా చేసినది, సాధారణముగా పశువుల గుంపును తోలుటకు ఉపయోగింతురు [నె]

పొలిదిరుగు = (1) గ్రామ గుడికట్టు చుట్టూ (*పొలిమేర చుట్టూ*) జాతరలలో బల్యన్నము (నెత్తురు కూడు) ఎత్తుకొని, పొలికేకలతో తిరిగి వచ్చి దేవతకు అర్పించుట ఇది చాల ప్రధానమైన తంతు. దీనివలన గ్రామమునకు సర్వశ్రేయములు ఒనగూడునని విశ్వాసము; పొరుగూరువారు దీనిని తాకరాదు. [నె, కర్నూ; తె]

(2) కొలుచుటకు ముందు పొలములో ధాన్యపురాశికి చుట్టును జిల్లేడు ఆకు చేత బట్టుకొని మూడు పర్యాయములు ప్రదక్షిణము చేయు [అ]

పొలిపదాలు = గ్రామ దేవత జాతరలలో దేవతకు ప్రీతిగా పాడునట్టి బూతుపాటలు —*పొలి పదాలు మొదలు పెట్టినాడు అనగా,* బూతులు ప్రారంభించినాడు అని [నె]

పొలిపెర = జాడ; చిహ్నము [మ]

పొలిబెడ = కళ్ళమును శుభ్రపరచు పొరక; దీనిని ఆకుమట్టతో కట్టుదురు [నె-పో]

పొలిబోయిన బ్రతుకు = సంతానములో ఇది వరకు నష్టపడిన జీవనము [కరీ]

పొలిమేర = (1) పోలిని (బలిని) తీసికొని తిరుగవలసిన గ్రామపు ఎల్లలు; గ్రామ సీమాంతము — *పొలిమేర దాటి గొట్టినాడు* [నె: కర్నూ; తె]

(2) పొలముల మేర [అ]

పొలుచు = (చూ) పొలుసు [గో; అ; వ, నె]

పొలుపదాలు = బూతు లేక, కుప్ప నురిపెడు లప్పుడు పాడు యాలపాటలు [నె]

పొలుపు = పది నిముసముల ఎండవేడిమి

పొలుమూలు = పొలిమేర [కరీ]

పొలుసు - (1) చేపల చర్మముపైన ఏర్పడి యుండు బిళ్ళల పొక్కులు — *పొలుసు తోము*

(2) నీచువాసన — *పొలుసుకంపు కొట్టినది;* పొలుచు [నె; అ; తె]

పొల్ల = పోరి; అనాధ బాలిక [కరీ]

పొల్లకట్టు = పట్టగా (మట్టగా) మిగిలిన పొల్లు ధాన్యము [కరీ]

పొల్లి = చిన్నపిల్ల: పోరి; పోలి [తె]

పొల్లు = (1) అస్థిరమైన మనస్సు — *ఆయన పొల్లు మనిషి ;* గుబులు మనిషి

(2) ఉన్నట్లుండి మనసు రేగు — *పొల్లు రేగింది* (Whimsical) [నె]

పొల్లుకట్ట = కళ్ళాలలో ధాన్యాన్ని తూర్పార బోసిన తరువాత కట్టగా ఏర్పడిన పొట్టు, తాలుకట్ట [గు]

పొల్లుకట్టలు = ఏటివెల్లువ నీళ్ళు పొర్లి పైకి వచ్చి తీర గ్రామములకు దెబ్బ తగులకుండ ఉండుటకు, నదికి ఇరుప్రక్కలా పోసిన పెద్దకట్టలు. వీటిని నదీ ముఖ ద్వారమునకుపైన 30, 40 మైళ్ళ నుండియే నిర్మింతురు; వెల్లువకట్టలు (Flood Bunds) [నె]

పొల్లుకూతలు = వ్యర్థవాక్యములు [తె]

పొల్లుగుడ్డు = పిల్ల పిగులుటకు అవసరమైన జీవకణములు (కలిలము) లేని కోడిగుడ్డు —(Vegetable egg) *పుంజు ప్రొక్కకుండానే పెట్ట గ్రుడ్లు పెట్టుననుట*

ఇప్పటి బహిరంగ రహస్యము; ఊబ గుడ్డు

పొల్లుబాకీలు = వసూలు కాబడని బాకీలు [అ]

ప్రొద్దుగూకులు = ఉదయాస్తమానము; దిన మంతా—ప్రొద్దుగూకులు ఒకటే పని. పొద్దుకూకులు [నె]

# పో



పోకపొత్తరము = పోకచెట్టు బొందె అట్టతో కుట్టినది; దొప్ప [అ]

పోకిళ్లు = అక్రమచేష్టలు, వెర్రి వేషములు [గో]

పోకు = దొంగతనము — ఆ యింట్లో రాత్రి పోకు పోయింది [చి]

పోగంత = చనిపోవుకాలము — పోగంతకు దుర్బుద్ధి పుట్టినది [కరీ]

పోగగు = దాపురించు — నాకది ఎక్కడ పోగైందో తెలియదు [నె; అ]

పోగాకు = మగగురి [వి]

పోగు = (1) చెవులకు కుట్టు సన్నటిలోహపు తీగ—కుట్టుపోగు; ముక్కుపోగు - నవాబు భార్యకైనా కుట్టుపోగులే [నె; కర్నూ]
(2) పోగరతో రాచు — ఈ కమ్మిని కొనలో పోగి తీసుకురా [చి]
(3) జందెము—వాని మెడలో పోగుపడ లేదు [తె; అ]

పోగుపోయు = పచ్చినూలుతో మంగళ సూత్రమును పేని సిద్ధముచేయు [చి]

పోగులుపోయు = బాగుగా సంపాదించు; హేళనార్థంలో సంపాదించి కుప్పలుపోయు చున్నాడనుట — సంపాదించి పోగులు పోస్తున్నాడు [కరీ]

పోగులువేయు = గొర్రె, పొట్టేలు మొదలగు వేటలను కోసి కుప్పలు పెట్టుట, ఇట్టికుప్ప లను పంచుకొనుటలో అమ్మటలో జరుగును —నిన్నుకోసి పోగులవేయ, పోగులుబెట్ట అనితిట్టు [కరీ, నె]

పోగువేయు = నాగటెద్దులపై వారినె సర్దుచు భారము పూన్చు — దాపలెద్దుపై పోగే యుము [కరీ]

పోగెత్తు = ప్రస్తావించు—ఆయన అనంగతే పోగెత్తలేదు [నె; అ-పె]

పోచికోలురాయుడు = లేనిపోని డంబాలు చెప్పుచు కాలము వెళ్లబుచ్చువాడు [గు]

పోచు = పోపు; పోసు; తిరుగమాత [కరీ]

పోటాకు = వరి మొదలగునవి, వెన్నుతీయు టకు ముందుతీయు చివరి నిర్రమైన ఆకు —పైరు పోటాకు వేసింది; కోటాకు [నె]

పోటి = (1)వ్యవసాయదార్లు పరస్పరము తమ కాండ్లతో ఇంకొకరి పనికి తోడ్పడుట— మేము వాండ్లకు పోటిపోయినాము; తోడిడి [తె]
(2) గిరాకిలేని వస్తువును గిరాకిగల సరుకుతో జోడించి అమ్ముట—జొన్నలానికి చక్కెర పోటిపెటి అమ్మినారు [నె]

పోటుగ్రమ్ము = నదిలో ప్రవాహమెక్కువై ఒడ్డు ఒరయు [కరీ]

పోటెండ = తీక్షణమైన మధ్యాహ్నపుటెండ [గు]

పోట్లమారి = చీటికిమాటికి కయ్యానికి కాలు దువ్వేఎద్దు [నె; కర్నూ; అ; తె]

**పోడు** - (1) కష్టము — *వాడిపోడు ఎక్కువైంది*
(2) బలవంతము—*ఇవ్వామని పోడుచేసినాడు*
(3) ఎక్కువైన—*పోడుగాలి;* పోరుగాలి ఎత్తుగాలి; పోరు [నె; కర్నూ; తె]
4) కొండమీద అడవికొట్టి కాల్చుట [వి]

**పోడుగొట్టు**=(1) అడవి నరికి పొలమును సాగుకు అనువుచేయు [నె-పొ]
(2) చెట్లుగొట్టి ఊరు పొందించు, (ఊరికి తీసికొనవచ్చు) [కరీ]

**పోడుగోలు**=పనికిమాలినవాడు, బాడుగోలు [చి]

**పోతపాలు** = బిడ్డకు తల్లిపాలులేక పోసిన అన్యమైనపాలు—*పోతపాలులో ఎదిగిన బిడ్డ* × తల్లి పాలు [చి; నె]

**పోతి**=మరణించినట్టిది; శవము [అ]

**పోతుగడ్డ**=వీరభూమి — *ఈ ఊరు మంచి పోతుగడ్డ* [తె; నె]

**పోతుగాడి**=వడ్లు మేలురాసి చేసిన తర్వాత, క్రింద నేలమట్టములో రాసి చుట్టు తీసిన లోతుగాడి; గీత, దానిని కదలించకుండా జేయుటకు యిది ముద్రవంటిది; మొలతాడు (తీయు) [నె]

**పోతు బలిసిపోవు**=సత్తువ ఎక్కువై, పైరు ఎక్కువగా ఆకు బలిసిపోవు, దీనివలన పంట తగ్గును [నె]

**పోతురాజు**=గ్రామదేవతకు ముందు ఊరేగుచు ముందు నైవేద్యము గొనువాడు, ఎడమచేత ఖండించబడిన తల, కుడిచేత ఖడ్గముగల యీయన గ్రామదేవతలు వందమందిలో చిన్నవాడు; పోలేరమ్మ యీయనకు అక్కవదెనో [చి; నె]
(2) ఏపని చేతగానివాడు — *పనికిపోతురాజు, తిండికి తిమ్మరాజు* [గో]

**పోతుముడి**=గట్టి ముడి [చి]

**పోత్రము**=పొగరు, పోతరము [శ్రీ]

**పోథీ**=వయ్యి; పుస్తకం [కరీ]

**పోపు**=(1) తిరుగమాత; తిరుగబోత; పొగపు; పోచు; పోసు [సర్కా]

**పోబెరుగు** = మితిమీరి పెరుగు — *పైరు పోబెరిగినది* [నె-పొ]

**పోయినాడు** = (1) వెళ్లినాడు — *ఆయన ఇప్పుడే పోయినాడు* [నె; కర్నూ]
(2) చనిపోయినాడు, ఇట్లే వెళ్లిపోయినాడంటే నెల్లూరుప్రాంతములో చనిపోయినాడని అర్థము [సర్కా]
(3) సంగమించినాడు—*దానితో పోయినాడు* [అ; నె; తె]

**పోరటి** = ఒకరు ఇంకొకరికి పంపిన తినుబండారములు [శ్రీ]

**పోరడు**=పిల్లవాడు × పోరి [వి; తె]

**పోరి**=(1) పిల్ల [మ]
(2) దాసిపిల్ల [వ; కరీ]
(3) తలిదండ్రులు లేనిపిల్ల పొల్లి; పోలి × పోరడు [మ]

**పోరు**=(1) ఎక్కువైన—*పోరుగాలి*
(2) పిల్లకాయలు ఏదో ఒకటి కావలెనని చేయు రచ్చ, పెట్టు హరము — *వాడిది ఒకటే పోరైంది* [నె; కర్నూ; తె]

**పోరు**= (చూ) పోడు [అ]
(3) బాధ— *అత్తగారి పోడు బడలేక* [అ]
(4) గుక్కపట్టి ఏడ్చు [గు]

**పోరుకాడు** = తీవ్రముగా ప్రయత్నించు— *ఎంత పోరుకాడినా పని కాలేదు* [నె]

**పోర్వ**= అంచులేని తెల్లనిబట్ట [చి]

**పోలక**=ఒక రకపు గువ్వపిట్ట [కరీ]

**పోలి** = (1) చెడుత్రోవ త్రొక్కినవాడు [సే]
(2) ఆడుపిల్ల; పోరి; పొల్ల [వి]

పోలిగాడు = విదూషకుడు — *పోరా జుట్టు పోలిగా;* పోలుగాడు [చి]

పోలిపాట = (చూ) ఓలిపాట [గో]

పోలుగట్టులు = పెద్దబండి నొగలు [మ]

పోలు పైకెత్తు = రెండెడ్ల బండికి వెనుక బరువెక్కువై కాడి పైకి లేచిపోవు; లేవగు

(2) ఎవరైన జబ్బుపడి బలహీనమగు

(3) నష్టపడు [గు]

పోలుపొందులేని = ఒకరీతి ఒక పద్ధతి లేని; చాలుమూల లేని [కరీ; నె]

పోలుబోయు = పెండ్లి పందిరిలో పిండి ముగ్గులు దీర్చి బియ్యము వరుసగా పేర్చు విధానము [కరీ]

పోలెలు = పోళీలు (భక్ష్యాలు) [మ]

పోలేరమ్మ = స్ఫోటకము— *పోలేరమ్మ పోసింది;* మొలుపు చూపింది [నె; అ]

పోల్లడు = అనాథ బాలుడు [కరీ]

పోవడి = వాలకము; పోబడి [కరీ]

పోసాని = ఎఱుకల సాని; ఒక నాగరీకమైన స్త్రీ [కరీ]

పోసికాలు = (1) పోషణ. గంజిపోసి కాపాడుట అనుట—*ఆయన పోసికాల క్రింద ఎవరూ లేరులే* [నె; అ]

(2) సరసపు మాట; పోసికోలు [గో]

పోసికోలు = (1) వ్యర్థ ప్రసంగము [గు]

(2) సరసపుమాట, పోసికాలు [గో]

పోసు = పోవు, తిరుగమాత, పోచు [కరీ]

పోసుకోరు = నమ్మరాని మాటలు [కృ]

పోసుగోలు = అడుక్కొని తినువారు [చి]

పోసెట్టి = కోమటివారి పేరు [కరీ]

పోళీలు = బొబ్బట్లు [చి]

ప్రత్తివిడుచు = ప్రత్తి రాట్నముతో గింజలు వేరుచేయు [గు]

ప్రదక్షిణాలు = పురుషుడు ఒక స్త్రీకై ఆమె ఇంటిచుట్టు తారికాడు చుండుటలు [నె; తె]

ప్రసిమిసి = ప్రస్తావన,—*దాని ప్రసిమిసే అక్కడ రాలేదు* [నె]

ప్రస్తము = గర్భాధానము; ప్రస్తుతము [అ]

ప్రస్తుతము = గర్భాధానము; ప్రస్తము [అ]

ప్రాణంబట్టి = లావు అగు [మ]

ప్రాణాచారము = (1) (చూ) వరపడుట

(2) విడువక ఒకరిని అతి దీనముగా అర్థించు—*వాడు ప్రాణాచారం బడి తీసికొన్నాడు* [నె]

(3) అభీష్టసిద్ధికి చేయు దీన ప్రయత్నము [కృ]

ప్రాయ దూడ = పెయ్య

ప్రాయము = ఒడ్డును ముట్టుట [అ; బ]

# బ



బంక = లోభితనము—*ఆయన బలే బంక* [మ; నె]

బంకపని = సులభముగా వగతెగనిది [అ]

బంకులు = చతుశ్శాల భవంతి ముందుండు, పైన కప్పువేసిన అరుగులు; సాధారణముగ మగవారంతా కూర్చొని వ్యవహారాలు జరుపుచోటు; పంచ [మ]

బంగపోవు = బ్రతిమాలు; భంగపోవు [అ; నె; బ]

బంగారక్క = తోలుబొమ్మలాటలో వాడ వదినె, (చూ) కేతిగాడు [నె, చి]

బంగురు = ప్రాకు — పడవ నేర్చి బంగురి నట్టు [వి; శ్రీ]

బంటుగూటము = ఎద్దులను విప్పి, అదే ఎత్తులో నిండుబండి నిలుపుటకు ముందు నొగ క్రింద పోటీబెట్టుకొయ్య; బండి గూడ; కయికాడి

బంటుగూటము = బండికి ఎద్దులుకట్టియుంచి నట్లే నిలుపుటకు బండిపట్టమునకు వెనుక ఆనించు పొట్టికర్ర; × ఇట్లే ముందు నొగకు పోటీపెట్టు దానికి కయికాడి అందురు [నె-మెట్ట]

బండ = చిన్నరోకలి [తె; నె]

బండమనిషి = (1) సిగ్గులేనివాడు [తె]
(2) మొరటుపట్టుగల మనిషి [నె]

బండవాలము = పెట్టుబడి, మూలధనము, బండారము; బండాళము [అ]

బండారము = (1) సామర్థ్యము
(2) రహస్యము — నీ బండారం బయట పడిందిలే [కర్నూ, నె]
(3) సొమ్ము
(4) మూలధనము; బండవాలము; బండాళము [మ]

బండారము = (1) గ్రామదేవతల ప్రసాదముగా నిచ్చు కుంకుమ; బండారు [సే]
(2) పుట్టమట్టి; పాలుపోసి వచ్చునప్పుడు తీసికొనివచ్చునది; ఇది ప్రసాదమువంటిది; [కర్నూ]

బండారు = గ్రామదేవతలకు పెట్టిన కుంకుమ, పసుపు [కరీ; చి]

బండాలము = రహస్యము [చి]

బండాళము = (1) సొమ్ము
(2) మూలధనము; బండవాలము; బండారము [వ]

బండి = 20 బస్తాలు; 1 పుట్టి [నె; మ]

బండికడీలు = వంకరటింకరగా ఉండి, గుంజలుగ పాతుటకు అక్కరకు వచ్చు కట్టెలు [మ]

బండికుంబము = ధర్మరాజుల తిరునాళ్లలో బకాసుర వధనాడు, బండిని అలంకరించి భీముడు (వేషగాడు) బండి తోలుకొనుచు రాగా, ఇంటింటా అన్నం మక్కెరలో (జల్ల) పోయుదురు. సాయంకాలం కాగానే ఆలయ మైదానములో బకాసురుడు (వేషధారి) వచ్చి భీమునితో కలియబడి వధింపబడు యీ ఉత్సవమును బండి కుంబమందురు; బండికుంభము [చి; నె]

బండిబుడ్డి = చక్రము యొక్క ఆకులు చేరే చోటు; కుండ [నల్ల]

బండిసున్న = బండిచక్ర మంతటి సున్న అనుట; పూజ్యము; బొత్తిగాలేనిది [నె]

బండు = (1) రోత — బండుకూతలు [నె]
(2) బురద; బరుదు [కరీ]

బండుండ = బండిచక్రము, పిల్లలు తోలుకొని ఆడుకొను చక్రము [వి]

బండుగడుగు = ఒకరి తప్పులన్ని ఎత్తిచూపి తిట్టు [కరీ]

బండుబాగోతము = (1) పచ్చి బూతుకూతలు
(2) అధికమగు హల్లా [కరీ]

బంతి = రాగి, సజ్జ, అరి, వరి మొదలగు వాటిని నురుచుటకు పశువులచే తొక్కించునపుడు వరుస ఏర్పడుటకు వాటి మెడలకు కట్టిన, మెడ పలుపులు గలిగిన మోకు; మేతకు కట్టివేయు దామెన వంటిది [అ; పె; వ]

బంతికూడు = పంక్తిగా కూర్చుండబెట్టు వడ్డించు అన్నము — నాకు బంతికూడు పట్టదు [చి; నె]

బంతిచాప = భోజనమునకు ఎక్కువమంది కూర్చుండుటకు మూరెడు వెడల్పున పొడుగుగా వుండెడిచాప [కృ; నె]

బంద = (1) తమలపాకుల చిన్నకట్టలు కలిపి కట్టిన పెద్దకట్ట; పంద; సుడి [నె-ఆత్మ]
(2) లేత పొట్టి తాటిమాను; బొంద — *తాటిబంద గుంజుతీయి* [నె-ఆత్మ]

బందము = వరిచేని పంపు [కరీ]

బందరుపిచ్చోడు = మతి స్థిమితములేనివాడు; దేనికి కొరగానివాడు. తలవెంట్రుకలు చెదరిన వారిని, ఈ మాటలో సంబోధింతురు [చి]

బందరుబరానీ = నెల్లూరు నెఱజాణవంటి పదము. బందరు ప్రాంతపు స్త్రీ చాలా గడుసరులు, అని ప్రతీతి

బందా = రొఖ్ఖము, *బందాగా రూపాయ యిచ్చాను*, నాణెమని భావము [చి]

బందికాడు = వరములు బిగించుకొని నందున చిన్న చిన్న అడుగులతో కష్టము మీద నడచు—*బందికాడుతూ వచ్చినాడు* [నె]

బందిరి = బందిరి (లి) దొడ్డిలో పశువులను వేసినందుకు చెల్లించు రుసుము, బంది; బందె [అ-పె]

బంధుబెట్టు = మానుకొను [కరీ]

బందే = గ్రామ సమష్టి కార్యములలో పాల్గొనని వారికి ఊరి పెద్దలు వేయు అపరాధము [చి]
(2) చేతికి తగిలించుకొను ఆభరణము [అ]

బందెకాడు = ప్రియుడు; తగులము గలవాడు [మ; అ]

బందేలదొడ్డు = (1) దొంగ పశువులనుతోలి అపరాధము వసూలు చేయుదొడ్డి; బందెల దొడ్డి [వ]

బందే = నమస్కారము [కరీ]

బంప = గల్ల (దగ్గితే వచ్చునది) [చి]

బంబు = వెదురుబొంగు — *బంబులు కొట్టి కొటాయి వేశారు* [చి]

బక్కబరుడు = ఎండిన నేల నెరియలలో నుండు పాము, ఇది కరువదు గాని నాకినచో చర్మవ్యాధి ఏర్పడును; పరుగడు [నె]

బక్కలు = దుక్కిపెళ్లు [శ్రీ]

బగాది = గాలివాన [శ్రీ]

బగార = మాంసములేని పొలావు అన్నము [మ]

బగ్గంపాడు = భగ్నము, నాశనము [తూ-గో; తె]

బగ్గి = గుఱ్ఱపుబండి
(2) ఒంటిమీద ఏర్పడిన గీత [గో]

బచ్చల = ఇంటిలో స్నానము చేయుచోటు —*బచ్చలగది*; బచ్చలి

బచ్చలి = స్నానాలగది— *జాలారి* [కర్నూ]

బచ్చలిల్లు = స్నానము చేయుగది [అ; సే]

బచ్చెనకుండలు = (చూ) అరివేణి; అరిమెన [చి]

బచ్చెనకోల = కొడుపు, పూరీలు చేయు కఱ్ఱ [మ; వ]

బచ్చెనలెట్టు = రంగుచేయు [తె]

బచ్చెల = స్నానాల గది [సే]

బజారు = వారపు సంత; వీధి [తె]

బజీతు = (1) సిగ్గు విడిన మనిషి — *ఆపె ఒక బజీతు ముండ*
(2) పరువు ప్రతిష్ఠ లేని; పజీతు [నె; కర్నూ; అ; తె]

బజ్జి = వంకాయ, సొరకాయ మొదలగు వాటిని వండి, ముద్దగా ఎనించినకూర— *వంకాయ బజ్జి* [నె; కర్నూ; అ; తె]

బటకాయించు = (1) మోసగించు, బటాయించు [తె]
(2) పొగరు ఎగురవేయు — *బడవపశు బటాయిస్తున్నది* [నె]

బటువాయి సంచి = (1) వక్కాకు సంచి

(2) డబ్బుల సంచి. దీనికి ఎఱ్ఱని బట్ట, తెల్లని చారలు, మూతికి కంచు ఉంగరాలలో దారము గలవు [చి]

బటువు = (1) వివాహ సమయమున ప్రధానములో ఉపయోగించు ఉంగరము [గు]

(2) ఆనుకొనుటకు లావైన దిండ్లు; ఆనుడు దిండు [అ]

(3) పెద్ద ఉంగరము [అ]

(4) కాలి బొటనవ్రేలికి పెట్టు వెండి ఉంగరము; మెట్టె [తె]

బట్ట = (1) మైల అయినట్టి; లేక స్త్రీల బహిష్టతో మైలఅయిన గుడ్డ అని తిట్టుగా వాడబడు మాట, *ఓరి నాబట్ట* — అని స్త్రీల తిట్టు [నె; అ; తె]

(2) ఒక వన్నెలో, ఇంకొకవన్నె మచ్చ —*బట్టెద్దు* [నె]

(3) సుఖరోగ విశేషము (గనోరియ) [వ]

(4) స్ఖలనము [వ]

బట్టముచ్చోడు = బట్టలపై అత్యాసక్తి కలవాడు [మ]

బట్టి = బోదె [శ్రీ]

బట్టోళ్లు = బట్రాజులు; కవివాండ్రు [చి]

బట్లర్ ఇంగ్లీషు = అరకొరల ఇంగ్లీషు; గ్రామ్యము. ఇంగ్లీషు వారింట వంటచేయు (= బట్లర్) మనదేశీయులు ఉపయోగించు వచ్చిరాని ఇంగ్లీషు — Four mans Sir [నె]

బల్లె = ఆముదము వండి తీసి దానిని మరల కాచుకొనునట్టి మట్టిపాత్ర — *ఆముదపు బల్లె* [నె-షా]

బడ = బక్కచిక్కిన— *బడోడు, బడావు* [అ-పె]

బడప = తెలివిలేనివాడు [తె]

బడరోకలి = చిన్న రోకలి, బుడకొయ్య [చి]

బడాన = వెంటనే; బడుగ్గున [అ; బ]

బడి = (1) వెంట, వరుస; సాలుపు — *పెన్నబడి గ్రామములు* [అ]

(2) ఎక్కువ—*బడివిడిచిన ముండ బజారుకు పెద్ద;* బరితెగు [నె]

బడిచెప్పు = ఒకడన్నది, తక్కినవారు వెంబడిగా బలుకు (బడిలో పిల్లకాయలు పలికినట్లు) [అ]

బడితె = (1) ఎండిన లావుకఱ్ఱ

(2) అదుపాజ్ఞలు లేక తిరుగు స్త్రీ గాని, పురుషుడు గాని [నె; కరీ]

బడిపెద్ద = వీదిబడులలో పెద్దగా నియమింపబడిన విద్యార్థి; పెచ్చె [నె, తె]

బడుద్దాయి = (1) బద్దకస్తుడు; సోమరి [గో]

(2) అప్రయోజకుడు [గో; నె]

బడుప = (1) ఒకతిట్టు

(2) ఆకు పూత లేక ఎండినచెట్టు [మ]

బడ్డీ = కిళ్లీకొట్టు, మొదలగు వానిని ఉంచుకొను కఱ్ఱ రేకుల గది; బంకు [గ]

బణంగి = (1) అబద్దాల పుట్ట

(2) రౌడీ [కరీ]

బతాయి = వంట యింట్లో ఉపయోగించే చారు గిన్నె [మ]

బతావనీ = (1) పట్వారీ (కరణం) లెక్కలలో సరిచూచుకొనుట

(2) కొలకుండల హెచ్చు తగ్గులను సరిచూచు కొనుట [కరీ]

బత్తల = నగ్నము; దిగంబరత్వము, బరిబత్తల; బరిమేను [మ; రా]

బత్తాయి = ఒకజాతి రుచిఅయిన నిమ్మపండు (బటేవియాజాతి) [సర్కా]

,, గజనిమ్మ [నె]

,, చీని [రాయ]

,, సాతుక్కుడి [దక్షిణం]

బత్తాసు = (1) పిండి చక్కెరలో కలిపి పాగుచేసి బిల్లలుగా చేసిన తినుబండారము బొత్తాము [అ; వ]

(2) గుండి—చొక్కాబత్తాను [నె]

బత్తెము = ఒక పెద్ద మానును తొలిచి పడవగాచేసినది. ఇందు ఒకరిద్దరే కూర్చుండి పోగలరు; ఇవి ముత్తుకూరు ఉప్పుటేరు (కండ్లేటి ముఖద్వారము) లో వాడబడు చున్నవి—బత్త్యాలలో దాటి వచ్చినాము [నె]

బత్యము = (1) (చూ) బత్తెము [నె]

(2) దినవెచ్చము — ఆయన ఇచ్చినవి యీనాటి బత్తెమునకు (బత్త్యానికి) సరిపోయింది [నె]

బత్తెముతీరిపోవు = చనిపోవు, గింజలు దీరిపోవు

బదనాము = (1) బాధ్యత; బదనాయము [అ]

(2) కష్టము [అ]

(3) చెడ్డపేరు; [తె]

బదనాయము = (1) బాధ్యత—బదనాయం పెట్టుకోకు [నె]

(2) సంబంధము — దాంట్లో నాకేమీ బదనాయంలేదు: అదేమి బదనాయమా! [నె; తె]

(3) తప్పు [చి]

(4) కష్టము—నీవు వెళ్లిపోయినా నాకేమీ బదనాయము లేదు [చి; గు]

బదాబదలు = (1) సంబంధం లేకుండా విడిపోవు;

(2) చెల్లాచెదరగు [అ, బ]

బదాలు = (1) పెద్దచినుగులు— పంచబదాలు బదాలుగా చినిగిపోయింది [నె]

బద్రింపు = పునాది గోడపైన గోడ కట్టునపుడు రెండుప్రక్కలా మిగిలించిన భాగాలు; పత్రింపు; పత్తిరింపు [గు]

బద్ద = (1) తాటి మొదలగువాటిని నిలువుకు చీల్చిన పొడవు కంబము. — తాటిబద్దలు

(2) మినుము పెసలు మొదలగు వాటి పప్పు, బేడ

(3) పలకపాటు—బద్దగా చెక్క; దబ్బ [నె; కర్నూ; తె; అ]

బద్దగు = అప్రతిష్ఠపాలగు; అగౌరవముచెందు —నేను ఈ వ్యవహారములో బద్దయిపోతిని [అ]

బద్దమానంచేయు = కొలత పావులు సరిగ ఉన్నవో లేవో చూచు, బద్దించు [మ]

బద్ది = (1) గోలీల ఆటలో ఆటగానికి స్థావరమైన చిన్నగుంట—అది నా బద్ది [నె; వ; కరీ]

(2) స్త్రీ యోని [వ]

(3) గుడ్డ నేయునపుడు పెద్దచావులోపంచ పంచకు నడుమ వదలు పేక (అడ్డనూలు) లేని భాగము — బద్దికాడికి చించు; బద్దె [నె]

బద్దించు = (1) సేరు మున్నగు కొలత పాత్రతో మరొక పాత్రను కొలిచి సరిచూడు; బద్దమానం చేయు [తె; అ]

(2) గొణిగితిట్టు—ఊరక బద్దిస్తుంటుంది [తె]

బద్దికాల్చు = గోలీల ఆటలో నిర్ణయమైన (గుంటలో) బద్దిలో గోలని పడవేయు—ఆ బద్దిని కాల్చినా [నె]

బద్దినుస్సు = గట్టి కావలా, కాపుదారి [కరీ]

బద్దిరింపు = కొంతపైకి కట్టబడినగోడ వెడల్పు తగ్గించుటకు వదలెడిగాడి, పత్తిరింపు [గు]

బద్దు = నిర్బంధము [అ]

బద్దుచెడు = పూర్తిగా దిగజారిపోవు [కరీ]

బద్దెబడు = పని ముగియవచ్చు [కరీ]

బనాతుపచ్చడము = జమిలిదుప్పటి (రెండుపేటదుప్పటి) [కరీ]

బన్నసరాలు = ఆభరణాలు [కరీ]

బప్కా = ఇంట నీళ్లుకాచుకొను బాయిలర్ [కరీ; వ]

బబ్బురు = వస్త్ర గాలితములచేయగా మిగిలిన పొల్లుపొట్టు [కరీ]

బమ్మెత్త=భ్రమత; బమ్మెర [అ]
బయట కంసలవారు = పొరుగూరినుం వచ్చిన కంసాలి; బయటికమ్మరి [చి]
బయటపడింది = ముట్టయింది; రజస్వల అయింది [వి]
బయటి కమ్మరి=గ్రామ గ్రామ నికి కొలిమి పనిముట్లతో పోవుచు, ఊరిబయటగాని, గ్రామచావిడి దగ్గరగాని తాత్కాలికముగ కొలిమి ఏర్పరచుకొని, ఆ ఊరి కమ్మరి పనిచేసి ముగించి వేరొక గ్రామమునకు పోవుచుండు ఇనుప పనివాడు. వీరు రాజ స్థానమునుండి తురక దాడులకు పరుగెత్తి వచ్చినవారు. ఇప్పుడు ఆయా గ్రామాల లోనే స్థిరవాస మేర్పరచుకొని నిలిచిపోయిరి; వీరి భాష వేరు. నెల్లూరులో నేటి బయటి కమ్మరి వీధి వీరిదే [నె; అ]
బయటికిబెట్టు = ఊరకే విరేచనములగు — *అతడికి బయటికి బెట్టినది* [హై]
బయటికిపోవు = అధికాచమానమునకు పోవు; నీళ్లచాయపోవు [నె]
బయసుమాలు=ప్రాలుమాలు [కరీ]
బయిసి=(1) సత్తువ [చి]
(2) సిగ్గు; పరువు—*బయిసిమాలి* [నె]
బయ్యడు=నీచుడు [కరీ]
బయ్యెము=భయము — *బయ్యెంతల బల్లి బావ పక్క పుణ్ణోసింది* [వి]
బయ్యా=పిచ్చివాడు, ఛాందసుడు; బరియా [గ]
బరక=(1) పనికిరాని పొలము [తె]
(2) నూక [అ; నె; వ]
బరకతు=లాభము [కరీ]
బరకమ్మి=అంచనాకు తక్కువ [కరీ]
బరడ=(1) రవ్వ, బరక; నూక [నె]
(2) శెనగపిండి, ఉల్లిపాయతో కలిపి చేయు కూర. దీనిని మహారాష్ట్రి బ్రాహ్మణులు తెలంగాణంలో చేయుదురు [మ]
బరబసు=నునుపుదనము [కరీ]
బరాతము=(1) అప్పు ఇచ్చు వరకు ఒక మనిషిని ఋణస్థుని దగ్గర పెట్టుట: తరువు [చి]
(2) ఒకరు ఇంకొకరికి ఇవ్వ వలసిన దానిని యివ్వమని మూడవ వానికి అప్పగించునది—*నీడబ్బుకు అయనకు బరాతం పెట్టినా* [నె; కర్నూ]
(3) తగాదా— *వాని బరాతం ఎక్కువైంది* [తె]
బరి=(1) పశువుల బోర ఎముక [నె; కర్నూ; అ]
(2) గీత; నియమము
బరిక=(1) ఎండిపోయిన తాటిమట్ట; కమ్మ; బరిగ; బజ్జ [నె]
(2) చిన్న రెమ్మ [తె]
(3) రువ్వ
(4) బెత్తము [కరీ]
బరిగ=బెత్తెము; బరిక [కరీ]
బరితెగు=పూర్తిగా తెగించి, సిగ్గువిడుచు— *బరి తెగితే బాగోతం*; బడివిడుచు [ప; వి]
బరి పెరికిళ్లు పీకు = కోయనక్కరలేక చేతులతోనే పెరుకు [కరీ]
బరిబత్తల = దిసమొల, నగ్నము; బత్తల; బరిమేను [మ]
బరిమేను = నగ్నము; బత్తల; బరిబత్తల [కరీ]
బరియా=ఛాందసుడు; బయ్యా [గ]
బరుకు = (1) ఇష్టము వచ్చినట్లు ఆకులు పెరుకు—*ఆకు బరుక్కురా* [మ]
(2) చిక్కిర బిక్కిరగా వ్రాయు—*కాగిత మంతా బరికి వేసినారు* [నె; కర్నూ; అ]
(3) గిలుకు [గో]
(4) పెద్దగా గట్టిగా గోకు

బరుడు=బట్టలపై పేరుకొనిన బురద — *బరుడు కడుగు* [నె]

బరువుదించుకున్నాడు = మృతిని పొందినాడు [మ]

బరువులు దించుకొను=పీనుగును మోసినవాళ్లు తరువాత చేసుకొను ఒక తతంగము [అ]

బర్తంపట్టు=సాధించు; భరతంపట్టు [నె]

బర్తిబండి=సామానులబండి దీనిపై కప్పు ఉండదు [మ]

బఱ్ఱ = (1) బెత్తెము; మెల్లె—*చింత బఱ్ఱలతో చావగొట్టారు* [చి; అ]

(2) బరిక; ఏండిన కమ్మ [అ]

బఱ్ఱులు=బఱ్ఱెలు; గేదెలు; ఎనుములు; బర్లు [తె]

బఱ్ఱెకుక్క=చిన్న బఱ్ఱె [వ]

బఱ్ఱెముక=ప్రక్క ఎముక [నె]

బలంపీట = (1) బరువుమూటలు పెట్టుటకు ఉపయోగించు పొట్టి మొంటుకొయ్య చట్టము [నె]

(2) వెడల్పు ఎత్తుగలిగిన బెంచి; బలము [నె]

బలబల=కొంచెము కొంచెము — *బలబల తెల్లవారింది* [నె· వ; అ]

బలబలాపురి = ఎవ కి వారే యైపోవు [కరీ]

బలము = వెడల్పుబెంచి — *బలంమీద పండుకో* [నె]

బలముచేయు=ఎరువులు వేయు [కరీ]

బలరక్కసి=నాగజెముడు; నాగమల్లి [నే]

బలవా=మీదబడి కొట్టడము; బల్వా [కరీ]

బలిగుడు = చెడుగుడు (క్రీడావిశేషము); కబాడి [చి; నె]

బలిచెక్క=ఏటికాల్వలో ఇసుకత్రవ్వి ఎత్తి మెట్టకువేయు సాధనము [ఓ]

బలుపు=గర్వము [మ]

బలుపుదింపు=గర్వమణచు [మ]

బల్ల=రెండు మద్రాసు శేర్లు; అరతూము [చి]

బల్లకూర్పు=మిద్దెలాడుటకు క్రింద దంతెల మీద పరచు చెక్కలు [నే; అ]

బల్లపాటు=పఱపుగా; అడ్డపాటు [కరీ]

బల్లీలు=వాసము వంటివి [మ]

బవంతి=(1) పెద్ద పెంకుటిల్లు; భవంతి [నె]

(2) ఇంటిముందరి హాలులో గాలి, వెలుతురులకై కొంచెము ఎత్తుగా కట్టినది [తె]

(3) గృహాంతర్భాగమున నుండు కప్పు లేని చోటు; బవుంతి; తొట్టికట్టు [చి]

బవుంతి=(చూ) బవంతి [చి]

బస = తాత్కాలికమైన విడిది — *నెల్లూరు బసకు రా* [నె; కర్నూ; వ; అ]

బసవన్న = గంగిరెద్దు [చి]

బసవి=(చూ) బసివి [వ; అ]

బసారము=అతి విరేచనాలు [కరీ]

బసివి = (1) పరువు లేనిది, వ్యభిచారిణి

(2) స్వేచ్ఛావిహారిణి

(3) కన్నడ దేశములోను, బళ్లారి అనంతపురం జిల్లాలలోను యింటి ఆడపడచును ఒకతెను, బసవేశ్వరునికిగాని, పశుపతికి గాని అంకితము చేయుదురు; ఆమెను బసివి అందురు. ఈమె దేవదాసియై భోగము వనితవలె పెండ్లి చేసికొనక, నిత్య సుమంగలిగానే రసికులతో సంసారము చేయుచుండును. ఈమెకు సంఘములో న్యూనములేదు ఈమె పుట్టినింటనే ఉండిపోవును. ఈ బసివి స్త్రీ అయినను తండ్రిఆస్థిలో భాగముపొందును ఈమెకు సంతతి కలిగినను అగౌరవము లేదు. ఈ ఆచారము శూద్రులలోను, కన్నడ లింగాయతులలోను గలదు — *లేకలేక ఒక బిడ్డ కలిగితే అది బసివి అయింది* [రా]

బళ=(చూ) ఉలవాయి [అ]

బళపము=బలపము; బళాపము [అ]

బళాపము=పలకపుల్ల; బలపము; బళపము [అ]

బళ్లారినూనె=కుసుమలనూనె [నె]

# బా



బాండీ=బాణలి

బాండ్లి=మూకుడు; బాండలి [సే]

బాక=వద్దు; బోకు—*తాక బాక;* ముట్టుకోకు [నె; తె]

బాకి=పెద్ద—*బాకినోరు* [వ]

బాకినోరు=వికారపునోరు [పొ]

బాగశాలి=(1) భార్య
(2) ఒకతిట్టు, బాశాలి [అ-పె]

బాగాలు=వక్కపొలుకులు [తె]

బాజీబందు=స్త్రీలసందిట ధరించు నగ; రెట్ట కడియము, బాజుబందు [నె-పొ]

బాజుబందు=స్త్రీలసందిట పెట్టుకొను ఆభరణము; కేయూరము; బాజీబందు [నె-పొ; మ]

బాటబడు=ఆచారమగు [కరీ]

బాటు=తూకపురాయి [కరీ]

బాడవ = నీళ్లు నిలుచు పల్లపు ప్రదేశము; పడవ; వాద — *అది బాడవ పొలము* (ఉరుదు) [నె; సర్కా]

బాడి=బురద [గో]

బాడిగ = అద్దె — *బండిబాడుగ;* ఇంటి బాడుగ; బాడుగ [నె; గ; రా]

బాడిగె=బాడిగ; అద్దె; కిరాయి ]అ]

బాడిద=కొయ్య చెక్కుట కుపయోగించు సాధనము దీనికి పొడవైన కఱ్ఱబిగించి యుందురు; బాడిస [శ్రీ]

బాడు= కుంటిన ధనము (ఉరుదు) [తె]

బాడుగ=అద్దె; కిరాయి, బాడిగ [నె; రా]

బాడుగోలు = (1) పనికిమాలిన — వాడు *బాడుగోలు మనిషి* [నె]
(2) జారిణి [చె]

బాడుచాకిరి = వెట్టిపని [తె]

బాణాకఱ్ఱ = పొడుగాటి కఱ్ఱ; లాఠి; చెడి [అ; నె; బ]

బాత = రెంటి ప్రదేశములమధ్య ఎల్లగీత [కరీ]

బాతాలు = బడాయిలు, డంబములు — *బాతలపోతు* [వ]

బాతుకోడి = బాతు [సే]

బాదరబంది = తగులాటము, ఇబ్బంది — *ఏమీ బాదబంది లేనివాడు* [నె]

బాదు = (1) గుంజను బాగుగ కూరి నాటు —*గుంజల బాదినారు* [నె; తె; అ]
(2) కట్టుట [గో]

బాదులు=(బాదిన=నాటినవి) తాటాకుఇళ్లకు వందిళ్లు వేయుటకు భూమిలో నాటు పొడుగాటి కందిమలు (గుంజలు); బాజాలు[గు]

బాన = పెద్ద కుండ
(2) నీరెత్తు తలుముయొక్క ఇనుప పాత్ర; *కపిలబాన;* ఇది సాధారణముగ తోలుదిగనుండును, కపిలగూన [నె; కర్నూ; అ; తె]

బాన్లి = బూర్లముకుడు; మూకుడు [మ]

బాపనకప్ప = బాకురుకప్ప; గోద రుకప్ప [వి]

బాపనతెలుపు = స్వచ్ఛమైన తెలుపు— *బాపన తెల్లెద్దు* [చి; నె]

బాపన పశెద్దు = కొమ్ములు గిట్టలు కండ్లు ఎరుపుగా నుంచు తెల్లటి ఎద్దు—*బాపన పశెద్దు బాగా యీడుస్తుంది*: బాపనతెలుపు ఎద్దు [నె-పొ]

బాపన బల్లి = తెల్లబల్లి [వి]

బాపాక్రం = అంతా తనకే కావలె ననెడి కోరిక [శ్రీ]

బాప్ప = తండ్రికంటె పెద్ద మేనత్త [వి]

బాబు = నాయన [కరీ]

బామ్మ = నాన్నమ్మ [వి]

బాయి = (1) చనుబ్రాలు (పిల్లలు అనుమాట)
(2) చన్నులు, చాచులు [వ, నె]

బారకట్టు = ఇబ్బంది—*దానిపిల్ల ఏమిబార కట్టు వచ్చినా నే నున్నాగా* [నె-ఆత్మ]

బారకన్ను = మెల్లకన్ను [వి]

బారకించు = (1) శరీరము బడలి అవయవ చలనము మందగించు
(2) బాధతో మొద్దుబారు — *తల బారకించింది* [నె; అ]

బారివాటము = కపిల ఎద్దులు లాగుచు దిగు జారివలె వాటముగా నుండునది; (slope); బారువాటము [నె; అ]

బారు = (1) ఉదారము—*చాల బారుగుణము* [నె, తె]
(2) ఆర్భాటము— *బూరుబారుమని పెండ్లి చేసినాడు* [కర్నూ]
(3) తుపాకిమందు; *బారునింపి కొటినాడు* [వ]; *బారుచేసినాడు* [వ; నె]

బారుకట్టు = నాగలినొగ; ఏడికోల [శ్రీ]

బారుబడాయి = ఆరంభశూరత్వం [కరీ]

బారువడ్డీ = అంతకములలో వడ్డీని అసలులో చేర్చని వడ్డీ (Simple interest) × అంతకపు వడ్డీ; చక్రవృద్ధి [నె]

బారువాటం = (చూ) బారివాటం [వ]

బారూదు = తుపాకిమందు [కరీ]

బారపు పిల్లలు = బేరగాళ్ల ఊళ్లకు వచ్చి కొనుక్కొని పోయే కోళ్లు [మ]

బాలపుస్తకం = పిల్లలకు దడుపుజ్వరం వచ్చినపుడు కట్టు తాయత్తు [గు]

బాలమ్మను చేయు = సాధారణంగ బాలింతలు పూజించే దేవత బాలమ్మ, పాపను తొట్లెలో వేసేనాడు మాంసంతో కాని, తీపితోకాని, ఈమెకు నైవేద్యం పెట్టుదురు. గుగ్గిలపు పొగకాక నిప్పుపై నూనె వేసి "పాలదార నాకు, నూనెదార నీకు" అని మ్రొక్కుదురు. ఇది ఇట్టితంతు [మ]

బాలసంతపు వాండ్లు = విచిత్రమైన కూర్పాసమువంటి అంగి ధరించి, గంట ఊపుతూ వచ్చి, బిచ్చం తీసుకొనేవారు. వీరికి పాతబట్టలు ఇస్తే సంతానం కలుగునని నమ్మకం [మ]

బాలేపండు = అరటిపండు [అ-దక్షి]

బాల్చి = బొక్కెన, బకెట్టు [వి]

బాల్టీ = (1) వాల్దీ, బాల్తి (Bucket) [శ్రీ]
(2) బాల్చి, బాల్చా [శ్రీ; వి; ఉ-గో]

బావమీద బరాతం = నిష్ప్రయోజనమైనది [సర్కా]

బావిలీలు = కర్ణభూషణము

బావురు = (1) శూన్యత—*ఆ పెద్దిల్లు బావురుమంటున్నది* [నె; తె; అ]
(2) చిన్నబోయిన స్థితి [గో]

బావురుగాడు = బావురు పిల్లి; పెద్ద పిల్లి [కర్నూ; తె]

బాసతప్పుడోడు = మాట తప్పువాడు; అబద్ధీకుడు [నె]

బాసింగము = బాషికము; బాసికము; శుభిక [అ; ఐ]

బాసిపీట = రెడ్డిగము వేసి కూర్చుండుట (చూ-రెడ్డిగము) [తూ-గో]
బాసేలి = (1) ఒక స్త్రీ ఇంకొక స్త్రీని నిర్దేశించుటకు ఉపయోగించు పదం; బొడ్డి— ఆ బాసేలి వచ్చిపోయింది [నె; అ; తె]
(2) భార్య—మా బాసేలి [చి]
బాళిక = మన్నిక [అ; బ]

# బి



బింకి = కల్లులొట్టి [న]
బింగణ్ణ = జీరంగి; వానకాలములో తిరుగు రెక్కల పురుగు [తె]
బింగరము = తాత్కాలికోద్రేకము— *వానికి బింగరము లేచింది*
బింగిమేక = చెవులు ముడుచుకొని పోయిన మేక [నె-పొ]
బింగిచెవులు = వెనుకకు మరలిపోయిన చెవులు [కరీ]
బింగిరాళ్లు = ఇసుకలో నుండు నున్నని రాళ్లు [కర్నూ]
బింగిరి = యతిమతము; పిచ్చి సంచు— *బింగిరి చేష్టలు* [నె; తె]
బిందిగె = నీటి కుపయోగించు తామ్రపు పాత్ర—*బిందె* [సే]
బిందిపాము = బల్లివంటి చిన్నపాము; దీని తోక ఎఱ్ఱగా ఉండును; నలికీచు [వి]
బిక్కట్టు = చాల యిబ్బంది [కరీ]
బిక్కలము = వ్రాసిన పత్రములు చివర, వ్రాసినవాని చేవ్రాలు; దస్తూరి; సంతకము [కర్నూ; అ]
బిక్కిపండు = జామపండు [సే]
బిగజారు = బీజారు [నె-అత్మ]
బిగడాయించు = భీష్మించు [వి]
బిగడాయించు = మలకబెట్టి, (మెలిబెట్టి) వెళ్లిపోవు; బెగడాయించు [కరీ]
బిగబట్టు = (1) ఇవ్వవలసిన పైకములో కొంత నిలుపుట— *పైకం బిగబట్టినారు* [నె; కర్నూ; అ]
(2) ప్రాణాలు బిగబట్టు, ఊపిరి బిగబట్టు [వ]
బిగుతుగా = బిఱ్ఱుగ [తె]
బిగురు = (1) పొగరు—*చింతచెట్టు బిగురు చూడు, చిన్నదాని బిగురు చూడు*; బిగువు
(2) మిడిసిపాటు—*ఏమిటిరా అలా బిగురుతున్నావు?* [వి]
బిగువు = (1) గుడిసె తడకెను బిగించెడు అడ్డకొయ్య; బిఱ్ఱు [నె, గు]
(2) గడ్డిమోపు ప్రమాణము [కర్నూ; అ; తె]
(3) ఐదుమూరల దారముచుట్టుకొలత [చి]
(4) బారెడు తాడుకు సరిపోవు గడ్డి— *నాలుగు బిగువులు కసువు ఐదులు తీస్తావా?* [చి]
బిగెడు = ఎకరము [కరీ]
బిచ్చి = (1) చిన్నపిల్లల మూత్రము
(2) పిల్లల మర్మస్థలము [వ]
బిచ్చు = (1) మొనదేలిన రాతిముక్క

(2) కంప నరుకు చిన్న గొడ్డలి; ఆకు గొడ్డలి [తె]

బిటుకు = ఎంకి నిస్సారమైనది [కరీ]

బిట్టుబిట్టు = గట్టిగా [కరీ]

బిడాయించు = దుప్పటి గప్పుకొని, కాళ్లు బిఱ్ఱబిగ్గి పడుండు [కరీ]

బిడారు = బండ్లు గుంపుగట్టి, అడవి మార్గమున పోవునది; సార్థవాహము [నె, తె]

బిడారుదయ్యము = బిడారు వర్తకుల శ్రీ మార్గమధ్యమున మరణించి, అయిన దయ్యము [వి]

బిడుకోలు = (1) ఇబ్బంది

(2) మాటగాని, నిర్ణయమునుగాని తప్పిన చెల్లించవలసిన అపరాధము

(3) పరిహారంతో కూడిన ఒప్పందము, లేక షరతులు = Penal conditions — *బిడుకోలు షరతు*

బిడుగు = (1) తోటగట్టున నున్న చిన్న బీటినేల [నె-పా]

(2) (చూ) బిడువు

బిడువు = (1) విశ్రాంతి, [సే, అ]

(2) బీడు; బిడుగు

(3) ఖాళీజాగా; చోటు — *ఆ గదిలో బిడువు లేదు* [తె]

(4) బావిలో మట్టి పడకుండా చుట్టూ మట్టి ఎత్తిన భాగం; బిడుగు [చి] (చూ) బిళవు [అ]

బిడ్డపాలవేళ = సేద్యపు పనులు చేయు బిడ్డ తల్లులు, మధ్యన ఇంటికి పోయి బిడ్డలకు పాలిచ్చి వచ్చువేళ; చంటివేళ [నె: వ; అ]

బిడ్డపాలు = పల్లెలలో శ్రీమంతమైన సంసారము, పేదల చంటి బిడ్డలకు ఉచితముగ పోయు మేలైన పాలు; ఇట్లే వరిఅన్నము గూడ పెట్టుదురు, దానిని బిడ్డ మెతుకు అందురు [నె; తె]

బిడ్డమెతుకు = (చూ) బిడ్డపాలు [నె]

బిడ్డ సొంగ్యము = పురిటి పండుగ నాటి శాస్త్రోక్త విధి [చి]

బిడ్డీ = పెద్ద వెండిచెంబు [ఉ-వి]

బితుకు = భయము [శ్రీ]

బిత్తల = దిసమొల, దిగంబరత్వము [తె; రా]

బిదకలు = దుమ్ములు (ఎముకలు) కలిసిన మాంసము (కూర); చితకలు [వి]

బిదువు = విశ్రాంతి; విరామము [కర్నూ-పరమటి తాలూకాలు]

బినబిన = బిరబిర, త్వరగా [కరీ]

బిన్నా = త్వరగా—*బిన్నారా* [నె-దక్షిణం]

బిన్నించు = ఎదిరించు; వ్యతిరేకించు—*కార్తె బిన్నించినది* [కరీ]

బిరడాబెట్టు = పూనిన దయ్యమును వదలించు (చూ) సీసాలోకి దించు [నె]

బిఱ్ఱు = (1) నిండు — *బండికి బరువు బిఱ్ఱుగా వేసినారు* [నె]

(2) గర్వము [మ]

(3) ఆంక్ష—*బిఱ్ఱు బెట్టినారు* [అ]

(4) తడికెకు కట్టు బిగువు [నె; తె]

బిలముబండ = గనిలో త్రవ్విన నాపరాయి [అ]

బిల్ల = బావిగిలక; బిళ్ల [అ; బ]

బిస = (1) వేగము; *బిసబిస పోతున్నాడు* [అ]

(2) యంత్రపు కీలకము — *దానికి బిస చెడి నిలిచిపోయింది* [నె; వ]

బిసపెట్టు = (1) ఆంక్షపెట్టు [అ]

(2) బెట్టును, గురుత్వమును కలిగించు [నె]

బిసాతు ఎంత = నీ లెక్కేమిటి [తె]
బిసెక్కించు = పురిపెట్టు; ప్రేరేపించు [తె; నె]
బిస్తరు = పక్కచుట్ట; పరుపు [కరీ]
బిళువు = మట్టిగుంట త్రవ్వినప్పుడు, సులభముగ పని అగుటకు, మట్టి పైకి చేర్చుటకు వీలగునట్లుగా ఏర్పరచుకొనిన లోతు పరిమాణము; బావి రెండు బిళువులు తెగినది; బిళువు (వరి పైరు కోతలలో ములము అన్నట్లు) [నె]
బిళ్ల = (1) ఒకరకము స్త్రీ రోగము [వి]
(2) బావిగిలక; బిల్ల [అ; బ]
బిళ్లగోచి = కుచ్చెబోసిపెట్టిన గోచి [తె; నె]
బిళ్లజోడు = కళ్ల జోడు; సులోచనములు [వి]
బిళ్లదూలము = బావిపై నీళ్లు తోడుటకు వేయు బలమైన అడ్డకట్టె [కరీ]
బిళ్లబిట్టుగా = ఉన్నదున్నట్లుగా — *ఇంటి కప్పు బిళ్లబిటుగా కూలిపోయింది* [గు]
బిళ్లలమోకు = బండ్లపై సరుకు కట్టేతాళ్లు బిగించుట గిలకలు గలిగిన మోకు [గు]
బిళ్లగుత్త = (మా) బిళ్లమక్తా [గో]
బిళ్లమక్తా = ఒక పనిని నిర్ణయించుకొనిన కంట్రాక్టు మొత్తము; బిళ్లగుత్త [నె]

## బీ



బీకి = బలహీనము [చి]
బీగము ముద్ద = తాళము కప్ప [చి]
బీగుడు = వియ్యంకుడు [అ]
బీగురాలు = వియ్యపురాలు [అ]
బీగులు = వియ్యంకులు [అ]
బీడుమాలిన = (1) పనికిమాలిన [నె]
(2) పనిలేనివాడు [తె]
బీదసాదలు = బీదలనుటకు జంటపదము— *బీదసాదల కణిసించి (గుర్తించి) పోవాల* [నె]
బీపు = వీపు [శ్రీ]

## బు



బుంగ = (1) నూనెవేసియుంచు చిన్న మట్టి కుండ [శ్రీ]
(2) నీరు తెచ్చుటకు ఉపయోగించు చిన్న మూతి మట్టిపంటి [సర్కా]
(3) వెదురు పేళ్లతో అల్లిన చిన్నబుట్ట [శ్రీ-పాతపట్నం, ఇచ్ఛాపురం, సోంపేట]
(4) చేపలుపట్టి వేసికొను తిట్ట, బుట్ట [శ్రీ]
(5) చిన్న రంధ్రము—*చెఱువుకు బుంగ పుట్టింది;* బొంగ [కరీ]
బుంగకొమ్ములు = పశువు రెండు కొమ్ములు పైన కలసికొని వలయముగ ఏర్పడినవి —*బుంగకొమ్ముల ఆవు* [నె; అ-పె; వ]

బుంగపడు = మట్టి మిద్దెలమీద వర్షమునకు సందిచ్చు [కర్నూ]
బుంగమూతి = ముడుచుకొనిపోయిన మూతి [కరీ]
బుకాయించు = (1) బుదుగరించు [కరీ]
(2) లేనిపోనివి చెప్పి నమ్మించబోవు (Bluff) [నె]
బుకినీ = పొడి, చూర్ణము [కరీ]
బుక్కపిండి = గంధపుపొడి [తె]
బుక్కాగులాలు = శోభన ద్రవ్యములు; సుగంధ ద్రవ్యములు [కరీ; మ]
బుక్కాపక్కీరు = ఏమియులేని పేద; అంతయు పోగొట్టుకొన్నవాడు [అ; నె]
బుక్కినాడు = ఆత్రముగా తిన్నాడు; బొక్కినాడు [శ్రీ]
బుగడ = చెవికి పెట్టుకొను బంగారు ముత్యములుగల ఆభరణములు [అ; నె; రా]
బుగత = (1) యజమాని
(2) బ్రాహ్మణుడు [శ్రీ]
బుగతరాలు = యజమానురాలు; బ్రాహ్మణి [శ్రీ]
బుగిడికడ్డీలు = స్త్రీలు చెవులపై ఒకవైపున ధరించు నగలు [అ]
బుగులు = కొయ్య ఎండి తడిసి నిర్వీర్యమగు; బోగిడిచిపోవు [గు]
(చూ) గుబులు [అ]
బుగులు = (1) కడుపులో దడ [కరీ]
(2) భయము [మ]
(3) చిత్త చాంచల్యము [అ]
బుగ్గ = (1) నీరు నిరంతరాయముగ పైకుబికి పారు వివరము (Spring) [నె; కర్నూ; తె]
(2) ఒక వదంతి అతిగా వ్యాపించుట — *ఆ సంగతి బుగ్గపుట్టినట్లయింది* [నె]
(3) స్ఫోటకము, గజ్జి మొదలైన వాటి వలన లేచు పెద్దపొక్కులు
(4) ఎలెక్ట్రిక్ బల్బు — *బుగ్గ చెడిపోయింది* [హై]
బుగ్గఊట = ఒకచోట పెద్దగా నీరుబికివచ్చు ఊట [అ]
బుగ్గచెంపలు = ఎత్తు చెక్కిళ్లు [కరీ]
బుగ్గాయు (బుగ్గి + ఆయు) = నాశనమగు (ఒక తిట్టు) [అ]
బుగ్గి బూడిద = పూర్తిగా చెడిపోవు — *ఆ పని బుగ్గి బూడిద అయినది* [నె]
బుచ్చాయి = అవుదూడ; బుజ్జాయి [కృ]
బుచ్చుడి = వెంట్రుకల ముడి, ముచ్చట
బుచ్చిపోవు = చిన్నపోవు — *నీ మొగము బుచ్చిపోయింది* [తె]
బుజగనగడ్డ = దాచుకొనిన ధనము — *వాడు తన దగ్గర బుజగనగడ్డ ఉన్నదనేనాయీ పాటు* [గు]
బుజనము = భోగము [గు]
బుజ్జాయి = లేగదూడ; బుచ్చాయి [కృ; గు]
బుటక = నీటమునిగి పైకిలేచుట — *రెండు బుటకలు వేసినాడు* [నె; వ]
బుటుకు = (చూ) బుటక [చి]
బుట్టమేపు = పశువులకు గానుగపిండి, ఉలవలు మొదలగునవి బుట్టలోవేసి తినబెట్టినది × గాటిమేపు, (గడ్డి మొదలగునవి) [నె; తె]
బుట్టరి = అల్పపు వ్యక్తి; లెక్కలోనికి రాని వాడు [కరీ]
బుట్టలోబెట్టు = (1) లోగట్టుకొను
(2) నిర్వీర్యునిజేసి స్వాధీనము చేసికొను — *వాడిని బుట్టలో బెట్టినాడు* [నె; అ; తె]

బుట్టలో వేసికొను = వశము చేసికొను; వలలో వేసికొను [కర్నూ. నె]

బుట్టాజూపించు = ఎగవేయు (బుట్టా అంటే ఉరుదూలో మొక్కజొన్నకంకి, దీనిని చూపుట అనుట); ఎరగడ్డ చూపు; ఇరవై ఒక్కటి చూపు (ఉన్న ఇరవై వ్రేళ్ల గాక పైన ఒకటి చూపుట) [కరీ]

బుట్టి = బాగా పెరిగిన తల వెంట్రుకలు [కరీ]

బుడగ = (1) బుగ్గ [నె; తె; అ]

(2) మునక [గో]

(3) నీటిపైన గాలినిండి ఏర్పడిన ఉబ్బు; బుద్బుదము [నె; కర్నూ]

బుడబుడ పుట్టింది = వార్త అంతట ప్రాకుతున్నది; అవాయి రేగింది, పొక్కిపోయింది [కరీ]

బుడమ = (1) దొండజాతిలో చేరినకాయ; దీనిని కోసి వరుగులు చేసికొందురు [నె]

(2) పుల్లగనుండు దోసజాతికి చెందిన కాయ [కర్నూ. తె]

(3) చెట్టుక్రింది భాగము; తరుకాండము; బుడము [కర్నూ. ప-కో; అ]

బుడము = చెట్టుమొదలు, బుడమ [తె; అ]

బుడికీ = చాల చిన్నియమ్మాయి [కరీ]

బుడిగ = (1) చిన్నది; చిన్నముంత; బుడిగి [చి; తె]

(2) తమలపాకుల చిన్నకట్టలు (పిడులు) కొన్నిటిని చేర్చి కట్టిన పెద్దకట్ట; నుడి [నె-కనిగిరి]

(3) పిల్లలాడుకొను చిన్నని మట్టిపాత్ర [అ]

బుడిగజంగము = తందాన కథలు చెప్పి జీవించు జంగములు; బుఱ్ఱకథలవాండ్రు; బుడిగెజంగము [వ]

బుడిగి = (చూ) బుడిగ [అ]

బుడబుడి = కల్లబొల్లి [కరీ]

బుడుగు = దిగుబాటు గుంట [కరీ]

బుడువు = (1) చిన్నముంత [గో]

(2) బుడిపె, దెబ్బతగిలి ఏర్పడిన బొప్పి [నె]

బుడుసు = జొన్న మొదలగువాటి వేళ్లతోడి మూలభాగము

బుడుబుడక్కలశాతలు = నమ్మదగని చేష్టలు [ను]

బుడిగెజంగము = బుడిగెలు వాద్యముచేయుచు భిక్షమెత్తువారు; బుడిగిజంగము [కరీ]

బుడ్డ = బుడగ [సే]

బుడ్డకల్లు = (చూ) బుడ్డికల్లు

బుడ్డకేతిగాడు = తోలుబొమ్మలాటలో ఇష్టిలపు హాస్యగాడు [నె, వి]

బుడ్డకొణుసు = (చూ) బుడ్డపిడుదు [గో]

బుడ్డను గాను = బోగోతములో హాస్యకాడు; బుడ్డకేతిగాడు [కరీ]

బుడ్డనూనె = వేరుశనగనూనె [మ]

బుడ్డపక్కి = మంచినీటి చిన్నచేప [నె; రా; కృ]

బుడ్డపిడుగు = (చూ) బుడ్డపిడుదు [అ]

బుడ్డపిడుదు = (1) పశువులకు ఐట్టు గుండ్రటి చిన్నపురుగు; బుడ్డకొణుసు

(2) నురుగుజ్జు — వాడొక *బుడ్డపిడుదు*; బుడ్డపిడుగు; [నె; కర్నూ; తె]

బుడ్డపెదవి = దళసరి పెదవి [వి; నె]

బుడ్డలు = (1) శెనగబుడ్డలు; వేరుశనగకాయలు [అ; తె; కర్నూ; నె-కనిగిరి]

(2) చిన్న మొక్కజొన్న కంకులు — *కంకిబుడ్డలు* [వ]

బుడ్డికల్లు = గీతచెట్టుకు రాత్రిగట్టిన లొట్టెను ఉదయము దించక, మధ్యాహ్నము దించి తీసిన కల్లు. దీనికి కైపు ఎక్కువ— *బుడ్డికల్లు తాగినట్లున్నదే వాలకం* [నె-కందుకూరు]

బుదిరించు = పిల్లకాయలను బుజ్జగించు [శ్రీ]

**బుదుగరించు**=ఓదార్చు [కరీ]

**బుద్ధావతారము** = మూగమొద్దు; తమకని వ్యక్తి — *ఆయన ఒక బుద్ధావతారము* [నె; కర్నూ; అ; తె]

**బుద్ధికాదు**=(1) ఇష్టపడదు, రుచింపదు — *ఆ కూర నాకు బుద్ధికాదు* [నె, కర్నూ]
(2) వివేకముకాదు [అ]

**బున్నీసు**=ఉన్నిశాలువ, బుర్నీసు, బూనీసు [కర్నూ]

**బురకడు** = పిల్లవాడు

**బురగుంజు** = (చూ) బుఱ్ఱగుంజు [నె]

**బురద మడుగులు** = బొమ్మిడాయి అను చేపలు [మ]

**బురాంజి**=పెరుగుపచ్చడి [మ]

**బురిక** కొబ్బరిచిప్ప [ఉ-వి]

**బురిడీ**=అసత్యము: మోసపుమాట (Bluff) — *ఒక బురిడీ కొట్టి పోయినాడు;* బురుడా [నె; అ]

**బురిడీవేయు** = బేలుపుచ్చు [నె]

**బురుగు**=(1) రహస్యము [కరి]
(2) దర్పము—*నీ బురుగు ఇక్కడ సాగదు* [చి]
(3) నీటిపై తేలు నురుగు [చి]

**బురుగు తేలిపోవు**=నిజం తెలిసిపోవు [చి]

**బురుగులు** = మరమరాలు; బొరుగులు [కర్నూ]

**బురుడా**=(చూ) బురిడి [చి]

**బురుడు చేయు**=మంచిమాటలాడి ఒప్పించు కొను; బురిడీవేయు [శ్రీ]

**బుర్నీసు**=ఉన్నిశాలువ; బున్నీసు; బూనీసు [కర్నూ; అ; శ్రీ; వి]

**బుఱ్ఱ** = (1) కొబ్బరిలేని టెంకాయచిప్ప [కర్నూ-పత్తికొండ]
(2) ఎండిన బోలు తాటికాయముట్టె [నె]
(3) ఎండిన సొరకాయ బుఱ్ఱ
(4) పురుగు తొలచిన రంధ్రములు — *కందులలో బుఱ్ఱలున్నవి* [అ]

**బుఱ్ఱగుంజు** = తాటితేగలపైన నిలిచిన ముట్టెను పగులగొట్టగా లోపలనుండు తెల్లటిగుజ్జు; ఇది మంచి రుచిగా నుండును; బురగుంజు [నె; వ]

**బుఱ్ఱతిరుగుడు**=గర్వము—*వాడికి మహా బుఱ్ఱతిరుగుడుగా వుంది* [వి]

**బుఱ్ఱావు** (బుఱ్ఱ+ఆవు) = పొట్టిగట్టి ఆవు [నె]

**బుఱ్ఱిఆవు**=పొట్టిగట్టిఆవు; బుఱ్ఱావు[అ; వ]

**బుఱ్ఱిగాడు**= వెధవ; అప్రయోజకుడు [కరీ]

**బులాకి**=(చూ) బుళాకి; బుళాకు [చి; నె; మ; అ]

**బులిపింపు** = (చూ) గుణిపింపు, గుణుపు [గో]

**బులిబుచ్చికము**=గారవము [కరీ; నె]

**బులిబుజ్జికాలు**=(వ్యంగ్యముగా) బ్రతిమాలు టలు — *అంతా బులిబుజ్జికాలు పడు తున్నాడే* [నె; గో]

**బులిబులి**=(1) కల్లిబొల్లి
(2) గారవాల [కరీ]

**బులుపు**=బులిపెము [కరీ]

**బుస**=రహస్యము—*వాని బుస బయటకు రాదు*

**బుసి**=జొన్నలు, సజ్జగింజలకు వెనుక కుదు రువలె ఉన్న పొట్టు; బూగు [మ]

**బుళాకి**=అడ్డబాస [గో]

బూకడు = అత్యాశ [మ]

బూగు = జొన్న సజ్జగింజలకు వెనుకనున్న కుదురువంటి పొట్టు. బుసి [మ]

బూజర = (1) దేహముపై రేగు తెల్లటిపొడి (2) పొగ అడ్డము వచ్చినట్లు చూపు ఆనకుండుట, కండ్లు మసకలగుట—*కండ్లు బూజరగా నున్నవి* [నె; అ, తె]

బూజు = మూతి సన్నని చేదపాత్ర; చేదపాత్ర [కరీ]

బూజుగుమ్మడి = బూడిద గుమ్మడి, కుష్మాండము [గో]

బూటకాల బుచ్చన్న = మాట నిలుకడ లేని వాడు [మ]

బూడిదగుమ్మడి = బూజుగుమ్మడి [గో]

బూదిండ్లమారిది = అత్యాశ గలది, బూకటిది [నల్ల]

బూనీసు = ఉన్ని శాలువ; బూరినీసు, బుస్నీసు బుర్నీసు [నె; అ]

బూర = (చూ) బూరగ— *బూర ఊదినట్లు* [వ]

బూరగ = (1) పదేపదే ఒకే సంగతిచెప్పుట —*అయనది ఒకే బూరగైంది* [నె] (2) లోపలి ఉద్దేశమును బయటబెట్టుట— *ఆయన బూరగ బయట బెట్టినాడు* [నె; తె]

బూరగొమ్ము = ఊదునట్టి పెద్ద లోహపు కొమ్ము [వ]

బూరటిల్లు = బుడబుడలాడు [కరీ]

బూరాచక్కెర = (1) చీనా పంచదార [చి] (2) గోధుమవన్నెగల మెత్తటి చక్కెర ×అస్కాచక్కెర [నె; కర్నూ; అ, తె]

బూరాపు = క్షత్రియుడు [వి]

బూరారంగు = బూడిదరంగు [కరీ]

బూరి = ఉపస్థ—*బూరిఆశ, భూమాశ పనికి రాదు* [నె-ఆత్మ]

బూరిబుగ్గలు = ఉబ్బిన బుగ్గలు [వి]

బూరు = వెంట్రుకలు [కరీ]

బూరెలు = బూర్లు; కుడుములు

బూర్నీసు = బూనీసు [వ]

బూలాబూలా = అమాయకుడు; బోళా; బోళాబాయి [కరీ]

బూసా = వట్టి పొట్టు [కరీ]

బూసులు = కంటిమైల; పుసులు [కరీ]



బెంచి = రేగడినేలలోని నీటిదారువు [అ]

బెంజ = ఎంతతిన్నా తనవి తీరనివాడు — *వాడు బెంజ* [చి]

బెంజి = ఏదైన వస్తువునందు ఎక్కువ అసక్తి కలిగి ఉండుట — *వాడు బెంజి వాడు* [అ]

బెంజిగొడ్డు = పంజా పసరము; గొడ్డుబోత పసరము [అ-పె]

బెండగిలపడు = నిశ్శక్తుడగు [తె]

బెందడి = (1) ఎడము; నడుమ సందు — *బెందడిచేయి; బెందడి పూచు* [నె]

(2) గచ్చు బదులు, రాళ్లు కట్టునప్పుడు ఉపయోగించు తడిసిన మట్టి [కర్నూ]

(3) రంధ్రము—బెంచపడిపడినది [నె;చి]

(4) వసతి; వీలు—బెందడి కాలేదు [నె]

(5) గోడ కట్టునప్పుడు రెండు రాళ్లసందు పూడ్చుటకు ఉంచు రాతిముక్క (చెక్క); బెచ్చు [అ; తె]

(6) పునాదిలో (గోడ కాలులలో) నింపే రాయి—బెందడి రాయి [తె]

(7) కంకర

బెంబేలు=గాభరా; దిగులు — బెంబేలెత్తి పోయాడు; బెంబేలు పడిపోయాడు [చి]

బెక్కొను=భయపడు [కరీ]

బెగడాయించు = మలకబెట్టి వెళ్లిపోవు; బిగడాయించు [కరీ]

బెగ్గంపాడు=ఒక్కరులేకుండా వెళ్లిపోయిన స్థితి [కరీ]

బెచ్చిక=దెబ్బతగిలి, దేహమునందు గాని, గారనేలలో గాని లేచిన బిళ్లపారు పలుకు —బెచ్చిక లేచింది; పెచ్చిక [నె]

బెచ్చు=(1) రాతి కట్టకమున ఒక రాతి క్రింద యమర్చు బిచ్చె (రాతిముక్క); బెందడి [కరీ]

(2) బెదరు; చేలలో దిష్టిబొమ్మ పెట్టి బెదరు పెట్టుట [అ]

బెచ్చుచెడనీక = ఎంతమాత్రము చెడనీక; బెట్టు చెడనీక [కరీ]

బెచ్చులు=బెచ్చికలు; పెచ్చులు [వ]

బెట్ట = (1) ఎండవేడిమి వలన కలిగిన తాపము [నె; కర్నూ]

(2) విరాగము; ఒప్పమి—వారిద్దరిమధ్యా బెట్ట ఏర్పడింది

(3) పరుషమైన — బెట మాటలు పలికినాడు [నె]

(4) గట్టి రాతిమట్టి — మా బావిలో తెల్ల బెట్ట పడినది, మంచినీళ్లు పడవచ్చు [వ; అ]

బెట్టుకొమ్ము = (చూ) మెంటకొమ్ము; బెట్రావు [అ]

బెట్టు=(1) స్వోత్కర్ష—బెట్టుచూపినాడు

(2) గంభీరము—బెట్టు మనిషి; బెత్తు

(3) విల్లనంటు మొదలగు వాటిని ఉపయోగించుటకు పంచి సిద్ధము చేసినది; బిగువు (Tension) — బెట్టు తప్పినది [నె;కర్నూ తె; అ]

(4) గౌరవము; ఆధిక్యము — బెట్టు పోగొట్టుకొన్నాడు [నె]

బెట్టెము=పెద్దముద్ద—బెల్లము, చింతపండు తెలకపిండి మొదలగు వాటి ముద్దలను బెట్టెము అందురు; [వ]

బెట్రావు=(చూ) మెంటకొమ్ముల ఆవు [అ]

బెడపడు= గుంపునుండి తప్పిపోవు — మేక బెడపడి పోయినది [నె]

బెడవట్టిపోవు = పశువు మటిల కట్టకుండ నిలిచిపోవు (స్త్రీకి ముట్టుడిగినట్లు) [నె]

బెడిసికొట్టు = ఒకరిపై చేసిన ప్రయోగము తిరిగి వచ్చి తనకే తగులు [తె]

బెణకప్ప=వినాయకుడు, పిళ్లారి

బెతుపు=ముఖము విఱుపు

బెత్తాయించు = ప్రోత్సహించు, పురమాయించు [వి; శ్రీ]

బెత్తు=(1) బెట్టు — ఆ బెత్తులన్నీ నా దగ్గ తెందుకూ [చి]

(2) భీతి [తె]

(3) నత్తగుల్ల పై చిప్ప [నె]

బెత్తుక=బెజ్జము, రంధ్రము [గు, తూ-గో]

బెనాయి = మట్టిత్రవ్వుట కుపయోగించు ఇనుప సాధనము. దీనిని పొడవైనకఱ్ఱకు బిగించి ఉపయోగింతురు [శ్రీ]

బెమ్మరము=మూర్ఛ [నె-పొ]

బెర=గొల, గెల [కరీ]

బెరస=(1) కత్తికట్టకనే పందెమాడు మేలుజాతి పౌరుషవంతమైన కోడిపుంజు; డింకి

(2) పౌరుషవంతుడు—*ఆయన బెరన* [నె]

(3) పురుష లక్షణములు కొరబడినవాడు

బెరికి=ఇరు జాతికి పుట్టినవాడు—*బెరికోడు* సంకర జన్ముడు; పూటు [చి]

బెరుకులు=ఒక ధాన్యములో కలిసిన అన్య జాతి గింజలు; కేడిగింజలు [తె]

బెలుగు - కట్టుదూలము [కరీ]

బెల్లంబువ్వ=పరమాన్నము [మ]

బెల్లించు=లాలించు [కృ]

బెసగు=(1) పీలగు; లభ్యమగు — *ఉబ్బ ఏమీ బెసగలేదు* [నె; కర్నూ; అ]

(2) జారిపోవు — *చేప బెసగిపోయింది;* బెసుగు; జెడిసిపోవు [నె; కర్నూ; అ; తె]

బెసికిపోవు=తప్పిపోవు—*సంబంధం బెసికి పోయినది* [తూ-గో]

బెసుగు=(చూ) బెసగు [నె; కర్నూ]

బెస్తపెగ్గెలు=చేయలేనిచేతలను చేయగలిగి నట్లు ఎక్కువగా చెప్పుకొనునవి; ఉత్తర కుమార ప్రజ్ఞలంటివి. బెస్తలు(జాలరులు) ఏంతో యీది ఏన్నో చేపలు పట్టినామని చెప్పుకొనుచుండు డంబాలు [నె]

బెస్తపెద్దతనము=చాల యిబ్బంది కలుగ జేయు పెద్దతనము. యువకులంతా వలను లాగుచు,ఒడ్డుననున్న వృద్ధునిచేత గుడ్డలు మోయింతురు. ఇట్లే బ్రాహ్మణులలో చిన్నకు ముసలివారు పనిబెట్టి వేదించు చుందురు—*బెస్తలలో పెద్దకు, బ్రాహ్మణులలో చిన్నకు బెడద*

బెళగువ్వ=గువ్వ

## బే



బేగారి=వెట్టి [కరీ]

బేజా=అసంబద్ధము; బేజా × బజా [కరీ]

బేజాను=చాలా బాగా ఉండుట [గు]

బేజారు=(1) సహ్యము కానిది—*హోటలు తిండి బేజారైనది* [అ]

(2) విసుగు—*బేజారుగా ఉన్నది* [నె]

బేడిసలు = చిన్న వెడల్పు చేపలు. మన కావ్యములో స్త్రీల కండ్లకు పోల్చునవి. పురిటాండ్రుకు పెట్టు పత్యపుకూర; పక్కెలు [శ్రీ]

బేడెము=చిలుకు [మ]

బేపి=ఆడుకుక్క [వి]

బేరళ్లు=ఎద్దుల మెడ పట్టెడలు, (తోలుతో చేసినవి, [న]

బేరి=(1) వంతెన, అట్టెడ; మోరి [నె]

(2) వ్యాపారముచేయు ఒక తమిళము కులము—*బేరిసెట్టి*

(3) బెట్టిజాతికి చెందిన ఒక ఫలము —*బేరికాయ* [నె]

(4) వరుస—*చీమలు బేరిగట్టినవి* [అ]

బేరిఒడ్డు=కాలువకు అడ్డముగా వేసిన పెద్ద అడ్డకట్ట [నె; అ]

బేలుపోవు = ఏమరిపోవు, మోసపోవుట కంటె కొంత తక్కువ—*ఆ విషయంలో బేలు పోయినాడు* [నె; కర్నూ; అ; తె]

బేలువేయు=మోసము చేయు; టోపివేయు [శ్రీ]

బేసము=పండులో తండభాగము [అ]

బేసరి=ఒకటికన్న ఎక్కువ రాళ్లతోచేసిన ముక్కుపుడక [నె; మ; కరీ]

బేష్రీ=రాళ్లు పొదిగిన నాసాభూష, బేసరి

# బై



బైకాలు = వేవిళ్లు
బైతు = అప్రయోజకుడు; దద్దమ్మ [శ్రీ]
బైదోడు = మాల, మాదిగ, దాసరికాక మరొక హరిజన జాతి [మ]
బైనాటి = పంపజోళ్లు (జమిడికలు) వాయించుచు, పెద్ద వంకరకొమ్ము (కాహళ) ఊది జీవించు కులము [నె]
బైబైయైంది = తెల్లవారబోవుచున్నది [కరీ]
బైరిగ = పిడిసాన; బర్మా [అ-పె]
బైరూపు = వివిధ వేషములు వేయువాడు—*ఊళ్లోకి బైరూపులోడు వచ్చిండు;* పరాశక్కపోడు; లకోర్కరోడు; పైటివేషగాడు; పగటివేషగాడు; బౌరూపోడు తుపాకి లొట్టోడు [మ]
బైరొడ్లు = మెట్టలో పండు వడ్లు; వర్షాధారముపై పండు వరిగింజలు [చి]
బైర్లు = చీకట్లు—*కనులు బైర్లు క్రమ్మినవి* [చి]
బైసుమాలు = ప్రాలుమాలు [కరీ]

# బొ



బొంగ = (1) తనంతటతానే చేలగట్టులలో ఏర్పడి నీళ్లుకారిపోవు బెజ్జము —*బొంగ వేసుకున్నది* [నె; అ; శ్రీ]
(2) ఊల [వి]
బొంగు = (1) వెదురుకఱ్ఱ; గడ; బొంబు [అ; నె; తె]
(2) మట్టికప్పుగల మిద్దెటిండ్లపై కప్పులో, వానకు తడిసి వర్షపునీటి ఒత్తిడికి పడు రంధ్రము [అ]
(3) యోని—ఏమిబొంగు పగిలింది [చి; నె]
(4) పొడవైన వ్యక్తి—*బొంగోడు* [నె]
(5) వ్యర్థము, నిస్సారము — *నేను తమ్ములు బొంగులుగా* [భార-ఉద్యో]
(6) లోపల గుల్లగా ఉండునది; కట్టెయందు బొంగు; పేలాలు [వ]
బొంగులు = (మా) బొరుగులు [తె]
బొండ = గట్టి పెసుగింజ [కరీ]
బొండ రాలగొట్టు = పూర్తిగా పొగరడంచు [కరీ]
బొండిగ = గొంతు [కరీ]
బొండ్లెము = (1) ఆచ్ఛాదన లేనిది (బోడిది) (2) టెంకాయ కొబ్బరిచిప్ప: బొన్లెము [నె; పొ]
బొంత = (1) పెద్ద చేప; రెండు అడుగులు పెరుగు నల్లటి చేప [శ్రీ]
(2) లావుపాటి — *పెద్ద బొంత అరటి; బొంతజెముడు* [అ; నె; తె, గో; కర్నూ]
బొంతగంగమ్మ = చెట్టుకు పేలికలు కట్టి పూజించు దేవత [చి]
బొంతరాయి = గట్టి లేకుండా సందులుసందులుగా ఏర్పడిన ఎఱ్ఱరాయి; తురకరాయి (Latarite) [నె]

బొంతరోమము = పశువుల దేహముపై రేగి యుండు లావు రోమము; దుర్లక్షణము [నె]
బొంతివంక = చిన్నరాళ్లతో నిండిన పిల్ల వాగు [చి]
బొంతు = (1) ఎదిగిన గొఱ్ఱెపిల్ల; కొదమ వయస్సుకు పైన గొఱ్ఱెప్రాయమునకు క్రింది వయస్సుగలది [నె-మెట్ట; తె]
(2) (చూ) బొంగ [వ]
(3) జొన్నబుసి (గింజకుదురు)
బొంతురేగు = గుడ్డ ఉతికినపుడు గుడ్డ మోటుదేలు [గు]
బొంద = తాటి ఈత వీటి లేత చినమ్రాకు; బెంద [నె]
(2) గోరి [తె]
బొందలము = ధృఢము — వాడు బొందలముగా ఉన్నాడు [తె]
బొంది = అరటిమాను లోపలనుండు మెత్తటి ఊచ; బొందె [నె]
బొందు = (1) మంగసూత్రపుత్రాడు
(2) కంకి తీయక ఎండిపోయిన జొన్న
(3) వెన్నుదీయని వరికాలు [నె; కర్నూ; తె; అ]
బొందుముడుచు = సమాప్తిచేయు [కరీ]
బొందె = (చూ) బొంది [నె]
బొంపుకము = రెండు పాతబట్టలు కలిపి కుట్టుట [మ]
బొంబాయి = (1) కిరసనాయిలు తోడుకొను పంపు [గు; కృ]
(2) వడవలు నిలుచు పెద్దతొట్టి కట్టు (Basin) [కృ-బందరు]
(3) నీళ్లపంపు [శ్రీ; వి]
బొంబు = వెదురుబొంగు [సే]
బొక్క = అడుగురి
(2) (వ్యంగ్యముగా) పిల్ల [అ-పె]
(3) ఎముక [కరీ]
బొక్కపెరిడె = ఒకజాతి పాము — బొక్కపెరిడివలె కదలలేవు [నె]
బొక్కలు మీదేసుకున్నడు = చిక్కిపోయి నాడు [మ]
బొక్కు = నోటినిండా ఏదైనా వస్తువును దురుగుకొను; బుక్కు [నె]
బొక్కెన = బాల్చి, చాద, బక్కెటు [కృ; కర్నూ; గో]
బొగడ = (1) బుగ్గ
(2) చేనిగనిములో ఏర్పడిన బొక్క [నె]
(3) చెవిపై గూబపై బెజ్జము చేసి పైకి క్రిందకు కనబడునట్లు పెట్టు నగ [గు]
బొగుడు = మొరుగు [సే]
బొగ్గ = పొక్కు; గడ్డ [కరీ]
బొగ్గనాలబొగడ = అంతా శూన్యము [కరీ]
బొగ్గలు స్ఫోటకపు మచ్చలు [కరీ]
బొగ్గులపొయి = కుంపటి [నె]
బొచ్చ = (1) వెడల్పు, పెద్దగా ముండ్లతోడు గుగ నున్న మంచినీటిచేప [ఉ; గో; నె; తె]
(2) బొమ్మ — ఎదురు బొచ్చెలో తన్ని నాడు; బొచ్చె పగిలింది [నె]
(3) చిప్పలతో నున్న పీచు — తాటి బొచ్చె; టెంకాయబొచ్చె [చి; నె]
బొజ్జన్న = బుద్ధుడు — బొజ్జన్నకొండ [వి; అ]
బొటాబొటి = తూచినట్లు సరిగా ఉండుట [శ్రీ]
బొట్టుబావి = సెలయేటిలో చెట్లకొమ్మలతో తీగలతో అల్లిన దాపతో కుంచిన గుండ్రని బావి, ఇది తాత్కాలికమైనది ఇసుక దొర్లకుండా ఈ బొట్ట అపును [చి; నె]
బొట్టు = గంప [అ]
బొట్టులు = ఒక భక్ష్య విశేషము [గం]
బొట్టి = (1) బొటనవ్రేలు [తె]
(2) స్త్రీ; బొడ్డి [చి]

**బొట్టు**=(1) మంగళసూత్రము [నె; రాయ] (2) వెనుకటి కాలణా; చిన్నడబ్బు; పైసా; కాని [క; అ; కర్నూ]

**బొట్టుపెట్టు**=ఆదరించు [కరీ]

**బొట్టూ బోనమూ లేదు**=పేరంటాలు బొట్టు బెట్టి పిలుచుటగాని బోనము (అన్నము) పెట్టుటగాని లేకుండుట, పిలుపూ, తలపూ లేకపోవుట [సర్కా]

**బొట్టె**=చిన్నబిడ్డ

**బొట్టెడు**=పిల్లకాయ; బాలుడు

**బొడబొడపండ్లు**=సంక్రాంతినాటి పిల్లలపై పోయు రేగుపండ్లు [కరీ]

**బొడిగ** = వితులు తక్కువగల చిన్నబొడ్డె (కంకి) [కరీ]

**బొడిగరాళ్లనేల**=సన్నని రాలనేల [కరీ]

**బొడికెలు**=చిన్నపిల్లలు; బొట్టెలు [కరీ]

**బొడుపు**=బొప్పి [ప]

**బొడుసు**=బొడుపు; (చూ) బుడిపు [ప]

**బొడ్డంబాలు** = ఆటలో పొరపాటు, బొడ్లో పాలు [వి]

**బొడ్డి**=బాపేటి అను మాటవలె స్త్రీలు స్త్రీకి ఉపయోగించు పదము — *అబొడ్డి కేమి వచ్చె వచ్చిందమ్మా, బొడ్డి* [నె, వ]

**బొడ్డు**=(1) బావికి చుట్టు కట్టు రాతి కట్టడము (2) మధ్యప్రదేశము—*ఊరి నడిబొడ్డు* [నె]

**బొడ్డుగిన్నె** = ఒక గిన్నెలోపల యిమిడే చిన్న గిన్నె [వ]

**బొడ్డుచవిక**=గ్రామ కూడలలో ఎత్తుఅరుగు చావిడి [నె]

**బొడ్డుచావడి** = నడిపచ్చు;బొడ్డుచవిక [కరీ]

**బొడ్డుచీల** = (చూ) భీమ చీల [నె-ఆత్మ; గు]

**బొడ్డుబావి**= లోపల చుట్టూ రాతితో అంచు గట్టిన పెద్ద బావి [నె; కర్నూ, తె]

**బొడ్డురాతిచవిక** = (చూ) బొడ్డురాతిదగ్గర కట్టిన నలు చదరపు మండిరము—*సాధారణముగ ఇది పెంకుతోనో పూరితోనో నిర్మింతురు* (చూ) బొడ్డురాయి [నె]

**బొడ్డురాయి** = కలరా మసూచి మొదలగు సాంక్రామిక సాంఘిక వ్యాధులు, పశు వ్యాధులు సోకకుండునట్లు గ్రామవాసులు పూజించు నిలువున నాటిన పెద్దరాయి. ఇది మహాలక్ష్మి అంశమైన శీతల దేవత ప్రతి కృతిగా గ్రామ మధ్యమున నెలకొల్పిన శిల. గ్రామమున అరిష్టము లేర్పడినప్పుడు, కొన్ని చోట్ల బ్రాహ్మణులు, మరికొన్ని చోట్ల కుమ్మరులు గ్రామప్రజల పక్షమును యీ రాతిని పూజించి, వడపప్పు పానకములను పంచిపెట్టుచుందురు [నె]

**బొడ్రాయి** = (1) బొడ్డురాయి — *ధ్వజస్తంభము వంటిది;* గ్రామంలో జరిగే శుభకార్యాలన్నిటిలో ఈ రాయి దగ్గరకు వచ్చి పూజాదులు చేసి వెళ్లుదురు [మ] (2) గ్రామ నడిబొడ్డున అరుగువలె అమర్చిన పెద్దబండ; దీనిని చవికవలె ఉపయోగింతురు [నె]

**బొడ్డెమ్మ**= ఒక దేవత. దసరా పండుగకు ముందు బతకమ్మ పండుగు వచ్చును. దానికి కొంత ముందు బొడ్డెమ్మ పండుగు వచ్చును. ఎఱ్ఱమట్టితో బొడ్డెమ్మను చేసి బాలికలు పూజింతురు [వ; తె]

**బొడ్డెలు**= కంకులు [కరీ]

**బొడ్లు** = చిన్న చిన్న కయ్యలు, మడులు; పాదులు [శ్రీ]

**బొడ్లోపాలు**=(1) పిల్లకాయలు ఆట నడుమ విరమము కోరుమాట — *నా బొడ్లో పాలు,* యుద్ధములో పూరి కరచుట వంటిది.

(2) సహకరించుటకు నిరాకరించుట — *ఆయన బొడ్లో పాలన్నాడు* [నె]

**బొణిగ**= (1) దొంగఆవు మెడలో గట్టు పెద్ద ఇనుప మువ్వ.

(2) వదరుబోతు—వాడు పెద్ద బొంఐగ, (అది మ్రోగినట్లే వాగుచుండు ననుట) బొంఐగు [నె]

(3) వేయించగా పేలాలుగాని గట్టి జొన్న గింజ [నె-పొ]

బొంఐగు = (చూ) బొంఐగ [వ]

బొత్త = బొజ్జ; బొజ్జ [కరీ]

బొత్తంచు = ఎరంగుళముండు గుడ్డ అంచు; బద్దెంచు [వి]

బొత్తాము = (1) చెక్కెరతో చేసిన బిళ్లలు [తె]

(2) గుండీ; బటన్; బత్తాసు [నె]

బొత్తు = (1) కాయధాన్యములను మెత్తగా నలుగగొట్ట బడిన పిండి; పెసరబొత్తు, మినపబొత్తు. ఉలవబొత్తు; పొట్టు

(2) 2, 4 మొదలగు సరిసంఖ్య [శ్రీ]

(3) పోటు [ఉ-వి]

బొత్తులు = ( ) కాగితములు. రూపాయి నోట్లు వగైరా వరుసలుగా పెట్టినపేర్పులు

(2) కూరలు మొదలగున వాటి కుప్పలు [గు]

బొద్దు = (1) వరిగడ్డితో పొడవుగా పేన బడిన ఒదులుపురి; ఎంటి దీనితోధాన్యము పోయు పురులను (కూటులను) నిర్మింతురు [గ]

(2) పూరింటికి కప్పు వేసే ముందు చూరు క్రింద వాసములపైన కట్టుకట్ట [నె]

(3) బాగుచెపట్టు గోడ

(4) ఉబ్బెత్తుగా చేసినది—వెకప్పుకు బొద్దు పట్టినారు [నె]

(5) పెద్ద గడ్డిమోపు [నె, తె, అ]

(6) లావు — బొద్దుగా ఉన్నారు [నె-పొ]

బొప్పడు = పనికిరాని వాడు [కరీ]

బొప్పాయి = బొబ్బాయి; బొబ్బాసి, బొప్పాడ [సర్కా]

బొప్పి = గారాబు శిశువు — నీవేం చిన్న బొప్పివా ! [నె]

బొబ్బిలిగోటు = లేనిగొప్ప [వి]

బొబ్బె = వక్షస్థలము [కరీ]

బొమిక = (1) బొక్క [తె; అ]

(2) ఎముక [సర్కా]

బొమిడికె = రెండు పాతబట్టలు కలిపి కుట్టినది [మ]

బొమ్మిడము = బురదలో వుండు ఒకరకము చేప; బొమ్మడాయి [వి]

బొమ్మిడాలు = బొమ్మడాయి, నల్లగా పాము వలె నుండుచేప [శ్రీ]

బొమ్మె = (1) పందెపు వయస్సురాని కోడి పుంజు [నె-కనిగిరి]

(2) ఒకవిధపు చేప; కొఱ్ఱమీను [కరీ; వ]

బొయారము = సొరంగము — నేల బొయారము పడింది; బొయేరము: బొయ్యారము [వ]

బొయేరము = నేల బొయ్యారము [కరీ]

బొయ్యారము = (1) సొరంగము; బొయారము, బొయేరము [మ]

(2) గయి, గుంట; గని

బొరక = బొరియ; బొక్క [నె - మెట్ట: అ; బ]

బొరిగ = త్రవ్వుకొనే గునపము [ఉ-వి]

బొరిగె = (1) గడ్డిచెక్కు ఇనుప సాధనము; దోకుడుపార [శ్రీ]

(2) లోతుగ నున్న రంధ్రము [మ]

బొరుగులు = బియ్యమును కోలగా గుండ్రముగా వచ్చునట్లు వేయించినవి; పేలాలు; మరమరాలు [నె, తె]

బొరుసు = (1) గరుకు — కాకరకాయ వలె; తాటిచెట్టు మొదలువలె - వాడి మొగం బొరుసుబారింది [నె ఆత్మ]

(2) నాణెమునకు బొమ్మలేనిప్రక్క [గు]

(3) మినపపప్పు మున్నగునవి మెత్తగా నురుగువచ్చునట్లుగా రుబ్బినది [గు]

బొల్లావు = తెల్లమచ్చలున్న ఆవు; బట్టావు [చి]

బొసుకు = లోపల సారములేని కాయ— *ఈ ఏడు నిమ్మ బొసుకులైనవి* [నె]

బొళ్లు = (చూ) బోలు [అ]

# బో



బోకరించుకొను = (వ్యంగ్యముగా) అనుభవించు అనుట — *ఏమి బోకరించుకోవాలని అక్కడికి పోయినావు?* [నె]

బోకి = (1) భుజించుగిన్నె [చె]

(2) కుండపెంకు,

(3) (వ్యంగ్యముగా) వెధవ—*ఆ బోకి* [అ]

(4) ఆటలలో ఓడిపోవు — *బోకి అయినాడు* [నె]

(5) మట్టిపాత్ర;

(6) బొచ్చె, *బోకె త్తుకొని అడుక్కు తింటున్నాడు* [చి]

బోకు = ప్రయోజన విరహితమైనది; దళారీ [గ]

బోకె = పగిలిన కడవముక్క; పగిలిన చిప్ప; పెంకు [కరీ]

బోగం = కారుపంట — *ఇరుబోగం వరి సాగింది* (ఇరుకారు పండినది) [చి]

బోగము = స్వామివారి నైవేద్యము. ఇది పక్వాన్నముతో పెట్టింతురు [కరీ]

బోగాటము = గొప్పబరాటా; బోగాతము; భాగవతము [కరీ]

బోగాణి = వెడల్పయిన పాత్ర [అ]

బోగించు = కొయ్య ఎండకు ఎండి, వానకు తడిసి మెత్తగిల్లిపోవు; బోగిడిచి పోవు [చి]

బోగిడుచు = కొయ్య ఎండకు ఎండి వానకు తడచి మెత్తబడిపోవు; బోగించు [నె]

బోగుబడి = కుటుంబ బాధ్యతలు పట్టించుకోకుండా ఉండువాడు—*బోగుబడి అయిపోయినాడు* × సంసారి - *నీవు సంసారివా? బోగుబడివా?* [నె; అ]

బోగుబడి సేద్యం = ఆసక్తిలేని వ్యవసాయము; క్రమములేని సేద్యం [అ; నె]

బోటు = (1) గడ్డ లేక ముద్ద — *బెల్లం బోటు; తెలికపిండి బోటు;* బోడు.

(2) పెద్ద పిండిముద్ద [కరీ]

(3) ఎద్దునోటికి అమరునంతటి తెలక పిండి ముక్క [వ]

(4) మేక ప్రేవులు (వంటచేసి తిందురు) [వి]

(5) నేరుగా నిట్టముగా పెరిగిన కొండ రాయి; బోటురాయి [అ; నె]

(6) ఎత్తుగుట్ట — *ఆదారి బోటెక్కి దిగుతుంది* [నె]

బోటుక = పిచ్చ తీయని చింతపండు [తె]

బోడబావి = దొరువు, లేక బావి [చి]

బోడసరం అంచు = ఒక రకము పువ్వుల అంచు [ని]

బోడిగిత్త = కొమ్ములు కురుచైన గిత్త; బోడెద్దు [చి; నె]

బోడిచవిక - పైన కప్పులేని గ్రామ చావిడి [నె]

బోడిదుక్కి = (చూ) వెలిగడ [గో]

**బోడిబావి**=చుట్టు చేపట్టు గోడలేని బావి [నె]

**బోడిమిద్దె** = పై అంతస్తులేని మేడ; డాబా [నె]

**బోడు** = (చూ) బోటు

**బోణిగలు** = సంక్రాంతినాడు చిన్న పిల్లల తలపై పోయు రేగుపండ్లు [తె]

**బోణిగలుపోయుట** = సంక్రాంతి పండుగ నాడు చిన్న పిల్లను అలంకరించి కూర్చుండబెట్టి రేగుగాయలు, చెఱకు పిచ్చెలు, చింబ (చిమ్మిరి) ఉంటలు, రాగి పైసలు కలిపి దిష్టితీసి హారతి ఎత్తుట [అ]

**బోణిగి** = మొదటిబేరము; బోణి [అ]

**బోతలు** = సిరాబుడ్డి [కరీ]

**బోదగడ్డి**=మంచి పరకలు వేసే అడవిగడ్డి [నె; కర్నూ; తె]

**బోది**=(1) మిట్ట పొలమునకు నీరుపారించుటకు, మట్టము ననుసరించి పోసిన పెద్ద కట్ట, దీని వెన్నుమీద కాలువ తీయుదురు; బోదె [నె, తె]

**బోదిగట్టు**=చేప ఉనికిపట్టు ఏర్పరచుకొను —*చేప ఇక్కడ బోది గట్టినది* [గో]

**బోదె**=(చూ) బోది [నె; అ; తె]

**బోదె**=(1) ఇష్టము—*నీకు బోదైతే నాకు బోదె* [శ్రీ]

(2) అరటిఊస; పట్టలన్నీ ఊడదీసిన, లోపలనుండును. ఇది కూరలకు పనికి వచ్చును; బొంది

(3) స్తంభముపై దూలములక్రింద వేయు రాతిదిమ్మె [చి]

**బోనగిరి**= (చూ) పైడిపంపు [మ]

**బోనపుటిక**=జమీందారులు తమ పెద్దరైతులు నగిరి పఃమీద సంస్థానమునకు వచ్చినప్పుడు, వారి బసకు పంపు అన్నపు బుట్ట; ఇది పెద్ద గౌరవ లాంఛనము—*ఆయనకు బోనపుటిక వస్తుంది* [నె- వెంకటగిరి; తె]

**బోనము** = (1) మద్దెలకు రెండు ప్రక్కల రాచెడి మైనము [కరి: నె]

(2) అమ్మవారికి పంపు నైవేద్యము [తె]

(3) దేవతలు కొలుపులలో బెట్టుకొను పొంగలి

**బోనాసి**=దాసరులు భిక్షార్థము చేతగొనిపోవు వెడల్పుమూతిగల రాగిపాత్ర; భవనాశి [అ]

**బోనిగ**=అంగడి తీయగనే అగు మొదటి బేరము; బోణీ, బోణిగి [కర్నూ]

**బోనుపెట్టె** = బోషాణప్పెట్టె; పెద్దపెట్టె [వి]

**బోముడాయించు**=అంతటమ్రోగిపోవు—*ఆమె పేరంతట బోముడాయించింది* [కరీ]

**బోర**=(1) ప్రత్తికట్ట

(2) వదులు సంచులు — *దూదిబోరలు*; బోరెము [అ]

(3) ఎదురుతొమ్ము [నె]

**బోరగ** = రాబంధు; బోరుబొంత [సే నె]

**బోరతలుపు**=కోట ద్వారముల పెద్ద తలుపు [నె-పొ]

**బోరు** = చిన్నగట్టు; పెద్ద మట్టిదిబ్బ [కరీ]

**బోరుబొంత** = గ్రద్దజాతికి చెందినది. కుక్క వగైరా శవములు తినును పెద్ద ముక్కు పెద్ద రెక్కలు గలది; బోరగ; రాబంధు [ఎ]

**బోరెము**= (1) గోనె పట్టలతో పెద్దబండికి సరిపోవునట్లు కుట్టిన పెద్ద సంచి, దీనిని బండిమీదనే ఉంచి ధాన్యముతో నింపి తోలుకొని పోవుదురు [వ]

(2) పెద్దబండిలో ధాన్యం పోయుటకు వేయు పెద్దతట్టు [మ]

(3) పెద్దగోతాము —*దూది బోరెము* [నె]

**బోరెము పోతులు** = ధాన్యముతో నింపిన పెద్ద గోతముల బరువు బండిని లాగు పశువులు — *వాడు బోరము పోతులా ఉన్నాఁడు* [వ]

బోలు= (1) వదలు వదలుగా నుండునది— మూట బోలుబోలుగా కట్టు; బోల్లు [నె; కర్నూ; వ]
(2) లోపల ఖాళీగా నుండుట — బోలు కడియాలు (లోపల రాగికడ్డీ లేనివి) - బోలుమురుగులు [నె]

బోలె=(1) ఇనుపగంప; బొచ్చె [అ]
(2) పెద్దచిల్లి — ముంతకు బోలెపడినది

బోసిపోవు=దీబూసి (చూ) [అ]

బోసు=(బొడుసు) దెబ్బదాకినచోట కలుగు ఉబ్బు, బొప్పి [కరీ]

## బౌ

బౌరూపు

బౌరూపు = వేషములు వేయువాడు (బహురూపు); బైరూపు; పైటివేషగాడు (పగటివేషగాడు); పరాశ్కాపోడు; లక్కోరోడు; తుపాకిలొట్టోడు [మ]

## బ్ర

బ్రతికి చెడినవాడు బ్రహ్మవిద్య

బ్రతికిచెడినవాడు = శ్రీమంతుడై యుండి ధనమును పోగొట్టుకొనినవాడు ఇతడు లోకమెరిగి మర్యాద వర్తనముతో నడచుకొను యోగ్యుడు × చెడి బ్రతికినవాడు [నె]

బ్రహ్మవిద్య=అసాధ్యమైనపని— అదేమంత బ్రహ్మవిద్యయా ? [నె]

## భ

భగ్గుండ భరతంబట్టు

భగ్గుండ=ఊదారంగు కుంకము [మ]

భట్లి= ఒకరకపు పెద్దయెత్తు పాకము [కరీ]

భణంగి = మోసకారి [కరీ]

భ్రభాజమానము = లాభము; ధనము (వ్యంగ్యము) — ఏమి భ్రభాజమానం బావుకొన్నట్లు [నె]

భయడు = వెట్టివాడు [శ్రీ]

భరతంబట్టు (1) కష్టమైన పనిని బలవంతముగా చేయించు
(2) శిక్షించు. భరతనాట్యము కష్టసాధ్యమైనది కాబట్టి అంతపని అని భావము— వాడి భరతం బట్టినారు [నె; కర్నూ; అ; వ]
(3) ఎక్కువగా భోజనం చేయు, చేయించు —కొందరు శైవులు వడ్డించిన దాని

నంతయు కష్టపడిఆయినా భోజనముచేయు ఆచారము-ఆయన భరతం పట్టినారు [తె] (4) కక్షపై ఎదిరి వారిని ఏడ్పించు; పగ దీర్చుకొను [గు]

భరంతి=(1) ఇంటి గోడకాళ్లను, గుణవర్ధమును (పునాదులను) నింపుటకు ఉపయోగించు కంకరరాయి, ఇసుక మొదలగునవి—*భరంతి నింపినారు* [వ] (2) ఇంటికి బేస్‌మెంటు గోడలు (అస్తిభారము) కట్టిన తర్వాత గోడలమధ్య ఏర్పడిన ఖాళీ— *ఇసుకతో భరంతిని నింపినారు* [నె]

భల్లూకపుపట్టు=మొండిపట్టుదల [తె]

భవంతి=పెద్ద పెంకుటిల్లు, బవంతి [నె]

భసారం=భేదులు [కర్నూ]

## భా

భామ

భామ = (1) వీధిభాగవతములో నాయికాపాత్ర—*భామ వేషగాడు;* వీరిపై పల్లెలలో పెద్ద మోజు [నె; తె] (2) ఆడుది; గొల్లభామ [అ]

## భీ

భీమచీల

భీమచీల = బండి ఇరుసుపైన బిగించిన అడ్డలో (మొద్దులో) నడుమ ఇరుసులోనికి దిగునట్లు దూర్చి బిగించిన పొడవు ఇనుపచీల [నె; తె]

## భౌ

భౌరికోమట్లు

భౌరికోమట్లు = కోమట్లలో ఒకజాతి; భేరిశెట్లు [వి]

## మ

మంకిరి మంగచెక్క

మంకిరి=బండిజల్ల; మక్కిరి [అ-పె]

మంగ=ఏమెరుగని స్త్రీ [కరీ]

మంగచెక్క=మంగచెట్టు బెరడుతో చేసిన పొడి. దీనిని స్నానమున ఒళ్లు రుద్దుకొను

టకు ఉపయోగింతురు; ఇది తెల్లటి నురుగునిచ్చును [నె]
మంగళము=పెంకు; మంగలము [నల్ల]
మంగళవారప్పీనుగ = నిజదురదృష్టము లోనికి ఇంకొకనిని ఈడ్చునది. మంగళవారం మరణించిన వ్యక్తి తన వెంట వచ్చుటకు మరొక పీనుగను కోరునని ప్రతీతి; రాచపీనుగ (తోడులేకపోదు)
మంగు = మబ్బులు గ్రమ్మియుండుట; మూగాము—*రెండు దినాలుగా మంగువేసి యున్నది* [నె]
మంగురు=ఎవరిమాట వినని మొండిగుణము —*గొల్ల మంగురు ఇల్లు చేరనీయదు* [కరీ]
మంచముకోళ్లు=(1) చెరువులలో మొలచు ఒక విధమైన గడ్డి; దీని కాయలు పిల్ల కాయలు తినెదరు [నె-ఆత్మ]
(2) ఒక పక్షి [గు]
మంచమువేయు = జబ్బుపడు; పడకబెట్టు [వ]
మంచానవడు=రోగానపడు
మంచిగ=బాగుగ; లెస్సగ [తె; అ]
మంచినిమ్మ = ఊరగాయకు, రసమునకు పనికివచ్చు, సన్నటి చర్మము గలిగిన చిన్న నిమ్మకాయ (Lime) — *మంచి నిమ్మకాయ ఊరగాయ* [నె; వ; అ]
మంచినూనె=(1) నువ్వులనూనె [నె; వ]
(2) వేరుశనగనూనె [అ; మ]
మంచిమాట=వివాహము నిశ్చయము చేసుకొనుట; కన్యానిశ్చయముచేసికొనుట— [అ; పె]
మంచుమేపు = బీటిగడ్డిపై కురిసిన మంచు ఆరిపోకముందే, వేకువన పశువులను మేపునది, ఇది మంచిది—*దూడలు మంచు మేపుతో రెక్కొన్నవి* [నె]
మంచెపెట్టు = రెండు క్రోసుల దూరము [కరీ]
మంజిరిపీట=తురుముపీట;మంజల్‌పీట [వ]
మంజల్‌పీట=(చూ) తురుముపీట [మ]
మంటినూనె=కిరోసిన్ [కర్నూ]
మంటిబుక్కడు = విషములేని ఒకజాతి పాము [వి]
మండగరువు=భరించరాని కరువు [కరీ]
మండజలకము = స్ఫోటకాదులు వచ్చిన వారికి వేపమండతో చేయించు స్నానము [నె-ఖా]
మండదొక్కుట=ఆకు కట్టలు ఒకదానిపై నొకటి పేర్చుట; పచ్చి తాటిఆకు చదరముగా అణుగుటకు వరుసుగా దొక్కుట [అ]
(2) బస్తాలు ఒకదానిపైన ఒకటి పేర్చునట్టు వేయు—*బస్తాలు మండగా వేయండి* [అ]
మండపీత = గుడ్లపీత, గుడ్ల ఎంట్రకాయ [వి]
మండవేయు=(1) వేపాకుమండ తీసికొని మంత్రించు — *పురుగు కాటుకు మండ వేయించుకో* [నె; తె]
మండి=(1) విత్తనములు మోసు లెత్తుటకు నేలమీద చక్రాకారముగా నెరిపిన గింజల కుప్ప. దీనిని తడుపుచుండిన మోము లెత్తును [నె]
(2) ఒకవిధమగు విషవ్రణము.
మండిక = పశువులకు కుడితిని త్రాగించు మట్టితొట్టి [శ్రీ]
మండిగము = బండి యిరుసుపై అడ్డముగా నుండు మొద్దు; అడ్డ [నె-ఖా]
మండిపోవు = (1) ఎక్కువ కోపముతో ఉండు

(2) బజారు ధరలు పెచ్చు పెరిగిపోవు — — బజారు మండిపోతు న్నది, మండిపడు [క, నె; తె]
మండె = (1) కట్ట—అవి మండెలు [అ]
(2) కోసిన జొన్నకంకులు పోయుటకు చొప్పతో గుండ్రముగా అమర్చిన బొట్ట వంటి గూడు [నె]
(3) వస్తువుల రాశి ]అ]
మండెతిరుగు = దెబ్బతగిలి విరుగు [గు]
మండెబోయు = మొలకఎత్తుటకొరకు వండ్లు నానబోయు [నల్ల-భోనగిరి; నె]
(2) మామిడిపండ్లు పండుటకు (మాగు టకు) వేపాకు వేసిపెట్టుట [మ]
మండెలమాను = కుంపుడు బావులలో క్రింది తల్లిపరను అమర్చి కుంచు పచ్చి పాల కొయ్యతోచేసిన గుండ్రటి చట్టము [నె]
మంత్రి = మంగలి [శ్రీ]
మందెన్న అంగడము = గుణగణములు తెలియని గొడ్డు [కరీ]
మందకొనారి = గొఱ్ఱెలమంద యజమాని [శ్రీ]
మందగట్టు = పశువులమ ఎరువుగా పొలము లలో కట్టివేయు; మందపెట్టు, మందవేయు [నె]
మందగుది = వాయువువ్యాధి వలన, పశువులు పండుకొని లేచి నడుచునప్పుడు, మొదటి నాలుగైదు అడుగులు నరములు లాగి నట్లు అడుగులు వేయునది—*మందగుది వసరం* [నె; తె]
మందట = ముందుట; సమక్షమున— *అయ నను మందట పెట్టుకొని ఆ పని చేయి* [వ; నె]
మందపెట్టు = (చూ) మందగట్టు, మందవేయు [అ]
మందము = నీటి ప్రవాహములో నుండు మిక్కిలి లోతైన మడుగు [గో]
మందముచేయు = మక్కు మంచము, తలు పుల మొదలగునవి చేసినప్పుడు, పలకల లోని రంధ్రములు కనుబడకుండ జీనిగల వాడు (వడ్రంగి) ఒకవిధమైన పదార్థముతో మెత్తుట [అ]
మందల = (1) సేద్యపు కార్యక్రమము— *మందలకాడ కనిపెట్టుకొని ఉండాల*
(2) విషయ విపులీ కరణము — *మందల చెప్పి పంపు*
(3) క్రమము — *వాడి పనికి అందలా మందలా లేదు* [నె]
మందలచేయు = ఒక పనిలో ఒక ఘట్ట మును పూర్తిచేయు [నె]
మందలింపు = ఒకరికి జరిగిన అశుభాదు లకుగా పోయి ఓదార్చుట; పరామర్శించు; విచారించు — *ఆయనను మందలించి వచ్చినా* [హై]
మందవేయు = (చూ) మందగట్టు; మంద పెట్టు [అ]
మందళ్లు = దున్నినచేని గనిమల చుట్టులోని భాగము — *మందళ్లు దున్నినారు* [నె-ఆత్మ]
మందుకొట్టు = సారాత్రాగు—*వాడు మందు కొట్టాడు* [వి]
(2) నల్లమందు మొదలగు ప్రేలుడు వస్తువులుంచు కొట్టు [నె]
మందులమారి = మందులు బెట్టి మగనిని మలుపుకొనునది [కరీ]
మంపరము = స్మృతి లేకుండుట, మూర్ఛ; మంపు [అ; బ]
మంపు = స్మృతిదప్పుట; మూర్ఛ; మంప రము [అ, బ]
మకిరె = తట్ట [సే]
మకిలీ = మలినము, మురికి; మకిలె [శ్రీ; నె]
మకిలె = (1) మైల

(2) ప్రసూతి వ్యాధి; మకిలీ [కరీ]

మకుడు = మురికి—*గుడ్డలు మకుడు బట్టినవి*; మకిలీ [నె; ఆత్మ]

మకురు = పొగరుబోతుదనము మొండి పట్టుదల; మొకురు [అ]

మక్కె = (1) నడుము; మక్కె— *మక్కె విరుగగొట్టు* [గ]

(2) ఒకరకపు పురుగు, ఇవి నువ్వు మండెలపై వ్రాలి విత్తులను కాజేయు [కరీ]

(3) మొక్కజొన్న [కరీ]

మక్కష్టము = ముఖక్షౌరము [అ]

మక్కిరి = (మా) జల్లి [అ-పె]

మక్కు = మొండివాడు [చి]

మక్కు =(1) ముదిరినకాయ పండబారు—*మామిడి బాగా మక్కలేదు*

(2) ధాన్యాదులు ఎక్కువగా పాతబడు—*వడ్లు మక్కిపోయినవి* [నె; కర్నూ; వ]

(3) పుండు; గాయము [వ]

(4) కట్టెపొడితో బంధనచేసి కొయ్య పనిలో ఉపయోగించునది [చి]

(5) మక్కినవాసన (ఎక్కువగా మాగినది) [అ-నె]

మక్కుడువాసన= (1) పాతబడిన వాసన; ముక్కవాసన [నె; కర్నూ, తె]

(2) ఎవరికిని తెలియకుండ దాచుట [గో]

మక్కువేయు = గుమ్మి మొదలగు వాని లోని ధాన్యముమీద గడ్డికప్పి పైన బురద మట్టి పట్టించి మూసివేయు; మెత్తు వేయు [వ]

మక్కె = తొడఎముక కీలు—*మక్కె విరిగింది* [నె; కర్నూ; తె; అ]

మక్కెర= (1) వెదురుతో అల్లిన బండిపై బెట్టు జల్ల, *ఈ మక్కెరలో ఎరువులు ధాన్యము వగైరా పోయుదురు*; జల్ల; డొల్లి [చి]

(2) పేడ, మట్టి పూయని గంప [సే]

మగత = కునుకు—*చిన్న మగత పట్టింది* [వి]

మగుచాతనము = పొగరు [కరీ]

మచ్చ = (1) వెదురువబ్బ [నె]

(2) అట్టుక; అట్టడ [అ]

మచ్చనాలికవాడు = అబద్ధములు చెప్పువాడు (నాలుకపైన ఏర్పడిన మచ్చలు బొల్లిమాట లాడించునని) [నె]

మచ్చమాపు = చంపు [నె]

మచ్చు = (1) అట్టు; సామాను లుంచుటకును సాధనము లుంచుటకు అనువుగ సామానుగదిలో ఏర్పరిచినది; మచ్చు; అట్టడ [మ; నె-పొదలి, అ, కర్నూ]

(2) పశువులగాటి మీద మేత పెట్టుకొనుటకై కట్టినట్టి అట్టడ [తె]

(3) అడ్డవర (అడ్డమార) వంటిది; రెండు గోడలు కలియు మూలలందుంచు రాతిపలక [చి]

మచ్చు = (1) స్త్రీలు పురుషుని లోబరచుకొనుటకు బెట్టు మందు; గరము; మరులు మందు — *మచ్చుమందు చల్లినట్లున్నది* [నె]

(2) మైకము కలిగించు మందు [వ]

(3) పెద్దకత్తి— మచ్చుకత్తి; మడ్డుకత్తి [సే; నె]

(4) ఉదాహరణమునకుగా చూపు వస్తువు

మచ్చుకులేదు = లేనేలేదు, బొత్తుగా లేదు [కరీ, నె]

మచ్చుకొడవలి = కట్టెలను నరుకుటకు ఉపయోగించు వంకరలేని లావు కత్తి; మచ్చుకత్తి, మడ్డుకత్తి [అ]

మచ్చుపిసరు = మాదిరికై తీసిన పసిడి పిసరు [కరీ]

మచ్చుమాయ = మోసము [వి]
మచ్చెర్కాలఆడ్డి = వగలాడి [మ]
మచ్చెర్కాల చేష్టలు = సమ్మదగని చేష్టలు [మ]
మజాలు = దమ్ము; ధైర్యము—*మా పైన చేయి వేయటానికి వానికి మజాలు గలవా* [కరీ]
మజ్జు = జబ్బుగలది; సోమరి [కరీ]
మటమటలాడు = విసుగుతో ముఖము మాడ్చుకొను [నె, తె]
మటిక = గోరుచిక్కుడు; గోకిరికాయ; శ్రీరామచిక్కుడు, మట్టిక; మొటిక [నె-మెట్ట; రా; హై]
మటికి = కుండమీద మూసిపెట్టు పాత్ర; మూకుడు [కర్నూ-వ-కొ]
మటిరె = మట్టిపాత్ర [ఎ]
మటియా = చిన్నబిందె [శ్రీ]
మటుకు = వరకు; సంబంధించినంత వరకు; మట్టసానికి — *నామటుకు నాకువద్దు* [నె; కర్నూ; అ; తూ-గో]
మటుమాయముజేయు = చూచుచుండగా అగుపడకుండా మరుగుపఱచు [కరీ; నె]
మట్ట = (1) ఆకులు పేర్చిపెట్టిన చిన్న మడుపు—*మట్ట విదల్చు* [నె; కర్నూ; తె]
(2) టెంకాయ, తాటి ఆకు—తాటిమట్ట [నె; అ; గో]
(3) చిన్నతాటిచెట్టు; గున్న [గో]
(4) లావుతాటి నార [నె]
(5) ముంజేతి ముంగలి భాగం [కరీ]
మట్టందట్టు = అసలుకే మోసం — *వాడు మట్టంద ట్టేవాడు* [చి]
మట్టగడ్డి = గొడ్లచే తొక్కించిన వెనక కళ్లంలోనుండి తీసినగడ్డి; కలిమట్టు గడ్డి [గు]
మట్టగించు = (1) పెళ్లగించు [గో]
(2) తక్కువజేయు—*ఆయన మా ఇంటికి రావడం మట్లగించినాడు* [నె]
(3) నరికివేయు [నె-పొ]
మట్టగుడిశ = కొరమీనువంటి నల్లటి చిన్న మంచి నీటి చేప; మట్టగొడిసె [నె; తె]
మట్టగొడిసె = (చూ) మట్టగుడిశ
మట్టపరచు = చిల్లాపల్లా పడి ఉన్న వాటిని చక్కజేయు—*ఆ కాగితాలను మట్టపరచి పెట్టు* [నె, తె; అ]
మట్టము = తక్కువ — *తెలివి కొంత మట్టము*
(2) ఎత్తుకొలత—*నీటి మట్టము*, గోడ మట్టము [నె, కర్నూ, అ; తె]
మట్టసము = (1) పొదుపు — *మట్టసమైన సంసారం* [నె; తె; అ]
(2) బుద్ధిగా, మర్యాదగా [కర్నూ]
(3) పరిశుభ్రము
(4) కచ్చితము
(5) సరియైనది [అ]
(6) అధికము — *వారి సంసారం మట్టసముగా ఉన్నది*, బాగా అభివృద్ధిలో నున్నదనుట [నె, కరీ]
మట్టసానికి = సంబంధించినంత వరకు; మటుకు—*నా మట్టసానికి* [నె; కర్నూ; గు; అ]
మట్టు = (1) కుండ ఉంచు కుదురు—*కుండ మట్టు* [వి]
(2) తొక్కు [శ్రీ]
మట్టు = మనిషి ఎత్తు మోయన పీటిలోతు, (ఇది ఆరడుగుల కొలత); నిలువు — *నాలుగుమట్ల బావి* [నె; వ; తె; అ]
మటుకు = మట్టుకు (చూ) [వ]
మట్టు = చూడు ఆవులు, గేదెలు యొక్క యోనులనుండి స్రవించు జిగురు పదార్థము [గో]

**మట్టుగడ్డి**=మరిపిడిలో గింజలు రాలిపోయి నను నలుగుడు బడక మట్టగా (మట్టపరచి నట్లు) నుండుగడ్డి; పేకె [నె]

**మట్టుగార్చు(బోయు)**=గేదెలు మొదలగు నవి కట్టుటకు ముందు తెల్లని రసిని కార్చు [కరీ; గో]

**మట్టె** = (1) ముత్తైదువలు కాలివ్రేళ్లకు ధరించే భూషణాలు; మెట్టె [వ]
(2) బటల ఆవు

**మట్టెంచు** = వరికుప్పల నూర్చు; నురిపిడి [శ్రీ]

**మట్ర**=(1) చిన్నకొమ్మ [వె]
(2) దున్నటలో సాయికు సాలు నడుమ నిలిచిపోయిన గడ్డ—*దుక్కిలో మట్రలు పోయినవి* [నె]

**మట్రము**=సరిసమానం [కరీ]

**మరము** = బడి [అ-పె]

**మడక**=(1) స్థలము
(2) ఊరు
(3) చుట్టుపట్లు; పరిసరము [శ్రీ]
(4) నాగలి [నె; రా, తె]
(5) పొలము అటు ఇటు రెండుచాళ్లగా దున్ను—*చేనుకు మడకైనది* [నె,కర్నూ]
(6) పల్లము — *పొలం మడకైంది* [నె-పొ]

**మడగంచము**=కంచుతో చేసిన పెద్దకంచము [గు]

**మడత కుడుము**=ఉపవాసము— *ఈదినం నాకు మడతకుడుములే* [వి, నె, గు]

**మడతబందికలు** = మోచేయి మోకాళ్లకీళ్ల [చి]

**మడతమాటలు** = ద్వంద్వార్థము నిచ్చు మాటలు [కరీ]

**మడదల**=మోమెత్తని విత్తనపు గింజ [నె]

**మడదొక్కు**=తాటిఆకు కొట్టిన తర్వాత, పచ్చిమీదనే ఒకదానిపైన ఇంకొకటిగా బారుగా పొడవుగా తొక్కి ఉంచుట.— దీనివల్ల ఆకు చదరమగును [నె]

**మడనాలుక**=అబద్ధములువలికించు నాలుక; మచ్చనాలుక [కరీ]

**మడపరొయ్య**=ఒలవకుండానే ఎండబెట్టిన రొయ్య [నె]

**మడపలు**=పితరుల కిచ్చు నైవేద్యము;మడ సళ్ల [వి]

**మడసళ్లు**=పితరుల కిచ్చు నైవేద్యము; మడ పలు

**మడసోల**=కాలిమడమలో పుట్టు మాదు; మడిశూల [వి]

**మడవ** = (1) కయ్యలకు నీరుపారుటకుగా గనిమలలో చేసిన చిన్నగండి — *మడవ తీసివేయు*
(2) అడ్డమువేయు కట — *మడవవేయు* [నె; కర్నూ; తె]
(3) వరవ [కరీ]

**మడవకట్టుకాడు** = చేలకు నీరుపారించు వాడు; నీరు కట్టుగాడు [నె; అ]

**మడవలి**=చాకలి, మడేలు [చి]

**మడి**=(1) ఆడపశువుల మర్మస్థానము [నె; కర్నూ; క; గో]
(2) మాగాణిపొలము — *మడిచేని మనిస వాడు; చేను (మెట) చేని చెడినవాడు లేడు* [రాయి]

**మడికాలు**=చేను; కయ్య, పొలము—*మడి కాలుకు పోయినాడు* [నె; మెట్ట; వ, అ]

**మడిగె**= దుకాణము [మ]

**మడిచేయు** = పశువు ఈనుటకు ముందు గుడిలో కలుగ మార్పు — *బఱ్ఱె మడి చేసింది,* (ఈ కారణముగా) కరిమి పెద్దదై జారును, ముడ్డిపైన చొట్టలు పడును [నె; అ; గో]

**మడిపెట్టు** = పశువు త్వరలో ఈననుండుట [అ]

మడిమ్రట = పొలములు; గడ్డిగాద మన్నట్లు జంటపదము [కర్నూ]
మడియమాసి = ప్రమాణమునకు మించిన మోటుమనిషి (ఆడుది)
మడియాలు = చాకలి [శ్రీ]
మడుగుబూలు = మణుగు బువ్వలు; తేనె తెలలు [అ]
మడుపు = (1) ఎదిగిపోయిన తముల పాకు తీగను అనుగా పెరుగు అవిశచెట్టు మొదలుకు దించి క్రింద అంటుగట్టునది [నె]
(2) దున్నిన దుక్కి తిరుగ దున్నినది.
(3) సున్నముదాశి మడచి యిచ్చిన తమల పాకు [గో; అ; వ]
మడుపులు = (1) చిన్నచిన్న కట్టలుగా పేర్చిన ఆకులు — *రెండు మడుపులు యిట్లందియ్యి* [నె; తె]
(2) తాంబూలమునకు సిద్ధముచేసిన తమల పాకు
(3) ఆకుపూజ (దేవతను ఆకు మడుపులతో అలంకరించునది [అ]
మడువ = కట్ట; మళ్లచుట్టు కట్టిన కట్ట, మడవ [న]
మడువులు = ఉతికి మడచిపెట్టిన గుడ్డలు [నె]
మడువులెత్తు = మొక్కుబడి వెల్లించుటకు కోవెలకు నడచి పోవుటకుగా నేలమీద చలువ చేసిన దుప్పట్లను పరచి, నడచి పోయిన దానిని ఎత్తి, మరల ముందు పరచుచు దారి సాగించుట. ఇది గొప్ప వారికి గూడ చేయు మర్యాద; ఇప్పటి ఎఱ్ఱకంబళి పరచు రాజలాంఛనము వంటిది (మడువులు—*మడువులు* = ఉతికి మడచి పెట్టిన గుడ్డలు) - *అడుగులకు మడువు లెత్తుచు ఊరేగించినారు;* మడువులొత్తు [నె; తె; అ]
మడువులొత్తు = (చూ) మడువులెత్తు [తె]
మడేలు = చాకలి; బత్తుడు, మడివేలు; మడియాలు [కరీ]
మడ్డికూడు = సజ్జలు జొన్నలు, వక్కలు ముక్కలుగా దంచి, ఉడుకవేసి పశువులకు వేయునది [నె-మెట్ట; తె]
మడ్డిగము = వివాదము వచ్చినపుడు, మధ్యస్థుని దగ్గర ఒక వస్తువు నుంచుట [నె-పొ]
మడ్డుబూలు = మణుగుబూలు [మ]
మడ్లగిబ్బ = (వ్యంగ్యముగా) బాగా బలిసి కావర మెక్కిన మనిషి, తరుచు స్త్రీలకే వాడుదురు [కరీ]
మణుగూలు = (చూ) మణుబువ్వ [కర్నూ]
మణుబువ్వ = ఎక్కువ చుట్లు గలిగిన మురుకు; మణుగుబువ్వ, మడుగుబూలు, మణుగుబూలు; తేనెతెల [నె; వ]
మణుగుబూవు = (చూ) మణుబువ్వ [నె]
మతకము = స్తబ్దత; సోమరితనము—*ఏదో మతకంగా ఉన్నది* [నె]
మతించు = (1) లెక్కబెట్టు—*దాన్ని వాడు ఏమీ మతించలేదు* [నె]
(2) అంచనా వేయు [అ]
మతుపు = కప్పిపుచ్చు; మసపు [కరీ]
మత్తగోలుగా = మత్తుగా [కరీ]
మదనపడు = (1) సంకటపడు; మధనపడు [నె, తె; అ]
(2) వెనుక ముందాడు [నె-పొ]
మదనమాగు = (చూ) మదరమాగు [ ]
మదనము = వరికుప్పచుట్టు చెక్కిన స్థలము; కల్లము [కరీ]
మదనానప — స్వాయి; పరంగి; పా...యి, బొప్పాయి [వి]
మదరమాగు = పంట ఎక్కువగా మాగు; మదనమాగు; కలమాగు [నె; అ]
మదలకించు = ఒక విషయమును గిట్టిగా అడుగు [శ్రీ]
మదసము = (చూ) మటసము [అ]

మదిటిమీద పైరు = ఉన్న శక్తినంతా ఉపయోగించుకొని స్వల్పకాలము మాత్రమే విఱ్ఱవీగువాడు. ఇది గింజ పొగరున్నంత వరకే మనునుగాని అవల ఎండిపోవును— *వాడు మదిటిమీద పైరుమాదిరి సాగించినాడు* [నె]

మదిర = మజురా; సివారుపల్లె; మజరా [కరీ]

మదుగు = ఒకేచోట నీళ్లు నిఱచు [కరీ]

మదుపు = (1) జీతగానికి ముందు ఇచ్చు పెట్టుబడి [శ్రీ]
(2) బంగారులో కలుపు రాగి [తె]
(3) కప్పిపుచ్చు; మతుపు [కరీ; అ]

మదుపుపెట్టు = పని చేయించుకొనుటకు ముందుగా డబ్బుఇచ్చు (Advance) ఇచ్చు [గు]

మదుము = చిన్న కాలువమీద కట్టిన చిన్న వంతెన; అట్టెడ; దాటు [శ్రీ]

మద్దు = దేనికదిగా లెక్కలు చేర్చు [కరీ]

మద్దెము = అసహ్యము [కృ]

మద్దెలు = సమీపము—*అవీది మద్దెలకువచ్చియుండును* [నె-పొ]

మధనిపడు = బాధపడు; మదనపడు [వి; వ; అ, కర్నూ]

మనగానము = గోడలకు గచ్చుపూతచేయుట [అ]

మనవడు = కట్టుకొనిన భర్తతో కాపురము చేయు [శ్రీ]

మనవర్తి = (1) జీవనోపాధికి యిచ్చు భృతి; మనువర్తి—*అమెకు మనవర్తి నాలుగు పుట్లు* [నె]
(2) అనాథలకు భర్త విడిచిపెట్టిన వారికి ఇచ్చు పోషకభృతి, మనోవర్తి [వ]

మనిగాసము = నేలను మనువుచేయు; చదరము చేయు [చి]

మనిగాసంపలక = నేలను చదునుచేయు సాధనము [చి]

మనుగుడుపులు = పెళ్లిచూపులకు పెళ్లిచేయు భోజనము [మ]

మనువర్తి = (చూ) మనవర్తి [కర్నూ]

మనుసాలు = భోజనాలగది తరువాత ఉండే విశాలమైన గది (సిటింగ్‌రూము వంటిది)

మనువు = పెండ్లిచేసుకొనిన భర్తతో కాపురము చేయు [శ్రీ]

మనువెళ్లు = పెండ్లియాడు [శ్రీ]

మనేదా = మనోవ్యధ — *వాడు మనేదాతో బాధపడుతున్నాడు* [గు]

మనోరంజితము = మనోరంజని; సంపెగ పువ్వు [చి, నె]

మనోవర్తి = (చూ) మనవర్తి [అ; తె; నె]

మనోవర్తి = భర్త చనిపోయినా భర్త వదలివేసినా ఆ భార్యాపిల్లల పోషణ నిమిత్తము ఆ భర్తకు కల్గిన ఆస్తిలో నుంచి ముట్టజెప్పబడే ఆదాయం; మనవర్తి [గో; నె]

మన్నాడు = (చూ) మర్నాడు [అ; మ]

మన్నెండు = మృతిని పొందినాడు [మ]

మన్నెపువాడు = రైతులవలన ఏర్పాటుచేయబడిన మాదిగవాడు [మ]

మప్పు = మరపు; నేర్పు [వి]

మప్పుట = మాటలను కప్పిపుచ్చుట [కరీ]

మబ్బు = (1) చీకటి
(2) మందకొడితనము [అ]

మబ్బుఏలు = ఆకాశంలో ఒకతట్టు ఎక్కువగా మబ్బుచేరు—*పరమట బాగా మబ్బు ఏలింది* [నె]

మబ్బుది = జాగ్రత్తలేనిది — *మా పిల్ల ఒట్టి మబ్బుది* [నె-పొ]

మబ్బుపట్టు = మబ్బుఏలు [అ]

మమేకము = ఎంతోప్రేమగా అన్యోన్యముగా ఉండు [గు]

మయిలెద్దు=అన్ని రంగులు కలిసిన ఎద్దు [కరీ]

మరక=ఎడకారు మేక, లేక గొఱ్ఱెపిల్ల—*పెండ్లికి ఒక మరకను పడవేసినారు;* మరి [నె-కనిగిరి; వ]

(2) గుర్తు—*బట్టకు నల్లమరక వేసినా* [తె]

(3) మైల; కర [నె]

మరగాలు = (1) కొయ్యతో చేసిన కృత్రిమపు కాలు, దీనిని కట్టుకొని నాట్యము చేయుట ఒక విశేషము; కొయ్యకాలు గుఱ్ఱపుఆట దక్షిణాదిన ప్రసిద్ధము [నె; తె]

(2) కఱ్ఱ [గో]

మరగు=(1) చారు మొదలగునవి ఎక్కువ కాగు; మరుగు

(2) ఆసక్తుడగు — *తిన మరగినాడు* [నె; తె; అ]

మరచెంబు = మూతిని బిగించుటకు మర గోసిన చెంబు, రైలుచెంబు [అ, తె]

మరదాము=చెట్టుకాయ రెండవకారు కాపు, గైరంగము [చి]

మరన్ని=ఎక్కువ—*మరన్ని పెట్టు;* మరిగన్ని, మరిన్ని [నె]

మరపు=(1) అలవరచు—*మరపవచ్చును గాని, మాన్పలేము* [నె; అ, వ]

(2) కోడెను పనికి అలవాటుచేయు — *దానికి బండి మరపినారు;* మరుపు [నె; కర్నూ, తె]

మరమరాలు=బొరుగులు [కర్నూ; తూ-గో]

మరము=(1) చేట [పే]

(2) గట్టి రాతి పారు నేల; మరుము [నె]

మరవ=(1) ముంతకంటె కొంచెము పెద్ద మట్టిపాత్ర [నె-ఆత్మ; నె-పొ]

(2) చిన్నకుండ—*మజ్జిగ మరవ* [అ]

మరవ=(1) చెరువు అలుగు

(2) కోడి [అ]

మరవలు=వయస్సు చెల్లినవారికి నరముల నుండి కాళ్లకు దిగు నీటిచారలు. ఇవి తాళ్లవలె లావుగ కనిపించుచుండును — *ఆ కోడికి కాళ్ల మరవలు దిగెను;* జోము దిగు [నె-పొ]

మరామళ్లు=చిక్కులు, మారాముళ్లు [గు]

మరామేకు=అసాధ్యుడు (స్క్రూ అని) [వి]

మరి=గొఱ్ఱెపిల్ల; మరక

మరిగంత=ఎక్కువ—*మరిగంతా తీసకరా* [నె]

మరిగన్ని=ఎక్కువ — *మరిగన్ని ఇవ్వాలాక;* మరీన్ని, మరిన్ని [నె]

మరిడమ్మ=కలరా [వి]

మరిన్ని=(1) మరికొంచెము [వి]

(2) ఎక్కువగా; మరిగన్ని; మరీన్ని [తె; నె]

మరిపేట=ఉదయము తిను చలిది అన్నము నకు మధ్యాహ్న అన్నమునకు మధ్య తిను తిండి [శ్రీ]

మరివేలు = పెండ్లికాగానే, వధూవరులు అత్తగారింటికి (వధువు యింటికో వరుని యింటికో, వెళ్ల సాంప్రదాయక ప్రయాణము. వధువు యింట పెండ్లి అయిన వరుని ఇంటికి, వరుని ఇంట పెండ్లి అయిన వధువు ఇంటికి పోవునది [చి]

మరుగు=(1) నీళ్లు మొదలగునవి ఎక్కువగా కాగు; మరగు [కర్నూ]

మరుగుమందు = స్త్రీ పురుషుని లోబరచు కొనుటకు పెట్టు మరులు మందు; మచ్చుమందు; గరము [వ]

మరునాగి=(చూ) మర్నాగి [కరీ]

మరునాడు = (1) ఆవల ఎల్లుండి (నాల్గవ నాడు) — *నేడు, రేపు, ఎల్లుండి, మరునాడు;* మర్నాడు [నె; కర్నూ]
(2) రేపు [సర్కా]
(3) ఎల్లుండి [అ]

మరుపు = (చూ) మరపు [నె; కర్నూ]

మరులమందు = స్త్రీలు పురుషుని లోబరచుకొనుటకు బెట్టు మందు; మచ్చుమందు; గరము [నె]

మరుసు = ఇసుకనేల మధ్య పేరుకొనియుండు జిగట మట్టి — *మరుసు దగిలి నీరు రాలేదు* [నె]

మర్దాము = మరల క్రొత్తగా నాటకనే పాత మొక్కలనుండి మొలిచిన కరలు; కొయికాలు; నాప — *మర్దాంచెరుకు* [చి]

మర్నాగి = చెరువులకు బుంగలు బుచ్చు ఒక జంతువు
(2) (వ్యంగ్యముగా) మోసకాడు — *ఇతడు మర్నాగి;* మరునాగి [కరీ]

మర్నాటు = ఎల్లుండి, రేపటి తర్వాత దినము (మూడవదినము) [అ]

మర్నాడు = (1) ఎల్లుండి తర్వాత దినము; అవల ఎల్లుండి, మరునాడు (నాల్గవనాడు) [నె; కర్నూ]
(2) ఎల్లుండి (మూడవనాడు) [అ; చి]
(3) రేపు (రెండవనాడు) [సర్కా] మరునటినాడు; మరునాడు

మర్లవేయు = (చూ) మలవేయు (వ)

మర్లాకు = దూడను ఒల్లని పశువులకు బెట్టు ఆకు ఓషధి (మరులు గొలుపు ఆకు) [నె-పా]

మలక = సారి — *ఒక మలక మీరు రండు* [కరీ]

మలక కూర = కొయ్యగూర; కోయటాకు [అ]

మలకబెట్టు = పనికిరాక బందుబెట్టు [కరీ]

మలకుదోలు = పశువులను వానకాలములో మేపుటకుగా కొండ (మల) ప్రాంతపు బీళ్లకు తోలుట; ఇది సాధారణముగా నెల్లూరులో వెలిగొండలకు తోలుచే అగును పులవరి (పుల్లరి)తోబాటు కోయ, చెంచు వాండ్రకు మేపుకూలి యిత్తురు. అచట వారే మేపి కాపాడి, మేపు అయిపోగానే తిరిగి తూర్పునాటికి తోలుకొని వత్తురు — *ఆవులు మలకు దోలినాము;* మలకుపోపు [నె]

మలగుదాలు = (1) చిక్కులు; అభ్యంతరములు — *మలగుదాలు పెట్టినాడు*
(2) నిర్ణయము కుదురనందున రహస్యముగ ఆలోచనలు సలుపుట — *ఏదో మలగుదాలు పడుతుండినారు;* మల్లగుల్లాలు [నె]

మలగులాలు = (1) అయోమయము
(2) నానావస్థ — *ఎంతో మలగులాలు పడి సాధించినాడు* [చి]

మలగొట్టు = బండ్లుగాని, పశువులుగాని, ఒకరి పొలములోనికి రాకుండ అడ్డగించి వెనుక త్రిప్పి కొట్టివేయు — *వాళ్ల బండ్లను మలగొట్టినారు;* మళ్లగొట్టు [నె; అ]

మలదోలు = (1) బీడు మొదలగు సొంత పొలములలోనికి ఇతరుల పశువులు రాకుండ ఆంక్షబెట్టుట. గడ్డి ఎదిగిన తర్వాత సొంత పశువులను మాత్రమే ఇందు మేపుకొందురు. ఇట్లా మలదోలిన దానికి గుర్తుగా ఎల్లలలో తాటి ఆకులను చెట్లకు గట్టియుంతురు; మళ్లగొట్టు — *పరమటి బీడు మలదోలి యున్నది* [నె; అ]
(2) మేపు — *ఆ ఎద్దులను మలదోలుకొనిరా* [చి]

మలప = (1) కొంటెబాలుడు [గు]
(2) నీచమైన — *మలపముండ* [నె]

మలవేయు = పోవుచున్న పశువులను అడ్డగించి, వేరు దారికి తోలు; మళ్లవేయు

మళ్లేయు — ఆవుల మలవేసిన వాడే అర్జునుడు [నె; అ]
మలామా = పైపూత (Ointment) [కరీ]
మలాయిదా = పరిష్కారము కాని (Pending) [కరీ]
మలిదత = (మలి + ఇదత) రెండవమారు— *మలిదత అన్నం తినలేదు* [చి]
మలిమిడి = పశువుల కాళ్లలో బుట్టు పుండు; గాలికుంటు [నె; పొ]
మలీద ముద్దలు = పీర్లకు నివేదించిన బెల్లపుముద్దలు [కరీ]
మలుచు = (1) చేటలో బియ్యము మొదలైన వానిని వేసి ప్రక్కగా కదలించుట, దీనితో రాళ్లు వేరగును — *రాళ్లు మలువు* [తె; నె]
(2) మందలో అమ్మిన గొర్రెలకు గుర్తుగా రోమములు కత్తిరించు — *మలచిన గొర్రెల బయటికి తోలండి* [నె-పొ]
మలుకప = చాల చిన్నదారి, ఇరుకుదారి— *ఆ మలుకులో వెళ్లాల* [చి]
మలుగు = పామువలె నుండు మంచి నీటి చేప [నె; అ]
మలుగుజారు = చూడు పశువులకు ముడ్డి పైభాగము కొంచెము జారు; ఇది త్వరగా ఈను ననుటకు సూచన [నె; కర్నూ; అ]
మలుపన = లేగచచ్చిన పాడి గేదె మరల చేపి పాలిచ్చుట — *మా గేదె మల్పన (మలుపన) పాలిచ్చినది* [కరీ]
మలుపు = (1) పీడి తిరుగుడు; కుని — *వీధి మలుపులో నక్కినాడు* [నె; కర్నూ; అ]
(2) పైరున్న చేనిలో ఎక్కువైన నీరును ఇంకొక కయ్యలోనికి నడిపి, చివరన బయటకు తీసివేయుట—*నారు కయ్యలో నీళ్లు మరవిరా* [నె]
(3) త్రిప్పు—*బండి మలువు* [తె]
(4) రవిక కణుమ [కరీ]
(5) ఆర్పు—*ఆ దీపమును మలువు* [అ]
మలుపుకొను = మచ్చిక చేసికొను; మరవుకొను [కరీ]
మలుము = (1) పాడిపశువులు చేపుటకుగా, పాలుదీసే దానికి ముందు తినుపించు చున్న మొదలగల బుట్టమేపు [నె-మెట్ట; గు]
(2) గొర్రె, మేకల పిల్లలు వేయు పెంట [అ; పె; గు]
మలువగడ్డి = సారమైన కంచె గడ్డి [కరీ]
మలెసాల = మెల్ల; అరుగు [కరీ]
మల్లగుల్లాలు = (చూ) మలగులాలు [గు]
మల్లదోలు = పశువులుమేయు నీటిలో పచ్చి కను పెంచుటకు పశువులను రానీయకుండు; మలదోలు [నె-పొ]
మల్లబడు = అవసరమప్పుడు వెనుకా ముందూ చూచుకొనకుండ పనికి దిగు; నడుముగట్టు [గు]
మల్లి = అక్కడి మాటలు ఇక్కడ, ఇక్కడిమాట లక్కడ చెప్పెడు ఆడుది [అ-పె]
మల్లిముల్లు = ముల్లుతీయు సాధనము; మల్లె ముల్లు [చి]
మల్లు = ఏకులు [నే]
మల్లుకొను = (1) విజృంభించు; ప్రారంభించు— *పడమటి గాలి బాగా మల్లు కొన్నది* [నె]
(2) ఒక పనిని పలుమారు చేయు— *అప్పుడే దబ్బు అడుగను మల్లుకొన్నాడు* [నె]
మల్లె = జొన్న, బాగాకు చేలలో పైర్లు పాడుచేయను మొలచిన మొక్క — *ఆ చేనికి మల్లెగొట్టింది* [తె; గు]
మల్లెముల్లు = కాలిలో ఇరిగిన ముల్లుతీయు శ్రావణమువంటి చిన్న ఇనుప సాధనము [నె-అత్మ]

మల్లెమొగ్గ = చాల చక్కనిది [కరీ]
మల్లెలు = (చూ) మెల్లె [అ]
మశనికాడు = వల్లకాడు; శ్మశానము [తె]
మశాణం = శ్మశానము— *మట్టి మశాణం అయిపోయింది* [నే; నె]
మశానము = శ్మశానము [తె]
మషాకత్తు = సేవ [వి]
మసకనేల = మన్ను ఇసుక కలిసినది; ఇసుకకర [అ]
మసలు = వచ్చిపోవుటలు— *అటు మనిషే మసల లేదు* [నె; కర్నూ; అ; వ]
మసి = సిరా [అ]
మసిగుడ్డ = వేడి వంటపాత్రలను దింపుటకు ఉపయోగించు మసియైె మాసిన గుడ్డ పేలిక [నె; అ; కర్నూ; తె]
మసిపాత = (చూ) మసిగుడ్డ [కరీ]
మసిబుడ్డి = సిరాబుడ్డి; నౌటి; దవతి [అ]
మసిలీశం = చేపలు పట్టువారి పాలెం; పట్టపు పాళెం; బెస్తపాళెం [శ్రీ]
మసుకు = కనుజీకటి — *మసుకులోనే బయలుదేరినా*; మసుగు [నె]
మస్కాగొట్టు = మోసము చేయు[అ-పె]
మస్కాబెట్టు = (1) కండెనబెట్టు (2) వంచించు [కరీ]
మస్కావేయు = ఉచ్చించు [మ]
మస్రీ = మదము, పొగరు [వ]
మస్తు = (1) మదము—*ఏనుగ మస్తు పట్టినది*; మదించినది [అ] (2) ఎక్కువ—*మామిడి మస్తుగా కాసింది* [నె]
మస్లె = అబ్కా; అట్లవ [నల్ల]
మహడి = మిద్దె; మాడి [కర్నూ]
మహసూలు = కుప్పలు నురిసి ధాన్యము ఇంటికిచేర్చి, గడ్డివాములు వేయు సేద్యపు పని; మాసూల్ — *ఈ ఏడు యింకా మహసూలు కాలేదు* [నె]

మహసూలు అను అరబ్బీ పదమునకు అదనని, ఋతువని అర్థము. పూర్వము వలెనే మొగలుల హయాములో గూడ శిస్తు ధాన్యరూపముగ వసూలు చేసికొనుటకు దివాణపు ఉద్యోగులు దగ్గర ఉండి రైతుల కుప్పల నురిపించి, తమ భాగపు ధాన్యమును ఆయా యా గ్రామములలోని రాచ గాదెలలో భద్రపరచి, ఎక్కట్లను (జెట్టీలను) కాపుంచి పోయెడివారు. ఇట్లు అదనుకు చేయు నురిసిళ్లను, ధాన్య సేకరణను మహసూల్ అనిరి. ఆ ధాన్యపుశిస్తు వసూలు కార్యకలాపము నేడు లేకపోయినను కుప్పలపని పూర్తిచేయుటకు మహసూల్ అనుచునే ఉన్నారు; మాసూల్; సుగ్గి [నె]

మళ = (చూ) మొల [తె]
మళ = చీల; మేకు; మొళ [నే; అ]
మళిగి = పెద్దఅంగడి [అ]
మళిగె = చిల్లర అంగడి [చి]
మళ్లగుళ్లాలు = మలకలు; పేచీలు; మలగుదాలు [కరీ]
మళ్లగొట్టు = (చూ) మలగొట్టు [కర్నూ; అ]
మళ్లవేయు = మళ్లేయు (చూ) —*మలవేయు* [కర్నూ]
మళ్లుగొట్టు = (చూ) మలగొట్టు [వ]

మాంతమైనోడు = ఘటికుడు [మ]

మాగ = పెద్ద సముద్రపు చేప, 2,3 అడుగుల పరిమాణము గలిగియుండునది [కృ]

మాగ = మంచిగా—*నిజంగా* (*సింధ్యగ్రామ్యము*)—మాగ దెచ్చితిని [కరీ]

మాగండము = మహాకష్టము [కరీ]

మాగన్ను = తూగువలన ఏర్పడిన అరమోడ్పు కన్ను—*మాగన్నుగా నుండినా*; మేగన్ను [నె; కర్నూ; తె; అ]

మాగి = చలికాలము [కరీ]

మాగు = పాతబారు — *గాజులు మాగినవి* (చేతిపై చాలకాలమున్నందున)

మాగుడు = (1) పండ్లు మొదలగునవి ఎక్కువగా మాగుటచే కొట్టు కుళ్లు కంపు, బూజువాసన [నె; కర్నూ]

(2) మంచివాసన; పండ్లు మాగిన వాసన [తె]

మాగుడుకాలము = శరత్ హేమంత ఋతువులలో జబ్బులు చేయుకాలము; మాగిలికాలము [నె-పొ]

మాగురువాసన = కుంటువాసన [న]

మాటచేసుకొను = వివాహము నిశ్చయము చేసుకొను; మంచిమాట చేసికొను [అ-పె]

మాటమిగులు = ముందుగా పెద్దగ పలుకు—*మాట మిగిలి దెబ్బలు తిన్నాడు* [నె]

మాటలపుట్ట = వదరుబోతు—*ఆమె మాటల పుట్ట* [నె; కర్నూ; అ; తె]

మాటవచ్చు = (1) నిందవచ్చు [నె; పొ; సర్కా]

(2) రాజదండన కలుగు [నె-పొ]

మాటి = స్త్రీలు కమ్మనుండి, గూబమీదగా పైన జుట్టుకు తగిలించు నగ, మాటీ [నె; కర్నూ; తె; అ; చి]

మాటు = (1) వేటలందు పులి మొదలగునవి వాడుకగా వచ్చిపోవు ప్రదేశములలో -సాధారణముగా జలాశయముల దగ్గర, వేటగాడు పొంచి వేచియుండుటకు అమర్చిన మరుగు ప్రదేశము—*మాటుతటు పులి రాలేదు*

(2) లోహపాత్రలకు పడిన బొక్కలు అతుకుటకు పెట్టిన లోహపుబిళ్ల—*మాటు వేసినాడు* [నె, కర్నూ; తె, సర్కా]

(3) తమలపాకుల చిన్నకట్ట, పిడి [కరీ]

(4) అతుకులు—*బిందెకు మాటువేసినాడు* [కరీ; నె]

(5) గజ్జెలను తయారు చేయునపుడు కుంపటిలో ఏర్పఱిచిన నిప్పులగుహ [గు]

మాటుకొను = (1) ఎదుర్కొను — *వాడు దానితో మాటుకొన్నాడు* [నె; కర్నూ]

(2) తగులుకొను [చి]

మాట్లాడుకొను = ముందుగా బాడుగ మొదలగునవి నిర్ణయించుకొను — *ముందుగా బాడుగ మాట్లాడుకొని బండిఎక్కు* [నె; [కర్నూ; అ: తె]

మాడ — (1) వరహాలో సగము, రెండు రూపాయలు—*అదేం మాడలా వరహాలా* [చి; నె]

(2) దేవాలయ ప్రహరీ అనుకొని ఏర్పడిన గ్రామవీధి— *ఉత్తరమాడావీధి* [చి]

(3) తలరంధ్రము (చూ) మాడు [కరీ; నె]

మాడము = మబ్బు; మేఘము; మోడము —*తూర్పున మాడము పట్టినది* [అ]

మాడి = మిద్దె, మకోడి; మాడి [రా; క]

**మాడీ** = (1) మేడ; మిద్దె [అ, బ]
(2) మిద్దెపై రెండవ అంతస్తు [అ]

**మాడు** = శిశువు పుట్టగనే నెత్తిన పుఱ్ఱెలో ఏర్పడియుండు గుండ్రటి మెత్తటి ప్రదేశము, ఇది క్రమేణా గట్టిపడిపోవును ఇది గట్టి పడుటకు ఎంత ఆలస్యమైన అంత ఆయుస్సు ఎక్కువని నమ్మకము; బ్రహ్మరంధ్రము. పెండ్లిలో వధువుకు జీలకర బెల్లము పెట్టుచోటు, పెండ్లికి ఇదే ప్రధానక్రియ — *మాడుకు ఆముదం పూయి; మాడు పగిలి వచ్చినారు* [నె]

**మాడుచెక్క** = వంటలో అడుగంటి మాడిన చెక్కలు [తూ-గో; గు; నె]

**మాత** = పెండ్లి చేసికొనకుండా జాతరల లోను, కొలుపులలోను జరుగు ఊరేగింపులలో చిందువేయు మాదిగ ఆడపడుచు; ఈమె పెండ్లిచేసికొనదు; బసివివంటిదేగాని ఆమెకు ఈ ఆటపాటలు లేవు [నె]

**మాతుడుపు** = మాతంగిని ఆరాధించు ఆచారము. ఇది కొందరు బ్రాహ్మణులలోగూడ నున్నది [నె-ఖా]

**మాద** = మానని మేహవ్రణము [నె-ఖా]

**మాదాకవళము** = యాచించి, అడుక్కొని సంపాదించుకొనిన భిక్షాన్నము, మధుకరము. మాదా అనగా తమిళమున దేవుడు, కవళ మనగా అడుగుకొనిన అన్నము; ప్రార్థన గీతములను పాడుచు ఇంటింట పెట్టించుకొనిన అన్నము; మాధుకరము [చి; నె]

**మాతాలు** = వ్యాక్సినేషను వేయు టీకాలు [అ]

**మాదాపన** = (1) నిద్ర పట్టీపట్టని స్థితి
(2) జ్వరాదులలో ఒళ్లు తెలిసీ తెలియని స్థితి (కోమా) — *మాదాపనలో నున్నాడు* [నె]
(3) అజీర్ణము — *మాదాపనగా ఉంది, త్రేపులు వస్తున్నవి.* [చి]

**మాదుము** = పెద్దకురుపు [గ]

**మానకము** = (1) పనిమానిన సెలవు దినము — *ఈదినం మానకము* [మ]
(2) మాఫీచేయు; మన్నించి విడుచుట [కరీ]

**మానవతి** = మానముగల యువతివలె నటించు స్త్రీ: మంగ [కరీ]

**మానా** = (1) చూచి అనుసరించుటకు ఏర్పరచిన వస్తువు; నమూనా
(2) విధము — *వారంతా ఒకే మానాలో ఒడినారు* [నె]
(3) పై విలాసము; చిరునామా [కరీ]
(4) విద్యార్థులకు వ్రాత కుదురుటకు కాపీకి ఇలను వ్రాయు మొదటిబంతి — *కాపీ మానాప్రకారం వ్రాయతేదేమి?* [నె]

**మానాన** = లావు — *మానాన అయినవు* [మ]

**మానిక** = (1) అలంపూరు తాలూకాలో 12 కొలతసేర్లు ఒక మానిక, 12 మానికలు ఒక తూము; 20 తూములు ఒకపుట్టి [మ]
(2) రెండు తవ్వలు లేదా, అద్దలో సగము [వ]
(3) ముంతలో సగము
(4) మారెళ్లసీమలో (దర్శి, పొదిలి) వాడుకలో నున్న సింగంపుట్టి కొల మానములో ఒక భాగము ఇది మదరాసు పడికి సమానము) $1\frac{1}{2}$ (శేరు)
దీని భాగములు—
తవ్వ = మానికలో సగము
సోల = తవ్వలో సగము
అద్ద = సోలలో సగము
చిట్టి = అద్దలో సగము [నె-మెట్ట]
(5) వరంగల్‌లో గిద్దెల ఎరుసు (లెక్క) ప్రకారము — *గిద్దెడు, అరసోల, సోల, తవ్వ, మానెడు, అద్దడు, కుంచెడు.*

ఇరుస, తూము. గిద్దెనుండి తర్వాతివి అన్ని ఒకదానికి మరొకటి రెండింతలు [వ]

**మానిముంత**=(చూ) మానుముంత [నె]

**మాను** = పొడవు లావు గలిగిన దూలము వంటి కొయ్య (Log) — *పేటమానుతో గోని చక్కెలు తీసినారు* [నె]

**మానుకాయ** = తూముకు ముద్దెరయిడు కొయ్య; ముద్రపలక [కరీ]

**మానుగాయి** = ధాన్యమునకు, ములక (మునక) వచ్చి తడిసినప్పుడు పట్టెడి వర్ణ విశేషము; పచ్చగింజ [కృ]

**మానుతోలు**=కంపతోలు [చి]

**మానుముంత**=గట్టి కొయ్యను తొలచిచేసిన గిన్నె, మజ్జిగకు వాడుదురు

(2) పొట్టివాడు; మానిముంత — *మాను ముంతవలె* [నె]

**మానుపులి** = అడవిలోనుండు ఒక విష వృక్షము, పశువులు దీనిని ఒరుసుకొన్నప్పుడు దీనికిఅంటుకొని పోవును. అప్పుడు ఆ మానిని గొడ్డలితో గొట్టిన, అది పశువును విడుచును. ఇది మాంసాశనులైన వృక్షజాతి వంటిది. దీనిని తాకగానే అవయవములు అక్లే అంటుకొని పోయి, నరములను లాగి ప్రాణము తీయును. ఎల్లప్పుడు ఇది జరుగదు, ఒక్కొక్కప్పుడు ఒక్కొక్క చెట్టుకు యీగుణము కల్గుచుండును. నెల్లూరు సంతపేటలో ఒక వేపచెట్టుకు గూడ యీ గుణము కలిగినది. (దీనిని విద్వాన్ కోట సుబ్రహ్మణ్య శాస్త్రిగారు. (పోచిలి) స్వయంగా చూచినారు) [నె]

మాంశాసాశనులైన వృక్షములు చాల పెద్దవి, మెడగాస్కరులో యిప్పటికిని ఉన్నవి, ఇవి పెద్ద జంతువులను లాగుకొని, కాండమునకు శాఖలకు బిగించుకొని చంపి మాంసమును గ్రహించి, ఎముకలను ఉమ్మివేసినట్లు వదలివేయును. ఇట్లే చిన్న ఈగలను పట్టి బంధించి తిని వేయు చిన్నచెట్లు, కొన్ని తీగలు మన దేశమున గలవు.

**మాపుపొంకె** = ఒకపూట మాత్రమే పని చేయుట [కరీ]

**మామిడిఅంచు** = అంగవస్త్రములకు నేసిన తెల్లటి చిక్కటి వెడల్పుఅంచు—*మామిడి అంచు వంచ*; మామిడంచు [నె; కర్నూ: అ]

**మామూలాపట్టు** = కల్లు, సారాయి, దుకాణాల ఇజరాకు తీసుకొను [మ]

**మాయబరీ** = భుక్తము కోటకు కొంత ఏర్పాటుచేసుకొనినది [న]

**మాయబరికిచ్చుట**=కౌలుకిచ్చుట [నల్ల]

**మారతులాడు**=(1) కీచులాడు; వివాదపడు [నె]

(2) ఎదురాడు — *మారతు నోరిడానసై* [భారత-ఉద్యో] [అ]

**మారా** = ఎక్కువగ — *మారా బలిసినాడు* [నె]

**మారాకు**=(1) చెట్లపాది తీగలు, పందిలికి ప్రాకుటకు ప్రక్కన ఆనుగా పెట్టు మంత మొదలగునవి — *బుద్ధిలతకున్ మారాకు హత్తించి* [నె; కర్నూ]

(2) ననకువచ్చు మూడవఆకు; రెండు దిప్పలు గలిగిన అంకురము; మూడవ ఆకును దొడుగుట — *కాకరమొక్క మారాకు వేసింది* [నె-పొదిలి]

(3) విత్తు చిట్లి వచ్చిన మొక్కకు పుట్టిన రెండవఆకు [తె]

(4) మొలక చిగిర్చిన తర్వాత మొదట వేసిన ఆకు [అ]

(5) పండుటాకు రాలిన తర్వాత వేసిన కొత్త నన

**మారాజు**=(1) మహారాజు; శ్రీమంతుడు— *ఆయన పెద్ద మారాజు*

(2) గొప్పవాడు—ఆయన మారాజు

(3) సత్పురుషుడు [తె; నె]

**మారాము**=పోరు; హఠము—మారాం పెట్టుకొన్నాడు [చి]

**మారాముళ్లు**=(1) కపటము—మారాముళ్ల తెలియనివాడు [నె]

(2) చిక్కులు; వివాదములు—మారాముళ్లు పెట్టినాడు [నె]

**మారి**=(1) కలరా వ్యాధి [కరీ]

(2) అమ్మవారు; స్ఫోటకము [చి]

**మారు**=(1) విసరు — కొట్టడానికి చెయ్యి మారినాడు [చి]

(2) పర్యాయము; తడవ — ఎన్నిమార్లు చెప్పేది[తూ; గో, నె]

(3) దుక్కిలోని కొండ్రల భాగము — నేను ఇటు మారుపెట్టి దున్నుతాను [కరీ]

(4) దూరము — రెండుచేల మారుఉంది [తె]

(5) భోజనము చేయుటలో మలిసారి పెట్టించుకొను అన్నము—మారుపెట్టుకో కుంటే మరల రారు [నె, కర్నూ; వ]

(6) మజ్జిగ—మారుపోసుకో [నె; వ]

**మారుగాలి** = అంతకుముందు వీచుచుండిన గాలి నిలిచిపోయి, ఎదురు దిక్కునుండి వీచుగాలి—మారుగాలి మళ్లిన తర్వాత చల్లబడింది (సాధారణంగా తూర్పుగాలినే మారుగాలి అందురు.) [నె, వ; అ]

**మారుచీరె**=మార్చి కట్టుకొనుటకు ఉపయోగించు రెండవచీరె (చీర)—మారుచీరైనా లేదు [క, నె]

**మారుచూపు**=కోపపుచూపు [కరీ]

**మారుచేడ**=దున్నుటకు చేనికి పెట్టిన నీళ్లు చాలకపోగా మరల బెట్టిన తడి [నె; అ]

**మారునీళ్లు**=ఋతుమతియైననాడే స్త్రీ చేయు స్నానము — మారునీళ్లు పోసుకోని కుండలలోకివచ్చింది [నె-పా]

**మారుపాలు**=తల్లిపాలు గాక మరొక స్త్రీ బిడ్డకు ఇచ్చు పాలు — మావాడు మారు పాలతోనే ఎదిగినాడు [చి]

**మారుపు**=ఒకరకపు చేప [కరీ]

**మారుబెట్టు** = పాలలో చేమిరి (తోడు) వేయు (మారు = మజ్జిగ, దీని చుక్క వేసినచో పాలు విరుగును) [నె-మెట్ట]

**మారు మనుము** = కొన్ని కులములతో, ఆడుది మగని వదలి, మరల ఇంకొకని చేసుకొను పెండ్లి; విడాకుల చట్టము—మాకులానికి మారుమనుము లేదు [నె; కర్నూ; [తె]

**మారు మనువు**= (చూ) మారుమనుము [అ; నె]

**మారు మసలు**=నిర్లక్ష్యముతో ఆలస్యము చేయు—వాడు మారు మసలుచున్నాడు [నె-పొ]

**మారు మానము** = (చూ) మారుమనువు; మారువానము [వ]

**మారుమూల**=దూరమున కడ కంతలలో నుండునది—మాది ఒక మారుమూలపల్లి [నె; కర్నూ; తె; అ]

**మారువానము**=(చూ) మారుమనుము [తె]

**మారువేయు** = ఒకకోడె వేరొక దానిపై దాడికొలుకు (ఢీకొనుటకు) యత్నించు; మార్కొగ్గు [కరీ]

**మారెముళ్లమనిషి** = తగువుకు సిద్ధమగు మనిషి; మారాముళ్ల మనిషి [కరీ]

**మార్పుడుగాడు**=మత్స్యవిశేషము [మ]

**మార్పులు** = మూతిన ముండ్లు గలిగి తాకిన వారిని పొడుచు చేపలు, తేలుమీను [శ్రీ]

**మార్కొగ్గు**=ఢీకొను; మారువేయు [కరీ]

**మాలకాకి** = (1) కాకులలో ఒక తెగ (వ్యంగ్యముగా) మలినుడు—అతడుమాలకాకి [కరీ; నె]

(2) ఏపనీ లేకుండా ఊరంతా తిరుగువాడు [గో]

మాలకొండల = నల్లటి కొండలచేప; మాల మట్ట గుడిసె [నె; రా]

మాలదు = కాదు; వీలుకాదు — *అదంతా మాలదు* [చి]

మాలపంకిలము = అపరిష్కృతత [కరీ]

మాలపున్నమ = భాద్రపద మాసములో పున్నమినాడు చేయు పండుగ; పొలము లలో బలి ఇచ్చి వేడుక చేసుకొందురు [అ; మ]

మాలాడ = మాలపల్లె; మాలవాడ [నె; అ]

మాలిత = మాలస్త్రీ; మాలెత [నె]

మాలిమి = (చూ) మాళెము [కర్నూ]

మాలీ = రివెన్యూ [కరీ]

మాలు = (1) ద్రవ్యము [కరీ]

(2) వస్తువు — *ఇప్పుడు మండీకి మంచి మాలు వచ్చింది* [హై]

మాలుగు = లోపలి కామోద్రేకముతో మూల్గుచు నీల్గు—*అబ్బయ్య మాలుగులలో ఉన్నాడే* [నె]

మాలుగుబాము = పామువలె పొడవుగా నుండు ఒకజాతి చేప; మలుగు [గో]

మాలె = గుడిసెకాని ఇల్లు [మ]

మాలెత = మాలస్త్రీ; మాలిత [నె]

మాలెము = (చూ) మాళెము [అ]

మావిటీ = చెవిగూబకు బెట్టుకొను నగ; మాటీ [రా; నె]

మావురాయి = మీసలుండు పెద్దచేప [చి]

(2) నల్లటి మంచినీటిచేప—*వాడు మావు రాయి మాదిరి ఉన్నాడు* [నె]

మావులు = (1) మామిడిచెట్లతోపు—*మావు లలో దూరినాడు;* ఇట్లే ఈతచెట్లగుంపు ఈదులు [నె, తె]

(2) తాటిపువ్వును (చుండుకాయ) ఎండించి మూటగట్టి నిప్పంటించి త్రిప్పిన రాలు పూలు. ఇది దీపావళిలో పిల్లకాయలు ఉపయోగించు బాణాసంచులో ఒకవిధము [చి]

(3) చేపలను పట్టుకొను పరికరము. వెదురు పేళ్లతో అల్లిన దీనిని చిన్నకాల్వలకు అడ్డముగా నిల్పుదురు; కొడమ [గో]

మాసలా = మాదిరి, నమూనా (Specimen) [అ]

మాసూలు - (చూ) మహసులు [నె]

మాసోరి = భార్య; తక్కువజాతుల వారు దాదాపు 25, 30 సంవత్సరములున్నవారు భార్యను గూర్చి ఇతరులతో చెప్పునప్పుడు వాడుమాట [మ]

మాస్కేసినట్లు = తగనిసంబంధము - *పాత గుడ్డకు అతుకుగా వేసిన ఇంకొక పేలిక (మాసిక) వలె సరిపోనిది* - అదంతా మాస్కేసినట్లే ఉన్నది; మాసిక వేసినట్లు [మ; నె]

మాళిక = మిద్దె; మేడ, మాళిగ; ఇల్లు [రా; తె; గో; చి]

మాళిగ = (1) మిద్దె, ఇల్లు; మాళిక [తె; రా; గో; చి]

(2) ఇల్లు (అరవము)—*తమ తిరుమాళిగ ఏది?* [అ]

మాళెము = (1) పిల్లలకు పెద్దవారితో కలుగు చనువు. ప్రేమ—*వాడు నాకు మాళెము*

(2) పశువు పనికి మరిగి (నేర్చుకొని) లోబడుట; మాలిమి -— *అగిత్త మాళె మైనది* [నె, తె]

మాళ్లు = అడుగు మాడిన యన్నపుచక్కలు; మాడులు [గిరి]

మింగిడి = మీగడ [కృ]

మించా = ఎక్కువగా, (మించునట్లు) — *మించానేయివేసినావ్* [నె]

మించనాడు = తిట్టు [కరీ]

మించు = పెండ్లి అయిన స్త్రీ పాదము నాల్గవ వ్రేలికి పెట్టుకొను ఉంగరము; పిల్లేళ్లు [రా]

మిగమీరు = (1) అతిశయించు

(2) మాటవినకపోవు [మ]

మిచ్చికెన = నిచ్చెన; మిచ్చెన

మిచ్చెన = నిచ్చెన; మిచ్చికెన [అ; ఖ]

మిటకరించు = (1) భయముతో కండార్చు — *మిటకరిస్తూ చూస్తున్నాడు* [నె; కర్నూ; అ; తె]

(2) సందేహించు [చి]

(3) ఆశ్చర్యంలో ఏమీ తోచకుండు [వ]

మిటకాయించు = (1) ఎగ నామముబెట్టు

(2) పైకి లేచిపోవు [కరీ]

మిటాయిలేచు = ఒకవైపు పైకి లేచిపోవు — *బండి మిటాయి లేచింది*; మిట్లు [కరీ]

మిటిమిటిసర్గము = ఎఱ్ఱని మధ్యాహ్నపు ఎండ; మిడిఎండ [కరీ]

మిటుకులాడి = వగలాడి [తె]

మిట్టు = (1) ఇంటి తల వాకిటనుండు లోగిలి; ప్రాంగణము — *మిటున మంచాలు వేసినారు* (ఇంటివెనుక భాగమును సందు అందురు. -సందువాకిట) [నె]

(2) గ్రామమధ్యమున నుండు జలాశయమునకు చుట్టు నాలుగు ప్రక్కలా ఏర్పడిన వీదులు — *తూర్పు కోనేటి మిట్టున వారి ఇల్లు* [నె]

మిట్టుకాయ = చిటిక; వ్రేల్మిడి [వి]

మిట్టలు = చిన్న నల్లటి చేపలు [శ్రీ]

మిటిక్కుచ్చు = కొంచెముగ పెట్టు; (మిటికించు); ముట్టించు [మ]

మిట్లు = బండివెనుక బరువైతే నొగలు పైకి లేచుట; మిటాయిలేచు [నె-పొ]

మిరాకోరు = హద్దుమీరిపోవు ఆడుది — *అవిడ మిండల మిరాకోరు*; ముటాకోరు [కరీ]

మిడసరము = ఎగురుబోతు తనము, ఎగవేయు పొగరు — *వాడు మిడసరపుముండా కొడుకు* [నె]

(2) పెడసరము [అ]

(3) ఎగిరిపడు వ్యాధి [నె]

మిడిదేలు = గడిదీరు; ముఖ్యమగు — *వీడు వారిలో మిడిదేలినాడు* [నె-పొ]

మిడిమిడి = అర్ధము; సగము సగము — *వానిది మిడిమిడి జ్ఞానము* [తె]

మిడుసు = ఎండిన మామిడి ముక్కలను వానబెట్టి ఆ రసముతో చేయు పచ్చడి [నె]

మిడుక్కు = అయ్యో అయ్యో అని ఏమితోచక తిరుగు; మిడుకు [మ]

మిత్తమ్మ = (చూ) మిత్తయ్య [శ్రీ]

మిత్తయ్య = పూరిజగన్నాథ స్వామివారి ప్రసాదమునుగాని, ఇంకేదేవుని ప్రసాదమునుగాని సాక్షిగా పెట్టుకొని ఇద్దరు మనుష్యులు ప్రమాణము చేసుకొని స్నేహితులైన వ్యక్తులు; మిత్తమ్మ [శ్రీ]

మిత్తిబియ్యము = చేటలో బియ్యముపోసి పెండ్లికొడుకుపైనుండి తిప్పి మంగలివానికిచ్చునవి [మ]

మిత్రవిందె = వగలాడి [మ]

మిద్దె=రాతిమేడ (మట్టిది కానిది) [అ]
మినకర=అగ్నికణము — మినకర జూచి [చి]
మిన్నలమ్మ=మెరుపు. ఈమెను అర్జునుడు ప్రేమించి, ఆకసమున రథము నడుపు నట, ఆ రథశబ్దమే ఉరుము, ఆమె ఆ మూలలో మినుక్కుమని ఈ మూల తళుక్కుమనును [చి]
మిఱ్ఱు=మిట్ట [కరీ]

మిఱ్ఱిగాడు=గర్వి [మ]
మిసమిసలాడు=నిండు బిగువుతో కళకళ లాడు [కరీ; నె]
మిసిగు=మాటిమాటికి;నిష్కారణముగా— వాడు మిసిగితే ఊరికి పోతాడు [తె]
మిళ్లి = (1) పసిపిల్లలు నాడుకొను చిన్న చెంబు [మ]
(2) చిన్నది—మిళ్లిగంటి [మ; నె]
మిళ్లెన=చిన్నగంటె, మిళ్లెగంటి [సే]

# మీ



మీటు=(1) చిన్నగ కయ్యము పుట్టించు
(2) చెవిలో మాటచెప్పు [కరీ]
మీదిపంచ=పైపంచ, అంగవస్త్రము [తె]
మీదుకట్టు=దేవునికి మ్రొక్కొని ముడుపు గట్టు [నె-మెట్ట; తె; అ]
మీదుబెట్టు = పశువు మొదటిఈత పాలను మొదటిసారి పిండి దేవునికి అరగించుటకు ప్రత్యేకించుట [నె-మెట్ట; అ; తె]

మీనువిల్లు=(వ్యంగ్యముగా) చుట్టైనవాడు —ఆ అమ్మాయి మీనువిల్లి [కరీ]
మీసాలబువ్వ = ఇంట్లో అంబలితాగి, బైట సన్నన్నం తిన్నట్లు ప్రదర్శించుటకు మీసముపై అతికించుకొనిన మెతుకులు [వి; శ్రీ]
మీళ్కె=ఈదు [సే]

# ము



ముంగము=తాటిఆకుతో పొట్లముగా గట్టినది; ముంగాము [గో; నె]
ముంగమూసి=నంగనాచి — పాపం ఏమీ తెలియదు, ముంగమూసి!
ముంగర=(1) స్త్రీలు ముక్కుపుడక బదులు ఒక ప్రక్కన ధరించు పెద్ద వలయపు నగ, ముక్కర [నె; వ; అ]
(2) ముక్కుపోగు [అ]

ముంగారు = ముందుకారు; అదను ప్రారంభము [నె; కర్నూ; అ; తె]
ముంగి=గబ్బగలది [మ]
ముంచెత్తు = వలసినంత లాభింపజేయు; ముంచిఎత్తు [కరీ]
ముంజ=తాటికాయ లోపలనుండు మెత్తటి పదార్థము; నుంగు; నుంజ [నె]

ముంజకాయ = ముంజ ఉండు తాటికాయ; × చుండుగాయ (మగతాడిచెట్టు వేయు పోడవాటి గుండ్రనివి) [నె; తె; అ]

ముంజూకంపు = దుర్వాసన [గు]

ముంజేత = ముందుగా [కరీ]

ముండపాప = మగడు చచ్చిన తర్వాత పుట్టిన బిడ్డ [శ్రీ]

ముండబోలు = భర్త చనిపోయిన స్త్రీ [వి]

ముండమోపి = (వితంతువు) చేతగానివాడు; అప్రయోజకుడు [అ; నె]

ముంత = (1) ఒకవిధమగు కంచుచెంబు — *తలెముంత* [వ]

(2) ఒకకొలతపాత్ర, దానికి మూడు సేర్లు

(3) నాలుగు సవశేర్లు ఒక ముంత [నె]

(4) నీరుత్రాగుటకు ఉపయోగించు చిన్న మట్టిచెంబు—*ముంతతో గూడ నీళ్లు ఇవ్వాలేదు* [నె]

ముంతఖర్జూరము = మెత్తగా నానబెట్టిన ఖర్జూరపుపండు [నె]

ముంతపప్పు = చిన్న మట్టిపిడతలో నిప్పువేసి పప్పు మధ్యవుంచి వేడిచేసి అప్పటికప్పటికి అమ్మే వేరుశనగపప్పు [వి]

ముంతపొగ = ఒక ముంతలో నిప్పువేసి అందులో మిరపకాయలువేసి పెట్టునది [మ]

ముంతపొగబెట్టు = ఒక శిక్ష, గదిలోవేసి పొగబెట్టునది [అ]

ముంతమామిడి = జీడి, క్యాజు. ఈ చెట్టు మొదట ఆఫ్రికానుండి పోర్చుగీసు నావికుడు - వాస్కోడిగామాచేత కొనిరాబడి, మలబారు తీరమున ఇసుక తిన్నెలలో పెంచబడినవి. కాయకు గింజ బయట నుండుట చేతను, కొత్తదగుట చేతను సంస్కృతములో అగ్రబీజమన్నారు; గోడంబి, దీని కాయే పువ్వు, జీడి అనిన భల్లాతకి [నె; చి; అ; కర్నూ, తి]

ముందరిల్లు పెద్దఇండ్లలో మొగదలనుండు పెద్దహాలు, నేటి డ్రాయింగ్‌రూం వంటిది; మొగసాల [నె; కర్నూ; అ; వ; తె]

ముందల = కుందు [వి]

ముందాడి = మొదలు—*ముందాడే చెప్పినా*; ముందోడి [నె]

ముందేరు = దున్నుచున్న నాగేళ్ల వరుసలో మొదటి మడక (నాగేలు) [నె]

ముందోడి = మొదటనే; ముందాడి [నె]

ముక్క = పేనానిబ్; పాళి, టాకు [అ; నె; తూ-గో]

ముక్కన = మదరాసు ఇరువదినాల్గుపళ్ల కొలత [చె]

ముక్కపొందిక = ఎట్లో సర్దుకొని పోవుట [కరీ]

ముక్కర = (చూ) ముంగర [కర్నూ]

ముక్కవాసన = (చూ) ముక్కువాసన [నె, గో]

ముక్కాకలు తీరినవాడు = మూడుమారులు కాల్చబడి గడిదేరినవాడు, అనగా అతి సమర్థుడు

ముక్కాములగా = ముక్కు (వఱకు) మునుగునట్లుగా, సంపూర్ణముగా — *నాకీ వేళ ముక్కాములగా పనిఉన్నది* [గు]

ముక్కాలుదుడ్డు = మూడు పైసలు; కాని; చినడబ్బు; బొట్టు [చి]

ముక్కిడి = (1) చీటికి మాటికి ఏడ్చువాడు — *ముక్కిడిపిల్ల* [నె]

(2) ముక్కుతో మాట్లాడునది [తె]

(3) నడ్డిముక్కు [అ]

ముక్కిడిదుడ్డు = పెద్దపైస; అర్ధణా [ను]

ముక్కు = (1) ఏదేని వస్తువు నిలువుగా నుంచు —*ముక్కుబట్టు*

(2) తిట్టు [కరీ]

ముక్కుపుల్ల = (1) ఒకరాయివేసిన ముక్కుపుడక [మ]

(2) బులాకి [రా]

ముక్కువాసన = మక్కిపోయిన వాసన; ముక్కివాసన; ముగ్గువాసన; ముక్కవాసన [వ]

ముక్కెర = (చూ) ముంగర, ఇది బంగారుది [తె]

ముక్తసరిగ = క్లుప్తముగ — ముక్తసరిగా మూడు మాటలలో చెప్పినాడు [నె]

ముఖండి = అధికారి; కామందు [కరీ]

ముఖపాఠము = నోటికి వచ్చినట్లు వల్లించిన పాఠము [కరీ]

ముఖవచనం = నేరుగా (స్వయముగా) చెప్పిన మాట — ఆయన ముఖవచనం లేనిది నేనెట్లా ఇచ్చేది [తె; అ]

ముగెక్కుడు = (చూ) మొన ఎక్కుడు [అ-పె]

ముగ్గట్టు = తల్లితో బాలమునకు పోయిన యెడ దూడ, పాలు కుడవకుండా, దాని మూతికి కట్టునట్టి పంగలకట్టు; ముగ్గొయ్య [నె-పొ]

ముగ్గుపురుగు = నీటిలో ముగ్గు వేసినట్లు అతి వేగంగా తిరుగాడు పురుగు [చి]

ముగ్గువాసన = ముక్కువాసన [అ]

ముగ్గొయ్య = (చూ) ముగ్గట్టు [నె-పొ]

ముగ్గోసన = ముక్కువాసన [అ]

ముచ్చు = (1) పశువులపై ఏర్పడు కాలెలు— ముచ్చుఎద్దు [వ; నె]
(2) కోడె మూపురముపై పోసిన నలుపు చాయ — ముచ్చుపోసినకోడె [కరీ]

ముచ్చుట = వెంట్రుకల ముడి; బుచ్చిడి — —ముచ్చుట ముడివేసింది

ముచ్చినగుంత = తల మెడ గలసిన వెనుక వైపు గుంట; ముచ్చిలిగుంట; ముచ్చెన గుంట; ముచ్చినిగుంట [నె]

ముచ్చినిగుంట = (చూ) ముచ్చినగుంట [అ; నె; తె]

ముచ్చిలి = చిన్నచేట [చి]

ముచ్చిలిగుంట = (1) గొంతుక్రిందకంఠె బొక్కలకు నడుమనుండు గుంట [వ]
(2) (చూ) ముచ్చినగుంట

ముచ్చు = మనసు దాచి మాటలాడకుండు వాడు [నె]

ముచ్చుదుగుంపులు = మెడపై తలక్రింద ఉన్న వెంట్రుకలు [మ]

ముచ్చుమొగము = (1) లోపలి క్రౌర్యమును బయటికి పొంగనివ్వనివాడు
(2) దొంగమొగము [నె]

ముచ్చె = ఒకవిధమైన పాదరక్ష—ముచ్చెతో కొట్టినాడు [తె, నె]

ముచ్చెమటలుపట్టు = బాగా చేమటపోయు (భయముచేతగాని, శారీరక శ్రమచేతగాని) [వి; నె]

ముచ్చెనగుంట = ముచ్చిలిగుంట [నె-పొ]

ముచ్చెలి = ముచ్చెనగుంట; జడ ఆరంభమయ్యే స్థానము [నె-పొదిలి]

ముజుగుంబము = (1) మొగమోటము [అ]
(2) ముసుగులో గుద్దులాట; ముజుగుమ్మము; ముసుగుండ్లు [అ; బ]

ముజుగుమ్మము = ముసుగుంట్లు, మోమోటము. ముసుగులో గుద్దులాట; ముజుగుంబము [అ; బ]

ముజ్జిడ్డు = (1) పెద్ద చీకాకు
(2) పెద్దచీకటి [కరీ]

ముటాల్ = అవివేకి [నె-దక్షిణ]

ముట్టుకొలత = మొత్తముకొలత—ఈ కుప్ప ధాన్యము ముట్టుకొలత పడిఐస్తాలు [కరీ]

ముటాకోరు = అవిపీతిపరుడు; — ముండల ముటాకోరు

ముట్టుకోసుకూర = గోసీపువ్వు; క్యాబేజి

ముట్టుగిల్లు = (1) నిప్పు రగులొక్కను
(2) ఏదైనా వ్యాధిసోకు; ప్రబలు

ముట్టి = (1) ముట్టె [నె]

(2) మోపు—*కళ్లెముట్టి* [వి]
ముట్టించు = (1) వెలిగించు — *దీపం ముట్టించు* [నె; కర్నూ-పణ; అ]
(2) ధాన్యమును నూర్పుచేయు [వి]
(3) తగిలించు [తె]
(4) కొంచెముగా ఇచ్చు—*బెల్లంముట్టించి నాడు (తాకించు అనుట)*
ముట్టికంప = ముండ్ల పొద [వి]
ముట్టు = కదురులో మొదట తగిలించుదారము —*కొత్తముట్టు* [అ; నె]
ముట్టుకుట్టు = బహిష్ఠ సమయమున స్త్రీలకు వచ్చు కడుపునొప్పి [నె; గు]
ముట్టుబడి = వసూలు [కరీ]
ముట్టెమోపు = కీలకస్థానము; మూలస్థానము క్లిష్టస్థితి — *అది తీరా ముట్టెమోపుకు వచ్చింది* [నె]
ముడిగి = పదహారు ఎకరాల పొలము [చి]
ముడిబడు = (1) లంకె ఏర్పడు [కరీ]
(2) వివాద మేర్పడు—*వ్యవహారం ముడిబడింది* [నె]
(3) సమాప్తమగు [కరీ]
ముడివేళ = ఇబ్బంది వేళ [కరీ]
ముడుకులు = మోకాటిచిప్పలు, మోచేతి చిప్పలు [గ]
ముడుచు = దొంగిలించు; ఊరుకొను [వ]
ముడుదూడు = కొయిలగోపి; దుష్టుడు [నె]
ముడుపు = చెల్లించవలసిన ధనము [కరీ; నె]
ముడ్డీమొగంలేదు = తీరుతెన్నులేదు; గుద్ద నోరు లేదు [వి]
ముతక = (1) తలవెంట్రుకలకు పట్టిన జిడ్డు —*తల ముతక పట్టినది* [తె]
(2) లావు [అ]
(3) మొరటు—*ముతక గుడ్డ* [నె]
ముతకబట్టు = నూనె మొదలగు వానిచే మకిలి వాసనబట్టు; మైలబట్టు
ముతుక = ముతక [వ]
ముత్తి = ముత్యము [చి]
ముత్తు = మూత్రపువాసన; గత్తుకంపు [కరీ]
ముత్తెము = నిమ్మకాయలోని ముత్తెములవలె విడివిడిగా ఉండునవి [నె]
ముత్యాలతొడుగు = తెల్లని కుండలు వేసిన మశూచికము [వి]
ముదనష్టము = (1) నిస్సంతవుట [గో]
(2) ఎక్కువ నష్టము—*అవని ముదనష్టమైంది* [నె; అ]
(3) నీచము — *ముదనష్టపు ముండా కొడుకు* [నె; తె]
ముదరష్టం = (చూ) ముదనష్టము [గు]
ముదురు = లేతగానిది, ఎక్కువైనది — *ముదురు ఎరువు* [కరీ; నె]
ముద్ద = సంకటి [అ]
ముద్దాయి = (1) ఫిర్యాదు చేసినవాడు (Complainant) [తె]
(2) నిందితుడు (Accused) [సర్కా]
ముద్దుగులము = మూడుదుగలములు, పన్నెండణాలు [నె]
ముద్దుగ = బాగుగ; మంచిగ, ముచ్చటగ— *ఆచీర ముద్దుగున్నది* [తె; నె]
ముద్దెర = వైష్ణవ గురువులచే శంఖచక్రాలు చేతులపై ముద్ర వేయించుకొని, వైష్ణవము స్వీకరించుట [మ]
మునమున = కోపము మ్రింగికొని, రుసరుసలాడుట [గు]
మునాఫాకిచ్చు = కౌలుకిచ్చుట [మ]
మునిపొంతే = రెండుపూటలా నాగలికికాని, మోటకుకాని ఒకేజత ఎద్దులను కట్టుట [న]
ముమ్మడి = కలిసిచేసినది—*ముమ్మడివ్యాపారము*; ఉమ్మడి [మ]
ముయ్యాలు = బంధువుల వివాహాది శుభ కార్యాలలో, కొంత పైకము కొన్ని వస్తు

వులు కట్నరూపముగ చదివించినవి. వీటి పట్టిక వ్రాసియుంతురు. ఆవల ఇవి యిచ్చిన వారింటిలో శుభకార్యము జరిగి నప్పుడు ఇట్లే వీటిని తిరిగి ఆపెండ్లి వారికి చదివింతురు; చదివింపులు. కేవలము ధనరూపకముగా ఒకటి రెండు రూపాయలనే ఇచ్చుటకు నెల్లూరులో ఈడు అందురు [మ]

(2) బహుమతులు, కానుకలు [అ-పె]

ముయ్యి = (1) చదివింపు; వధూవరులకు వివాహ సమయమున బంధుమిత్రులియిచ్చు బహుమతులు, కానుకలు మొదలగునవి, ఈడు

(2) పొత్తుల సేద్యము; తోడిడిసేద్యము [అ-పె; మ]

ముయ్యికిముయ్యి = బదులుకు బదులు [అ]

ముయ్యెర = (చూ) (1) ఊదర

(2) బహుమతి; ఈడు; కానుక [అ-పె]

ముయ్యెరపెట్టు = (1) ఎలుకలు, పందికొక్కులను పొగపెట్టి చంపునది; ఊదరబెట్టు

(2) చీకటిలో ఉంచు [మ]

మురక = (1) సగము, సంకటిముద్దలో సగము, రొట్టెలో సగము

(2) చక్కిలముల ముక్కలు, పొలుకులు [అ-పె]

మురుమురాలు = ధాన్యము ఉడుకపెట్టి దంచిన బియ్యమును వేయించినవి (వేయించిన ఉప్పుడు బియ్యము) [వి]

మురీలు = బొరుగులు, మురమరాలు; పేలాలు [గ]

మురుకు = చిన్నదిగాచేసిన గట్టి మణుబూవు [నె; చి; హై]

మురుగులు = (1) చెవులపోగులు [అ]

(2) ముంజేతి కడియములు [నె]

మురువు = గర్వము — *నీ బలువు మురువు దీస్తా* అని తిట్టు

ముట్టీ = మురికి [వి]

ముట్టుపాలు = (1) బట్టికాని ఆవుకాని ఈనిన దినమున యిచ్చుపాలు; జున్నుపాలు [మ; నె]

ముత్తెలు = ముఱముఱాలను తినుబండారము [శ్రీ]

ములికి = (1) వంగిన కొసగల ముల్లు [చి]

(2) బొంగరమునకు బిగించిన ఇనుపచీల [నె]

(3) చిన్న కూచిచీల [నె]

ములివాడ = నల్లగానుండు చిన్నచేప; ఇది ముండ్లతోడుగు [శ్రీ]

ములుతన = తొలుతన [కరీ]

ములుము = మునుము— *రెండు ములుముల కోత అయినది* [నె]

ముల్లాను = ముల్లుకఱ్ఱతో పొడుపుతిని నడచునది—*ఆయెద్దు ముల్లాని పోవును* [నె-పొ]

ముల్లుబోయు = తిరుగలి మొదలగు వానికి గంట్లుపోయు; కక్కుగొట్టు [అ]

ముసారా = ఎడతెరిపి లేకుండా కురియువాన ముసురు— *ముసారా పట్టిఉన్నది* [నె]

ముసి = (1) వరిపైరు మంచికోపుగా పెరుగుట— *నల్లగా ముసివేసుకొని పెరుగుతున్నది* [నె; వ]

(2) తెలుపు నలుపు కలిసిన రంగు— ముసెద్దు [అ-పె]

ముసించు = చెడ్డకాలమునకు చెడ్డబుద్ధి పుట్టు; చెడ్డకాలము పైకొను — *వాడికేదో ముసించి అది చేసినాడు* [నె]

ముసిండి = మూగగాఉండు; ముసెండి [అ-పె]

ముసుగుంట్లు = (1) మొగమాటము; ముంజుగుంబము

(2) ముసుగులో గుద్దులాటలు [అ; బ]

ముసుగులో గుద్దులాట = (1) రహస్యముగ వాదులాట, వివాదము (లోపల ఏమి చేసికొనినారో బయటివారికి తెలియనిది అనుట [నె]
(2) మొగమోటమి; ముజుగుమ్మము [అ; బ]

ముసురు =(1) చుట్టుకొను—*ఈగలుముసిరినవి* [అ; నె]
(2) జడివాన; ముసార [తె; సర్కా]
(3) అన్నము — *వాడు ముసురు ముట్టలేదు* [అ]

ముసెండి =మూగగానుండు; ముసిండి [అ-పె]

# మూ



మూకుడు =కదురుకు బిగించిన గిలకవంటి కొయ్యతునక; దిండు; మూగటి [చె]

మూగ = వేగక మిగిలిన ధాన్యము [తె]

మూగకంకులు =గింజలు పట్టని కంకులు [అ]

మూగటి = (చూ) మూకుడు [అ]

మూగకలలు =వ్యర్థపుకోర్కెలు [కరీ]

మూగతీటు =పుండ్లు లేక అట్టవలె లేచు తీట [అ; నె]

మూగదెబ్బ = గాయము బయటికి కనుపించకుండ లోపలనే కండ నలగి బాధ పెట్టు దెబ్బ [నె; కర్నూ; అ; వ]

మూగనోము =మౌనవ్రతము [నె; కర్నూ]

మూగవేయు =లోహసామగ్రి బెజ్జములను సుత్తెతో మూతపడునట్లు కొట్టు [గో]

మూగాము = విడవకుండా మబ్బుగప్పియుండియు వాన కురువకుండు స్థితి — *మూగాముపల్ల వడ్లుఎండలేదు; మూగాము మూసుకొని ఉన్నది* [నె; అ]

మూగెండ (మూగ + ఎండ) = సూర్యుడు మబ్బుచాటుననుండి కలిగించు ఎండ [నె;

మూటకూడు =(1) దారిన తినుటకు అన్నమును సాదకములనే ఒకటిగనే కట్టిన మూట. ఇది కలియబడి యుండుటచే అంత మేలైనది కాదనుట— *మూటకూడు తిన్నట్లున్నది*; అధ్వాన్నము [నె; వ]
(2) శవమును మోయునప్పుడు దింపుటకు కళ్ళందగ్గర పెట్టు అన్నము [వ; అ]

మూటబడి = మూడు భాగముల దిగుబడి లభించునది — *వరిగలకు మూటబడి బియ్యము ఎస్తవి, అరుగలకు సగము* [నె-పొ]

మూటలుమోయు = కొండెములు చెప్పు [నె]

మూటలు వేయువాడు = చాడీలు చెప్పువాడు; మూటలు మోయువాడు [చి]

మూటు = ఆవముపైకప్పు; ఇటుకశూలపైకప్పు; జల్లె [చి]

మూడవహస్తంవారు =వైదీకులు (రెండు హస్తాలు(చేతులు)గా మూడవదిచాదస్తము, ఇది గలవారనుట) [గు]

మూడారుగాలాలు =ఎల్లవేళలు [కరీ]

మూతిముప్పిడి వ్యవహారము = దాపరికముగా చేయుపని [వి]

మూతికట్టు =ఉగ్గము [కరీ]

మూతయిల్లు =గాలిరాని కొంప [కరీ]

మూతినాకుళ్లు = (1) మొగము ముందరి మాటలు [తె]
(2) ఇచ్చకములు [నె]
మూతిముడుచు = (1) అసహ్యపడు [వి]
(2) అతృప్తిని దెలుపు [నె]
మూదేవి = ఏడుపు మొగముతోనుండువాడు; పెద్దమ్మ — *అంతా మూదేవి మాదిరి ఉన్నావే* [నె-దక్షిణ]
మూసగాయ = దోసకాయ గిజరుతీసి తరిగి వండినకూర [నె-బో]
మూల = వీధికుని; మలుపు [కర్నూ]
మూలకట్టలు = (1) చెరువు కలుజుకు ఇరు ప్రక్కల ఉండు బలువైన కట్టలు; మొత్తలు; దిమ్మెలు [నె]
(2) మంచమునకు వేసిన ఇనుపమూల కట్లు. కదలకుండుటకు కాళ్లకు పట్టీలకు మూలలలో వేసినకట్లు [అ]
మూలగాలి = చలికాలములో ఈశాన్యము నుండి వీచు ఈదరగాలి [నె]
మూలగొట్టు = మారుమూల [కరీ]
మూలమట్టము = యావత్తూ; అంతా [గో]
మూలమలుపు = వీదికుని తిరుగుడు; వీది మలుపు [కరీ]
మూసికొనివచ్చు = క్రమ్ముకొని ఆవరించు —*మబ్బువాన మూసికొని వస్తున్నవి* [నె]
మూసిన ముత్యము = (1) తెలిసిగూడ తెలియనట్లు నటించువాడు [నె, కర్నూ; తె]
(2) ఎక్కువ మాట్లాడనివాడు [వ]
మూసినవాయనం = పెండ్లి సమయములలో తీర్థములసమయములలో చేటలలోమంగళ ద్రవ్యములు పెట్టి పైన చేటమూసి,ముత్తైదువుకు ఇచ్చునది; మూసినాయనం [నరా]

# మె



మెంగెము = సున్న; శూన్యం [కరీ]
మెంట = పసరమునకు ఒకకొమ్ము ఒక వైపుకు, ఇంకొకటి మరియొకప్రక్కకు తిరిగియుండుట—మెంటావు [నె; వ]
మెంటకన్ను = మెల్లకన్ను [తె]
మెంటకొమ్ము = (చూ) మెంట
మెంటవ = మూతి ఎరుపులోను, మూతి పొడవులోను కొంత వారఉండు ముంగిస జాతి [నె; చి]
మెండు = (1) పైకిలేపు [తె]
(2) గడ్డను వదిలేసి పలుమారు గాటువేసి ప్రక్కన నాటిన గుంజ మొదలగు వాటిని పెగల్చుట; నెరుము [నె-పొ]
మెండుబండవాడు = మెండి అను ఒక కులంకూడా ఉన్నది; ఏమీ ఇవ్వనిదే ఈయాచకుడు పోకుండా ఇంటిముందు అశుద్ధం పెట్టుకొని తింటూ, కూర్చుండును. అది నిజంగా అశుద్ధం కాకపోవచ్చు కాని అట్లాగే కనబడును; మొండిబండవాడు మొండుబండవాడు [వ]
మెండ్రించు = బలముగా కెలుకు [కరీ]
మెకము = ఏదుబంది; ముండ్లపంది [అ]
మెచ్చి మేకతోలు కప్పు = బూటకపు ప్రసంగం చేయు [వి]
మెటిక = (1) మెట్టు; సోపానము — *మిద్దె మెటికెలు* [అ]

(2) వ్రేలు మొదలగు వాటిని విరచి చేయు శబ్దము—*మెటిక విరిచినాడు* [నె]

మెట్ట=(1) ఆడువారు వెంట్రుకలను ఎడమ వైపుకు మళ్లించి తురుముకొను కొప్పు —*మెట్ట ముడిసింది* [శ్రీ; వి]

(2) మిట్టు; మెరక [నె]

(3) నీటివసతిలేని ప్రదేశము — *మెట్ట తాలూకా* [నె]

(4) మాగాణి, జొన్న మొదలగునవి పండు పొలము—*మెట్ట పది ఎకరాలు*; మెరక; చెల్క [నె: కర్నూ; తె]

మెట్టదుక్కి = ఎండిన భూమిని దున్నినది × దుంపదుక్కి; ఎలిగడ దుక్కి [ప-గో; శ్రీ]

మెట్టవేదాంతము = (1) అనుభవములేని వేదాంతము; కలువాయి వేదాంతము [వి]

(2) బూటకపు మాటలు

మెట్టు=చెప్పు [క]

మెట్టుకట్టు = సరుకు బస్తాలు ఒకదానిపై ఒకటి పేర్చు; నట్టుగట్టు [గు]

మెట్టుకట్టె=పొయిమీద ఉడికే సంకటిని తెడ్డుతో గెలుకుటకు, కుండకు ఆనించి, దానిపై ఒకకాలు అదిమిపెట్టు కట్టె. దీనికి చివరన పంగలు ఉండును. [నె-మెట్ట]

(2) కంపకు ఉపయోగించు ఇట్టి కట్టె పొడవుగా నుండును, దీనిని రాగలకట్టె అందురు

మెట్న=మూలమట్టము [వ]

మెడచింపులు=మెడపంపులు [వ]

మెడపంపులు=కంఠభాగము;మెడపొంపులు —*మెడపంపులు విరుగగొట్టినారు* [నె; కర్నూ; అ; తె]

మెడబిగువు=పొగరు [గో]

మెడఃచ్చు=కోడెలకు కాడి తాకిడిచే ఒరసి మెడపై గుబ్బలేచు; ఇఱ్ఱుగు [కరీ]

మెత్త = (1) బండిమీద జల్లక్రిందవేయు గడ్డి

(2) పశువులు పండుకొనుటకు కొట్టములో వేయుగడ్డి [నె]

(3) పరుపు [చి]

మెత్తబడు=(1) ఆర్థికముగా దెబ్బతిను —*రైతులు మెత్తబడినారు* [నె. కర్నూ: అ; తె]

(2) ఎడ్లు దున్నలు బాగా పనిచేసి గిట్టలు మెత్తబడి నడువ లేకుండు [వ; నె]

మెత్తా=తలదిండు [కరీ; వ]

మెత్తాళ్లు=చిన్న సముద్రపు చేపజాతి, వీటిని ఎండబెట్టియే వాడుకొందురు; నెత్తళ్లు [నె]

మెత్తు=(1) ఎక్కువ; నిండు—*కడుపులో మెత్తుగా ఉన్నది* [నె; తె]

(2) గాదె, బొట్టలలో ధాన్యముపోసి పైన గడ్డి దురిగి, బురదమట్టితో ఒత్తుగా అలికినది—*గాదెమెత్తు పూడబెరికి ధాన్యము తీయి*; మేగు [అ; నె; తె]

(3) ఒక బాధ్యత; ఒక భారము [కరీ]

మెత్తుకూటిగుడ్డ=కూటిముత్త మూతినికప్పి కట్టినగుడ్డ [నె]

మెత్తుకొను=కన్నులు త్రొక్కుడు త్రొక్కుడుగా నుండి అతుక్కొనిపోవు [కరీ]

మెద=(1) గడ్డిమోపు [మ]

(2) కోసిన వనకట్ట [కరీ]

మెదగట్టు=గింజలు దులుపు [మ]

మెదగడ=బండిచక్రము దిగబడెడు ఒదులు మట్టిగల ప్రదేశము; మెదుగుడు [అ-పె]

మెదగము = గడ్డిని తొక్కించునప్పుడు ఎక్కువగా మెదిగినది (నలిగినది) [నె]

మెదలు=(1) అప్పుడప్పుడు కనుపడు;వచ్చిపోవు—*ఆయన ఇట్లా మెదలడమేలేదు* [నె; కర్నూ; తె]

(2) కదలు [చి]

మెది = పొలము (మడి) పారకమునకు ఏర్పర చిన నీటిరేవు; మడవ [కరీ]
మెదిగినవాడు = అనుభజ్ఞుడు—*నలుగురితో మెదిగినవాడికి తెలుసు* [చి]
మెదిమడవ = కొంత నీరు పైన పొర్లిపోవు నట్లు వేసిన చేనిగట్టు [చి]
మెదుగుట = (1) ఒక విషయక్షుణ్ణముగా చర్చింపబడుట—*ఆసంగతి బాగా మెదిగింది* [నె; కర్నూ; తె; వ]
(2) అనుభవము గడించుట — *ఆయన బాగా మెదిగినవాడు* [అ]
మెదుగుడుబడు = (1) సమస్యను కొంత దంగుట (దంచుట)
(2) దారి బాగా నలుగు [కరీ]
మెదుపు = (1) పనికి అలవరచు; కరపు — *లేగను మెదుపుదురు;* మరపు [కరీ]
(2) పూయు; కూర్చు; నింపు [వ; తె]
(3) ఒకవస్తువుకు మృదుత్వమును కలిగించు వేరు వస్తువు. ఇడ్లిబియ్యపు నూకలో మినపపప్పు కలుపుటవంటిది—*ఇడ్లీకి మెదుపు తక్కువైంది* [నె, కర్నూ]
మెదురు = మెదడు [నె]
మెదువు = మెల్లగా — *మెదవుగారా;* మెత్తగా [చి]
మెప్పాచారము = నలుగురికి మెప్పగుమాట [కరీ]
మెరక = మెట్టపొలము [సర్కా; తె]
మెరగనూదు = టంకములేకుండ లోహము లను అతుకు [వి]
మెరమన = హింసించి హింసించి ఒక మనిషిని చంపుట — *వాడిని మెరమన చంపినారు* [క]
మెరము = చేట [సే]
మెరవణి = ఊరేగింపు—*ఊరు మెరవణి;* మెరిమెణ; మెరవిడి; మెరవణిగె [చి; అ]
మెరవణిగె = ఊరేగింపు; మెరిమెణగ [సే]
మెరవిడి = ఊరేగింపు, మెరవణి [అ]
మెరిక = (1) దంచగా పొట్టుపీడని గట్టి వడ్లగింజ
(2) సమర్థుడు; గట్టివాడు; మెరికె—*మెరికలంటివారిని ఏరినాడు* [నె; తె; అ]
మెరికె = (చూ) మెరిక [కర్నూ; నె; వ]
మెరిమిళ్లు = వీరభద్రుని తిరునాళ్లలో జంగాలు నిప్పులలోనుండి నడచిపోవు ఉత్సవము. *నిప్పుల గుండము* [కరీ]
మెరిమెణ = ఊరేగింపు, సాధారణముగ వివాహ సందర్భములో వధూవరులను ఊరేగింపుగా తీసికొనిపోవు ఉత్సవము; ఊరేగింపు; మెరవణి [మ]
మెరిమెణగ = ఊరేగింపు, మెరివిణి
మెరివిణి = పెండ్లి ఊరేగింపు; మెరవణి; మెరిమెణగ
మెరుగుడు = బంగారుతో వేయు అతుకు [మ]
మెలి = (1) చిక్కుముడి
(2) ప్రతిష్ఠంభనము; మెలిక: మెలికె — *పరిష్కారం మెలిబడినది* [నె, అ; తె]
మెలిక = (1) బెత్తం, బజ్జ [చి]
(2) మెలి; చిక్కు—*మెలికబడింది* [నె]
మెలికె = (చూ) మెలి [కర్నూ; వ]
మెలుపు = చిక్కు, మర్మము—*దీనిలో చాల మెలుపులున్నవి, తెలిసికొనుట కష్టం* [నె]
మెలుము = (1) రెండు మూడు తాళ్లను, పేనకుండా మెలివేసినది (పెనవేసినది)
(2) నలుగగొట్టిన ఈత, తాటిమట్ట — —*మెలుములతో బిగించినారు* [నె]
మెల్ల = (1) మిద్దె గుమ్మానికి మీదుగా గజం ముందుకు పెంచి కట్టినగోడ—*మెల్లాగోడ* [గో]

(2) వసారా [గు]
(3) అరుగు; మెల్లె [కరీ]

మెల్లగిచ్చి గిల్లిపో = ముక్కు గిల్లే ఆట [మ]

మెల్లుఅక్షరము = వత్తులేని హల్లు, క. గ. చ వంటిది [చి]

మెల్లె = (1) నులగవంటి, (బెత్తమువంటి) లేతకొమ్మ — *చింతమెల్లెతో బాదివారు* [నె; కర్నూ]
(2) అరుగు, మలెసాల [కరీ]

మెసలు = కదలు — *వాడు మెసలకుండా ఉన్నాడు* [తె]

# మే



మేక = అమాయకుడు — *వాడు ఒట్టి మేక; గొఱ్ఱె అనుటగూడ గలదు* [ఓ]

మేకుమియ్యా = (1) అసాధ్యుడు [వి]
(2) ప్రతిరోధము కల్పించువాడు [నె]

మేకొను = కాడిక్రిందికివచ్చుట; అంగీకరించు [కరీ]

మేగన్ను = నిద్రకు ముందుస్థితి — *మేగన్నుగా ఉండగా లేపేశాదు; మాగన్ను* [చి]

మేగు = అతుకునట్లు రాయు — *మటి మేగినారు; మెత్తు* [కరీ]

మేచారము = ఋణమిచ్చినందుకు నిచ్చు లంచము; ఇది వస్తురూపముగ నుండును — *నన్నూరు అప్పిచ్చినందుకు ఆవు పెయ్యి మేగారము ఇచ్చినాను* [నె-పొ]

మేచారము = సౌకుమార్యము [గు]

మేటి = (1) కుప్పపడుగు త్రొక్కు ఎద్దుల బంతిలో మొదటి ఎద్దు (లోపలి అద్ద ప్రక్కది) × అసురు
(2) దాపలి భాగమున మొదటిఎద్దు — *మేటి నడచును*
(3) ముందుకోపు [కరీ]

మేటిఉమ్మడిపొలము = గ్రామస్థలముకు ప్రత్యేకమైన పట్టాలుండికూడ, గ్రామ సాముదాయక ప్రయోజనముగా వదలిపెట్ట బడిన భూమి [నె-కందుకూరు]

మేడకుడు = అమాయకుడు [కరీ]

మేడాటము = (1) మొండితనము; పిడివాదము — *బడికి పోకుండా మేడాటం బెట్టినాడు* [నె]
(2) మంకు [వ]

మేడామి = (మేడివామి) కుప్పను నురుచు నప్పుడు ఎల్లిపోయిన ఒక్కొక్క పొడుగు గడ్డిని కల్లముచుట్టు ఎత్తుగా వేసిన మేట, (కుప్ప) మేడాము [నె]

మేడాము = (చూ) మేడామి [నె]

మేడాము పడు = కార్యము వగదెగక నానుడుపడు [నె]

మేడి = నాగలి వెనుక పైకి ఎత్తుగా బిగించిన ఊనుకర్ర — *కాడి మేడికడగా బెట్టిన రైతు* [నె; కర్నూ, ప; అ; తె]

మేడితోక = పట్టుకునేటందుకు వీలుగ వడ్ల వాడు (వడ్రంగి) చేయు పనిముట్టు [మ]

మేడిమలక = ఊడిపోకుండా మలక (మెలి) వేసి కటినకట్టు [కరి]

మేడెముబెట్టు = (1) వనిచేయకుండా భీష్మించు [కరీ]
(4) హఠము బెట్టుకొను [కరీ; నె]

మేను = ఏటవాలుగ వేసిన పెద్ద మడవ; పై చేనికి క్రిందిచేనుకు ఎత్తులో ఎక్కువ వార ఉన్నప్పుడు యీ ఏటవాలు మడవ వేసి క్రింద గుంట పడకుండా చేయుదురు [నె]

మేపుడుకోడె = వ్యవసాయమున కుపయోగించు కోడె × చూపుడుకోడె = వచ్చిన వారిని చూపు అందమైనది [నె-పొ]

మేయు = లోలోపల ఎచ్చుట — వ్యాధిలో లోన మేస్తున్నది [కరీ]

మేరువగప్పు = సన్నని వండుగప్పు [కరీ]

మేరువు = నానువట్టెడల (నగలు) బిగింపు సంతనము [గు]

మేరోడు = దర్జీ; కుట్రపుపనివాడు [కరీ; వ]

మేర్మాను = (1) కానుక
(2) గొప్పతనము [కరీ]

మేలు = పై భాగము; పైన—మేలుదూలము; మేలుబంతి

మేలుగాయ = మంచికాయ; మొదటికాపు కాయ × తాలుకాయ [కరీ]

మేలుదూలము = దూలముమీది గుజ్జులపై అమర్చబడు చిన్న అడ్డదూలము; గుంట దూలము; [నె]

మేలుమడవ = పెద్దకాలువనుండి పిల్లకాలువ చీలుచోట (యాగర) వేసిన పెద్దగట్టు — మేలుమడవ తెగింది [నె; అ; పె]

మేలుమాళె = మిద్దెలో మొదటి అంతస్తు

మేల్వాటు = మిద్దెటింట్ల పైకప్పున మట్టి పోయుట [అ]

మేవచేప = ఉప్పువేసి ఎండబెట్టుటకు పనికి వచ్చు చేప [కృ]

మేవా = ఎండబెట్టిన పండ్లు [కరీ]

# మై



మైదాకు = ఆడపిల్లలు గోళ్లకు రంగువచ్చుటకు అమర్చు ఆకు; గోరంటాకు [కరీ]

మైదుచల్లు = మంత్రపుపొడిచల్లి, మైమరపించు [మ]

మైనపుముక్కు = సమయానుకూలముగా పక్షములు మార్చువ్యక్తి, మైనముతో చేసిన ముక్కు ఎటువంచిన అటు వంగునట్లు యీ మార్పు; దొర్లుడు పుచ్చకాయ; ఏగాలికాచాప ఎత్తువాడు; నీటివంక తుంగ [నె]

మైనపువత్తి = క్యాండిల్; మోంబొత్తు; కొవ్వొత్తి [నె]

మైపన్నా = అహంకారము [కరీ]

మైల = (1) మాలిన్యము — తూర్పురేకలు యిప్పుడే మైల విడుస్తున్నవి [నె]
(2) ప్రసవించిన వెనుక వెడలివచ్చు మైల నీరు; మావి—మైల పడలేదు [అ]
(3) ముట్టు; అంటు, సూతకము [వ: తె]
(4) వయసుకోడెకు గంగడోలుమీది ఏర్పడు నల్లదనము — మైలెద్దు; మైల కోడె (ఈ నలుపు వయసు ఎదుగుకొలది పోవును) [నె-పొ]

మైలతేరు = బ్రహ్మోత్సవమున, శాస్త్రోక్తముగా త్రిమతములవారు లాగినతర్వాత ఇతరులు లాగు తేరు [అ]

మైలబడు = మడ్డివిడుచు [కరీ]

మైలలు = చంటిబాలులకు దగులు ముట్టుమైల [కరీ]
మైలవన్నె = తెలుపు నలుపు మిశ్రితమైన వర్ణము—*మైలవన్నెలకోడె* [చి; నె]

మైలసంత = చేపల మార్కెట్ [చి]
మైలపోతు = ఆకు తోటలకు పసుపుతోటలకు బహిష్ఠ అయినవారి మైలతగులు [గు]

# మొ



మొంటి = చిన్నగంప మున్నగువానివంటి వరికరము [చి]
మొంటె = పిల్లలు ఆడుకొను చిన్నచేట; మొరిటె; మొరిటి [మ; కరీ]
మొండి = (1) ఆటలలో అడ్డము తిరుగుట—*వాడిదంతా మొండిఆట*
(2) అక్రమము—*మొండిచేష్టలు*
(3) హఠము; తిరుగుబాటు — *ఆ ఎద్దు మొండికేసుకొంటుంది*
(4) పని అయినదాక వదలకుండుట — *మొండికేసుకొని డబ్బుతీసుకొని పోయినాడు* [నె]
మొండిచేటు చూపు = అడిగినదానిని లేదను; వట్టిచేటజూపు; చేట తిరుగవేయు [కర్నూ]
మొండిచేయిజూపు = ఎగబెట్టు; మోచేయి జూపు [తె]
మొండిబండవాడు = పట్టువిడువనిమూర్ఖుడు. బండ్లవాండ్లు అనువారు దిమ్మరులైన ఆరణ్యకులు. భిక్షమునకు వచ్చినప్పుడు ఎంత పొమ్మనినా వాకిలిని విడిచిపోక మోడిబెట్టుకొందురు [నె; అ]
మొండు = (1) తప్పు
(2) అసమర్థత — *ఈమొండు నామీదికి వచ్చినది* [నె-పొ]
మొండుబండవాడు = (చూ) మొండిబండవాడు [తె]
మొండుబడు = మొండికిదిగు [కరీ]

మొండెముక = ఎద్దులకు ప్రక్కలలో ఉబ్బి ఉండు ఎముక, ఇది దుర్లక్షణము [నె-పొ]
మొకముకొట్టు = తీపిపదార్థాలు అతిగాతిన్నందున పుట్టు వెగటు; మొగముమొత్తు [మ]
మొకిరి = (1) చేనిగనిమలు కలిసిన మూల [నె]
(2) చివరి అంచు
మొకిరె = గోడ మొదలగు వాటి భాగములో ఏర్పడు బొక్క; మొరిక [కరీ; న]
మొకిరెలు = పొయ్యిరాళ్లు [మ]
మొక్క = నాటుటకు అనువైన చెట్టుపిలక—*టెంకాయమొక్క* [నె; కర్నూ; వ; అ]
(2) వరి కోసిన తరువాత ఏర్పడిన మోటు మొదలు; కొయికాలు—*ఇదిమొక్కడుగు పైరు (వరికోసి వెంటనే దున్ని పెట్టిన పైరు)* [నె, కర్నూ; అ]
మొక్క = పైబట్టలేని వాడు—*మొక్కవలె తిరుగుచున్నాడు* [చి]
మొక్కచెడు = పూర్తిగా చెడిపోవు; మొదలంటచెడు — *వాడు మొక్క చెడిపోయినాడు* [నె; అ]
మొక్కడగు = వరికోసి వెంటనే మిగిలిన మొక్కలు (కొయికాలు) దున్ని వెంటనే మరల పెట్టిన పంట; రెండవకారు — *ఈ ఏడు మొక్కడుగులు మంచిపంట నిచ్చినవి* [నె]

మొక్కలిపీట=ముక్కాలిపీట [గ]
మొగముగొట్టు=అసహ్యతబుట్టు [కరీ]
మొగంమొత్తినట్టు=గట్టిగా—వాణ్ణి మొగం మొత్తినట్టు తిట్టినా [వి]
మొగంమొత్తు = తీపు మొగలగువాటిని ఎక్కువగా తినినందున వెగటుబుట్టుట; మొకముగొట్టు — అదంతే ఆయనకు మొగం మొత్తి పోయింది [నె; కర్నూ; అ; వ; తె]
మొగంవాచిపోవు = ఒక వస్తువు మీద ఎక్కువ అపేక్షపడు; వాచిపోవు—పచ్చ ళ్లకు మొగం వాచిపోయింది [నె]
మొగదల=మొదట — ఊరి మొగదల; మొగాళం [నె]
మొగరముగడ్డ=గణుసుగడ్డ; రత్నపురిగడ్డ; కందగడ్డ; చిలగడదుంప; తెలగడుంప; మొరుంగడ్డ [హై]
మొగాళం=మొదట; మొగదల [నె]
మొగి=(1) వరుస
(2) తాటిచెట్టు, ఈతచెట్టుయొక్క తల భాగము [కరీ]
మొగిలినాగు=మొగలిచెట్లలోను (డొంకల లోను) మొగలిపూవు వాసన కలిగిన పాము; ఇట్లే మల్లినాగు, సంపంగినాగు, చింతనాగు, తాటినాగు మొదలగునవి[శ్రీ]
మొగుదారి = అగ్రగామి; మొగేదారి [నె; చి]
మొగురము=స్తంభము [కరీ]
మొగేదారి=పనికి ముందుగా సిద్ధపడువాడు; సమర్థుడు [నె]
మొటిక=(1) మొట్టికాయ—మొటికేశాడు [చి; నె]
(2) మొగమునలేచే యౌవనపుపొక్కులు; మొటిమ
(3) చిన్నముక్క—బలపపు మొటిక
(4) గొరుగగా నిలిచిన మోటిక [నె-పొ]
మొటికాక్కాయ=మొట్టికాయ [కర్నూ; అ]
మొటికాక్కాయ=గోరుచిక్కుడుగాయ; మటి కాక్కాయ; గోకిరికాయ; శ్రీరామచిక్కుడు [చె]
మొట్ట=ఒకరకపు చేప [కరీ]
మొట్టు=మ్రోడు [కరీ]
మొట్టికాళ్లు = వేళ్లకు గోళ్లులేనికాళ్ల [నె-పొ]
మొట్టువాడు=అంగ వికలుడు [నె-పొ]
మొడుసు=గనె [కరీ]
మొత్త=(1) మాల [చి]
(2) గోదాము; గిడ్డంగి [గు]
(3) పశువుల కట్టివేయు కట్టుకొయ్య[కరీ]
మొత్తలు = (1) దారికి (గేటుకు) ఇరు ప్రక్కలా కట్టిన దట్టమైన గోడలు, దిమ్మెలు
(2) తలుము (ఏతము) కపిల (మోట) గిలక చట్టమునకు క్రింద కట్టిన గోడ భాగము [నె; కర్నూ]
(3) తొంటి—ఆమెకు మొత్తలు జారినవి, పిల్లలు పుట్టరు [నె-పొ]
మొత్తసము=సమృద్ధి [కరీ]
మొత్తు=కొట్టు [అ; నె]
మొత్తుకొను=(1) గట్టిగా కేకలువేయు — వాడు ఊరకతే మొత్తుకుంటున్నాడు
(2) ప్రాధేయపడు [తె; నె]
మొదలుమాసిన=వంశనాశనమైన [కరీ]
మొనఎక్కుడు=పోవుటకు కష్టమనిపించు దారి, ప్రదేశము—మూలప్పేటకు పోవా లంటే మొన ఎక్కుడనిపిస్తుంది [నె]
మొనదేలి=కొస్సెగా [కరీ]
మొనదేలు = (1) నెత్తురుగడ్డ మొదలగు వ్రణములు, పగులగొట్టుకొనుటకుముందు మొన ఏర్పడుట [నె; వ; అ]

(2) ఒక వివాదము పరిష్కారం ముఖ మగుట—*దానికి ఇప్పుడే తేలింది* [నె; కర్నూ; అ; తె]

మొపికలు = యౌవన సూచకముగా లేచు చిన్న గుల్లలు; మొటిమలు, మొటికలు [అ]

మొప్పము=(1) మోసము

(2) ప్రమాదము [కర్నూ]

మొమ్మటు=మైనము [మ]

మొయిన=శుభాశుభకార్యాలలో బ్రాహ్మణుల కిచ్చే స్వయంపాకం. బియ్యము పప్పు, చింతపండు ఆకులలో కూరలు ఉప్పు నెయ్యి మొదలగునవి; మోయన

మొయిలుమేయు = మబ్బు పర్వతశిఖరములను చుట్టుకొను, ఇది త్వరలోరానున్న వర్షమును సూచించును — *ఈ పొయిలు బాగా మొయిలు మేసింది* [నె]

మొరము=(1) గులకరాతినేల; మొరుము [మ; నె]

(2) మెట్టనబెట్టు వరి [చి]

మొరవ = చెరువునిండి పారు అలుగు; కలుజు [తె; చి]

మొరాయించు=మొండిబడు [తూ-గో]

మొరిక=చిన్నగుంట; మొరికి — *గోడకు మొరికపోయింది* [నె; వ]

మొరికి=అంగలోపము; మొరిక [కరీ, నె]

మొరుంగడ్డ = గణుసుగడ్డ, చిలగడదుంప, రత్నపురిగడ్డ, కంద; తెలగుదుంప; మొగరముగడ్డ [న]

మొరుము=రాతిపలుకులతోనిండినమట్టి — *మొరుంనేల, మొరుంబావి*; మొరము [చి]

మొట్టు=(1) జిగురు పదార్థము నిచ్చే ఒక రకపు చెట్టు—*మొట్టుబంక*

(2) అంగలోపము — *తొట్టి*; మొట్టి [కరీ]

(3) తక్కువ [మ]

మొల = (1) తలబుడుపులేని లావు ఇనుప చీల, మళ—*మొలదించి బిగించు* [నె]

(2) నాగలికట్టును ఇముడ్చుచీల

(3) మేకు [నే]

(4) రాతిని చెక్కు సాధనము; చీనము—*ఏమొల తొలిచినదో ఈ శిల్పము* [చి]

మొలక = (1) మోసులెత్తిన వడ్ల విత్తనములు; ఇవి రొంపిలో చల్లుటకు ఉపయోగింతురు.—*మొలకమండి*

(2) పెద్దచెట్టు (అరటి) ప్రక్కన మొలచిన చిన్నపిలక [నె; కర్నూ; అ; తె]

మొలకబారింది=మొలకెత్తినది [చి]

మొలకలపున్నమ = వైశాఖ మాసములో పున్నమనాడు స్త్రీలు చేయు పండుగు[అ]

మొలతాడుతీయు=(చూ) పోతుగాడి [గో]

మొలపంచ = ధోవతి; అంతరీయము — *మొలపంచతోనే స్నానంచేయు* × పైపంచ; ఉత్తరీయము; అంగ వస్త్రము [నె]

మొలవడి = పైరుకోసిన తర్వాత చేలలో రాలినగింజలు వానకు మొలచిన మొలకలు —*మొలవడి ఎక్కువగా వచ్చింది* [నె]

మొలుపుజూపు = స్ఫోటకము పోయుట ప్రారంభించు — *ఈదినం అమ్మవారు మొలుపు జూపింది* × దించుకొను=తగ్గిపోవు [నె]

మొలుపుపదును=మొలకలు మొలచుటకు చాలినంత తడి [కరీ]

మొల్కబోయు = మొల్కకొరకు వడ్లుపోయు; ములకబోయు [న]

మొల్లి=చిన్నాపిల్ల [కరీ]

మొళ=చిన్నసైజు లోహపు మేకు; మొల [అ]

మోంబొత్తులు = కొవ్వొత్తులు, మైనపువత్తులు క్యాండిల్సు [అ]

మోక = మొగ్గ [కరీ]

మోకాటిదండె = (1) బండి బరువు ఎక్కువ అయినప్పుడు, ఎద్దులు ముందటి మోకాళ్లపై వ్రాలి పూని లాగునది (2) ఎక్కువైన ప్రయత్నము—*మోకాటి దండెవేసి పని పూర్తిచేసినాడు* [నె]

మోకాటిలో మెడనరం పట్టింది = అసంభవాన్నిగూర్చి చెప్పుట; బట్టతలకు మోకాళ్లకు ముడివేసినట్లు [గు]

మోకు తిరుగని = మిక్కిలి లావైన —*మోకు తిరుగనిచెట్లు* [వి]

మోకుబిళ్ల = గడ్డి, కంప మొదలైనవి బండి మీద తోపుగా వేసి బిగించు మోకుల చివరన కట్టియుండు కొయ్యబిళ్ల [నె]

మోచీవాడు = చెప్పులు చేయువాడు; ముచ్చివాడు [కరీ]

మోచేతిక్రింద నీరుత్రాగు = దీనాతి దీనముగా ఒకరిపై ఆధారపడియుండు. దోసిలితో నీరు త్రాగునప్పుడు రెండు మోచేతుల బుడుపునుండి నీరుకారిపోవు చుండును, ఈనీరు త్రాగి బ్రతుకు దైన్యస్థితి అనుట; మోచేతి గంజిత్రాగు —*ఆయన మోచేతిక్రింది నీరుత్రాగి బ్రతికే వారెవరూ లేరులే!* [నె; తె; గు]

మోచేతిగంజిత్రాగు = (చూ) మోచేతిక్రింది నీరుత్రాగు [కర్నూ; గు]

మోచేతిదెబ్బ = చాలా బాధాకరమైన దెబ్బ [సర్కా; నె]

మోచేతిమీసం = ఆడవారికి ఎంతో అరుదుగా మోచేయిపైగా, కుచ్చుగా రోమము లుండును. ఇది చాల అదృష్ట సూచకము —*దానికేమి మోచేతి మీసాలున్నవా!* [చి]

మోచేయిజూపు = ఎగబెట్టు; పిల్లకాయలు ఆటలలో నియమమునకు భిన్నముగా ఎదురు తిరిగినపుడు మోచేయి చూపుదురు —*ఆయన మోచేయి చూపినాడు* [నె; అ; వ]

మోట = కపిలబారి మొదట (పైకి) ఎద్దులు వచ్చి నిలుచుచోటు, ఇక్కడనుండి నీరు నిండిన బానను లాగుకొనుచు బారిలోనికి ఎద్దులు దిగిపోవును [నె-ఆత్మ]

మోటపంపు = మోటతోలి పారించు పొలము [కరీ]

మోటా = మొరటు [అ]

మోటి = గోడమీదకప్పు మదురు [కరీ]

మోటిక = నరుకగా. లేక కోయగా మిగిలిన చిన్న మొదలు — *మోటికలు లేకుండా గొరుగు*; మొటిక [నె]

మోటు = మోటిక—*చేలో మోట్లులేవి దేని నారు* [అ; నె]

మోట్లుగొట్టేవేళ = వేగుచుక్క పొడిచి నంతనే మోట్లు—(*మోటలు, కపిలలు*) *కట్టుటకు వెళ్ల సమయము, దాదావు* $3\frac{1}{2}$ *4 గంటలు* [మ]

మోడి = (1) దొమ్మర మొదలగు బ్రిమ్మరి జాతులవారు, గిరులు దాటి నడుమ నుంచిన పందెపు డబ్బును తీసికొనుటకు చిందులతో, పాటలతో పోయి చేయు ప్రయత్నమును మోడి అందురు. ఈ ఆట గాంఢ్రకు ప్రతిగా, ఎదురు మాంత్రికుడు, ఎదుట వేసిన గుడిసెలో గూర్చుండి, పాముల బుట్ట నూదుచు చిందులువేయుచు పోవుచుండు దొమ్మరిని మంత్రములతో

అశక్తుని జేయ ప్రయత్నించుచుండును. ఇరువాగుల వారును క్షుద్ర విద్యలను ప్రయోగించుచుందురు. చివరకు గిరులు దాటి, వాట పందెపు డబ్బును తీసికోగలిగిన దొమ్మరి మోడి గెలిచినట్లు ఎంచబడును.

(2) పట్టుదల చూపుట — *మోడివేసి కూర్చొని ఉన్నాడు*

(3) పిల్లలు హారము బెట్టుకొనుట; మూర్ఖపుపట్టు — *మోడి ఏల అని త్యాగరాజు వాడినాడు* [నె; కర్నూ; అ]

(4) పంతము; పందెము [తె]

(5) సేపు—*నేను వచ్చి కొంచెము మోడి అయింది* [మ]

(6) పూర్వపు మహారాష్ట్రి లిపి [అ]

(7) స్పర్థ [కరీ]

మోడెముబోవు = వరి పరుగు దగిలబోవు [కరీ]

మోద = (1) నెత్తురుకదుము — *మోద కట్టింది;* మోదు [నె; తె; అ; పె]

(2) తమలపాకులకట్ట [గో]

మోదు = మోద—*చెయిమోదు కట్టినది*[అ]

మోపి = ఒక తిట్టు; ముండమోపి వెధవ అని అర్థము— *పోరా మోపీ* [తె; నె]

మోపు = (1) పెద్దప్రయత్నము — *దానికి పెద్దమోపు చేసినాడు* [నె]

(2) సంభోగము — *వాడు దానికి మోపు చేసిండు* [మ]

(3) గర్భంచేయు [వ; తె]

(4) కోపము — *చాల మోపుగా మాట్లాడాడు* [చి]

(5) గొట్టములను అతుకు [గు]

(6) నగకు రాళ్లుతాపు—*రాళ్లమోపుతమ్మ* [నె]

(7) అధికమగు — *జ్వరం చాలా మోపు చేసింది* [నె]

మోపుగా = మెల్లగా [నె-పొ]

మోపూరుచక్కెర = విషపవీరము. మోపూరులో ఒక సంసారి, ఆ స్త్రీకొరకు ఒక బిడ్డకు యీ విషమును చక్కెర అనిచెప్పి యిచ్చి చంపినాడు. అది మొదలు దీనికి యీపేరు [నె]

మోయన = (1) సరిపోవునది; ఒకపాటిగా నుండునది—*అది మోయనగా నున్నది;* మోయిన [నె]

(2) వల్లెలలో సంసారుల ఇండ్లకుబ్రాహ్మణ అతిథులు వచ్చినప్పుడు, వారి భోజనమునకు వలసిన వంట సామగ్రిని ఒక బ్రాహ్మణుని ఇంటికి పంపునది. దీనితో వంటజేసి అతిథి సత్కారము గావింతురు; సాహిత్యము — *ఇద్దరికి మోయన పంపి* నారు; మొయిన [నె; తె; అ]

(3) ఒకపాటి పరిమాణము గలిగిన— *అయన మోయన మనిషి* [నె, కర్నూ]

మోయిన = (చూ) మోయన [నె]

మోర = (1) పశువులమూతి [అ; నె]

(2) (నీచార్థములో) ముఖమనుట — *నీమొగము నీ మోరలే* [నె; వ]

మోరి = వంతెన; అడ్డెడ; బేరి [అ-పె]

మోరీ = (1) సిటికాలువ [తె]

(2) చిన్నవంతెన [అ; హై]

మోరుచిక్కము = ఎదురుబడుట [కరీ]

మోరుదోపు = చెప్పిన విననివాడు [కరీ]

మోరుదోపుచేష్టలు = చేతగాని సోమరి చేష్టలు [మ]

మోరువొట్టు = కల్లు [మ]

మోసు = పేరుకొనిన వండు మట్టిఉప్పు [కరీ]

## య



యంబ=(1)చీకాకు; పనిలో కలిగిన చిక్కు; ఇబ్బంది — *ఇంట్లో యంబగా ఉన్నది* [నె]
(2) వేడిమి—*ఈదినం చాల యంబగా వుంది* [చి]

యంబ్రహ్మ=అప్రయోజకుడు—*వాడువట్టి యంబ్రహ్మ* [నె; కర్నూ; అ, తె]

యటుమటుము=చిక్కు; సంకటము [కరీ]

యట్టుము=కంపతొడుగు [అ-పె]

యడ్డామడ్డి=ఎడ్డిమడ్డి; మొరటు [అ-పె]

యతామతం=వెట్టిమొట్టితనము, యతివలె అలౌకికముగా నుండుట; యతిమతము; యతిమితం—*ఆయన యతామతం మనిషి* [నె, తె]

యతిమితం = (చూ) యతామతం [నె; కర్నూ]

యత్తవారి=ప్రయత్నము, సన్నాహము; యత్వారి—*మంచి యత్తవారి చేసినాడు* [నె]

యత్వారి=(చూ) యత్తవారి [నె]

యదబడు=భయపడు [అ; బ]

యదార=(1) ఆసక్తి
(2) చీకూ చింత [అ; బ]

యమగండడు = చాలా సాహసము గలవాడు [సే]

యల్లాబాగా=తేరగా [అ; బ]

యళవు=(1) రోగము
(2) అశుభమైనమాట — *ఇదేవి యళవు* [సే]

## యా



యాకటి = వేకటి; గర్భిణి

యాకము=అఖండము, యాకాణము [మ]

యాకాణము=మొదలు తుద ఒకటిగా కలిసి యుండుట—*ఆదూలం యాకాణానికి ఒకే మోస్తరుగా ఉన్నది* [నె]

యాకాము = వేకువ [వి]

యాకిరి బీకిరి = చిందరవందర; ఒకక్రమము లేని [అ; బ]

యాగర = సాగు నీటికాలువలు చీలు మొత్తలు, (చోటు) రెగ్యులేటరు [నె]

యాగట్టు=గొట్టుకు వెనుక చేర్చిన అక్కడను కలిపి ఉంచు కట్టు [నె-మెట్ట; అ]

యాగీ=అల్లరి — *వాడు యాగీ చేస్తాడు* [తె]

యాటొలె=ఏటవాలు [మ]

యాతబెట్టు=ప్రయోగముచేయు; చాతబడి చేయు, పంపుచేయు [నె-పొ]

యాతరమంది=నీచులు [తె]

యాతరి=(1) మర్యాదతెలియని
(2) పొడిచే పశువు [నె-పొ]

యాదర = ఇంటిలోను, ఉమ్మడి కాపురముల లోను, ఎవరికి వారు డబ్బును మిగుల్చుకొని చేర్చిపెట్టుకొనుచు, రహస్యముగ వస్తువులను ధాన్యాదుల అమ్మి మూట

గట్టుకొనుచు, ఎవరి సొంతమును వారు పెంచుకొను చుండునది—*ఆమె యాదర గట్టినది. యాదరగట్టిన సంసారం ఎక్కిరాదు* [నె]

యాదస్తు = జ్ఞాపకము [వి]

యానము = అన్నమెత్తుకొని వెళ్లు పాత్ర [చి]

యామ = ఒకవిధమగు చేప [గు]

యార = (1) పనిచేయక వదలివేసినదినము; సెలవు—*ఈదినం యార వదలినారు*

(2) జాతరలలో ముఖ్యమైన ఉత్సవము లేని దినము

(3) చెట్టును, కల్లుకుట్టనీయకుండ విలిపిన దినము—*చెట్టుకు యార వదలినాడు* [నె]

యారగట్టు = వ్యవసాయమునకు కావలసిన తాళ్లు మున్నగునవి; కలప [నె]

యారదోలు = పారదోలు, కోడిపిల్లలను చేపారిన తర్వాత తల్లిపెట్టనుండి ఎడము చేయు [నె-పొ]

యారదోసు = (చూ) పారదోలు [నె-ఆత్మ]

యారపోటి = (చూ) తోడిడి [నె-ఆత్మ]

యారాము = (1) పైరుబెట్టిన, పైరునాటిన కయ్యలో నీరు బయటికి పోవుటకు చేసిన లోతు తక్కువ, చిన్న పాయకాలువ [నె]

(2) కప్పుకాలువ [అ-పె]

యాలాము = (1) పశువులను కట్టివేయుటకు పొలములో తాత్కాలికముగా అమర్చిన దొడ్డి; యాలాలు

(2) పొలము మధ్య ఏర్పరచిన చిన్న పశువులదొడ్డి, కాపురపు గుడిసెలు (Farm-House)—*వంగల్లు యాలాలు* [నె]

(3) దుర్గమారణ్యములలో వెలసినదేవతల తిరునాళ్లకువచ్చి చేరినజనము, ముఖ్యముగా కలిగినవారు ఏర్పరచుకొనిన తాత్కాలిక వసతి, బస—*సుబ్బయ్యా యాలాములో దిగినా* [నె-మెట్ట]

యావ = (1) అధికాసక్తి — *ఆయన బలే యావ మనిషి*

(2) వృథామానసిక కామేచ్ఛ—*యావతో తిరుగుచున్నాడు* [నె; అ]

(3) పాటు [కరీ]

(4) నైపుణ్యము, అభినివేశము [వ]

(5) వంక; సాకు; మిష—*ముక్కుడున్న మ్మకు యావ, నే నెవరినో*

(6) దీవి—*యావగా ఉంది* [వి]

(7) ఎగబడు [వ; గో]

యావన్నగాలము = ఎల్లకాలము, ఆరుగాలము [అ; బ]

యాష్ట = మానసిక ఆయాసము — *ఆయన ఊరకే యాష్ట పోతున్నాడు* [నె]

యాసమాటలు = (1) కావరపు మాటలు [కరీ]

(2) ఒక ప్రాంతము వారికి ఇంకొక ప్రాంతమువారి మాటలో దోచు అపరిత ధ్వని; నూతన శైలి—*నెల్లూరుకు గోదావరి మాట యాస*

యాసరపోవు = వేసారు [మ]

# యూ



యూపానికిలాగు = బంధించి కష్టపెట్టు — *వాడిని యూపానికి లాగినారు. ఈమాట సామాన్య ప్రజలలోగూడ వాడుకలో నున్నది* - యూపము = యజ్ఞపశువును బంధించు స్తంభము. దీనికి కట్టి మేకను చంపి వప (పేగుపై నుండు సన్నటిపొర) దీసి వేల్తురు [నె]

# యె



యెతమతం = ఒకరు ఔనన్న దానిని కాదనుట; యతమతము [గు]

యెతీపతి = అటూ ఇటూ తేలని పరిస్థితి — *దానికి యెతీపతీ తేలలేదు* [గు]

యెదరపు = (1) బదులు; ఎదరపు [చి]
(2) సహాయము చేయవలసిన వారు, దానికి మారుగ సహాయము చేయించు కొనుట — *అమ్మగారింటికి యెదరపు పెట్టవలని వచ్చింది* [నె]
(3) రావలసిన బాకీని వసూలు చేసుకొనుటకు, ఋణస్థునికి చేయు ఆర్థికసహాయము — *ఆయన కంట్రాక్టుకు యెదరపు పెట్టి చివరకు వసూలు చేసుకోవలని వచ్చింది* [నె]

# యే



యేడి = బండిజల్ల చివరన ఆకు అడ్డము పెట్టుకు ఆనుగా కట్టిన త్రాడు — *యేడి విప్పు* [నె-ఆత్మ]

# యో



యోగులమారి = ఉపాయశాలి

రంగము = వివాదము; రచ్చ — *దాని విషయంలో పెద్ద రంగమైనది* [వె]
రంగరజ వాళ్లు = రంగులు అద్దేవాళ్లు; రంగ రాజువాళ్లు [మ]
రంగరాజువాళ్లు = గుడ్డలకు రంగులద్దేవారు; రంగరజవాళ్లు [వె]
రంగసాని = భోగముచాన. గంగజాతరలలో ఈ పాత్రగల నాటకము ప్రసిద్ధము [చి]
రంగు = వలపు — *దానికి వాడిమీద రంగు* [వి]
రంగులాడి = వేషకాంత [కరీ]
రంజీతు = అప్రియమైన విషయము బయట బడినప్పుడు ఒక వ్యక్తి పడు బాధ — *అతడు రంజీతు పడుతున్నాడు* [నె-మెట్ట]
రంది = (1) పోరు
(2) వలపుగాని రాకపోకలు — *వాడిది రంది అయింది*
(3) తీవ్ర కామోద్రేకము—*వాడికి రంది పట్టింది;* యావ [నె]
(4) గొడవ — *వాడి రంది వాడిదే* [నె; తె]
(5) కలహము [గో]
(6) విచారము; మనోవ్యథ [వ]
రంప = చిన్నకట్టె (కొయ్య) పేడు [వి]
రంపు = (1) గోడు
(2) చేయు బలవంతము—*ఉబ్బుకు వాడు రంపు చేస్తున్నాడు* [నె; కర్నూ]
(3) పీడ—*వాని రంపు ఎక్కువైంది* [నె; తె; అ]
(4) గొడవ [గో]
రకుక్క = గోళ్లతో గట్టిగా గీకు [నె; కర్నూ; తె; అ]
రకొక్కను = అభివృద్ధిచెందు; రెకొక్కను [చె]
రగడ = రచ్చ; వివాదము—*దానికి ఒక పెద్ద రగడైంది* [నె; కర్నూ; తె]
(2) కొట్లాట [అ]
(3) రాపిడి [వి]
(4) పచ్చి వరాసీలు మసాలవేసి ఉడుక బెట్టిన భక్ష్యము [హై]
రగరగ = మెఱపు [కరీ]
రచ్చ = (1) కొట్లాట [చి; నె]
(2) సమావేశము [చి]
(3) రచ్చబండ—*చావిడి*
(4) పెద్దగొడవ—*రచ్చ రాయిడి* [గో; నె]
రచ్చన = ధాన్యపు కుప్పచుట్టు, ముద్దెర (ముద్ర) పలుకలేని వాళ్లు బూడిదతో గుర్తుగ పోయినది (రక్షణ ?) [మ]
రజను = అంపముతోగాని ఆకురాయితోగాని బంగారముపై రాచినపుడు రాలు బంగారపు పొడి [గు]
రటాణి = తిరుగలి; లంటారొ, రాగరాయి [సే]
రత్నపురిగడ్డ = (చూ) గణుసుగడ్డ; చిలగడ దుంప; కంద [హై]
రపాట = (1) ఒకే లక్ష్యము కలిగియుండుట —*ఒకే రపాటాన ముందుకు పోయినాడు* [నె]
(2) దెబ్బ [కర్నూ]
రపాన = (చూ) రెపాన [నె-ఆత్మ]
రప్పము = గొఱ్ఱెల మేకలకై కంపలతో నిర్మించిన దొడ్డి [అ-పె]

రబసము = కలబా; రచ్చ; రబ్బసము—
*దానికిగా రచ్చ రబసమైంది* [నె]
రబ్బసము=(1) అందము
(2) గలాటా; రబసము [అ-పె]
రబ్బీ = మధ్యకారు మెరకపంట × కరిఫ్
[కరీ]
రబ్బు=ఆధిక్యము [కరీ]

రసపిచ్చి=(1) అధికానక్తి [వె]
(2) కామాతురత; యావ—*ఆయన రస పిచ్చిగాడు* [నె; వ]
(3) బంగారుచేయు ఆకాంక్ష; రసవాద లౌల్యము (పాదరసంతో బంగారుచేయు ప్రయత్నము) [చి]
రసిక=కురుపులనుండి కారు ఏము, నెత్తురు
[నె]

# రా



రాకాసిగుళ్లు = పూర్వము మృతకళేబరము లకు చేసిన భూస్థాపనములు. ఇవి కందుకూరు, కనిగిరి తాలుకాలయందు అచ్చటచ్చటగలవు, స్థానికులు పూర్వకాలమున రాక్షసులు తపస్సు చేసుకొను మందిరము లను నమ్మకముచే పై పేరుతో పిలుచుచున్నారు. కాని ఇవి పూర్వుల మృత కళేబరముల నుంచిన స్థలములని చరిత్ర పరిశోధకుల అభిప్రాయము [నె-మెట్ట]
రాకిణి=స్త్రీలు తలపై బెట్టుకొను నగ [మ; కరీ]
రాగరాయి=తిరుగలి; రాగినకల్లు [సే]
రాగలకట్టె=కంపను నెట్టుటకు, కట్టుటకు ఉపయోగించు, ఒక చివరన వంగాలుగల పొడవుగట్టికట్టె (కఱ్ఱ); రాగోల [నె]
రాగిటి=స్త్రీల శిరోభూషణః రాగిడి [అ]
రాగిడి=నెత్తిపై బిళ్లవలెపెట్టు నగ[గు;తె]
రాగినకల్లు=తిరగలి; తిరుగలి; విసరురాయి; రటాణి; లంటారో; రాగరాయి
రాగిల్లు=ఆరితేఱు [కరీ]
రాగోల=కంప యెత్తెముల నెత్తు పొడుగాటి లావటికఱ్ఱ; దీని చివర రెండు వంగ లుండు; రాగలకట్టె [కరీ]

రాచేగుమ్మడి=బూడిదగుమ్మడి [వ]
రాచినుకు పోచినుకు = అప్పుడప్పుడు కురియు వాన తుంపరలు — *రాచినుకు పోచినుకు బీట్లో గడ్డ బాగా వట్టినది* [నె]
రాచి రంపానబెట్టు = బాధించు — *ఆమె కోడలిని రాచి రంపాన బెట్టింది* [నె]
రాచిప్ప=(చూ) రాచ్చిప్ప [నె; కర్నూ; తె]
రాచ్చిప్ప-రాతిచిప్ప=(1) తెలివిలేని మొద్దు —*సైదాపురం రాచ్చిప్ప* అనితిట్టు. గూడూరుకు పరమటనుండు సైదాపురము చుట్టు పట్ల మైకాగనులలోనుండు దంపుడు అనే మెత్తటి పసిమిచాయ రాతిని మలిచి పెద్ద చిన్న గిన్నెలవంటి పాత్రలను చేయుదురు. చారు మొదలగునవి కాయుటకు వచ్చళ్లు పెట్టుకొనుటకు మడిగా బ్రాహ్మణులు వీటిని ఉపయోగించుదురు. ఇది మొద్దుగా నుండుటచే, మొద్దుమనిషినిగూడ రాచ్చిప్ప అని అంటున్నారు
(2) రాచిప్ప [నె; కర్నూ; వ]
రాజమండ్రిరవ్వ = రాజమండ్రి ప్రాంతపు స్త్రీ. ఉత్తమస్త్రీ అని [గో]

రాజాళువు = చాలా మంచి పోకవక్క [తూ-గో]

రాజేయు = (1) పొయ్యిలో నిప్పువేసి మండించు
(2) పద్యాదులను కంఠోపాఠం చేయు—పుస్తకమంతా రాజేసినాడు; బాగా ఒప్పగిస్తాడు [నె]

రాట = (1) గుంజ; గూటము; మేకు
(2) కొయ్య [వి]

రాటపాకు = (1) రాట్నపు చక్రమున ఆకుల వలె నుండు వెడల్పు చక్కలు
(2) ఒకజాతి ఆకు తీగ, దీనిని మేకలు గూడ తినవు [నె]

రాటు = (1) రాకపోకలు — మనిషి రాటు తగులుతున్నది [నె]
(2) అనుభవం—అతడు రాటు దేలినాడు [అ; తె]

రాట్నము = నూతిగిలక [చి]

రాతము = ప్రతిదినము వాడకము [కరీ]

రాతిఉప్పు = భూమిని త్రవ్వి తీయునది; సైంధవ (సింధుదేశపు) లవణము [నె; తె; అ]

రాతిమాంసము = పచ్చడి; ఊరుబిండి [నె-కలువాయి]

రాపిచ్చి = ధనాదాయమునందే కోరికగల మానసిక స్థితి — ఆయనకు రాపిచ్చే గాని పోపిచ్చిలేదు [నె]

రామందాడి = రామునిదాడి; శ్రీరాముడు కోతిమూకలతో చేసిన దాడివంటి దనుట. అసంఖ్యాకముగ ప్రజలు గుమికూడుట, రాకపోకలు జరుపుట—జనం రామందాడి అయినది; ఎలుకల రామందాడి అయినది [నె]

రామకుందనము = కల్లులొట్టి [తె-భోనగిరి]

రామచక్కని = అత్యంతము చక్కనైనది [హై]

రామబాణాలు = చీకిళ్ల కట్టెలు [మ]

రామాయపట్నమధ్యస్థం = ఒకడు ఇంకొకని వస్తువును అన్యాయముగా లాగుకొనినప్పుడు, మధ్యవచ్చిన పెద్దమనిషి—చెడ్డసొమ్మును చెరిసగము చేసికొనమని సర్దుబాటుచేసి తీర్మానము చేయుట. రామాయపట్నంవారు సాధారణముగా ఇట్టి పరిష్కారములే చేయుచుందురని ప్రతీతి. తుని తగవు చేయు [నె]

రామములకాకాయ = టొమాటో, టక్కోరపు వంకాయ

రాలగుంట = (చూ) రాలగుంటి

రాలగుంటి = నట్టింట, నేలమట్టమునకు పాతి పెట్టియుంచిన, కొద్ది గుంట గలిగినపలక రాయి దీనిపై కుండెనబెట్టి దంచుకొందురు; రాలగుంట [నె-మెట్ట]

రాలుగాయ = (1) పనికిరానివాడు — రాలుగాయపల్కు రిత్తమాట [గు]
(2) ఘటికుడు [కరీ]

రాలుడు = చెట్టునుండి తమంతతాముగా రాలినవి—రాలుడు పిందెలు [కర్నూ; నె]
(2) (చూ) రాల్పు [కర్నూ]

రాలుబడి = ఫలసాయము—ఈ ఏడు నిరుటికంటె రాలుబడి జాస్తి; రాల్పు, కనుబడి; దిగుబడి [చి]

రాల్పు = వరి మొదలగు పైరులు యిచ్చు ఫలితము — ఈఏడు మెట్టచేను రాల్పు బాగున్నది. దంచినప్పుడు తేలినబియ్యమును దిగుబడి అన్నట్లు; రాలుబడి; దిగుబడి, కనుబడి [నె; అ; తె]

రావమన్ను = రేవమన్ను [కరీ]

రావు = (1) ఠీవి—అతనిముఖం రావుగావుంది
(2) ముఖకాంతి—రావుగలమనిషి [చి;నె]

రావూరురసికుడు = నెల్లూరు నెఅజాణకు ఎదురుద్దిగా పేర్గాంచిన కల్పితపురుషుడు. రావూరు నెల్లూరుకు తూర్పున ఉన్న గ్రామము [నె]

రాళ్లు = రవ్వలు, పుష్యరాగములు మొదలగు నవరత్నము—రాళ్లగాజులు [నె]

## రి



రికాముగా=(1) తీరికగా, పనిలేకుండా [నె]
(2) వ్యర్థముగా [శ్రీ]

రిక్క=ఎద్దుల నదల్చు శబ్దము [చె]

రిక్కగోచి=ఒంటిరిక్కగోచి × బిళ్లగోచి [కరీ]

రిక్కు=నిక్కు [కరీ]

రిచ్చుపిట్ట = ధ్వని లావుగాసేయు ఒకపిట్ట (వ్యంగ్యముగా) నోరు నెత్తిన పెట్టుకొను మనిషి [కరీ]

రిట్టకాయ=కుంకుడుకాయ [వి]

రిబ్బు=ఆకులు మొగలు మొదలగు వానిని గోళ్లతో త్రెంచు [కరీ]

రిల్ల=లేతకొమ్మ — *ఆరిల్లను కొట్టివేసెను* [కరీ]

రిల్లగాళ్లు=తొట్రగాళ్లు [కరీ]

రివట=(1) కొంచెము — *వాడు రివటైనా పెట్టడు* [నె-పొ]
(2) జడి; పెద్ద—*రివటగాలి*

రివట = (చూ) రెవట [వ]

రివరివమను=ఇగురించు [కరీ]

రివ్వ=(1) సన్నగా, పొడవుగా ఉన్న వెదురు బొంగు
(2) బెత్తము; రువ్వ [వి]

## రు



రుజాము = పెంపు; అభివృద్ధి — *వాళ్లకు అయింట్లో రుజాములేదు* [నె]

రుద్దంతసేపు=ఎంతోసేపు [వి]

రుబ్బులాడి=వారివి వీరివి అనక అందరి కోకలు ధరించు స్త్రీ [కరీ]

రుమాలు=(1) తలపాగ [సే]
(2) జేబుగుడ్డ [గు]

రుమ్మెన = గుంటుకు (గుంటక) యొక్క పట్టు గట్టి (మేడి) [కరీ]

రుళి =కాలి అందె [సే]

రువ్వ=బెత్తము; మెల్లె; రవ్వ — *చింత రువ్వ* [వి]

## రూ



రూక=(1) ఒకటింకాలణా [చె]
(2) రెండు అణాలు [చి]

రూటుము = తప్పుచేసినందుకు కట్టు (జరిమానా) ధనశిక్ష [నె-పొ]

రూపుదప్పినవాడు=పనికిమాలినవాడు

రూపుబడదు=పొడగట్టదు;కనుతాలదు[కరీ]

రెంటాము = ఎద్దుమూపురము; చెండు

రెంటాలకుపోవు = మలవిసర్జనకుపోవు; రెండేళ్లకు పోవు [అ]

రెంకేలు = అధికాచమానము [అ]

రెండెడ్లబండి = సామానులబండి వంటిదే కాని, పైకప్పు ఉండును; గూటిబండి [మ]

రెండోపాలు = రెండోపంట [వి]

రెక్క = (1) ద్వారబంధమున రెండు అరలుగా బిగించిన తలుపులలో ఒకటి — *దానికి ఒకరెక్క మూయి* [నె; కర్నూ; తె; అ]

(3) పొగాకులో ఈనెకు ఒకవైపు భాగము [గో]

రెక్కదుప్పటి = ఒకే పొరగల దుప్పటి × పెద్దదుప్పటి [నె]

రెక్కపట్టె = బండిచంకపట్టె [నె-ఆత్మ]

రెక్కపాయ = కోడి — *ఆకాశతీర్థం* [కల్లు] *దెచ్చి, రెక్కపాయ కాల్చురా* [నె-ఆత్మ]

రెట్టకాయ = రెండూ ఒక్కటిగా కలిసిన కాయ; అమడకాయ; అరటిపండ్లిట్టివి మాంత్రికులకు అవసరము [చి]

రెట్టగోడ = ఇంటి ప్రక్కగోడలమీద ఇరుప్రక్కలా, కప్పుదించుటలో ఏటవాలు ఏర్పరచుటకు అటునిటు వాటముగా కట్టిన నెత్తిగోడలు (Gable Wall) [నె; వ]

రెట్టబిడ్డలు = అమడబిడ్డలు [చి]

రెట్టమతం = సామాన్యప్రజలు సాధారణముగా అను దానికి వ్యతిరేకముగా చెప్పుమాట, చేయు వాదము — *వాడిదంతా రెట్టమతం.* వేమనవలె విమర్శించుటచే రెట్టమతమను నానుడి పుట్టి పెరిగి అలముకొనినది. ఇతడు గొల్లడని ఒకమాట. రెట్టమతశాస్త్రమును అయ్యల భాస్కరుడు తెనిగించినాడు [నె, కర్నూ; అ; తె]

రెట్టమతమోడు = (1) అవివేకి

(2) మొండిపట్టుకలవాడు [అ]

రెడ్డి = మునసబు, గౌడు; కాపు

రెడ్డెమ్మ = వాయల్పాడు సమీపం గ్రామదేవత. ఈమె మహమ్మదీయు సేనలతో పోరాడి చివరికి కొండలోని బండను బ్రద్దలు చేసికొని లోనికి వెళ్లినది. ఈ మహాపతివ్రత వరమున పుట్టిన వారికి రెడ్డెన్న, రెడ్డెమ్మ అని పేర్లు ఏటా పూజలు విశేషోత్సవములు జరుగును [చి]

రెడ్డోరి ఆపఎద్దు = రెడ్డివారి ఆబోతెద్దు.

(1) చూపులకేగాని చేతలకు పనికిరాని వ్యక్తి. గ్రామ పశువులను దాటుటకుగా అచ్చువేసి, వెంకటేశ్వరుని పేర విడిపించిన రెడ్డిగారి ఆబోతెద్దు, ఇది తానుగా దాటదు, ఇంకొక ఎద్దును దాటనీయదు.

(2) ఒకపని తను చేయక, ఇంకొకరిని చేయనీయని బయటి పటాటోపపు మనిషి (చూ) ఆపఎద్దు; రెడ్డోరి దున్నపోతు [నె; తె]

రెడ్డోరి దున్నపోతు = అన్నిటికీ అభ్యంతరముపెట్టువ్యక్తి — *రెడ్డోళ్ల దున్నపోతు అదీ కడదు, ఇంకోదాని ఎక్క నివ్వాదు;* రెడ్డోరి ఆపఎద్దు [చి; తె]

రెపాన = (1) ఎవరిపాటికి వారు — *ఎవరి రెపాన వారు చేసినారు*

(2) తదేకధ్యానము — *ఒకటే రెపాన చేసినాడు* [నె]

రెప్ప = ఇలారానికుండు ద్వారము — *రెప్ప యెత్తి గింజలు తీయండి* [నె]

రెబ్బుగా = పోదిగా; గుబురుగా — *పైరు రెబ్బుగా వస్తున్నది* [నె]

రెయ్యలు = పెద్దతలకాయ కలిగిన చేపలు, రొయ్యిలు [శ్రీ]
రెల్లు = కాకిరెల్లు; రెళ్లు; శరము (Reed) [నె; వ]
రెల్లుగడ్డి = రెల్లు [అ]
రెవట = (1) లేతకొమ్మ
(2) లేతఆకు — తమలపాకుల రెవటః రివట [నె]
రెళ్ల = వరి వెన్నులో గింజలు కలిగిన చీలిక — ఈవేడు రెళ్ల ఎక్కువగా రాలింది [నె]
రెళ్లు = రెల్లు; కాకిరెల్లు [నె]

## రే



రేక = (1) గాయము — రేకచేసినాడు [అ]
(2) విదియనాటి చంద్రుడు [చి]
(3) చేద (చేదునది) [వి]
(4) తాటిఆకుతో చేసిన కోలదొప్ప [నె]
రేకు = (1) సంసారి వితంతువులు ధరించు; అంచులేని పాలచాయ (లేత రోజా) కోక [నె]
(2) టిన్, ఇత్తడి మొదలగు ధాతువుల పలుచని యాకు — తలుపుకు రేకుగొట్టు [శరీ; నె]
(3) ఒంటి వరుస దుప్పటి [మ]
రేగడపాలు = ఈనిన 3, 4 నాళ్లు ఇచ్చుపాలు, ముట్టుపాలు; జున్నుపాలు [నె; వ]
రేగడబఱ్ఱె = అప్పుడే ఈనిన ఎనుము; లేగడ బఱ్ఱె [నె]
రేగిగంప = తగులుకొన్నచో వదలక కలహించు స్త్రీ [మ]
రేచిక = (చూ) రేక్కె [మ]
రేచు = అడవికుక్క; చాల భయంకరమైనది [నె; కర్నూ; వ]
రేడ = తేనె పెరడు; తేనెతుట్టె [చి; అ]
రేపము = స్వాధీనము — మాఆస్తి నీరేపమైనది (నిందించుమాట) [నె-బా]
రేనాటిసీళ్లు = రేనాడు (పరమట సీమ) నుంచి పెన్నకు పారివచ్చు ఎఱ్ఱటి బురదనీరు [నె]
రేవమన్ను = నన్నువిపండుమట్టి; రేవుమన్ను [శరీ]
రేవు = (1) చాకలి చేసిన ఉతుకు — ఎన్ని రేవులయ్యాయి; మూడు రేవులకి నెల [వి]
(2) ఉపాయము [శరీ]
(3) కాలిబాటవలె లేక ఏటి రేవువలె ఏర్పడిన ప్రదేశము — రేవులు రేవులుగా గొరిగినాడు (నింద) [నె; తె]
(4) వైపు; పార్శ్వము — అవని ఒక రేవుకు ఇప్పుడే వచ్చినది అనగా పరిష్కారమునకు వచ్చినదనుట; ఏరుదాటు వారికి రేవు - దిగునట్టిచోటు - దొరకినట్లు [నె]
(5) అగిఆగి వరుసబెట్టి తిట్టుట — రేవు పెట్టి తిట్టింది [వ]
రేవుకుపోవు = (1) భర్త మరణించిన స్త్రీని జలాశయమునకు (కడ కర్మచేయుచోటికి) తీసికొనిపోయి, గాజులు పసుపుకుంకుమ తీసివేసి పుట్టింటివారు ఇచ్చిన వస్త్రము ధరింపజేయు సాంగెము [తె; నె]
(2) అపర కర్మలకుగా జలాశయమునకు పోవు — ఈదినం ఎత్తురేవు [నె]
(3) చాకలి గుడ్డల నుదుకుటకు ఏటికో చెరువునకో పోవుట [అ]

రేవుబెట్టు=తిట్టు — *రేవుబెట్టి ఉతికినట్లు* తిట్టు [వ]

రేవుకువచ్చు = (1) ఒకవని వైనమగు; ఫలోన్ముఖమగు — *ఇప్పటికి ఆవని ఒక రేవుకు వచ్చింది* [నె; తె]
(2) ఒడ్డుకు వచ్చు [గో]

రేవుకువేయు = చాకింటవేయు; చాకలికి గుడ్డలువేయు [వి]

రేవునబడు=కడతేరు; సఫలమగు; రేవుకు వచ్చు [కరీ]

రేవుమన్ను = సన్నని వండుమట్టి; రేవ మన్ను [కరీ]

రేవుతావు=గతి మోక్షము [కరీ]

రేవులేని=పెరవు చాలని [కరీ]

రేశము=పౌరుషము; — *రేశముకలమనిషి* [వ]

రేశ్కా=(1) ఇది అడవియందు పొంచిఉండి పశువులను పట్టి శరీరమంత రంధ్రములు చేసి నెత్తురు పీల్చు మృగము; రేచు
(2) వెంటతగలి విడువక కయ్యముపెటు కొను స్త్రీ; రేచిక, రేచు [మ]





రొంపికరవు = అతివృష్టివలన పైరులు మురిగి చెడి ఏర్పడిన కరవు × వరవు కరవు [నె]

రొంపు=పోరు, రంపు [అ]

రొఖ్కాట = డబ్బుకు ఇబ్బంది; కసాలా [శ్రీ]

రొచ్చు = (1) పశువుల ఉచ్చ పేడ కలిసి ఏర్పడిన బురద [నె; కర్నూ; అ; తె]
(2) వ్యంగ్యముగా-సంతోషము—*అయన రొచ్చులో ఉన్నాడు* [నె]

రొజ్జ=ఈదరగాలి, చలిగాలి [గ]

రొట్ట=(1) వచ్చిఆకు మురిగి అయినఎరువు [నె-దక్షిణము; చి, అ; వ]
(2) లేతకొమ్మ — *తోరణానికి మామిడి రొట్ట కావాలి* [గో]

రొట్టెలపెంకు = సజ్జరొట్టెలుగాల్చు మట్టి పాత్ర [నె; పా]

రొడ్డ=ఎడమ—*రొడ్డచేయి* [కరీ]

రొత్తి=మగ గురిజోలు [నె]

రొద్దు=(1) ప్రొద్దు; సేవు
(2) కొంత [వి]

రొప్పుడువేట=(చూ) అరవువేట [శ్రీ]

రొబ్బ = బురద [నె]

రొమ్ము=చన్ను—*బిడ్డకు రొమ్ముకుడుపు; వచ్చిరాని రొమ్ములు* [నె]

రొయ్యపొట్టు = (చూ) కూనరొయ్య [నె]

రొష్టు = (1) పని కష్టము; శ్రమాధిక్యము —*అతడు రొష్టుకు ఓర్వాడు* [వ; కరీ]
(2) మురికి [అ]
(3) ఇంటి చాకిరి [వ]
(4) అవమానము—*వాడు రొష్టుబడినాడు; రొష్టు* [నె, కరీ]

రొసరొసలాడు = కోపించు [కరీ]

రొష్టు = (చూ) రొష్టు [కరీ]

## రో



**రోకటిశాస్త్రం** = చిన్నబిడ్డలు సన్నగా ఉన్నప్పుడు, రోటిలో కూర్చుండబెట్టి, ముగ్గురు ముత్తైదువులు పసుపు కుంకుమ పూసిన రోకళ్లనెత్తి "పొడుతునా వేతునా" అని బెదిరించి, రోకళ్లతో తాకుట, ఇట్లు చేసిన ఆ బిడ్డ తుండువలె బలియునని నమ్మకము [చి]

**రోకు** = (1) ఆసక్తి, మోజు — *రోకుతో పని చేసినారు* [నె; శ్రీ]

(2) వైపు; వలను [వి]

(3) వలపు—*ఆ రోకు పోకుడు* [కరీ]

(4) వాకిరి [అ]

(5) తగని ప్రీతి, ఎక్కువప్రీతి [గ]

(6) ఒకరికి పొద్దస్తమానము కష్టపడి పని చేయు [అ; బ]

**రోచు** = రేచుకుక్క [అ]

**రోద** = బండిచక్రము, కల్లు, గాలు [న]

**రోపు** = కోపము—*చాల రోపుచేస్తున్నాడు* [చి]

**రోలుగుంట** = దంచుకొనుటకుగా, నేలమట్టమునకు ఇంట పాతిపెట్టిన, చిన్న గుంట గల రాయి; రాలగుంట, రాలగుంటి [నె]

**రోసినవాడు** = సిగ్గుమాలినవాడు— *వాడు అన్నిటికి రోసినవాడు* [నె]





**లంకె** = మేలు కీతల కలగలుపు, మంచి ఎద్దుతో దొంగఎద్దును, ఆవును లంకె పెట్టుదురు [వ]

**లంగా** = (1) చిన్నపిల్లల పావడ; పరికిణి [కర్నూ; ప-కీ; అ; చి]

(2) ఆడవాళ్లు చీరలో ధరించు ఉపవస్త్రము [కరీ]

**లంగా** = (1) నీచుడు; కొరగాని — *లంగా నాయాలు* [కర్నూ]

(2) రౌడి; నంగా [కరీ]

**లంగా నాయాలు** = నీచుడు; కొరగాని వాడు [కర్నూ]

**లంగు** = నష్టము — *వ్యాపారంలో లంగు వచ్చింది* [నె-పొ]

**లంగులు** = కాలినరములు—*లంగులు దెగ నడచితి* [కరీ]

**లంజదిబ్బ** = పూర్వం బౌద్ధాలయము ఉండిన చోటు. చెడిన ఆడుదల్లా అందు చేరిపోవు చుండుటచే వ్యంగ్యంగా ఆ ప్రదేశమునకు ఈ పేరుబెట్టి వైదిక మతమువారు బౌద్ధమును న్యూనపరచిరి. బౌద్ధవిహారములకు ఊరికి నడుమ పెద్దగోడలు కట్టిగాని, మట్టిదిబ్బలు పోసిగాని వేరు చేసి యుంచిరి.

**లంటారో** = తిరుగలి; రాగరాయి [నే]

**లండ** = (1) మొండితనము—*వాడు లండకు పడినాడు* [తె]

(2) వ్యర్థుడు [చి]

**లండు** = మొండి [వ, కరీ]

**లంద** = (1) లావైన, పెద్దదైన — *లంద గోలి* [నె; గో]
(2) మాదిగవాడు తోలు నానవేసే గోలెము [వ; కరీ]

**లంప** = (1) ఒక పెద్ద లోగిలిలో (ఆవరణములో) ఉండు కొన్ని ఇండ్లు; లొంపి— *ఆ లంప ఇండ్ల వాళ్లంతా.*
(2) దగ్గర సంబంధములు గల కుటుంబములు; లొంపి [నె-కందుకూరు; గు]

**లంపటు** = (1) తగులాటము—*వాళ్లది పెద్ద లంపటై పోయింది* [నె, గో; తె]
(2) బాధ; ప్రయాస [అ]

**లంబడి మనుము** = ఒకసారి వివాహమై అత్తగారింటికి వెళ్లి ఎంత కాలానికైన అమ్మగారింటికి తిరిగి రాకపోవు సంబంధము [మ]

**లకుముకిగాడు** = తార్పుగాడు [గో]

**లక్కంచు** = వస్త్రములకు నేయు చిక్కటి వన్నె అంచు, ఇది అంచు చివరనుండియే ప్రారంభమగును [నె]

**లక్కపూత** = లక్కపూసి, బచ్చెన రంగు వేసినది [వ]

**లక్కి** = సంబంధము [కర్నూ]

**లక్కోరోడు** = (చూ) బైరూపోడు, పగటి వేషగాడు; పెటేషికాడు; తుపాకి లొట్టోడు [మ]

**లక్ష్మీపట్టె** = (1) ద్వారబంధపు క్రింది అడ్డ పట్టె; ఇది పవిత్రమైన దని త్రొక్కనీయరు, దానిపై కూర్చుండనీయరు [నె]
(2) గడపకు పైభాగమునందుండు పట్టె, నెత్తిపట్టె [నె-పొ]

**లగాటు**=తలక్రిందుల పల్టీలు, లగోటు [అ]

**లగాయించి పట్టుకొను** = ఒడిసి పట్టుకొను [వరా; నె]

**లగాయించు** = తేరకు వచ్చిన తిండిని బాగుగా గొంతువఱకు తిను—*లగాయించి తిన్నాడు* [తూ-గో; నె]

**లగాలగి** = ఒకే వరుసన [కరీ]

**లగితీ** = అనుకూలము [అ]

**లగువు** = (1) పరుగు—*లగువు దీ* [నె]
(2) లాఘవము — *ఆయన ఆపని లగువుగా చేసినారు* [నె; అ, బ]
(3) నెమ్మది; స్వస్థత [అ]

**లగెత్తు** = పరుగెత్తు [నె, అ]

**లగోటు** = పల్టీ; లగాటు [కర్నూ]

**లగ్గపట్టు** = అధికమైన పట్టుదల [అ-పె]

**లగ్గపుపోలు** = వివాహ లగ్నసమయమున చాకలి బియ్యములో పోయు గీతలు, తెల్లపోలు [మ]

**లగ్గలకెత్తు** = (1) బండిలో నుండి ఏదైన క్రిందికి తోయునప్పుడు నొగ పైకెత్తి వెనుకభాగము భూమి మీద మోయునట్లుంచు; నొగలెత్తు; లగ్గకెత్తు
(2) అధికముగా నవ్వుట [అ-పె]

**లగ్గలెత్తు** = బండినొగ పైకి ఎత్తి వెనుక భాగము నేలకు అనించు; లగ్గలకెత్తు; నొగలెత్తు [అ-పె]

**లజ్జాగుజ్జులు** = పెనుగులాటలు [వి]

**లటుకు వేయు** = (చూ) రిక్కవేయు [అ]

**లటుక్కున** = (1) గబాలున—*లటుక్కున నోటిలో వేసికొన్నారు; లపుక్కున*
(2) చిటికెలో, వెంటనే [అ; బ; నె]

**లట్టుపిక** = అప్పడాల కఱ్ఱ; కొడుపు [సే]

**లట్టూటు** = వినాదము [గు]

**లట్టి** = తగవు, లట్టీ [శ్రీ]

**లట్టీ** = తగవు; లట్టి [శ్రీ]

**లట్టు** = (1) లావు—*లట్టుమనిషి* [నె]
(2) బొంగరము [కర్నూ; నె]
(3) గుండ్రటి మనిషి [వ]

**లడితీ** = ఆలస్యము [కరీ]

**లడీ** = గుత్తి, చేఱు [కరీ]

లత్తగొట్టు = పాపము దగిలి నశించు [కరీ]
లత్తుకోరు = కొంటెబాలుడు [గు]
లపుక్కున= చప్పున—లపుక్కున మింగే వాడు; లపక్కున [వి]
లప్ప = (1) బిగము [అ]
(2) లావైన [కరీ]
(3) నిక్షేపము [నె-మెట్ట]
లప్పున = చిటికెలో, వెంటనే; చప్పున [అ; బ]
లప్పెడు = ఎక్కువ—వాడు లప్పెడంత అన్నం తిన్నారు [నె-ఆత్మ]
లఫంగు = అప్రయోజకుడు [అ]
లబోదిబో = మొత్తుకొనుట—లబో దిబో ఏడ్చినాడు [గు; నె]
లయలు = నయగారములు; వగలు; టక్కులు; అభినయములు — అంతా లయలు పడిపోయినాడు; లయ్యాలు; లయ్యాలు [కర్నూ; నె; తె]
లయ్యలు = (చూ) లయలు [కర్నూ]
లయ్యాలు = నయగారాలు; టక్కులు, లయలు; లయ్యలు [కర్నూ]
లవలాడు = పెనుగులాడు; ప్రాకులాడు [తె]
లవ్వాడు = పాటుబడు [కరీ]
లసుగు=(1) నష్టము
(2) కొన్నిటికి జతగా చేర్చు పదము— లడ్డు లసుగు [నె]
లస్తి = అందుబాటు [కర్నూ]

## లా



లాంతేరు = చేదీపము; లాంతరు; లాందరు [గో; వి]
లాందరు = ల్యాంట్రిన్, చేదీపము; లాంతరు; లాంతేరు [నె; అ]
లాకు=(చూ) నాగు; నాము; లాగు [అ; బ]
లాగు = ధాన్య ఋణముపై వడ్డీగా ఇచ్చు ధాన్యము; నాగు; నాము; ధారణి [అ]
లాగోడి = మునాఫా భూమిని కౌలుకిచ్చుట వలన వచ్చిన లాభమా [కరీ]
లాజలు = పేలాలు [కరీ]
లాజిగ = పెద్దగ [మ]
లాట=వరి మొదలగు వాటిని కోసిన దుంప నుండి మొలచినమొక్క; నాము; లేట (Latoon)
లాటకజ్జు = కొయ్యకాలు, కోసిన పైరు చిగిర్చి పుట్టిన కరలు; నాముకర [కరీ]
లాటిను = లాంటర్ను; లాందరు [నె; అ]
లాభం కలుగు = ఒకటి (వ్యాపారస్థులు లెక్కింటిలో ఒకటి అనుటలో కలిసి రాదని కాబోలు దానికి బదులు లాభం కలుగు అని తమ కొలతను తూనికలను ప్రారంభింతురు. రైతు "పొలి కలుగు" అని ప్రారంభించును [అ; బ: నె]
లాభము = కమీషను [అ]
లాము = గుంపు; రాశి [అ]
లాలాయ జలము=జొల్లు, సొంగ; తేవ [వి]

**లాలిగ** = నూనె పోసే గొట్టము; పన్నల్; గరాటీ; లాలికి; లాళిగ; లాళిని [అ; బ]

**లావాటోడు**=ఘటికుడు [వ; ని]

**లాసిగా** = పెద్దగా, గట్టిగా — *కొంచెము లాసిగా చెప్పు, లాసిగా పిలువు* [తె]

**లాళికి**=గరాటి; పన్నల్; లాళిని [అ]

**లాళిని**=గరాటి; పన్నల్ [అ]





**లింగము**=కల్లులోట్టె [న]

**లింగాలు** = (1) బాలెంత నీళ్లకు వెళ్లిన రోజున పలుగురాళ్లు 5 గాని 9 గాని చేద బావి గట్టుపైన పెట్టి, పసుపు కుంకుమతో అలంకరించి, నవధాన్యాలు పోసి ధూపము వేయు రాళ్లు

(2) బాలింత ఊరుదాటి వెళ్లేటప్పుడు ఒక ఊరి పొలిమేరదగ్గర పెట్టి పూజించి వెళ్లు రాళ్లు [మ]

**లింగిలింగడు**=ఇద్దరాంధ్ర మగడు [క రీ]

**లిక్కి** = (1) మెట్టచేలలో, తడపకుండానే కలుపుతీయు చిన్న కొడవలి [నె]

(2) చిన్నకొడవలి [అ]

**లిక్కికి లిక్కిపెట్టు**=ఒకదానికొకటి తేల కుండా లంకెలుపెట్టియుంచిన వ్యాపారము; తంపులమారి [గో]

**లిగాడ**=అపనింద; చెడ్డపేరు [అ; బ]

**లిగాడి**=(1) ఇబ్బంది

(2) వివాదము

(3) ఆపద—*ఈమధ్య నాకు ఒక లిగాడి వచ్చి, వేయి నష్టం వచ్చినది* [నె-పొ]

**లిడ్తి**=(1) నష్టము

(2) ఆపద; చిక్కు—*లిడ్తిలో పడ్డ ప్రాణం* [వ]

**లిద్ది** = బండిచక్రములో ఉలవాయి వదలైన ప్పుడు, కుండ నడుమ, చచ్చౌకముగా బెజ్జము దీసి కొయ్యతునక అందు గట్టిగా బిగించి, మరల ఇరుసుకు రంధ్రముచేయు నది-- *దానికి లిద్దెలు వేసినారు*

(2) గట్టిప్రతిక్రియ చేయుట — *వాడికి బాగా లిద్ది బిగగొట్టినారు; లిద్ది బిగిసింది* [నె]

**లియాలు**=పేలాలు; నెయ్యిలు [గ]

**లివ**=శక్తి—*వాడిలో ఇప్పుడు లివలేదు* [నె; తె]

**లిసురు**=కుప్ప నురిసే ఎద్దులబంతిలో చివరి ఎద్దు × మేట [నె-ఆత్మ]





**లీబలు**=ధాన్యములో సన్నటి చచ్చుగింజలు; ఈబలు; తరకలు [నె-ఆత్మ]

**లీలగా**=అస్ఫుటముగా—*ఆ సంగతి లీలగా తెలియ వచ్చింది; లీలగా అన్నాడు* [నె; అ; వ; తె]

**లీలజాలము**=సులభముగా చేసిన పని [అ]

# లు

లుంగచుట్టు = క్రమపద్ధతి లేకుండా వస్తువులను కలిపివేయు [గో]

లుంగి = ఉత్తరదేశములో మగవారు కట్టు రంగు రంగుల మొల అడ్డకట్టు; ఇది బర్మా మొదలగు తూర్పు అసియా వారికి గూడ జాతీయ పద్ధతి.

లుకలుక = పురుగులు హెచ్చుగా ఉండి ఒదులెక్క—పిండినిండా పురుగులు లుకలుక లాడుతున్నాయి [సర్కా; వ]

(2) వస్తువు పాతదై బాగా కదిలి ఆడుట—బండి లుకలుకలైంది [నె; అ]

(3) కుటుంబీకులు మధ్య చెడిన సామరస్యము—ఆ కుటుంబములో లుకలుకలు ప్రారంభమైనవి [తూ-గో]

లుకచెడు = పూర్తిగా చెడు—ఆ కుటుంబము లుక చెడింది [నె]

లుచ్చాపు = నీచము [అ]

లుడపలు = చుట్టలు, మూటగా చుట్టినవి—విడిచిన గుడ్డలన్నీ లుడపలు లుడపలుగా పెట్టినాడు [గో]



# లూ

లూతపుండు = కంటి కొలికిలోని పుండు [కరీ]



# లె

లెక్క = (1) డబ్బు—లెక్క చేతిలో లేదు [క; కర్నూ; అ; చె; తె]

(2) దూరము—ఎంత లెక్క వెళ్లినాడు [నె, శ్రీ]

(3) ఎన్నదగిన — ఆయన లెక్కలోని మనిషి [నె, తె]

(4) గురుత్వము—వాడంటే నాకు లెక్క లేదు [నె; కర్నూ; అ, తె]

లెక్కదీరింది = ఆయువు ముగిసింది — ఈనాటితో ఆయన లెక్కదీరింది [చి]

లెక్కపక్కలేదు = నిరాదరణముగానుండు—మగడంటే దానికి లెక్కాపక్కా లేదు [నె; తె]

లెక్కాచారము = (1) న్యాయము (correct) [అ]

(2) సంప్రదాయము [నె]

లెక్కాలు = ఎక్కములు — లెక్కాల పుస్తకము [చి]

లెల్లెపదము = మాదిగతిట్లు; లెల్లెపాట; ఆసాది కూతలు [కరీ]

లెల్లెపాట = మాదిగతిట్లు; లెల్లెపదము [కరీ]

లెసడా = సోమరితనము — వాడు పనికి లెసడాయించినాడు [శ్రీ]

# లే



లేకి = (1) కళ్లాలూడ్చుకొని బ్రతుకువాడు [కరీ]
(2) ఏరుక తినువాడు; లేకితనం [చి]
(3) తగినది [గు]
లేకిడి = (1) వికారితనము [కరీ]
(2) తక్కువతనము [మ]
లేగడబత్తె = అప్పుడే ఈనినగేదె; రేగడబత్తె [గో]
లేచిపోవు = స్త్రీగాని, పురుషుడుగాని ప్రియులతో రహస్యముగా యిల్లువదలిపోవు — *అది వాడితో లేచిపోయింది* [నె; కర్నూ, అ, తె]
లేట = కొయ్యకాలునుండి మొలిచినమొక్క; లాట; నాము [కరీ]
లేటబారు = వెలవెలబోవు [కరీ]
లేదరబిడ్డ = పసిబిడ్డ — *పాపం అందరూ లేదరబిడ్డలే* [చి]
లేపు = (1) దూదిపరుపు
(2) దూదితో నింపిన దిండువంటి సంచి [అ; బ]
లేవ = (1) బండి మొదలగువాటికి వేసిన వెనుకబరువు; లేవడ; లేపు × అరక [నె; కర్నూ]
(2) సత్తువ [గో]
లేవడ = లేవ (చూ) లేవడి [అ]
లేవడి = దారిద్ర్యము [గో]
లేవలేని మనిషి = (1)గర్భవతి [నె; కర్నూ]
(2) రోగి [తె]
(3) అశక్తుడు [గో; గు]
లేవలేనోడు = శక్తిహీనుడు; కాలుపోయినోడు [మ]
లేవిడాలు = బెల్లపుపాకులో నువ్వుపప్పుపోసి చేయు ముద్దలు (బిళ్లలు) [వి]
(2) హేళనలు [నె-పొ]
లేవిడి = (1) అసమర్థుడు [చి]
(2) ఒకతిట్టు [అ-పె]
లేవిడిగొట్టు = ఓడినవానినిచేయు పరిహాసము — *లేవిడిగొటి పంపినారు* [నె]
లేవిడిలేపు = పరిహాస పాత్రునిచేసి అవమానించు [మ; నె]
లేపు = (చూ) లేవ [నె-మెట్ట; అ]
లేసు = (1) తేలిక, లాఘవము — *అది లేసైన పని; బలే లేసుగా చేసినాడు*
(2) చులకన — *వాడు లేచైపోయినాడు* [నె-పొ]
(3) ద్రవరూపము [నె]
లేసుగాచేయు = నేర్పుగాచేయు [గు]

# లొం



లొంక = డొంక [కరీ]
లొంగిలువేసికొను = చేరవేసికొను [కరీ]
లొంద = (1) పల్లపునేల [కరీ]
(2) డొంక
లొందలు = గుంతలు; తగ్గులు [తె]
లొంప = (చూ) లొంపి [నె-పొ]
లొంపి = (చూ) లంప; లొంప [నె]
(2) నొక్కులు [అ]

లొగిడి = దొంగ ఆవు మెడలోకట్టు పెద్ద ఇనుపమువ్వ; బొణిగ [చి]

లొగ్గిడి = త్రొక్కిడి—లొగ్గిడితిండి [కరీ]

లొచ్చుదనము = చిన్నతనము; వెలితి; అవమానము [నె-ఖా]

లొజ్జు = (1) హీనస్థితి [చి]
(2) లోగు; చొతుకు [కరీ]

లొటుకు = (1) వాగుట—ఎక్కువగా లొటుకొద్దు [అ-పె]
(2) నష్టము [కరీ]

లొట్టిగాడు = లొట్టిగలవాడు (ఒకవిధమగు తిట్టుమాట) — లొట్టిగాడితో జెప్పుకో [వ]

లొట్టాకు = (వ్యంగ్యముగా) తాంబూలము [అ-పె]

లొర్గణిగె = అప్పడాలుచేయు కఱ్ఱ [సే]

లొడబెట్టు = (1) క్రింది మురికి పైకి లేపు—ఎందుకు లొడబెట్టుతావురా [తె; నె; అ]
(2) గడచిన వానిని అనవసరముగా చెప్పు [తె]

లొడారిబుచ్చి = ఏసంగతి దాచలేక ఆడంబరముగా మాట్లాడువాడు [తూ-గో]

లొడిగ = పావుశవ్వ [చి]

లొడిపి = బురదతో నిండిన పల్లపునేల; లొడుగు [నె; వ]

లొడుగు = (1) ఎక్కువగా నీళ్లుపోసి అతిపలుచగా చేసిన చల్ల మొదలగునవి [గో]
(2) బురద
(3) బురదలో నిండిన పల్లపునేల; లొడిపి [నె; వ]
(4) ఒదులు — వాడికి చొక్కా లొడుగైనది [నె-ఖా]

లొడుము = ప్రక్కన పారుచుండు ఏటిపాయ ఒకటి, అంతర్వాహినియై, మరల కొంతదూరమున, ఒక పల్లపుచోట పైకుబికి, నిరంతరాయముగా నీరు పారుచుండనది; బుగ్గ—తాడిపర్తి లొడుము [నె]

లొడ్డ = వెనుకబడ్డవాడు—ప్రతి ఆటలోనూ లొడ్డే [చి]

లొతుక = లొంద, దొంక [కరీ]

లొత్త = గుంట, ఉత్త — కనకాయలన్నీ లొత్తలే; లొటకన్ను లొత్తపోయింది [చి]

లొద్ది = (1) గుంటప్రదేశము—రెండు చేలమధ్య లొద్దిని పూడ్చి కలుపుకొన్నాడు [నె; కరీ]
(2) లోయ [కరీ]

లొయ్య = వాననీళ్లు కోసివేయుటచే పొలములలో ఏర్పడిన నిట్రమైన గుంట [తె]

లొల్లాయపాట = క్షుద్రములగు పాట [కరీ]

లొల్లి = (1) రంతు; ధ్వని [మ]
(2) అల్లరి [తె]

లొసుగు = లోకువ [వి]

## లో



లోకాయ = (1) పేరు ఊరు లేనివాడు—లేకలేక ఒక లోకాయ పుడితే, ఆ లోకాయ కన్ను లొట్టపోయిందట [నె]
(2) ఫలానివాడు అనుట—ఏదో ఒక లోకాయ [వా]

లోకాయగాడు = ఎవడో ఒకడు అనుట [కరీ]

లోకాలు = ఎడమప్రక్క ఎద్దు, దాపటెద్దు [అ-పె]

లోగా = ఇంతకు క్రితం—లోగా యిచ్చినది పోను [కరీ; నె]

లోగాడిఎద్దు = (1) తనంతానే తనపై భారము మోపుకొనునది, ఏనుగు తననెత్తిపై తానే మన్ను చల్లుకొన్నట్లు

(2) స్వయంకృతాపరాధముతో బాధపడు వ్యక్తి (బండిలాగు ఎద్దులలో ఒకటి కాడ కట్టు వైపుకు నెట్టుకొని వచ్చు అలవాటున పడును. దీనివల్ల రెండెద్దుల బరువు అది ఒక్కటే వహించి బాధపడుచుండును); లోకాడిఎద్దు, లోకాడెద్దు [నె; [అ]

లోగాడిపుల్ల = ఎద్దు కాడికట్టువైపుకు నెట్టుకొని రాకుండ చేయుటకు పలుపు తొలిలో దించిన ఒకపాటి పొడవైన లావుపుల్ల; లోగాణిపుల్ల [నె; అ; చి]

లోగాణిపుల్ల = (చూ) లోకాడిపుల్ల [చి]

లోగిరి = మండువా [వి]

లోగిలి = (1) ఇంటిముందు ప్రహరీలోపల ఉండు ప్రాంగణము; మిట్ట—నా లోగిలి లోకి అడుగుబెట్టవద్దు [నె; కర్నూ, తె, అ]

(2) ఇల్లు [తూ-గో]

లోగుట్టు = మర్మము—లోగుట్టు పెరుమాళ్లకెరుక [తె; నె]

లోచూపు = (1) అంతర్ముఖమగు దృష్టి

(2) మర్మము బయటబెట్టక దాచు స్వభావము

లోటా = (1) చెంబు [సే]

(2) బంబర్లు, గలాసు; టంబ్లర్ [అ; నె]

లోడారాయి = చెరువు, కాలువ మొదలగు వాటి లోపలి కట్టకు నీటికోత, అలల దెబ్బ తగులకుండునటులు, పరుపున కట్ట పొడవున బిగించురాయి; అలరాయి (Revitment) [నె]

లోడు = ఒరగుదిండు [అ]

లోతక్కువ = లోకువ [అ, బ]

లోనంగల్ల = ఎక్కడనో లోపల [మ]

లోనైన = మొదలగు, లోనగు [నె; కర్నూ అ]

లోపాయకారి = (1) లాలూచి, ఇద్దరు భాగస్థులు ఒకటై మూడవ భాగస్థుని మోసగించుట

(2) శత్రువుకు రహస్యముగ సహాయపడుట—వాళ్లు లోపాయికారి పనిచేసినారు

(3) భూమిని కౌలుకు దీసికొనినవాని దగ్గరనుండి, మారుకౌలుకు దీసికొనినవాడు [నె, కర్నూ, అ]

లోపిరికి వెలిపిరికి = ముందువెనుకలాడుట, త్రొక్కటపడుట—అయన లోపిరికి వెలిపిరికిగా ఉన్నాడు [నె; తె]

లోపు = (1) పొట్టలో త్రిప్పినట్లగు

(2) కుండలోని ద్రవపదార్థమును కలియబెట్టు [కరీ]

లోపొగరు = అంతర్మదము, బయటికి వినయము నటించునది — వాడికి లోపొగరు [నె, అ]

లోబడు = ఉన్నసరకు చాలవరకు అమ్ముడుపోవు, వ్రయమగు — కాయలు లోబడ అమ్ముకొన్నా; ఆస్తిని చాలవరకు లోబరచినారు [నె]

లోలక్కులు = వ్రేలాడునట్లుగా బాలికలు చెవికి ధరించు ఆభరణాలు; లోలాకులు [అ]

లోలాయపడు = పనిబాట లేకుండ తిరుగాడు—వాడు లోలాయపడుతున్నాడు; లోలు పడు [నె]

లోలాయి = తార్పుడుకాడు

లోలుపడు = కష్టపడు—వాడు పనిలేక లోలుపడుతున్నాడు; లోలాయపడు [చి]

లోవట్టము = కొనుటలో అమ్ముటలో కలుగు తుట్టి (నష్టము) [కరీ]

లోవి=అన్నమువండు వెడల్పు మూతిగల కుండ [నె]

లోసంచు అగు = ఎదుటివానితో రహస్య కార్యములో కలియు — *ఇంటివాడు లోసంచు కానిదే ఇంత జరుగదు* [తె]

# వ



వంక=వల్లము [సే]

వంకీ=స్త్రీలు ధరించు బంగారు వెండి హస్తాభరణము; రెట్టకడియము [అ]

వంగు=(1) వాన కురియుట ప్రారంభించు —*ఇప్పుడే తొలకరి వంగినది;* వంగబడినది

(2) వరికోత ప్రారంభించు — *ఇప్పుడే మిట్టచేలో వంగినారు* [నె]

వంచె=(1) దుప్పటిగుడ్డతో కట్టిన డోలి — *వంచెగట్టి ఆసుపత్రికి తీసుకవచ్చినారు* [నె; రా]

(2) చెంగోవు, చెంగొరస (దుక్కి అయిన తర్వాత, చుట్టు గనిమల నరికి సరిజేయునది [అ]

వంజరం=రెండు అడుగుల వరకు ఎదుగు సముద్రపుచేప; వీపుమీద నల్లటి చుక్కలుండును (King Fish) [శ్రీ]

వంటపుట్టు=వంటవాడు [గం]

వండ=(1) దండుగ [చి]

(2) ఉపద్రవము; అరిష్టము — *కొంపకు వండదెచ్చినాడు;* వచ్చె [నె]

వంత = వీధి నాటకంలో వెనక పాడుపాట [చి]

వంతు = (1) ఉమ్మడి పనిలో దామాషాగా పనిచేయునది [తె]

(2) పంతము — *నా తో వం తు పె ట్టు కొన్నది* [ప; నె]

వంపు (1) తడవ, పర్యాయము—*అప్పుడే రెండో వంపు అన్నం తిన్నాడు* [నె]

(2) బండిచక్రమునకు వేయునది, పూటి [చి]

వంపొత్తుకొను=వశపరచుకొను [కరీ]

వకరించు = పప్పు బియ్యములను సన్న పోటుతో దంచుట [తె]

వకరిణము=(చూ) ఒకరిణము [నె]

వక్కణాలు = వొంకమైన మాటలు [తె]

వకరల ముక్కలు = అరకొరలు — *వని వక్కలా ముక్కలాచేసి పోయినాడు; వక్కలు ముక్కలుగా నమలి మింగు;* వక్కలు ముక్కలు [నె; అ; వ]

వకలొక్కలు = లొడుకుల్లొడుకులు [అ]

వక్కాకుశాస్త్రము = వివాహ నిశ్చయ తాంబూలము [అ-పె]

వక్కి = ఇక్కచిక్కిన; ఒక్కి; ఒల్లి— *వక్కివాడు* [నె; కర్నూ; అ]

వగ్రణ=తిరుగపోత; పోపు [సే]

వచ్చె = (1) ఎక్కువగా వ్యాపించిన కలరా బోటిపీడ; అరిష్టము; చేటు—*ఏదో వచ్చె ఋట్టినట్టు పుటిందు;* వండ [నె; అ]

(2) తీవ్రమగు ఆస — *వచ్చెబట్టి అదే మాటికిమాటికి తిన్నారు* [అ]

(3) అసూయ

వచ్చేండాలు = పోటీలు [గు]
వచ్చేగావుండు = చెప్పగా ఉండు [వి]
వజ్జెలేరుపులు = పెండ్లిలో పడమటి అరుగు మీద పెట్టు కుండలు. ఇక్కడనే పెండ్లి కూతురు గౌరీపూజ చేయును [మ]
వట్టము = (1) పెద్ద నాణెమునకు చిల్లర యిచ్చుటకు తీసికొను సుంకము—*రూపాయకు ఐదు పైసలు వట్టము* [నె; చి: కర్నూ]
(2) నష్టము, దండుగ — *దాంట్లో మంచి వటం వచ్చింది* [కరీ, వ; గో; అ]
(3) తుట్టి [కరీ]
(4) అవసరమైన కర్చు [అ]
(5) వంకర; వక్రము [గో]
వట్టపునోరు = (1) వదరుబోతు [వ]
(2) వక్రపుమాట లాడువాడు [నె]
వట్టువారు = పుండు మానకవచ్చు [కరీ]
వట్టికాలు = మోకాటి క్రింది భాగము — *నా వట్టి కాలి రోమం పోయినట్లు* [నె; అ; తె]
వట్టిచాప ఐందు = చిక్కిపోయినాడు [మ]
వట్టిచేప = ఉప్పు వేయక ఎండపెట్టి పెంచిన చేప—*వట్టి చేపవులును.* (ఉప్పు రుద్ది ఇట్లే ఎండబెట్టిన సముద్రపు చేపను కరవాద అందురు.)-*కాకి అరుస్తూనే ఉన్నది, కరవాడ ఎండుతునే ఉన్నది* [నె; వ; అ]
వట్టితునకలు = ఎండిన మాంసపు వరుగులు, ఉప్పుకండలు, ఉప్పాంసులు [మ]
వట్టిదిపోవు = పొయ్యిమీద వంటకములు ఏవీ లేకుండా వూరకే కట్టెలు కాలిపోవు —*పొయ్యి వట్టిది పోతున్నది* [నె]
వట్టిపోవు = (1) పశువు ఇచ్చే పాలు ఎండిపోవు [కర్నూ; నె]
(2) భూమి తడి ఆరిపోవు [కర్నూ; పకొ]
వట్టివాడు = వ్యర్థుడు [నె; అ; తె]
వట్టు = పరకు—*ఇంతవటు* [కరీ]
వట్లు = ముఖముపై ఎండిన కన్నీటిగుర్తులు [నె-పా]
వరము = ప్రభలో జోడించు వంపు రేకు [చి]
వడ = (1) గారె [నె; చి, రాయ, తె]
(2) ఎండదెబ్బ—*వడ దగిలింది* [అ; తె]
వడకవప్పు = చిన్న ముక్క [తె]
వడప = ఫలశూన్యత — *వడప అయినది* [గు]
వడపు = (చూ) ఒడుపు [కర్నూ]
వడము = చేపలుపట్టు పరికరము [చి]
వడితనం = తొందరపాటు [శ్రీ]
వడిదారము = రాట్నమునకును కదురుకును తగిలించియుండు దారము (బెల్టువలె) [నె]
వడిదుడుకు = (1) ప్రమాదము — *ఆపద* [నె-పా]
(2) ఎచ్చు తక్కువ—*దారి వడిదుడుకుగా ఉన్నది* [నె]
(3) నడతలో ఒక క్రమరీతి లేని వ్యక్తి; తొందరపాటు—*అయన ఒక వడిదుడుకు మనిషి* [నె]
వడివంగు = గర్వమడగు [కరీ]
వడిసెల = (చూ) ఒడిసెల [నె; కర్నూ]
వడుపు = (1) వత్తుగా ఉన్న పైరు [తె]
(2) చేతిలాఘవము—*వాడువడుపుగా పని చేస్తాడు* [తె, నె]
వడుసుబోవు = (1) వంగిపోవు [అ]
(2) గుడ్డనూలు తక్కువై ఉతుకులో దార్లు దారుగా ఏర్పడు — *వంచ వడుసుబోయింది* [నె]
వడ్డించు = తిట్టు, తన్ను— *నాలుగు వడ్డించరా* [తె, నె]

వతను = పాలు మొదలగునవి వాడుకగా యింటికి తెచ్చి యిచ్చుచుండుట — *అతడు వతనుగా మంచి పాలుపోస్తాడు;* వాడుకగా [గో]

వత్తలు = (1) వాడిపోయినవి [కరీ; చి]
(2) కాయలుకోసి ఎండబెట్టిన వరుగులు [ఁ]

వత్తాసి = మాట సహాయముచేయుట; ఒకరి పక్షము వహించుట — *అయనకు వత్తాసి వచ్చినారా;* వత్వాసి [నె, గు]

వత్తి అగు = కృశించు—*వత్తి అయిపోయి నాడు* [నె; కర్నూ; అ, తె]

వత్తులు = చంటిపిల్లల ముంజేతి ఆభరణములు; ఒత్తులు [కరీ, నె]

వత్వాసి = (చూ) వత్తాసి [తె, నె]

వదగదు = పనికిరాదు— *అవి విత్తనాలకు వదగవు* [చి]

వది = (1) లోతైన గుంట
(2) గాయము [నె-పొ]

వనగూడు = కలసివచ్చు; సమకూరు—*ఏదీ వనగూడలేదు* [నె]

వనజంబళము — అన్న వస్త్రాదులను కోరక కేవలము నిర్ణీతధనానికి పనిచేయు ఏడాది పరిజీతము; కడుపు కూటిపని [అ]

వనము విడిచిన కోతి = కులమునకు బాసిన వ్యక్తి [కరీ]

వనారు = వీలు; సౌకర్యము; వనరు [అ;బ]

వనాసరము = వ్యర్థము; అనవసరము [అ; బ]

వన్నెవాసి = కీర్తి—*వన్నెవాసి తగ్గింది* [నె; కర్నూ, తె]

వపదీయు = అధికముగా బాధించు— *వాడి వపదీసి అరవేసినారు* (వప = పేగులపై నుండు సన్నటి పొర; యజ్ఞములలో యజ్ఞపశువు వపదీసి వేల్తురు; అదే విధముగా బాధించుట అనుట, ఇది అతి సామాన్యమైన వాడుక మాటగా నున్నది) [నె; కర్నూ]

వప్పారు = పాక; వసార [పే]

వయ్య = ఒకవానిలో భాగము [నె]

వర = (1) బావులు కుంచుటకు ఉపయోగించు మట్టిలో చేసి కాల్చిన వలయములు — *వరలబావి* [నె]
(2) పరుపు, దిండు మొదలగు వాటి ముసుగు; కలీబు, గౌసిన [నె; కర్నూ]

వరంబడి = ధనాదాయము, వరుంబడి [కర్నూ]

వరక = ఏటవాలు; ఏటి వరక [వి]

వరకట్టు = అడవిపంది వెండ్రుకలతో చేసిన చిన్నకట్ట. (బ్రష్)దీనితో ధనికుల ఇండ్లలో బంగారు సొమ్ముల మకిల అప్పుడప్పుడు కడుగుచుందురు; వరాకట్ట; వరాహపుకట్ట [వ]

వరగడ్డము = (1) నిట్రముగా నున్న రాతియొక్కగాని, గట్టు యొక్కగాని అంచు —*వరగడ్డాన నిలుచుకో బాక* [నె, తె; గు]
(2) త్రోవ ఒకప్రక్క ఎత్తు ఇంకొకప్రక్క తగ్గుగా నుండునది [అ]

వరటకపోవు = కృశించు, ఎండుకపోవు [నె]

వరదు = బక్కచిక్కిన వాడు [గో]

వరదుగ్రిక్కు = నక్కయఖవు [కరీ]

వరదగూడు = చంద్రునిచుట్టు ఏర్పడు పరివేషము; గాలిగూడు [మ]

వరదట్టుకొను = రాబట్టుకొను—*రావలసిన వడ్డీ వరదట్టుకొన్నారు* [చి]

వరంపందు = (చూ) వరపదు; వరము పందు, వరముకొరకు పందు (పందుకొను) [వ, కృ]

**వరపడు** = కోర్కెలకొఱకు, ముఖ్యముగా స్త్రీలు సంతానముకొరకు, దేవి ఆలయమున నిష్ఠతో ప్రతిదినము కొంతసేపు, దేవి ఎదుట సాగిలబడి, ధ్యానముతో నుండుట— *అమె పొన్నవాడ కామాక్షమ్మకు వరపడినది* [నె; కర్నూ; అ; తె]

**వరప్రయాణము** = చేయదలచుకొనిన ప్రయాణమునకు తిది వార నక్షత్రములు బాగలేనప్పుడు, ముందుగా ఒక మంచిదిన మున వేరొక యింటికి పయనమై పోయి ఉండుట [అ]

**వరలు** = వాగు; వదరు

**వరవ** = (1) చెరువుకు నీళ్ల వచ్చుటకు సహజముగ (త్రవ్వకనే ఏర్పడిన వాగు) *ఆ చెరువుకు వరవ వాగులేవు* [నె; అ; తె; గు]
(2) చేకూరు సదుపాయము — *డబ్బుకు మాకేమి వరవ ఉన్నదా?* [నె; అ; తె]
(3) గడ్డ [చి]

**వరవడి** = వేగము; ఉరవడి [కర్నూ; నె]

**వరసందు** = రెండు ఇండ్లసూర్లు కలిసికొనిన చోటు, వాటినుండి జారిన నీరు బయటికి పోవుటకు గోడల నడుమ ఏర్పరచిన చిన్న ఎడము — *వరసందున నడచిరా;* సూర్లసందు [నె; అ; గు]

**వరసజ్వరము** = చలిజ్వరము; మలేరియా

**వరాకట్టు** = పందిరోమములకట్టు; వరకట్ట [నె-పో]

**వరిడి** = (చూ) వరిది [తె]

**వరిది** = శ్రీమంతులు, రాజులదగ్గరకు ఎప్పుడూ ఇచ్చకము మాటలు చెప్పునది. —*అయనకు ఎప్పుడూ వరిది చెప్పాల.* వర్ది; వరిడి [నె]

**వరి ముదిగెనని కొడవలి బారవేయు** = అక్కఱ వస్తువును అక్కఱలేనప్పుడు, అజాగ్రత్తగా పడవైచి, తరువాత విచారపడు [కరీ]

**వరుంబడి** = ధనాదాయము; డబ్బురాక; వరంబడి; వరుమానము — *మాకు వరుంబడి తగ్గింది* [నె; తె; అ]

**వరుగు** = ఎండించిన కూరగాయ ముక్కలు —*మామిడివరుగులు;* వొరుగులు [కరీ; వి; నె]
(2) బక్కచిక్కిపోవు — *వాడు వరుగై పోయిండు* [వ; నె]

**వరుణ** — ఒకరిగా పూజయో, పారాయణమో చేయుటకు మరియొకరిని నియమించి అవసరమైన ధనమిచ్చుట — *ఆయనకు వరుణ ఇచ్చినారు* [శ్రీ]

**వరువది** = (చూ) వరిది [నె-పో]

**వరుస** = ప్రాయము; వయస్సు—*ఆయన పెద్ద వరుస మనిషి* [నె; వ]

**వరుసబడు** = మామలల్లుండ్లు వరుసతో వరిహాసములాడుకొను —*వరుసబడుతున్నాడు* వరుసలాడు [నె]

**వర్జిగ** = (చూ) తలేరు [అ]

**వర్ది** = (చూ) వరిది [నె]

**వర్లు** = వదరు; ప్రేలు—*వర్లుబోతు* [అ; మ]

**వఱదవాఱు** = ప్రవాహమువలె వచ్చు; వెల్లువబెట్టు

**వఱ్ఱు** = కారము—*వఱ్ఱుగారెలు* [వి; శ్రీ]

**వఱ్ఱులు** = బీటలు — *గోడ వఱ్ఱులిచ్చింది* [వి]

**వల** = పర్యాయము—*మిరపతోటలతో ఒక వల సాలు తోలెదరు, రెండవ వల అచ్చు తోలెదరు* [గు]

**వలంత** = ఒక కొసన రెండుగా చీల్చి వంగాలు చేసిన నొగ, దీనిని బురద కయ్యలో చదరపెట్టను ఉపయోగించు నల్లమానుకే బిగించెదరు [నె; చి]

**వలపక్షము** = పక్షపాతము—*ఆయనకు వాడి మీద వలపక్షము* [కర్నూ; నె]

వలలోవేసికొను = బేలుపుచ్చి లోబరచుకొను—ఆయనను ఎటునో వలలో వేసికొన్నారు [నె]
వలాకు = సుకుమారి [కరీ]
వలాసాలు = మిల్లుసంచులు [కృ]
వలికి = శ్మశానము; గోరి [తె; నె]
వలిబట్టు = చలికి అవయవములు కొంగుర్లుపోవు — ఈ ముసారాకు నన్ను జీవాలకు వలిబట్టినది [నె; వ; తె]
వలుసపోవు = కారణము లేకయే తల్లికి పాలు రాకుండుట [మ]
వల్లకో = ఊరుకో; పల్లకో [శ్రీ]
వల్లడి = తొందర; చెడుపు—వాడికేమి వల్లడి వచ్చిందో (తిట్టు) [సే; నె]
వల్లపడదు = వీలుకాదు; చెల్లదు—అదంతా ఇక్కడ వల్లపడదు [నె; తె; అ; గో]
వల్లమాలిన = (1) అద్దు అపులేని — వల్లమాలిన కోపం వచ్చింది [వి]
(2) సాధ్యంకానిపని — ఈ వల్లమాలిన పనులు నావల్లకావు [చి]
వల్లముసంచి = డబ్బువేసి నడుమునకు కట్టుకొను తిత్తి, జాలెసంచి [అ]
వల్లవైపు = దారితెన్ను—నీవనికి దారితెన్ను వల్ల వైపు లేదు [నె-పొ]
వల్లు = శకునము [కరీ]
వల్లుమిక్కిలియగు = అపశకునము కలుగు [కరీ]
వల్లె = పంచ, గుడ్డ [చె]
వల్లెంపుపంచ = పెండ్లికూతురుకు వల్లెవాటుగా రెండుప్రక్కల వేయు అంగవస్త్రము [నె-పొ]
వల్లెవాటు = అంగవస్త్రమును ఒక చంకక్రిందనుండి తీసి ఎదుట భుజములపైకి లాగి కప్పు విధము [చె; నె]
వల్లెలు వేయించుట = యుక్తవయస్సు వచ్చిన ఆడపిల్లలకు మేనమామలు ఓణీ (పైట)లు తెచ్చి వేడుక చేయించి ఇచ్చుట [తూ-గో]
వషట్కారాలు = చీవాట్లు [తె; నె]
వష్టుమువాడు = వైష్ణవుడు [సే]
వసపాది = ఇంటిపెరటిలో, జలదారిగుంట చుట్టును, బిడ్డల వైద్యమునకుగా వసగడ్డలను వేసి పెంచుపాది. తుంగవలె ఎదిగే వసను మూడేండ్ల కొకసారి త్రవ్వివేసి కొత్తవసను నాటుచుందురు, లేకున్న వస ముదిరి నాభి అయి, కరిన విషమగును [నె-ఆత్మ]
వసపిట్ట = ఎడతెఅపి లేకుండా మాట్లాడువాడు (చూ) వసబోసినవాడు [తూ-గో; గు]
వసబోసినవాడు = ఎక్కువగా మాట్లాడువాడు, వాయాడి. వసబాది చిన్నపిల్లలకు బోయుదురు. దీనిని ఎక్కువగా పోసిన మాటలు ఎక్కువగునని నమ్మకము—వాడికి ఎక్కువగ వసబోసినారు; వసపిట్ట [నె; కరీ]
వసారా = (1) రెండుప్రక్కలా క్రిండికి నూర్లుదించిన షూరిపాక [నె; కర్నూ; అ; తె]
(2) ఇంటిముంచు వేసిన వరంతావంటి పందిలి [నె; తె; మ]
(3) సోపా [అ]
(4) అరుగు [వి]
(5) గుమ్మము [కరీ]
వసుకుదీయు = క్రొత్తపెండ్లి జంటను పీటల నుండి లేపునపుడు వారిపై నుండి ముసుపు పైసాలు చుట్టితీయు [కరీ]
వస్త్రకలిశము = (చూ) వస్త్రగాయము; వస్త్రకళశము [కర్నూ]
వస్త్రకళశము = (చూ) వస్త్రగాయము; వస్త్రకలిశము [కర్నూ]

వస్త్రకాయకము = వస్త్రగలితము [వి]
వస్త్రగలితము = (చూ)వస్త్రగాయము [నె]
వస్త్రగాయము = (1) దేనినిగాని మెత్తటి పొడిగాకొట్టి, పలుచటి గుడ్డగుండా అది పడునట్లు చేయుట; వస్త్రగలితము, వస్త్రకలితము, వస్త్రకళశము [నె; గో]
(2) వడగట్టు [అ]
వస్త్రగాళము = వస్త్రకాళికము [అ]

# వా



వాక = వంశగౌరవమునకు తగినది — *నాకు వాకగాడు* [కరీ]
వాక = నీరుబారు వల్లపుపొలము; వాద; బాడవ; పడవ
వాక = వలదు — *బాక-తాకవాక* [అ]
వాకిర = కక్కట [నె; ఆత్మ]
వాకిటఉండు = స్త్రీ బహిష్టుఅయి దూరముగ ఉండు [వి]
వాకిలి = (1) తలుపు [రా; నె]
(2) ఆవరణము, గుమ్మము [సర్కా]
(3) ఇంటికి ముందు ఉన్న ఆవరణము; మిట్ట [శ్రీ; ఉ-గో]
వాగట్టు = వాననీరు కల్లములోనికి రాకుండా చేయను కుప్ప నురిపిడి కల్లముచుట్టు వేసినకట్ట [నె; అ]
వాగర్త = సముద్రతీరము; కఱవాక; కరాక [నె-తూర్పునాడు]
వాగల్లము = కుప్ప నురిపిడికిగా చేసినకల్లము చుట్టు పడుగు పరచిన దానికి మించు నట్లుగా ఎక్కువగా చేసిన కల్లము [నె]
వాచిపోవు = ఎక్కువగా ఆశపడు — *మొగం వాచిపోవు; మామిడిపండుకు వాచిపోయినా* [నె]
వాచూరు = ఇంటికప్పుచూరు; వాలుచివరి భాగము — *వాచూరుపట్టె* [చి; నె]
వాచూరు = వాకలిచూరు [కరీ]
వాచేదు = ఎక్కువగా చెడు; వాచ్చెడు [అ]
వాచ్చెడు (వాసి + చెడు = ఎక్కువ చెడు) — *వాడు వాచ్చెడిపోయినాడు* [నె]
వాటంగ అగు = లావుగ అగు [మ]
వాటపందెము = ఒడ్డిన పందెపు ధనము — *పదిరూపాయల వాటపందెము వేసుకొన్నారు* [నె; అ]
వాటపడు బండి మొదలగునవి తలక్రిందు లగు, వాటుపడు [అ; బ]
వాటము = (1) ఎక్కువైన బలుపు — *వాడు వాటంగా ఉన్నాడు (వాటంబైన వేటు తమకంబున అని పోతన)* [వి]
(2) అనుకూలము — *వాటంగాదొరికింది* [నె]
(3) ఏటవాలు స్థితి — *బారివాటము* [నె]
వాటారము = చిలికే కవ్వపుత్రాడు; తరివాడు [గు]
వాటికూళ్లు = వారియింట, వీరియింట తిను ఉచితమైన భోజనము [నే]
వాటు = (1) అప్రయత్నముగా కలిగిన లాభము — *బలేవాటు గొట్టినాడు* [నె]
(2) తలక్రిందు లగుట, బోల్తాపడుట — *బండివాటు పడినది;* వాటపడు [నె; తె]
(3) అసందర్భపు కూత [వి]
(4) కౌగిలింత — *వాటేసుకొను* [కరీ]
వాట్లమారి = వాట్లు = అసందర్భపు మాటలు పలుకువాడు [కరీ]

వాడ = ధాన్యాదులు నిలువచేయు పెద్ద మట్టి పాత్ర [అ; బ]

వాడకము = ఉపయోగము; వాడుట [నె; కర్నూ; అ; తె]

వాడకాలు = (1) భోగంపీది—*ఇదేమి వాడకాలువీది అయిపోయిందే* [నె-దక్షిణ]
(2) వాడవదినె — *వాడకు (పేటకంత టికి) వదినె* (వరుసైనది) [వ]

వాడటెంకాయ = బొనికదీసి ఎండబెట్టిన గోదుమవర్ణపుకాయ [నె]
× పచ్చిటెంకాయ; కొబ్బరికాయ

వాడవదినె = తిరుగుబోతు ఆడుది [కరీ]

వాడుక = (1) వినికిడి, జనశ్రుతి—*ఆయన మంచివాడని వాడుక* [నె; కర్నూ]
(2) అలవాటు—*అది వాడికి వాడుక* [తె; నె; అ]

వాణి = కండువా, ఉత్తరీయము; పైపంచ [శ్రీ]

వాణీ = పైట; ఓణీ

వాతబియ్యము = శవము నోటిలో బోయు బియ్యము (అత్యంత దైన్యముచు దెలుపు పదము—*వాతబియ్యము గూడ లేకుండా చచ్చినాడు* [నె]

వాతిబియ్యము = (చూ) వాత బియ్యము [నె]

వాద = వెల్లువనీరు తగులు పల్లపు పొలము; పడవ; బాడవ—*అల్లూరువాద* [నె]

వానకాలం యాసంగిచదువు = సరిగా రాక ఎప్పుడో వీలైనప్పుడు, వానలలో ఎండలలో చదివిన చదువు; పనిలేని కాలంలో చదివినది, ఒక్కముక్కల చదువు [మ]

వానకాళ్లు = క్రిందికి సారలు సారలుగా దిగిన మబ్బులు; ఇది వర్షసూచకము — *పరమట వానకాళ్లు దిగినవి;* వానసేర్లు [నె; అ]

వానగండ్లు = (1) వడగండ్లు; రాళ్లవర్షము
(2) పెండ్లికొడుకుకు బావమఱదులు వడ్డించు పిండివంట [మ]

వానగుడిసె = గొడుగు [చి]

వానసేర్లు = (చూ) వానకాళ్లు [వ]

వానాకాలపుచదువు = అరకొరలుగా వచ్చిన విద్య—*పల్లెలలో పనులులేని వానాకాలములో మాత్రం చదివిన చదువు* [నె]

వానాగుంతలు = వామనగుంటలు [చి]

వాపరించు = ఎక్కువగా దండానడపు [కరీ]

వాపాటము = అభ్యాసము; అలవాటు [పొ]

వాపు = కోరిక [గు]

వామానము = మృషాభిమానము; తెచ్చికోలు గౌరవం—*వామానం చూపి పోయినాడు* [నె]

వామి (1) నురిసిన గడ్డిని బొడవుగా, గడ్డి అయిపోవునంత వరకు ఉండు నట్లుగా పేర్చినది, మేట; [నె, కర్నూ; తె]
(2) కయ్యలలో పోసి ఉంచిన పెద్ద ఉప్పు కుప్ప [నె; అ]
(3) పెరడు—*గడ్డివామి* [చి]

వామినికోయు = గడ్డిమేటను పేర్చు [నె]

వాము - (1) అప్పుడే రొంపిన చల్లినచేనిలో నిలిచిన నీటిని, చిన్న చిన్న కాలువలు దీసి, చల్లిన మొలకకు దెబ్బతగులకుండా మెల్లిగా ఆ నీటిని బయటకు తీసివేయుట —*నారు కయ్యలో నీళ్లు వామిరా* [నె]
(2) కప్పుదీయు [అ]

వాముకొను గడ్డగప్పు [కరీ]

వాయ = (1) తినుబండారములు కాల్చునప్పుడుగాని. బియ్యము మొదలగునవి దంచునప్పుడుగాని బాండలిలో, రోటిలో ఒక్కొక్క తడవ పట్టగలిగినది; వాయి — *దానిని రెండు వాయలుగా దంచు* [నె, అ]
(2) పర్యాయము (అన్నము తినునప్పుడు) —*మొదటి వాయ* [అ]

వాయాడి = (1) నోరుగల స్త్రీ; ఊరికే వాగునది [చి]

(2) మాటకారి [నె]
వాయి=(మూ) (1) వాయ [కర్నూ; తె]
(2) మూర్ఛరోగము
వాయిదా=(1) వాగ్దానము [తె]
(2) కేసు వినుటకు కోర్టు యిచ్చు గడువు
(3) చెల్లించవలసిన మొత్తము పద్దులు పద్దులుగా చెల్లించు — *పది వాయిదాలలో కట్టాల* (Instalment) [ఆంధ్ర]
వార=(1) ప్రక్క; వైదొలగు—*ఒకవారగా నిలువు;* ఓర [నె; తె]
(2) దూకుడు; వాటము (Slope) [అ]
(3) వ్యత్యాసము—*దానికి దీనికి అంతగా వారలేదు* [నె]
వారగు=తొలగు—*వీడ వారయింది* [అ]
వారచ్చు = ఒకే అట్టతో కుట్టిన పలుచటి చెప్పు [నె-మెట్ట]
వారడి=(1) భేదము—*దాని వారడికట్టిచ్చినారు*
(2) చేసినలోటును, తక్కువను సరిచేయుట; ఎలవ — *అన్నంవారడి ఫలహారంలో తీసినాడు* [నె]
(3) ఏటవాలు [అ, బ]
వారపాక = ఇంటిగోడకు ఆనించి వాలుగా వేసిన పందిలి [నె-ఆత్మ]
వారపాకు=కొట్టము [తె]
వారపోయు = (1) పుట్టచుట్టు దిరుగుచు, స్త్రీగాని దంపతులుగాని సన్నగా పోయు నీరు మొదలగునవి [కర్నూ]
(2) దేవునిముందు నీరుబోసి మ్రొక్కుట [తె]
వారబోవు=(1) స్త్రీ బహిష్ఠు అగు; దూరముగనుండుట—*ఆమె వారబోయింది* [నె]
(2) ఓరగానుండు [వ]
వారము=పంటలో సగము ధాన్యమునిచ్చు పద్ధతి—*వారం సారం వచ్చిందింత;* మేడిపాలు [చి]
వారా=భేదము; వార [అ, బ]
వారాది=వంతెన [తె]
వారాలుజేసికొను=రోజొకరియింట నియామకముగా భోజనము చేయుచు ఏడు దినములు గడుపుకొను, ఇది ముఖ్యముగా విద్యార్థులు చేయుపని [వి; కరీ; నె]
వారిణి=కపిల (మోట) కాడిమధ్య, నీటి బాన మోకును బిగించుటకు, పన్నికట్టి పెట్టిన పలుపు (ఉచ్చుతాడు); వార్నె
వారినె=(1) మోటుపగ్గము
(2) నాగటిత్రాడు [కరీ]
వారు=(1) సన్నముగా కోయు (చెక్కు) [నె]
(2) దేవునకు నైవేద్యముగా పోయునది [నె]
వారె=రెండుచేతులకు అబ్బునంత—*వారె గడ్డి తెస్తున్నా;* సందెడు [చి]
వార్నె=(1) కపిల మోకును కాడికి బిగించుటకు పన్నిన ఉచ్చుతాడు; వారిణి [నె-ఆత్మ]
(2) కాడి మానుకు నడుమకట్టియుంచు ముప్పేటత్రాడు [నె-పొ]
వార్నెపీట = వార్నెను దూర్చు అల్లికము [నె-పొ]
వాలకము = (1) పేరుకు పనిచేసినట్లు నటించుటకు — *వాలకంచేసిపోయినాడు* [నె]
(2) విధానము, పద్ధతి
వాలకాలు = జాతరలలో వేయు వేషములు [గ]
వాలగ=మేలైన సున్నటి మంచినీటిచేప; వాలుగ [నె; అ, తె]
వాలగ మీసాలవలె = కోపుగా తెగులు లేకుండా ఎదుగు వరిదంటును పోల్చి చెప్పుట —*పైరు వాలగమీసాలవలె వస్తున్నది* [నె; అ]
వాలాయము=(1) సహజము—*ఇది వాడి*
; నె]

(2) అలవాటుప్రకారము, అయినను కాక పోయినను అదే సమయమునకు చేయు పని — *వాన వాలాయం తీర్చుకొని పోయింది;* అనగా బాగుగ కురువలేదనుట [నె: అ]

(3) తప్పక— *వాలాయంగా రండి* [వ]

వాలు=(1) ఏటవాలు—*ఇంటికప్పుకు వాలు తక్కువైనది* [నె; కర్నూ]

(2) పర్యాయము—*ఇది రెండోవాలుతిండి* [నె]

(3) బావి త్రవ్వినప్పుడు తీయు వరుస [కరీ]

(4) ఒరగడ్డము, నిట్రమైన ప్రదేశపుకొన [అ]

వాలుగ=(చూ) వాలగ [వ]

వాలెరువు (వాల+ఎరువు) = ఉచ్చతో గూడ అరి, పొడిపొడిగా విరబడిపోయిన పేడఎరువు [నె]

వావిలిపొరక=దూలాలపైన కప్పు దంతి; కొడిసెపొరక; దంతి [కరీ]

వాసనకట్టు=నెయ్యి మొదలగువాటి వాసన తగ్గిపోకుండునట్లు, పాత్ర మూతికి గట్టి మూతగా కట్టినది; వాసెనకట్టు [నె]

వాసి=(1) నెమ్మది; నయము — *జ్వరం వాసి అయినది*

(2) కొలత, పరిమాణము — *పని కాలు (పాతిక) వాసిగూడ కాలేదు* [నె]

వాసూరుపట్టె=వాసూరున బిగించిన చెక్క [చి]

వాళిగ = పొన్నలు (Funnel) కువ్వెన; గరాటు

వాళి=(1) వాడుక, అలవాటు [వి]

(2) ఉనికి; స్థావరము — *ఇది దేశవాళి వసరము*





వింటిలిదబ్బ = విల్లినంబువంటిది, బాణము నకు బదులుగా అల్లెత్రాడు నడుమనుండు చిన్న అల్లకములో చిన్నరాయిబెట్టి, అల్లెత్రాడు లాగికొట్టునది; ఇంటిలిదబ్బ; ఉండేలిదబ్బ — *విల్లకాకేమి దెలుసు వింటిలిదబ్బ ఏటు* [నె; అ; తె]

విచారింపు = ఒకఇంట జరిగిన మరణమునకుగా, ఆ ఇంటివారి చుట్టములు పోయి చేయు ఓదార్పు, పరామర్శ; మందలింపు—*విచారింపుకు శుక్రవారంపోరాదు* [నె; కర్నూ; అ; వ]

విచ్చు = ప్రత్యేకముగా నుండు నాణెము; విచ్చురూపాయి [గ]

విచ్చెలు=దూదిపింజలు [కరీ]

విడతలు=మార్లు—*ఎన్ని విడతలుతింటూరు?* ఇడతలు [తె]

విడదొక్క=ఒక పెద్దపొలమును విభజించి బాగస్థులకు ఆయా భాగములను ప్రత్యేకించు — *మిగుపొలం పెద్దవాడికి విడదొక్కనారు* [నె; అ]

విడవలి=చెరువుతొట్లులలో గంటగట్టిఎదుగు దర్భగడ్డి. దీనితో ఇండ్లు కప్పుదురు; కుశ; ఇడవలి (ఈ జాతిలో సువాసన గలదే వట్టివేరు) [నె]

విడిచినది=భర్తచే విడువబడిన జారిణి

(2) సిగ్గువిడిచినది స్త్రీ — *అది విడిచిన ముండ* [నె; అ]

విడుచు = తలకు అంటిననూనె, సీకాయ మొదలగు వాటితో పులుమగా నూనె వదలుట—*తల వాగా విడిచినది;* విడిచి పోయినది [నె]

విడుచు = పండిన పత్తిని కాయనుండి ఒలుచు—*ఈ చేను మూడు విడుపులకు వచ్చినది* [నె-పొ]

విడుదాకు = విడిపోవుట [కరీ]

విడెము పెట్టు = మనువు నిశ్చయమొనర్చు; నిశ్చితార్థము; తాంబూలము బెట్టు [కరీ]

వితణ్ణము = వితండము; మూర్ఖము; పెడద్రమ—*వాడు బలే వితణ్ణపు మనిషి* [నె; అ]

విత్తుపూజ్యము = చల్లిన విత్తనములుగూడ పండక పైరు ఎండిపోవుట—*ఈ ఏడు మాకు విత్తు పూజ్యమైనది* × కొడవటి పూజ్యము = పైరు ఎదిగి కోయవలసిన అగత్యము లేకనే ఎండిపోవుట [నె]

విద్దెలు = కెరటాలు [వి]

వినాయింపు = మినహాయింపు [వి]

వినికిడి = (1) కింవదంతి; అవాయి, పుకారు, [నె, కర్నూ, తె, అ]

(2) వినినది [గో]

(3) అనేక విషయములను విని తెలుసుకొని యుండుట [అ; బ]

(4) ఇంపు—*ఆయన ఉపన్యాసము వినికిడిగా లేదు (వినుటకు సొంపులేదు)* [అ]

వినిపించుకొను = (1) చెప్పినది ఆలకించు

(2) చెప్పినట్లు చేయు—*వాడు నామాటే వినిపించుకోలేదు* [నె]

విప్పులక్క—ము = కొంతవింత; విడ్డూరము [కరీ]

విబ్బెట్టు = జుగుప్సితము [కరీ]

విరగగోయు = తగ్గించు—*తనకు రావలసిన డబ్బు విరగగోసుకొని మిగత ఇచ్చినాడు* [నె-పొ]

విరదాళ్లు = వీరులత్రాళ్లు, కొలుపులలో గొల్లలు తొడలచుట్టు విసరికొట్టి 'టప్' అను శబ్దము చేయునవి. ఇవి ఎలుకతోక వాటపు కురుచమోకులు. ఇవి ఉంచు పెట్టెను 'గంగపెట్టె' అని పూజింతురు [నె]

విరుగడమైపోవు = విడిపోవు [కరీ]

విరుగుడు = విషమును విరుచునది, ఉపశమనము—*నాముక (నాగుకు) చిలుము విరుగుడు* [నె; కర్నూ, అ; వ, తె]

విరుపు = (1) అసూయ [కరీ]

విలవిలలాడు = అయాసముతో తపించు [కరీ]

విసరురాయి - తిరగలి; రాగినకల్లు [అ]

విసవిస = (1) ఒకదాని కొకటి యంటక ఉండు

(2) దేనికదే యుండి పోవు [వి; కరీ]

విస్తళ్లువేయు = భోజనమునకు సిద్ధముచేయు. పీటలు వేయు—*విస్తళ్ల వేసినారు, లేండి* [నె; కర్నూ; తె]

విస్తుపోవు = ఆశ్చర్యపడు [చి]

## వీ



వీరంగము = పెద్ద గోల [కరీ]

వీరకత్తి = వియ్యపురాలు × వీరూడు = వియ్యంకుడు (భ్రష్టరూపములు)—*ఈరకత్తె; ఈరకాడు* [గ్న]

వీరజాటి = వీరులతాడు. గంగమ్మ భక్తుడు దీనితో మోదుకొనుచు, నృత్యముచేయును (చూ) విరదాళ్లు [చి]

వెంగళప్ప = వెఱ్ఱిబోగలవాడు [నె; సర్కా; తె; అ]

వెంపలాడు = తరిమివెన్నాడు — *వెంపలాడి చంపినారు;* వెంపర్లాడు [క]

వెంపు = వైపు; తట్టు; ప్రక్క

వెతెళ్లు = కొలబానలతో ధాన్యము కొలవగా హెచ్చు వచ్చిన ధాన్యము [నె-పొ]

వెచ్చము = (1) ఇంటికి కావలసిన చిల్లర వస్తువుల — *వెచ్చానికి పోయినాడు* [నె; కర్నూ; అ]

(2) మందులు వండుటకు కావలసి వచ్చే శొంఠి, పిప్పళ్లు మొదలగు దినుసులు [తె]

వెచ్చలు = నింపుకలు; నిప్పుకణములు [అ, కరీ]

వెట్టికిబ్రతుకు = నిరాదరణచూపినను బాగుగ పైకివచ్చు — *యానాది బిడ్డమాదిరి వెటికి బ్రతికినాడు* [నె]

వెటకారము = తామే సమర్థల మని ఇతరులను వికటముగాచేయు వెక్కిరింత [గో]

వెణ్ణీరు = వేడినీరు × పన్నీరు = చల్లనీరు [అ]

వెనుకదన్ను = వెనుకనున్న సహాయము [వి]

వెనుకదీము = వెనుక నుండు బలము [కరీ]

వెనుక కపిలె = (చూ) తిరుగుడు కపిలె [చి]

వెనుగాడు = వెనుపట్టె; పూరిండ్లకు పైభాగమున వాసములకు ఆధారముగా నుంచు కొయ్య [నె-పొ]

వెనుగు = కంచె [వ]

వెన్నముద్ద = ఒకరకపు గాదము; వెన్నాది [కరీ]

వెన్నుదంతి = జొన్న కంకులను పోగు చేయుట మొదలగు పనులకు ఉపయోగించు సాధనము [నె-ఆత్మ]

వెన్నుపోటు = ఒక ఇంటి వెన్నుగాడి ఇంకొక ఇంటి వెన్నుగాడికి అడ్డముగా నుండుట. వాస్తుప్రకారము ఇది దోషము — *ఆ యింటికి వెన్నుపోటు తగిలింది* - పోటీ [నె]

వెన్నాద్రి = ఒక రకపు గాదము [కరీ]

వెన్నెమ్మ = పురిటిలో శిశువులకు హానిజేయు పిశాచి [నె-పొ]

వెఱ్ఱికుట్టె = ఏమీ తెలియని వ్యక్తి (కుట్టి అనిన బాలుడుగాని, బాలికగాని అని తమిళము)

వెఱ్ఱివెంగళప్ప = వెఱ్ఱిబాగుల వాడు [వ]

వెలయు = (1) తగ్గు

(2) భూమినుండి పుట్టుకొనివచ్చు [కృ]

వెలిగడ = (1) నీరుబెట్టక దున్నిన దుక్కి; ఎలిగడ — *వెలిగడ చల్లినారు; గడ్డలలో కలిపినారు* × రొంపిదుక్కి [నె]

(2) వర్షాధారము గల భూమి [నె-పొ]

వెలిగనులుబడు = నిదుర దేలిపోయి కన్నులు నిలిచిపోవు [కరీ]

వెలిగాకి = ఎవరితోను కలియక తిరుగు వ్యక్తి [కృ]

వెలిగాడి = ఎద్దు బండికాడి చివరకు పోవుట; ఎలిగాడు [నె; అ]

వెలిగొండలు = నెల్లూరుజిల్లాలో తూర్పుకనుమలకు పేరు, తెల్లటి అని. వీటికే కర్నూలు మండలములో అర్లగడ్డ దగ్గర ఎఱ్ఱమల అని, నంద్యాలకావల నల్లమల అని పేరు

వెలిమబ్బు = కురిసి కురిసి వెల్లబారిన మొగులు [కరీ]

వెలుగడి=కార్చిచ్చు; ఎఱగలి [కరీ]
వెలుచే=చిన్న పాత్రలను తోము [కరీ]
వెలుచు=కదుళ్లమీద ఉన్న నూలు పంటె కెక్కించు: లేదా రాట్నములకు డబ్బాలు తగిలించి ఆ డబ్బాలకు నూలు చుట్టు; ఎలుచు
వెలుతురుకట్టె = ఒక అడవిచెట్టు కొమ్మ. దీనిని పచ్చిలో వెలిగించినచో చమురు బోసిన దివిటీవలె వెలుగుచుండును [నె]
వెల్లువ=ఎక్కువగా నుండుట, ఏటి వెల్లువ వలె ననుట—*ఆ పొలములో తాటిచెట్లు వెల్లువ;* ఎల్లవ [నె, వ; అ]
వెల్లువకట్టు = (మా) పొల్లుకట్ట
వెళ్లగాయు=నోటినుండి వదలు—*ఆ పశువు వీడచలు వెళ్లగాయును* [నె-ఖ]
వెళ్లనంపు = (1) జాతర అయిన తర్వాత ఆ గ్రామదేవతను ఊరి పొలిమేరకు తీసి కొనిపోయి, వెలిమొగము బెట్టి ఉంచి, తల వగులగొట్టి వచ్చు తంతు; విసర్జన వంటిది — *పోలేరమ్మను వెళ్లనంపినారు* (2) ఇష్టములేని వారిని పంపి వేయు — *అయనను వెళ్లనంపను యింత సేపు బట్టి నది;* సాగదోలు [నె]
వెళ్లనీదు=దాటు; గడచు [కర్నూ]
వెళ్లబోసుకొను = తన దుఃఖమును ఒకరి ముందు గాథగా చెప్పుకొని ఏడ్చు [నె]
వెళ్లాల=(1) శాఖాహారులైన మొదలియార్లు [చి]
(2) కృషికులు
వెళ్లిపోవు=చనిపోవు [నె]

# వే



వేంపుడు = వేయించినది; వేపుడు — *వేంపుడు కూర;* సేక [నె; కర్నూ, అ; తె]
వేకాడు=ఉక్క [చి]
వేగించు = నెగ్గించు, నిర్వహించు [కరీ]
వేగిలి=నువ్వు చేని అడుగు [కరీ]
వేగిలివారు=తెల్లవారు; వేగులవారు [కరీ]
వేగులవారు=తెల్లవారు; వేగిలివారు [కరీ]
వేచికాల్చు = ఎక్కువగా బాధించు — *అయన నన్నుజనాన్ని వేచి కాలుస్తున్నాడు* [నె; అ]
వేపు=వైపు; వెంపు; తట్టు; ప్రక్క
వేపుడు = వేయించినది — *వేపుడుకూర;* వేంపుడు [నె; కర్నూ; తె]
వేయికాళ్లజెట్టి=ద్రిమ్మరి
వేరగు=అన్నదమ్ములు కుటుంబవిభాగమగు [అ]
వేరుబోవు=కుటుంబము విభాగమగు; వేర్లు బోవు [కర్నూ; తె]
వేర్లుబోవు = కుటుంబవిభాగమగు; వేరు బోవు—*అన్నదమ్ములు వేర్లుబోయినారు* [నె]
వేర్పుబోవు=వేరైపోవు; వేరుపోవు [వ]
వేలుకూరు రామాయణము = మొదలు పెట్టిన పని ముగియులోపలనే పలుమారు మరల మరల ప్రారంభించుచు వచ్చునది. చిత్తూరు తాలూకాలో వేలుకూరుగ్రామ మున్నది. రామాయణ కాలక్షేపము ప్రారంభించి సాగుచుండ మధ్య రెడ్డిగారు వచ్చే వారట. రెడ్డొచ్చె మొదలెత్తుకోమంటే మళ్లీ మొదలుపెట్టి కొన్ని క్షణాలైనదే

మరొక రెడ్డిగారు రాగా మొదలెత్తుకొని మళ్లీ ప్రారంభించుచునే యుందురు గాని కథ ముందుకు సాగిపోక ఆ పుణ్యకాలము గడచిపోయేది, కథ సాగేదికాదు [చి]

వేషాలమారి=(1) క్షణక్షణమునకు మనసు మార్చుకొనువ్యక్తి

(2) ఎప్పుడూ వేళాకోళము పడువాడు—*వాడంతా వేషాలమారివాడు* [నె; కర్నూ; తె; అ]

(3) మోసగాడు, వేసాలమారి [వి]

వేసె=చీరకట్టుకొనుటలో పెట్టుకొను గోచి [సర్కా]

వేళపాళ = సమయము, సందర్భము — *వాడికి వేళాపాళ లేదు* [నె; కర్నూ; అ; [తె]

# వై



వైపు=(1) ఆనుకూల్యము — *పనికి వైపు దప్పింది*

(2) పట్టు — *వైపు దప్పి జారిపోయింది*

(3) మెలకువ—*వైపుగా పనిచేయు* [నె; కర్నూ; తె; అ]

వైమూల=ఐమూల [కరీ]

వైవాటు=ఆచారము [కరీ]

# వొ



వొట్టెలు=వంపులు; చీలికలు; పట్టెలు [మ]

వొత్తుపొయ్యి=నీళ్ల కాగుటకు ఒకకుండమ పొయిప్రక్కన గుంతచేసి ఉంచి అమర్చిన పొయ్యి; పొంతకుండ; పొయ్యి [మ]

వొట్టిమాటలు=వంకరమాటలు [మ]

వొస్కెలు=వధూవరులపై నుండి దిగతీసి దానమిచ్చు పైసలు [మ]

# వో



వోకారము=వాంతి; వాకర [మ]

వోలాలు = కాల్చిన పచ్చి సెనగకాయలు [మ]

# శ



శకణ్ణము = వేళాకోళము, చాత్రి; శాణి—*అప్పుడప్పుడే శకణ్ణాలుపడుతున్నాడే* [నే]

శకలుబడు = మితిమీరు, వెఱ్ఱిచేష్టలు చేయు —*సెకలబడుతున్నావే* [నె]

శకున గీసిగాడు = ప్రతిదానికి అడ్డుపడేవాడు

శకునపక్షి = అభ్యంతరాలు చెప్పువారు; శకునాలపక్షి; శకునగీసిగాడు [చి; కర్నూ]

శకునాలపక్షి = (1) ప్రతిదానికి ఏదోఒక అభ్యంతరము చెప్పువ్యక్తి; ప్రతిదానికి శకునముల పట్టింపు చూచువాడు; శకున పక్షి [నె; తె]

(2) చెడ్డగా శకునం చెప్పువాడు, అనిష్ట సూచకుడు [అ]

శక్కండాలు = శకణ్ణములు, వేళాకోళములు [అ]

శటము = పిపాస; క్షుద, పిచ్చి. అధికేచ్ఛ [అ; బ]

శటాయింపు = విరక్తి; కోపము [అ]

శతమానము = ఎక్కువగా తిట్టుట (నూరు తిట్లు అనుట) — *శతమానం పెట్టినాడు* [నె; తె]

శరవ = మూతి సన్ననిపాత్ర [నె-పొ]

శరామసి = కొంచెముగూడ తీరిక లేనిపని; గబగబ పనిచేయు — *ఆయన ఇప్పుడు శరామసిగా ఉన్నారు* [నె]

శర్లు = తలపాగగట్టు పెద్దరుమాలు

# శా



శాండో = (1) సర్కసులలో భీమునివలె బలప్రదర్శనము చేయువాడు — *శ్యాండో పనులు*

(2) ఎక్కువ శారీరక బలముగలవాడు; భీముడు. ప్రొఫెసర్ కోడి రామమూర్తి శ్యాండో ఈ శతాబ్దాదిలో, స్విడ్జర్లాండు దేశస్థుడు — *ఈజిన్ శ్యాండో అను మల్లునివలె ఇనుపగొలుసులు త్రెంచుట, ఏనుగును పైన ఎక్కించు కొనుట మొదలగు బలప్రదర్శక కార్యములను చూపుచు సర్కసును సాగించినాడు.* ఆయన ఆంధ్రుడు, విజయనగరవాసి. కోడి రామమూర్తికి ఆ శాండోకు పోటీ జరిగి, కోడివారు గెలిచినారు (ఈయన విశ్వబ్రాహ్మణుడైనను నాయుడని పేరు బడినది) వీరు అదె మొదలు 'రామమూర్తి శ్యాండో' అనుపేర విదేశములు స్వదేశము పర్యటించి పేర్గాంచి, పరమపదించినారు. [నె; తె; అ]

శాత = భాగము; గురుతు; ఫలితము—*అబద్ధమాడిన శాత కొట్టినది* [నె]

శాకండాలు పోవు = బడాయిలు పోవు; ఎగిరిపాటు [గు]

శాకము = సేకము; సెగ; వేడిమి—*పొయ్యి శాకము* [అ; బ]

శాకరము = శోభించు—*ఇప్పుడు శాకరముగా ఉన్నాడు; ఈ పైరు దానికంటె శాకరముగా నున్నది;* శాకారము [నె-పొ]

శాకారము = (చూ) శాకరము [నె-పొ]

శాఖము = మాంసము (పై జాతులవారు వాడు మాట) [వ]
శాగమట్టు = (చూ) కలబంద [వ]
శాగరమట్టు చీర = నారచీర [మ]
శాణ = తెలివిగలవాడు [తె]
శాణతనము = జాణతనము [మ]
శాణా = అన్ని నేర్చిన నాగరికుడు; జాణ [కరీ]
శాణాతనము = శాణీతనము [గు]
శాణి = కోడిగము; చాల్తి—అంతా శాణీలు పడుతున్నాడే [నె]
శాణి = నేర్పరి; నేర్పరితనము [అ]
శాణీతనము = నాగరీకము [కరీ]
శాతబడి = (చూ) చేతబడి; సేతబడి; శాతాళము [కర్నూ: కరీ]
శాతాళము = సేతబడి; సేతాళము [కరీ]
శాతువ = పని, సేద్యం; శాదవ [అ; బ]
శాదము = పచ్చిక [నె-పొ]
శాదవ = చేసిన పని (వ్యంగ్యముగా) — ఏమి శాదవ చేసినావయ్యా [నె]
శాదానము = చేసిన పనికి వ్యంగపదము; శాదవ [కర్నూ]
శాదారము = నష్టము [చి]
శాన = చాల—శానా పని [కరీ; వ, నె; చి]
శానభోగు = కరణము; కులకర్ణి; కనకపిళ్ల
శానా = చాలా [సే; నె; తె; చి]
శాపనగొట్టు = శాపము దవిలిన — ఈ భూములు శాపనగొట్టు భూములు [కరీ]
శాద్ధి = ప్రతిజ్ఞ—శాద్ధీ దీసినాడు [నె]
శాల్తి = (1) రూపము,
(2) వస్తువు; ఉరువు [వి]
శావ = సేవ—దేవుని శావదీసిరి [కరీ]

# శి



శింద = ఆడగురి [గు]
శిఖండి = రెండువైపుల తలలు గలిగిన పాము—మొండి సికండి [నె; ఉ-గో]
శిగినపు వక్క = చిగిరపు వక్క; మేలైన వక్క [కర్నూ]
శిడ్డులు = ఎద్దుల మెడలపై కాడిపెట్టి, దాని పైన బిగించే కొయ్యలు [వ]
శివ = (1) తారాజువ్వ [చి]
(2) సన్నని వెదురు మెలిక, గాలముగా త్రాడును కట్టునది. దీనిని పిట్టలు పట్టుటకు ఉరులుగా ఉపయోగింతురు [చి]
శివముసూలు = దేవుడు పూనుటచే తూలు [కరీ]
శివమెత్తు = ఆవేశము పొంగు — వానికి శివమెత్తింది [తె; నె]
శివా అంటూ = ఓంప్రదమతః; సిమా అంటు [కరీ]
శివాలాడు = (1) ప్రాధేయ పడు—వానిని పట్టుకొని ఊరకే శివాలాడినా
(2) పీగదీయు [నె]
(3) దేవుని పూనికవల్ల మైకం కమ్మి ఊగులాడు [గో; వి]

శ్రీగ్జాలు = కట్టెను చెక్కి వనిముట్లు; బాడిస [మ]

శీల = చీల [వ]

శీలముండలు = (చూ) చీల మడిమ [వ]

## శు



శుద్ధిపెట్టు = కడగు, భుజించిన విస్తరి తీసిన చోట, అలికి శుభ్రపరచుట [అ; నె]

శుభస్వీకారము = కర్మ ముగిసిన తర్వాత, మామగారలు కర్మచేసినవారికి వస్త్రము లిచ్చు ఆచారము [అ]

## శూ



శూన్యము చేయించుట = (చూ) చేతబడి [అ]

## శే



శేవుకొాను = బలములేకుండా శరీరము ఊరు; వాపు; ఉబల [శ్రీ]

శేరు = (1) గిలక జబ్బు (వృషణవ్యాధి) హెర్నియా—*వాడికి శేరు దిగింది* [వి]
(2) పశువుల మగ గురి [నె]

## శై



శైవము = శాకాహారభోజనము — *ఈ దినం మాకు శైవం* [దక్షిణము]

## శో



శోకణాలు = ఏడ్పులు [కరీ]

## శ్రీ



శ్రీరామచిక్కుడు = గోరుచిక్కుడు, మటిక, గోకిరి

## షో



షోకు = (1) వగ — అతడు షోకులు బడు చుండె [నె]
(2) విపరీత అలంకరణము; విలాసము [కరీ; నె]

షోడదాయినికొడుకు = దుర్మార్గుడు [గో]

షోదా = పనిబాటలు లేకుండా తిరుగాడుచు, స్త్రీలవెంట బడుచు విలాసముగా తిరుగాడు పనికిమాలినవాడు. ఇతడు రౌడి వలె దుర్మార్గుడుగాక మెత్తనివాడు [నె]

## స



సంకటికట్టె = అంబలి మొదలగువాటిని గెలుకుకట్టె; తెడ్డు [చి]

సంకదాళ = సంకలో కలుగుగడ్డ [అ]

సంగటివేళ = ఉదయం సంగటి (సంకటి) దిను ప్రొద్దు (ఉదయం 10 గంటలు); కాపు కూటివేళ [అ]

సంగడావు = స్త్రీ పురుష లక్షణములతో పుట్టిన ఆవు. దీనిని యింట వుంచుకొనరు, గంగిరెద్దు వారికి యిచ్చివేతురు [నె-బొ]

సంగడి = సామాన్యమైన నదులను దాటుటకు ఉపయోగపడు పడవ [గు]

సంగడికోళ్లమంచం = కాళ్లను (కోళ్లను) సంగడి (తరిమెన) పైన నునుపుగా గుండ్రముగా చేసి అమర్చిన మంచము; అరడాలమంచము [మ]

సంగనోటు = అధికము; ఎక్కువ—సంగనోటిపని అయినది [అ, బ]

సంగి = (1) ఆడుదానివంటివాడు; ఆడంగి రేకులవాడు; కొజ్జా
(2) ఏమిచేతగానివాడు [మ]
(3) కల్లిబొల్లి ఏడ్పుకలది, (కలవాడు) [అ-పె]

సం(గ్రము = ఉక్కబోయుట [అ; బ]

సంచకరి = బయనా; చెంచకరువు; సంచకారము [కరీ]

సంచకారము = చెంచకరువు [అ]

సంచకరువు = బయాన; అడ్వాన్సు, సంచకారము [నె; కర్నూ, అ]

సంచకారము = సంచకరువు, బయానా [అ; నె]

సంచ = పశువులపారుడు వ్యాధి [శ్రీ]

సంచు = (1) గుంపు [గో]
(2) మర్మము [అ]
(3) గొడవ—*ఈసంచు నాకేల* [కరీ]
(4) విధము—*వాడిదంతా విచ్చిసంచు* [నె-కనిగిరి]

సంజెరేవు = సంసారుల పెండ్లిండ్లలో ముహూర్తమైన మరుసటిదినము సాయంత్రము, ఊరిచెరువు రేవు దగ్గరకు పెండ్లికొమరుని తీసికొనిపోయి, అలంకరించి, చదురు జరిపి గుఱ్ఱముపై కూర్చుండబెట్టి ఊరేగింపుగా ఇంటికి తీసికొని వచ్చుట. ఇది వేడుకైన దినము. పెండ్లికూతురు పూలపల్లకిలో ఉత్సవమున చేరును; సందిరేవు [నె]

సంతన = (1) ఒకపనియొక్క ముగింపు [గు]
(2) పనిచేయుటలో లాఘవము [నె]

సంతనాపి = పరియగు యేర్పాటు [గ]

సంతసొరకాయ = ప్రతివారు పట్టిచూచి విడిచిపొవునది. అంగడిలోని ఆనపకాయను కొనువారు గోటనొక్కి ముదురు లేతను చూచునట్లు ప్రతివారు ఉపయోగించు వస్తువు అనుట—*సాని కువములు సంత సొరకాయలు* (కవిప్రయోగము గూడ)

సంతము = సొంతము [కరీ]

సంతుముసుగు = వంశ మంతరించు [కరీ]

సందకాడ = సందెకడ [అ; బ; నె]

సందప్ప = చంద్రుడు

సందాల = సాయంసమయములు; పగటాల; పగటివేళ [అ; నె]

సంది = ప్రాంతము, చుట్టుపట్ల — *ఈ సంది అల్లాది లేదు* [అ]

సందిబొందె = స్త్రీలు సందికి (రెట్టకు)తొడుగు కడియము [నె-పొ]

సందిరేవు = సంసారుల పెండ్లిండ్లలో లగ్నమైన మరునాడు పెండ్లికొడుకును చెరువు దగ్గరకు తీసికొనిపోయి అలంకరించి, అచట నాట్యపు చదురు జరిపి; ఊరేగింపుతో ఇంటికి తీసికొనివచ్చునది; సంజెరేవు; సందెరేవు [నె]

సందిలి = (చూ) సందెడు; సందిట [కర్నూ]

సందీలము = ఎక్కువ—*సందీలము నని ఉంది* [అ-పె]

సందు = పాడ్యమినాటి చంద్రవంక; నెల [శ్రీ]

సందు = 1) ఎడము—*సందులేకుండా జనం క్రిక్కిరిసిపోయినారు*
(2) ఇంటి వెనుకభాగము, దొడ్డి; పెరడు *సందులోబావి*. సందు × మిట్ట
(3) మధ్యకాలము, సంధి సమయము—*కొత్తపాతల సందున* [నె; కర్నూ; ప; అ]

సందుకొట్టు = పసిపిల్లలకు నెలలమూరు మధ్య తగిలెడు బాలగ్రహవ్యాధి—*అరవనాటి సందు* [వ; నె]

సందుకొను = (1) కలిసికొను; సంధించుకొను—చిత్తస్వాతి సందుకొన్నవి [నె, అ]
(2) మధ్యదూరు—*మా తగువులో అతడు సందుకొన్నాడు* [నె]

సందులు = బాలింతకు నీళ్లుపోసే దినము [మ]

సందులోమందు = ఇరుకాటములో మెలగు [కరీ]

సందెకబళము = సందెపూట అడుక్కొను కూడు; సందెకవళము [కరీ]
సందెడు - రెండుచేతులు బారలుగా చాచిన అందు ఇముడునంత; సందిలి, సందిటి—*సందిట్లో*-సందెడుగడ్డి [నె; తె; అ]
సందెరేవు=(1) ఊరేగింపు [అ]
(2) (చూ) సందిరేవు [నె]
సంపతెళ్లు = వివాహానంతరము వధువు తల్లిగారింటికి పోవుట; [చె]
సంపర్తి - కరణము [చి]
సబందాలు = ఉత్తరక్రియలు జరిగిన మరునాడు విస్తర్యంకులుచేయు విందు—*సంబందాలు కలిపేవరకూ ఉండి వస్తాము* [చి]
సంబడము = (వ్యంగ్యముగా) ఇదేనా?అనుట—*ఈ సంబడానికేనా యింత ఆర్భాటం* [నె; కర్నూ; అ; తె]
సంబడు = వెట్టివాడు (సాంబనికి వ్యంగ్యముగా)—*ఈ వెఱ్ఱిసంబడేమి చేయగలడు* [కరీ]
సంబరము=(1) తిరునాళ్ల మొదలగువేడుక—*సంబరానికి పోయినాము* [నె;కర్నూ; అ; వ]
(2) సంతోషము
సంబళగాడు=జీతగాడు, సాలు సరి జీతము మీద పనిచేయు కూలివాడు [అ]
సంబళము=నెలజీతము [అ; నె; చి]
సంబాళించు=సమళాయించు [నె]
సంసారి = (1) రైతుకుటుంబీకుడు; గృహస్థు; × బోగుబడి — *ఊరిసంసారులంతా చావిడికాడ చేరినారు* [నె; కర్నూ; అ; వ; వి]
(2) పతివ్రత — *ఈవిడ సంసారియా బోగుబడియా* [కరీ; నె]
సకారదీర్ఘము=సాని [శ్రీ]
సకారము = వేశ్య, సాని [వి]
సకలాతు = ఉన్నిశాలువ [అ]
సకా = కూడా—*అది సకా;* సగ [శ్రీ]
సకినాలు = బియ్యపుపిండితో చేయు తినుబండారము [మ]
సగ = కూడ — *నేను సగచూడలేదు;* సకా [నె-పొ]
సగపడ =(1) సగము అగు — *ఆపని సగపడ అయినది* [కరీ]
(2) సరిపడు [కరీ]
సగపెట్టు=(1) తయారుచేయు [గు]
(2) సవరించు, అక్కఱకందించు —*నాకు డబ్బు సగబెట్టు;* సగవేయు [కరీ]
సగమంత్రము = నడిమధ్య — *పని సగమంత్రముగా వదలిపోయినాడు;* నడుమంత్రము; నడీమంత్రము [నె; అ; తె]
సగవేయు = సిద్ధముచేయు — *బండి సగవేయి;* సగపెట్టు [నె, ఆత్మ]
సగాల = ప్రాంతము, ప్రదేశము [అ]
సగాలు = సమీపము — *ఇది వింటే వాడి సగాలుకు రాడు* [నె-పొ]
సగించు=రుచించు; బుద్ధియగు, నయించు — *అన్నము సగించలేదు* [నె; తె; అ]
సగిచ్చినట్లుండు=హాయిగా ఉండు [అ;నె]
సగిలి = (1) ఊరిపశువుల కొట్టములనుండి సత్తువను కొట్టుకొనివచ్చిన వాననీరు — *అది సగిలి పారే చేను*
(2) సత్తువ—*అది సగిలిచేను*
(3) సత్తువ ఎక్కువ అగు—*ఆచేను సగిలి పారిపోయింది, ఇది సెబ్బరే* [నె]
సజ్జా = ప్రస్తుతమునకు — *సజ్జా దాన్ని ఎత్తుకపో* [నె]
సడబోయు = గోగులు మొదలైన పైరు, చాలులేకుండా చల్లుట, నిండుగా చల్లుట *గోగులు సడబోసినారు;* ఎదబెట్టు [నె-పొ]
సడాయించు=(1) దంచు
(2) విషయించు

(3) తిట్టు—బాగా సడాయించినాడు; సడయించు [నె]
సడింపులు=ఒకసారి దంపిన బియ్యము;
(2) దెబ్బలు [అ; బ]
(3) చివరన ఇంకొకసారి దంచవలసిన బియ్యము; సగం చేరుబ్లు
సణ్ణయ్య=పినతండ్రి; సన్నన్న
సత = తీవ్రప్రయత్నము — సత పోరినా ఆయన ఒప్పుకోలేదు [నె]
సత్కదీయు = దృష్టిపరిహారము తీసివేయు [మ]
సత్తరకాయ=భార్యాభర్తలకు అన్యోన్యత లేకయుండినను, కలిగిన సంతానము— సత్తరకాయ పుటినాడు [గో]
సత్తా = ఆర్థికస్తోమత — ఆయనదగ్గఱ ఇప్పుడు సత్తాలేదు [నె]
సత్తారు=అన్నపురాసి — పుట్టెడు బియ్యం వండి సత్తారు పోసినారు [నె-పొ]
సత్తికారు=రెండవపంట ధాన్యము [శ్రీ]
సత్తూరి=(చూ) చత్తూరి [అ-పె]
సత్తెమ్మ=శక్తిరాయి [చి]
సత్తేశము = దసరాలో విచిత్రవేషములు ధరించి బిచ్చం అడుక్కొనేవారు. దీనిని భిక్షం అనక ఇనాం అందురు [మ]
సదాటము=సమతలమైన ప్రదేశము; చదర కట్టునేల [కర్నూ]
సదును=(1) సమతలము - చదరము— కయ్యాను సదునుచేసినారు; చదును [నె-మెట్ట; వ; అ; తె]
(2) తేమ; సెమ్మ [అ]
సదునుచేయు=కొట్టు [వి]
సద్ది=అడుగురి [వి]
సద్దికంపు=(చూ) చద్దివాసన [కర్నూ]
సద్దిపీనుగ=ఎన్నడో చచ్చినది [అ]

సద్దులు = బతకమ్మ పండుగరోజు, పిండి చక్కెరతో చేసే అయిదు విధములైన పిండ్లు (పిండితో చేసిన పలహారము) [మ]
సద్దె = సొంతము — మాసద్దెతమ్ముడు; సయాము [అ]
సని=చల్లుటకు వీలగునట్లు విత్తనమునకు వచ్చు (మొలక) మోము; మొలక [కర్నూ ప. కొ]
సనుగొయ్యలు = బండిపరంమీది నాట్లు (కొయ్యలు); గుజ్జలు; సన్నుగొయ్యలు
సన్న=చిన్న — సన్నపంచె, సన్నచెంబు [మ]
సన్న = బరువు లేవనెత్తునపుడు ప్రక్కకు వేసి పైకెత్తు కఱ్ఱ — సన్నలేచి బండి కెక్కించండి, లివర్ [చి]
సన్నగాడు=ఒక ఊరిలో పేదకుటుంబీకుడు — సన్నగాండ్ర పశువులు; సన్నోడు [నె; అ]
సన్నజీవము=మేకగాని, గొఱ్ఱెగాని (చిన్నది అనుట) [నె, కర్నూ; అ; మ]
సన్నన్న=పినతండ్రి; సణ్ణయ్య
సన్నపోరగాండ్లు=చిన్నపిల్లలు [మ]
సన్నాలు = దేవుని రథచక్రాలు అటుఇటు పోకుండా అడ్డువేయు మొద్దు; చొప్పలు [తె]
సన్ని=సనికలురాయి [శ్రీ]
సన్నికల్లు సరసుడు=డాబులరాయడు [వి]
సన్నియ్యపొద్దు = మధ్యాహ్నము మూడు గంటలు [మ]
సన్నుగొయ్య = బండికి ప్రక్కల బిగించు గుజ్జు, (మేకు) సనుగొయ్య [నె-మెట్ట]
సన్నుబుడ్డి=పసిపిల్లలు పాలు త్రాగుటకు అనువుగా గొట్టము ఉంచిచేసిన చిన్న మట్టిగురిగి; పాలసీస [మ]
సపాయి=(1) సమము
(2) సమతలము [అ]

(3) పూర్తిగా తుదముట్టించు — దానిని సపాయి చేసినారు [నె]

సపారము = (1) ఇంటి వెనుక గోడకానించి ఏటవాలుగ గడ్డి ఆకులతో వేయు పందిరి; సప్పరము; చప్పరము [నె; మ]
(2) ఒకే ప్రక్కకు ఏటవాలుగా కట్టిన పందిలి; వరండా — సపారంలో కూర్చో [నె]

సపారు = వసారా; చిన్న పందిరి [చి]

సపెట్టు = వగబట్టు [నె-ఆత్మ]

సప్పరము = (చూ) సపారము [అ]

సబురు = (1) తడవ; పర్యాయము
(2) ప్రయాణము — ఒక సబురు కొట్టి వచ్చినాడు [నె; అ-పె]
(3) ఓడప్రయాణము [గో]

సబ్బండు = నానా జాతులు కలసిన సంఘము; వివిధ వస్తువులు కలిపినది — దాంట్లో సకల సబ్బండు కలిపినది; సకలసబ్బండు గోత్రానాం పుల్లమ్మ పుత్రానాం అని కోడిగపు చాటవ [నె, అ; తె]

సబ్బండు పెట్టు = బూతులు తిట్టు — సబ్బండు పెటి పంపివాడు [నె-పొ]

సబ్జా = తెల్లని పావురము [గు]

సబ్బీము = సగ్గుబియ్యము [అ]

సబ్బుబియ్యము = సగ్గుబియ్యము [సే]

సమళాయించు = (1) బుజ్జగించు, బ్రతిమాలు — బిడ్డను సమళాయించు
(2) కష్టమునుండి బయట బడుట, సమాళించు — ఆయన కాస్త సమళాయించు కొన్నాడు [నె]
(3) కాపాడుకొను — అన్నిటిని సమళాయించుకొను శక్తి [కరీ]

సమాళాయించు = (చూ) సమళాయించు; సమ్మాళించు; సంబాళించు

సముకు = ఉగ్గు గిన్నె [గ]

సయాము = సొంతము — నాకు ఆమె సయాము అక్క అవుతుంది; సద్దె [నె-పొ]

సయించు = రుచించు; ఇష్టమగు; సహించు; సగించు [కర్నూ]

సరం దప్పింది = (1) పొరబోయినది [మ]
(2) గొంతు ఎండినది

సరంబి = (1) దూలమునకు పనికి వచ్చు మొద్దు [వి]

సరకము = మలము

సరఖా = కన్నపు దొంగతనము [కరీ]

సరచు = (చూ) చెరచు [కర్నూ]

సరడు = దారమువలె నుండు బంగారు దండ; దీనిలో మంగళ సూత్రమును బిగింతురు [నె; కర్నూ; తె]

సరత = చెమట [అ; బ]

సరవడి = బరువు బండలను లాగుటకు ఉపయోగించు చక్రములు లేని మొరటు కొయ్య చట్టము [నె-మె]

సరవిచెట్టు = (చూ) చవకచెట్టు

సరాగాలు = సరదాలు; హాస్యములు; వినోదములు [చి]

సరానబడు = (1) కుత్తుక దగ్గఱబడు [కరీ]
(2) పొరబోవు [మ]

సరాసరి = (1) నేరుగా; తిన్నగా; చక్కగా — సరాసరిగా పో [నె; కర్నూ, తె; అ]
(2) సగటున; యావరేజ్ [నె]

సరి = గంజి [కర్నూ; తె]

సరి = (1) నిర్బంధమును సూచించు పదము — తప్పని సరిగా రావాల [నె; కర్నూ; అ]
(2) సమాప్తి; నాశనము — వాడంత రీతో సరి; బ్రతుకదు [వి; నె]
(3) బట్టలకు కంబళ్లకు వేయు గంజి [అ; బ]
(4) అడవిలో చిన్నబాట

(5) అగాధము

సరి అంబలి = చింతగింజలు, మొదలగు నవి కలిపి గొంగళ్లు నేయుటలో గట్టి కొరకు ఉపయోగించు అంబలి [మ]

సరిఒత్తు = (1) సరిజేసికొను
(2) రెంటిని పోల్చి చూచుకొను — *లెక్కలు సరి ఒత్తుకొంటున్నారు* [నె; అ; వ]

సరికిసరి బరికిబరి = సరిసమానం [వి]

సరిగ = (1) జల్తారు—*సరిగంచు పంచ* [నె; అ; తె]
(2) ఆభరణము; సరిగె [అ]

సరినాగు = అప్పుగా తీసుకొన్న ధాన్యమునకు సంవత్సరమునకు రెండింతలుగా ఇచ్చు వడ్డి ఎంటి ధాన్యము; సరికిసరి నాగు; నాము [మ]

సరిపట్టు = ప్రతిమాలుచు తిరుగు [వ]

సరిపించు = మొద్దువోయిన కత్తి మొదలగు వాటి వాదరను కాచి కొట్టి పదును వచ్చునట్లు చేయు— *గొడ్డలి సరిపించు కొనిరా* [కర్నూ; నె]

సరిపిణి = గొలుసు; స్త్రీల ఆభరణము [అ]

సరిబరి = సరిసమానము—*ఆ కోడెకు దీనికి సరిబరి* [నె-పొ, మ]

సరివి = (చూ) సరుగు, చవక [అ]

సరుకు = చవకచెట్టు; క్యాషురీన; సరుగు; సవక; సరుగుడు; సరివి [సర్కా]

సరుగు = (చూ) సరుకు [సర్కా]

సరుగుడు = సరుకుచెట్టు; (చూ) చవక [కర్నూ]

సరుడు = మెడలో ధరించు బంగారు నగ; సరడు [చె]

సరువు = వానజల్లు

సర్తు = చెమట— *ఒళ్లంతా సర్తుబోసింది* [అ]

సర్వసిద్ధి సరసులు = నెల్లూరి నెరజాణలకు (రావూరి రసికులు) సరిపోవు సరసులు [వి]

సల = చిన్న కాలువలలో కట్టెలతో కట్టిన అడ్డము. దీనిలో చేపలు వచ్చి చిక్కు-కొనును [శ్రీ]

సలగ = జంపైన, పొడవైన— *కోడె మంచి సలగపారుగా (పాటుగా) ఉన్నది* [నె-ఆత్మ]

సలప = వెడల్పు బండ చెక్క; సలువ; సల్వ [కరి]

సలపన = వలుచన

సలవరించు = నొప్పి పెట్టు [వి]

సలాకా = చువ్వ [కరీ]

సలింద్రము = ప్రేప; చలి పేంద్ర; చలి పందిలి [మ]

సలిపి = పేలినట్లు ఎఱ్ఱటి గుల్లలు గుల్లలుగా లేచి బాధించు సోకుడు వ్యాధి. ఇది మంత్రముతో నయమగును మంత్రమునకు ముందు నిద్ర చేయుట ప్రమాదకరము. ఒకే పేరు గలిగిన భార్యా భర్తలలో ఒకరు సున్నపు నీళ్లు సల్లిన గూడ ఇది తగ్గిపోవును; సలిపిరి; సలుపు [నె]

సలిపిరి = (చూ) సలిపి [కర్నూ]

సలుకు = (చూ) సలిపి; సలుపు [అ]

సలుగు = (1) మొరటువాడు [శ్రీ]
(2) నాగలికట్టు [కరీ]

సలుపు = (1) నొప్పి, బాధ— *ఈ కురుపు సలిపింది* [గో; తె; చి]
(2) చిన్నచూపు [నె]

సలువు = (1) నాగలి, బండి మొదలగు వాటిని వన్నునప్పుడు; కాడిని నొగ మొదలుకు దగ్గరగా కట్టినది. దీనివలన నాగలి నేలలో బాగుగ దిగును, బండి భారమగును × ఎలువు [నె; ప; అ]
(2) లఘుత్వము—*ఆయన బాగా నలువై పోయినాడు* [నె]
(3) చనవు [నె]

సలుసు = నొప్పిపెట్టు; దన్నులు [శ్రీ]

సలేంద్రి=చలివేంద్ర [అ; బ]

సల్వ=(1) కుమ్మరివాడు కుండలు మన్నగ చేయునప్పు డుపయోగించు కొయ్య [ప]
(2) పలుచని బండః సలప; సలుప [నిజా; మ]

సల్లాడము=చల్లడము, సల్లడము; నిజారు; పైజామ [అ]

సల్లిపురుగు=సాలెపురుగు

సల్తైము = పైత్యము వలన శరీరముపై ఏర్పడు దద్దురు [వి]

సవక = (చూ) చవకచెట్టు; సరుకు, సరుగుడు [నె]

సవడలు=రెండు అడుగులు వరకు పెరుగు మంచి నీటిచేపలు [శ్రీ]

సవర = (1) బంగారు సావరిణ, సవరస; సవరను
(2) చవుడుబారు — ఆ కయ్యి సవర బోయింది [నె]

సవరను=(చూ) సవర; సవరము [కర్నూ]

సవరసు=(చూ) సవర [వ]

సవళ=ఒక జాతి పందెపుకోడి [శ్రీ]

సవారి = రెండెడ్ల బండిపై ఎండ తగల కుండుటకు వేయు వెదురు దబ్బల గూడు [అ-పె]

సవారిబండి = మనుష్య లెక్కు బండి; సవారీ కచ్చరము; పెట్టిబండి [కరీ]

సవారి వేసిండు=చనిపోయినాడు [మ]

సవాల=పెద్దగొంగడి [మ]

సవుడు=చవిటినేల మన్ను; చవుడు [మ]

సవ్వ=(1) విత్తనాలు చల్లిన వెంటనే చేనిలో నిలిచిన నీటిని వాముటకు (బయటకు పంపుటకు) చేసిన సన్నకాలువ [నె]
(2) అసమర్థుడు [నె-పొ]

సవ్వన = జవ్వన; చప్పన — సవ్వాగా ఉన్నది [నె; వ]

సష్టిపంచ = (షష్టి పంచమి) సుబ్బరాయుడి షష్టినాడు బ్రహ్మచారులకు దానము చేయు చిన్న పంచె [అ]

ససవ=చవట [గ]

ససి = (1) నారు విత్తనములు (ససి) పోసిన కయ్యి; నారుకయ్యి; అకుమడి [అ]
(2) శక్తి—ససి చెడినది [గో, నె]
(3) రుచి—ససి లేదు [నె]

సళ్లు=(1) కుచములు,
(2) వదలు (Loose) —దారము సళ్లగా కట్టినారు [నె; శ్రీ]
(3) వానజల్లు—సళ్లుకొట్టింది [నె]
(4) కాళ్లు—సళ్లు విరగొట్టాడు [చి]

సళ్లగొట్టు = వాన జల్లు ప్రక్కలనుండి లోపలికి గొట్టు, జల్లుగొట్టు; చళ్లగొట్టు [నె; కర్నూ]

## సా



సాంగెము=(1) తక్కువ కులమువారి కుల కట్టుబాటు—అది శెట్టి సాంగెము
(2) తంతు; సంప్రదాయము: సాంగ్యము [నె; కర్నూ; అ; తె]

సాంగ్యము=(చూ) సాంగెము [నె; కర్నూ]

సాంబ్రాణి కడ్డీలు=అగరొత్తులు [చి; నె]

సాక=పిల్లలకు మశూచి వచ్చినప్పుడు ప్రతి అడంగ గుడిముందు పోయు మందు— నీరుసాక; కల్లుసాక [మ]

సాకుడుతల్లి = పెంపుడు తల్లి [నె]

సాగ = మేడి తోకకు ప్రక్కన అడ్డముగా బిగించు కొయ్య (చిల్ల) [నె-పొ]

సాగు = (1) మాట, లేక అధికారము చెల్లుబడి యగు—*సాగినవాడు; సాగితే పడమన్నారు, జారితే పడమన్నారు* [నె; కర్నూ అ; తె]

(2) సాగిలబడు [గో]

సాటవ = (1) సామెత; నానుడి; చాటవ [నె; కర్నూ; అ]

(2) బండి నొగపై గల చట్టము; చాటవ; చాటువ—*సాటవను బట్టుకొనే లాగివేసినాడు* [వ]

(3) ఒక జంతువు నిచ్చి దానికిగాను మరొక జంతువును (మార్చుకొనుట) తీసికొనుట; చాటవ; సాటువ [తె; అ- పె]

(4) పోలిక; సంబంధము—*దానికి దీనికి ఏమి సాటవ?* [అ; నె]

సాటింపు = గ్రామ దేవతల తిరునాళ్ల ప్రారంభమును గూర్చి గ్రామములో తెలియజేయుట; చాటింపు [కర్నూ]

సాటిమొలు = ఎల్లరకు తెల్లమగు మొలు [కరీ]

సాటువ = (1) (చూ) సాటవ; చాటవ; [నె; కర్నూ; వ]

(2) పైకప్పు లేని బోడకచ్చులము [కరీ]

(3) ఏదైన ఒక వస్తువు నిచ్చి మరొక వస్తువును తీసుకొనుట; మార్పిడి— *ఈ ఎద్దు సాటువ కిచ్చినాడు* [అ; పె; తె]

(4) పోలిక—*దానికి దీనికి ఏమిసాటువ?* [అ; నె]

సాతుకొయ్య = వసారాల కప్పుకు బిగించు నిలువు వాసము (కొయ్య) [నె]

సాతువాడు = గోనె పంచులు కుట్టువాడు [నె]

సాదము = ప్రసాదము; అన్నము (దీనిని వైష్ణవులే నాడుదురు. (ఇది తమిళము) [కరీ; నె]

సాదాత = జాగు [కృ]

సాదు = బొట్టు బెట్టుకొనుటకు పాగుగాచేసి ఎండబెట్టిన నల్లటి పదార్థము; దీనిని నీటి బొట్టువేసి చాది బొట్టు బెట్టుకొందురు (చాదునది)—*సాదుబొట్టు పెట్టుకొన్నాడు* చాదు [నె; వ]

సానిక = (1) అన్నము దిను కంచము [నె]

(2) పేడనీళ్లు [తె]

సానిమొయ్య = చుక్కలు చుక్కలుగా నుండు సముద్రపు చేప [శ్రీ]

సాన్పికుండ = ప్రతి ఉదయము ఇంటిముందు చల్లు పేడనీళ్లు కలుపుకుండ; కళ్లాపకుండ [మ]

సాపాటురాముడు = తిండికి దప్ప ఇతరమునకు పనికిరాని సోమరి [నె; కర్నూ; వ]

సాపు = (1) ఒకజతి—*పంచలసాపు;* చాపు [శ్రీ; నె]

(2) స్పష్టముగా—*ఉన్న సంగతి సాపుగ చెప్పు* [వ; నె]

సాపెన = శాపము [వి; కరీ]

సామంతము = గర్వము చూపుట; అహంభావము; టెక్కు [గ]

సామనలుపు = చామనచాయ [కర్నూ]

సామిని = గడ్డివామి; మేట [చి]

సామీను = గడ్డి మొదలగు వాటి మోపులను మట్టసముగ పేర్చినకుప్ప [నె-ఆత్మ]

సారగము = సేవకావృత్తి; అధికకృషి [కరీ]

సారవ = (1) కట్టడముకట్టునప్పుడు పనిచేయువారు గోడ ప్రక్కన నిలువబడుటకును, సామాను పెట్టుకొనుటకును అమర్చిన చట్టము (Scafolding) [నె; కర్నూ; వ

(2) వంతెన [రా; తె]

(3) చేర [అ]

సారసత్తులు=(1) బియ్యపుపిండితో చేసిన సేమియాలు

(2) ఆవిరిలో ఉడికించిన పిండివంట [అ]

సారువ=(చూ) సారవ; సార్వ [చి]

సాల = (1) వెన్నుగాడి ఎత్తుగానుండి రెండుప్రక్కల సూరు క్రిందికి దించిన పూరిఇల్లు; పాక [నె; వ]

(2) పరంజా [గో]

సాలిగ=తవ్వలో సగం [చి]

సాలు=(1) పొడవు, అంగసౌష్ఠవము కలిగి యుండుట—*అది సాలైన పసరము* [నె]

(2) పంక్తిక్రమము; చాలు [చె]

సాలువు=కొండ, ఏరు మొదలగు వాటి ప్రక్కన అనుకొని పొడవుగా సాగిపోవు ప్రదేశము; సాల్వు—*ఏటిసాలువున్, నము ద్రపుసాలువున* [నె; కర్నూ; వ]

సాల్వు=(చూ) సాలువు [నె; కర్నూ]

సాలుమూల=క్రమము—*సాలుమూలతెలిసి పనిచేయి* [నె]

సాలె = చదువులబడి (కన్నడ సంప్రదాయము); సాళ్లె [అ-దక్షిణ]

సాలేశ్వరము=చత్వారము, నలభై ఏండ్లకు కలుగు కంటిచూపు మసక (చాలిస్‌అంటే ఉరుదులో నలభై, ఆ వయస్సులో వచ్చు దృష్టిమాంద్యమును చాలిసి అన్నారు. ఇది ఈ పదభ్రంశము, ఇట్లే చత్వారమనగా నలువదిఏట వచ్చునది అనియే సూచన. సంస్కృతమున చత్వారింశతి అనగా నలభై) [చి]

సావడము=పామువలె పొడవుగా వలుచగా నుండు చేప; మలుగు [శ్రీ]

సావడి=రచ్చ; చావడి; సావిడి; [మ; నె]

సావోటి=హెచ్చు — *సావోటి డబ్బులు ఇచ్చినారు* [శ్రీ]

సాసవలు=ఆవాలు; సాసూలు [చి]

సాసూలు=ఆవాలు; సాసవలు [అ; సే]

సాహిత్యము=(చూ) మోయన—బ్రాహ్మణకులకు ఇచ్చు ఆతిథ్యము [వ]

సాళ్లె=బడి; పల్లెకూటము; సాలె [మ]

# సి



సింగంపుట్టి=మార్కెళ్లసీమ అనబడు పొదిలి దర్శి తాలూకాల ప్రాంతములో సింగంరాజు అధికారము సాగించి, ఒక క్రొత్త కొలమానమును తనపేర ప్రవేశపెట్టినాడు. దీనికి 30 చిన్నతూములు. దీనికంటె పెద్ద పుట్టిని ఆ ప్రాంతమువారు పల్లెపుట్టి అందురు [నె]

సింగిడించుకొను = ఒళ్లు విరుచుకొను—*ఎందుకంత సింగిడించుకోవడం* [నె-పొ]

సింగిణి=ఇంద్రధనుస్సు [మ]

సింగినాదము=(1) అసభ్యప్రవర్తనము—*అంతా సింగినాదం పడుతున్నావే.* సింగి-ఎరుకలసాని, సింగడిభార్య, ఆమె ఏకనాదము (ఒకేతీగ గల తంబురవంటి వాద్యము) మీటుచు సోదెచెప్పును; అట్టి నాదము లేక చేష్టయే యిద అనుట—సింగినాదం జీలకర్ర అనునది జంటపదము [నె; కర్నూ]

(2) పిల్లలఏడ్పు [అ]
సింగీతము = చేపలపట్టు వల [చి]
సింద = చింద; గొల్లి; ఆడుగురి [వి]
సిందోళ్లు = చిందువేయు (ఆట ఆడు) మాది గలు; వీరు సింద భాగవత మాడుదురు [కరీ]
సింపించుకొను = ఒకరు భుజించుట యందలి అయిష్టతను తెలియజేయు [అ; బ]
సింబారము = ముక్కుద్రాడుతో గూడ అలం కారార్థము పశువుల మూతికి కట్టి త్రాడు; సిగమోర; సింగిమోర [అ; బ]
సిగనము = మేలుజాతి వక్క [నె పొ]
సిగమోర = ఎద్దులకు అలంకారముగా మోరకువేయు అల్లకము; సింబారము [నె]
సిగినమాకు = మేలైన తమలపాకు [అ-పె]
సిట్టీగ = (చూ) చీకటీగ; చిన్నఈగ [అ]
సిట్టెపుతొట్టి = కంసాలి ఉపయోగించు కుంపటి [మ]
సిడి = (1) పోరుబెట్టుట [గో]
(2) పిల్లకాయలు తెలియని బాధలచే ఏడ్చి తలి తండ్రులకు కలిగించు చీకాకు — *ఇంట్లో సిడిగా వున్నది* (సిడి = జాత రలలో బలి పశువును వ్రేలాడ దీయు ఏతము (తలుము)వంటి కొయ్య చట్టము; సిడిమాను. దానిపైన ప్రాణి పడు అవస్థ వంటిది అనుట [నె; అ]
సిడెము = లోహ ఖండము — *అతడు ఇనుప సిడెము* [కరీ]
సితకలు = మాంసపు ముక్కలు; మాంసపు కండలు [శ్రీ]
సితిరి = గయ్యాళి [అ; బ]
సిదుగు = అల్లరి, కొంటెతనము [అ; బ]
సిద్ద = (1) చిన్న మట్టిపిడత; సిద్ది [శ్రీ]
(2) చిలుము [వి]
సిద్దవటం దోస = కరబూజ [నె]
సిద్దిలి = డెక్కలిజాతి [కరీ]
సిద్దె = బాగా బలిసిన మనిషిని వ్యంగ్యంగా సిద్దెకు సిద్దె అని అందురు [వ]
సిపాయి (1) వేరుసెనక్కాయలు, ప్రత్తి మొదలగు వాటిని తూచే కాటాలోని సిబ్బె (గోనె గుడ్డ]
(2) అసిమిసంచి [అ]
సిప్ప = (1) బండిచక్రము; గాలు, కల్లు
(2) కొబ్బరిచిప్ప [శ్రీ]
సిప్పసప్ప = నిర్విమర్శగా కొట్టుట — *అత డా బిడ్డను సిప్ప నప్ప కొట్టెను*; చిప్ప చప్ప [కరీ]
సిప్పగి = కుట్రపువాడు; దర్జీ
సిబ్బి = (1) అన్నంవార్చు చిల్లుల మూకుడు. మట్టిదిగాని, లోహపుదిగాని [వ; అ]
(2) తక్కెడతట్ట [అ]
(3) బియ్యము మొదలగునవి వడియబోసు కొనుటకు ఉపయోగించు పేళ్లతో అల్లిన బుట్ట, దీనిని పేడతో అలుకరు [నె; వ]
(4) చర్మమునకు కలుగు పొడ రోగము; సోబి
సిబ్బిరేకు = గంజి వార్చుకొను చిల్లుల తట్ట; జల్లి మూకుడు [శ్రీ]
సిబ్బె = (చూ) సిబ్బి [అ; బ; నె]
సిబ్బెము = ఒంటిచర్మముపై లేచు క్షుద్ర చర్మవ్యాధి; సిధ్మము [కరీ]
సిమాంతు = మొట్టమొదటిసారి — *సిమాంతు వస్తే వాణ్ణి తిట్టిండు; సిమాంతుకానిన ఆనవుకాయ కనక అందరికో ముక్క పంచిపెట్టాలె* [ప]
సిమ్మానూనె = కిరసనాయిలు; సీమనూనె [అ]

సిమ్మాదిరప్పన్న = (సంహాద్రిఅప్పన్న) ఆటోతు [వి]

సిరిచాప = (చూ) చిరిచాప, చిఱుచాప; [నె; కర్నూ; తె; అ]

సిరిచుక్క = వీధిబడులలో పిల్లకాయలు తెల్లవారకముందే బడికి వచ్చేవారు. మొదట వచ్చినవానికి సిరి, రెండవవానికి చుక్క అరచేత బెట్టునవి. ఆ తర్వాత వచ్చినవారికి 3 మొదలు, వరుసప్రకారము బెత్తముతో అన్నేసిదెబ్బలు కొట్టుదురు [నె; కర్నూ; వ]

సిరులు = గ్రామదేవతల జాతరులు—ఎల్లమ్మ సిరులు [శ్రీ]

సిళ్లులు = కోపము [వి]

సిలలు = (1) దారులింగములు (పోతురాజు, పోలేరమ్మ మొదలగునవి)

(2) సంసారుల అపర క్రియలలో పూజకు నెలకొల్పు ఇటుకరాతి లింగములు. వీటికే ఆదరింపుగా పోయు కన్నీళ్లు అను నీటి అభిషేకము చేయుదురు. [నె]

(3) దేవతలను భావముతో నుంచిన రాళ్లు; శిలలు [నె-పొ; గో]

సిలలునిలుపు = సంసారుల అపరక్రియలలో ఒక ప్రధానమైన క్రియ [నె]

సిలువేరు = కొట్టవచ్చినట్లుండు ఎఱ్ఱరంగు; ముదురు ఎరుపు—అమె సిలువేరు చీరె కట్టింది [కరీ]

సిసలు = (1) వంశమూలము—సిసలు మునిగెను [కరీ]

(2) మేలైన—సిసలైన పంట [కరీ]

(3) అప్పటమై; యోగ్యమైన—సిసలైన మనిషి [నె]

(4) సరియైన; సక్రమమైన కొలతగాని లెక్కగాని—సిసలైన తూకం [నె]

సిసింద్రీ = చురుకైన [శ్రీ]

# సీ



సీకరణి = అరటి, మామిడివంటి ఫలములు తరగి చక్కెరవేసి చేసిన ఫలాహారము [అ]

సీకులు = సలాకలు [కరీ]

సీతాకుండ = దృష్టిదోషము తొలగించుటకై మున్నముపూసి నల్లని చుక్కలుంచెడి కుండ; దిష్టికుండ [చె]

సీతారామకోరుట = కళకళలాడు [గు]

సీతాళాలు = తట్టు అను స్ఫోటకము (Chicken pox) [అ]

సీదరిచ్చుట = అసహ్యముపొందుట; చీదరించుట [మ]

సీదారము = ఛిద్రము [కరీ]

సీపెముత్తెము = అసలు ముత్తెము, ఆణిముత్తెము [కరీ]

సీబావి = మంచినీటిబావి [అ-దక్షి]

సీబిల్లి = పిల్లి [అ; బ]

సీమనూనె = కిరసనాయిలు [అ]

సీరా = (1) సత్యనారాయణ ప్రసాదముగ గోధుమనూకతో చేయు తీపిపదార్థము [వి]

(2) హల్వా [చి]

సీల = చీల [కరీ]

సీలుఆగు=కోలుకొను [కర్నూ]
సీసాలోకిదించు = పూనిన దయ్యమును మాంత్రికుడు మంత్రాలచే వదలించి, ముగ్గు మధ్యబెట్టి యుంచిన ఒకసీసాలోనికి దిగునట్లు చేయును. ఆవల దానికి గట్టి బిరడా బెట్టగా దయ్యపు పీడ అంతటితో వదలి పోవునని విశ్వాసము, బిరడాబెట్టు అని గూడ అందురు అనగా-పీడ వదలించు అని అర్థము [నె]
సీళ్లవేయు=ఊలవేయు [సే]

# సు



సుంకరి=ఊరిబంట్రౌతు [కరీ]
సుంకరోడు=ఊరుకావలి కాచేవాడు; కావలివాడు [మ]
సుంకు = (1) అమ్మవారు పోసి దిగుతున్నపుడు పెసలు ఉడికించి తట్టలోపోసి పోకినవ్యక్తి ఎదురుగ చెరగి పంచిపెట్టు గుగ్గిళ్లు [చి]
(2) బాధ—*వాడిసుంకు వదిలింది* [వి]
(3) తగువు—*సుంకు తెగగొట్టు* [శ్రీ]
(4) మొగలిపువ్వులోని రజము
(5) వరిగింజ పువ్వు — *సుంకురాలిపోయింది* [నె; తె]
(6) మదము — *ఆతనిసుంకు లుడిగినవి* [కరీ]
సుంకులు=పెండ్లికి ముందు ముత్తైదువులు దంచు వడ్లు [అ]
సుంగుడు = (1) మిగతశేషము; లాభము; చింగుడు [చి]
(2) వడ్డి [నె-వెంకటగిరి]
సుకమంచి=కన్యాశుల్కముతోపాటు ఇచ్చు ఇబ్బడిబియ్యము పప్పులు, నేయి వగైరా సంబారము; సుగమంచి; సుగుమంచి [అ]
సుకి=లోన తీపిపదార్థము పూర్ణమునుంచి కాల్చెడియుండ; బూరె; తినుబండారము; సుఖియ [చె; నె]
సుక్కా = వేయించిన మాంసము; చుక్కా [అ]
సుగమంచి=పెండ్లికూతురుకు ఇచ్చుఓలితో బాటు వెంట పంపు ధాన్యము [నె-మెట్ట; అ]
సుగమంచివారు = రెడ్లలో ఒక తెగవారు [చి]
సుగాసి=కష్టమోర్వలేని--*సుగాని ప్రాణము* [అ-పె]
సుగీలు=తినుబండారములు (చూ) సుకి [చి; నె]
సుగుంటలు = పూర్ణముతో చేసిన ఫలహారములు [చి; అ-పె]
సుగుమంచి=(చూ) సుగమంచి [అ]
సుగ్గి=పంట మార్పిడికాలము; మహసూల్ [అ-పె; తె]
సుగ్గు=రక్తవిరేచనము [చి]
సుట్లు=(1) తాగేచుట్టలు
(2) మెట్టెలు [మ]
సుడి=(1) తమలపాకుల చిన్నకట్టలు (పిడి-పిళ్లు) బెట్టికట్టిన పెద్దకట్ట [నె]
(2) కట్ట; మోపు—*జనపనార సుడి* [గో]
సుడిగాడు=శ్మశానము; సుడుగాడు; సుదుగాడు [సే]

సుడిదలు = బాలింతల పాలరొమ్ములకు (స్తనములకు) పావల తల తగిలినందున పాలు చేపకపోవుట [మ]
సుడియ = కన్య [సే]
సుడివెంట్రుకలవాడు = దౌర్భాగ్యుడు,పొరక సుడి ఉండిన పశువుకు సెబ్బరను గూర్చు నట్లు యీతనికి యీసుడి లేకున్నను ఉన్నంత (వెంట్రుకల వలయము) చెడు పును కలిగించు ననుట — *వాడు వటి సుడివెంట్రుకలవాడు* [నె, అ]
—*వాడికి గుద్దలో సుడి ఉన్నది*[వ; నె]
సుడుగాడు = శ్మశానము; సుడిగాడు [సే; అ; బ]
సుడెండ = మధ్యాహ్నము, తీక్షణముగ సూటిగా వడు ఎండ [అ]
సుడెము = దీపావళి పండుగలో వెలిగించి తిప్పుటకు చొప్పతో కట్టబడిన పంజు [నె-మెట్ట]
సుణ్ణంగి = చూడలేనితనముగలవాడు
సుత = (1) కూడ — *అతడు సుతరాలేదు* [కరీ; వ]
(2) మొదలుకొని — *అది సుతా ఆయన రావడంలేదు* [నె; వ; గో]
సుతారము = నాణ్యం [మ]
సుతారి = నేర్పరి [కృ]
సుత్రాము = పూర్తిగ — *అస్సలే నాకైతే సుత్రాము ఇష్టంలేదు* [మ]
సుదారి = నిర్వహించి [అ, బ]
సుదిని = పక్కపై పరిచే దుప్పటి [వ]
సుదుగాడు = శ్మశానము: సుడుగాడు; సుడిగాడు [అ]
సుదుము = ఎక్కువగా నలిగిపోయిన గడ్డి [నె]
సుద్ద = (1) ఒకరకపు తెల్లని గట్టి మట్టి, వీధిలో ముగ్గు లిడుదురు [కరీ; నె]
(2) మూత్రముగుండా బయటబడు తెల్లటి పదార్థము, ఇది ఒకవ్యాధి—*సుద్దబడి బల హీనమైనాడు* [నె]
సుద్ది = (1) వార్త
(2) ఎరుకలసాని చెప్పు జోస్యపుమాటలు
(3) పాటగా చెప్పు వీరుల కథలు [అ;నె]
(4) విషయము;జోలి—*నాసుద్ది నీకెందుకు*
సుద్దీ = పూర్తిగా, సుతరామూ — *నామాట సుద్దీ వినడు* [అ; బ]
సుద్దులు = నేరణాలు [కరీ]
సునాతి = సౌకుమార్యము—*హారతి తీసి కొంటే ఉష్ణం; ప్రసాదం తీసికొంటే పడిశం వచ్చే కుసుమకోమల శరీరుల యొక్క తత్త్వము* [అ; బ]
సున్నకు సున్నహళ్లికిహళ్ళి = ఏమియు మిగులలేదనుట [అ, నె]
సున్నపుకాయ = (1) ఇండ్లలో తాంబూలపు సున్నముంచుకొను మట్టిముంత, ఇది అనేక ఆకృతులతో అందచందముగజేయ బడియుండును [నె; కర్నూ; అ]
(2) కోడిగ్రుడ్డు [ప]
సున్నపుగురిగి = (చూ) సున్నపుకాయ [వ]
సున్నిబిండి = (చూ) సున్నుబిండి [కర్నూ]
సున్నుండ = మినపపిండి, నేయి పంచ దారలో చేసిన మిఠాయి [వి]
సున్నుబిండి = పెసలు, కచ్చూరాలు మొద లగు సుగంధద్రవ్యములు కలిపికొట్టిన బియ్యపుపిండి. దీనిని స్నానములలో ఒళ్లు రుద్దుకొనుటకు ఉపయోగింతురు, సున్నిబిండి; సున్నిపిండి; నలుగుపిండి [నె; తె; గో, వ]
సుబ్బి = (చూ) సోబి; సుబ్బెరి [అ]
సుబ్బెం = (చూ) సోబి; సుబ్బి [వ]
సుమాది = సోమరిపోతు [శ్రీ]
సుమారు = నాసిరకము; నమ్మరాని [అ]
సురకాయ = సొరకాయ; అనపకాయ [కరీ]

సురకాయలునరుకు = వ్యంగ్యముగాకోతలు కోయు [కరీ; నె]
సురతాణిబొమ్మ = నేర్పుకల అందక త్తె [తూ-గో]
సురిగ = (చూ) సులగ [వ]
సురిగె = బరిగె [కరీ]
సురిగెను = ఏగెను [సే]
సురుముకొను = (1) నిప్పుసెగకు వెంట్రుకలు కాలి చుట్టచుట్టుకొనిపోవు
(2) బీటిగడ్డి బాగా ఎడిపోవు (కాలిన వెంట్రుకలవలె) — *వానలేక గడ్డంతా సురుముకొని పోయింది* [నె; అ]
సురుసుకొను = (చూ) సురుముకొను [నె-పొ]
సులగ = చెట్టు లేతకొమ్మ; సువ్వ; సెలగ [నె]
సులిగిరి = చర్మవ్యాధి, ఇది రేగిముల్లు తాకించిన పోవును; సుల్లచుండు [మ]
సులుగు = సన్నటికఱ్ఱ (వంచిన వంగగలది) బడిపిల్లలను కొట్టుటకు ఉపయోగించు బెత్తంవంటిది) సువ్వ. బెత్తము [మ]
సులువు = సమపాళము — *గోడలు సులువు చేసిరి* [కరీ]
సుల్లకూత = అబద్ధము [కర్నూ]
సుల్లచుండి = ఎంగిలిదద్దు [అ]
సుల్లజుండు = గుండ్రముగా దురదతోఏర్పడు చర్మవ్యాధి (Ring Worm) [నె]
సుల్లల సుభద్ర = రంకుటాలు [వి]
సుల్లాయికూతలు = (చూ) చుల్లాయిమాటలు [నె; గో]
సుల్లాయిమాటలు (కూతలు) = (1) అసూయతోకూడిన ఎత్తిపొడుపుమాటలు.
(2) అపనిందావాక్యములు — *ఆయన కంతా సుల్లాయిమాటలే;* సుళ్లు; సుళ్ల కూతలు [నె; గో]
సువ్వ = (1) పొడుగుగ సన్నగనుండు కఱ్ఱ; దోటి [మ; వ]
(2) పొడవుగా సాగిన లేతకొమ్మ; సెలగ [నె]
సువ్విపాట = ప్రథమ రజస్వలకు వేడుకగా పాడు పాట — సువ్వి *"సువ్వాలలే" అని పల్లవి* [నె]
సుళువు = (1) కిటుకు [అ]
(2) సులభము—*అవని సుళువుగా చేయవచ్చు* [నె]
సుళ్ల = (చూ) (1) సుల్లాయి మాటలు; సుళ్ల కూతలు; సుళ్లమాటలు [కర్నూ]
(2) అబద్ధము; సుళ్లు [కర్నూ]
సుళ్లకూతలు = (చూ) సుల్లాయి మాటలు; సుళ్లమాటలు [కర్నూ]
సుళ్లు = అబద్ధము; సుళ్ల [అ-దక్షి]

## సూ



సూంతి = అపనింద, కళంకము; లోకువ [అ; బ]
సూక = వేపుడు; ఇగురు [సర్కా]
సూకరాలు = (1) సుకుమారతలు
(2) విడూరములు [గ]
సూగుర్లు = పాత నాణెములు [మ]
సూజీ = రవ్వ; సూక; సొజ్జి; సోజి
సూదిగొంతు = సన్నగా ధ్వనినిచ్చు గొంతు —*సూదిగొంతు వానకడుపు అని ఆపహాస్యము* [నె]

సూను = శనగపిండితో చేయు వ్యంజనము [కరీ]

సూన్యము=(చూ) చేతబడి [అ; నె]

సూరు = (1) ఇంటి కప్పు క్రింది చివరి భాగము [నె; వ, అ]

(2) తాటి ఆకుతో ఇంటి కప్పు కుట్టునప్పుడు బిగించుటకుగా సూరుకోటు దబ్బకు క్రిందినుండి అందించు గట్టి నారపట్ట — *సూరు అందించే మనిషి లేడు* [నె; అ]

సూరుకోటు దబ్బ = ఇండ్లు కప్పునప్పుడు, ఆకును బిగించుటకు గుచ్చి, కట్టు తడపను పైకిలాగు (కంట్యాణివలె) ఉపయోగించు ఇనుపకోల [నె]

సూరుపోయు = తలనుక్రిందుగా నుంచి నీటిలోనికి దూకు [అ; బ]

సూర్యుడు, చంద్రుడు = పాపటకు ఈవల ఆవల పెట్టు నగలు [మ]

సూల = (1) ఇటుకరాయి కాల్చుటకు పొడవుగా, క్రింద మంట వేయుటకు పొవ్వుల వంటి కంతలుబెట్టి పేర్చినది, చదరముగా పేర్చిద దానిని బట్టి అందురు—*సూలలో నిప్పేసినారు* [నె; వ; అ]

(2) శూల; ఘాత; వెన్నుపోటు [గో; వె]

(3) పూస, ఇది పాటినేలలో దొరకును. స్ఫటికము వలె మెరయుచుండును—*ఆ సూలదండ వేసుకొన్న ముసలామె ఎవరు ?* [నె-పొ]

సూసకము = వివాహ సమయాన వధువు తలపై నలంకరించు పూవుల కూర్పు [అ; బ]

సృజన = చేసిన కర్మ; జాయమానం. —*ఇంతకూ వాడి సృజన అట్లా ఉన్నది* [గో]

# సె



సెద = రుసుము [వి]

సెన=(చూ) జన [స]

సెనాపతి = బట్టల నేయువాడు [శ్రీ]

సెమ్మె = దీపస్తంభము [నె]

సెయికోలు = కుడిప్రక్క; చెయికోలు [అ]

సెల = (1) వాగు మొదలు, మూలము

(2) చలియ [నె-ఉదయగిరి; తె]

(3) కురుపు ఒకచోటమాని మరియొకచో బయలుదేరుట—*ఆ కురుపు సెలవేసింది* [నె, గో; అ]

(4) పండ్లు, కాయలు కొన్నప్పుడు నూటికి పైన లెక్కలోనికి రాకుండ వేయుకొసరు కాయలు; కొసరు [మ]

సెలంబులవారు = చేతి అందియలతో నర్తించువారు; కావడిపాటను పాడుదురు. సిలంబు అనగా తమిళమున అందియ [చి]

సెలక్కాయ = వేరుశనగకాయ [వి]

సెలగ = (1) లేతకొమ్మ [నె]

(2) ధాన్యమును కొలుచునప్పుడు 20; 50 మొదలగు సంఖ్య వచ్చినప్పుడు, ఆ సంఖ్యకు బదులు చెప్పు సంకేతపదము, పందొమ్మిది సెలగ అని చెప్పి, మరల ఒకటితో కొలత గాని, లెక్కింపుగాని ప్రారంభింతురు [అ; వి]

(3) 80 కుంచాలు [వ]

(4) బత్తె [అ]

సెలగబాబు=(1) పుచ్చేబుట్టు
(2) వంశము అతిగా విస్తరిల్లు [కరీ]
సెలగా=శలాకవలె, వంకరలేని [కర్నూ]
సెలగు=చిన్న మండలను చెండుట [కరీ; నె]
సెలగొట్టు = ముల్లు ఒకచో గుచ్చుకొని, అందులో కొన్ని దినములుండి మరొక చోటినుండి బయటికి వచ్చు [వ]
సెలగోల=కొరడా; చలకోల [చి]
సెలపెయ్యి=కట్టుకొబు పెయ్య [కరీ]
సెలబారు=పుండు చుట్టును గుల్లలు మొలచి, పుండు వ్యాపించు — *అది సెలబారి తెగ టూరి పోవైతి చంద్ర* (మనుచరిత్ర); సెల వేయు [అ]

సెలలు=(చూ) సిలలు [చి]
సెలవు=వ్యయము — *ఎక్కువగా సెలవు చేసినాడు* [నె; చి; గు; అ]
సెలవేయు-సెలపోయు = కురుపు చీము కూడి నొప్పి కలిగించు — *కురుపు సెల వేసింది* [నె; మ]
సెలువు=దీర్ఘకాలానంతరము అనుట — *ఎంతో కాలానికి సెలువుగా యిప్పుడు చూచినా;* సెలవు [నె]
సెవత్తకారి=నెరజాణ; చమత్కారి [వి]
సెవ్వ=సీ+అవ్వ = ఆడవాళ్లు ఇంకొక స్త్రీని సంబోధించు పదము — *సెవ్వా, ఎట్లున్నావు* [కరీ]

## సే



సేకు=గోగునార [వి]
సేకునేల=గడ్డి బలిసి దున్నుటకు కష్టమైన నేల; చేకునేల [గు]
సేకె = గింజలను రాల్చి చిక్కుపడని వరి గడ్డిమట్టి, మట్ట [గు]
సేత=వ్యవసాయము [కరీ]
సేతవ=(1) కృషి
(2) ఏదైనా పని, సేదవ [తె· నె]
సేతబడి=(చూ) శాతబడి [కరీ]
సేతాళము=చేతబడి, శాతాళము [కరీ]
సేదరం మాదరం=చిరాకు; చీకాకు [మ]
సేనాపతి=సాలివాడు [వి]
సేరిదారుడు = భూస్వామి భూములను సాగు చేయించువాడు; పండించిన పంటలో ఇతనికి భాగముంచును, సెల్లూరిలో తలమనిషి వంటివాడు [మ]
సేరు=(చూ) చేరు [అ, నె]
సేర్లు=కావడిమట్టు తాళ్లు [నె]
సేరుకు సవాశేరు=ఎత్తుకు పై ఎత్తు [తె]
సేలు=పురుషార్థము [కరీ]
సేవ - దేవునికి జరుగు వాహనోత్సవము— *ఈ దినం రంగనాయకుల గరుడ సేవ; రావణాసేవ* [నె; దక్షిణ; కర్నూ; అ; తె]
సేసలుబోయు = వధూవరులకు, పెండ్లి పీటల మీద నే కంకణ విసర్జనమునకు ముందు, పెండ్లిపెద్దలు ముగ్గురు, మూడేసి పిడికిళ్ల తలంబ్రాలు (=సేసలు) వధూవరుల ముందు పోయునది [నె]

# సై

సై = సిద్ధము—సై అంటే సై అన్నాడు [వ]
సైగొట్టు = అన్నది కాదనక అంగీకరించు; ఊకొట్టు; బలకొట్టు [మ]
సైగ్గా = నిశ్శబ్దముగా; తెలియకుండ; సైగగా —ఆమె సైగ్గా పోయింది [నె; అ; తె]
సైజేయు = సిద్ధపఱచు [కరీ]
సైదాపురం = మొద్దు మనిషి; మందబుద్ధి—సైదాపురములో దొరుకు మొద్దు రాతిచిప్ప వంటి వాడనుట (చూ) రాతి చిప్ప-పోరా పుంగనూరు (పిచ్చివాడా) అన్నట్లు మోసమునకు కుంబకోణ మన్నట్లు ఆయా స్థల ప్రాశస్త్యమా - నిందనో బట్టి వాడుకలోనికి వచ్చుమాట [నె]
సైయిగా = (చూ) సైగ్గా [నె]
సైసూడు = రుచిజూడు, చవిచూడు [మ]



# సొ

సొంరా = లారీకట్టు [కరీ]
సొండిగలు = వడియాలు [అ]
సొండెలు = చుండలు, గుడాలు; గుగ్గిళ్లు [మ]
సొండేలు గొడ్డు = అప్రయోజకుడు [వి]
సొగయు = ఇష్టపడు [నె-పొ]
సొగిలి = తిక్కవాడు—బుద్ధ సొగిలివాడు
సొజ్జి = సోజి; నూక; రవ్వ
సోటు చేయు = భోజనమునకు సిద్ధము చేయు, పీటలువేయు [మ]
సొట్ట = వంకర — అక్షరములు సొటగ నున్నది [అ]
సొట్టు = (1) నెపము, సాకు; సొడ్డు [అ] (2) లొట్ట [మ]
సొడసొడ = జొట జొట (నెత్తురు కారుట యందలి ధ్వన్యనుకరణం) [కరీ]
సొడలు సొడలువోవు = ఆకలిచే సొక్కి సోలిపడు [కరీ]
సొడ్డు = సాకు; నెపము—దానికొక సొడ్డు బెట్టినాడు; సొట్ట [నె]
సొతిక = పడిలో నాల్గవ భాగము [చి]
సొత్త = (1) గింజలులేని కాయలు— సొత్త కనకాయలు (2) పల్లము; సొట్ట [చి]
సొత్తికూర = ముల్లంగికూర [శ్రీ]
సొత్తి దుంప = ముల్లంగి దుంప [వి]
సొద = (1) ఒకరి కష్టములను ఇంకొకరితో విసుగు బుట్టునట్లు చెప్పుకొనునది; సోద —ఆయన ఏదో సొదచెప్పి పోయినాడు [నె; కర్నూ] (2) దుఃఖము; గోడు [అ, తె]
సొదజొచ్చు = అగ్ని ప్రవేశము చేయు; సతి [అ]
సొదబోవు = ప్రాణము సొమ్మసిల్లి పోవు [గు]
సొన = (చూ) జన [అ]

సొన = (1) వాగర్తన (సముద్రతీరమున) ఇసుక తిన్నెలనుండి పుట్టి, బుగ్గవలె నిరంతరాయముగ, జాలువారు నీటి జల కాలువ — *అ సొన క్రింద యాభై ఎకరాలు పారుదల* [నె; గు]
(2) మామిడి మొదలగు కాయల తొడిమ త్రుంచగానే కారు వస నీరు [నె; కర్నూ]
(3) పుండునుండి కారు రసిక [వ]
(4) చేవ గుడ్లు — *చేవ సొన లేక చేవ జొన* [గో: చి]
(5) కోడి గ్రుడ్లు నుండి కారే నీరు వంటి ద్రవము [గో; అ; చి]
(6) పనస మొదలగు వాటి తొన [శ్రీ]
(7) నవ, జిల [చి]

సొమ్ములు = పశువులు; గోగణం [శ్రీ; వి]

సొమ్ములకాపు = పసులకాపరి

సొర = (1) సముద్రపు పెద్ద చేప. దీని ముక్కు, ఇరుప్రక్కలా పండ్లు గలిగిన ఒక రంపమువలె పొడవుగా నుండును. ఇది ఈ ముక్కులో ఇతర చేపలను నరికి వేయు భయంకర జలజంతువు. దీని చమురు మందులకు ఉపయోగింతురు. దీనితోక కరకైన కొరడావలె ఉపయోగ పడును. (Shark) [నె; వ]
(2) గాయము తడిసినపుడు చేయు నొప్పి — *ముల్లు గుచ్చుకొని, అది సొరపోయినది*
(3) ప్రాణము శోషబోవు [పా]

సొరకాయ = ఆనపకాయ, సొజ్జకాయ [నె; రా; తె]

సొరకాయలు కోయు = డంబాలు చెప్పుకొను — *సొరకాయలు బాగా కోసేవాడు* [నె]

సొరడ = (1) చిన్న తొడకురుపు గడ్డ [శ్రీ]
(2) ఒకటే ధోరణిలో చెప్పిన విషయమునె చెప్పుట — *వాడిదంతా ఒకటే సొరడ* [నె]

సొరపోవు (వేయు) = (1) చుట్ట మొదలగు వాటికి ఒకతట్టు నిప్పు ఎగప్రాకిపోవు — *చుట్ట సొరపోయింది* [నె; వ]
(2) గుంపులో నెట్టుకొని పోవు — *వాడు సొరేసుకొనిపోయినాడు* [నె; గు]
(3) వాననీళ్ళకు పొలము కాలువలుగా కోసి కొనిపోవు — *చేనంతా సొర కోసుకొనిపోయింది* [నె; వ]
(4) గొంతు ఎండిపోవు — *గొంతు సొర పోయింది* [వ; కరీ]

సొరబడి = (1) వంశక్రమము — *అది వారి సొరబడి*; చాలు; ఆజాము [అ-పె]
(2) స్వభావము — *వాళ్ల సొరబడి మంచిది కాదు* [చి]

సొరికె = దొన; గుహ [కరీ]

సొరుగు = (1) చూరు క్రింది భాగము — *మేజా సొరుగు* [చి]
(2) టేబుల్‌లోని డ్రాయరు — *సొరుగులో పెట్టు* [నె]

సొరుపు = అంటు; పొరుపు [కరీ]

సొరెక్కు = ఏదైన మాటుగా గొంతులోకి పోయినప్పుడు దగ్గువచ్చు [అ]

సొజ్జకాయ = ఆనపకాయ; సొరకాయ [కర్నూ; శ్రీ]

సోండేలుగాడ్సు=వ్యర్థుడు [వి]
సోంబేరి=సోమరిపోతు—*వాడు సోంబేరై పోయినాడు* [నె-దక్షి; చి; తె]
సోకుమొకాలు=రాజకీవులు [కరీ]
సోగ=(1) కోల; అండాకారము (Oval)—*ఆమెది సోగమొగము* [నె]
(2) పొడవైన; సోగు [కరీ; నె]
సోగు=పొడవైన; సోగ [కరీ, నె]
సోడిదేవు=(1) అప్రయోజకత; కొఅగాని తనము [అ]
(2) పనినుండి నిలిపివేయు—*వాడిని సోడి దేవు చేసినారు* (చోడదేవ్) [నె]
సోడు=సోలెడు [కరీ]
సోడ్డు=మొట్టికాయ [వి]
సోద=(చూ) సొద [కర్నూ]
సోదా=పనిబాటలేక తిరుగువాడు. నీతిలేని విలాస పురుషుడు; షోదా — *వాడు వట్టి సోదా* [నె; వ]
సోదె=వినుగెత్తించు మాటలు—*ఏదో ఒక సోదెచెప్పి పోయినాడు* [నె; కర్నూ, వ]
సోన=(చూ) సొన [నె-వాగర్త; వ; అ]
సోనె=చనువుతో స్త్రీలను అను మెత్తటి తిట్టు—*దా నమ్మ సొనె గదవె* [నె]
సోప=క్షోభ—*నీసోప ఏమిటి చెప్పు* [నె-పొదిలి]
సోబి=(1) చాకలి ఉతుకునప్పుడు చేయు శబ్దము [చి]
(2) దేహముమీద ఏర్పడు బూజరవంటి చర్మవ్యాధి; సుబ్బెము [నె]
సోమసూత్రము=గోకర్ణము [గు]
సోమిడి=ఒక బాలవ్యాధి మూడేళ్ల దాటని బిడ్డలను స్త్రీలు ఋతుస్నానమాడిన వెంటనే చూచినచో పిల్లలు ఎండిపోదురు. దీనిని సోమిడి తగిలినది అందురు [వ]
(2) చిన్నపిల్లలు ఏదో గాలి తాకుడువల్ల చిక్కి సన్నగా అగుట; పక్షిదోషము [మ]
సోల=(1) చిన్న కొలపాత్ర [నె-మెట్ట, తె; అ]
(2) తవ్వలో సగము [గో]
సోలకము = సముద్రపుగాలి — *సోలకం దగిలితే టెంకాయచెట్లు బాగా ఎదుగును* [నె-వాగర్త]
సోలజేయు = (1) మాటలతో, చేతలతో ఎదుటివానిని జేలుపుచ్చు; లోబరచుకొను; సోలించు—*ఆయనను సోలజేసివేసినాడు* [నె, వ]
(2) ఓడించు [తె; అ]
(3) వదలుచేయు — *వాడి గుద్దసోల చేసిండు* [వ]
(4) ఉబ్బించు; పెద్దదిచేయు — *పొగిడి వాడి గుద్దసోల చేసినాడు* [నె]
సోలిగాడు=అనామకుడు—*ఎరుకల సోలి గాడు; ఒక సోలిగాడు* (వ్యంగ్యముగా) [కరీ]
సోలు=(1) చండాలుడు [వి]
(2) ఓడిపోవు [అ; బ]
సోలుపు=వరుస (చూ) సాలుపు [చె; అ]

సౌండు = అబోతు [గ]
సౌటు = పగటు [కరీ]
సౌతు - గ్రామఉమ్మడి పనికిరానివానికి బెట్టు వెలి; అంశ [నె]
సౌదా = సామాగ్రి [కరీ]
సౌరముగా = ఒక క్రమములో [కరీ]
స్త్రాంబాళము = పళ్లెము [నె]
స్వాతికొంగ = స్వాతికార్తెలో వచ్చి వరి చేలలో వ్రాలియుండు తెల్లటి కొంగజాతిది. ఇది జనవరితోగూడ ఎక్కడికో ఎగిరి పోవును. కోకిల, ఆరేటిబాతు, సీరుకాకి మొదలగు జలపక్షులవలె ఇది ఋతువును బట్టి దేశాంతరములకు ఎగిరిపోయి తిరిగి వచ్చు పక్షిజాతికి సంబంధించినది (Climate Changing Bird) [నె; వ; అ]
స్వాధీనాడుమానము = భూమిని అడుమాన బెట్టి (తాకట్టు; ఆయకం;) తనఖా డబ్బు తీసికొని, ఋణముతీరువరకు ఋణదాత స్వాధీనములో ఆ ఆస్తిని ఉంచునది; తీరు భోగ్యము [నె]
స్వాన = ఆశ [శ్రీ]
స్థితిమంతుడు = బాగా డబున్నవాడు [అ; నె]
స్వాష్ఠ = చౌక [శ్రీ]



హండా = పెడల్పుమూతిగల లోహపాత్ర; అండా [తె]
హంసనత్తు = హంసఆకారముతో చేసి, క్రింది ముత్యాలు వ్రేలాడగట్టిన ని ? [మ]
హద్దూపద్దూ = నీతి నియమము; అద్దూపద్దు *హద్దూపద్దూ లేకుండ వ్యవహరించినాడు* [కర్నూ; నె]
హరాయించుకొను = (1) అపహరించుకొను (2) దక్కించుకొను [అ]
హరిగిలి = (చూ) అరిగిండ్లు, పుట్టి [కర్నూ]
హళ్లి = లెక్కలలో శూన్యస్థానమును తెలుపు గురుతు. సున్నకు విలువ ఉన్నది, దీనికి లేదు. ఇట్లుండును ( . ( ౨౬౪), అళ్లి
హళ్లికిహళ్లి సున్నకుసున్న = ఒకరు చేసిన దానికి తగిన ప్రతిక్రియ—*సున్నకుసున్న సరిపోయినదనుట* [నె; కర్నూ]
హూనం = పిండి — *ఈపనితో నాదేహం హూనం హూనం అయింది* [నె-పొ]
హోశిగ = ఓశిగ, ఒబ్బట్టు [అ]

# కడపటి చేర్పులు



ఈడవ = ఆకుతోట (తమలపాకులతోట) తీగ నాటి, ఆకు గోసికొని ముదరుపైనందున వదలివేసి తోటకు చెడగొట్టుటకు పట్టు క్లుప్తకాలము. ఇది రమారమి మూడేండ్లుండును — రెండు ఈడవలకు కౌలు కిచ్చినా (చూ) ఈడవ [నె-వింజమూరు]

ఊర్పు = వండినకూరలో అడుగున నిలుచు చిక్కటిపులుసు — ఊర్పు దీసి ఇటు వేయి [నె]

ఎరుకబట్టు = గుర్తించు—ఆయనను ఎరుక బట్టగలవా? [హై]

కట్టుమోతు = తోడుబోతు; కాతబడి చేసే వాడు

కనుబడి = కోసిన పైరులో రాలు ధాన్యము; రాలుబడి — ఈ ఏడు కనుబడితక్కువ [నె-కోట]

కయికాడి = బండి ఎద్దులను కట్టినట్లే నిలిచి యుండుటకు ముందు నొగ క్రిందబెట్టు కట్టె, బంటుగూటము [నె-మెట్ట]

కోడినిదుర = నిదుర పట్టీపట్టక సగము మెలుకవతో నున్నట్లే స్వల్పధ్వనికిగూడ లేచునది. కోడి ఇట్లే నిదురించును — రాత్రంతా కోడి నిదురగానే ఉండినది [నె]

కోవ = కాలువ — కోవలుదీసి నీరుపారించు [నె]

గూడమంచు = దట్టమైన పొగమంచు — గూడమంచు దారినే మూనివేసింది [నె]

చీమునెత్తురు లేకుండుట - మట్టుమర్యాదలు లేకుండుట; ఆత్మగౌరవం లేకుండుట— వాడికి చీమునెత్తురు లేదు; సిగ్గుశరము లేనట్లు [నె]

తలికి = వరకు—నేను వచ్చేతలికి ఆయన లేడు [నె]

నీలపాలివాళ్లు = చావుతో మైల (అంటు) ఏర్పడు చుట్టములు; మరణమునకు నీట మునుగు దాయాదులు — నీళ్లపాలి వాళ్లందరు రాలేదు [నె]

పా = (1) ఇద్దరు కలిసి పోవుదము అనుట Let us go — ఇకపా [నె]

పాయ = పశువులమేపుకు ఉపయోగించు అడవి—పశువులను పాయకు తోలినారు (చూ) పాయ; [నె-రాపూరు]

మత్తిగుడ్డ = పిల్లకాయలు బడిలో పలకల తుడుచుటకు నీట తడిపియుంచుకొను గుడ్డపేలిక, లేక పేలికల చిన్నమూట— మత్తిగుడ్డ ఎండిపోయింది [నె]

మరులుపెండ్లి = పెండ్లి అయిన తర్వాత, వధువునింటనుండి మొదటిసారిగా వరుని ఇంటికి సబాంధవముగ వచ్చుట — అందరూ మరులుపెండ్లికి పోయినారు [నె]

మునిమి = బంధువు చనిపోయిన తర్వాత ఆయింట పండుగ వేడుక చేయకుండు కాలము (Mo uring period) — వాళ్ల యింట్లో మునిమి అయినందున, పిల్లకాయలకు మేము అప్పచ్చులు పంపినాము [నె]

సరందప్పు = దప్పికచే గొంతు ఏండిపోవు [హై]